ఓం

# శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి

## ఆరవ సంపుటము

## శ్రీమద్భగవద్గీతా

ప్రకాశకులు

**శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము**

**శ్రీ వ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ

వ్యాహరన్మామనుస్మరన్



యః ప్రయాతి త్యజన్దేహం

స యాతి పరమాం గతిమ్

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంథాలు పాఠకలోకానికి సుపరిచితాలే. ఈ గ్రంథాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు. ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది.

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంథాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి. అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి. జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి.

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంథాలుగా ముద్రింపబడివున్నాయి. వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంథ రాశిగా ''శ్రీమలయాళసద్గురు గ్రంథావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు. ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు.

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది. ఇంచుమించు ఆగ్రంథాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా లుంటాయి. ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి.

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ

శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు. ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది.

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంథ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము.

శ్రీ వ్యాసాశ్రమం
1-3-2000 ప్రకాశకులు

ఓమ్
శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# విషయసూచిక

ఓమ్

# "గీ-త" అక్షరార్థము



గీకారం త్యాగరూపం స్యాత్
తకారం తత్త్వబోధకమ్ ।
గీతా వాక్యమిదం తత్త్వం
జ్ఞేయం సర్వముముక్షుభిః ॥

"గీత" అను రెండక్షరముల తాత్పర్యమును యీశ్లోకము తెలుపుచున్నది. "గీ" అను అక్షరము త్యాగమును బోధించు చున్నది. "త" అను అక్షరము తత్త్వమును అనగా నాత్మ స్వరూపము నుపదేశించుచున్నది. "గీత" యను రెండు శబ్దముల కిదే యర్థమని ముముక్షువులందరును తెలిసికొనవలయును.

వి॥ త్యాగశబ్దమునకు నిష్కామకర్మయోగమగు కర్మ ఫలత్యాగమనియు లేక సర్వసంగపరిత్యాగమనియు నర్థము గలదు. అలాగున తత్త్వబోధమున కాత్మసాక్షాత్కార జ్ఞానమనియు, బంధమునుండి విముక్తి కల్గుటయనియు నర్థము గలదు. ఈ పరమరహస్యమునే గీతాశాస్త్ర ముపదేశించు చున్నది.

ఓం తత్ సత్



ఓమ్

# సంసారసాగర తరణోపాయము



సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః ।
గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥

తా॥ జననమరణములనెడు ఘోరదుఃఖమునకు కారణభూతమగు యీ సంసారసముద్రమును ఏ నరుడు దాటగోరుచున్నాడో నతడు గీతయను నావను ఆశ్రయించిన యెడల సుఖముగ దాటగలడు.

వి॥ సాగరము పారము తెలియనిది. ఎల్లప్పుడును కల్లోలములతో గూడినది. మకరము మొదలగు అనేక క్రూరములగు జలజంతువులతో గూడినది. అచ్చటచ్చట అనేక సుడులుగలది. అట్టి సాగరమును దాట తలంచువారు విశాలమై దృఢమైయుండు ఓడను యెక్కినచో సుఖముగా దాటవచ్చును. ఆలాగున సంసారముయొక్క పారముగూడ తెలియ రానిది. ఇయ్యది జనన మరణవ్యాధిరూపములగు అనేక ఘోరదుఃఖములకు స్థానమైనది. సంకల్పములనెడు కెరటములు సదా గలిగియుండునది. రాగద్వేష కామక్రోధాది దుష్టజంతువులకు ఆకరమైనది. సంశయములనెడు సుడులతోగూడినది. ఇట్టి ఘోరమగు సంసారసాగరమును సుఖముగా దాటుటకు భగవద్గీతాపఠనము, దానియందు చెప్పినట్లు ఆచరించుటయు చాలును. ఓడలో స్త్రీలుగాని, పురుషులుగాని, బ్రాహ్మణులుగాని. అబ్రాహ్మణులుగాని, గృహస్థులుగాని, సన్న్యాసులుగాని, ఎవరైనను ప్రయాణము చేయవచ్చును. అయితే వారు సుస్థిరముగా నుండవలెను. అచ్చటచ్చట తిరుగుచు ఓడనుండి సముద్రములో జారిపడిపోయినచో వెంటనే వారిని మకరము మొదలగు జంతువులు మ్రింగివేయును. ఆలాగున గీతాపఠనము, దాని ఆచరణము గలవారు అట్టి పవిత్రమార్గమునుండి హద్దు దాటక యుండవలెను. అట్లుగాక ప్రకృతి గుణములు గలిగి నిష్ఠనుండి జారిపోయినచో మాయ యను మొసలి మ్రింగివేయును. గీతాపాఠకులు యీ విషయములన్నింటిని బాగుగా జ్ఞాపకము చేసికొనవలెను.

ఓమ్ తత్ సత్

ఓమ్

# గీ తా క ల్ప వృ క్ష ము

శ్లో॥ గీతాకల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం
వేదవ్యాసవివర్ధితం శ్రుతి శిరోబీజం ప్రబోధాంకురమ్।
నానాశాస్త్రరహస్యశాఖమరతిక్షాంతిప్రవాళాంకితం
కృష్ణాంఘ్రిద్వయభక్తిపుష్పసురభింమోక్షప్రదంజ్ఞానినామ్

తా॥ భగవంతుడగు శ్రీకృష్ణునిచే స్థిరముగా నాటబడినదై వేదవ్యాసమహర్షిచేత జక్కగా పెంచబడి యుపనిషత్తే విస్తృతముగా గలదై ఆత్మప్రబోధమనెడు అంకురము గలిగి అనేక శాస్త్రముల సార మనెడు కొమ్మలు గలిగి వైరాగ్యము సహనములనెడు చిగురుటాకులుగల్గి శ్రీకృష్ణపాదయుగళము నందలి భక్తియనే సుగంధముగల పుష్పముచేబరిమళించుచు జ్ఞానులకు మోక్షదాయకమైన భగవద్గీత యను కల్పవృక్షమును సేవించుచున్నాను.

వి॥ ఇచట గీతను కల్పవృక్షముగా వర్ణించడమైనది. కల్పవృక్ష సమీపమునకు వెళ్ళి దేనిని మనస్సులో సంకల్పింతురో, అది లభింప జేసెడు శక్తి దానియందు గలదు. అలాగున గీతను భక్తి శ్రద్ధలు గలిగి పఠించుచు దానియందున్నట్లు ఆచరించువారికి కామ్యకర్మలైనచో కర్మఫలము, నిష్కామ కర్మలైనచో మోక్షమున్ను గలుగును. ఈ కల్పవృక్షబీజమును శ్రీకృష్ణ భగవానుడే సుస్థిరముగా ప్రపంచములో నాటెను. ఈబీజమేమన ఉపనిషత్సారము దీనిని శ్రీ వ్యాస భగవానుడు ఛందోబద్ధముగా జేసినందుచే శ్లోక రూపముగ రచించి నందుచే వృద్ధినొందించినవాడయ్యెను. అనగా శ్రీ కృష్ణభగవానుని వాక్యములు ఆ వ్యాసభగవానుడు ఛందోబద్ధముగ రచించెను. ఇది అనేక శాస్త్రములసారభూతములగు కర్మ, భక్తి. యోగ, జ్ఞానముల నెడు శాఖలతోగూడినది. విరక్తిసహనము దీనియొక్క చిగుళ్ళు. శ్రీకృష్ణ చరణార విందభక్తియే దీనియొక్క సుగంధయుతమైన పుష్పము, మోక్షమనునదే దీనియొక్క ఫలము జ్ఞానులు దీనిని అనుభవించి జన్మసాఫల్యమును బొందెదరు. ఓమ్ తత్ సత్

ఓమ్

# కృష్ణం వన్దే జగద్గురుమ్

ఓమ్ వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనం ।
దేవకీపరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 1

అతసీపుష్పసంకాశం హారనూపురశోభితం ।
రత్నకంకణకేయూరం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 2

కుటిలాలక సంయుక్తం పూర్ణచంద్ర నిభాననం ।
విలసత్కుండల ధరం కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 3

మందారగన్ధసంయుక్తం చారుహాసం చతుర్భుజం ।
బర్హిపింఛావచూడాంగం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 4

ఉత్ఫుల్లపద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభం ।
యాదవానాం శిరోరత్నం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 5

రుక్మిణీకేళిసంయుక్తం పీతామ్బరసుశోభితం ।
అవాప్తతులసీగన్ధం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 6

గోపికానాం కుచద్వన్ద్వకుంకుమాంకిత వక్షసం ।
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 7

శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలావిరాజితం ।
శంఖచక్రధరం దేవం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 8

కృష్ణాష్టకమిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి ॥ 9

శ్రీ కృష్ణాష్టకం సంపూర్ణమ్

ఓమ్

# "గీ-త" అక్షరార్థము



గీకారం త్యాగరూపం స్యాత్
తకారం తత్త్వబోధకమ్ ।
గీతా వాక్యమిదం తత్త్వం
జ్ఞేయం సర్వముముక్షుభిః ॥

"గీత" అను రెండక్షరముల తాత్పర్యమును యీశ్లోకము తెలుపుచున్నది. "గీ" అను అక్షరము త్యాగమును బోధించు చున్నది. "త" అను అక్షరము తత్త్వమును అనగా నాత్మ స్వరూపము నుపదేశించుచున్నది. "గీత" యను రెండు శబ్దముల కిదే యర్థమని ముముక్షువులందరును తెలిసికొన వలయును.

వి॥ త్యాగశబ్దమునకు నిష్కామకర్మయోగమగు కర్మ ఫలత్యాగమనియు లేక సర్వసంగపరిత్యాగమనియు నర్థము గలదు. ఆలాగున తత్త్వబోధమున కాత్మసాక్షాత్కార జ్ఞాన మనియు, బంధమునుండి విముక్తి కల్గుటయనియు నర్థము గలదు. ఈ పరమరహస్యమునే గీతాశాస్త్ర ముపదేశించు చున్నది.

ఓం తత్ సత్



ఓమ్

# సంసారసాగర తరణోపాయము



సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః ।
గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥

తా॥ జననమరణములనెడు ఘోరదుఃఖమునకు కారణభూతమగు యీ సంసారసముద్రమును ఏ నరుడు ధాటగోరుచున్నాడో నతడు గీతయను నావను ఆశ్రయించిన యెడల సుఖముగ దాటగలడు.

వి॥ సాగరము పారము తెలియనిది. ఎల్లప్పుడును కల్లోలములతో గూడినది. మకరము మొదలగు అనేక క్రూరములగు జలజంతువులతో గూడినది. అచ్చటచ్చట అనేక సుడులుగలది. అట్టి సాగరమును దాట తలంచువారు విశాలమై దృఢమైయుండు ఓడను యెక్కినచో సుఖముగా దాటవచ్చును. అలాగున సంసారముయొక్క పారముగూడ తెలియరానిది. ఇయ్యది జనన మరణవ్యాధిరూపములగు అనేక ఘోరదుఃఖములకు స్థానమైనది. సంకల్పములనెడు కెరటములు సదా గలిగి యుండునది. రాగద్వేష కామక్రోధాది దుష్టజంతువులకు ఆకరమైనది. సంశయములనెడు సుడులతోగూడినది. ఇట్టి ఘోరమగు సంసార సాగరమును సుఖముగా దాటుటకు భగవద్గీతాపఠనము, దానియందు చెప్పినట్లు ఆచరించుటయు చాలును. ఓడలో స్త్రీలుగాని, పురుషులుగాని, బ్రాహ్మణులుగాని. అబ్రాహ్మణులుగాని, గృహస్థులుగాని, సన్న్యాసులుగాని, ఎవరైనను ప్రయాణము చేయవచ్చును. అయితే వారు సుస్థిరముగా నుండవలెను. అచ్చటచ్చట తిరుగుచు ఓడనుండి సముద్రములో జారిపడిపోయినచో వెంటనే వారిని మకరము మొదలగు జంతువులు మ్రింగివేయును. అలాగున గీతాపఠనము, దాని ఆచరణము గలవారు అట్టి పవిత్రమార్గమునుండి హద్దు దాటక యుండవలెను. అట్లుగాక ప్రకృతి గుణములు గలిగి నిష్ఠనుండి జారి పోయినచో మాయ యను మొసలి మ్రింగివేయును. గీతాపాఠకులు యీ విషయములన్నింటిని బాగుగా జ్ఞాపకము చేసికొనవలెను.

ఓమ్ తత్ సత్

ఓమ్

# గీతా కల్పవృక్షము

శ్లో॥ గీతాకల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం
వేదవ్యాసవివర్ధితం శ్రుతి శిరోబీజం ప్రబోధాంకురమ్।
నానాశాస్త్రరహస్యశాఖమరతిక్షాంతిప్రవాళాంకితం
కృష్ణాఙ్ఘ్రిద్వయభక్తిపుష్పసురభిం మోక్షప్రదంజ్ఞానినామ్

తా॥ భగవంతుడగు శ్రీకృష్ణునిచే స్థిరముగా నాటబడినదై వేదవ్యాసమహర్షిచేత జక్కగా పెంచబడి యుపనిషత్తే విత్తనముగా గలదై ఆత్మప్రబోధమనెడు అంకురము గలిగి అనేక శాస్త్రముల సార మనెడు కొమ్మలు గలిగి వైరాగ్యము సహనములనెడు చిగురుటాకులుగల్గి శ్రీకృష్ణపాదయుగళము నందలి భక్తియనే సుగంధముగల పుష్పముచేబరిమళించుచు జ్ఞానులకు మోక్షదాయకమైన భగవద్గీత యను కల్పవృక్షమును సేవించుచున్నాను.

వి॥ ఇచట గీతను కల్పవృక్షముగా వర్ణించడమైనది. కల్పవృక్ష సమీపమునకు వెళ్ళి దేనిని మనస్సులో సంకల్పింతురో, అది లభింప జేసెడు శక్తి దానియందు గలదు. అలాగున గీతను భక్తి శ్రద్ధలు గలిగి పఠించుచు దానియందున్నట్లు ఆచరించువారికి కామ్యకర్మలైనచో కర్మఫలము, నిష్కామ కర్మలైనచో మోక్షమున్ను గలుగును. ఈ కల్పవృక్షబీజమును శ్రీకృష్ణ భగవానుడే సుస్థిరముగా ప్రపంచములో నాటెను. ఈబీజమేమన ఉపనిషత్సారము దీనిని శ్రీ వ్యాస భగవానుడు ఛందోబద్ధముగా జేసినందుచే శ్లోక రూపముగ రచించి నందుచే వృద్ధినొందించినవాడయ్యెను. అనగా శ్రీ కృష్ణభగవానుని వాక్యములు ఆ వ్యాసభగవానుడు ఛందోబద్ధముగ రచించెను. ఇది అనేక శాస్త్రములసారభూతములగు కర్మ, భక్తి. యోగ, జ్ఞానములనెడు శాఖలతోగూడినది. విరక్తిసహనము దీనియొక్క చిగుళ్ళు. శ్రీకృష్ణ చరణారవిందభక్తియే దీనియొక్క సుగంధయుతమైన పుష్పము, మోక్షమనునదే దీనియొక్క ఫలము జ్ఞానులు దీనిని అనుభవించి జన్మసాఫల్యమును బొందెదరు. ఓమ్ తత్ సత్

ఓమ్

# కృష్ణం వన్దే జగద్గురుమ్

ఓమ్ వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనం ।
దేవకీపరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 1

అతసీపుష్పసంకాశం హారనూపురశోభితం ।
రత్నకంకణకేయూరం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 2

కుటిలాలక సంయుక్తం పూర్ణచంద్ర నిభాననం ।
విలసత్కుండల ధరం కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 3

మందారగన్ధసంయుక్తం చారుహాసం చతుర్భుజం ।
బర్హిపింఛావచూడాంగం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 4

ఉత్ఫుల్లపద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభం ।
యాదవానాం శిరోరత్నం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 5

రుక్మిణీకేళిసంయుక్తం పీతామ్బరసుశోభితం ।
అవాప్తతులసీగన్ధం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 6

గోపికానాం కుచద్వన్ద్వకుంకుమాంకిత వక్షసం ।
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 7

శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలావిరాజితం ।
శంఖచక్రధరం దేవం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 8

కృష్ణాష్టకమిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి ॥ 9

శ్రీకృష్ణాష్టకం సంపూర్ణమ

ఓమ్

ఆరవ సంస్కరణము:- శ్రీ గురుశ్శరణమ్

# చిన్న మనవి

పరిశుద్ధ జ్ఞానస్వరూపులగు ప్రియమైన ఆత్మసోదరీ సోదరులారా!

"వర్ధతాం బ్రహ్మవిద్యా చ, లోకేభ్యః సుఖమేధతామ్"

లోకోత్తర గ్రంథరాజమగు శ్రీమద్భగవద్గీతకు యెన్నియో వ్యాఖ్యానములు గలవు. తెలుగునను యెందఱో తాత్పర్య-పద్యానువాదముల రచించిరి. కాని గీతానురక్తభక్తులను తత్త్వజిజ్ఞాసువులను మాత్రమవి తృప్తిని గలుగజేయలేక పోయినవనియే చెప్పనగును. అట్టిలోటును దీర్చుటకయ్యే శ్రీ గురుదేవులు-అల్ప విద్యగలిగి గీతార్థమును దెలిసికొనగోరు సామాన్య జనులకు స్త్రీ పురుషుల కందఱికిని అవగతమగునట్టి సుబోధశైలిలో యీ 'గీతార్థప్రకాశముల'ను రచించిరి. అనగా పదవిభాగ-టీకా- తాత్పర్య-విశేషార్థములతో గీతార్థమును విశదపఱచిరి. నేడు మన ఆంధ్రదేశములో యీ శ్రీవారిగీత గీతాభక్తుల కత్యంతప్రీతిపాత్రమై బహుళ ప్రచారములో నున్నది. పండితులు-పామరులు స్త్రీలు పురుషులు అందఱు దీనిని ప్రీతితో పఠించి ఆదరించుచున్నారు. 'బ్రహ్మవిద్యకు సర్వులు సమానార్హుల' ను పరమరహస్యము యిందు బహిర్గత మొనర్పబడియుండుటయే దీనికి ముఖ్యకారణము. శ్రీవారి రచనలలో బహుళవ్యాప్తిలోనున్నవాటిలో నిది ప్రముఖమైనది.

పూర్వసంస్కరణలలో అచటచట కొద్దిగ అన్వయ కాఠిన్యము, వాక్య వ్యతిక్రమములు ఉండి పాఠకులకు తాత్పర్యము స్పష్టము కాకుండుటచే మరుముద్రణమున సంస్కరించిన బాగుండునని సంకల్పము గలిగెను. ఆ సంకల్పము శ్రీగురుదేవుని యనుగ్రహముచే నేటికి కొంతవఱకు సిద్ధించినది. గుర్వనుగ్రహముచే సంలబ్ధమైన బుద్ధిశక్తిచే భావవిరోధముగాని రీతిగా, భావవివరణాత్మకమైన మార్పులచటచట తోచినంతవఱకు సామర్థ్యమున్నంత వరకు గావింపబడినది. ఇదియు శ్రీగురుదేవుని దివ్య సంకల్పమహిమయే. భావగ్రాహకులగు పాఠకులు యీ మార్పులచే సులభముగా గీతార్థమును గ్రహించి ఆనందించిరేని ప్రయత్నము సఫలమైనట్లే. శ్రీగురుదేవుని ఆశయమునకు విరుద్ధముగాని విధముననే మార్పులుగాని, కూర్పులుగాని, చేయబడినవనియే ఆత్మవిశ్వాసము అయినను త్వరగా ముద్రణజరుగవలసియుండుటచే ముద్రణదోషములు ఉండకబోవు. సహృదయులగు పాఠకులు వాటిని తెలిపినచో మరుముద్రణమున సవరింపబడగలవు. గీతాచార్యుడు-శ్రీగురుదేవుడు భక్తుల ననుగ్రహించుగాక!

గీతాతత్త్వ స్వరూపాయ స్థితప్రజ్ఞాయ యోగినే। నమః శ్రీ గురుదేవాయ కర్మభక్తి ప్రబోధినే॥

శ్రీవ్యాసాశ్రమము. విమలానందస్వామి.

1-1-1968. ఓం జయ్ గురుదేవ్ ఓం

ఓమ్
శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# ఉపోద్ఘాతము

శ్రీమద్భగవద్గీతయందు గల విశ్వాసము, భక్తియు,సత్య నిర్ణయము, ధర్మపర్వతమున్ను యీ గ్రంథము వ్రాయుటకు నన్ను ప్రేరేపించినది. ఆంధ్రభాషలో నిదివరకు నీగీత కెవరును పద విభాగమును వ్రాయకపోవుటచే పాఠకులలో కొందఱికి పదముల యొక్క సంధులు తెలియక పోవుటచే స్వచ్ఛముగ పారాయణము చేయుటకును, పదములయొక్క యర్థమును సులభముగా గ్రహించుటకును అవకాశములేక పోవుచున్నదని గలిగిన తలంపే దీనిని వ్రాయుటకు కారణము. అందువలననే దీనికి (1) పదవిభాగము, (2) ప్రతిపదార్థము, (3) తాత్పర్యము (4) విశేషార్థము వ్రాయుటకు కారణమైనది. మఱియు ఈశావాస్యాది ఉపనిషత్తులను, మన్వాదిస్మృతులను, బ్రహ్మగీతాది గీతలను, భాగవతాది పురాణములను భారతాది ఇతిహాసములను, పాతంజలాది యోగశాస్త్రములను, బుద్ధ క్రీస్తు, మహమ్మదు మొదలగు ప్రవక్తల మతగ్రంథములను కొన్నింటిని నా బుద్ధినిపట్టి చదివి గ్రహించిన సారమునుబట్టి యాలోచించిన,దానిలో శ్రీమద్భగవద్గీతలోగల అర్థమునకన్న నధికము కానుపించక పోవుటచేతను దీనిని వ్రాయుటకు కారణమైనది. మఱియు వర్ణాశ్రమ ధర్మములు సనాతనములని యుద్ఘోషించు వారిని గుఱించియు, సామాన్యజనులు వాటిలోగల సత్యమును బాగుగా దెలిసికొనుట కొఱకును దీనిని వ్రాయవలసి వచ్చినది. సనాతనధర్మమనగా-అ.2, శ్లో॥ 24 లో నాత్మను గుఱించి చెప్పినదేగాని, సదాపరిణామము హొందుచుండెడు వర్ణమును గుఱించిగాని, ఆశ్రమమును గుఱించిగాని చెప్పుట గాదనియు ఇదియే నిజమనియు నందఱును తెలిసికొనుట కొఱకిది వ్రాయవలసి వచ్చినది.

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్యస్సర్వగతస్థాణురచలోఽయం సనాతనః ॥

ఈయాత్మ యాయుధములచే ఛేదించుటకు సాధ్యముకాదు. ఈయాత్మ నీటిచే తడుపుటకు సాధ్యపడునదికాదు. ఈయాత్మగాలిచే

శోషింపచేయుటకును సాధ్యపడునది కాదు. ఈ యాత్మ నిత్యము, సర్వవ్యాపకము, స్థాణువువలె చలింపనిది. సనాతనము నగు చున్నది. మఱియు

"భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥"
అ. 7, శ్లో॥ 4.

తా॥ నాయొక్క యీ ప్రకృతి భూమి, జలము, అగ్ని, గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారమని యెనిమిది విధములుగా విభజింపబడినది. బుద్ధిపర్యంతముగల వృత్తులన్నియు ప్రకృతితో గూడినవనియు, అవి పరిణామయుక్తములే యనియు తెలియుట కొఱకిచట వ్యష్టిని గుఱించియు, నవ్యక్తమునరకు గల సమష్టిని గుఱించియు నిరూపింపబడినది. మఱల చాతుర్వర్ణ్య వ్యవస్థను గుఱించి కాదనియు, గుణమును గురించియే యనియు లోకము గ్రహించుటకొఱకు అ. 4, శ్లో॥ 13 "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" గుణకర్మలను బట్టియే చాతుర్వర్ణ్య వ్యవస్థ నాచే గావింపబడినదని చెప్పబడెను. దీనిలోగల సూక్ష్మార్థమే అ. 18 శ్లో॥ 41, 42, 43, 44 నాలుగు వర్ణముల గుఱించి ప్రసంగించుచు విస్తరించి తెలుపబడినది. నాల్గు వర్ణముల గుఱించి తెలుపునపుడు "బ్రాహ్మం కర్మ స్వభావజమ్-క్షాత్రం కర్మ స్వభావజమ్-వైశ్యం కర్మ స్వభావజమ్-శూద్రస్యాపి స్వభావజమ్" అని విస్తరించి ఆయా వర్ణధర్మములను శ్రీభగవంతుడే స్వయముగా తెల్పియున్నాడు. 'స్వభావము' అను పదమున కొక్కొక్కరున్ను వారి వారి బుద్ధి ననుసరించియు, విద్యాబలమును బట్టియు ననేకార్థములు జెప్పినను, సత్యబుద్ధితో నాలోచించిన వారి వారి గుణములనుబట్టి గలిగెడు సత్త్వరజస్తమస్సులనియే 'స్వభావము' అను పదమున కర్థమగును. ఈ యర్థమునే శ్రీ శంకరానంద, ఆనందగిరి, మధుసూదనసరస్వతీ మొదలగు మహాత్ములు తమతమ వ్యాఖ్యానములలో విశదీకరించియున్నారు. సనాతనులని చెప్పువారు వారియొక్కయు, వారి సంబంధులయొక్కయు ఆహార విహార వస్త్రాభరణాదుల గుఱించియు వారి

పుత్ర పుత్రికాదుల విద్యావిధానమును గురించియు, బ్రహ్మచర్యా ద్యాశ్రమపాలనమును గుఱించియు, వైశ్వదేవాద్యగ్ని కార్య ములను గుఱించియు, నిత్యనైమిత్తికాది పంచయజ్ఞములను గుఱించియు తమలో తామాలోచించుకొనిన, పూర్వీకులగు ఋ షుల సనాతన ధర్మాచరణమునకున్ను, తమకున్ను గల మార్పును తెలిసికొన గలుగుదురు. మఱియు విద్యాభ్యాసమును గుఱించి మనువు చెప్పినది చూడదగినది.

'యోఽనధీత్య ద్విజో వేదమన్యత్ర కురుతే శ్రమం ।
స జీవన్నేవ శూద్రత్వమాశు గచ్ఛతి సాన్వయః ॥'
మనుస్మృతి—అ. 2, శ్లో॥ 168

తా॥ ఎవడు వేదము నధ్యయనము చేయక జీవనోపాయము కొరకై నితరశాస్త్రములందు పరిశ్రమచేయునో అతడు జీవించి యున్నప్పడే తన వంశజులతోగూడ శీఘ్రముగా శూద్రత్వము నొందును. ఇక పరాశరస్మృతియందు ధర్మనిర్ణయమును గుఱించి చెప్పినదిన్ని చూడదగినది.

"మునీనామాత్మవిద్యానాం ద్విజానాం యజ్ఞయాజినాం ।
వేదవ్రతేషు స్నాతానామేకోఽపి పరిషద్భవేత్॥"

తా॥ ఆత్మవిద్యానుభవము గలిగి మననశీలురయి యున్న వారును, లోకానుగ్రహార్థము యజ్ఞముల నాచరించుచుండువారును, వేదవిద్యావ్రతస్నాతులున్నునగు ద్విజులలో నొక్కడైనను పరిష త్తనం బడును.

దీనియందాత్మవేత్తలు, ధర్మశీలురు ఐదుగురుగాని, నల్గురు గాని, ముగ్గురుగాని, యిద్దరుగాని, కట్టకడకు ఒక్కరుగాని ఆ యా దేశ కాలముల ననుసరించి యేదేది యనుష్ఠేయమగు ధర్మమని చెప్పెదరో, అదియే యాచరణీయ మని తెలుపుచుండగా వర్ణా శ్రమములు సనాతనములని అనగా వేదకాలమునుండి యెల్ల ప్పటికి నొకేవిధముగా నుండవలెనని యెట్లు చెప్పగలరు? మఱియు

"పంచ పూర్వే మయా ప్రోక్తాస్తేషాం చానంభవే త్రయః।
స్వవృత్తిపరితుష్టా యే పరిషత్సా ప్రకీర్తితా ॥"

ఓమ్

ఆరవ సంస్కరణము:- శ్రీ గురుశ్శరణమ్

# చి న్న మ న వి

పరిశుద్ధ జ్ఞానస్వరూపులగు ప్రియమైన ఆత్మసోదరీ సోదరులారా:

"వర్ధతాం బ్రహ్మవిద్యా చ, లోకేభ్యః సుఖమేధతామ్"

లోకోత్తర గ్రంథరాజమగు శ్రీమద్భగవద్గీతకు యెన్నియో వ్యాఖ్యానములు గలవు. తెలుగునను యెందరో తాత్పర్య-పద్యానువాదముల రచించిరి. కాని గీతాను రక్తభక్తులను తత్త్వజిజ్ఞాసువులను మాత్రమవి తృప్తిని గలుగ జేయలేక పోయినవనియే చెప్పనగును. అట్టిలోటును దీర్చుటకయ్యే శ్రీ గురుదేవులు-అల్ప విద్యగలిగి గీతార్థమును దెలిసికొనగోరు సామాన్య జనులకు స్త్రీ పురుషుల కందఱికిని అవగతమగునట్టి సుబోధశైలిలో యీ 'గీతార్థప్రకాశముల'ను రచించిరి: అనగా పదవిభాగ-టీకా- తాత్పర్య-విశేషార్థములతో గీతార్థమును విశదపఱచిరి. నేడు మన ఆంధ్రదేశములో యీ శ్రీవారిగీత గీతాభక్తుల కత్యంతప్రీతిపాత్రమై బహుళ ప్రచారములో నున్నది. పండితులు-పామరులు స్త్రీలు పురుషులు అందఱు దీనిని ప్రీతితో పఠించి ఆదరించుచున్నారు. 'బ్రహ్మవిద్యకు సర్వులు సమానార్హుల'ను పరమరహస్యము యిందు బహిర్గత మొనర్పబడియుండుటయే దీనికి ముఖ్యకారణము. శ్రీవారి రచనలలో బహుళవ్యాప్తిలోనున్నవాటిలో నిది ప్రముఖమైనది.

పూర్వసంస్కరణలలో అచటచట కొద్దిగ అన్వయ కాఠిన్యము, వాక్య వ్యతిక్రమములు ఉండి పాఠకులకు తాత్పర్యము స్పష్టము కాకుండుటచే మరుముద్రణమున సంస్కరించిన బాగుండునని సంకల్పము గలిగెను. ఆ సంకల్పము శ్రీగురుదేవుని యనుగ్రహముచే నేటికి కొంతవఱకు సిద్ధించినది. గుర్వనుగ్రహముచే సంలబ్ధమైన బుద్ధిశక్తిచే భావవిరోధముగాని రీతిగా, భావవివరణాత్మకమైన మార్పుఅచటచట తోచినంతవఱకు సామర్థ్యమున్నంత వరకు గావింపబడినది. ఇదియు శ్రీగురుదేవుని దివ్య సంకల్పమహిమయే. భావగ్రాహకులగు పాఠకులు యీ మార్పులచే సులభముగా గీతార్థమును గ్రహించి ఆనందించిరేని ప్రయత్నము సఫలమైనట్లే. శ్రీగురుదేవుని ఆశయమునకు విరుద్ధముగాని విధముననే మార్పులుగాని, కూర్పులుగాని,చేయబడినవనియే ఆత్మవిశ్వాసము అయినను త్వరగా ముద్రణజరుగవలసి యుండుటచే ముద్రణదోషములు ఉండకబోవు. సహృదయులగు పాఠకులు వాటిని తెలిపినచో మరుముద్రణమున సవరింపబడగలవు. గీతాచార్యుడు-శ్రీగురుదేవుడు భక్తుల ననుగ్రహించుగాక!

గీతాతత్త్వ స్వరూపాయ స్థితప్రజ్ఞాయ యోగినే। నమశ్శ్రీ గురుదేవాయ కర్మభక్తి ప్రబోధినే॥

శ్రీవ్యాసాశ్రమము. విమలానందస్వామి.

1-1-1968. ఓం జయ్ గురుదేవ్ ఓం

ఓమ్
శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# ఉ పో ద్ఘా త ము

శ్రీమద్భగవద్గీతయందు గల విశ్వాసము, భక్తియు, సత్య నిర్ణయము, ధర్మపర్వతమున్ను యీ గ్రంథము వ్రాయుటకు నన్ను ప్రేరేపించినది. ఆంధ్రభాషలో నిదివరకు నీగీత కెవరును పదవిభాగమును వ్రాయకపోవుటచే పాఠకులలో కొందఱికి పదముల యొక్క సంధులు తెలియక పోవుటచే స్వచ్ఛముగ పారాయణము చేయుటకును, పదములయొక్క యర్థమును సులభముగా గ్రహించుటకును అవకాశములేక పోవుచున్నదని గలిగిన తలంపే దీనిని వ్రాయుటకు కారణము. అందువలననే దీనికి (1) పదవిభాగము, (2) ప్రతిపదార్థము, (3) తాత్పర్యము (4) విశేషార్థము వ్రాయుటకు కారణమైనది. మఱియు ఈశావాస్యాది ఉపనిషత్తులను, మన్వాదిస్మృతులను, బ్రహ్మగీతాది గీతలను, భాగవతాది పురాణములను భారతాది ఇతిహాసములను, పాతంజలాది యోగశాస్త్రములను, బుద్ధ క్రీస్తు, మహమ్మదు మొదలగు ప్రవక్తల మతగ్రంథములను కొన్నింటిని నా బుద్ధినిపట్టి చదివి గ్రహించిన సారమునుబట్టి యాలోచించిన, దానిలో శ్రీమద్భగవద్గీతలోగల అర్థమునకన్న నధికము కానుపించక పోవుటచేతను దీనిని వ్రాయుటకు కారణమైనది. మఱియు వర్ణాశ్రమ ధర్మములు సనాతనములని యుద్ఘోషించు వారిని గుఱించియు, సామాన్యజనులు వాటిలోగల సత్యమును బాగుగా దెలిసికొనుట కొఱకును దీనిని వ్రాయవలసి వచ్చినది. సనాతనధర్మమనగా-అ.2, శ్లో॥ 24 లో నాత్మను గుఱించి చెప్పినదేగాని, సదాపరిణామము పొందుచుండెడు వర్ణమును గుఱించి గాని, ఆశ్రమమును గుఱించిగాని చెప్పుట గాదనియు ఇదియే నిజమనియు నందఱును తెలిసికొనుట కొఱకిది వ్రాయవలసి వచ్చినది.

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్యస్సర్వగతస్థాణురచలోఽయం సనాతనః ॥

ఈయాత్మ యాయుధములచే ఛేదించుటకు సాధ్యముకాదు. ఈయాత్మ నీటిచే తడుపుటకు సాధ్యపడునదికాదు. ఈయాత్మగాలిచే

శోషింపచేయుటకును సాధ్యపడునది కాదు. ఈ యాత్మ నిత్యము, సర్వవ్యాపకము, స్థాణువువలె చలింపనిది. సనాతనము నగుచున్నది. మఱియు

"భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥"
అ. 7, శ్లో॥ 4.

తా॥ నాయొక్క యీ ప్రకృతి భూమి, జలము, అగ్ని, గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారమని యెనిమిది విధములుగా విభజింపబడినది. బుద్ధిపర్యంతముగల వృత్తులన్నియు ప్రకృతితో గూడినవనియు, అవి పరిణామయుక్తములే యనియు తెలియుట కొఱకిచట వ్యష్టిని గుఱించియు, నవ్యక్తమువఱకు గల సమష్టిని గుఱించియు నిరూపింపబడినది. మఱల చాతుర్వర్ణ్య వ్యవస్థను గుఱించి కాదనియు, గుణమును గురించియే యనియు లోకము గ్రహించుటకొఱకు అ. 4, శ్లో॥ 13 "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" గుణకర్మలను బట్టియే చాతుర్వర్ణ్య వ్యవస్థ నాచే గావింపబడినదని చెప్పబడెను. దీనిలోగల సూక్ష్మార్థమే అ. 18 శ్లో॥ 41, 42, 43, 44 నాలుగు వర్ణముల గుఱించి ప్రసంగించుచు విస్తరించి తెలుపబడినది. నాల్గు వర్ణముల గుఱించి తెలుపునపుడు "బ్రాహ్మం కర్మ స్వభావజమ్-క్షాత్రం కర్మ స్వభావజమ్-వైశ్యం కర్మ స్వభావజమ్-శూద్రస్యాపి స్వభావజమ్" అని విస్తరించి ఆయా వర్ణధర్మములను శ్రీభగవంతుడే స్వయముగా తెల్పియున్నాడు. 'స్వభావము' అను పదమున కొక్కొక్కరున్ను వారి వారి బుద్ధి ననుసరించియు, విద్యాబలమును బట్టియు ననేకార్థములు జెప్పినను, సత్యబుద్ధితో నాలోచించిన వారి వారి గుణములనుబట్టి గలిగెడు సత్త్వరజస్తమస్సులనియే 'స్వభావము' అను పదమున కర్థమగును. ఈ యర్థమునే శ్రీ శంకరానంద, ఆనందగిరి, మధుసూదనసరస్వతీ మొదలగు మహాత్ములు తమతమ వ్యాఖ్యానములలో విశదీకరించియున్నారు. సనాతనులని చెప్పువారు వారియొక్కయు, వారి సంబంధులయొక్కయు ఆహార విహార వస్త్రాభరణాదుల గుఱించియు వారి

పుత్ర పుత్రికాదుల విద్యావిధానమును గురించియు, బ్రహ్మచర్యాద్యాశ్రమపాలనమును గుఱించియు, వైశ్వదేవాద్యగ్ని కార్యములను గుఱించియు, నిత్యనైమిత్తికాది పంచయజ్ఞములను గుఱించియు తమలో తామాలోచించుకొనిన, పూర్వీకులగు ఋషుల సనాతన ధర్మాచరణమునకున్ను, తమకున్ను గల మార్పును తెలిసికొన గలుగుదురు. మఱియు విద్యాభ్యాసమును గుఱించి మనువు చెప్పినది చూడదగినది.

'యోఽనధీత్య ద్విజో వేదమన్యత్ర కురుతే శ్రమం ।
స జీవన్నేవ శూద్రత్వమాశు గచ్ఛతి సాన్వయః ॥'
మనుస్మృతి—అ. 2, శ్లో॥ 168

తా॥ ఎవడు వేదము నధ్యయనము చేయక జీవనోపాయము కొరకై నితరశాస్త్రములందు పరిశ్రమచేయునో అతడు జీవించియున్నప్పుడే తన వంశజులతోగూడ శీఘ్రముగా శూద్రత్వము నొందును. ఇక పరాశరస్మృతియందు ధర్మనిర్ణయమును గుఱించి చెప్పినదిన్ని చూడదగినది.

"మునీనామాత్మవిద్యానాం ద్విజానాం యజ్ఞయాజినాం ।
వేదవ్రతేషు స్నాతానామేకోఽపి పరిషద్భవేత్॥"

తా॥ ఆత్మవిద్యానుభవము గలిగి మననశీలురయి యున్నవారును, లోకానుగ్రహార్థము యజ్ఞముల నాచరించుచుండువారును, వేదవిద్యావ్రతస్నాతులునునగు ద్విజులలో నొక్కడైనను పరిషత్తనం బడును.

దీనియందాత్మవేత్తలు, ధర్మశీలురు ఐదుగురుగాని, నల్గురుగాని, ముగ్గురుగాని, యిద్దరుగాని, కట్టకడకు ఒక్కరుగాని ఆ యా దేశ కాలముల ననుసరించి యేదేది యనుష్ఠేయమగు ధర్మమని చెప్పెదరో, అదియే యాచరణీయ మని తెలుపుచుండగా వర్ణాశ్రమములు సనాతనములని అనగా వేదకాలమునుండి యెల్లప్పటికి నొకేవిధముగా నుండవలెనని యెట్లు చెప్పగలరు? మఱియు

"పంచ పూర్వే మయా ప్రోక్తాస్తేషాం చానంభవే త్రయః।
స్వవృత్తిపరితుష్టా యే పరిషత్ప్రా ప్రకీర్తితా ॥"

తా॥ నేనిప్పుడు పరిషద్విషయిమై 5 పక్షములను చెప్పియున్నా
ను. ఆ చెప్పినవానిలో నొకపక్షమైనను లభింపనియెడల నిషిద్ధ
వృత్తినవలంబింపక స్వవృత్తిచేతనే సంతసించుచుండు ముగ్గురైనను
పరిషత్త్వమునకు అర్హులగుదురు. పరాశరమహర్షి యెంత దీర్ఘా
లోచనతో ధర్మసంగ్రహమును చెప్పియుండినారు! వేదాధ్యయనము,
ఆత్మవిచారమున్ను లేనివారైనను నిషిద్ధకర్మలు చేయనివారు
ముగ్గురైనను చేరినిర్ణయించునదే యీ కాలమునకు తగిన ధర్మ
మని తెలిపినారు. ఏ కాలమున కేధర్మ మనుష్ఠేయమో నదియు
తెలియదగినదే. సర్వజనులకు వారివారి గుణకర్మల యోగ్యత
ననుసరించి సర్వకార్యములందును ప్రవేశార్హత నంగీకరించు మతమే
సత్యమైనది తక్కినమత మేదైనను పక్షపాత కల్మష దూషిత
మనియును సృష్ట్యాది యందొక్క మానవజాతియే యుండె
ననియు, వారు బ్రాహ్మణులేయనియు, కొంతకాలమునకు తరు
వాత గుణకర్మ భేదములచే వారలలో నిరుతెగ లేర్పడినవనియు,
వారే యార్యులనియు అనార్యులనియు (అనగా దస్యులనియు)
పేర్లు కలిగినవారలైరనియు, గీత అ. 16, శ్లో॥ 6 "ద్వౌ భూత
సర్గౌ లోకేఽస్మిన్దైవ ఆసుర ఏవచ" అని చెప్పిన విధముగా నుండె
ననియు, కొంతకాలమునకు అ. 4 శ్లో॥ 13 "చాతుర్వర్ణ్యం మయా
సృష్టం గుణకర్మవిభాగశః" అని చెప్పినట్లు నాలుగువర్ణములు గల
వారలైరనియు నిరూపించబడినది ఈ నాలుగు జాతులవల్లనే అనేక
జాతు లేర్పడినవి ఏర్పడుచున్నవి. ఏర్పడగలవు. సృష్ట్యాదిలో
బ్రాహ్మణజాతి ఒకటే యుండెను.

ఇప్పుడు బ్రాహ్మణులలో శైవ వైష్ణవాది భేదము లేర్పడి
నవి. అలాగున శ్రీ ఏసుక్రీస్తు జన్మించుటకు ముందుగా క్రైస్తవ
జాతియు, శ్రీ మహమ్మదునబి యావిర్భవించుటకు పూర్వము
మహమ్మదీయులు లేరనియు, శ్రీ బుద్ధదేవు డవతరించుటకు
ముందుగా బౌద్ధులు ఉండలేదనియు నందఱు నెఱింగిన విష
యమే. పై చెప్పిన ప్రవక్తల మత మవలంబించిన జనులాయా
పేర్లతో బౌద్ధులనియు, క్రైస్తవులనియు, మహమ్మదీయులనియు

పేర్కొనబడ దొడంగిరి. స్వల్పకాలము క్రిందటనే శ్రీ నానక్ సాంప్రదాయకులు సిక్కులుగాను, శ్రీ దయానంద సాంప్రదాయకులార్యులుగాను. శ్రీరామమోహన సాంప్రదాయకులు బ్రహ్మసమాజికులుగాను వ్యవహరింపబడిరి. జాతియొక్క యావిర్భావ మీలాగుననే యుండును. దీని వలన జాతియొక్క పరిణామమును తెలిసికొనవచ్చును. ఈ లాగున కల్పాంతమువఱకు ప్రకృతి తన యొక్క వికృతితోగూడిన నాటకమును నడుపుచుండును. ఈ విషయమై సనాతన ధర్మమును చెప్పువారేమి తెలుపుదురు? ఒకరాజ్యపాలన మారునప్పుడు ఆయారాజ్య ధర్మమేలాగున మారుచుండునో కాలము ననుసరించి ధర్మమున్ను అలాగున మార్పు చెందుచుండును. దానిని అనుసరించి నడువవలయుననియే ధర్మశాస్త్రము బోధించుచుండును. అట్లుకానిచో ఆయా ప్రభుత్వమునకు భిన్నముగా నడుచువారి గతియే వీరిక పట్టును. అందఱున్ను అలాగున ధర్మవిరుద్ధముగా నడచుచున్నారు. కాని వాక్కుతోమాత్రము సనాతనులమనియే పలుకుదురు. పైవిధమున కాలానుగత ధర్మముతో నడువని వారేటి కెదురీదువారి గతినే హొందుదురు. మఱియు ప్రకృతి తనలో నిగూఢమైయుండు శక్తిని, వృక్షము తనలోగుప్తమైయుండు ప్రభావమును ఫలపల్లవ పుష్పాదులచే వికసింపజేయునట్లు, దినదినము విజృంభింపచేయుచునే యుండును. కాలానుగుణముగా నేర్పడు రసాయన శాస్త్రములును విద్యుదాది యంత్రములును, విమానాది వాహనములును దీనికి తార్కాణము. దీనివలన ఆత్మధర్మమును విడువవలయునని శాస్త్రము విధించుటలేదు. బాహ్యాచరణాదులలో మాత్రము కొంత మార్పు చేసుకొనవలెననియే శాస్త్రము తెలుపుచున్నది.

"కృతే తు మానవా ధర్మాస్త్రేతాయాం గౌతమాః స్మృతాః।
ద్వాపరే శఙ్ఖలిఖితాః కలౌ పారాశరాస్స్మృతాః॥

తా॥ కృతయుగంబున మనుస్మృత్యుక్త ధర్మములును, త్రేతాయుగంబున గౌతమస్మృతి ప్రతిపాదిత ధర్మంబులును, ద్వాపరయుగంబున శంఖలిఖిత స్మృతివిహిత ధర్మంబులును. కలియుగంబున పరాశరోక్తధర్మములును ప్రచురముగ నాచరింపదగినవి.

ధర్మశాస్త్రములన్నిటిలోను మనుస్మృతి మొట్టమొదటిది. దానివి సనాతన ధర్మమని చెప్పుదురు. కాని యది కృతయుగమునకు మాత్రమే యుపయోగపడునని వచించి త్రేతాయుగమునకు శ్రీగౌతముడు గౌతమస్మృతిని నిర్మించెను. మఱల శ్రీ శంఖలిఖితుడు గౌతమస్మృతి ద్వాపరమునకు పనికిరాదని నిశ్చయించి శంఖలిఖిత స్మృతిని నిర్మించెను. శ్రీ పరాశరుడు కలియుగమునకు పై మూడు స్మృతులును పనికిరావని తీర్మానించి. పరాశరస్మృతిని యేర్పరచెను. ఇక యాజ్ఞవల్క్య స్మృతిని శ్రీ యాజ్ఞవల్క్యుడు రచించెను. ఇకను శ్రీ వసిష్ఠ, శ్రీ వ్యాస, శ్రీదేవలాది ఋషులు అనేక స్మృతులను రచించిరి. దీని కేమి సమాధానము జెప్పగలరు? ధర్మమునకు పరిణామములేనిచో, కాలానుగుణముగా నిన్ని స్మృతులు ఋషులచే నేల వ్రాయబడవలసి వచ్చెను? భారతమున అనుశాసనిక పర్వమునందు వర్ణమును గుఱించి చెప్పినది చూడుడు.

"ఏకవర్ణమిదం పూర్వం విశ్వమాసీద్యుధిష్ఠిర! ।
కర్మక్రియావిశేషేణ చాతుర్వర్ణ్యం ప్రతిష్ఠితమ్॥"

తా॥ ఓ ధర్మరాజా! సృష్ట్యారంభమున నొక్కవర్ణమే విశ్వమంతట నుండెను. గుణకర్మల మార్పువలన చాతుర్వర్ణ మేర్పడెను.

శ్రీ జగద్గురు శంకరాచార్యాదులు గీత కర్థము వ్రాసియుండగా, నిప్పుడు ప్రత్యేకముగా వ్రాయుటకు వారికన్న వీరికి యెక్కువజ్ఞానము గలదా! యని కొందఱు తలంచవచ్చును. ఈ వాక్యమున కర్థమేలేదు ఏలయున, శ్రీ శంకరుల కేవల శ్రీరామానుజులు. శ్రీమధ్వులు నేల భాష్యముల వేరువేరుగా వ్రాసిరి? మఱియు వారి యనుయాయులగు శ్రీ శంకరానందగిరి, మధుసూదన సరస్వతి, శ్రీ ఆనందగిరి మొదలగువారు అద్వైతమునకును. శ్రీ వెంకటనాథులు మొదలగువారు విశిష్టాద్వైతమునకును శ్రీ రాఘవేంద్రస్వాములు మొదలగువారు ద్వైతమునకు నేల వ్యాఖ్యానముల వ్రాసిరి? తరువాత ఒక్కొక్క మతానుయాయులలో ననేకులు గీతకు అర్థములు వ్రాసిరి, వ్రాయుచున్నారు. వ్రాయగలరు ఈలాగున మహోకల్పాంతములవఱకు జరుగుచునే యుండును శ్రీ శంకర శ్రీ రామానుజ. శ్రీ మధ్వాది మతత్రయా చార్యుల

భాష్యములను, తరువాత నాయా సాంప్రదాయకుల వ్యాఖ్యానము
లను గ్రహించిన వాలును. శ్రీ కంఠశివాచార్యులు శివపరముగాను
గీత కర్థము వ్రాసియున్నారు. అయితే మానవులయొక్క విజ్ఞానాభి
వృద్ధి ననుసరించి సర్వులకును సర్వవిషయములందు మార్గమివ్వ
వలయును. ఒక కాలమున స్త్రీ శూద్రాదులకు శాస్త్రముల గ్రహిం
చెడు బుద్ధివికాసశక్తి లేదని కొందఱు సంకుచిత హృదయులు చెప్పు
చుండిరి. ఇప్పుడు యం. ఏ బి. ఏ. లలో యెందరో బ్రాహ్మణే
తరులును, స్త్రీలును ఉత్తీర్ణులగుచున్నారు. అలాగున సంస్కృత
ములో నెందరో బ్రాహ్మణేతరులు ఆచార్య పరీక్షలోను శాస్త్రశిరో
మణిలో నారితేరిరని వార్తాపత్రికలయందు ప్రచురింపబడుచుం
డుట జూచుచునేయున్నాము. జనుల ప్రజ్ఞను వృద్ధిపఱచుట కవ
కాశము గలుగజేయక అణచిపెట్టినందుచే నాత్మజ్ఞానమును శాస్త్ర
జ్ఞానము వృద్ధి నొందకపోయెను.

బీజమును భూమిలో పెట్టి పోషింపక డబ్బిలో పెట్టియుంచి
వృక్షముగా బరిణామమును పొందలేదనియు. నిప్పుపుల్లను
వెలిగించికట్టెలు పెట్టక అగ్ని ప్రజ్వలింపవలేదనియు చెప్పిన
నెట్లుండునో వీరి వాదమును కూడు నట్టిదే. ఇట్టి పాపమువలననే
వందలాది సంవత్సరముల నుండి భారతీయులు పరాధీనులై
అస్వతంత్రులై బానిసలై పోవుటకు కారణమని యిప్పుడిప్పుడు
విజ్ఞులు తెలిసికొనగలుగుచున్నారు. ఇట్లు గానిచో 40 కోట్ల జను
లను 4 కోట్ల విదేశీయులు సముద్రములు దాటి వేలమైళ్లదూర
మున నుండుచు పాలింపగలుగుదురా? [illegible] మీ
లాగున నుపదేశించుచున్నాను. అది యేమన, ఎంతవఱకు మీ
క్రింద నొక్కడు [illegible] గలడో, అంతవఱకు
మీరు మఱి యొకరి క్రింద నుండవలసియుందురు. ఏలన 'యా
మతిస్సా గతిర్భవేత్' అని శాస్త్రము

మఱియు శ్రీ భగవద్గీత కర్మయోగమునే యుపదేశించుచున్న
దని కొందరును భక్తి యోగమునే యుపదేశించుచున్నదని మఱి
కొందఱును ధ్యానయోగమునే యుపదేశించుచున్నదని వేరుకొంద
ఱును, జ్ఞానయోగమునే యుపదేశించుచున్నదని యితరులు కొంద

యును చెప్పుచున్నారు. వీరు చెప్పిన భావమంతయు గీతలోగలదు. కాని అంతటితో పూర్తిగా లేదు. 18 అధ్యాయములలోను ప్రతి అధ్యాయాంతమున యోగశబ్దముండుటచే ఈ 18 యోగములను శ్రీకృష్ణభగవాను డుపదేశించెనని గ్రహించుటయే యథార్థమగును. ఈ 18 అధ్యాయములను గీతాకల్ప వృక్షముయొక్క శాఖలే యగును. ఇవియన్నియు చేరినదే గీతాకల్పతరువగును ఒక్కొక్క దానిని చెప్పువా రొక్కొక్కశాఖను చెప్పినవారును. ఆచరించిన వారును మాత్రమే యగుదురు. కర్మ భక్తి యోగ జ్ఞానములనెడు 4 యోగములలో తక్కిన 14 యోగము లంతర్భూతములే యని గ్రహింపదగును. ఏలన నీ నాల్గుయోగములు మాత్రమే జగద్విఖ్యాతి గలిగియున్నవి. ముఖ్యముగా కర్మయోగమే గీతాశయ మని ఎక్కువమంది అభిప్రాయమై యున్నది. ఉత్తరగీతను గూడ చదివిన మాత్రమే యీ గీతాశయము పూర్తిగా తెలిసికొన సాధ్యమగును. ఏలన మానవుని జీవితము పూర్వభాగమనియు ఉత్తరభాగమనియు రెండుభాగములుగా విభజింపబడియున్నది. బ్రహ్మచర్య గృహస్థములను పూర్వభాగముగాను, వానప్రస్థ సన్న్యాసములను ఉత్తరభాగముగాను చెప్పిరి. పూర్వభాగమగు గృహస్థాశ్రమము నుండు నప్పుడే గీత ఉపదేశింపబడినది. ఉత్తరాశ్రమమందుండునప్పుడు ఉత్తరగీత యుపదేశింపబడెను, కావుననే దానికి 'ఉత్తరగీత'యని పేరు గలిగినది. అందువలన అంతఃకరణశుద్ధి గలుగునంతకు నిష్కామ కర్మయోగము ననుష్ఠించి తరువాత జ్ఞానయోగము ననుసరించవలయుననియే గీత బోధించుచున్నది. ఈ తత్త్వము నాధారముగా చేసి కొనియే కృష్ణ ముఖారవిందమునుండి స్వయముగా గీతాస్మృతోదేశమును పొందిన యర్జునాది పాండవులైదుగురును ద్రౌపదియు నంత్యకాల మాసన్నముగాకమునుపే సర్వసంగపరిత్యాగులై సాధువులై, ఇంద్రప్రస్థమును త్యజించి వనవాసమొనర్చి, తీర్థయాత్రాపరులై, అచ్చటచ్చట శివ [illegible] మొనర్చుచు, కృష్ణకథా [illegible] ప్రదేశము [illegible] కేగుచు జేరి అటనుండి [illegible] మొనర్చిరి. ఈ గాథ [illegible] యు మహాభారత మహాప్రస్థానపర్వమందు గనదగును. నిష్కామకర్మయోగ

మునే శ్రీకృష్ణుడుపదేశించియుండిన, పాండవు లంత్యకాలమువరకును స్వగృహమందుండియే ఫలాపేక్షారహితులై కర్మయోగము ననుష్ఠించవలసియుందురు. బ్రహ్మవిచారమునకు సర్వత్యాగము ఏకాంతవాసమున్ను అవశ్యముగా నుండవలెను లేనిచో నిర్విషయ, నిర్వికార, నిర్వికల్పమగు బ్రహ్మసమాధిని పొందజాలరు కావుననే క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగమున జ్ఞానము నుపదేశించిన తరువాత "జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే" అనితెలుపుటకు కారణము కావున జ్ఞేయమును పొందుటయే గీత యొక్క ఆశయమగును లేనిచో నమృతత్వప్రాప్తి గలుగదని శ్రీకృష్ణభగవానుడు స్వయముగా నుపదేశించెను. కనుకనే ఆ యధ్యాయమున "న హి నస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్" అట్టి జ్ఞేయమును పొందనివాడు ఆత్మఘాతకుడనియు, "యః పశ్యతి న పశ్యతి" అట్టిజ్ఞేయమును దర్శించనివాడు నేత్రముండియు గ్రుడ్డివానితో సమానుడనియు, అట్టి జ్ఞేయబ్రహ్మమును, దర్శించువాడే నేత్రము గలిగినవానికి ఫలమును పొందగలడనియు శ్రీవాసుదేవుండుపదేశించుటకు కారణమైనది

మఱియు శ్రీభగవద్గీత అధ్యాత్మశాస్త్రమగుటచేతను, శ్రీభగవంతుడుపదేశించిన దగుటచేతను, శ్రీ వేదవ్యాసమహాముసీంద్రుడు ఛందోబద్ధముగా వ్రాసినదగుటచేతను, స్థూలముగా కనబరచిన కురుక్షేత్రమున పాండవ దుర్యోధనాదుల యుద్ధమును గుఱించి మాత్రము చెప్పినదని నమ్మదగదు. దీనియందగాధమగు నంతరార్థభావమేదైన యుండవలెను ఆ యుద్ధము ప్రతివారి హృదయములో జరుగుచుండెడు ధర్మాధర్మముల సంగ్రామమని గ్రహించదగును అయ్యది జ్ఞానాజ్ఞానముల సంఘర్షణమును బట్టియే యుండును. ధృతరాష్ట్రుడువుట్టంధుడు. అతని కుమార్లు నూర్గురు. పాండు శబ్దమునకు తెలుపని అర్థము. పాండురాజు కొడుకులు ధర్మరాజాదులైదుగురే. అంధుని కెల్లప్పుడున్ను చీకటియే గోచరించును. అనగా అజ్ఞానమని తాత్పర్యము. ఇది తామసగుణము. తమస్సు, దీనియొక్క సంతానములు రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము మొదలైననివి. వీనే దుర్యోధనాదు

లుగా వర్ణించడమైనది. తపస్సునుండి యేర్పడిన వారలగుటచే వీరు తామసులగుటకు కారణము. పాండుశబ్దమునకు తెలుపని అర్థము. అది సత్త్వగుణము. దీని సంతతి సత్త్వగుణములగు ధర్మాదులు. (సత్యము, ధర్మము సహనము, జ్ఞానము, త్యాగము మొదలగు నైదు) వీటినే ధర్మరాజాదులుగ వర్ణించబడినది. అర్జునుడనగ జీవుడు. కృష్ణపరమాత్మయనగ దేవుడు. కురుక్షేత్ర మనగ హృదయము దీనియందు గలుగుచుండు పాపపుణ్యముల సంగ్రామమే యీ గీతయందు యుద్ధముగ వర్ణించడమైనది. ఇట్టి సందిగ్ధావస్థలో ధర్మాధర్మముల నిర్ధారణ చేయుటకు శక్తిలేన ప్పుడు జీవుడు పరమాత్మను శరణుపొందుటయే కర్తవ్యము. ముముక్షువైనవాడు బ్రహ్మవేత్తల నాశ్రయింపవలెను. అప్పుడు పరమేశ్వరుని కృపచే జీవుడు తనయొక్క కర్తవ్యాకర్తవ్యములను తెలిసికొని యనుష్ఠించుటవలన జీవునికి జ్ఞానము గలుగును. అందు వలన జీవన్ముక్తియగు మోక్షము సిద్ధించును. ఇదే పాండవుల స్వారాజ్య పట్టాభిషేకముయొక్క నిజార్థము గును. కావున హృదయ ములోగల దుష్ట గుణములను రహితమొనర్చి మోక్షసామ్రాజ్య మును పొందవలయును. ఇది దైవకృపలేనిచో సాధ్యముకాదు. దైవదూరులకు మొదట బాహ్యసుఖము కనిపించినను, దైవ సంబంధులకు ప్రథమమున కొంత ప్రయాసము కలిగినను, క్రమ ముగా నధర్మమునకు క్షయమును, ధర్మమునకు జయమును గలుగుననియే దుర్యోధనాదుల నింద్రప్రస్థరాజ్యసుఖము, ధర్మ రాజాదుల వనవాసమున్ను తెలుపుచున్నది.

విజ్ఞానాత్ములారా! మహాశయులారా! దీనియందేదైన లోప ముండిన తెలిపెడువారికి కృతజ్ఞుడను. మరుముద్రణమునందది నవరింప నుద్యుక్తుడను, విజ్ఞులెల్లప్పుడును రాజహంసలవలె సార గ్రాహులై యుందురుగదా!

(1) గీతాశయము. అను గ్రంథమునను (స్వబోధ సుధాకర మను పుస్తకమందు 'భగవద్గీతాశయము' అను వ్యాసమునను గీతాతాత్పర్య విషయమై విస్తారముగా తెల్పబడినందున, నిచట అధికముగా విస్తరింప బూనలేదు. ఆ గ్రంథమును చదివినచో

గీతయొక్క యాశయము అందఱికిన్ని తేటతెల్లముగ బోధపడ గలదు. మఱియు పద్మపురాణాది గ్రంథములలో గీతను గుఱించి చెప్పినవి కొన్నింటిని యిచట తెలిపెద.

సర్వశాస్త్రమయీ గీతా సర్వవేదమయో హరిః।
సర్వతీర్థమయీ గంగా సర్వతేజోమయో రవిః॥

తా॥ ఏలాగున గంగ సర్వతీర్థమయమై యున్నదో, ఏలాగున సూర్యుడు సర్వతేజోమయుడై యున్నాడో, హరి యేలాగున సర్వవేదమయుడై యున్నాడో, ఆలాగున గీతయు సర్వశాస్త్రమయమైయున్నది. మఱియు,

భారతే భగవద్గీతా తథా నామ సహస్రకం।
గాయత్ర్యాస్సమ్మితం ప్రోక్తం పుణ్యే పాపక్షయే తథా॥
పాఠేన యత్ఫలం ప్రోక్తం అర్థజ్ఞానాచ్చతుర్గుణం।
మద్భక్తేభ్యశ్శ్రావణాచ్చ పుణ్యం దశగుణం స్మృతం।
వ్యాఖ్యానాచ్చాపి శిష్యేభ్యః పుణ్యం శతగుణం స్మృతమ్॥

తా॥ మహాభారతమునందు భగవద్గీతయు, విష్ణుసహస్రనామము మున్ను గలవు. ఈ గీతయో గాయత్రీ మహామంత్రమునకు సమానమైనది. గాయత్రి పుణ్యప్రాప్తికిని పాపక్షయమునకు యెంత మహిమ గలిగియున్నదో గీతయును యిటువంటిదే. పారాయణ యణముచే యెంత పుణ్యము గలుగునో అంతకన్నను అర్థముతో గూడ పఠించిన నాల్గురెట్లధిక పుణ్యము గలుగును. ఈ గీతకు వ్యాఖ్యానముజేసి భక్తులచే బఠింపజేసినచో నూరురెట్లధికఫలము (పుణ్యము) గలుగును ఇదే విధముగ గీత 18-వ అధ్యాయమున శ్రీకృష్ణ భగవానుడు ఉపదేశించెను.

"య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥"

తా॥ ఎవడీ పరమరహస్యమగు గీతాశాస్త్రమును నా భక్తులకు జెప్పుచున్నాడో వాడు నాయందు సర్వోత్కృష్టమైన భక్తిని జేసి (భక్తిగలిగి) నన్నేపొందుచున్నాడు, దీనియందు సంశయములేదు

న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ॥
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥

తా॥ మనుష్యులలో నాభక్తులకు గీతను జెప్పువానికంటె అధికప్రియమును జేయువాడు మఱియొకడు నాకు లేనేలేడు. ఈ లోకమున అట్టి వానికంటె యితరుడు మఱియెవడును నాకు మిక్కిలి యిష్టుడు కానే కాబోడు.

గీతా గంగా చ గాయత్రీ సీతా సత్యా సరస్వతీ ।
బ్రహ్మవిద్యా బ్రహ్మవల్లీ త్రిసంధ్యా ముక్తగేహినీ ॥
అర్ధమాత్రా చిదానందా భవఘ్నీ భయనాశినీ ।
వేదత్రయీ పరాఽనంతా తత్త్వార్థజ్ఞానమంజరీ ॥

తా॥ శ్రీ భగవద్గీతకు యిన్ని పేర్లుగలవు. (1) గీత, (2) గంగ, (3) గాయత్రి, (4) సీత, (5) సత్య, (6) సరస్వతి, (7) బ్రహ్మవిద్య, (8) బ్రహ్మవల్లి, (9) త్రిసంధ్య, (10) ముక్తగేహిని, (11) అర్ధమాత్ర, (12) చిదానంద, (13) భవఘ్ని, (14) భయనాశిని, (15) వేదత్రయి, (16) పర, (17) అనంత, (18) తత్త్వార్థజ్ఞానమంజరి.

పరమశివుడు గీతామాహాత్మ్యమును గుఱించి పార్వతీదేవికి ఉపదేశించినది చూడుడు.

"నాతః పరతరం కించిద్రహస్యం హంసగామిని !
ఉపతాపత్రయహరం మహాపాతకనాశనం ।
యథా కాలేష్వహం నిత్యో యథా పశుషు కామధుక్ ॥
యథా వ్యాసో మునీంద్రేషు వ్యాసేషు బ్రహ్మవిత్తమః ।
యథా దివౌకసాం శక్రో శుక్రాదిషు గురుర్వరః ॥
యథా రసానాం పీయూషముత్తమం విశ్వవిశ్రుతం ।
తథా గిరీణాం కైలాసో యథా చేన్ద్రో దివౌకసామ్ ॥
తీర్థానాం పుష్కరం తీర్థం యథా పుష్పేషు పంకజం ।
పతివ్రతాసు నారీషు యథా లోకేష్వరుంధతీ ॥
యథా మఖేష్వశ్వమేధో యథోద్యానేషు నందనం ।
యథా రుద్రేషు సర్వేషు వీరభద్రో మమానుగః ॥
యథా దానేషు భూదానం యథా సింధుషు గౌతమీ ।
యథా లోకే హరిక్షేత్రం ప్రశసం ధర్మకర్మసు॥"

తా॥ ఓ పార్వతీదేవీ! ఈ గీతాశాస్త్రముకన్న పరమరహస్య మనునది వేరొండులేదు. ఇది సకల సంతాపహారకమును, మహా పాతకవినాశకమునై యలరారుచున్నది. ఇంకను దీని శ్రేష్ఠత్వ మును వినుము. కాలములలో నిత్యుడనగు నావలెను (ఈశ్వరుని వలెను), ధేనువులలో కామధేనువువలెను, మునీంద్రులలో వ్యాస మహర్షివలెను, వ్యాసమునులలో బ్రహ్మవిత్తగు వ్యాసభగవానుని వలెను, దేవతలలో దేవేంద్రునివలెను, గురువులలో బృహస్పతి వలెను, రసములలో యమృతమువలెను, పర్వతములలో కైలా సమువలెను, నక్షత్రములలో చంద్రునివలెను. తీర్థములలో పుష్కరతీర్థమువలెను, పుష్పములలో కమలమువలెను, పతివ్రత లలో అరుంధతివలెను, యజ్ఞములలో అశ్వమేధమువలెను, ఉద్యా నములలో నందనమువలెను, రుద్రులలో వీరభద్రునివలెను, దాన ములలో భూదానమువలెను, నదులలో గంగవలెను, పుణ్య క్షేత్రములలో ధర్మకార్యాచరణకు బదరికాశ్రమమువలెను యీ గీతశాస్త్రము సర్వశాస్త్రములలో ప్రధానముగా నలరారుచున్నది యని పద్మపురాణము.

శ్రీ శంకరభగవత్పాదాచార్యులు గీతను గుఱించి తెలిపినది జూడుడు,

"భగవద్గీతా కించిదధీతా గంగాజలలవకణికా పీతా ।
సకృదపి యేనమురారిసమర్చా తస్య కరోతి యమోఽపి
న చర్చామ్ ॥

తా॥ భగవద్గీతను కొంచమయినను యెవడు పారాయణము జేయునో, గంగాజలముయొక్క ఒక్క బొట్టైన నెవడు పానము చేయునో, యెవడొక్కసారియైన శ్రీమన్నారాయణుని ధ్యానము జేయునో, అట్టివానిని గూర్చి యముడు సహితము భయపడి యతని మాటయే యెత్తడు.

శ్లో॥ మంగళం శ్రీకురుక్షేత్రరణక్షోణివిహారిణే ।
పార్థసారథిరూపాయ గీతాచార్యాయ మంగళమ్ ॥

ఇట్లు తమ చరాచరసుఖాభిలాషి,
శ్రీ మలయాళస్వాములవారు.

ఓం

ఓం తత్ సత్

# శ్రీ గ ణే శ స్తో త్ర మ్

ఓం ఓం ఓం ఓఙ్కారరూపం త్ర్యహమితిచపరం యత్స్వరూపం, తురీయం
త్రైగుణ్యాతీతనీలం కలయతి మనసస్తేజసిన్దూరమూర్తిమ్ ।
యోగీన్ద్రా బ్రహ్మరన్ధ్రే సకలగుణమయం శ్రీహరేన్ద్రేణసంగం
గం గం గం గం గణేశం గజముఖమభితో వ్యాపకం చిన్తయన్తి॥



ఓమ్

# శ్రీ గు రు ధ్యా న మ్

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యాసమ్ప్రదాయకర్తృభ్యో
వంశఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః । 1

" నమోఽస్త్వనన్తాయసహస్రమూర్తయే, సహస్రపాదాక్షి శిరోరు బాహవే
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే, సహస్రకోటీ యుగధారిణే నమః ॥ 2

,, గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥ 3

,, నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే ॥
నిర్మలాయ ప్రశాన్తాయ దక్షిణామూర్తయేనమః ॥ 4

,, శివాజ్ఞయా జీవగణాన్ ప్రశాస్తుం భువంగతో భార్గవమణ్డలాద్యైః
సమస్తయోగీ జనతారకం తం సనత్కుమారం శరణం ప్రపద్యే ॥ 5

,, కృపాసముద్రం సుగతస్యమిత్రం తపశ్చరన్తం గిరిరాజపార్శ్వే
జగద్గురుం సర్వమతప్రదీపం నమామి మైత్రేయమగాధ బోధమ్॥ 6

,, హయాస్యాద్యవతారైస్తుజ్ఞానసిద్ధా మునీశ్వరాః
కృతార్థానాం గతాస్తం వైనారాయణముపాస్మహే ॥ 7

ఓం వేదతత్త్వైర్మహావాక్యైర్వసిష్ఠాద్యా మహర్షయః ।
చతుర్భిశ్చతురా ఆసన్ తం వై పద్మభువం భజే ॥ 8

ఓం బ్రహ్మర్షిర్బ్రహ్మవిద్వర్యో బ్రహ్మణ్యో బ్రాహ్మణప్రియః ।
తపస్వీ తత్త్వవిద్యస్తు తం వసిష్ఠం భజేఽన్వహమ్ ॥ 9

,, యోగజ్ఞం యోగినాం వర్యం బ్రహ్మజ్ఞానవిభూషితమ్ ।
శ్రీమద్వసిష్ఠతనయం శక్తిం వన్దే మహామునిమ్ ॥ 10

,, ధర్మజ్ఞం ధార్మికం ధీరం ధర్మాత్మానం దయానిధిమ్
ధర్మశాస్త్రప్రవక్తారం పరాశరమునిం భజే ॥ 11

,, కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతమ్ ।
వేదాబ్జభాస్కరం వన్దే శమాదినిలయం మునిమ్ ॥ 12

,, శ్రీపరాశరపౌత్రం శ్రీవ్యాసపుత్రమకల్మషమ్ ।
నిత్యవైరాగ్యసమ్పన్నం జీవన్ముక్తం శుకం భజే ॥ 13

,, సనందనం శ్రీసనకం సనాతనం సనత్కుమారం చ సనత్సుజాతం।
శ్రీవామదేవం చ శుకం మహాన్తం నమామి భక్త్యానిజబోధ సిద్ధ్యై ॥ 14

,, మాణ్డూక్యకారికాకర్తా యోభాతి బ్రహ్మవిద్వరః ।
శ్రీ గౌడపాదాచార్యం తం ప్రణమామి ముహుర్ముహుః ॥ 15

,, యోగీశ్వరం వేదచూడం వేదాన్తార్థనిధిం మునిమ్ ।
గోవిన్దభగవత్పాదాచార్యవర్యముపాస్మహే ॥ 16

,, హరిలీలావతారాయ శఙ్కరాయ పరౌజసే ।
కైవల్యకలనాకల్పతరవే గురవే నమః ॥ 17

,, బ్రహ్మణే మూర్తిమతే శ్రుతానాం శుద్ధిహేతవే ।
నారాయణ యతీన్ద్రాయ తస్మై శ్రీ గురవే నమః ॥ 18

,, మఙ్గళం గురుదేవాయ మహనీయగుణాత్మనే ।
సర్వలోకశరణ్యాయ సాధురూపాయ మఙ్గళమ్ ॥ 19

ఓం తత్ సత్

## శ్రీ గణేశ స్తోత్రమ్

ఓం ఓం ఓం ఓఙ్కారరూపం త్ర్యహమితిచపరం యత్స్వరూపం తురీయం
త్రైగుణ్యాతీతనీలం కలయతి మనసస్తేజసిన్దూరమూర్తిమ్ ।
యోగీన్ద్రా బ్రహ్మరన్ధ్రే సకలగుణమయం శ్రీహరేన్ద్రేణసంగం
గం గం గం గం గణేశం గజముఖమభితో వ్యాపకం చిన్తయన్తి॥



ఓమ్

## శ్రీ గురు ధ్యానమ్

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యాసమ్ప్రదాయకర్తృభ్యో
వంశఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః । 1

" నమోఽస్త్వనన్తాయసహస్రమూర్తయే, సహస్రపాదాక్షి శిరోరు బాహవే
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే, సహస్రకోటీ యుగధారిణే నమః ॥ 2

,, గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥ 3

,, నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే ॥
నిర్మలాయ ప్రశాన్తాయ దక్షిణామూర్తయేనమః ॥ 4

,, శివాజ్ఞయా జీవగణాన్ ప్రశాస్తుం భువంగతో భార్గవమణ్డలాద్యైః
సమస్తయోగీ జనతారకం తం సనత్కుమారం శరణం ప్రపద్యే ॥ 5

,, కృపాసముద్రం సుగతస్యమిత్రం తపశ్చరన్తం గిరిరాజపార్శ్వే
జగద్గురుం సర్వమతప్రదీపం నమామి మైత్రేయమగాధ బోధమ్॥ 6

,, హయాస్యాద్యవతారైస్తుజ్ఞానసిద్ధా మునీశ్వరాః
కృతార్థతాం గతాస్తం వైనారాయణముపాస్మహే ॥ 7

# శ్రీ వ్యాస స్తోత్రమ్

ఓం నమశ్శ్రుతిశిరఃపద్మషణ్డమార్తాణ్డమూర్తయే ।
బాదరాయణసంజ్ఞాయ మునయే శివవేశ్మనే ॥ 1

ఓం బ్రహ్మసూత్రకృతే తస్మై వేదవ్యాసాయ వేధసే ।
జ్ఞానశక్త్యవతారాయ నమో భగవతే హరేః ॥ 2

ఓం వ్యాసాయ యతివర్యాయ విద్యావిగ్రహధారిణే ।
నమస్తే పరమానన్దదాయినే పరమాత్మనే ॥ 3

ఓం వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్ ।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్ ॥ 4

ఓం వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥ 5

ఓం మునిం స్నిగ్ధామ్బుదాభాసం వేదవ్యాసమకల్మషమ్ ।
వేదవ్యాస సరస్వత్యాఽఽవాసం వ్యాసం నమామ్యహమ్ ॥ 6

ఓం అచతుర్వదనోబ్రహ్మా ద్విబాహురపరో హరిః ।
అఫాలలోచనశ్శమ్భుర్భగవాన్ బాదరాయణః ॥ 7

ఓం పారాశర్యం పరమపురుషం విశ్వవేదైకయోనిం ।
విశ్వాధారం విమలయశసం వేదవేదాన్తవేద్యమ్ ॥
శశ్వచ్ఛాన్తం శమితవిషయం శుద్ధబుద్ధిం విశాలం ।
వేదవ్యాసం విమలమతిదం సర్వదాఽహం నమామి ॥ 8

ఓం వ్యాఖ్యాముద్రికయా లసత్కరతలం సద్యోగపీఠస్థితం
వామే జానుతలే దధానమపరం హస్తం సువిద్యానిధిమ్ ।
విప్రవ్రాతవృతం ప్రసన్నమనసం పాథోరుహాఙ్గద్యుతిం
పారాశర్యమతీవ పుణ్యచరితం వ్యాసం స్మరేత్సిద్ధయే ॥ 9

ఓం కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతమ్ ।
వేదాబ్జభాస్కరం వన్దే శమాదినిలయం మునిమ్ ॥ 10

నమోఽస్తుతే వ్యాస! విశాలబుద్ధే ఫుల్లారవిన్దాయతపత్రనేత్ర!
యేన త్వయా భారతతైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః॥

ఓం నారాయణం నమస్కృత్యనరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ॥ 12



శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ కృ ష్ణ ధ్యా న మ్

ఓం కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్ ।
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్ ॥ 1

ఓం ప్రసన్నపారిజాతాయ తోత్రవేత్త్రైకపాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ॥ 2

ఓం కృష్ణాయ యాదవేన్ద్రాయ జ్ఞానముద్రాయ యోగినే ।
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాన్తవేదినః 3

ఓం సారథ్యమర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ ।
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః ॥ 4

ఓం వాచకః ప్రణవో యస్య క్రీడావస్త్వఖిలం జగత్ ।
శ్రుతిరాజ్ఞా వపుర్జ్ఞానం తం వన్దే దేవకీసుతమ్ ॥ 5

ఓం వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥ 6

ఓం మూకం కరోతి వాచాలం పఙ్గుం లఙ్ఘయతే గిరిమ్ ।
యత్కృపా తమహం వన్దే పరమానన్దమాధవమ్॥ 7

ఓం కరకమలనిదర్శితాత్మముద్రః
పరికలితోన్నతబర్హిబర్హచూడః ।
ఇతరకరగృహీతవేత్రతోత్రో
మమ హృది సన్నిధిమాతనోతు కృష్ణః ॥ 8

ఓం ఆ తామ్రపాణికమలప్రణయప్రతోదం
ఆలోలహారమణికుండలహేమసూత్రమ్ ।
అవిశ్రమామ్బుకణమమ్బుదనీలమవ్యాత్
ఆద్యం ధనఞ్జయరథాభరణం మహో నః ॥ 9

ఓం అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠన్
పశ్చాత్పార్థం ప్రణయసజుషా చక్షుషాఽవేక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రాం
అభిభ్రాణో రథమధివసన్ పాతు నస్సూతవేషః ॥ 10

ఓం వంశీవిభూషితకరాన్నవనీరదాభాత్
పీతామ్బరాదరుణబిమ్బఫలాధరోష్ఠాత్ ।
పూర్ణేన్దుసున్దరముఖాదరవిన్దనేత్రాత్
కృష్ణాత్పరం కిమపి తత్త్వమహం న జానే ॥ 11

ఓం వన్దే కృష్ణార్జునౌ వీరౌ నరనారాయణౌ వుభౌ ।
ధృతరాష్ట్రసుతోన్మత్తగజారోహణవల్లభౌ ॥ 12

ఓం యం బ్రహ్మా వరుణేన్ద్రరుద్రమరుతః స్తున్వన్తిదివ్యైః స్తవైః
వేదైస్సాంగపదక్రమోపనిషద్భైర్గాయన్తి యం సామగాః ।
ధ్యానావస్థితతద్గతేన మనసా పశ్యన్తి యం యోగినో
యస్యాన్తం న విదుస్సురాసురగణా దేవాయతస్మై నమః ॥ 13

ఓం సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః ॥
పార్థోవత్సస్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥ 14



## భా ర త స్తు తిః

భీష్మద్రోణతటా జయద్రథజలా గాన్ధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా ।
అశ్వత్థామవికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణాఖలు పాణ్డవై రణనదీ కైవర్తకః కేశవః ॥ 1

పారాశర్యవచనస్సరోజమమలం గీతార్థగంధోత్కటం
నానాఖ్యానకకేసరం హరికథా సమ్బోధనాబోధితమ్ ।
లోకే సజ్జనషట్పదైరహరహః పేపీయమానం ముదా
భూయాద్భారతపఙ్కజం కలిమలప్రధ్వంసిన శ్శ్రేయసే ॥ 2



శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

## శ్రీ గీ తా ధ్యా న మ్



ఓం సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః ।
గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥ 1

ఓం గీతాకల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం
వేదవ్యాస వివర్ధితం శ్రుతిశిరో బీజం ప్రబోధాంకురమ్।
నానాశాస్త్రరహస్యశాఖ మరతి క్షాంతిప్రవాళాంకితం
కృష్ణాంఘ్రిద్వయభక్తిపుష్పసురభిం మోక్షప్రదం జ్ఞానినామ్॥2

ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్ ।
అద్వైతామృతవర్షిణీం భగవతీమష్టాదశాధ్యాయినీం
అమ్బ! త్వామనుసందధామి భగవద్గీతే! భవద్వేషిణీమ్ ॥ 3



## అ థ ఋ ష్యా ది న్యా స ః



ఓం అస్య శ్రీభగవద్గీతాశాస్త్ర మహామంత్రస్య—భగవాన్ వేదవ్యాసఋషిః—అనుష్టుప్ఛన్దః—శ్రీకృష్ణపరమాత్మా దేవతా—అశోచ్యాన్నన్వశోచ స్త్వమితి బీజం- సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతి శక్తిః—అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతి కీలకం — మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసీతి కవచం — కిరీటినం గదినం చక్రహస్తమిత్యస్త్రం — అనాది మధ్యాంత మనంతవీర్యమితి ధ్యానం — జ్ఞానయజ్ఞేన భగవదారాధనార్థే శ్రీకృష్ణపరమాత్మప్రీత్యర్థే గీతాపారాయణే జపే వినియోగః॥

ఇ తి ఋ ష్యా ది న్యా సః



## అథ కరన్యాసః

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ఇత్యం గుష్ఠాభ్యాం నమః-నచైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః ఇతి తర్జనీభ్యాం నమః—అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽ-శోష్య ఏవ చేతి మధ్యమాభ్యాం నమః—నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః ఇత్యనామికాభ్యాం నమః — పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః ఇతి కనిష్ఠికాభ్యాం నమః — నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చేతి కరతలకరపృష్ఠాభ్యాం నమః॥

ఇతి కరన్యాసః

## అథ హృదయాదిన్యాసః

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ఇతి హృదయాయ నమః -న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః ఇతి శిరసేస్వాహా-అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చేతి శిఖాయై వషట్—నిత్యస్సర్వగతస్థాణురచలోఽయం సనాతనః ఇతి కవచాయ హుం—పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ఇతి నేత్రత్రయాయ వౌషట్-నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చేతి అస్త్రాయ ఫట్—భూర్భువస్సువరోమితి దిగ్బంధః— ఓం శ్రీకృష్ణపరమాత్మ ప్రీత్యర్థే గీతాపారాయణే జపే వినియోగః॥

ఇతి హృదయాదిన్యాసః

## ఋష్యాది న్యాసముల వివరము

ఏ వేదమంత్రముగాని, ఇతరమంత్రముగాని, వేదసంబంధ శాస్త్రముగాని యెవరిచేనేర్పడుచుండునో వారిని ఋషి యని చెప్పుదురు. ఏది ఛందోబద్ధమైయుండునో దానికి ఛందస్సు అనిపేరు. మంత్రాదులకు ఏది అధిదేవతయో దానికి దేవతయని పేరు. వేద

మంత్రాదులకు ఏది మూలమో అది బీజమనంబడును. దానియొక్క మహిమ యేది గలదో దానిని శక్తి యనెదరు. దీనియొక్క రహస్య మేదియో దానిని కీలకమందురు. ఇప్పుడు "అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే" అని మొదలుగాగల గీతలోగల శ్లోకములు భగవద్గీతా మహామంత్రమునకు బీజాదులుగ నిరూపింపబడినవి. ఆయా అధ్యాయ శ్లోకములను తదర్థమును కనుగొనిన యీ బీజ, శక్తి, కీలకములలోగల మహిమను తెలిసికోవచ్చును. అంగన్యాస కరన్యాసములు అంతముఖ్యములు గావు. అవి ఏకాంతములోనుండు గొప్ప తపస్సంపన్నులకు మాత్రమే యుపయోగకరములు. అదిన్ని యేదైన సిద్ధినిపొంద నిచ్ఛగల వారికి మాత్రమే చాలును. నిష్కామబుద్ధితోగాని, పరమభక్తితో కాని, జ్ఞానప్రాప్తికొఱకుగాని తపమొనర్చువారి కక్కరలేదు. దాని యొక్క సారమేమన విఘ్నదేవతలచే భంగము గలుగకుండుట కొఱకు అంగరక్షణము చేయుటేయగును. (1) ఋషి, (2) ఛందస్సు, (3) దేవత, (4) బీజము, (5) శక్తి, (6) కీలకము ఇవిమాత్రము ప్రతి మంత్రమునకు విధించినట్లుండవలెను. అధి దేవత ప్రాణము (ఆత్మ) అనియు, ఋషి మొదలగు షడంగ ములు నేత్రములు కరములు మొదలగు ఇన్ద్రియములనియు గ్రహించదగినది. పంచజ్ఞానేంద్రియములలో కర్మేంద్రియములు అంతర్భూతములు. అంతరింద్రియములు నాల్గుచేరి ఒక్క మనస్సునందు అంతర్భూతము గనుకనే పంచజ్ఞానేంద్రియములు మనస్సుచేరి షడంగమని చెప్పబడును. మంత్రము మాత్రముండి ఋష్యాదిషడంగములు లేనిచో, ప్రాణముమాత్రముండి నేత్రా దీంద్రియములు లేనివానివలె నుండును, ఇంద్రియములును మన స్సును మంచిస్థితిలో నుండిన మాత్రమే గదా ఆత్మగలదానికి ప్రయోజనము? ఒక్క అనన్యభక్తిమాత్రము గలిగి ధ్యానము చేయు వారికిదంతయు ముఖ్యముగాదు. అయినను కలిగియుండుటచే

మంచిది. తన యనుష్ఠానములో లోపముగలిగియో,మఱియేవిధము గానో యేవైన విఘ్నములు గలుగవచ్చును. వాటినుద్దేశించియే తన్నివారణ కొఱకు పరమకారుణికులగు ఋషులు ఋష్యాది షడఙ్గముల నేర్పరచిరి. అయితే కొన్ని మంత్రములు (1) ఋషి, (2) ఛందస్సు, (3) దేవత వీటిని మాత్రమే గలిగియుండును. ఏ మంత్రము దేనిని గలిగియుండునో ఆ విషయము కల్పశాస్త్రములో నిరూపింపబడియున్నది.

ఇప్పుడు గీతలోగల బీజ, శక్తి, కీలకాదుల నిరూపించెద. బీజం = అ.2,శ్లో॥ 11, శక్తి = అ,18, శ్లో॥ 66, కీలకం = అ· 18, శ్లో॥ 66లో ఉత్తరపాదము.

ఇక హృదయాది న్యాసము చెప్పబడుచున్నది. (1) హృదయం — అ. 2, శ్లో॥ 23, (2) శిరస్సు — అ. 2, శ్లో॥ 23, ఉత్తరపాదము, (3) శిఖ = అ. 2, శ్లో॥ 24, (4) కవచం = అ. 2, శ్లో॥ 24, ఉత్తరార్థము, (5) నేత్రము = అ. 11, శ్లో॥ 5, (6) అస్త్రము = అ. 11, శ్లో॥ 5, ఉత్తరపాదము. ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

శత్రువులు ప్రవేశింపకుండుటకు సైన్యములచే నేలాగున దిగ్బంధము జేయుదురో, అలాగున ధ్యాననిష్ఠలో నుండువానిని విఘ్నదేవతలు ప్రవేశించి భంగపరచకుండుటకొఱకిది యేర్పడినది. పైతెలిపిన హృదయాది న్యాసమునకు నిరూపించిన మంత్రములే కరన్యాసమునకును వర్తించును.

పై చెప్పిన మంత్రముల కన్నిటికిని భావములు గలవు. అవి అనుభవజ్ఞులవలన తెలిసికొనవలసియుండును. దీనిలో వ్రాసినను అవి బోధపడవు. నేరులో చూపి చెప్పవలసియుండును.

ఓమ్ తత్ సత్.

ఓం

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ గీతా మాహాత్మ్యమ్

ధరోవాచ = భూదేవి చెప్పెను .

శ్లో॥ భగవన్! పరమేశాన! భక్తిరవ్యభిచారిణీ ।
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో! ॥ 1

తా॥ ఓ భగవంతుడా! పరమేశ్వరా! హే ప్రభో ! ప్రారబ్ధకర్మ ననుభవించు వానికి పరమేశ్వరునియందు అచంచలమైన భక్తి యెట్లు గలుగును?

శ్రీ విష్ణురువాచ = విష్ణువు చెప్పెను.

శ్లో॥ ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।
స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥ 2

తా॥ ఎవడు గీతాభ్యాసమునందు నిరతుడై యుండునో అతడు ప్రారబ్ధ కర్మ ననుభవించుచుండినను, అట్టి కర్మచేత లిప్తుడు కానేరడు. లోకమునందు అతడే ముక్తుడు, అతడే సుఖియును.

వి॥ భూదేవి యడిగిన ప్రశ్నయు విష్ణుభగవానుడు చెప్పిన సమాధానమును గొప్ప విశాలభావముతో గూడినవి. ఏలన, ఒక్కజాతినిగాని, ఒక మతమునుగాని, పురుషునిగాని, స్త్రీనిగూర్చిగాని అడుగక 'ప్రారబ్ధకర్మ ననుభవించు జీవుడెట్లు అనన్య భక్తిగలవాడగున'ని ప్రశ్నించెను. మనుష్యమాత్రులలో నెవరైనను ప్రారబ్ధకర్మలేనిచో జన్మమెత్తరు. కావున నియ్యది మనుష్య మాత్రులందఱిని గుఱించి యడిగిన ప్రశ్నగాను సమాధానముగాను తెలియవలయును.

శ్లో॥ మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।
క్వచిత్ స్పర్శం న కుర్వన్తి నళినీదళమంభసా ॥ 3

తా॥ ఎవరైతే గీతాధ్యానమును జేయుదురో వారికి కమలపత్రమునకు నీరు అంటనివిధమున మహాపాపాదిపాపములు కొంచమైన నంటవు.

వి॥ బ్రహ్మహత్య, గోహత్య, గురుపత్నీగమనము, సురాపానము, భ్రూణహత్య మొదలగునవి మహాపాపములని చెప్పబడుచున్నవి. అలాటివారిప్పుడు లోకములో సామాన్యముగా నుండరు. అట్టివారుగూడ గీతాపారాయణమున కర్హులనియు, అట్టి మహాపాపములును, ఉపపాపములును గీతా

పారాయణముచే నశించుననియు జెప్పగా యికనేమైన స్వల్పపాతకములుం డిన అవి నశించునని మఱల చెప్పవలయునా? కావున గీతాపఠనమునకు అందఱు అర్హులే, ఎవరైన ఏదైన పాపము చేసినవారుండినచో వారే ముం దుగ గీతాపారాయణమునకు సన్నద్ధులై యుండవలెను. పావనకర్మము లన్నియు పాతకనివారణముకొఱకేర్పడినవి. రోగులకుగదా! రోగశమనకర మగు నౌషధమేర్పడినది. వైద్యులును అట్టి రోగులకొఱకుగదా యేర్పడి యున్నారు. రోగుల కౌషధమివ్వక రోగము లేనివారికే వైద్యుడేర్పడెనని చెప్పుట యెంత విపరీతభావమో దీనివలన తెలిసికొనవచ్చును. అట్లే పాపు లను జూడకూడదు. వారితో మాట్లాడకూడదు, వారిని ముట్టకూడదు. కట్ట కడకు వారికి నే సహాయము చేయకూడదని చెప్పువారి వివేకజ్ఞాన మేమని చెప్పవచ్చును? అయితే రోగి పథ్యము గలిగి యుండవలసినట్లు పాపులు అనుష్ఠానము గలిగియుండవలయును, 'నళినీదళమంబువత్' అని పాఠాంత రము.

శ్లో॥ గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై ॥ 4

తా॥ ఎచ్చట గీతాపుస్తకముండునో, ఎచ్చట నియమపూర్వకముగ గీతాపారాయణము జేయబడునో. ఆ స్థలమునందు ప్రయాగ మొదలగు సమస్త తీర్థములుండును.

శ్లో॥ సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చయే ।
గోపాలా గోపికా వాఽపి నారదోద్ధవపార్షదైః ॥
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే ॥ 5

తా॥ ఎచ్చట గీతాపారాయణ చేయుచుందురో అచ్చట సమస్తదేవతలు ఋషులు; యోగులు, అనంతుడు వాసుకి మొదలగు నాగులు, గోపాలురు, గోపికలు, భగవత్పార్శ్వవర్తులగు నారదోద్ధవాది పరమభాగవతోత్తములు సహాయులై యుందురు.

శ్లో॥ యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్ ।
తత్రాహం నిశ్చితం పృథ్వి! నివసామి సదైవ హి 6

తా॥ ఓ భూదేవీ! ఎచ్చట గీతయొక్క విచారణము పఠనము(చదు వుట) పాఠనము (చదివించుట) శ్రవణము జరుగుచుండునో అచ్చట నిశ్చ యముగా నేను నివసించుచున్నాను.

వి॥ పఠనమనగా చదువుట, పాఠనమనగా చదివించుట, వినుట. లేక వినిపించుట పఠించుటకు శక్తిలేనివాడు వినినను చాలును.

శ్లో॥ గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్।
గీతాజ్ఞానముపాశ్రిత్య త్రీన్లోకాన్పాలయామ్యహమ్ ॥ 7

తా॥ నేను గీత నాశ్రయించియున్నాను. గీతయే నాకు నుత్తమమైన మందిరము. మఱియు గీతాజ్ఞానము నాశ్రయించియే నేను మూడు లోకము లను పాలించుచున్నాను.

వి॥ గీతాజ్ఞానమనగా గీతలో చెప్పబడిన నిష్కామ నిస్సంగత్వ యోగము. అట్టి ఫలాపేక్షారహితాసంగత్వభావముతో లోకపాలన చేయు చున్నాడని భావము.

శ్లో॥ గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః ।
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా ॥ 8

తా॥ గీతయే నాయొక్క బ్రహ్మవిద్య. గీతయే బ్రహ్మస్వరూపము, గీత ప్రణవముయొక్క నాల్గవపాదమగు అర్ధమాత్రాస్వరూపము. నాశరహిత మైనది. అనిర్వాచ్యమైనది. నిత్యమైనది, కావున గీతయే ఆత్మవిద్య యనం బడును. సంశయములేదు.

శ్లో॥ చిదానందేన కృష్ణేన ప్రోక్తాస్వముఖతోఽర్జునమ్ ।
వేదత్రయీ పరానందా తత్త్వార్థజ్ఞానమంజసా ॥ 9

తా॥ ఋగ్వేదాది వేదత్రయరూపముగను, పరమానందరూపముగను, తత్త్వజ్ఞాన గర్భితముగను నుండు నీ గీతను చిదానందస్వరూపుడగు శ్రీ కృష్ణభగవానుడు స్వయముగా నర్జునున కుపదేశించెను. 'చిదానందఘనే కృష్ణే ప్రోక్తా' అని పాఠాంతరము. 'తత్త్వార్థజ్ఞానసంయుతా' అనియు పాఠాంతరము.

శ్లో॥ యోఽష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చలమానసః ।
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్ ॥

తా॥ ఏ పురుషుడు నిశ్చలమైన మనస్సుగలవాడై ప్రతిదినము పదు నెనిమిది యధ్యాయములను పఠించునో (పారాయణముచేయునో) అతడు జ్ఞానసిద్ధిని బొందును. దానిచే మోక్షమును బడయును.

వి॥ 'జపేన్నిత్యం' అని చెప్పుటకు కారణమేమన, మంత్రమునకే జపము సంభవము కావున మంత్రమువలె విశ్వాసము గలిగి గీతను జపించవలయును లేక పఠించవలయునని భావము.

శ్లో॥ పాఠేఽసమర్థసంపూర్ణే తదర్ధం పాఠమాచరేత్ ।
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః ॥ 11

తా॥ సంపూర్ణముగ గీతను చదువుటయందు శక్తిలేనివాడు సగమై నను (తొమ్మిది అధ్యాయము లైనను చదువవలెను, దానివలన గోదాన మ్మంతటిపుణ్యము గలుగును ఇందు సంశయములేదు.

వి॥ ప్రతిరోజును తొమ్మిది అధ్యాయములు పారాయణచేసిన మొత్తము నకు ఒకగోదానపుణ్యమా? లేక రోజు రోజుకు గోదానపుణ్యము కలుగునా? అని కొందఱికి సందేహము గలదు. తొమ్మిది అధ్యాయములు ఒక్కరోజు నకుగాని లేక యెన్నిరోజులకుగాని పూర్తియగునో అప్పుడు ఒక గోదాన పుణ్యము గలుగును. అని భావము.

శ్లో॥ త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్ ।
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్ ॥ 12

తా॥ గీతయొక్క మూడుభాగములలో నొక భాగమగు ఆరు అధ్యాయములను జదువువారికి గంగాస్నానఫలము ప్రాప్తమగును. ఆరింటిలో నొక భాగమును (మూడు అధ్యాయములను) పారాయణమొనరించువారికి సోమ యాగ ఫలము లభించును.

వి॥ ఆరుఅధ్యాయములు ఒకరోజుగాని లేక యెన్ని రోజులకుగాని పూర్తి యగునో, అప్పుడు గంగాస్నానఫలము గలుగును. అలాగున మూడుఅధ్యాయ ములు ఒకరోజుగాని లేక యెన్నిరోజులకు పూర్తియగునో అప్పుడు సోమ యాగఫలము గలుగును.

శ్లో॥ ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తిసంయుతః ।
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసేచ్చిరమ్ ॥ 13

తా॥ భక్తితో నెవడైతే యొక అధ్యాయమునైనను జదువునో! అతడు రుద్రలోకమును బొంది రుద్రగణములలో నొకడై అచ్చట బహుకాల ముండును.

శ్లో॥ అధ్యాయ శ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః ।
స యాతి నరతాం యావన్మనుకాలం వసుంధరే ॥ 14

తా॥ ఓభూదేవీ! ఏ మనుష్యుడు అధ్యాయముల శ్లోకములందు నాల్గింట నొక భాగమునైనను నిత్యము పఠించునో అతడు ఒక మన్వంతరము వఱకు మానవజన్మమునే బొందుచుండును, 'మన్వంతరం' అని పాఠాంతరము.

శ్లో॥ గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్ ।
ద్వౌత్రీనేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠేన్నరః॥ 15

శ్లో॥ చన్ద్రలోకమవాప్నోతి వర్షాణామయుతం ధ్రువమ్ ।
గీతాపాఠసమాయుక్తో మృతోఽమానుషతాం వ్రజేత్॥ 16

తా॥ ఏమనుష్యుడు గీతయొక్క పదిశ్లోకములుగాని లేక ఏడు, ఐదు, నాల్గు మూడు, రెండు అథవా ఒకటిగాని తుదకు అర్ధశ్లోకమునైనను చదువునో అతడు

చంద్రలోకమును బొంది అచట పదివేల సంవత్సరము లుండును. ఇది నిశ్చయము. గీతాపారాయణమును జేయుచు మృతుడైన తదుపరి దేవత్వమును పొందును.

వి॥ ముక్తిపొందక పోయినను గీతాపారాయణమును జేయువాడు ఉత్తమ మనుజ కులములోనే పుట్టును.

శ్లో॥ గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తిముత్తమామ్ ।
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్ ॥ 17

తా॥ పై జెప్పబడినటుల నరజన్మమును బొందినవాడు గీతాభ్యాసము నందు నిరతుడై ఉత్తమమైన ముక్తిని బొందును. మరణకాలమున "గీతా" 'గీతా' అను శబ్దము నుచ్చరించుచు ప్రాణము విడుచువాడుగూడ సద్గతిని బొందును.

వి॥ గీతయనగా భగవంతుడు చేసిన గానమని యర్థము. వారు "బ్రహ్మ సత్యం జగన్మిథ్య" యని గానము చేసిరి. ఇట్టి భావము గలిగి ప్రాణము విడుచువాడు సద్గతిని బొందునని అర్థాంతరము. (తాత్పర్యము)

శ్లో॥ గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే॥ 18

తా॥ మహాపాపముతో కూడినవాడైనను గీతార్థమును వినుటయందా సక్తుడగుచో నతడు వైకుంఠమును బొంది యచ్చట విష్ణువుతో గలసి సంతోషముగా నుండును.

శ్లో॥ గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః ।
జీవన్ముక్తస్స విజ్ఞేయో దేహాన్తే పరమం పదమ్ ॥ 19

తా॥ ఎవడు అనేక కర్మలను జేయువాడైనను ప్రతిదినము గీతార్థ విచారణ చేయుచుండునో (ప్రణవముయొక్క నాల్గవపాదమైన అర్ధమాత్రా స్వరూపమైన బ్రహ్మమును ధ్యానించునో) అతడు జీవన్ముక్తుడని తెలియవల యును. మఱియు నతడు దేహపతనానన్తరము పరమపదమునుగూడ బొందును.

వి॥ అనేకకర్మల జేయుటయనగా చేతులతో మాత్రమేగాక వాక్కు చేతను, కర్మచేతను, నేత్రాదులచేతను, నిష్కామపూర్వకముగ నిస్సంగత్వ బుద్ధితో విధ్యుక్త కర్మల చేయునప్పటికిని అని భావము.

శ్లో॥ గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః ।
నిర్ధూతకల్మషా లోకే గీతాయాతాః పరం పదమ్ ॥ 20

తా॥ జనకుడు మొదలగు ననేకరాజర్షులు గీత నాశ్రయించినవారలై యిహలోకమున కీర్తినిబొంది పాపరహితులై యుత్తమమైన పదమును బొందిరి.

వి॥ జనకుని గురించి చెప్పుటకు కారణమేమనగా నతడు రాజ్య కార్య భారమును నిర్వహించుచు జీవన్ముక్తిని పొందెను. అట్లుండగా ఒక గృహ కార్యమును నిర్వహించుచు జీవన్ముక్తిని పొందు విషయమై ఇక చెప్పవల యునా యని భావము.

శ్లో॥ గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్ ।
వృథాపాఠో భవేత్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః ॥ 21

తా॥ గీతను చదివి దాని మాహాత్మ్యమును ఎవడు చదువడో అట్టివాని గీతాపఠనము తగిన ఫలము నివ్వక వ్యర్థమగును. అందుచే నాతని గీతా పఠనము శ్రమయే యగును.

శ్లో॥ ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః ।
న తత్ఫలమవాప్నోతి దుర్లభాం గతిమాప్నుయాత్ ॥ 22

తా॥ అందువలన నీ మహాత్మ్యముతోగూడిన గీతాభ్యాసము చేయు వాడు మీద జెప్పబడిన ఫలమును బొంది దుర్లభమైనగతిని (మోక్షమును) బొందును.

వి॥ గీత చదివి మాహాత్మ్యము జదువకపోయిన గీతాపారాయణము యొక్క ఫలమెట్లు లేకపోవునని కొందఱు శంకింతురు, మాహాత్మ్యమును చది విన మాత్రమే గీత యింత మహిమగలదిగదా యను విశ్వాసము గలుగును. ఒక్క దివ్యపురుషుని యందు భక్తి విశ్వాసములు గలుగవలసియుండిన అతని మహిమ తెలియకపోయిన యెట్లు గలుగును? అలాగున శ్రీ కృష్ణాది దైవముల

యందును భక్తివిశ్వాసములు గలుగవలసియున్న తన్మాహాత్మ్యము నెఱుగవలసి యున్నది. అట్లు ఎఱుంగనిచో ఆదైవముల నారాధించుటకు మనస్సెటుల ఒప్పును? కావుననే ఔషధము మొదలు కొని సర్వేశ్వరుని వఱకు గల అన్నిటికిని మహిమ తెలుపడమైనది.

సూత ఉవాచ = సూతుడు చెప్పెను.

శ్లో॥ మాహాత్మ్యమేతద్గీతాయా మయా ప్రోక్తం సనాతనమ్ ।
గీతాన్తే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్ ॥ 23

ఇతి శ్రీ వరాహపురాణే శ్రీ గీతామాహాత్మ్యం సంపూర్ణమ్.

తా॥ సనాతనమైన ఆర్షేయమగు ఈ మాహాత్మ్యమును నేను దెలిపితిని. గీతాపారాయణానంతరము ఎవడు దీనిని పఠించునో వాడు పైజెప్పబడిన ఫలమును హొందును.

వి॥ శ్రీమద్భగవద్గీతను స్త్రీలు బ్రాహ్మణేతరులు పఠించగూడదని యొక వాదముండెను. అది యిప్పుడు కాలగర్భములో లీనమైనందుచే దానినిగూర్చి వక్కాణించనవసరము లేకపోయినను ఇప్పుడుండువారిలో నెవరికైనా సందేహము గలిగి యున్నచో తన్నివృత్తికొఱకు ఈ క్రింది విషయము తెలుపడమైనది 'గీతను' ఎవ్వరు చెప్పిరి? ఎవరికి చెప్పిరి? ఎందుకు చెప్పిరి? అని యీ మూడు విషయములను విమర్శించిన దీనియందు గల సత్యము తెలియును. ప్రారబ్ధకర్మచే బద్ధులైయుండు జీవులకు అనన్యభక్తి యెట్లు గలుగుననియు మహాపాపకర్మముల చేసినవారికి పాప విమోచన మెట్లు లభించుననియు శ్రీమన్నారాయణుని శ్రీ భూదేవి యడిగినట్లును ఈ మొదటి రెండు శ్లోకములచే వ్యక్తమగుచున్నది. ఇట 'ధరోవాచ' అనుటవలననే దీనిని పఠించుటకు అందరికిని అర్హతగలదని గోచరించుచున్నది. స్త్రీలలో చేరిన భూదేవి పరమాత్మనుండి సంపాదించిన యీ గీతను స్త్రీలు పఠించగూడదని చెప్పుట యేమి బాగున్నది? అట్లేదైనయున్నచో అప్పుడే శ్రీహరి యిది స్త్రీలకు పఠించుట కర్హతలేదని తెలిపియుండును. మరియు మహాపాపులుగూడ పఠించి పాపవిముక్తులు కావచ్చునని స్పష్టముగ సర్వేశ్వరుడే చెప్పియుండ హాస్యము

చదువకూడదని యెట్లు చెప్పుదురు! ఇది యెంత సాహసము? స్త్రీలు సంపాదించిన దానిని స్వాధీనము చేసికొని వారిని వెడలగొట్టి, 'మీకు హక్కు లేదు మాకే హక్కు'ని చెప్పువారెంత సాహసులో దురూహ్యము, 'సత్యమునకే జయమ'ని చెప్పెడు వాక్యము ఎంతనిజమో యిప్పడు స్త్రీలోకమును జూచిన తేటతెల్లమగుచున్నది. ఓమ్,

ఇట్లు వరాహపురాణమునందుగల గీతామాహాత్మ్యము
సంపూర్ణము.

ఓమ్ తత్ సత్.







శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## ప్రథమోఽధ్యాయః - ప్రథమాధ్యాయము

## అర్జునవిషాదయోగః - అర్జునవిషాదయోగము

ధృతరాష్ట్ర ఉవాచ:— ధృతరాష్ట్రుడు చెప్పెను.

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయ! ॥ 1

పదవిభాగము:— ధర్మక్షేత్రే - కురుక్షేత్రే - సమవేతాః - యుయుత్సవః, మామకాః - పాణ్డవాః - చ - ఏవ - కిం - అకుర్వత - సంజయ!

ప్రతిపదార్థము:- హేసంజయ,=ఓ సంజయుడా!,యుయుత్సవః ఏవ=యుద్ధము చేయుటకే పూనుకొన్నవారై, ధర్మక్షేత్రే = పుణ్యభూమియగు, కురుక్షేత్రే=కురుక్షేత్రమునందు, సమవేతాః=కూడుకొనిన, మామకాః=నా వారలును, పాణ్డవాః చ=పాండవులును, కిం=ఏమి, అకుర్వత=చేసిరి?

తాత్పర్యము:- ఓ సంజయుడా! నావారలైన దుర్యోధనాదులును, పాండురాజు పుత్రులగు ధర్మరాజాదులును సంధి పొసగమిచే యుద్ధముచేయుటకే పూనుకొన్నవారలై, పుణ్యభూమియగు కురుక్షేత్రమునకు బోయిరిగదా! అచ్చట జేరిన పిమ్మట వారేమి జేసిరి? అనగా ఆక్షేత్ర మహిమనుబట్టియైన వారికి మంచిబుద్ధి పుట్టి సంధి కొడబడిరా? లేక యుద్ధము జేసిరా?

విశేషార్థము॥ కురుక్షేత్రములో శ్రీకృష్ణార్జునులకు జరిగిన సంభాషణమును ప్రప్రథమమున విని ధృతరాష్ట్రమహారాజునకు దెలిపినవాడు సంజ

యుడు. ఈ సంజయుడు సూతకులమున బుట్టినవాడు. అబ్రాహ్మణుడు. ఇతని జీవితము "మహాభారత"మందు కనందగును. సంజయుడనగా సర్వేన్ద్రియములను లెస్సగా జయించినవాడు.అట్టి సంజయునివలె సర్వేంద్రియనిగ్రహము గలవారికే "గీతార్థము" బోధపడును. ఆత్మసంయమము గలుగనివారికి పరమార్థతత్త్వబోధము గలుగదు. ఆ కాలమున సంజయుని వంటి సంయములు ఎవరును లేనందుచేతనే శ్రీవేదవ్యాసులు కురుక్షేత్రములో జరుగు విషయములన్నింటిని ఇన్ద్రప్రస్థములో నుండియే గ్రహించెడు దివ్యదృష్టిని అతని కనుగ్రహించెను. ఇదిన్ని భారతమందు కనదగును.దీనివల్ల సర్వేన్ద్రియములను జయించినవారికే పరమాత్మసాక్షాత్కారము గలుగునని తెలియదగినది. ఒక్కొక్కడు తాను రచింపబూనిన గ్రంథముయొక్క ఆశయమును మొట్టమొదటి పదమునందే నిరూపించును. "ధర్మక్షేత్రే" అని ప్రయోగించుట కిదియే కారణము. "క్షేత్ర" శబ్దమున కిచట భూమియని అర్థము. సుక్షేత్రమందు వేసిన బీజమే పూర్ణవృక్షమై ఫలము నొసంగును. అలాగున తనయొక్క పూర్ణత్వమగు జ్ఞానము గలుగవలసియుండిన ఈ జీవుడు తన హృదయక్షేత్రములో ధర్మానుష్ఠానమగు బీజమును నాటవలయును. ధర్మశబ్దమున కనేకార్థములు గలవు. ఇచ్చట యుద్ధారంభమగుటచే ధర్మమునకే జయము గలుగునని నిరూపించడమైనది. కనుకనే 'యతోధర్మస్తతో జయః' ఎచ్చట ధర్మము గలదో అచ్చటనే జయము గలుగును. "ధర్మసంస్థాపనార్థాయ" భగవదవతారము ధర్మమును స్థాపించుటకొఱకేయని శ్రీకృష్ణభగవానులు స్వయముగా వచించిరి. ధర్మముయొక్క నిజార్థమేమన, ఎవడు ఏ యనుష్ఠానమందు లేక యే కార్యమందు ప్రవర్తించుచున్నాడో వాడు దానికి తగిన ఆచరణ గలిగి యుండవలయును. అని మఱియు నితరులు తనకొఱకేమి జేసిన ప్రీతిగలుగునో అట్టి కార్యమే యితరులకు తాను జేయవలయును. ఇతరులు మనోవాక్కాయములచే నేమిజేసిన తన క్రప్రీతికలుగునో అట్టిది యితరులకు త్రికరణములచే జేయగూడదు అనుటయు ధర్మశబ్దమునకు అర్థము. మఱియు, మనుజుడు యితర మనుజాదిప్రాణులకు మేలు జేయుటకొఱకే పుట్టియున్నాడు. అనునది ధర్మశబ్దమునకు గౌణార్థము.ముఖ్యార్థమేమన? ఇక జననమరణముల నొంది సంకటపడక దైవసాక్షాత్కారజ్ఞానముగలిగి జీవన్ముక్తిపదవిని పొందవలయుననుటయే యగును. సంజయునిచే ప్రప్రథమమున శ్రీ భగవన్ముఖారవిందమునుండి స్వయముగా వినబడిన గీత ధృతరాష్ట్రునకు జెప్పడమైనది. ఇందువల్ల బ్రాహ్మణేతరులకుగూడ గీతయందధికారము గలదా? లేదా? యను సందేహమున కవకాశములేదు.

సఞ్జయ ఉవాచ:— సంజయుడు చెప్పెను.

శ్లో॥ దృష్ట్వా తు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా
ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్ ॥ 2

పద॥ దృష్ట్వా - తు - పాణ్డవానీకం - వ్యూఢం - దుర్యోధనః - తదా
ఆచార్యం - ఉపసంగమ్య - రాజా - వచనం - అబ్రవీత్.

ప్రతి॥ రాజా=రాజైన, దుర్యోధనః తు=దుర్యోధనుడైననో, తదా=అప్పుడు, వ్యూఢం = వ్యూహాకారముగా నమర్చబడియున్న, పాణ్డవానీకం = పాణ్డవసైన్యమును, దృష్ట్వా = చూచి, ఆచార్యం = ద్రోణాచార్యుని, ఉపసంగమ్య = సమీపించి, వచనం = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా॥ ఓ ధృతరాష్ట్రమహారాజా! మీ వారలయొక్కయు, పాండవులయొక్కయు నుభయసైన్యములవారును కురుక్షేత్రమున చేరిన పిమ్మట యుద్ధసన్నద్ధులై యందున కనుగుణములగు వ్యూహములుగా దమతమ సైన్యముల నేర్పరచుకొని, యుద్ధమునకు దలపడి నిలిచియుండునట్టి సమయమున నీ పుత్రుడును, రాజును నగు దుర్యోధనుండట్లు వ్యూహాకారముగా నేర్పరుపబడియుండు పాండవసైన్యమును బారజూచి తనకు గురువగు ద్రోణాచార్యునొద్దకుబోయి యా యనతో నొకమాట జెప్పెను.అదేమనగా!

వి॥ దుర్యోధనుడు సభలో ఏదేని సమాలోచన చేయవలసియున్నపుడు ద్రోణాచార్యాదులను సభలోని కాహ్వానించువాడు, ఇపుడో ద్రోణాచార్యుల వద్దకు తానేవెళ్ళి పాండవుల సైన్యమునుజూచి భయముగలవాడై చెప్పుటచే ధైర్యము గోల్పోయిన వాడాయెను. ఇది శుభసూచకముగాదు. ఏ కార్యమును ప్రారంభించునపుడు మనస్సున నుత్సాహము గలుగుచుండునో, అట్టి కార్యములోనే ప్రవర్తింపవలయును. విషాదాదులను గలుగజేసెడి యే కార్యములోను ప్రవేశింపగూడదు. జ్యోతిషములోగూడ ఏ కార్యారంభములో మనఃప్రసన్నత ఉత్సాహము, ధైర్యము గలుగుచుండునో, అదిజయప్రదమగునని గలదు. కావున మనస్సే ప్రధానమని చెప్పుటకు కారణము

శ్రీభగవద్గీతలో ఎవరెవరు ఎన్ని శ్లోకములు చెప్పిరో వారి యందఱి పేర్లుగూడగలవు. అనగా ధృతరాష్ట్ర ఉవాచ - సంజయ ఉవాచ - అర్జున ఉవాచ - శ్రీభగవానువాచ అని ఈలాగున నుండగా ప్రథమాధ్యాయమున మూడవ శ్లోకమునుండి 11-వ శ్లోకము వఱకు 9 శ్లోకములు దుర్యోధనుడు

చెప్పెను. కాన 3-వ శ్లోకమున 'దుర్యోధన ఉవాచ' అని ఉండవలసి యుండెను. కాని అటుల కానరాదు. బహుశః పొరబాటు కావచ్చును.

శ్లో॥ పశ్యైతాం పాణ్డుపుత్రాణామాచార్య! మహతీం చమూమ్ ।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥ 3

పద॥ పశ్య - ఏతాం - పాణ్డుపుత్రాణాం - ఆచార్య - మహతీం - చమూం- వ్యూఢాం - ద్రుపదపుత్రేణ - తవ - శిష్యేణ - ధీమతా.

ప్రతి॥ హే ఆచార్య! = ఓ ద్రోణాచార్యుడా, తవ = నీయొక్క, శిష్యేణ = శిష్యుడును, ధిమతా = బుద్ధిమంతుడును నగు- ద్రుపదపుత్రేణ = ద్రుపద మహారాజు కుమారుడైన ధృష్టద్యుమ్నునిచేత, వ్యూఢాం = వ్యూహాకారముగా నేర్పఱుపబడినదియు, మహతీం=గొప్పదియునగు, పాణ్డుపుత్రాణాం = పాండవులయొక్క, ఏతాం చమూం = ఈ సైన్యమును, పశ్య = చూడుము.

తా॥ ఓ ద్రోణాచార్యుడా! మన యెదుటనుండునట్టి యీ పాండవ సైన్యమెంత గొప్పదిగానున్నదో చూడుము. ఇది గొప్పది యగుట మాత్రమేగాక, అనేకవిధములగు వ్యూహములుగా నమర్పబడియున్నది. ఈ వ్యూహముల బన్నినవాడెవడనగా, నీ శిష్యుడును, ద్రుపదరాజు పుత్రుడును, బుద్ధిశాలియును, పాండవ సైన్యమునకు నాయకుడును నగు ధృష్టద్యుమ్నుడు. ఇతడు వ్యూహముల పన్నుట యందు మిగుల నిపుణతగలవాడు. కనుకనే ఇతనిని పాండవులు తమ సైన్యమునకు నాయకునిగా నభిషిక్తుని జేసిరి.

వి॥ వ్యూహరచనయందు మహానిపుణుడగుటవల్లనే బుద్ధిమంతుడని ధృష్టద్యుమ్నుని గురించి చెప్పడమైనది.

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి ।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥ 4

పద॥ అత్ర - శూరాః- మహేష్వాసాః - భీమార్జునసమాః - యుధి, యుయుధానః - విరాటః - చ - ద్రుపదః - చ - మహారథః.

ప్రతి॥ అత్ర=ఈ పాండవసేనయందు, శూరాః = శూరులును,మహేష్వాసాః= గొప్ప విలుకాండ్రును, యుధి = యుద్ధమునందు, భీమార్జునసమాః= భీమార్జునులతో సమానులును,యుయుధానః=సాత్యకియు, విరాటశ్చ=

విరాటరాజును, మహారథః = మహారథుడగు, ద్రుపదశ్చ = ద్రుపదుడును, (మొదలగువారనేకులు) (సన్తి= కలరు), మఱియు అట్టివారెవరనగా చెప్పు చున్నాను, వినుము.

శ్లో॥ ధృష్టకేతుశ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్ ।
పురుజిత్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః ॥ 5

పద॥ ధృష్టకేతుః - చేకితానః - కాశీరాజః - చ-వీర్యవాన్.
పురుజిత్ - కుంతిభోజః - చ - శైబ్యః - చ - నరపుంగవః.

ప్రతి॥ ధృష్టకేతుః=ధృష్టకేతువును, చేకితానః = చేకితానుడును, వీర్యవాన్= పరాక్రమవంతుడగు, కాశీరాజః చ = కాశీరాజును, పురుజిత్ = పురుజిత్తును, కుంతిభోజః చ = కుంతిభోజుడును, నరపుంగవః = పురుషశ్రేష్ఠుడగు, శైబ్యః చ = శైబ్యుడును.

శ్లో॥ యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥ 6

పద॥ యుధామన్యుః - చ - విక్రాంతః - ఉత్తమౌజాః - చ - వీర్యవాన్.
సౌభద్రః - ద్రౌపదేయాః - చ - సర్వే - ఏవ - మహారథాః.

ప్రతి॥ విక్రాంతః = పరాక్రమశాలియగు, యుధామన్యుః చ = యుధామన్యుడును, వీర్యవాన్ = పరాక్రమవంతుడగు, ఉత్తమౌజాః = ఉత్తమౌజుడును, సౌభద్రః - సుభద్రాపుత్రుడగు అభిమన్యుడును, ద్రౌపదేయాః చ = ఉపపాండవులును. సర్వే = వీరందరును, మహారథాః ఏవ = మహారథులే.

వి॥ దుర్యోధనుడు ద్రోణాచార్యులతో, శత్రుపక్షములో గలవారందరును మహారథులని, వారియొక్క విశేషమునుగూడా వర్ణించుటచే తనయొక్క అధైర్యమును కనబరచుచున్నాడు. అట్లు గానిచో మొదట తనయొక్క సైన్యమును గురించి వర్ణించిన తర్వాత శత్రు సైన్యమును గురించి చెప్పవలసియుండును. శత్రుపక్షములోగల ఈ పదముగ్గురును గొప్ప ఓజస్సుగలవారనియు, మహాధనుస్సులు గలవారనియు, వీర్యవంతులనియు వర్ణించుటవలననే తనయొక్క అధైర్యము తెలుపబడినట్లైనది. ఈ పదముగ్గురి విశేషములను, విశేషార్థము వ్రాసియుండు గ్రంథములో చూడనగును.

శ్లో॥ అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ !
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ॥ 7

పద॥ అస్మాకం - తు - విశిష్టాః - యే - తాన్ - నిబోధ - ద్విజోత్తమ
నాయకాః - మమ - సైన్యస్య - సంజ్ఞార్థం - తాన్ - బ్రవీమి - తే.

ప్రతి॥ హే ద్విజోత్తమ ! = ఓ విప్రవర్యా !, అస్మాకం తు = మనవార లలో సైనన్ో, యే = ఎవరు విశిష్టాః = శ్రేష్ఠులో, మమ = నా యొక్క, సైన్యస్య = సైన్యమునకు, నాయకాః = అధిపతులో, తాన్ = వారిని, తే = నీకు, సంజ్ఞార్థం = తెలియుటకొరకు, బ్రవీమి = చెప్పుచున్నాను, తాన్ = వారిని, నిబోధ = తెలిసికొనుము.

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా ! మనవారిలో నెవరు శ్రేష్ఠులో నాయొక్క సైన్యమునకు ఎవరు రక్షకులో వారిని నీకు తెలియుట కొఱకు చెప్పుచున్నాను. వారిని తెలిసికొనుము.

వి॥ ద్రోణాచార్యులవారికి ధైర్యము గలుగుటకు మనవారిలోగూడ గొప్పయోధులు గలరని నిరూపింపదలంచి దుర్యోధనునిచే యిట్లు చెప్ప బడినది.

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిస్తథైవ చ ॥ 8

పద॥ భవాన్ - భీష్మః - చ - కర్ణః - చ - కృపః - చ - సమితింజయః. అశ్వత్థామా - వికర్ణః - చ - సౌమదత్తిః - తథా - ఏవ - చ.

ప్రతి॥ భవాన్ = నీవును, భీష్మః చ = భీష్ముడును, కర్ణః చ = కర్ణుడును, సమితింజయః = యుద్ధమునందు జయశీలుడైన, కృపః చ = కృపా చార్యుడును, అశ్వత్థామా=అశ్వత్థామయును, వికర్ణః చ=వికర్ణుడును, తథా ఏవ=అలాగుననే, సౌమదత్తిః చ= (సోమదత్తుని కుమారుడగు) భూరిశ్రవుడును,

శ్లో॥ అన్యే చ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్రప్రహరణాస్సర్వే యుద్ధవిశారదాః ॥ 9

పద॥ అన్యే - చ - బహవః - శూరాః - మదర్థే - త్యక్తజీవితాః, నానాశస్త్రప్రహరణాః - సర్వే - యుద్ధవిశారదాః.

ప్రతి॥ బహవః = అనేకులగు, అన్యే = ఇతరులైన, శూరాః చ = (శూరు లును) పరాక్రమవంతులును, మదర్థే = నా కొఱకు, త్యక్తజీవితాః= విడువబడిన ప్రాణము గలవారు, సర్వే = వీరందరును, నానాశస్త్ర ప్రహరణాః = బహువిధములగు శస్త్రాస్త్రములను గలిగియుండు వారును, యుద్ధవిశారదాః = యుద్ధమున నేర్పరులును అయి యున్నారు.

వి॥ దుర్యోధనుని ముఖమునుండి 'త్యక్తజీవితాః' విడువబడిన ప్రాణము గలవారు అని వచ్చుటచే వీరందరును తప్పక నశింతురని అంత రాత్మ తెలిపినట్లైనది,

కొన్ని కార్యములు ప్రారంభించునపుడు జరుగబోవు విషయమై తెలియకనే యీలాటి వాక్యములు వచ్చుచుండును. శుభాశుభశకునములు తెలిసినవారు దానిని కనిపెట్టి భావినిర్ణయము చేయుదురు.

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥ 10

పద॥ అపర్యాప్తం - తత్ - అస్మాకం - బలం - భీష్మాభిరక్షితం
పర్యాప్తం - తు - ఇదం - ఏతేషాం - బలం - భీష్మాభిరక్షితమ్

ప్రతి॥ తత్ = అట్టి (పైచెప్పబడిన యోధవీరులు గలిగినట్టి) అస్మాకం = మనయొక్క, బలం = సైన్యము, అపర్యాప్తం = అపరమితమైనదియు, భీష్మాభిరక్షితం = భీష్మునిచే రక్షింపబడు చున్నదియునై యున్నది, ఏతేషాం = ఈ పాండవులయొక్క, ఇదం = ఈ, బలం తు = సైన్య మన్ననో, పర్యాప్తం = పరిమితమైనదియు, భీమాభిరక్షితం = భీము నిచే రక్షింపబడినదియు నై యున్నది.

తా॥ అట్టి పై చెప్పబడినయోధులు గలిగినట్టి మనసైన్యము అపరిమితమైనదియు, అనగా లెక్కింప నశక్యమైనదియు, భీష్ముని చే రక్షింపబడుచున్నదియునై యున్నది. ఈ పాండవులయొక్క సైన్యమన్ననో పరిమితమైనదియు, అనగా లెక్కింప శక్యమైనది యు, భీమునిచే రక్షింపబడునదియు నై యున్నది.

వి॥ ద్రోణాచార్యులకు ధైర్యము గలుగుటకు దుర్యోధనునిచే ఈ లాగున చెప్పడమైనది.

శ్లో॥ అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః ।
భీష్మమేవాభిరక్షన్తు భవన్తస్సర్వ ఏవ హి॥ 11

పద॥ అయనేషు - చ - సర్వేషు - యథాభాగం - అవస్థితాః
భీష్మం - ఏవ - అభిరక్షన్తు - భవంతః - సర్వే - ఏవ - హి.

ప్రతి॥ హి = కాబట్టి, భవంతః సర్వే చ = మీరందరును, సర్వేషు = సమస్తములైన, అయనేషు ఏవ = మార్గముల యందే, యథాభాగం = మీ మీ స్థానములను విడువక, అవస్థితాః = ఉన్నవారై, భీష్మం ఏవ = భీష్మునే, అభిరక్షంతు = కాపాడుదురుగాక.

తా॥ మీరందరును మీకొఱకై నిర్ణయింపబడిన స్థానము లలో నుండి తొలగక భీష్ముని కాపాడుచుండవలయును,

శ్లో॥ తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః ।
సింహనాదం వినద్యోచ్చైశ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥ 12

పద॥ తస్య - సంజనయన్ - హర్షం - కురువృద్ధః - పితామహః,
సింహనాదం - వినద్య - ఉచ్చైః - శంఖం - దధ్మౌ - ప్రతాపవాన్.

ప్రతి॥ ప్రతాపవాన్ = పరాక్రమవంతుడును, కురువృద్ధః = కురుశ్రేష్ఠుడును, పితామహః = తాతయునగు భీష్ముడు, తస్య = ఆ దుర్యోధనునకు, హర్షం = సంతోషమును, సంజనయన్ = పుట్టించుచున్నవాడై, ఉచ్చైః=గట్టిగా, సింహనాదం = సింహగర్జనమును, వినద్య = చేసి, శంఖం = శంఖమును, దధ్మౌ = పూరించెను.

తా॥ పరాక్రమశాలియును, కురుశ్రేష్ఠుడునగు భీష్ముడు ఆ విధముగాస్తోత్రముచేయుచున్న దుర్యోధనునకు సంతోషమును బుట్టించుచు సింహనాదమునుచేసి శంఖమును పూరించెను.

శ్లో॥ తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః ।
సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్ ॥ 13

పద॥ తతః - శంఖాః - చ - భేర్యః - చ - పణవానకగోముఖాః,
సహసా - ఏవ - అభ్యహన్యంత - సః - శబ్దః - తుములః - అభవత్,

ప్రతి॥ తతః = పిమ్మట, శంఖాఃచ= శంఖములును, భేర్యః చ = భేరులును, పణవానకగోముఖాః = ఉడుకలును, తప్పెటలును, కొమ్ములును, సహసా ఏవ = శీఘ్రముగానే, అభ్యహన్యంత = వాయించబడెను, సః శబ్దః = ఆ వాద్యముల వలన గలిగిన ధ్వని, తుములః =అంతట వ్యాపించినదిగా, అభవత్ = ఆయెను.

తా॥ ఇట్లు భీష్మాచార్యుడు సింహనాదశంఖధ్వనులను జేయగానే కౌరవసైనికులు శంఖములు. భేరులు, ఉడుకలు, తప్పెటలు కొమ్ములు, మొదలగు యుద్ధవాద్యములను మ్రోయించిరి. అప్పుడు ఆ ధ్వని ఆకసమునందు, దిక్కులయందును అంతట వ్యాపించినదాయెను.

శ్లో॥ తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥ 14

పద॥ తతః - శ్వేతైః - హయైః - యుక్తే - మహతి - స్యందనే - స్థితౌ,
మాధవః - పాండవః - చ - ఏవ - దివ్యౌ - శంఖౌ - ప్రదధ్మతుః

ప్రతి॥ తతః = అనంతరము, శ్వేతైః = తెల్లని, హయైః = గుఱ్ఱములతో, యుక్తే = కూడినదియు, మహతి= గొప్పదియు నగు, స్యందనే = రథమునందు, స్థితౌ = కూర్చుండియున్న, మాధవః = శ్రీకృష్ణుడును, పాండవః చ ఏవ = అర్జునుడును, దివ్యౌ = దివ్యములగు, శంఖౌ = శంఖములను, ప్రదధ్మతుః = పూరించిరి.

తా॥ అట్లు కౌరవసేనయందు చేయబడిన వాద్యధ్వనులను వినిన పిమ్మట తెల్లని గుఱ్ఱములచేత బూన్పబడినదియును, గొప్పదియును నగు రథము నందున్న శ్రీ కృష్ణార్జునులు దివ్యములగు శంఖములను పూరించిరి.

వి॥ తెల్లని గుఱ్ఱములతోగూడిన రథమని చెప్పుటచే తెలుపు శుభసూచకముగా నిరూపించడమైనది. దివ్యములగు శంఖములని తెలుపుటచే నవి దైవవరప్రదత్తములని స్మరింప చేయుచున్నవి. మఱియు తెలుపు సత్త్వగుణము. సత్యమునకుకూడా తెలుపే గుణముగ చెప్పబడియున్నది, అలాగున ధర్మమునకుగూడ తెలుపే గుణముగా నిరూపించియున్నారు, కావున సత్త్వగుణము, సత్యము, ధర్మము ఈ మూడును పాండవులయందే గలవని నిరూపించడమైనది.

శ్లో॥ పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః ॥ 15

పద॥ పాంచజన్యం - హృషీకేశః - దేవదత్తం - ధనంజయః
పౌండ్రం - దధ్మౌ - మహాశంఖం - భీమకర్మా - వృకోదరః,

ప్రతి॥ హృషీకేశః = శ్రీకృష్ణుడు, పాంచజన్యం = పాంచజన్యమను శంఖమును, దధ్మౌ = పూరించెను. ధనంజయః=అర్జునుడు, దేవదత్తం= దేవదత్తమను శంఖమును పూరించెను. భీమకర్మా = భయంకర కృత్యముగల, వృకోదరః =భీముడు, పౌండ్రం = పౌండ్రమనియెడు, మహాశంఖం = గొప్ప శంఖమును పూరించెను.

శ్లో॥ అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ ॥ 16

పద॥ అనంతవిజయం - రాజా - కున్తీపుత్రః - యుధిష్ఠిరః.
నకులః - సహదేవః - చ - సుఘోషమణిపుష్పకౌ.

ప్రతి॥ కుంతీపుత్రః = కుంతీదేవి పుత్రుడైన, యుధిష్ఠిరః = యుధిష్ఠిరుడను పేరుగల, రాజా = ధర్మరాజు, అనంతవిజయం = అనంతవిజయమను శంఖమును పూరించెను, నకులః = నకులుడును, సహదేవః

చ = సహదేవుడును, సుఘోషమణి పుష్పకౌ = సుఘోషము, మణి పుష్పకము అను శంఖములను పూరించిరి.

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాసశ్శిఖండీ చ మహారథః ।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః ॥ 17

పద॥ కాశ్యః - చ - పరమేష్వాసః - శిఖండీ - చ - మహారథః, ధృష్ట ద్యుమ్నః - విరాటః - చ - సాత్యకిః - చ - అపరాజితః.

ప్రతి॥ పరమేష్వాసః = గొప్ప ధనుస్సుగల, కాశ్యః చ = కాశీరాజును, మహారథః = మహారథికుడగు, శిఖండీ చ = శిఖండియును, ధృష్ట ద్యుమ్నః= ధృష్టద్యుమ్నుడును, విరాటః చ = విరాటుడును, అపరా జితః = అపజయము నొందని, సాత్యకిః చ = సాత్యకియును.

శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే ! ।
సౌభద్రశ్చ మహాబాహుశ్శంఖాన్ దధ్ముః పృథక్పృథక్॥ 18

పద॥ ద్రుపదః - ద్రౌపదేయాః - చ - సర్వశః - పృథివీపతే,
సౌభద్రః - చ-మహాబాహుః - శంఖాన్ - దధ్ముః - పృథక్-పృథక్.

ప్రతి॥ హే పృథివీపతే ! = ఓధృతరాష్ట్ర మహారాజా !, ద్రుపదః = ద్రుపదు డును, ద్రౌపదేయాః చ = ద్రౌపదీ పుత్రులగు ప్రతివింద్యాదులును, మహాబాహుః = గొప్ప భుజములుగల, సౌభద్రః చ = సుభద్రా పుత్రుడగు నభిమన్యుడును, సర్వశః = సేనలోనెల్లయెడల, పృథక్ పృథక్ = వేరువేరుగా, శంఖాన్ = తమ తమ శంఖములను, దధ్ముః = పూరించిరి.

శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
నభశ్చ పృథివీంచైవ తుములో వ్యనునాదయన్ ॥ 19

పద॥ సః -ఘోషః - ధార్తరాష్ట్రాణాం - హృదయాని - వ్యదారయత్, నభః - చ - పృథివీం - చ - ఏవ — తుములః - వ్యనునాదయన్.

ప్రతి॥ తుములః = సంకులమైన, సః ఘోషః = ఆ ధ్వని, నభః చ = ఆకాశ మును, పృథివీం చ ఏవ = భూమినిన్ని, వ్యనునాదయన్ = ప్రతి ధ్వనులచేత నిండించిన దగుచు, ధార్తరాష్ట్రాణాం = దుర్యోధనాదుల యొక్క, హృదయాని = గుండెలను, వ్యదారయత్ = భేదించెను.

తా॥ అట్లు పాండవసైన్యమున పూరింపబడిన అన్ని శంఖ ముల యొక్కయు ధ్వనులొక్కటిగాచేరి భూమ్యాకాశములందం తట నిండినవై కౌరవసైన్యమునందలి యోధవరులగు దుర్యోధ నాదులయొక్క గుండెలను బ్రద్దలు చేసెను.

వి॥ దుర్యోధనాదుల హృదయములు బ్రద్దలైనవని చెప్పుటచే వారు నశించినట్లే యని సంజయునిచే తెలుపడమైనది.

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః ॥ 20
హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే ।

పద॥ అథ - వ్యవస్థితాన్ - దృష్ట్వా - ధార్తరాష్ట్రాన్ - కపిధ్వజః, ప్రవృత్తే - శస్త్రసంపాతే - ధనుః - ఉద్యమ్య - పాండవః - హృషీకేశం - తదా - వాక్యం - ఇదం - ఆహ - మహీపతే !

ప్రతి॥ హే మహీపతే ! = ఓ ధృతరాష్ట్రమహారాజా !, అథ = పిమ్మట, శస్త్రసంపాతే = యుద్ధము, ప్రవృత్తే సతి = ప్రారంభమగుచుండగా వ్యవస్థితాన్ = యుద్ధరంగమున నిలిచియున్న, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, దృష్ట్వా =చూచి, కపిధ్వజః = హనుమద్ధ్వజుడగు, పాండవః = అర్జునుడును, ధనుః = వింటిని. ఉద్యమ్య = ఎక్కుపెట్టి తదా = అప్పుడు, హృషీకేశం = శ్రీకృష్ణునిగూర్చి, ఇదం వాక్యం = ఈ క్రింద చెప్పబోయెడు మాటను, ఆహ = చెప్పెను,

తా॥ ఓ ధృతరాష్ట్రమహారాజా ! అట్లుభయసైన్యములవారును తమ తమ శంఖములను పూరించిన పిమ్మట కపిధ్వజుడగు అర్జునుడు యుద్ధరంగమున సన్నద్ధులై నిలిచియుండు నీ పుత్రుల మొదలగు వారలంజూచి, తన ధనుస్సగు గాండీవమును జేతనెత్తుకొని శ్రీకృష్ణుని అవలోకించి యిట్లనియె.

అర్జున ఉవాచ :— అర్జునుడు చెప్పెను,

శ్లో॥ సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ! ॥ 21

పద॥ సేనయోః - ఉభయోః - మధ్యే -రథం - స్థాపయ - మే - అచ్యుత.

ప్రతి॥ హే అచ్యుత! = ఓ కృష్ణమూర్తీ, ఉభయోః = రెండైన, సేనయోః = సేనల యొక్క, మధ్యే = మధ్యమునందు, మే = నాయొక్క, రథం = రథమును. స్థాపయ = నిలుపుము.

తా॥ ఈ రెండు సేనలయొక్క మధ్యమునందు నా రథమును నిలుపుము.

శ్లో॥ యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్ ।
కైర్మయా సహ యోద్ధవ్యమస్మిన్ రణసముద్యమే ॥ 22

పద॥ యావత్ - ఏతాన్ - నిరీక్షే - అహం - యోద్ధుకామాన్ - అవస్థితాన్
కైః - మయా - సహ - యోద్ధవ్యం - అస్మిన్ - రణసముద్యమే.

ప్రతి॥ అస్మిన్ = ఈ, రణసముద్యమే = యుద్ధముయొక్క ఉపక్రమము నందు, కైః సహ = ఎవ్వరితోగూడ, మయా = నాచేత, యోద్ధవ్యం = యుద్ధముచేయదగినది. అహం = నేను, యోద్ధుకామాన్ = యుద్ధ మును చేయవలెననెడి కోర్కెగలవారై, అవస్థితాన్ = వచ్చియున్న, ఏతాన్ = ఈ, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనుడు మొదలగువారిని, యావత్ = ఎంతదూరమునుండి, నిరీక్షే = చూడగలనో (అంత దూ రమున రథము నిలుపుము),

తా॥ ఓ శ్రీకృష్ణా! ఈ యుద్ధరంగమునందు నే నెవ్వరితో యుద్ధమును జేయవలసియున్నదో మఱియు నెవరెవరు యుద్ధము జేయగోరి వచ్చిరో వారినిచూడవలసియున్నది. కావున మన రథ మును వారందఱు కనిపించదగినంత దూరమునందు నిలుపుము. (లేక ఎంతలో నేను వారినిచూడగలనో అంతవరకు నిలుపుము)

శ్లో॥ యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్రసమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః ॥ 23

పద॥ యోత్స్యమానాన్ - అవేక్షే - అహం - యే - ఏతే - అత్ర - సమా గతాః - ధార్తరాష్ట్రస్య - దుర్బుద్ధేః - యుద్ధే ప్రియచికీర్షవః,

ప్రతి॥ దుర్బుద్ధేః = దుష్టబుద్ధిగల, ధార్తరాష్ట్రస్య = దుర్యోధనునకు, ప్రియ చికీర్షవః = ప్రియమును చేయదలచినవారై, ఏతే = ఏఏ వీరులు, అత్ర=ఈ యుద్ధభూమియందు,సమాగతాః=కలిసికొనిరో, ఏతాన్=ఈ, యోత్స్యమానాన్ = యుద్ధముజేయనున్నవారలను, అహం = నేను, అవేక్షే = చూచెదను.

తా॥ దుష్టబుద్ధిగల దుర్యోధనునకు ప్రియము చేయవలయు ననెడు కోర్కెలుగలవారై యుద్ధమును జేయుటకొఱకు ఎవరెవరు వచ్చియున్నారో వారలను నేను చూడగోరుచున్నాను.

సంజయ ఉవాచ:— సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత !
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥ 24

శ్లో॥ భీష్మద్రోణప్రముఖతస్సర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి ॥ 25

పద॥ ఏవం - ఉక్తః - హృషీకేశః - గుడాకేశేన - భారత! - సేనయోః- ఉభయోః- మధ్యే - స్థాపయిత్వా - రథోత్తమం - భీష్మద్రోణప్రముఖతః - సర్వేషాం - చ మహీక్షితాం - ఉవాచ - పార్థ! పశ్య - ఏతాన్ - సమవేతాన్ - కురూన్ - ఇతి.

ప్రతి॥ హే భారత! = భరతవంశజుడవగు ధృతరాష్ట్ర మహారాజా!, గుడాకేశేన=అర్జునునిచేత, ఏవం = ఈ ప్రకారముగా, ఉక్తః=చెప్పబడిన, హృషీకేశః=శ్రీకృష్ణుడు, ఉభయోః=రెండైన, సేనయోః=సైన్యముల యొక్క, మధ్యే = మధ్యయందు, భీష్మద్రోణప్రముఖతః = భీష్మ ద్రోణులయొక్క యెదుట, సర్వేషాం - మహీక్షితాం చ = అందఱి భూపాలురయొక్క యెదుటను, రథోత్తమం = శ్రేష్ఠమగు రథమును, స్థాపయిత్వా = నిలిపి, పార్థ! = ఓ అర్జునా!, సమవేతాన్ = యుద్ధము చేయుటకై సమకూడియున్న, ఏతాన్ = ఈ, కురూన్ = కౌరవులను, పశ్య = చూడుము, ఇతి = ఇట్లని, ఉవాచ = చెప్పెను.

తా॥ ఓ ధృతరాష్ట్రమహారాజా! అర్జునునిచేత నీవిధముగా జెప్పబడిన మాటలనువిని శ్రీకృష్ణుడు రెండు సేనల యొక్కయు మధ్యభాగమున భీష్మద్రోణులయొక్కయు, మఱియు నితరులగు రాజుల యొక్కయు నెదుట శ్రేష్ఠమగు రథమును నిలిపి ఓ అర్జునా! యుద్ధము జేయుటకు సమావిష్టులైయున్న యీ కురురాజులను చూడుము, అని చెప్పెను.

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా ॥

" శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।

పద॥ తత్ర - అపశ్యత్ - స్థితాన్ - పార్థః - పితౄన్ - అథ - పితామహాన్ ఆచార్యాన్ - మాతులాన్ - భ్రాతౄన్ - పుత్రాన్ - పౌత్రాన్ - సఖీన్ - తథా, శ్వశురాన్ - సుహృదః - చ - ఏవ - సేనయోః - ఉభయోః - అపి.

ప్రతి॥ అథ = పిమ్మట, పార్థః = అర్జునుడు, తత్ర = అచ్చట, ఉభయోః సేనయోః అపి = ఉభయసైన్యములందును, స్థితాన్ = ఉన్నట్టి, పితౄన్ = తండ్రులను, పితామహాన్ = తాతలను, ఆచార్యాన్ = గురువులను, మాతులాన్ = మేనమామలను, భ్రాతౄన్ = అన్నదమ్ములను, పుత్రాన్ = కుమారులను, పౌత్రాన్ =మనుమలను, సఖీన్ = స్నేహితులను, తథా = అలాగుననే, శ్వశురాన్ = మామలను, సుహృదః చ ఏవ = మేలుగోరెడి స్నేహితులను, అపశ్యత్ = చూచెను.

తా॥ ఆ ప్రకారము శ్రీకృష్ణుడు రథమును నిలుపగానే ఉభయసైన్యములయందును యుద్ధసన్నద్ధులై నిలిచియున్న పినతండ్రులను, పెత్తండ్రులను, తాతలను, ఆచార్యులను, మేనమామలను, మామలను, అన్నదమ్ములను, కొడుకులను, మనుమలను, స్నేహితులను, ఉపకారములను చేసిన వారలను అర్జునుడు చూచెను.

శ్లో॥ తాన్సమీక్ష్య స కౌంతేయస్సర్వాన్ బంధూనవస్థితాన్ ।
కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిద మబ్రవీత్ ॥ 27

పద॥ తాన్ - సమీక్ష్య - సః -కౌంతేయః - సర్వాన్ - బంధూన్ - అవస్థితాన్- కృపయా - పరయా -ఆవిష్టః - విషీదన్ - ఇదం - అబ్రవీత్

ప్రతి॥ కౌంతేయః = కుంతీ పుత్రుడైన, సః = ఆ అర్జునుడు, అవస్థితాన్ = యుద్ధరంగమునందున్న, తాన్= ఆ, సర్వాన్ బంధూన్ = చుట్టముల నందఱిని, సమీక్ష్య = చూచి, పరయా= అధికమైన, కృపయా = కరుణచే, ఆవిష్టః = ఆవేశింపబడినవాడై, విషీదన్ = వ్యసనపడుచు, ఇదం = ఈ క్రింద చెప్పబోయెడు మాటను, అబ్రవీత్ = పలికెను.

తా॥ కుంతీదేవిపుత్రుడైన అర్జునుడు రణరంగమందున్న వారును, పైన చెప్పబడినవారును అగు బంధువులనందఱినిజూచి అత్యధికమగు దయగలవాడై దుఃఖించుచు, శ్రీకృష్ణునితో నిట్లనియెను.

వి॥ ఇదివరలో యుద్ధము చేయుటకుద్యుక్తుడైయుండిన అర్జునునకు మిక్కిలిదయ గలిగి దుఃఖపడుటకు కారణము ఆ పుణ్యభూమియొక్క వి

షమే. జనుల హృదయము మూడు విధములు. (1) శిలాప్రాయము, (2) దారుప్రాయము, (3) మృత్తికాప్రాయము. ఎండినమట్టిపెళ్ల జలము తగిలిన వెంటనే కరిగిపోవును. మ్రాను కొంత కాలము నీటిలో యుండిన నాని ద్రవించిపోవును. రాయి యెంతకాలము జలమందుండినను కరుగదు. పుణ్యాత్ముల మనస్సు మట్టిగడ్డవలెను, ధర్మాత్ముల మనస్సు కొయ్యవలెను, కఠినాత్ముల మనస్సు రాయివలె నుండును. అర్జునుని మనస్సు ధర్మయుక్త మగుటచే ధర్మక్షేత్రమున ప్రవేశించిన వెంటనే మెత్తబడిపోయెను. దుర్యోధనుని మనస్సు కఠినశిల వంటిదగుటచే నతనికి కొంచమైనను కనికరము గలుగలేదు. పాపాత్ములు పుణ్యప్రదేశములో నుండినను వారి మనస్సునకు మార్పుగలుగదు. స్థలవిశేషముచే గలిగిన ప్రయోజన మీ లాగున నుండును.

అర్జున ఉవాచ :— అర్జునుడు చెప్పెను.

దృష్ట్వేమం స్వజనం కృష్ణ। యుయుత్సుం సముపస్థితమ్॥28

శ్లో॥ సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥ 29

పద॥ దృష్ట్వా - ఇమం - స్వజనం - కృష్ణ ! - యుయుత్సుం - సముపస్థితమ్ - సీదంతి - మమ - గాత్రాణి - ముఖం - చ - పరిశుష్యతి. వేపథుః - చ - శరీరే — మే -రోమహర్షః - చ — జాయతే.

ప్రతి॥ హేకృష్ణ! = ఓ శ్రీకృష్ణమూర్తీ ! యుయుత్సుం =యుద్ధముచేయ నిచ్చగించి నదియు, సముపస్థితం = ఇచ్చట నిలిచియుండు నట్టిదియు నగు, ఇమంస్వజనం = ఈ బంధుజనమును, దృష్ట్వా = చూచి, మమ=నాయొక్క, గాత్రాణి = అవయవములు, సీదంతి = శిథిలములగు చున్నవి, ముఖం చ = నోరును, పరిశుష్యతి = ఎండుచున్నది, మే శరీరే = నా దేహమునందు, వేపథుః చ = కంపమున్ను, రోమహర్షః చ =గగుర్పాటున్ను, జాయతే = కలుగుచున్నది.

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ ! యుద్ధము జేయుటకు ఎదుర్కొని సమీపించియున్న ఈ బంధుజనులనుజూచి నా యవయవములు శిథిల మగుచున్నవి. నోరు ఎండిపోవుచున్నది దేహము వణకుచున్నది, గగుర్పాటు గలుగుచున్నది.

శ్లో॥ గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥ 30

పద॥ గాండీవం - స్రంసతే - హస్తాత్ - త్వక్ - చ - ఏవ -పరిదహ్యతే, న - చ - శక్నోమి - అవస్థాతుం - భ్రమతి - ఇవ - చ - మే - మనః.

ప్రతి॥ మే = నాయొక్క, హస్తాత్ = కరమునుండి, గాండీవం = గాండీవము, స్రంసతే = జారుచున్నది. త్వక్ చ ఏవ = చర్మముగూడ, పరిదహ్యతే = మండుచున్నది, అవస్థాతుం చ = నిలుచుటకైనను, న శక్నోమి = శక్తిలేకున్నాను, మనః చ=మనస్సుగూడ, భ్రమతి ఇవ= భ్రమించుచున్నట్లున్నది.

తా॥ మఱియు నా గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. నా దేహమునందు మిగుల తపనము కలుగుచున్నది. మనస్సు భ్రమించుచున్నటు లున్నది.

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ !
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే॥ 31

పద॥ నిమిత్తాని - చ - పశ్యామి - విపరీతాని - కేశవ, న - చ - శ్రేయః - అనుపశ్యామి - హత్వా - స్వజనం - ఆహవే.

ప్రతి॥ హే కేశవ! = ఓ శ్రీ కృష్ణమూర్తీ! విపరీతాని = అనర్థసూచకములగు, నిమిత్తాని చ = దుశ్శకునములనుగూడ, పశ్యామి = చూచుచున్నాను, ఆహవే = యుద్ధమునందు, స్వజనం = బంధుజనమును, హత్వా = వధించి, శ్రేయః చ = మేలునుగూడ, న అను పశ్యామి = చూడజాలను.

తా॥ ఓ కృష్ణమూర్తీ! అనర్థసూచకములగు దుశ్శకునములను గూడ చూచుచున్నాను, యుద్ధమునందు బంధుజనమును చంపిన పిమ్మట జయము నొందియు, మనకు మేలొనగూడునట్లగ పడదు.

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ ! న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవింద ! కిం భోగైర్జీవితేన వా ॥ 32

పద॥ న - కాంక్షే - విజయం - కృష్ణ! - న - చ - రాజ్యం - సుఖాని - చ - కిం - నః - రాజ్యేన - గోవింద, - కిం -భోగైః - జీవితేన - వా.

ప్రతి॥ హే కృష్ణ! = ఓ శ్రీకృష్ణమూర్తీ!, (అహం = నేను) విజయం = విజయమును, (న కాంక్షే = కోరను), రాజ్యం చ = రాజ్యమును, సుఖాని చ=సుఖములనుకూడ, (న కాంక్షే=కోరను), హే గోవింద!=

ఓ గోవిందా !, న = మనకు, రాజ్యేన = రాజ్యముతో, కిం = ఏమి (ప్రయోజనము,) భోగైః = భోగములతోడను, జీవితేన వా = బ్రతికియుండుటతోడను, కిం = ఏమిప్రయోజనము ?

తా॥ శ్రీ కృష్ణమూర్తీ ! నేను జయమును, రాజ్యమును, సుఖమును కోరుట లేదు. ఓ గోవిందా ! రాజ్యముచేతను, భోగములచేతను, జీవించియుండుటచేతను మాకు ఏమి ప్రయోజనము?

వి॥ అర్జునునకు మతిభ్రమవలన దుశ్శకునములు కనిపించినవేగాని, నిజమైనవికాదు. మతిచెడుటచేతను, శరీరతాపముచేతను, పైత్యమువల్లను, మనోవ్యాకులతవల్లను, దుష్టాహారమువల్లను గలిగెడు దుశ్శకునములుగాని, దుఃస్వప్నములుగాని నిజములు కావు. వైరాగ్యము గలుగునప్పుడు అర్జునునకు గలిగినట్లు స్వభావముగ అందరికి ఈ స్థితి గలుగును.

శ్లో॥ యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ ।
తఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ ॥ 33

పద॥ యేషాం - అర్థే - కాంక్షితం-నః - రాజ్యం - భోగాః - సుఖాని -చ, తే - ఇమే - అవస్థితాః - యుద్ధే - ప్రాణాన్ - త్యక్త్వా - ధనాని - చ.

ప్రతి॥ యేషాం అర్థే = ఎవరి నిమిత్తము, నః = మనకు, రాజ్యం = రాజ్యము. కాంక్షితం = కోరబడదగినదో, భోగాః = భోగములును, సుఖాని చ = సుఖములును, (కాంక్షితాని = కోరబడదగినవో), తే ఇమే = అటువంటి వీరందరును, ప్రాణాన్ = ప్రాణములను, ధనాని చ = ధనములను, త్యక్త్వా= విడిచి, యుద్ధే =యుద్ధమునందు, అవస్థితాః = నిలిచియున్నారు.

తా॥ ఎవరికొఱకు మనచేత రాజ్యమును, సుఖములను, కోరబడుచున్నవో యట్టివారే ప్రాణములను, ధనములను వదలి యుద్ధసన్నద్ధులై వచ్చియున్నారు.

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రాస్తథైవ చ పితామహాః ।
మాతులాశ్శ్వశురాః పౌత్రాస్స్యాలాస్సంబంధినస్తథా ॥ 34

పద॥ ఆచార్యాః - పితరః - పుత్రాః - తథా - ఏవ - చ - పితామహాః, మాతులాః - శ్వశురాః - పౌత్రాః - స్యాలాః - సంబంధినః - తథా,

ప్రతి॥ ఆచార్యాః = గురువులును, పితరః=తండ్రులును, పుత్రాః = కొడుకులును, తథా ఏవ చ = అలాగుననే, పితామహాః = తాతలును,

మాతులాః = మేనమామలును, శ్వశురాః = మామలును, పౌత్రాః = మనుమలును, స్యాలాః = బావమరదులును, తథా = అట్లు, సంబంధినః = వియ్యంకులును. అవస్థితాః = వచ్చియున్నారు.

తా॥ ఆచార్యులును, తండ్రులును, పుత్రులును, తాతలును, మేనమామలును, మామలును, మనుమలును, బావమరదులు ఆ ప్రకారముగానే మరియు నితరులగు బంధువులును, యుద్ధమునకు వచ్చియున్నారు.

శ్లో॥ ఏతాన్న హన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన! ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే ॥ 35

పద॥ ఏతాన్ - న - హన్తుం - ఇచ్ఛామి - ఘ్నతః - అపి - మధుసూదన, అపి - త్రైలోక్యరాజ్యస్య - హేతోః - కిం - ను - మహీకృతే.

ప్రతి॥ హే మధుసూదన! =ఓ శ్రీకృష్ణమూర్తీ! ఘ్నతః అపి=నన్ను చంపువారలైనను, త్రైలోక్యరాజ్యస్య = ముజ్జగముల రాజ్యముయొక్క, హేతోః అపి=నిమిత్తముకొఱకైనను, ఏతాన్=ఈ కౌరవసైన్యములోనివారలను, హంతుం =వధించుటకు, న ఇచ్ఛామి = ఇష్టపడను, మహీకృతే = భూరాజ్యముకొఱకు, కిం ను = చెప్పవలసినదేమి ?

తా॥ ఓ శ్రీకృష్ణా! ఈ దుర్యోధనాదులందరు నన్ను సంహరించు వారైనను, నాకు ముజ్జగముల అధిపత్యము దొరికినప్పటికి నేను వీరలను వధింపను. త్రైలోక్య రాజ్యమునందే యపేక్షలేని నేను, భూలోక రాజ్యముకొఱకు వీరిని వధింపనని మరల చెప్పవలెనా !

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యాజ్జనార్దన ! ।
పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః ॥ 36

పద॥ నిహత్య - ధార్తరాష్ట్రాన్ - నః - కా - ప్రీతిః - స్యాత్ - జనార్దన, పాపం - ఏవ - ఆశ్రయేత్-అస్మాన్-హత్వా- ఏతాన్ - ఆతతాయినః,

ప్రతి॥ హే జనార్దన! = ఓ శ్రీకృష్ణమూర్తీ!, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, నిహత్య = సంహరించి, నః = మనకు, కాప్రీతిః = యేమి సంతోషము. స్యాత్ = అగును, ఆతతాయినః = దుర్మార్గులైన,

ఏతాన్ = ఈ దుర్యోధనాదులను, హత్వా = హతమొనర్చి, అస్మాన్ = మనలను, పాపం ఏవ = దోషమే, ఆశ్రయేత్ = పొందును.

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! ఈ దుర్యోధనాదులను చంపిన యెడల మనకేమి ప్రీతి గలుగును ? దుర్మార్గులైన వీరిని వధించిన యెడల మనకు పాపమే కలుగును.

వి॥ ఆతతాయులనగా - శ్లో॥ అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః క్షేత్రదారహరశ్చైవ షడేతే హ్యాతతాయినః॥ ఇల్లుమొదలగువానినిదగులబెట్టు వాడు,విషముపెట్టి చంపువాడును,ఆయుధపాణియై దోపిడిమొదలగునేరములు చేయువాడును, పరుల ధనము నపహరించువాడును, పరులభూమి నాక్రమించు వాడును, పరుల భార్యల నపహరించువాడును, ఈ అరుగురును ఆతతాయు లనబడుదురు. ఆతతాయులను వధించిన దోషములేదు. అర్జునునకు మిక్కిలి జాలిగలిగి, ఆతతాయులనుగూడ వధించుట మంచిదిగాదను తలంపు గలిగిన స్థితి గలిగెను.

శ్లో॥ తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్స్వబాంధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ! ॥ 37

పద॥ తస్మాత్ - న - అర్హాః - వయం - హంతుం - ధార్తరాష్ట్రాన్ -స్వబాంధవాన్, స్వజనం - హి-కథం - హత్వా - సుఖినః - స్యామ - మాధవ!

ప్రతి॥ హే మాధవ ! = ఓ శ్రీకృష్ణమూర్తీ!, తస్మాత్=అందువలన, వయం= మనము, స్వబాంధవాన్ =మనబంధువులగు, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, హంతుం = చంపుటకు, న అర్హాః=అర్హులముకాము, హి= ఏలయనగా, స్వజనం = బంధుజనమును, హత్వా = వధించి, కథం = ఎట్లు, సుఖినః = సుఖించువారలము, స్యామ = కాగలము ?

తా॥ ఓ మాధవా ! మనము బంధుజనులను వధించి యేమి సుఖమును బొందగలము? అందువలన మన బంధువులగు దుర్యోధనాదులను సంహరించుట మనకు తగదు.

శ్లో॥ యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ 38

పద॥ యది - అపి - ఏతే - న పశ్యన్తి - లోభోపహతచేతసః,
కులక్షయకృతం - దోషం - మిత్రద్రోహే - చ - పాతకమ్.

ప్రతి॥ యది అపి = ఏ విధముచేతనైనను, లోభోపహతచేతసః = రాజ్యము నందలి ఆశచేత చెడిన మనస్సులుగల, ఏతే = ఈ దుర్యోధనాదులు, కులక్షయకృతం = వంశనాశముచేతగలిగిన, దోషం చ = పాపమును మిత్రద్రోహే = మిత్రద్రోహమునందలి, పాతకం చ = దోషమును, న పశ్యంతి = చూడజాలకున్నారు.

తా॥ ఈ దుర్యోధనాదులు రాజ్యలోభముచేత హతమనస్కులైనందున కులనాశముచే గలుగు దోషమును, మిత్రద్రోహము వలన కలుగునట్టి పాతకమును తెలిసికొనజాలకున్నారు.

వి॥ పాపబుద్ధి గలవారికి కండ్లున్నప్పటికిని కనిపించదు, చెవులున్నప్పటికిని వినిపించదు.

శ్లో॥ కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన ॥ 39

పద॥ కథం - న - జ్ఞేయం - అస్మాభిః - పాపాత్ - అస్మాత్ - నివర్తితుమ్
కులక్షయకృతం - దోషం - ప్రపశ్యద్భిః - జనార్దన !

ప్రతి॥ హే జనార్దన! = ఓ శ్రీకృష్ణమూర్తీ!, కులక్షయకృతం = కులనాశముచే నేర్పడిన, దోషం = దోషమును, ప్రపశ్యద్భిః = చూచుచున్న, అస్మాభిః = మనచేత, అస్మాత్ పాపాత్ = ఈ పాపమునుండి, నివర్తితుం = మరలుటకు, కథం=ఎట్లు, న జ్ఞేయం= తెలియదగినది కాదు

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! కులనాశనముచేత దోషము గలుగునని చక్కగా గమనించుచున్న మన మీ పాపకృత్యమునుండి యెందుకు విరమింపకూడదు?

వి॥ మిక్కిలి కరుణ గలిగినందుచేతనే అర్జునుడు ఈ పాపమునుండి యెట్లు నివృత్తి గలుగునో యని దుఃఖముతో కూడినవాడయ్యెను. ఇదే పశ్చాత్తాపముయొక్క పూర్ణస్వరూపము,

శ్లో॥ కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత ॥ 40

పద॥ కులక్షయే - ప్రణశ్యంతి - కులధర్మాః - సనాతనాః,
ధర్మే - నష్టే - కులం - కృత్స్నం - అధర్మః - అభిభవతి - ఉత.

ప్రతి॥ కులక్షయే = కులనాశముకలుగగా, సనాతనాః = శాశ్వతములైన, కులధర్మాః=వంశాచారములు, ప్రణశ్యంతి = నశించుచున్నవి, ధర్మే= కులాచారము, నష్టే = నశించగా, కృత్స్నం = సమస్తమైన, కులం= వంశమును, అధర్మః = అనాచారము, అభిభవతి ఉత = నశింపజేయు చున్నదిగదా ?

తా॥ వంశము నశించుటవలన అనాదియైన కులాచారములు నశించిపోవును. కులధర్మములు నశించిపోవుటచేత ఆ కులము నందు అధర్మము వ్యాపించును.

శ్లో॥ అధర్మాభిభవాత్కృష్ణ! ప్రదుష్యంతి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసంకరః ॥ 41

పద॥ అధర్మాభిభవాత్ - కృష్ణ - ప్రదుష్యంతి - కులస్త్రియః,
స్త్రీషు - దుష్టాసు - వార్ష్ణేయ - జాయతే - వర్ణసంకరః.

ప్రతి॥ హే కృష్ణ ! = ఓ కృష్ణమూర్తీ !, అధర్మాభిభవాత్ = అన్యాయము వ్యాపించుటవలన, కులస్త్రియః = కులస్త్రీలు, ప్రదుష్యంతి = చెడిపోవుదురు, హే వార్ష్ణేయ ! = ఓ శ్రీకృష్ణమూర్తీ!, స్త్రీషు=స్త్రీలు, దుష్టాసు= చెడిపోయినవారలుకాగా, వర్ణసంకరః = వర్ణసాంకర్యము, జాయతే = గలుగుచున్నది.

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! ధర్మము నశించుటవలన కులాంగనలు చెడిపోవుదురు. కులస్త్రీలు చెడిపోయిరేని వర్ణసాంకర్యము కలుగును.

వి॥ స్త్రీలు గౌరవస్థితిలో నుండకపోయిన, హీనుల సంసర్గము జేసినచో ఉత్కృష్టమగు సంతతి గలుగదు. నికృష్టసంతానమువలన వంశక్షయము గలుగును. కావున స్త్రీలయొక్క గౌరవమును సంరక్షించుట పరమధర్మము.

శ్లో॥ సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః ॥ 42

పద॥ సంకరః - నరకాయ - ఏవ - కులఘ్నానాం - కులస్య - చ,
పతంతి - పితరః - హి - ఏషాం - లుప్తపిండోదకక్రియాః.

ప్రతి॥ సంకరః = వర్ణసాంకర్యము, కులఘ్నానాం = కులమును నశింపజేయు వారలకు, కులస్య చ = కులమునకును, నరకాయ ఏవ = నరకము కొఱకే అగుచున్నది, ఏషాం = ఈ కులనాశకులయొక్క, పితరః హి= తండ్రులును, లుప్తపిండోదకక్రియాః= లోపించిపోయిన ఉదకదానాది క్రియలు గలవారై, పతంతి = అధోగతిని జెందుదురు.

తా॥ వర్ణసాంకర్యమయ్యేనేని కులనాశకులకు, కులమునకును నరకము గలుగును. మఱియును అట్టివారలయొక్క పితృదేవతలు, పిండోదకాదులు ఇచ్చువారు లేకపోవుటవలన, అధోలోకములను పొందుదురు.

వి॥ సాంకర్యముచే దుష్టసంతానము కలుగుటవలన అట్టివారు మాతాపితరుల సేవచేయరు. దైవకార్యములను నిర్వర్తింపరు, పితృకార్యములనాచరింపరు,మనము బాల్యావస్థలో అశక్తస్థితిలో నుండగా సుమారు 16 లేక 20 సంవత్సరములు మాతాపితరులచే పోషింపబడిన వారలమై యున్నారము. అప్పుడు వారు యౌవనస్థితిలో శక్తిమంతులై యుండిరి. మఱల వారు వార్థక్యదశలో, అశక్తులైయుండు కాలమున మనము యౌవనముగలవారమై శక్తిమంతులగుటవలన వృద్ధాప్యదశలోనుండు మాతాపితరులకు 16 లేక 20 సంవత్సరములుగాని సంరక్షణ చేయవలసియుండును. అట్టివారే తల్లిదండ్రుల ఋణమును తీర్చినవారగుదురు. వారు యౌవనకాలములో వహించియుండిన గృహకృత్యములన్నిటిని, మనము యౌవనములో నుండునపుడు స్వయముగా నిర్వహించుచు జననీజనకులను దైవకార్యములలో ప్రవేశింపజేసి వారు ఇచ్చటనే తరించులాగున చేయవలెను. ఇదే మాతాపితరులను తరింపచేయవలెనని చెప్పినదాని ముఖ్యార్థము.

శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః ।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ 43

పద॥ దోషైః - ఏతైః - కులఘ్నానాం - వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యన్తే - జాతిధర్మాః - కులధర్మాః - చ - శాశ్వతాః

ప్రతి॥ ఏతైః = ఈ, వర్ణసంకరకారకైః=వర్ణసాంకర్యమునకు హేతుభూతములైన, కులఘ్నానాం = కులనాశకులయొక్క, దోషైః = దోషములచేత, శాశ్వతాః = పరంపరాప్రాప్తములైన, జాతిధర్మాః = జాతిధర్మములు, కులధర్మాః చ = కులధర్మములున్ను, ఉత్సాద్యన్తే = నశింపజేయబడుచున్నవి.

తా॥ వర్ణసంకరమును జేయునట్టి కులనాశకులయొక్క దోషములచేత శాశ్వతములైన జాత్యాచారములును, కులాచారములును ఆశ్రమ ధర్మములున్ను నశింపజేయబడుచున్నవి.

శ్లో॥ ఉత్పన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన !।
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ ॥ 44

పద॥ ఉత్పన్నకులధర్మాణాం - మనుష్యాణాం - జనార్దన,
నరకే - నియతం - వాసః - భవతి - ఇతి - అనుశుశ్రుమ.

ప్రతి॥ హే జనార్దన ! = ఓ శ్రీకృష్ణమూర్తీ ! ఉత్పన్నకులధర్మాణాం = నశించిన కులధర్మములు గలిగిన, మనుష్యాణాం = మనుష్యులకు, నరకే = నరకమునందు, నియతం = ఎల్లప్పుడును, వాసః = నివాసము, భవతి =అగుచున్నది, ఇతి = ఇట్లని, అనుశుశ్రుమ = వింటిమి.

తా॥ ఓ జనార్దనా ! కులధర్మములను చెడగొట్టుకొనినవారలకు ఎల్లప్పుడును నరకమునందు నివాసము కలుగునని మనము వినియున్నాము. కావున కులనాశముచేసి కులధర్మములను బాడు చేయకూడదు.

శ్లో॥ అహో! బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః ॥ 45

పద॥ అహో - బత - మహత్ - పాపం - కర్తుం - వ్యవసితాః - వయం,
యత్ - రాజ్యసుఖలోభేన - హంతుం - స్వజనం - ఉద్యతాః.

ప్రతి॥ వయం = మనము, యత్ = ఎందుచే, రాజ్యసుఖలోభేన = రాజ్యమునందలి యాశచేత, స్వజనం = బంధుజనమును, హంతుం = వధించుటకొఱకు, ఉద్యతాః = ఉద్యుక్తులమైతిమో, (తత్ = అందుచే), మహత్ = గొప్పదియైన, పాపం = పాపమును, కర్తుం = చేయుట

కొఱకు, వ్యవస్థితాః = పూనుకొన్న వారమైతిమి, అహో ! = ఆశ్చ ర్యము, బత = ఎంతకష్టము !

తా॥ ఓహో ! రాజ్యసుఖమునందలి యాశచేత మనము బంధువులను గూడ జంపుటకు నుద్యుక్తులమైతిమి. ఇవ్విధముగ నుద్యుక్తులమై మహాపాపమును జేయబూనితిమి. అయ్యో!

శ్లో॥ యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్ ॥ 46

పద॥ యది - మాం - అప్రతీకారం - అశస్త్రం - శస్త్రపాణయః.
ధార్తరాష్ట్రాః - రణే - హన్యుః - తత్ - మే - క్షేమతరం - భవేత్.

ప్రతి॥ రణే = యుద్ధమునందు, అప్రతీకారం = ఎదిరించి యుద్ధముచేయ నట్టియు, అశస్త్రం = నిరాయుధుడనైనట్టియు, మాం = నన్ను, శస్త్ర పాణయః = ఆయుధపాణులగు, ధార్తరాష్ట్రాః = దుర్యోధనాదులు, యది హన్యుః = సంహరించిరేని, తత్ = ఆ మరణము, మే = నాకు, క్షేమతరం = మిక్కిలి క్షేమతరమైనది, భవేత్ = కాగలదు.

తా॥ ఆయుధములను ధరించిన దుర్యోధనాదులు ఆయుధ ములు లేనివాడను, ప్రతిక్రియను జేయనివాడను నయిన నన్ను జంపిరేని నాకు మిగుల మేలే కలుగును.

సంజయ ఉవాచ:- సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఏవముక్త్వాఽర్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః 47

పద॥ ఏవం - ఉక్త్వా - అర్జునః - సంఖ్యే - రథోపస్థే - ఉపావిశత్,
విసృజ్య - సశరం - చాపం - శోకసంవిగ్నమానసః.

ప్రతి॥ అర్జునః = అర్జునుడు, ఏవం ఉక్త్వా = ఇట్లుచెప్పి, శోకసంవిగ్నమా నసః = వ్యసనముచే చలింపబడిన మనస్సు గలవాడై, సశరం = బాణ ముతోగూడియున్న, చాపం = ధనుస్సును, విసృజ్య = విడిచి, సంఖ్యే= యుద్ధభూమి యందు, రథోపస్థే = రథముమీద, ఉపావిశత్ = కూర్చుండెను.

తా॥ ఓ ధృతరాష్ట్రమహారాజా! అర్జునుడీ విధముగా జెప్పి దుఃఖముచే కలవరము గలిగిన మనస్సు గలవాడై ధనుర్బాణము లను విడిచిపెట్టి, యుద్ధమునందు రథముమీద నుసూఅనుచు గూర్చుండెను.

వి॥ తీవ్రవైరాగ్యము గలిగి సంసారదుఃఖమునుండి తరించవలెనని తలంపు గలుగునప్పుడు అర్జునునకు గలిగినట్లు అందఱికినిసైరాశ్యము, సర్వత్యాగము, మనోదుఃఖము, నిర్వేదమును గలుగుచుండును.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే అర్జున విషాదయోగో నామ
ప్ర థ మో ఽ ధ్యా య ః

పద॥ ఇతి - శ్రీమద్భగవద్గీతాసు - ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జునసంవాదే - అర్జునవిషాదయోగః - నామ - ప్రథమః - అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇట్లు, ఉపనిషత్సు = ఉపనిషదర్థ ప్రతిపాదకంబును, బ్రహ్మ విద్యాయాం = బ్రహ్మవిద్యాస్వరూపంబును, యోగశాస్త్రే = యోగశాస్త్ర మును,శ్రీకృష్ణార్జున సంవాదే=శ్రీకృష్ణార్జునసంవాదరూపమును నగు, శ్రీమద్భగవద్గీతాసు = శ్రీ భగవద్గీతలలో, అర్జునవిషాదయోగోనామ = అర్జునవిషాదయోగమను, ప్రథమః అధ్యాయః = మొదటి అధ్యాయము ముగిసెను.

తా॥ ఇట్లు ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్ర మును, శ్రీ కృష్ణార్జునసంవాదరూపమును నగు శ్రీమద్భగవద్గీత యందు అర్జున విషాదయోగమను పేరుగల మొదటి అధ్యాయము ముగిసినది.

ఓమ్ తత్ సత్ ఓమ్

వి॥ ప్రతి అధ్యాయము కడపటను శ్రీమద్భగవద్గీతఅనియు,ఉపనిషత్సారము అనియు,బ్రహ్మవిద్యయనియు, యోగశాస్త్రమనియుచెప్పుటచే దీనియొక్కమహి మాతిశయము గోచరమగుచున్నది. ఈ గీతలో గల పదునెనిమిది అధ్యాయ

ములకును ఇదే ప్రకారముండుటవలన అవి యన్నియు బ్రహ్మవిద్యయనియు, ఉపనిషత్ సారములనియు, యోగశాస్త్రములనియు గ్రహించవదగును. అయితే సాంఖ్యయోగః,జ్ఞానయోగః ఆత్మసంయమయోగః భక్తియోగఃఅనియుండగ ఈ మొదటి అధ్యాయమునకు మాత్రము విషాదయోగః అని యేల పేరు గలుగ వలెను? యోగమునకు జీవాత్మ పరమాత్మలయొక్క ఐక్యమనియే అర్థము. సాంఖ్యము, జ్ఞానము,ఆత్మసంయమముమొదలగు శబ్దములవలన పరమాత్మని యందైక్యము గలుగుట లేక యోగసమాధి సిద్ధించుటలేక జ్ఞానసిద్ధిగలుగుటలేక ధ్యానమందుసర్వేంద్రియముల నిరోధముగలుగుటలేక పరమాత్మధ్యానమందు చిత్తైకాగ్రత గలుగుట మొదలగు అర్థములు స్ఫురించుచున్నవి. కాని విషాద యోగము అని యుండుటచే దుఃఖముగూడ యోగమగునా? దుఃఖముచే పర మాత్మైక్యము లభించునా? అనిసందేహము గలుగుట కవకాశము గలదు. ఐతే భగవంతుడు ఆలోచనలేకయే యిట్లుచెప్పినట్లు తలంచరాదు. భవబంధ విముక్తి కావలయునన తీవ్రవైరాగ్యము గలుగునప్పుడు శుద్ధజిజ్ఞాసులకు అర్జునునకు గలిగినట్లే నిర్వేదము, శోకము గలుగును. గద్గదస్వరము, శరీర కంపనము గగుర్పాటు ఆనందబాష్పము, సమస్తవస్తువులలో నిరాశమొద లగునవి యన్నియు తీవ్రముముక్షుత్వముయొక్క చిహ్నములు. ఇట్టి లక్షణ ములు గలవాడు తప్పక పరమాత్మయందైక్యము పొందగల్గును. అతనికి యోగసమాధి లభింపగలదు. తీవ్రవైరాగ్యముగల అట్టి ముముక్షువు భవ బంధ విముక్తి గలిగి జీవన్ముక్తియగు మోక్షమును తప్పక పొందగలు గును. అప్పుడుసర్వశోకశాంతియు ఆనంద ప్రాప్తియు లభించును. కావున విషాదముగూడ ఒకయోగము అని చెప్పుటకు కారణమైనది.

ఓమ్ తత్ సత్.



ఓమ్
శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## ద్వితీయాధ్యాయః-ద్వితీయాధ్యాయము
## సాంఖ్యయోగః-సాంఖ్యయోగము



రెండవ అధ్యాయమునకు సాంఖ్యయోగమని పేరు. సంఖ్యలచేత చెప్పబడిన దగుటచే సాంఖ్యమను నామము గలిగెను. 24 తత్త్వములనుశోధించి, అవి పంచభూతాత్మకములని తెలిసికొని వీటికి సాక్షియగు శుద్ధాత్మ తనయొక్క ఆత్మస్వరూపమని గ్రహించుటయే దీనియొక్క ముఖ్యోద్దేశము. అట్టి ఆత్మజ్ఞానము గలిగినచో ఆత్మ అవినాశియనియు, నిత్యమనియు, స్వప్రకాశమనియు అమృతమనియు తత్త్వబోధము గలుగును. అప్పుడు దేహము నశించినను, ఆత్మకు నాశములేదను సత్యము బోధపడును. అంతట నిర్భయత్వము గలుగును. ఈ యధ్యాయములో చెప్పబడిన ఆత్మను గుఱించిన విషయములన్నియు బోధపడిన, మఱల మరణమన్న భయము కలుగదు. అప్పుడే అర్జునుడు యుద్ధము చేయుటకు సరియైనవాడు కాగలడని తలచి శ్రీకృష్ణుడు ఈ సాంఖ్యతత్త్వము నుపదేశింపబూనెను. ఇట్టి తత్త్వమెఱింగినవాడు ఆత్మకు జననమరణములు, పుణ్య పాపములు, కర్తృత్వ భోక్తృత్వములు లేవను జ్ఞానముగలవాడై భ్రమచే గలిగిన ఈ ప్రపంచము మిథ్యయను జ్ఞానము గలవాడగును. ఇట్టి దివ్యజ్ఞానము గలుగకపోయిన, పడగ యెత్తి బుసగొట్టుచుండు కృష్ణసర్పమును పట్టుకొనుటకు ఒకరితో చెప్పిన అతడు ఏలాగున మరణభీతిచే దానిని పట్టజాలడో, ఆలాగున విషప్రాయములగు విషయములతోగూడిన యీ ప్రకృతి యను కృష్ణసర్పమును పట్టి ఆడింపజాలడు. గరుడమంత్రోపదేశముపొంది దానిని పఠించుచు నల్లత్రాచును పట్టుకొనినచో ఆ మంత్రప్రభావముచే ఆ త్రాచు ఏలాగున కరవజాలదో, ఆలాగున ఆత్మతత్త్వజ్ఞానబోధము గలిగిన వారిని ప్రకృతి బంధింపజాలదు. వారీ ప్రపంచములో నే పనినైనను చేయగలరు. వారు ప్రకృతి విషయముచే బద్ధులుగారు. ఈ పరమరహస్యము ఈ యధ్యాయములో నుపదేశింపబడినది.

సంజయ ఉవాచ:... సంజయుడు చెప్పెను.

శ్లో॥ తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీద న్తమిదం వాక్య మువాచ మధుసూదనః ॥ 1

పద॥ తం- తథా - కృపయా - అవిష్టం - అశ్రుపూర్ణాకులేక్షణం
విషీద న్తం - ఇదం - వాక్యం - ఉవాచ - మధుసూదనః.

ప్రతి॥ మధుసూదనః = శ్రీకృష్ణమూర్తీ!, తథా = ఆ ప్రకారము, కృపయా = కనికరముతోడ, అవిష్టం = కూడుకొన్నవాడును, అశ్రుపూర్ణాకులేక్షణం =కన్నీటితో నిండుకొని కలతబారిన నేత్రములు కలవాడును. విషీదన్తం= వ్యాకులత జెందుచున్నవాడును నగు, తం = ఆ యర్జునుని గూర్చి, ఇదంవాక్యం = ఈ వాక్యమును, ఉవాచ =వచించెను.

తా॥ మధుసూదనుడు అట్లు కనికరముతో కూడుకొన్న వాడును, కన్నీటితో నిండుకొని కలతబారిన నేత్రములు గల వాడును, దుఃఖపడుచున్నవాడునునగు అర్జునునిగూర్చి క్రింద చెప్పబోయెడు ఈ వాక్యమును చెప్పెను.

వి॥ తీవ్రవైరాగ్యము గలిగిన ముముక్షువులయొక్క శోకము ఆత్మ సాక్షాత్కార జ్ఞానముగల మహనీయుల జ్ఞానబోధమువలన శాంతించవలెనను తత్త్వము ఈ శ్లోకముచే.నిరూపించడమైనది.

శ్రీభగవానువాచ:—శ్రీభగవంతుడు చెప్పెను.

శ్లో॥ కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తి కరమర్జున !॥ 2

పద॥ కుతః - త్వా - కశ్మలం - ఇదం - విషమే - సముపస్థితం,
అనార్యజుష్టం - అస్వర్గ్యం - అకీర్తికరం - అర్జున !

ప్రతి॥ హే అర్జున ! = ఓ అర్జునా!,అనార్యజుష్టం= పామరులచే అవలంబింపబడదగినదియు,అస్వర్గ్యం = స్వర్గలోకప్రాప్తికి భంగకరమైనదియు,అకీర్తికరం = అపయశస్సును గలుగజేయునదియునగు,ఇదంకశ్మలం= ఈ మాలిన్యము, విషమే = ఈ విషమస్థితియందు, కుతః = ఏకారణము వలన, త్వా = నిన్ను, సముపస్థితం = పొందినది.

తా॥ ఓ అర్జునా! యుద్ధమును జేయుటకు సన్నద్ధమైన యీ

సమయమునందు స్వర్గము గలుగ జేయనిదియు, అపకీర్తికి కారణ మైనదియునైన ఈ శోకరూపమగు పిరికితనము నీ కెట్లు గలిగెను?

వి॥ ధర్మసందిగ్ధ సమయమునందును, మనోధైర్యము లేని సమయము నందును, ఆపత్ సమయమునందును కార్యనిర్ధారణ చేయుటకు సామాన్యులకు శక్తియుండదు. సుస్థిర జ్ఞానము గలిగినమాత్రమే అట్టి శక్తిగలిగి యుండును. తక్కినవారందరికిని అట్టి విపత్ సమయమున ధర్మస్వరూప మెఱింగిన సుస్థిరజ్ఞానము గలవారి సహాయముండవలెను.

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥ 3

పద॥ క్లైబ్యం - మా - స్మ - గమః - పార్థ! - న - ఏతత్ - త్వయి - ఉప పద్యతే, - క్షుద్రం - హృదయదౌర్బల్యం - త్యక్త్వా - ఉత్తిష్ఠ - పరంతప!

ప్రతి॥ హే పార్థ! = ఓయర్జునా!, క్లైబ్యం = అధైర్యమును, మాస్మ గమః = పొందకుము, త్వయి = నీయందు, ఏతత్ =ఈ అధైర్యము, న ఉప పద్యతే = తగినదిగాదు, హేపరంతప! = ఓ పరంతపా!, క్షుద్రం = నీచమైన, హృదయ దౌర్బల్యం = పిఱికి తనమును, త్యక్త్వా = విడిచి, ఉత్తిష్ఠ =లెమ్ము,

తా॥ ఓయర్జునా! నీవు క్లీబత్వమును (అధైర్యమును) పొంద కుము. నీకు అధైర్యముబొందుట తగదు. ఓ పరంతపా ! హీనమైన యీ దౌర్బల్యమును విడిచిపెట్టి యుద్ధమునకై లెమ్ము.

వి॥ ధర్మసంకటమందు కార్యనిర్వహణానర్హత గలుగుట మనో దుర్బలత్వము గలవారికి స్వభావము. అదిశూరులకు ధీరులకు ధర్మానుష్ఠాన నిష్ఠగల వారికి తగదు. అదిబాల తుచ్ఛమైన స్వభావము. కనుకనే "క్లైబ్యము" అని పరిహసించుటకు కారణమైనది. క్లైబ్యము అనగా నపుంస కత్వము, అనగాపురుషుడును, స్త్రీయును కాని వానిని గుఱించి నిందించెడు సమయమున అట్టి ప్రయోగమును చేయుదురు.

అర్జున ఉవాచ:— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన !
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన ! ॥ 4

పద॥ కథం - భీష్మం - అహం - సంఖ్యే - ద్రోణం - చ - మధుసూదన!
ఇషుభిః - ప్రతియోత్స్యామి- పూజార్హౌ - అరిసూదన!

ప్రతి॥ అరిసూదన! = శత్రువులను నశింపజేయువాడవగు, హే మధుసూదన! = ఓ శ్రీకృష్ణమూర్తీ! అహం = నేను, సంఖ్యే = యుద్ధమునందు, పూజార్హౌ = పూజనీయులగు, భీష్మం = భీష్మాచార్యుని ద్రోణం చ = ద్రోణాచార్యుని, ఇషుభిః=బాణములచేత, కథం =ఎట్లు, ప్రతియోత్స్యామి = ఎదిరించి యుద్ధము చేయగలను!

తా॥ శత్రువుల సంహరించు వాడవగు నో మధుసూదనా! నేను యుద్ధమునందు పూజ్యులగు భీష్మ ద్రోణులను బాణముల చేత నెటుల యెదుర్కొని యుద్ధము చేయగలను?

వి॥ అర్జునునకు కలిగిన సందేహము సామాన్య ధర్మబుద్ధికి తగినది. విశేషధర్మబుద్ధి గలవారికి కార్యనిర్వహణము శ్రేష్ఠమగును.

శ్లో॥ గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే।
హత్వాఽర్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్॥ 5

ప్రతి॥ గురూన్ - అహత్వా - హి - మహానుభావాన్ - శ్రేయః - భోక్తుం - భైక్ష్యం - అపి - ఇహ - లోకే - హత్వా - అర్థకామాన్ - తు - గురూన్ - ఇహ - ఏవ - భుంజీయ - భోగాన్ - రుధిరప్రదిగ్ధాన్.

ప్రతి॥ మహానుభావాన్ = పూజ్యులైన, గూరూన్ = గురువులను, హత్వాతు = చంపినయెడల నైతే నో, ఇహ= ఈ లోకమునందు,అర్థకామాన్=అర్థకామాత్మకములైనట్టియు, రుధిరప్రదిగ్ధాన్ = రక్తసిక్తములైనట్టియు, భోగాన్ =విషయ భోగములను, భుంజీయ = అనుభవింపగలవాడును, ఆకారణము వలన గురూన్ = మహనీయులను, అహత్వా ఏవ = చంపకయే,ఇహలోకే = ఈ లోకమునందు, భోక్తుం = భుజించుటకొఱకు, భైక్ష్యం అపి = భిక్షాన్నమైనను, శ్రేయఃహి = మేలైనది గదా!

తా॥ పూజ్యులైన గురువులను చంపి ఈ లోకమునందు అర్థకామాత్మకములైనట్టియు, రక్తలిప్తములైనట్టియునగు భోగముల

ననుభవించుటకన్న అట్టి గురువులను జంపకయే, ఈ లోకమునందు భుజించుట కొఱకు బిచ్చమెత్తుట యైనను మేలైనదికదా?

వి॥ ఇది ధర్మనిష్ఠలో గలిగిన స్వభావ వైరాగ్యముగాదు. ధర్మనిర్వహణ సమర్థత లేని అభావవైరాగ్యమని తెలియందగును.

శ్లో॥ న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః ।
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ 6

పద॥ న - చ - ఏతత్ - విద్మః - కతరత్ - నః - గరీయః - యద్వా - జయేమ - యది - వా - నః - జయేయుః - యాన్ - ఏవ - హత్వా - న - జిజీవిషామః - తే - అవస్థితాః - ప్రముఖే - ధార్తరాష్ట్రాః.

ప్రతి॥ యాన్ =ఎవరిని, హత్వా=వధించి, న జిజీవిషామః=మనము జీవించుటకు నిచ్ఛగించమో, తే = అట్టి, ధార్తరాష్ట్రాః ఏవ=ధృతరాష్ట్రుని సంబంధులగు భీష్మాదులే, ప్రముఖే = సేనాగ్రభాగమున, అవస్థితాః= నిలిచియున్నారు. ఇదియునుగాక మనమే, (వారిని) జయేమ = జయింతుమో, యద్వా=లేక, నః = మనలను, (వారు) జయేయుః యది వా = జయింతురో యేమో, ఏతత్ చ =ఇదియును, న విద్మః = ఎరుంగజాలకున్నాము. ఆకారణము వలన, నః = మనకు, కతరత్ = ఏది, గరీయః = శ్రేష్ఠమైనది.

తా॥ ఎవరిని వధించి మనము జీవించుటకు నిచ్ఛగింపమో, అట్టి ధృతరాష్ట్రుని సంబంధులగు భీష్మాదులే అగ్రభాగమునందు నిలిచియున్నారు. ఇదియుగాక, మనముజయింతుమో, లేక వారలే మనల జయింతురో యేమో, తెలియదు. ఆ కారణమువలనయుద్ధము చేయుట మేలా లేక మానుట మంచిదా యని యెఱుగజాలకున్నాము.

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥ 7

పద॥ కార్పణ్యదోషోపహతస్వభావః - పృచ్ఛామి - త్వాం - ధర్మసమ్మూఢ చేతాః - యత్ - శ్రేయః - స్యాత్ - నిశ్చితం - బ్రూహి - తత్ - మే - శిష్యః - తే - అహం - శాధి - మాం - త్వాం - ప్రపన్నమ్.

ప్రతి॥ కార్పణ్యదోషోపహతస్వభావః=కృపణత్వమువలన గలిగిన దోషముచేత గొట్టబడిన(భిన్నాభిన్నమైన)స్వభావము కలవాడను గనుక, ధర్మసమ్మూఢ చేతాః=యుక్తాయుక్తపరిజ్ఞానములేనివాడనై, త్వాం= నిన్ను,పృచ్ఛామి = అడుగుచున్నాను, యత్ = ఏది, శ్రేయః = శ్రేయస్కరము, స్యాత్ = అగునో,తత్=దానిని, మే = నాకు, నిశ్చితం = ఖచ్చితముగా,బ్రూహి= చెప్పుము, అహం = నేను, తే=నీకు, శిష్యః =శిష్యుడను, త్వాం=నిన్ను ప్రపన్నం = శరణుపొందిన, మాం = నన్ను, శాధి = శాసింపుము.

తా॥ కృపణత్వమువలన (మనోదౌర్బల్యమువలన) గలిగిన దోషముచేత భిన్నాభిన్నమైన నైజగుణము (స్వాభావికశక్తి) గల వాడనైతిని. కనుకనే యుక్తాయుక్తపరిజ్ఞానములేనివాడనై నిన్నడుగు చున్నాను. ఏది శ్రేయస్కరమగునో దానిని నిశ్చయముగా (ఖచ్చిత ముగా) నాకు చెప్పుము. నేను నీకు శిష్యుడను. నిన్ను శరణ మొందితిని, కాన నన్ను శాసింపుము.

వి॥ కృపణుడనగా ఆత్మజ్ఞానము లేనివాడులేక ధర్మస్వరూపము నెరుంగని వాడు. ఇందువలన తన స్వభావము ననుసరించి ప్రవర్తింపగూడదనియు, ధర్మ నిర్ణేతయగు గురుని సహాయముండవలెననియు తెలియదగును. అట్లైన మంచి నేర్పరియగు చుక్కానివాడుగల పడవలో ప్రయాణము చేసినట్లుండును. అట్లు గాక తన స్వభావము ననుసరించి ప్రవర్తించినచో, చుక్కానివాడు లేని పడవ గాలి ననుసరించియో, ప్రవాహవేగము ననుసరించియో కొట్టుకొనిపోయి ఏ సుడిగుండములోనో పడిపోయి యపాయమునకు లోనగునటుల విపద్గ్రస్తుడు కావలసియుండును. చుక్కానివాడుండినచో పడవను అపాయమునకు లోను గానీయక, నిశ్చితస్థలమునకు చేర్చునుగదా! దీనివలన సాధకులకు గురువు అవసరమో? లేక అనవసరమో తెలియగలదు.

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యా -
ద్యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్ !

అవాప్య భూమావసపత్న మృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥ 8

పద॥ న - హి - ప్రపశ్యామి - మమ - అపనుద్యాత్ - యత్ - శోకం - ఉచ్ఛోషణం - ఇంద్రియాణాం - అవాప్య - భూమౌ - అసపత్నం - ఋద్ధం - రాజ్యం - సురాణాం - అపి - చ - అధిపత్యమ్.

ప్రతి॥ ఇంద్రియాణాం = ఇంద్రియములను, ఉచ్ఛోషణం = శోషింపచేయుచున్న, మమ = నాయొక్క, శోకం = దుఃఖమును, యత్ = ఏది, అపనుద్యాత్ = తొలగజేయునో, (తత్ = దానిని), భూమౌ = భూలోకమునందు, అసపత్నం = నిష్కంటకమైనదియు, ఋద్ధం = సమృద్ధమైనదియు నగు, రాజ్యం = రాజ్యమును, సురాణాం = దేవతలకు, అధిపత్యం చ = అధిపతిగానుండునట్టి ఇంద్రపదవినిన్ని, అవాప్య అపి = పొందియైనను, న ప్రపశ్యామి హి = చూడజాలకున్నాను గదా.

తా॥ భూలోకమునందునిష్కంటకమైనదియు,సమృద్ధమైనదియు నగు రాజ్యమునుగాని,దేవతలకు అధిపతిగానుండునట్టి యింద్రపదవిని గాని పొంది నప్పటికిని నా యింద్రియములను శోషింపజేయుచున్న దుఃఖము తొలగుటను చూడజాలక యున్నానుగదా! ఇంద్రాధిపత్యమును బొందినను ఈ దుఃఖముతొలగుట కల్లయని భావము.

సంజయ ఉవాచ :- సంజయుడుచెప్పెను.

శ్లో॥ ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః ।
నయోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవ హ ॥ 9

పద॥ ఏవం - ఉక్త్వా - హృషీకేశం - గుడాకేశః - పరంతపః,
న - యోత్స్యే - ఇతి - గోవిందం - ఉక్త్వా - తూష్ణీం - బభూవ - హ.

ప్రతి॥ పరంతపః = పరంతపుడగు, (శత్రువినాశకుడగు) గుడాకేశః = అర్జునుడు హృషీకేశం = సర్వేంద్రియనియామకుడగు శ్రీకృష్ణునిగూర్చి, ఏవం = ఈ ప్రకారము, ఉక్త్వా = చెప్పి, నయోత్స్యే ఇతి = యుద్ధము చేయనని, గోవిందం = శ్రీ కృష్ణమూర్తిని గురించి, ఉక్త్వా = పలికి, తూష్ణీంబభూవ = ఊరకుండెను, హ = ఆశ్చర్యము.

తా॥ శత్రువులను దపింపజేయువాడగు నర్జునుడు శ్రీకృష్ణునితో పైచెప్పబడిన రీతిగా వచించి, నేను 'యుద్ధముచేయన' నిపలికి యూరకుండెను.

శ్లో॥ తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత ।
సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః ॥ 10

పద॥ తం - ఉవాచ - హృషీకేశః - ప్రహసన్ - ఇవ - భారత !
సేనయోః - ఉభయోః - మధ్యే - విషీదన్తం - ఇదం - వచః.

ప్రతి॥ హే భారత!= ఓ ధృతరాష్ట్రమహారాజా! ఉభయోః=రెండైన, సేనయోః= సైన్యములయొక్క, మధ్యే = నడుమను, విషీదన్తం = దుఃఖించుచున్న, తం=ఆ యర్జుననిగూర్చి, హృషీకేశః =శ్రీకృష్ణమూర్తి, ప్రహసన్ ఇవ= నవ్వుచున్నవానివలె, ఇదం = ఈ, వచః=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా॥ ఓ ధృతరాష్ట్ర మహారాజా! రెండుసేనల మధ్య నిలిచి, యిదివరకు చెప్పబడిన ప్రకారము విలపించుచున్న అర్జునుని పరిహ సించుచున్న వానివలె నవ్వుమొగముతో శ్రీకృష్ణుడీ క్రింద చెప్ప బోయెడు విధమున బలికెను.

వి॥ "ప్రహసన్నివ" అని ప్రయోగించుటచే శ్రీభగవంతుడుఅర్జుననిజూచి 'ఇదియా నీ శౌర్యము అని చిరునవ్వుతో పరిహాసముగా చెప్పెనని భావము దీనివలన భయపడ నక్కరలేదనియు, నేనురక్షించెదననియు అర్థము సూచితమగు చున్నది. అట్లుగానిచో కోపముతో బలికియుండును.

శ్రీభగవానువాచ:- శ్రీకృష్ణుడు చెప్పెను.

శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః ॥ 11

పద॥ అశోచ్యాన్ - అన్వశోచః - త్వం - ప్రజ్ఞావాదాన్ - చ - భాషసే,
గతాసూన్ - అగతాసూన్ - చ - న - అనుశోచన్తి - పండితాః.

ప్రతి॥ త్వం=నీవు. అశోచ్యాన్=దుఃఖింపతగనివారినిగూర్చి,అన్వశోచః=దుఃఖిం చితివి, ప్రజ్ఞావాదాన్ చ = పండితులు పలుకునట్టి మాటలను గూడ, భాషసే =పలుకుచున్నావు. పండితాః = ఆత్మజ్ఞానముగలవారు, గతా సూన్ = మరణించిన వారలగూర్చియు, అగతాసూన్ చ = బ్రతికి యుండు వారినిగూర్చియు, న అనుశోచన్తి = దుఃఖించరు.

తా॥ నీవు దుఃఖింప తగని వారిని గూర్చి దుఃఖించుచుంటివి. పండితులు (వివేకవంతులు) పలుకునట్టి మాటలను పలుకుచున్నావు.

ఆత్మజ్ఞానము గలవారు చచ్చిన వారల గూర్చిగాని, బ్రతికియుండు వారిని గూర్చిగాని దుఃఖింపరు.

వి॥ రెండవ అధ్యాయము11-వ శ్లోకమునుండి శ్రీకృష్ణభగవానునిధర్మోప దేశము (గీతోపదేశము) ప్రారంభమగుచున్నది.భగవద్గీతాకల్పవృక్షమునకు ఇది బీజమగును అనగామూలమగును.కావుననేఋష్యాదిన్యాసములలో"అశోచ్యానన్వ శోచ స్త్వమితి బీజమ్" అని తెలుపుటకు కారణమైనది. వటబీజములో వట వృక్షమేలాగున నిగూఢమైయుంటున్నదో అలాగున ధర్మములన్నియు గీతా శాస్త్రమునం దిమిడియున్నవి. ''రణరంగమున మిక్కిలి స్వల్పకాలములో 18 అధ్యాయములతో గూడిన ఈ మహోన్నత గ్రంథము నుపదేశించుటకు వ్యవధి యేది!'' అని కొందఱు విమర్శకులు శంకించుచున్నారు.భగవన్మహిమాతిశయము తెలియక. శ్రీ కృష్ణుడుగూడవారివలెఒకసామాన్యమనుజుడనితలంచుటచేతనే యీ శంక గలుగుటకు కారణము. గొప్పదైన మఱ్ఱిచెట్టును మిక్కిలి సూక్ష్మమైన బీజములో నిమిడ్చి సృష్టించిన భగవంతుని కిది పెద్ద సంగతి కాదు.సూత్రప్రాయ ముగా శ్రీకృష్ణుడు బోధించిన వాక్యములను గ్రహించి, యమునాద్వీపములో ఏకాంతముననుండి శ్రీకృష్ణాశయమును దెలిసికొని, శ్రీ వ్యాసభగవంతుడు దీనిని గ్రంథరూపముగా రచించెను. కనుకనే 'అస్య శ్రీమద్భగవద్గీతాశాస్త్ర మహామంత్రస్య శ్రీ వేదవ్యాసఋషిః' అని ఋష్యాది న్యాసములో నిరూపించుటకు కారణమైనది. శ్రీకృష్ణుని అపరావతారము శ్రీ వ్యాసుడనుటచే ఆయనకు శ్రీకృష్ణా శయములన్నియు తెలియశక్తిగలిగియుండెను. దీనికి మఱియొక దృష్టాం తము చెప్పెద. శివచిదంబరమందు సనకాది ఋషులకు వ్యాకరణశాస్త్రమంతయు 14 సూత్రవాక్యములలో డమరుకధ్వనిచే శ్రీ పరమశివుండుపదేశించెను.వాటిని పాణినిమహర్షి అష్టాధ్యాయిగా రచించెను. దానికి శ్రీ పతంజలిముని మహాభాష్య మును వరరుచిఋషి వార్త్తికమును రచించిరి. ఈ మహావ్యాకరణశాస్త్రమంతయు 14 ధ్వనులలో అమర్చి బోధించిన సర్వేశ్వరుని శక్తి యెటువంటిదో, శ్రీకృష్ణు డుపదేశించిన గీతాశాస్త్రమున్ను అటువంటిదే. కావుననే వ్యాకరణ పాఠములో 'ఇతి మాహేశ్వరాణి సూత్రాణ్యణాదిసంజ్ఞార్థాని' అని పఠించుటకును,

"నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారమ్ ।
ఉద్ధర్తు కామస్సనకాదిసిద్ధానేతద్విమర్శే శివసూత్రజాలమ్ ॥"

అని చెప్పుటకును కారణము

శ్లో॥ న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామస్సర్వే వయమతః పరమ్ ॥ 12

పద॥ న - తు - ఏవ - అహం - జాతు - న - ఆసం - న - త్వం - న - ఇమే - జనాధిపాః, న - చ - ఏవ - న - భవిష్యామః - సర్వే - వయం - అతః - పరమ్.

ప్రతి॥ అహం = నేను, జాతు = ఒకప్పుడును, న ఆసం = లేకుంటిననునది, న ఏవ = లేనేలేదు, త్వం తు = నీవైతేనో, న =లేకుంటివనునది, న = లేదు, ఇమే జనాధిపాః = ఈ రాజులు, న =లేకపోయిరనునది, న = లేదు, వయం సర్వే = మనమందరము, అతః పరం = ఇకమీదను, న భవిష్యామః ఏవ చ = లేకపోదుమనునదియు, న = లేదు.

తా॥ నేను ఒకప్పుడును లేకుంటి ననునది లేనేలేదు. నీవును లేకుంటివనునది లేదు. అట్లే ఈ యుద్ధరంగమందున్న రాజులుగూడ లేకపోయిరనునది లేదు. మనమందరము ఇకమీదను ఈ శరీరము నశించిన పిమ్మటను లేకపోయెదము అనునదియు లేదు. ఆత్మ దృష్టితో అందరము నిత్యులమేనని భావము.

వి॥ శరీరములు నశించినప్పటికిని ఆత్మకు నాశములేదని ధైర్యముగలుగుట కిట్లుపదేశించడమైనది. జనన మరణములు దేహమునకేగాని ఆత్మకు లేవు. ఆత్మసనాతనము, జ్ఞానస్వరూపము.

శ్లో॥ దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాంతర ప్రాప్తిర్ధీర స్తత్ర న ముహ్యతి ॥ 13

పద॥ దేహినః - అస్మిన్ - యథా - దేహే - కౌమారం - యౌవనం - జరా, తథా - దేహాంతరప్రాప్తిః - - ధీరః - తత్ర - న - ముహ్యతి.

ప్రతి॥ దేహినః = దేహధారియగు జీవునికి, అస్మిన్ దేహే= ఈ శరీరమునందు కౌమారం = బాల్యదశ, యౌవనం = యౌవనదశ; జరా = వార్ధక్యదశయును, యథా=ఏ ప్రకారమో, తథా= ఆప్రకారమే, దేహాంతరప్రాప్తిః= మఱియొక దేహమును పొందుట,ధీరః=ఆత్మస్వరూపమిట్టిదని యెఱింగినవాడు, తత్ర = ఆ విషయమున, న ముహ్యతి = మోహమును జెందడు,

తా॥ దేహధారియగు జీవునకి శరీరమందు బాల్య, యౌవన, వార్ధక్యదశలు ఏ ప్రకారము మారి మారికలుగుచున్నవో॰ అదేవిధ

ముగ ఆత్మకును ఒక దేహమునువీడుట,మఱియొకదేహముపొందుట సహజమగుచున్నది. ఆత్మయో నిర్వికారము. ఆ కారణమువలన ఆత్మస్వరూపమిట్టిదని యెఱింగినవాడు మోహమును జెందడు,

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ ! శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత ! ॥ 14

పద॥ మాత్రాస్పర్శాః - తు - కౌంతేయ! - శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినః - అనిత్యాః - తాన్ - తితిక్షస్వ -భారత!

ప్రతి॥ హే కౌంతేయ! =కుంతీపుత్రుడవగు నో అర్జునా!. మాత్రాస్పర్శాః తు = ఇంద్రియములకుశబ్దముమొదలగువిషయములతోడగలిగెడు సంయోగములైతేనో, శీతోష్ణసుఖదుఃఖదాః=శీతమును, ఉష్ణమును వాటిద్వారా సుఖదుఃఖముల నిచ్చునవి,ఆగమాపాయినః=రాకపోకలుగలిగినవి,అనిత్యాః= అశాశ్వతములునుఅయినవి.కావున,హే భారత!=ఓభరతకులసంభవుడా!, తాన్ = వాటిని, తితిక్షస్వ = సహింపుము.

తా॥ కుంతీపుత్రుడవగు నో అర్జునా!ఇంద్రియములకు శబ్దాది విషయములతోడ గలిగెడు సంయోగములు శీతోష్ణములను,తన్మూలకముగ సుఖదుఃఖములను గలుగజేయుననియు, రాకపోకలు కలిగినట్టివియు, స్థిరములు కానట్టివియు, నగుచున్నవి. ఓ భారతా! కావున వానిని ఓర్చుకొనుము.

వి॥ ప్రపంచములో పనిచేయువాడెట్టి మహాత్ముడైనను స్తుతినిందలను, సుఖదుఃఖములను, లాభనష్టములను పొందుచుండును. అవి దినరాత్రులవలెను, శుక్ల-కృష్ణపక్షములవలెను తప్పక గలుగును కాని అవి అస్థిరములని తలంచి, వానిని ఓర్చుకొనుటయే కార్యనిర్వహణధీరులయిన మహాత్ములయొక్క స్వభావమై యుండును. కావున, అట్టి మనోధైర్యము లేనివాడు ప్రపంచములో ఎట్టిచిన్న కార్యమైనను చేయజాలడు. అయితే మూఢసహనము పనికిరాదు. సత్యధర్మముల నుండి చలింపని సహనము గలిగియుండవలెను.ఆకాశములో అనేక రంగులతో గూడిన మేఘములు, ఉఱుములు మెఱుపులును ఉన్నను, సూర్యగ్రహనక్షత్రాదులు సంచరించుచున్నను, ఆకాశమేలగున స్వచ్ఛమై, నిశ్చలమై, నిర్మలమై పైచెప్పినవాటి నన్నిటిని అతిక్రమించి నిస్సంగమై నిలిచియున్నదో, అటులనే

శీతోష్ణములకు, సుఖదుఃఖములకు లొంగక స్థిరుడై, నిశ్చలుడై, అసంగుడై, నిలిచియున్నవాడు ద్వంద్వాతీతుడనబడును. లోకమును విడిచి జ్ఞాని యుండుట లేదు. అయితే లోకముచే గలిగెడు ద్వంద్వముల నంటక తాను నిర్వికారుడై సాక్షియై యుండును.

శ్లో॥ యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ !
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥ 15

పద॥ యం హి - న - వ్యథయంతి - ఏతే - పురుషం - పురుషర్షభ,
సమదుఃఖసుఖం - ధీరం - సః - అమృతత్వాయ - కల్పతే.

ప్రతి॥ హే పురుషర్షభ! = పురుషశ్రేష్ఠుడవగు నో అర్జునా! హి = ఏలయనగా, సమదుఃఖసుఖం=సుఖదుఃఖములయందుసమభావముగలవాడును,ధీరం= దృఢచిత్తముగలవాడునునైన ,యం పురుషం = ఏ పురుషుని, ఏతే = ఈ ద్వంద్వములు, న వ్యథయంతి =చలింపచేయవో, సః = ఆ పురుషుడు, అమృతత్వాయ = మోక్షముకొఱకు, కల్పతే = అర్హుడగుచున్నాడు.

తా॥ పురుషశ్రేష్ఠుడవగు నో యర్జునా!సుఖదుఃఖములయందు సమభావము గలవాడును, కార్యనిర్వహణమందు దృఢచిత్తము గలవాడునునైన ఏ పురుషునైతే యీ మాత్రాస్పర్శములు (ఇంద్రియ విషయ సంయోగములు) బాధింపవో అతడు మోక్షమునకు అర్హుడగు చున్నాడు.

వి॥ ఇప్పుడు లోకములో సామాన్యముగా ముక్తులమని తలంచువారిట్టి ద్వంద్వాతీతస్థితి తమకు గలిగినదా? లేదా? యని చూచుకొనుచుండవలయును. నదిలోజలవేగము,అలలు ఉన్నప్పటికిని,లేక నదియొక్క పైభాగమున అనేకము లగుపడవలువచ్చుచు పోవుచున్నప్పటికిని,లేక సముద్రముయొక్కఆటుపోటులచే జలముపొంగినను తగ్గినను,అగాధభాగముననుండు పర్వతఖండము లేక గుండు రాయి యెట్లు చలింపకయుండునో, అలాగునే ప్రకృతియను ప్రవాహమున వచ్చుచు పోవుచు అస్థిరములైయున్న శీతోష్ణాది ద్వంద్వములకు శబ్దస్పర్శాది విషయములకు లొంగక స్థితప్రజ్ఞుడు గుండురాతివలె స్థిరుడై నిర్వికారుడై యుండును. అలలచే పైభాగములో నుండు పడవలు, ఓడలు చలించునట్లు, మూడుదేహములకు సాక్షియగు ఆత్మను పొందని జీవుడు దృశ్యసుఖదుఃఖాది ద్వంద్వములచే విచలితుడై వ్యథను పొందుచుండును,

శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥ 16

పద॥ న అసతః - విద్యతే - భావః - న - అభావః - విద్యతే - సతః,
ఉభయోః - అపి - దృష్టః- అంతః - తు - అనయోః- తత్త్వదర్శిభిః

ప్రతి॥ అసతః = లేనిదానికి, భావః=ఉనికి, న విద్యతే=లేదు, సతః=కలదానికి, అభావః = లేకుండుట, న విద్యతే= లేదు, అనయోః = ఈ, ఉభయోః అపి=రెండింటియొక్కయు, అంతః తు=నిశ్చయమైతేనో,తత్త్వదర్శిభిః = తత్త్వజ్ఞానులచేత, దృష్టః = తెలిసికొనబడెను.

తా॥ లేని పదార్థము లేనేలేదనియు, ఉండేపదార్థమునకు లేక పోవుట యనునది లేదనియు అనగా అసత్పదార్థమునకు ఉనికిలేద నియు, సత్పదార్థమునకు అభావము అసంభవమనియు తత్త్వజ్ఞాను లగువారీ రెంటియొక్క నిశ్చయమును, చివరి నిష్కర్షను తెలిసికొని యున్నారు.

వి॥ చీకటియను ఒక పదార్థము సృష్టిలోలేదు.అయితే అది యున్నదానిని కనబడకుండజేయును.అంతేగాదు భయమునుగలుగజేయును.మార్గమును తెలియ నీయదు. అయితే అదేమని విచారణచేసి చూచిన, ప్రకాశముయొక్క అభావమే యగును. కనుక అజ్ఞానమనునది ఒకటిలేదు. అది జ్ఞానాభావమే. కనుకనే "బ్రహ్మ సత్యంజగన్మిథ్యా" అని శ్రుతి తెలిపెడి రహస్యము.దీనినిపరిశోధనచేసితెలిసికొన తలంచెడివారు ఏ రంధ్రమునులేనిగృహములోరాత్రికాలమున ఒకదీపమును వెలి గించుట మఱల ఆర్పుట- చేసిచూచిన తెలియగలరు, దీపము వెలిగించునప్పుడు చీకటి యెక్కడికి పోవుచున్నది? దీపము ఆర్పునప్పుడు చీకటి యెక్కడనుండి వచ్చుచున్నది? ఈ లాగున రెండు మూడుసారులు దీపమును వెలిగించి ఆర్పి చూచిన సూక్ష్మబుద్ధి గలవారికి దీని రహస్యను గోచరమగును.

శ్లో॥ అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి ॥ 17

పద॥ అవినాశి - తు - తత్ - విద్ధి - యేన - సర్వం - ఇదం - తతం,
వినాశం - అవ్యయస్య - అస్య - న కశ్చిత్ - కర్తుం - అర్హతి.

ప్రతి॥ యేన = ఏ ఆత్మచేత, ఇదం సర్వం=ఈ సమస్త ప్రపంచము, తతం = వ్యాపింపబడియున్నదో, తత్ తు = ఆ యాత్మనైతేనో,అవినాశి = నాశ

రహితమైనదానినిగా, విద్ధి = ఎఱుంగుము, అవ్యయస్య = నాశములేని, అస్య = ఈ యాత్మకు, వినాశం = నాశమును, కర్తుం = చేయుటకు, కశ్చిత్ = ఎవడును, న అర్హతి = అర్హుడుగాడు.

తా॥ ఏ ఆత్మచేత ఈ సమస్త ప్రపంచము వ్యాపింపబడి యున్నదో, ఆ యాత్మ నాశరహితమైనదని తెలిసికొనుము. నాశము లేని యీ యాత్మను నశింపజేయుటకు ఎవడును సమర్థుడు గాడు.

వి॥ ఆత్మను నశింపజేయుటకు ఎట్టివానికైన సాధ్యముగాదు అని దృఢ బోధగలుగుటకు ఇట్లుపదేశించడమైనది.

శ్లో॥ అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత!॥ 18

పద॥ అన్తవన్తః - ఇమే - దేహాః - నిత్యస్య - ఉక్తాః - శరీరిణః, అనాశినః - అప్రమేయస్య - తస్మాత్ - యుధ్యస్వ -భారత !

ప్రతి॥ నిత్యస్య = శాశ్వతముగా నుండువాడును, అనాశినః =నాశరహితుడును, అప్రమేయస్య =కేవలము శాస్త్రప్రమాణములచే తెలియబడతగనివాడును (అగోచరుడును) నగు, శరీరిణః=దేహధారియగు జీవునియొక్క, ఇమే దేహాః = ఈ శరీరములు, అన్తవన్తః = నశించునట్టివి అని, ఉక్తాః = చెప్పబడినవి, తస్మాత్ = అందువలన, హే భారత ! = ఓ అర్జునా!, యుధ్యస్వ = యుద్ధము చేయుము.

తా॥ శాశ్వతముగ నుండువాడును, నాశరహితుడును, కేవలము శాస్త్ర ప్రమాణములచే తెలియబడనివాడును నగు జీవునియొక్క యీ శరీరములు నశించునట్టివని తత్త్వజ్ఞానులచే చెప్పబడినది. కావున ఓ అర్జునా! యుద్ధము జేయుము.

శ్లో॥ య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే॥ 19

పద॥ యః - ఏనం-వేత్తి - హంతారం - యః - చ - ఏనం-మన్యతే-హతం, ఉభౌ - తౌ - న విజానీతః - న - అయం -హంతి - న – హన్యతే.

ప్రతి॥ యః = ఎవడు, ఏనం = ఈ ఆత్మను, హంతారం = చంపుదానినిగా, వేత్తి = తలంచుచున్నాడో, యః చ = ఎవడైతే, ఏనం = ఈ ఆత్మను హతం = చంపబడుదానినిగా, మన్యతే = తలంచుచున్నాడో, తౌ ఉభౌ =

వారిరువురును, న విజానీతః = తత్త్వమును తెలిసినవారుకారు, అయం= ఈ ఆత్మ,నహన్తి=చంపునదికాదు, న హన్యతే =చంపబడునదియు కాదు.

తా॥ ఎవరు ఆత్మను చంపుదానినిగాను లేక చంపబడుదానిని గాను దలంచుచున్నారో, వారుభయులును తత్త్వమును దెలిసినవారు కారు. ఈ ఆత్మ ఒరులను జంపునదికాదు మఱి యితరులచే చంప బడునదియు కాదు.

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి-
న్నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ 20

పద॥ న - జాయతే - మ్రియతే - వా - కదాచిత్ - న - అయం - భూత్వా- భవితా - వా - న - భూయః - అజః - నిత్యః - శాశ్వతః - అయం - పురాణః - న - హన్యతే - హన్యమానే - శరీరే.

ప్రతి॥ అయం=ఈ ఆత్మ,కదాచిత్ = ఎప్పటికిని, న జాయతే = పుట్టునదికాదు, న మ్రియతే వా = చచ్చునదియునుకాదు, న భూత్వా=ఇదివరకులేకుండి, భూయః=మఱల, భవితావాన = కలుగునదియు (పుట్టునదియు) కాదు. మఱేమనిన, అయం = ఈ ఆత్మ, అజః = పుట్టుకలేనిది, నిత్యః = నిత్యమైనది,శాశ్వతః=ఎల్లప్పుడునుండునది, పురాణః =పురాణమైనది (అనాదియైనది) కనుక, శరీరే = దేహము, హన్యమానే = చంపబడుచున్నను, (ఈ యాత్మ) న హన్యతే = చంపబడదు.

తా॥ ఈ ఆత్మ యెప్పటికిని పుట్టునదికాని, మరణమును బొందునదికాని కాదు. మఱియు కొంతకాలముండి పిమ్మట లేక పోవునదికాని, కొంతకాలము లేకుండ పిమ్మట నుండునది కానికాదు, కావున నీ ఆత్మ పుట్టుక లేనిదనియు, నాశములేనిదనియు, సర్వకాలములయందును ఒకేవిధముగా నుండునదనియు,అనాదియైనదనియును తెలిసికొనుము. కావుననే శరీరము మారిపోవుచున్నప్పటికిని ఈ యాత్మ మారిపోవునదికాదు.

వి॥ ఆత్మ సనాతన స్వరూపమని జ్ఞానము గలిగినచో మఱల పుట్టుట, కర్మముచేయుట, కర్మఫలము ననుభవించుట అనునవి గలుగవు. అప్పుడు సంచి

తము, ఆగామి, ప్రారబ్ధము అను కర్మలను గుఱించి యేమియు సందేహము కలుగదు. దీనినే వేదాంతశాస్త్రముయొక్క పరాకాష్ఠయగు "తత్త్వమసి" అను మహావాక్యముపదేశించుచున్నది. అయితే యెంతవఱకు ప్రారబ్ధకర్మ ప్రతీతమగుచున్నదో, అంతవఱకు 'తత్త్వమసి' మహావాక్యార్థము అనుభవమునకురాలేదని తలంచి శమాది సహితుడై శ్రవణ మనన నిదిధ్యాసములను జేయుచుండవలెను.

శ్లో॥ వేదావినాశినం నిత్యం య ఏన మజమవ్యయమ్ ।
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హన్తి కమ్ ॥ 21

పద॥ వేద - అవినాశినం - నిత్యం - యః ఏనం - అజం - అవ్యయం, కథం - సః - పురుషః - పార్థ - కం - ఘాతయతి - హన్తి -కమ్.

ప్రతి॥ హే పార్థ! = ఓ అర్జునా!, యః = ఎవడు, ఏనం = ఈ ఆత్మను, అజం= జన్మలేనిదానినిగను, నిత్యం=నిత్యమైనదానినిగను, అవ్యయం=క్షయము లేనిదానినిగను, అవినాశినం=వినాశము లేనిదానినిగను,వేద=తెలిసికొనుచున్నాడో, సః పురుషః=అట్టి పురుషుడు, కథం = ఎట్లు, కం= ఎవనిని, ఘాతయతి = చంపించుచున్నాడు!, కం = ఎవనిని, హంతి = చంపుచున్నాడు!

తా॥ ఓ అర్జునా ! ఈ యాత్మ జన్మలేనిదనియు, నిత్యమైనదనియు, క్షయించునదికాదనియు, నాశములేనిదనియు, ఎవడుతెలిసికొనుచున్నాడో' అట్టి పురుషుడు ఎవనిని యెట్లు చంపించును? ఎవనిని యెట్లు చంపును?

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ॥22

పద॥ వాసాంసి – జీర్ణాని – యథా - విహాయ - నవాని - గృహ్ణాతి - నరః – అపరాణి – తథా–శరీరాణి – విహాయ–జీర్ణాని -- అన్యాని – సంయాతి నవాని – దేహీ.

ప్రతి॥ నరః = మనుష్యుడు, యథా = ఏ ప్రకారము, జీర్ణాని = చినిగిపోయిన, వాసాంసి = వస్త్రములను, విహాయ = విడిచి, నవాని = నూతనములైన, అపరాణి = ఇతరవస్త్రములను, గృహ్ణాతి = గ్రహించుచున్నాడో, తథా= ఆ ప్రకారము, దేహీ = ఆత్మ, జీర్ణాని = శిథిలములైన, శరీరాణి=దేహములను, విహాయ = విడిచి, నవాని = నూతనములైన, అన్యాని = ఇతర దేహములను, సంయాతి = పొందుచున్నాడు.

తా॥ మనుష్యుడు ఏ ప్రకారము చినిగిపోయిన వస్త్రములను విడిచి నూతనములైన వస్త్రములను గ్రహించుచున్నాడో, ఆ ప్రకారము ఆత్మ, ముసలితనము రోగము మొదలగువానిచే శిథిలములగు దేహములను వదలి, క్రొత్తక్రొత్త దేహములను పొందుచున్నది.

వి॥ ప్రాత ప్రాత బట్టలను విడిచి క్రొత్త క్రొత్త బట్టలను గ్రహించు చున్నప్పటికిని మనుజుడు ఏలాగున మారకయుంటున్నాడో, అట్లే ఉపాధిభూతము లైన దేహములు మారినను ఆత్మ నిర్వికారమని గ్రహించవలయును. ఆత్మకు ఎన్నటికిని నాశములేదు, అది నిత్యము, సనాతనము.

శ్లో॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః ॥ 23

పద॥ న – ఏనం – ఛిందంతి – శస్త్రాణి – న – ఏనం – దహతి – పావకః,
న – చ – ఏనం – క్లేదయంతి – ఆపః – న – శోషయతి – మారుతః,

ప్రతి॥ ఏనం=ఈ ఆత్మను. శస్త్రాణి=ఆయుధములు, న ఛిందంతి=ఛేదింపజాలవు, ఏవం=ఈ ఆత్మను, పావకః = అగ్ని, న దహతి = కాల్పజాలదు, ఆపః చ = ఉదకమున్ను, ఏనం–ఈ ఆత్మను,న క్లేదయంతి = తడుపజాలదు, మారుతః=వాయువు,ఏనం=ఈఆత్మను,నశోషయతి=కృశింపజేయజాలదు.

తా॥ ఈ యాత్మను శస్త్రములు ఛేదింపలేవు. అగ్నిహోత్రుడు కాల్పజాలడు. ఉదకము తడుపజాలదు. వాయువు ఎండింపజాలదు.

వి॥ పంచభూతములను మార్పుచేయ సాధ్యమగును. కాని ఆత్మ పంచ భూతముల కతీతమగుటవలన అవి ఆత్మను ఏమియు చేయజాలవు.

శ్లో॥ అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్యస్సర్వగతస్థాణురచలోఽయం సనాతనః ॥ 24

పద॥ అచ్ఛేద్యః – అయం–అదాహ్యః – అయం–అక్లేద్యః–అశోష్యః–ఏవ–చ,
నిత్యః – సర్వగతః – స్థాణుః – అచలః – అయం – సనాతనః.

ప్రతి॥ అయం=ఈ ఆత్మ, అచ్ఛేద్యః=ఛేదింపదగినదికాదు, అయం=ఈయాత్మ, అదాహ్యః = దహింపదగినదికాదు, అక్లేద్యః = తడుపదగినదికాదు. అశోష్యః ఏవ చ=ఎండింపదగినదియు కాదు, అయం=ఈ ఆత్మ, నిత్యః= త్రికాలములయందు నేకరీతిగా నుండునది,సర్వగతః=సర్వవ్యాపకమైనది, స్థాణుః = నిశ్చలమైనది, అచలః = చలింపనిది, సనాతనః = సనాతన మైనదియు నై యున్నది,

తా॥ ఈ ఆత్మ శస్త్రాదులచే ఛేదింపదగినదికాని అగ్నిచే దహింప దగినదికాని, నీటిచే నానృదగినదికాని, గాలిచే శుష్కింపదగినది కాని కానేరదు. ఇయ్యది నిత్యము, సర్వవ్యాపకము, నిశ్చలము, నిర్వికారము, సనాతనమునై యున్నది.

వి॥ పై జెప్పిన శ్లోకభావమునే తరువాతను జెప్పుటకు కారణమేమన, అగ్రాహ్య (దుర్బోధ) విషయము బోధపడేలాగున జెప్పునప్పుడు రెండుసార్లు చెప్పుట శాస్త్రమర్యాదయై యున్నది. ఈ విషయములో ద్విరుక్తిదోషములేదు. సనాతన మతప్రచారకులు భగవంతుడుపదేశించిన యీ 'సనాతన'పదముయొక్క అర్థమును గ్రహించిన లోకమున కెంతో మేలు గలుగును. అట్లుగాక దేహమును గుఱించిన వర్ణాశ్రమములు సనాతనధర్మములని చెప్పుటవలన దేశమింత హీన స్థితికి వచ్చినది.

"విస్మయే చ విషాదే చ దైన్యే చైవావధారణే ।
తథా ప్రసాదనే హర్షే వాక్యమేకం ద్విరుచ్యతే ॥"

విస్మయమందును, విషాదమందును,దీనభావమందును, తత్త్వావధారణయందును, అనుగ్రహమందును, హర్షమందును ద్విరుక్తి ప్రయోగము గలదు.

శ్లో॥ అవ్యక్తోఽయమచిన్త్యోఽయ మవికార్యోఽయముచ్యతే ।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి ॥ 25

పద॥ అవ్యక్తః. అయం – అచింత్యః–అయం–అవికార్యః –అయం – ఉచ్యతే, తస్మాత్ – ఏవం – విదిత్వా – ఏనం – న – అనుశోచితుం –అర్హసి.

ప్రతి॥ అయం = ఈ యాత్మ, అవ్యక్తః = ఇంద్రియములకు గోచరము గానిది, అయం=ఈ యాత్మ, అచింత్యః=మనస్సునకు గోచరము కానిది, అయం= ఈ యాత్మ, అవికార్యః = వికారమును బొందనిదనియు, ఉచ్యతే=చెప్పబడుచున్నది.తస్మాత్=అందువలన, ఏవం =ఈ చెప్పబడిన ప్రకారముగా ఏనం= ఈ యాత్మను. విదిత్వా=తెలిసికొని, అనుశోచితుం = దుఃఖించుటకు. న అర్హసి = తగవు.

తా॥ ఆత్మ యింద్రియములచే తెలియ శక్యముకానిదనియు, వికారము లేనిదనియు, మనస్సునకుగూడ గోచరముకానిదనియును చెప్పబడుచున్నది. అందువలన ఈ ప్రకారముగా ఆత్మ మనోబుద్ధీంద్రియములకు గోచరముకానిదనియు, నిర్వికారమైనదనియు, నిత్యమైన దనియును తెలిసికొని దుఃఖింపతగవు.

వి॥ ఇంద్రియములను ప్రకాశింప చేయునది ఆత్మ యగుటచే, ఇంద్రియములు ఆత్మను తెలిసికొనజాలవు. ఇంద్రియములు జడములు. ఆత్మ స్వప్రకాశము.

శ్లో॥ అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాఽపి త్వం మహాబాహో! నైవం శోచితుమర్హసి ॥ 26

పద॥ అథ – చ – ఏనం – నిత్యజాతం – నిత్యం – వా – మన్యసే – మృతం, తథా – అపి – త్వం – మహాబాహో ! – న-ఏవం – శోచితుం-అర్హసి

ప్రతి॥ హే మహాబాహో! = ఓ అర్జునా!, అథ చ = మఱియు, ఏనం = ఈ యాత్మను, నిత్యజాతం=సదా పుట్టుచుండెడు దానినిగాగాని, నిత్యం మృతం వా = సదా చచ్చుచుండెడు దానినిగాగాని, మన్యసే=తలంతువేమో, తథా అపి = అట్లైనను, త్వం=నీవు, ఏవం=ఈప్రకారముగా, శోచితుం=దుఃఖించుటకు, న అర్హసి=తగవు.

తా॥ ఓ అర్జునా! ఒకవేళ నీవు ఈ యాత్మ సర్వకాలముల యందును పుట్టుచుండు ననియు, మరణమును పొందుననియును, తలతువేమో అట్లైనను ఆట్లు జననమరణములు గలుగుట సహజమే గనుక, నీవిట్లు వ్యసనమును పొందుట (దుఃఖించుట) తగదు.

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ!
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి ॥ 27

పద॥ జాతస్య – హి – ధ్రువః – మృత్యుః – ధ్రువం – జన్మ – మృతస్య – చ, తస్మాత్ — అపరిహార్యే — అర్థే — న — త్వం — శోచితుం — అర్హసి.

ప్రతి॥ జాతస్య=జననము నొందినవానికి, మృత్యుః=మరణము, ధ్రువః=నిశ్చయము, మృతస్య=మరణము నొందినవానికి, జన్మ చ=జననము పొందుటయు, ధ్రువం హి=నిశ్చయమేగదా, తస్మాత్=కాబట్టి, అపరిహార్యే=నివారింపదగని, అర్థే=విషయమునందు, త్వం=నీవు, శోచితుం=దుఃఖించుటకు, న అర్హసి=తగవు.

తా॥ పుట్టినవానికి చావును చచ్చినవానికి పుట్టుకయును నిశ్చయమై యున్నది. కావున అనివార్యముగా కలుగుచున్న యీ జనన మరణముల విషయమై నీవు దుఃఖించుట యుక్తము గాదు.

వి॥ 24–వ శ్లోకమున ఆత్మ సనాతనమనియు,26–వశ్లోకమున ఆత్మకు జనన మరణములు స్వభావములనియు, 27–వశ్లోకమున జన్మమెత్తినవానికి మరణము అనివార్యమనియు మూడు విధములుగ నుపదేశించడ మైనది. ఈ మూడు విధములుగా యోచించినను ఆత్మ నశించునని తలంచ నవసరములేదు.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత !
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥ 28

పద॥ అవ్యక్తాదీని – భూతాని - వ్యక్తమధ్యాని – భారత!,
అవ్యక్తనిధనాని – ఏవ - తత్ర - కా - పరిదేవనా.

ప్రతి॥ హే భారత!=ఓ అర్జునా!. భూతాని=శరీరములు, అవ్యక్తాదీని=కనబడని మొదలుగలవియు, వ్యక్తమధ్యాని=కనబడుచున్నమధ్యభాగముగలవియు, అవ్యక్తనిధనాని ఏవ=కనబడని నాశము గలవియు(నగుచున్నవి), తత్ర= అట్టి శరీరవిషయమై, పరిదేవనా = దుఃఖము, కా = ఏల?

తా॥ ఓ అర్జునా ! శరీరములు కనపడని మొదలుగలవియు, కనబడుచున్న మధ్యము గలవియు, కనపడని నాశము కలవియునై యున్నవి. అనగా ఆదిలో కానరాక, మధ్యలో కనిపించుచు, పిదప అదృశ్యములగు చున్నవి. అట్టి అస్థిరములైన శరీరముల విషయమై యేల దుఃఖింపవలయును?

వి॥ దేనికి ఆదియు అంతములేదో అదిమధ్యకనిపించినను లేనిదియగును. ఎండమావు లుదయమందును అస్తమయమందును కనబడవు. మధ్యాహ్నమున మాత్రము గనుపించును.అయితే విచారించిన అచట (అపుడుగూడ) జలములేదు. ఈశరీరములయొక్క స్థితియు అలాగుననేయుండును. దీనిని బాగుగాఆలోచించిన యిక దేహమును గురించి యేల చింతింపవలెను? భ్రాంతిమాత్రమని భావము.

శ్లో॥ ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః !
ఆశ్చర్యవచ్చైనమన్యశ్శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్॥ 29

పద॥ ఆశ్చర్యవత్ - పశ్యతి - కశ్చిత్ – ఏనం–ఆశ్చర్యవత్ – వదతి –తథా - ఏవ - చ - అన్యః - ఆశ్చర్యవత్ - చ - ఏనం - అన్యః - శృణోతి - శ్రుత్వా -అపి - ఏనం - వేద - న - చ - ఏవ - కశ్చిత్.

ప్రతి॥ కశ్చిత్ = ఒకానొకడు, ఏనం = ఈ ఆత్మను, ఆశ్చర్యవత్ = అద్భుతమైన దానినిగా, పశ్యతి = చూచుచున్నాడు, అన్యః = మఱియొకడు, తథా ఏవ = అలాగుననే, ఆశ్చర్యవత్ = అద్భుతమైనదానినిగా, వదతి చ = చెప్పు చున్నాడు, అన్యః = ఇంకొకడు, ఏనం = ఈ యాత్మను, ఆశ్చర్యవత్ = అద్భుతమైనదానినిగానే, శృణోతి = వినుచున్నాడు, శ్రుత్వా చ = విని యును, కశ్చిత్ అపి = ఎవడును, ఏనం = ఈ యాత్మతత్త్వముయొక్క యాథార్థ్యమును, న వేద ఏవ = ఎఱుగనే యెఱుగడు.

తా॥ ఒకానొకడు ఈ యాత్మను అద్భుతమైనదానినిగా జూచు చున్నాడు. మఱియొకడదేప్రకారముగ దీనిని అద్భుతమైనదానినిగా జెప్పుచున్నాడు. ఇంకొకడు. దీనిని (ఈ యాత్మను) ఆశ్చర్యకర ముగా వినుచున్నాడు. ఈ విధముగా ఆశ్చర్యకరముగా జూచియు, జెప్పియు, వినియు నెవడును ఈ యాత్మతత్త్వముయొక్క యాథార్థ్య మును ఎఱుగనే యెఱుగుట లేదు.

వి॥ ఆత్మను జూచువాడును, చెప్పువాడును, వినువాడును ఆశ్చర్యము గలవారగునప్పుడు ఇక సాక్షాత్కారము నొందినవాడెంత పరమాశ్చర్యమును పొందగల్గును? ఇచట దీనియందు చూచువాడని చెప్పుటచే చూడబడెడు వస్తువు చూచువానికి అన్యముగా నుండును. చూచుట చూడబడుట అనునివి లేనిస్థితియే సాక్షాత్కారజ్ఞానమగును. పై చెప్పిన మూడింటిలోను త్రిపుటిగలదు. దీనియందు త్రిపుటిలేదు. కనుకనే యాత్మజ్ఞానము గలిగిన అతిహర్షము గలుగు ననియు, సంపూర్ణశోకశాంతి సిద్ధించుననియు వేదాంతశాస్త్రము తెలుపుచున్నది.

శ్లో॥ దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ! ।
తస్మాత్సర్వాణి భూతాని నత్వం శోచితుమర్హసి ॥ 30

పద॥ దేహీ - నిత్యం - అవధ్యః - అయం - దేహే - సర్వస్య - భారత !
తస్మాత్ - సర్వాణి - భూతాని - న - త్వం - శోచితుం - అర్హసి.

పద॥ హే భారత! = భరతవంశీయుడవగు నో అర్జునా! సర్వస్య = పిపీలికాది బ్రహ్మ పర్యంతముగల సమస్త జంతుసమూహముయొక్క, దేహే = శరీరము నందలి, అయందేహీ = ఈ యాత్మ, నిత్యం = ఎప్పుడును, అవధ్యః = చంపదగినదికాదు, తస్మాత్ = ఆ కారణమువలన, త్వం = నీవు, సర్వాణి = సమస్తములైన, భూతాని = జీవాత్మలను గురించి, శోచితుం = దుఃఖించుటకు, న అర్హసి = తగవు.

తా॥ భరతవంశీయా! ఓ అర్జునా! సమస్త ప్రాణులయొక్క దేహములు సంహరింపబడినప్పటికిని యీ యాత్మయెప్పుడును జంపబడదు. కావున నీవుసమస్తములైన జీవులను గురించి శోకింపవలదు.

శ్లో॥ స్వధర్మమపి చావేక్ష్య న వికంపితు మర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే 31

పద॥ స్వధర్మం - అపి - చ - అవేక్ష్య - న - వికంపితుం - అర్హసి,
ధర్మ్యాత్-హి - యుద్ధాత్- శ్రేయః-అన్యత్ -క్షత్రియస్య - న - విద్యతే.

ప్రతి॥ స్వధర్మం = స్వకీయమగు క్షత్రియధర్మమును, అవేక్ష్యఅపి=ఆలోచించియైనను, వికంపితుం = చలించుట, న అర్హసి=తగవు. హి=ఏలయనగా, క్షత్రియస్య = క్షత్రియునకు, ధర్మ్యాత్ = ధర్మయుక్తమైన, యుద్ధాత్= యుద్ధమునకంటె, శ్రేయః = శ్రేయస్కరమైనది, అన్యత్= మఱియొకటి, న విద్యతే = లేదు.

తా॥ స్వకీయమగు క్షత్రియధర్మము నాలోచించినప్పటికిని నీవు చలించుట కర్హుడవుగావు. ఏలయనగా, క్షత్రియునకు ధర్మయుక్తమైన యుద్ధమునకంటె మఱియొకటి శ్రేయస్కరమైనది లేదు.

వి॥ యుద్ధమైనను ధర్మయుక్తముగానుండవలెను. మఱియుఆత్మయజ్ఞము ఎటువంటిదో, అట్టిదే ఆత్మయుద్ధముగూడ. ఆత్మయొక్క సనాతనమగు మోక్షసామ్రాజ్యము మాయచే ఆక్రమింపబడినది. ఇపుడు ముముక్షువైనవాడు గొప్ప యోధునివలె ధీరుడై శత్రువగు అవిద్యనురూపుమాపి అవిద్యాసంబంధవృత్తులను రహితమొనర్చి మోక్షసామ్రాజ్యపట్టాభిషిక్తుడు గావలెను.

శ్లో॥ యదృచ్ఛయాఽచోపపన్నం స్వర్గద్వారమపావృతమ్!
సుఖినః క్షత్రియాః పార్థ! లభంతే యుద్ధమీదృశమ్ ॥ 32

పద॥ యదృచ్ఛయా - చ - ఉపపన్నం - స్వర్గద్వారం - అపావృతం,
సుఖినః - క్షత్రియాః - పార్థ - లభంతే - యుద్ధం - ఈదృశమ్.

ప్రతి॥ హే పార్థ!=ఓ యర్జునా!. యదృచ్ఛయా=అప్రయత్నముగా. ఉపపన్నం= లభించినదియు,అపావృతం=తెరువబడినదగు,స్వర్గద్వారంచ=స్వర్గద్వారరూపమైనదియునగు, ఈదృశం =ఇట్టి, యుద్ధం=యుద్ధమును, సుఖినః= ధన్యాత్ములగు, క్షత్రియాః = క్షత్రియులు, లభంతే = పొందుచున్నారు.

తా॥ ఓ అర్జునా! అప్రయత్నముగా లభించినదై స్వర్గమునకు తెరువబడిన ద్వారరూపమైనదగు నిట్టి యుద్ధము ధన్యులు,పుణ్యాత్ములునగు రాజులకు మాత్రమే లభించును.

వి॥ ముముక్షుత్వముగలిగి అరిషడ్వర్గమును రహితమొనర్చుటకు శుభేచ్ఛ యెప్పుడు కలుగునో అపుడు వారు బ్రహ్మసుఖమును బొందగలరు.

శ్లో॥ అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి।
తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి॥ 33

పద॥ అథ – చేత్ – త్వం – ఇమం – ధర్మ్యం – సంగ్రామం–న–కరిష్యసి, తతః – స్వధర్మం – కీర్తిం – చ – హిత్వా – పాపం – అవాప్స్యసి.

ప్రతి॥ అథ = పిమ్మట, త్వం = నీవు,ధర్మ్యం = స్వధర్మయుక్తమైన, ఇమం సంగ్రామం =ఈ యుద్ధమును, నకరిష్యసిచేత్=చేయకపోతివేని, తతః= అందువలన, స్వధర్మం = క్షత్రియకులధర్మమును, కీర్తించ=కీర్తినిన్ని, హిత్వా = వదలి,పాపం = దోషమును. అవాప్స్యసి = పొందగలవు.

తా॥ అట్లుగాక, నీవు ధర్మయుక్తమైన యుద్ధమును జేయక యూరకుంటివేని కులధర్మమును విడిచినవాడవగుదువు; కీర్తిని పోగొట్టుకొనినవాడవును అగుదువు. ఇట్లు ధర్మకీర్తులను రెంటిని వదలు కొనుటవలన పాపమును బొందుదువు.

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్!
సంభావితస్య చాకీర్తి ర్మరణాదతిరిచ్యతే ॥ 34

పద॥ అకీర్తిం - చ - అపి - భూతాని – కథయిష్యంతి – తే - అవ్యయాం సంభావితస్య - చ - అకీర్తిః - మరణాత్ - అతిరిచ్యతే.

ప్రతి॥ అపి చ=మఱియును, భూతాని=ప్రాణులు. తే=నీయొక్క, అవ్యయాం= చిరకాలమువఱకుమాయకుండునట్టి.అకీర్తిం=అపయశస్సును,కథయిష్యంతి చెప్పుకొందురు, సంభావితస్య = గౌరవస్థునికి, అకీర్తిః = అపయశస్సు. మరణాత్ చ=మరణముకంటెను, అతిరిచ్యచే = అధికమైనదగుచున్నది.

తా॥ మఱియును నీవు యుద్ధముచేయనిచో జనులు మాయ కుండునట్టి నీ యొక్క అపయశస్సును చిరకాలము చెప్పుకొనుచుం

దురు. గౌరవస్థునికి అవమానము మరణము కంటెను అధికమైనద
చున్నది.

వి॥ పూజ్యులకు అపకీర్తిగలుగుటమరణమునకన్నను దుఃఖకరమైనది యగున

శ్లో॥ భయాద్రణాదుపరతం మన్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చత్వం బహుమతో భూత్వాయాస్యసి లాఘవమ్॥3

పద॥ భయాత్ – రణాత్ – ఉపరతం - మన్యన్తే - త్వాం - మహారథా
యేషాం - చ – త్వం – బహుమతః - భూత్వా–యాస్యసి-లాఘవమ్

ప్రతి॥ యేషాం = ఎవరికి, త్వం = నీవు, బహుమతః = సన్మానింపబడతగి
వాడవుగానుంటివో, అట్టి మహారథాః చ = మహారథులుగూడ, త్వాం
నిన్ను. భయాత్=భయమువలన, రణాత్=యుద్ధమునుండి, ఉపరతం
మఱలినవానినిగా, మన్యంతే=తలంతురు, భూత్వా = అట్లు తలంపబడి
వాడవై, లాఘవం = చులకదనమును, యాస్యసి = పొందగలవు.

తా॥ ఎవరు నిన్ను ఇంతవఱకు గౌరవముగా జూచిరో అ
మహారథులుకూడ నిన్ను నిప్పుడు పిఱికితనము వలన యుద్ధరంగమ
నుండి పారిపోయిన వానినిగా తలంతురు. అందువల్ల నీవు చుల
దనమును పొందగలవు.

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యంతి తవాహితాః।
నిందంతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ 36

పద॥ అవాచ్యవాదాన్ - చ – బహూన్ - వదిష్యంతి – తవ - అహితాః,
నిందంతః - తవ - సామర్థ్యం - తతః - దుఃఖతరం - ను - కిమ్.

ప్రతి॥ తవ -నీయొక్క, సామర్థ్యం =శక్తిని, నిందంతః= నిందించుచున్నవారై
తవ=నీయొక్క, అహితాః చ =శత్రువులును, బహూన్=అనేకములైన
అవాచ్యవాదాన్ = వచింపరాని దుర్భాషణములను, వదిష్యం = చెప్ప
కొందురు, తతః = అంతకంటె, దుఃఖతరం =మిక్కిలి దుఃఖకరమైనది
కిం ను = ఏమిగలదు!

తా॥ నీయొక్క శత్రువులు నీ సామర్థ్యమును నిందించుచున్న
వారై పలువిధముల అనరాని దుర్భాష లాడుదురు. అంతకంటె
మించిన దుఃఖము మఱి యేమిగలదు?

వి॥ బోధకులు సాధకులకు అప్పుడప్పుడు ఉత్తేజకరములగుధర్మములను జెప్పుచుండవలెను. అట్లు ప్రబోధించుట గాలి తగ్గి ప్రకాశము లేకపోయెడు గ్యాస్‌లైటునకు మఱల పంపుకొట్టి గాలి యెక్కించినట్లుండును.

శ్లో॥ హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృతనిశ్చయః॥ 37

పద॥ హతః — వా — ప్రాప్స్యసే—స్వర్గం — జిత్వా-వా— భోక్ష్యసే— మహీం.
తస్మాత్ — ఉత్తిష్ఠ — కౌన్తేయ — యుద్ధాయ — కృతనిశ్చయః.

ప్రతి॥ హే కౌన్తేయ! = కుంతిపుత్రుడవగు ఓ అర్జునా! హతః వా = చంపబడితివేని,స్వర్గం = స్వర్గమును, ప్రాప్స్యసే = పొందగలవు, జిత్వావా= జయించితివేని, మహీం = రాజ్యసుఖమును, భోక్ష్యసే = అనుభవింపగలవు, తస్మాత్=కాబట్టి, యుద్ధాయ=యుద్ధముకొఱకు, కృతనిశ్చయః= చేయబడిన పూనికగలవాడవై, ఉత్తిష్ఠ = లెమ్ము.

తా॥ ఓ అర్జునా! యుద్ధమునందు నీవు శత్రువులచేత జంపబడితివేని స్వర్గలోకసుఖముల ననుభవింపగలవు. అట్లుగాక నీవేశత్రువులను జయింతువేని, భూలోక రాజ్యభోగము ననుభవింపగలవు. కాబట్టి యుద్ధముచేయుటకొఱకు నిశ్చయించుకొని లెమ్ము.

వి॥ ఈ దివ్యమంత్రముచేతనే అర్జునుని ఆవేశించిన మోహామనెడుపెనుభూతమును శ్రీకృష్ణుడు పారద్రోలెను. తీవ్రముముక్షువులు పరమభక్తులు నైష్ఠికులు— వీరికి నెప్పుడెప్పుడు మనస్సులో అధైర్యము గలుగునో, అప్పుడప్పుడు దీనిని పఠించుచుండిన సాధనమునుండి పతనము గలుగదు. ఆత్మనిష్ఠలో ఉత్తీర్ణుడు కాకపోయినను ఇట్టి సాధకునికి పరలోకమునందు ఉత్తమలోకప్రాప్తి గలుగగలదు. ఉత్తీర్ణుడయ్యేనేని మోక్షసామ్రాజ్య ముక్తిసుఖమును బొందగలడు. కాబట్టి అనుష్ఠానములో చచ్చినను బ్రతికినను శ్రేయస్సే గలుగును. కావున చలింపకూడదు.

శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ!
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవంపాపమవాప్స్యసి॥ 38

పద॥ సుఖదుఃఖే — సమే — కృత్వా - లాభాలాభౌ — జయాజయౌ
తతః — యుద్ధాయ — యుజ్యస్వ—న — ఏవం — పాపం — అవాప్స్యసి.

ప్రతి॥ సుఖదుఃఖే — సుఖదుఃఖములను, లాభాలాభౌ = లాభనష్టములను,జయాజయౌ=జయాపజయములను సమేకృత్వా=సమములుగా భావించి,తతః=

అటుపిమ్మట, యుద్ధాయ=యుద్ధముకొఱకు, యుజ్యస్వ=ఆయత్తపడుము. ఏవం=ఇట్లుచేసితివేని, పాపం=దోషమును, న అవాప్స్యసి = పొందవు.

తా॥ సుఖదుఃఖములను, జయాపజయములను లాభనష్టములను, సమానములుగా భావించి అటుపిమ్మట యుద్ధమునకు ఆయత్తపడుము. ఇట్లు చేసితివేని నీవు పాపదోషమును పొందవు.

వి॥ ఇట్టి ద్వంద్వములను సహించు శక్తిలేనివాడు లేక వాటిని సమముగ జూచు సమర్థతలేనివాడు ప్రపంచములో నేకార్యమునైనను చేయజాలడు.

శ్లో॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మ బంధం ప్రహాస్యసి ॥ 39

పద॥ ఏషా – తే – అభిహితా – సాంఖ్యే – బుద్ధిః – యోగే – తు–ఇమాం–శృణు – బుద్ధ్యా – యుక్తః–యయా–పార్థ – కర్మబంధం–ప్రహాస్యసి.

ప్రతి॥ హే పార్థ! = ఓ అర్జునా!, తే = నీకు, సాంఖ్యే =సాంఖ్యయోగమునందు, ఏషా బుద్ధిః=ఈజ్ఞానము; అభిహితా = చెప్పబడినది, యయా బుద్ధ్యా = ఏ బుద్ధితోడ,యుక్తః=కూడినవాడవై, కర్మబంధం=సంసారబంధమును, ప్రహాస్యసి = విడువగలవో, అట్టి యోగే = కర్మయోగవిషయమైన, ఇమాం = ఈబుద్ధిని (జ్ఞానమును), శృణు = వినుము,

తా॥ ఓ అర్జునా! నీకు నింతవఱకు సాంఖ్యజ్ఞానము చెప్పబడినది. ఇక యే జ్ఞానముతో కూడినవాడవై సంసారబంధమును విడువగలవో అట్టి యోగసంబంధమగు జ్ఞానమును జెప్పెద వినుము.

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ 40

పద॥ న –ఇహ – అభిక్రమనాశః – అస్తి – ప్రత్యవాయః – న – విద్యతే, స్వల్పం – అపి – అస్య– ధర్మస్య–త్రాయతే–మహతః – భయాత్.

ప్రతి॥ ఇహ = ఈకర్మయోగానుష్ఠానమందు, అభిక్రమనాశః=ప్రారంభనాశము, న అస్తి = లేదు, ప్రత్యవాయః = దోషము, న విద్యతే = కలుగదు. అస్య ధర్మస్య = ఈ నిష్కామకర్మయోగముయొక్క, స్వల్పం అపి= అల్పమాత్రమైనను, మహతః = గొప్పదైన, భయాత్ = భయమునుండి, త్రాయతే = రక్షించుచున్నది.

తా॥ ఫలాభిలాషను వదలి యీ నిష్కామకర్మయోగమును జేయ ప్రారంభించి పూర్తియగుటకుముందుగా మధ్యకాలమున విఘ్నములచే నిలిచిపోయినను దోషములేదు. ఇట్టి కర్మయోగానుష్ఠానము కొంచమైనను, మిగుల గొప్పదియగు జనన మరణ ప్రవాహ రూపమైన సంసారభయమునుండి రక్షింపగలదు.

వి॥ బ్రహ్మనిష్ఠలోప్రవేశించిన పూర్తికానిచో ఫలముగలుగదనియు,దోషము సిద్ధించుననియు కొందఱుచెప్పుదురు. అట్టి వాక్యములవిని భయపడ నక్కరలేదు. ఈ యనుష్ఠానము కొద్దిగ చేసినను చిన్నఓడవల్ల సముద్రమును దాటునట్లు భవ సాగరమును దాటించుననియు,నిప్పుకొంచమైనను మహారణ్యమును భస్మమొనర్చు నట్లు అజ్ఞానారణ్యమునుదహింపచేయుననియు శ్రీకృష్ణభగవానునిచే ఉపదేశించబడ మైనది. అలాగున గీతాపారాయణమును ప్రారంభించి కారణాంతరముచే ఒక్క రోజు తప్పిపోయినచో పాపము గలుగునని చెప్పి భయపెట్టువారు గూడ గలరు. దానికి భయపడనక్కరలేదు. అనివార్యకార్యముచే ఒక్కరోజు లేక రెండురోజులు నిలిచిపోయినను మఱల సమయము దొరికినప్పుడు ప్రారంభించు కొనవచ్చును. కాని సాధ్యమైనంతవఱకు విడువకనే అభ్యసించుచుండవలెను. లేక గీతయందు ఒక్కశ్లోకముగాని, రెండు శ్లోకములుగాని, మూడు శ్లోకములుగాని హృదయంగతము చేసికొనిన, యాత్రలోగాని, లేక యితరకార్యములలో నిమగ్నులై యున్నప్పుడుగాని స్నానాది అనుష్ఠానములకు అనుకూలములు లేకపోయినను, భోజనమునకు గూర్చున్నప్పుడైన వాటిని స్మరించుకొని,భోజనము చేయవచ్చును. ఇది ఒకటిమాత్రము కాదు దైవానుష్ఠానములన్నియు స్నానము చేయలేదని తలంచి వదలనక్కరలేదు. ఆత్మశుద్ధి అన్నిటికన్న నెక్కువైనది, జలస్నానము ఒకటి మాత్రముకాదు. భస్మస్నానము, మంత్రస్నానము మృత్తికాస్నానము భావ స్నానము మొదలగునవిగలవు. వీటిలో నేదైన ఒకటి భావనజేసికొని ధ్యానానుష్ఠానములు చేసికొనవచ్చును. జలముచే ముఖ, పాద, హస్త ప్రక్షాళనముచేసి కొని, తిలక విభూతి కుంకుమాదులలో నేదైన నొకటి ధరించిన చాలును. అయితే స్నానమునకు అనుకూలము గలిగి చేయకపోయిన అది సోమరితనము క్రిందికి వచ్చును.

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునన్దన ।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽ వ్యవసాయినామ్॥ 41

పద॥ వ్యవసాయాత్మికా - బుద్ధిః - ఏకా - ఇహ - కురునన్దన!
బహుశాఖాః - హి - అనన్తాః - చ - బుద్ధయః - అవ్యవసాయినాం,

ప్రతి॥ హే కురునన్దన! = ఓ యర్జునా!, ఇహ=ఈ అనుష్ఠానమందు, వ్యవసాయాత్మికా = నిశ్చయాత్మకమైన, బుద్ధిః = మనస్సు, ఏకా= ఒక్కటియే, అవ్యవసాయినాం = నిశ్చయరహితులయొక్క, బుద్ధయః = మనోవ్యాపారములు, బహుశాఖాః= పరిపరివిధములుగ వ్యాపించినట్టివిగను, అనంతాః చ = అసంఖ్యాకములుగను, హి = అగుచున్నవిగదా!

తా॥ ఓయర్జునా ! ఈ నిశ్చయాత్మకమైన బుద్ధి (జ్ఞానము) ఏకరీతిగా నుండును. నిశ్చయరహితులయొక్క మనోవ్యాపారములు (జ్ఞానములు) పరిపరివిధములుగ వ్యాపించునట్టివిగను, అసంఖ్యాకములుగను నుండును.

వి॥ చిత్తైకాగ్రతలేనిచో మోక్షద్వారమున ప్రవేశింపజాలరు. సూదిరంధ్రములో దారము నెక్కించవలసియుండిన కొన యేలాగున నిశ్చలమై యేకాగ్రత గలిగియుండవలెనో యిదిన్ని అటువంటిదే. లేక అనేకశాఖలుగల ఒక మ్రానును ఒక రంధ్రములో దూర్చవలసియుండిన నేలాగున కొమ్మలన్నియు ఛేదించి కూచిగా జెక్కవలసియుండునో, అలాగున ముక్తిద్వారములో అనగా తురీయ పదవిలో లేక సుషుమ్నానాడిలో నిలుకడ గలిగియుండవలయునన్న ఆది వృత్తులు నశించి చిత్తైకాగ్రతగలిగిన ఆత్మకు మాత్రమే సాధ్యమగును.

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః॥ 42

" కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥ 43

" భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే ॥ 44

పద॥ యాం - ఇమాం - పుష్పితాం - వాచం - ప్రవదన్తి - అవిపశ్చితః - వేదవాదరతాః - పార్థ! -న - అన్యత్ - అస్తి - ఇతి - వాదినః.

" కామాత్మానః -స్వర్గపరాః –జన్మకర్మఫలప్రదాం- క్రియావిశేషబహుళాం- భోగైశ్వర్యగతిం - ప్రతి.

" భోగైశ్వర్యప్రసక్తానాం -తయా - అపహృతచేతసాం - వ్యవసాయాత్మికా- బుద్ధిః - సమాధౌ - న - విధీయతే.

ప్రతి॥ హే పార్థ!=ఓ అర్జునా! వేదవాదరతాః=వేదమునందలి అర్థవాదవాక్యము
లందాసక్తులైనట్టియు, అన్యత్ = స్వర్గాది సుఖములకంటె నితరమైనది,
న అసి =లేదు. ఇతి = ఇట్లని, వాదినః = చెప్పెడి స్వభావముగలవారును,
కామాత్మానః=పుత్ర, మిత్ర, కళత్ర, ధన, కనక, వస్తు, వాహనాదులందు
కోరికగలవారును,స్వర్గపరాః=స్వర్గసుఖమునందాసక్తులునునైన,అవిపశ్చి
తః=ఆత్మజ్ఞానములేని అజ్ఞానులు,జన్మకర్మఫలప్రదాం=జన్మకర్మఫలముల
నిచ్చునట్టి,లేక జన్మయనెడి కర్మఫలమును ప్రసాదించునట్టి, భోగైశ్వర్య
గతింప్రతి = ఐహికభోగములయొక్కయు, ఐశ్వర్యముయొక్కయు.
ప్రాప్తినిగూర్చి, క్రియావిశేషబహుళాం = వివిధక్రియా విశేషములతో
గూడిన, యాం=ఏ,ఇమాం=ప్రసిద్ధమైన, పుష్పితాం=వికసించిన మోదుగ
పూవువలె రమ్యమైన. వాచం = వాదమును, ప్రవదన్తి=చెప్పుచున్నారో,
తయా = అట్టిమాటకు మాత్రము అందమైన మోదుగపూవువంటి
ఆవాక్కుచే,అపహృతచేతసాం=అపహరింపబడినమనస్సుగలిగినట్టి,భోగై
శ్వర్యప్రసక్తానాం = ఐహికవిషయభోగైశ్వర్యములం దాసక్తులైనవారి
యొక్క, బుద్ధిః = బుద్ధి, వ్యవసాయాత్మికా=నిశ్చయాత్మకమై, సమాధౌ=
సమాధియందు, న విధీయతే=స్థిరముగ నిలువదు, లేక విషయభోగము
లందాసక్తులైన వారియొక్క, సమాధౌ = అంతఃకరణమునందు, వ్యవ
సాయాత్మికా= నిశ్చయాత్మికయైన బుద్ధిః = బుద్ధి, న – విధీయతే =
స్థిరముగ నెలకొనదు. అని గూడ చప్పుకొనవచ్చును.

తా॥ ఓ యర్జునా! వేదమందలి అర్థవాద వాక్యములచే నాకర్షింప
బడినవారై, విషయభోగములందు, స్వర్గాదిసుఖములందు ఆసక్తులై,
ఆత్మజ్ఞానశూన్యులైన అవివేకులుస్వర్గాదిసుఖముకంటె ఉత్కృష్టమైనది
శ్రేయస్కరమైనది మఱియొకటి లేదని జన్మకర్మలను ఇహపరసుఖము
లను ప్రసాదించునట్టి వేదప్రతిపాదిత వివిధ కర్మకలాపములగూర్చి
వికసించిన మోదుగపూవులవలె రమ్యములైన మాటలను బహువిధ
ములుగ జెప్పుచుందురు. పాపము అట్టి చూపుటకు మాత్రము రమ్య
ముగా కానవచ్చు మోదుగపూవులాంటి శ్రవణపేయములగుమాటలచే
నెవరు ముగ్ధులై ఆకృష్టులగుదురో, అట్టి విషయ సుఖాసక్తులయొక్క
బుద్ధి అస్థిరమై, చంచలమైనందున, సమాధియందు లేక దైవభావము

నందు లేక బ్రహ్మనిష్ఠయందు స్థిరముగ నిశ్చలముగ నిలువజాలదు. లేక అట్టి పుత్ర, మిత్ర, కళత్రాదివిషయసుఖము లందాసక్తచిత్తులైన వారి అంతఃకరణమున నిశ్చయాత్మికమైన బుద్ధి నెలకొనదు. కుదర దనియు గ్రహించునది.

వి॥ 42,43, 44 ఈ మూడు శ్లోకములును ఒకదానికొకటి సంబంధించియే యున్నవి. స్రక్చందనాది విషయభోగములయందు ఆసక్తిగలవారును, ఉద్యోగాది కార్యాద్యభిలాషగలవారును, కర్మకాండమునుగుఱించిగొప్పగచెప్పెడువాక్యము, ఎట్లుబాడిశచెట్టుపువ్వు లేక మోదుగపువ్వుచూచుటకు మహారమ్యముగా నుండినను దేనికిని ఎట్లుపయోగపడదో, అట్లే నిరుపయోగమైనది. అట్లు భోగైశ్వర్యములచే నపహరింపబడినమనస్సుగలవారిబుద్ధి నిర్మలముగానుండనందుచే సమాధియందు అనగా దైవభావమందు నిలువజాలదు. వారు ఈ సాంఖ్యయోగమున జెప్పబడిన బ్రహ్మాత్మైక్యస్థితియందు నిలువజాలరు.

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ 45

పద॥ త్రైగుణ్యవిషయా - వేదాః - నిస్త్రైగుణ్యః - భవ - అర్జున!
నిర్ద్వంద్వః - నిత్యసత్త్వస్థః - నిర్యోగక్షేమః - ఆత్మవాన్.

ప్రతి॥ వేదాః=వేదములు. త్రైగుణ్యవిషయాః=త్రిగుణాత్మకములగువిషయములను దెలుపునవిగానున్నవి, హే అర్జునా! = ఓ అర్జునా!, (నీవు). నిస్త్రైగుణ్యః=త్రిగుణాత్మకములగు విషయములవాంఛను వదలినవాడవుగను. (గుణాతీతుడవుగను),నిత్యసత్త్వస్థః=సదా కేవలశుద్ధసత్త్వాపన్నుడవుగను, నిర్ద్వంద్వః=సుఖదుఃఖాది ద్వంద్వములులేనివాడవుగను,నిర్యోగక్షేమః= యోగక్షేమ చింతారహితుడవుగను. ఆత్మవాన్= ఆత్మజ్ఞానముగలవాడవుగను, భవ = అగుము.

తా॥ ఓ అర్జునా! వేదములు త్రిగుణాత్మకములగు సంసారవిషయములను తెలుపునవిగానున్నవి. ఆ కారణమువలన నీవు త్రిగుణాత్మకములగు విషయములయందు వాంఛ వదలినవాడవుగను, అనగా గుణాతీతుడవుగను, సదా శుద్ధ సత్త్వవిశిష్టుడవుగను, సుఖదుఃఖాది ద్వంద్వముల సహించువాడవుగను, యోగక్షేమములను సహితము కోరనివాడవుగను, ఆత్మజ్ఞానము గలవాడవుగను అగుము.

వి॥ వేదములలో ఎక్కువ భాగము కర్మకాండమును, వర్ణాశ్రమములను, తత్కార్యములనుగూర్చి తెలుపుచుండును. ఇది (వేదముయొక్క కర్మకాండము) సత్త్వ రజ, స్తమోగుణములను మాత్రము ప్రతిపాదించును. వేదముయొక్క అంతిమభాగమగు ఉపనిషత్తు మూడుగుణములకుపై భాగమందుండు శుద్ధాత్మను గుఱించి యుపదేశించుచుండును. వేదముయొక్కకడభాగమగుటచేతనే 'వేదాంత' మని పేరు వచ్చినది.ఇది నిరతిశయానందమగు బ్రహ్మప్రాప్తిని కలుగజేయును.

శ్లో॥ యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥ 46

పద॥ యావాన్ - అర్థః - ఉదపానే - సర్వతః – సంప్లుతోదకే.
తావాన్ - సర్వేషు - వేదేషుః - బ్రాహ్మణస్య - విజానతః!.

ప్రతి॥ ఉదపానే=స్నానపానాదికముల విషయమై, సర్వతః=అంతటను, సంప్లుతోదకే=నిండియున్న యుదకముగలతటాకమునందు,యావాన్=ఎట్టిదైన అర్థః=ప్రయోజనమో, తావాన్ = అట్టిప్రయోజనము. సర్వేషు = సమస్తములైన, వేదేషు =వేదములయందు, విజానతః = బ్రహ్మతత్త్వమును బాగుగ తెలిసిన, బ్రాహ్మణస్య = బ్రహ్మనిష్ఠునికి (అగుచున్నది,)

తా॥ స్నానపానాదికముల విషయమై చిన్నచిన్న చెరువులు, నూతులు వీటివల్ల గలుగు ప్రయోజనము అంతటను నిండియున్న యుదకము గల తటాకమునందు యెటుల సిద్ధించునో, అటులనే సమస్తములైన వేదములందు ప్రతిపాదింపబడిన కామ్యకర్మ ఫలము లన్నియు ఆత్మానుభవము గల బ్రహ్మనిష్ఠునికి గలుగుచున్నవి. కర్మ ఫలములు బ్రహ్మజ్ఞానమునందంతర్భూతములని భావము.

వి॥ ఈశ్లోకము భక్తులపై మిక్కలి కరుణకలిగి యుపదేశింపబడెను, అనేకులు "మేము శాస్త్రములను చదువలేదు. యజ్ఞములనుచేయలేదు. యోగములను శీలించలేదు.దానముల నొనర్చలేదు.మంత్రములన్నియు జపింపలేదు. తీర్థయాత్ర లన్నియుజేయలేదు. మాకెట్లుమోక్షముగలుగు"నని తపించువారుగలరు.అట్టివారి ఆత్మశాంతికొఱకు ఈశ్లోకము శ్రీకృష్ణునిచే జెప్పబడినది.దాహముగలవానికిప్రపంచములోగల గంగాపుష్కరము మొదలగు ననేకజలాశయములతీర్థము లవసరము లేదు. ఒక్కలోటా నీరు చాలును. ఆకలిగలవానికి ప్రపంచములో పండెడుగోధుమలు,బియ్యము,జొన్నలుమొదలగునవన్నియు భుజింపనవసరములేదు.ఏదైనతన

కడుపు నిండునంత అన్నము చాలును.రోగముగలవాడు ఆయుర్వేదములోచెప్ప బడిన అసంఖ్యాకఔషధములను సేవింపనక్కరలేదు.అన్నిపథ్యములును ఆచరింప నక్కరలేదు. రోగమునకు తగిన ఒక్కమందును సేవించిదానికితగిన పథ్యముండిన జాలును, ఆలాగున వేదములలో అనేకకర్మములు, ఉపాసనలు, మంత్రములు గలవు. అవియన్నియు ఒక్కనికి అక్కరలేదు.తన భవరోగము నశించుటకుబ్రహ్మ ధ్యానము లేక ఏదైన ఒక్కయుపాసన చాలును. దానియందుసరియైననిష్ఠ నియమ ముండిన చాలును. తరింపవచ్చును. మఱియు అచటచట చిన్న చిన్నగుంటలు నూతులు మొదలైనవానిలోగల జలముచే నెంత యుపయోగమో, అంత ప్రయో జనము ఒక గొప్ప జలాశయమున ఎట్లు సిద్ధించునో,ఆలాగున అనేకవేదవిహిత ములగు కామ్యకర్మలు, సాధనలు, ఉపాసనలు, వీటివల్ల గలుగు ఫలము లన్ని యును ఒక్కబ్రహ్మజ్ఞానముచేతనే కలుగును.

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి ॥ 47

పద॥ కర్మణి – ఏవ - అధికారః - తే - మా - ఫలేషు - కదాచన.
మా - కర్మఫలహేతుః - భూః - మా - తే - సంగః - అస్తు-అకర్మణి.

ప్రతి॥ తే=నీకు, కర్మణి ఏవ =కర్మమునందే. అధికారః = ఆసక్తిగలుగుగాక!. కదాచన = ఒకప్పుడును. ఫలేషు = కర్మఫలములయందు అధికారము. మా అస్తు=కలుగకుండునుగాక! కర్మఫలహేతుః=కర్మఫలమునకు కారణ భూతుడవు, మా భూః = కాకుము. అకర్మణి = కర్మలు చేయక మానుట యందును, తే=నీకు, సంగః=ఆసక్తి, మా అస్తు=కలుగకుండుగాక!

తా॥ నీకు కర్మమునందే అధికారము, ఎప్పుడును కర్మఫల ముల యందాసక్తి కలుగకుండుగాక ! కర్మఫలములకు గారణమైన వాడవుగను గాకుము. సకామభావముతో కర్మల నాచరింపకుమని భావము, కర్మములు చేయక మానుటయందును నీకు ఆసక్తి గలుగ కుండునుగాక.

వి॥ నిష్కామముగా జేసెడు పుణ్యములవలననే లేక అనుష్ఠానమువలననే అంతఃకరణశుద్ధి కలుగును. అంతఃకరణశుద్ధి కలిగినను అట్టి యనుష్ఠానముబ్రహ్మ జ్ఞానమునకు అనుకూలమే యగును. సామాన్యముగా ప్రపంచములోగల మాన వులకుగూడ వారు చేసెడు పనికితగినకూలి లభించుచుండగా.ఇకదైవవిషయమై

దానికి తగిన ఫలము గలుగునా? లేదా! యని సందేహపడనక్కరలేదు. కాని ఫలాపేక్షగలవానికి దానికి తగిన ఫలము గలుగునేగాని, అంతఃకరణశుద్ధియు, దైవానుగ్రహము ఆత్మజ్ఞానమును గలుగదు. ఇట్టి స్థితి ఆత్మజ్ఞానము లేనివానికి గలుగదు. కాన సాధకుడు అనుష్ఠానపరుడై ఫలాపేక్షారహితుడై యుండవలసి యుండునని బోధించబడమైనది. మఱియు జీతముకొఱకుపనిచేయువాడు సొంతము వాడు కాడు. వాడు అన్యుడు, సొంతమువాడైనచో కూలిని అపేక్షింపకనే తాను చేయుపనిని కూలివాడు చేయుదానికంటె మిక్కిలి శుద్ధముగా సక్రమముగా జేయును. కూలివాడుదీనుడు. దైవాంశములో పుట్టినవారు ధీరులు. వీరు దైవాజ్ఞచే పుట్టినవారు కాబట్టిదైవజ్ఞానముగలవారై ఫలమును కోరరు, అనుష్ఠానమును విడువరు. కనుకనే దైవానుగ్రహమునకు పాత్రులగుదురు.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ !
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥ 48

పద॥ యోగస్థః – కురు – కర్మాణి – సఙ్గం – త్యక్త్వా – ధనంజయ.
సిద్ధ్యసిద్ధ్యోః – సమః – భూత్వా – సమత్వం – యోగః – ఉచ్యతే.

ప్రతి॥ హే ధనంజయ! = ఓ అర్జునా ! సిద్ధ్యసిద్ధ్యోః= ప్రాప్తాప్రాప్తములయందు. సమత్వం = సమబుద్ధి గలిగియుండుట, యోగః – యోగమని, ఉచ్యతే= చెప్పబడుచున్నది, (కనుక), త్వం = నీవు, సమః= సమబుద్ధిగలవాడవు, భూత్వా = అయి, సంగం = ఫలాసక్తిని, త్యక్త్వా = విడిచి, యోగస్థః= యోగమునందున్నవాడవై, కర్మాణి = కర్మలను, కురు = చేయుము.

తా॥ ఓ అర్జునా! ప్రాప్తాప్రాప్తములయందు అనగా కర్మానుష్ఠానమువలన గలిగెడు ఫలములయొక్క కలిమిలేములయందు సమబుద్ధి గలిగియుండుట యోగమని చెప్పబడుచున్నది. అందువలన నీవు కర్మఫల ప్రాప్తాప్రాప్తముల యెడల సమబుద్ధిగలవాడవై అట్టి కర్మఫలమందలి ఆసక్తిని విడిచి యోగనిష్ఠయందున్నవాడవై కర్మలను జేయుము.

వి॥ ధర్మకార్యములు చేయువారలలో నాలుగు తెఱంగులవారు గలరు. మొదటివారు–ఒక కార్యమును జేసిన, దానివలన కొంత సంపాదించవచ్చునని తలంపుగలవారు. వీరు చాల హీనులు. వీరు అట్టి కార్యమును జేయకపోవుటయే మంచిది. రెండవవారు తమకు సంపాద్యమేమియు నక్కరలేదు, గాని పేరు

ప్రతిష్ఠలు తమకేయుండవలెనని తలంతురు, వీరు పై జెప్పినవారికన్న కొంచెము ఆత్మశుద్ధిగలవారు. మూడవవారు పేరుప్రతిష్ఠలు గౌరవములు తమకు అక్కరలేదు. గాని కార్యము నిర్విఘ్నముగ జరిగిన చాలును. భగవత్కరుణ యుండిన చాలును. అది చూచి ఆనందించెదము అను భావము గలవారు. వీరు చాలవఱకు శుద్ధాత్ములు. కాని కార్యము చక్కగ జరుగక పోయిన వీరికి క్లేశము గలుగును. ఇక నాల్గవవారు—మనుష్యప్రయత్న మెంతవఱకు చేయవలెనో అంత వఱకు కొంచెమైనను పట్టువిడువక ధర్మకార్యమొనర్చువారు, కార్యము చక్కగా జరుగనీ జరుగకపోనీ సుఖదుఃఖములను బొందగూడదనివారు భావించెదరు,వీరే ద్వంద్వాతీతులు జీవన్ముక్తులు.మొదటివారు తమోగుణరజోగుణములతో గూడిన వారు. రెండవవారు రజోగుణ సత్త్వగుణములతో గూడినవారు. మూడవవారు సత్త్వగుణముగలవారు, నాలుగవవారు గుణత్రయాతీతులు. ఈ నాల్గు స్థితులలో తానే స్థితిలో నున్నదియు పరికించి చూచుకొన్న చాలును.

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ! ।
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ 49

పద॥ దూరేణ – హి – అవరం- కర్మ – బుద్ధియోగాత్ – ధనంజయ !, బుద్ధౌ – శరణం - అన్విచ్ఛ – కృపణాః – ఫలహేతవః.

ప్రతి॥ హే ధనంజయ ! = ఓ అర్జునా! బుద్ధియోగాత్ = చిత్తశుద్ధిగల్గి చేసెడి సమత్వబుద్ధియుక్తమైన నిష్కామకర్మయోగముకంటె, కర్మ = కామ్య కర్మము, దూరేణ=మిక్కిలి, అవరం హి = దీనభావము గలదిగదా! (నికృష్టమైనదికదా) కనుక నీవు, బుద్ధౌ = నిష్కామ కర్మానుష్ఠానబుద్ధి యందు,శరణం=రక్షకత్వమును, అన్విచ్ఛ=ఇచ్ఛగింపుము.ఫలహేతవః= ఫలము నపేక్షించువారు, కృపణాః = హీనులు(దీనులు.)

తా॥ ఓ అర్జునా! చిత్తశుద్ధిని గలుగజేసెడు నిష్కామకర్మ యోగముకంటె కామ్యకర్మము జ్ఞానమునకు మిక్కిలి దూరమైనది. దైవమునకును దూరమైనది. కనుకనే నికృష్టమైనది. కాబట్టి నీవు. నిష్కామకర్మానుష్ఠానబుద్ధియందు నిలుకడ కలిగియుండుము.నిష్కామ కర్మయోగమునే శరణుపొందుము. ఆశ్రయింపుము, ఏలన ! ఫలము నపేక్షించి కర్మలు చేయువారు దీనులు.

వి॥ కూలిపనివారు బీదలుగారా? ఫలాశగలవారును అట్టి పేదవారలే వీరు దైవకుటుంబమువారు కారు అనగా దైవజ్ఞానసంఘములో చేరినవారుగారు.

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥ 50

పద॥ బుద్ధియుక్తః – జహాతి – ఇహ - ఉభే – సుకృతదుష్కృతే.
తస్మాత్ – యోగాయ – యుజ్యస్వ – యోగః – కర్మసు – కౌశలమ్.

ప్రతి॥ బుద్ధియుక్తః = చిత్తశుద్ధి గలవాడు లేక సమత్వబుద్ధి గలవాడు. ఉభే= రెండైన, సుకృతదుష్కృతే = పుణ్యాపాపములను, ఇహ = ఈ లోకము నందే, జహాతి = విడుచుచున్నాడు, తస్మాత్ = ఆ కారణమువలన. యోగాయ = యోగముకొఱకు, యుజ్యస్వ = ఆయత్తపడుము.కర్మసు = కర్మములయందు, కౌశలం = నేర్పరితనమే, యోగః = యోగము.

తా॥ చిత్తశుద్ధిగలవాడు లేక సమత్వబుద్ధిగలవాడు పుణ్యాపాపముల రెంటిని ఈ లోకమునందే జీవించి ఉండగనే విసర్జించుచున్నాడు పుణ్యాపాపముల కతీతుడగుచున్నాడని భావము.అందువలన యోగము కొఱకు సన్నద్ధుడవగుము. కర్మములయందు నేర్పరితనమే యోగ మనబడును.

వి॥ నిష్కామకర్మయోగమందు గల కుశలత్వమే యోగమనంబడును. అది యిచ్చటనేగలుగవలయును. పుణ్యాపాపముల వలన గలుగు సుఖ దుఃఖాత్మక ఫలములరెండింటిలోను దగులకుండుటయే కర్మకౌశలమగును.కుమ్మరపురుగు బురద లోనుండినను దానిని అంటకయుండునని జెప్పెడు వాక్యమునకు ఇదియే అర్థము. బురద అంటుకొనినచో అది కుమ్మరిపురుగుకాదు. కంబళిపురుగు, కుమ్మరిపురుగు దేహముపై నొకవిధమగు చమురుగలదు. అందువలననే అది బురదలోనుండినను బురద అంటుకొనుటలేదు. దైవజ్ఞానముగలవాడును అలాగుననే యుండును.

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥ 51

పద॥ కర్మజం – బుద్ధియుక్తాః - హి - ఫలం - త్యక్త్వా - మనీషిణః.
జన్మబంధవినిర్ముక్తాః - పదం - గచ్ఛన్తి - అనామయమ్.

ప్రతి॥ హి = ఏలననగా, మనీషిణః = బుద్ధిమంతులైనవారు, బుద్ధియుక్తాః = నిష్కామకర్మానుష్ఠానపరులై, కర్మజం=కర్మమువలన గలిగెడు, ఫలం = ఫలమును, త్యక్త్వా=విడిచి, జన్మబంధవినిర్ముక్తాః=జన్మమనెడు బంధము నుండి విడువబడినవారై, అనామయం=సర్వోపద్రవరహితమైన, పదం= స్థానమును, గచ్ఛంతి = పొందుచున్నారు.

తా॥ ఏలననగా శుద్ధమైన (సమత్వ) బుద్ధిగలవారు నిష్కామ కర్మానుష్ఠానపరులై కర్మములవలన గలిగెడు ఫలమును విడిచి జన్మ మనెడి బంధమునుండి విడువబడినవారై సర్వోపద్రవరహితమైన భగవత్‌స్థానమును (బ్రహ్మపదమును) పొందుచున్నారు.

శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ 52

పద॥ యదా - తే - మోహకలిలం - బుద్ధిః - వ్యతితరిష్యతి,
తదా - గంతాసి - నిర్వేదం - శ్రోతవ్యస్య - శ్రుతస్య - చ.

ప్రతి॥ యదా=ఎప్పుడు, తే=నీయొక్క, బుద్ధిః = బుద్ధి, మోహకలిలం = అజ్ఞాన కాలుష్యమును,వ్యతితరిష్యతి=దాటగలదో, తదా=అప్పుడు, శ్రోతవ్యస్య= ఇక వినదగినఅర్థముయొక్క,శ్రుతస్య చ=ఇదివరలోవినిన అర్థముయొక్క నిర్వేదం = వైరాగ్యమును, గంతాసి = పొందెదవు.

తా॥ ఎప్పుడు నీయొక్క మనస్సు అజ్ఞానమనెడుకల్మషమును దాటగలదో అప్పుడు వినదగిన యర్థమునుండియు, విన్న అర్థము నుండియు అనగా కర్మవిషయమునందు విరక్తిని పొందెదవు.

వి॥ సాధకుడు ప్రకృతికి పరమగు బ్రహ్మపదమును ఎందువలన పొంద లేదోఅది యీశ్లోకములో తెలుపడమైనది. సాధకునిమనస్సు ఎంతవఱకు ప్రాకృత విషయమనెడు మాలిన్యమును దాటలేదో, అనగా ప్రకృతికి పరమగు తురీయ పదమును పొందలేదో అంతవఱకు అతడు బద్ధుడే.ఎప్పుడు విషయవాసన నశించి నిర్విషయస్థితి గలుగునో,అప్పుడే యిదివఱలో గురువులవలన లేక శాస్త్రముల వలన శ్రవణము చేసినదానియొక్క యర్థము బోధపడును.అప్పుడు ఈ జ్ఞానస్థితి కన్న అన్యముగా వినవలసినది మఱియొకటిలేదని బోధగలుగును.అనగాప్రకృతి రహితమగువఱకు తత్త్వబోధము గలుగదు.

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి॥ 53

పద॥ శ్రుతివిప్రతిపన్నా - తే - యదా - స్థాస్యతి — నిశ్చలా,
సమాధౌ - అచలా - బుద్ధిః - తదా — యోగం — అవాప్స్యసి.

ప్రతి॥ శ్రుతివిప్రతిపన్నా=కర్మకాండమునందలి అర్థవాదశ్రుతులచేత విక్షేపమును బొందియున్న, తే = నీయొక్క, బుద్ధిః = మనస్సు, యదా = ఎప్పుడు,

నిశ్చలా = చలింపనిదై, సమాధౌ = ధ్యానమందు. అచలా=స్థిరమైనదై, స్థాస్యతి= స్థిరముగా నుండగలదో, తదా = అప్పుడు. యోగం = యోగ సిద్ధిని, (పరమాత్మజ్ఞానమును) అవాప్స్యసి = పొందగలవు.

తా॥ నానావిధములైనయర్థవాదములను వినుటచేత ఇదివఱకు విక్షేపమును బొందియున్న నీ బుద్ధి యెప్పుడు పరమాత్మధ్యానమందు నిశ్చలమై స్థిరమై యుండునో, అప్పుడు నీవు పరమార్థజ్ఞానమును పొందగలవు.

వి॥ విషయవాసన నశించనిచో, సత్యముయొక్క జ్ఞానము గలుగదని పైశ్లోకమున చెప్పబడినది. ఈశ్లోకమున సమాధియందు నిశ్చలత గలుగవలసియుండిన ఫలవిషయక మహిమలను జెప్పెడు శాస్త్రములలోగల భ్రాంతి నశింపవలెనని తెలుపడమైనది.

అర్జున ఉవాచ:— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ !
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ॥ 54

పద॥ స్థితప్రజ్ఞస్య – కా – భాషా – సమాధిస్థస్య – కేశవ,
స్థితధీః – కిం – ప్రభాషేత – కిం – ఆసీత – వ్రజేత – కిమ్.

ప్రతి॥ హే కేశవ! = ఓ శ్రీకృష్ణమూర్తీ! సమాధిస్థస్య = సమాధినిష్ఠయందుండునట్టి. స్థితప్రజ్ఞస్య = నిశ్చలమైన తత్త్వజ్ఞానము గలవానియొక్క, భాషా= లక్షణము, కా = ఎట్టిది, స్థితధీః = నిశ్చయజ్ఞానము గలవాడు, కిం ప్రభాషేత=ఏలాగున వచించును, కిం ఆసీత =ఏరీతిగా నుండును,కింవ్రజేత= ఎట్లాచరించును !

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గలిగినట్టి సమాహిత చిత్తము గలవానియొక్క లక్షణము ఎట్టిది? అట్టి దృఢజ్ఞానము గలవాడు ఏమి ఉపదేశించును? అట్టి ఆత్మవేత్త యేలాగున ఉండును? అతని ఆచరణ యేరీతిగా నుండును ?

వి॥ బ్రహ్మవేత్తయొక్క లక్షణమెట్లుండును? అట్టివాడు లోకమునకు ఏ ధర్మము నుపదేశించును? తానుండే యాశ్రమము నేరీతిగానుంచును ! తాను ఏరీతిగా నడచుకొనును ! ఈనాల్గు ధర్మములును ప్రతి ముముక్షువు తెలిసికొని యాచరించదగినవి. స్థితప్రజ్ఞుడనియు, ప్రసన్నుడనియు, యోగసమాధిగలవా

డనియు, 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను యనుభవముగలవాడనియు జీవన్ముక్తుడనియు పేర్లుగలవు. 54-వ శ్లోకమున స్థితప్రజ్ఞుని లక్షణమునుగుఱించి అర్జునుడుశ్రీకృష్ణ భగవానుని ఈక్రిందివిధముగ నాలుగు ప్రశ్నలు అడిగెను. (1)స్థితప్రజ్ఞునిలక్షణ మెట్టిది? (2) అతడు ఎట్లు మాట్లాడును? (3) అతడు ఎట్లు కూర్చుండును? (4) అతడు ఎట్లు నడచును? అని, ఇందు 'బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము గలవాని లక్షణ మెట్లుండును?' అనునిది ఒకటిమాత్రమే ముఖ్యమనియు, అతడు ఎట్లు మాట్లాడును? ఎట్లు కూర్చుండును? ఎట్లు నడచును? అను నీ మూడు ప్రశ్న లును ముఖ్యములైనవి కావు. ఇవి సామాన్యములని తలంచియే శ్రీ కృష్ణభగ వానుడు ఈమూడింటికిని సమాధానము చెప్పలేదనియు కొందఱు వచింతురు. పాపము వారు (1)ఎట్లు వచించును, (2) ఎట్లు కూర్చుండును. (3) ఎట్లు నడ చును అను నీ ప్రశ్నలు సామాన్యములైనవని తలంచిరి. కాని ఇవిసామాన్యములా! కానేకావు వస్తుతః ఈలాటి చిన్నప్రశ్నలను అర్జునుడు అడిగేవాడా? ఈ మూడు ప్రశ్నలును అగాధార్థములతో గూడినవి. ఆచరణ యోగ్యములైనవి. అయితే కొందఱు పైవిధముగా జెప్పుటకు కారణమేమన ఈమూడుప్రశ్నలకు భగవానుడు వేరువేరుగా సమాధానము చెప్పకపోవుటయే. అందువల్ల అవి నిస్సారములనివారు తలంచిరి. మొదటి ప్రశ్నయగు లక్షణము ఒక్కదానికే భగవానుడు సమాధానము చెప్పినట్లు వారు తలంచుచున్నారు. 55-వ శ్లోకమునుండి అధ్యాయాంతమువఱకు స్థితప్రజ్ఞుని లక్షణమునే చెప్పినట్లు వారు తలంచుచున్నారు. అదే దీనిలోగల పొర పాటు. 55-వ శ్లోకము మొదలు అధ్యాయాంతమువఱకు గల 19 శ్లోకములలో ఈ నాలుగు ప్రశ్నలకును సమాధానము భగవానుడుపదేశించెను, అయితేఫలానా ప్రశ్నకు ఫలానా సమాధానమని ప్రత్యేకించి చెప్పలేదని వారు తలంచిరి. అలాగు ననే యుండవలయునని నియమములేదు. ఏలన అష్టమాధ్యాయమున మొదటనే "కిం తద్బ్రహ్మ" అని మొదలు పెట్టి రెండు శ్లోకములలో అర్జునుడు ఏడుప్రశ్నలు వేసినాడు,అదేరీతిగా త్రయోదశాధ్యాయమున ప్రప్రథమమున "ప్రకృతిం పురుషం చైవ" అని యారు ప్రశ్నలు వేసినాడు. వీటికన్నిటికిని శ్రీ కృష్ణభగవానుడు మొత్తముమీద సమాధానము చెప్పినాడేగాని ఫలానా ప్రశ్నకు ఫలానా సమాధాన మని యెచ్చటను విమర్శించి చెప్పలేదు. భాష్యకారులు, వార్తిక కారులు ఫలానా ప్రశ్నకు ఫలానా ఉత్తరమని వివరించి తెలిపిరి. అట్టి ఈ నాలుగు ప్రశ్నలకును సమాధానముంటున్నదని తెలిసికొనిన చాలును. ఈ ప్రశ్నకు ఇది ఉత్తరమని చెప్పకపోయినను,ఈస్థితప్రజ్ఞుని లక్షణములలోనే వేరు వేరు శ్లోకములలో నాలుగు

ప్రశ్నలకును వేరు వేరు ఉత్తరములు గలవు. అవి క్రింద నిరూపింపబడుచున్నవి, వాటిని చూచుకొనిన చాలును. అప్పుడు ఈ సందేహము పూర్తిగా నివృత్తి కాగలదు. కొందఱు భాష్యకర్తలు ఈ 17 శ్లోకములును స్థితప్రజ్ఞుని లక్షణము లను నిరూపించునవని తెలిపిరి. మఱికొందఱు ఈశ్లోకములలో స్థితప్రజ్ఞుని లక్షణమును స్థితప్రజ్ఞను పొందుట కభిలాషగల సాధకునియొక్క యనుష్ఠాన మును భగవానుడు తెలిపినట్లు వ్రాసియున్నారు. శంకరానందీయమందు మాత్రము ఈనాలుగు ప్రశ్నలకును సమాధానము చెప్పియున్నారు,అయితే మొదటి ప్రశ్నకే 55–వ శ్లోకమును సమాధానముగ నిరూపించి తక్కిన మూడు ప్రశ్న లకు కొన్ని శ్రుతివాక్యములచే సమాధానము వ్రాసిరి. కాని ఈ 17-శ్లోకములలో ఫలానా ప్రశ్నకు ఫలానాయుత్తరమని నిరూపించియుండలేదు. అయితే అనేక భాష్యములలో ఈ శంకరానందీయ గీతాభాష్యమే చాల విపులముగా సమరస ముగా నుండునని విజ్ఞు లభిప్రాయపడు చున్నారు· మొదటి ప్రశ్నగాక తక్కిన మూడు ప్రశ్నలు అంతప్రధానములు గావని ఆధునికులు మాత్రమే అంత నిర్లక్ష్యము చేయుచున్నారు గాని పూర్వీకులగు ఏ భాష్యకర్తలును ఆ మూడు ప్రశ్నలు నిస్సారములని తలంచియుండలేదు. అట్లు వారికి వాటియందు నిస్సారత్వబుద్ధి గలిగియుండిన వారు తమ తమ భాష్యవార్తి కాదులలో ఆ విషయమును తెలిపియే యుందురు. ఒకవేళ అర్జునుడడిగిన ఆ మూడు ప్రశ్నలు అప్రధానములైనచో గీతాశాస్త్రమును ఛన్దోబద్ధముగా రచించిన శ్రీ వ్యాసభగ వానుడైనా సవరణ చేయకపోవునా? కాన వర్తమానకాలములో నెవరు ఈ మూడు ప్రశ్నలు సామాన్యములని తలంచిరో వారు గాఢముగా విచారించ లేదని గ్రహించవచ్చును. (1) ఎట్లు మాట్లాడును? (2) ఎట్లు కూర్చుండును? (3) ఎట్లు నడచును? అనునివి సామాన్యమైన ప్రశ్నలు మాత్రమేనని వారు (ఆధునికులు)భావించుచున్నారు. ఇవి గొప్పప్రశ్నలా అనివారూహించియుందురు. కాని యివి సామాన్యప్రశ్నలుగావు. నిజముగా నాలోచించిన ఒకని గొప్పతన మంతయు నీ మూటియందే యుండును స్థితప్రజ్ఞుని లక్షణములను సూచించు "ప్రజహాతి" 55 "దుఃఖేష్వనుద్విగ్నమనాః" 56 "యస్సర్వత్ర" 57 "యదా సంహరతే" 58 "తాని సర్వాణి" 61 "తస్మాద్యస్య" 68 నీ ఆరుశ్లోకములలో స్థితప్రజ్ఞుని స్వరూపము తెలుపబడినది.

ఇక 2–వ ప్రశ్నయగు "కిం ప్రభాషేత" అనుదానికి సమాధానము జూడుడు.

శ్లో॥ నాస్తిబుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా।
న చాభావయతశ్శాన్తి రశాన్తస్య కుతస్సుఖమ్॥ 66

తా॥ మనోనిగ్రహము లేనివానికి శుద్ధమనస్సు గలుగదు. శుద్ధమనస్సు లేని వానికి ఆత్మజ్ఞానమందు ప్రవేశమును గలుగదు. ఆత్మభావన లేనివానికి ప్రకృతి శమనము గలుగదు. ప్రకృతి నశింపనివానికి ఆత్మసుఖము యెక్కడిది? అనగా స్వస్థాన మందుగాని, పుణ్యప్రదేశములందుగాని, మఱి యెచ్చటను గలుగదు,

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి ॥ 67

తా॥ విషయములమీదికి పోవుచున్న ఇంద్రియములతో జేరుకొని, మనస్సు గూడ విషయములమీదికి బోయెనేని అట్టి మనస్సు సముద్రమునందలి ఓడను తుపానుగాలి ముంచివేయు విధముగ బ్రహ్మనిష్ఠునియొక్క ఆత్మజ్ఞానమును నశింపజేయుచున్నది. అనగా నట్టివాడు సంసారసాగరములో మునిగిపోవును. ఈలాటి జ్ఞానవైరాగ్య బోధలనే బ్రహ్మజ్ఞానియైనవాడు తన దగ్గఱకు వచ్చిన వారికి చెప్పుచుండును. కావుననే 'స్థితధీః కిం ప్రభాషేత' అని ప్రశ్నించుటకు కారణమైనది. ఇపుడుగూడ వైరాగ్యబోధోపరతులను పొందిన మహాత్ములదగ్గఱికి ఎవరేని వెళ్ళినచోవారు బంధనివృత్తిపరములగు జ్ఞానవైరాగ్యములనుగుఱించియే బోధించుచుందురు. అంతేగాని సంసారములో అందఱు బాగున్నారా? పిల్లలందఱు సంతోషముగా నాడుకొను చున్నారా? అని యీలాగున తమ వద్దకు వచ్చే వారిని ప్రశ్నించరు. ఈ సత్యమును తెలిసికొనక 'కింప్రభాషేత' అనుదానికి 'ఎట్లు మాట్లాడును' అని సామాన్యార్థమును గ్రహించి ఈ పవిత్రవాక్యమును సారహీనముగా దలంచుచున్నారు. ఇపుడుగూడ ఒక మహాత్ముడు ఒక స్థలమున నున్నాడని మిత్రుడొకడు చెప్పినచో ఆయన వద్దకు వచ్చు వారితో 'ఏమి చెప్పును' అని ప్రశ్నించుట స్వభావముగదా? అనగా వారు మంత్రమును గూర్చిగాని, తంత్రమునుగూర్చిగాని; సంసారమునుగూర్చిగాని; నిష్కామకర్మమునుగూర్చిగాని, భక్తిని గుఱించిగాని, జ్ఞానమును గుఱించిగాని చెప్పుదురా! యని అడిగే మామూలు ఉన్నదిగదా? ఆ మహాత్ముడు వైరాగ్యబోధోపరతులను, భక్తిజ్ఞానములను ఉపదేశింపకపోయిన లోకమేలాగున తరించగలదు? 'భాషేత' అని చెప్పక "ప్రభాషేత" అని ప్రయోగించుటకు కారణమేమిటి? ఏమి చెప్పునని యడిగినచో'భాషేత' అని ఉండిన సరిపోయెడిది. అట్లుగాక 'ప్రభాషేత' అని ప్రయోగించుటచే ముఖ్యముగాను ప్రధానముగాను ఏమి చెప్పునని విశేషముగా నడిగినట్లైనది. అందువలననే ఈప్రశ్నకు నుత్తరము చాల విస్తరించి శ్రీ భగవానుడు చెప్పుటకు కారణమైనది, శ్లో॥ 59 "విషయా వినివర్తన్తే" 60 "యతతో

హ్యాపి"62"ధ్యాయతో"63 "క్రోధాద్భవతి" 64 "రాగద్వేషవియుక్తైస్తు" 65 "ప్రసాదే" 66 "నాస్తిబుద్ధి" 67 "ఇంద్రియాణాం" 69 "యానిశా" 70 "ఆపూర్యమాణం" 72 "ఏషా బ్రాహ్మీ" అను ఈ పదునొకండు శ్లోకములను "స్థితధీః కిం ప్రభాషేత" అను ప్రశ్నకు సమాధానముగా శ్రీకృష్ణభగవానుడు చెప్పినట్లు తెలిసికొనవలయును.

ఇక 3-వ ప్రశ్నయగు "కిమాసీత" అనగా 'ఎట్లు కూర్చుండును' అనుదానికి సమాధానము చెప్పబోవుచున్నారు. ఎట్లు కూర్చుండునన నాతడు ఏమేమి ఏర్పాటులు చేసికొనియుండునని భావము. ఆశ్రమమునుగాని, ఇతరస్థాపనములగాని ఏర్పాటు చేసికొని వాటిని నడుపుచుండునా? లేక ఊరక కూర్చుండునా? అని భావము లోకములో గూడ ఒక విఖ్యాతపురుషునిగూర్చి యడుగునప్పుడు ఆ మహాత్ముడు లోకము కొఱకు ఏదైన మేలు చేయుచున్నాడా? లేక ఊరక కూర్చున్నాడా? అని యెటుల ప్రశ్నించుచుందురో ఇదియునటువంటిదే, కావుననే "కిమాసీత" అను ప్రశ్నలో గల 'ఆసీత' అను పదమునే "ఆసీతమత్పరః" అని సమాధాన శ్లోకములో ప్రయోగించుటకు కారణమైనది. స్థితప్రజ్ఞుడు ఊరక కూర్చుండువాడుకాడు. మఱి ఈ క్రింది శ్లోకమున చెప్పబడిన లక్షణము గలిగియున్నాడని తెలుపబడినది.

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశ్యేహి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 61

తా॥ అనుష్ఠానపరుడు సమస్తములైన ఇంద్రియములను చక్కగా వశపరచుకొని నాయందు అనగా పరమాత్మయందు ఐక్యపరచిన మనస్సుగలవాడై యుండును. ఏలననగా-ఎవనియొక్క ఇంద్రియములు స్వాధీనములై నుంటున్నవో అతనియొక్క జ్ఞానము స్థిరముగాయుండును. కావుననే "వశేహియస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా" అని ప్రయోగించుటకు కారణమైనది. బ్రహ్మనిష్ఠుడు ఊరక సోమరియై ఇంద్రియపరవశుడై కూర్చుండువాడుకాడని తెలుపబడమైనది. ఇది సామాన్యమైన ప్రశ్నయా?

ఇక నాల్గవప్రశ్నకు సమాధానము శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు. "వ్రజేత కిం" ఎట్లునడచుచుండును? అనునది నాల్గవ ప్రశ్న.

శ్లో॥ విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః॥
నిర్మమో నిరహంకారస్స శాంతిమధిగచ్ఛతి ॥

తా॥ ఏ పురుషుడు సమస్తములైన కోరికలను విడిచి (ఏవిషయములు కావలయునని తలంపులేనివాడై)అహంకారమమకారములులేనివాడై సంచరించు

చున్నాడో (ఉంటున్నాడో) వాడు సకల దుఃఖనివృత్తిరూపమైన మోక్షమును పొందుచున్నాడు. కావుననే "స శాంతిమధిగచ్ఛతి" అని తెలుపుటకు కారణము. ప్రకృతి శమించినచో పరమోపరతిరూపమగు శాంతిని పొందుచున్నాడు. దీనిచే స్థితప్రజ్ఞుడు సోమరియై (దిమ్మరిగా) తిరుగువాడుగాడని నిరూపించడమైనది. 'వ్రజేత్ కిమ్' అను ప్రశ్నకు సమాధానమును నిరూపించుటకే 'పుమాంశ్చరతి నిస్స్పృహః' అని ప్రయోగించడమైనది. అనగా 'వ్రజేత్ కిమ్' అనుప్రశ్నకు 'చరతి నిస్పృహః' అనునది సరియైన సమాధానమని గ్రహించునది. దుఃఖము సంపూర్ణముగా నశించినవాడై ఆత్మానందామృతపానభరితుడై స్థితప్రజ్ఞుడు, శ్రీబుద్ధదేవుడు, శ్రీ శంకరాచార్యులు, శ్రీ కృష్ణచైతన్యులు, శ్రీ ఏసుక్రీస్తు, శ్రీమహమ్మదునిబి మొదలగువారివలె నడచుచు ధర్మములను బోధించుచుండునని భావము. ఇట్టియథార్థమునుతృణీకరించి 'యెట్లునడచును'అనునదిగొప్పప్రశ్నయా యని అర్జునుని వాక్యమును సామాన్యులు నిర్లక్ష్యము చేయుచున్నారు. "ఆత్మ రతిఃఆత్మక్రీడఆత్మమిథున ఆత్మానందస్సస్వరాట్ భవతి"అనిఛాన్దోగ్యోపనిషత్తు. అంతయు ఆత్మమయముగాను, బ్రహ్మమయముగాను నెఱింగిన మహాత్ముడు ఆత్మానందభరితుడై ఆత్మకంటె అన్యముగా వేరువస్తువులేనందుచే ఆత్మయందు క్రీడించువాడై ఆత్మయందు రమించువాడై సదా బ్రహ్మాకారవృత్తిగలవాడై ఆత్మసామ్రాజ్యాధిపతియై సంచరించుచుండును. గీత మూడవఅధ్యాయమున గూడ నీలాగుననే బ్రహ్మజ్ఞానిని గుఱించి తెలుపడమైనది.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవస్యాత్ ఆత్మతృప్తశ్చమానవః।
ఆత్మన్యేవ చ సంతుష్టః..................... ॥ అ. 3, శ్లో॥ 17.

తా॥ ఎవడైతే తన ఆత్మలో తానే ఆనందించువాడుగను, తన ఆత్మలోనే తానుతృప్తినొందువాడుగను, తన ఆత్మలోనేక్రీడించువాడుగనుఉండి విహరించునో వాడే మహాత్ముడు కృతకృత్యుడు అని భగవానునిచే తెలుపడమైనది.

శ్రీభగవానువాచ:— శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ! మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥ 55

పద॥ ప్రజహాతి - యదా - కామాన్ - సర్వాన్ - పార్థ - మనోగతాన్, ఆత్మని - ఏవ - ఆత్మనా - తుష్టః - స్థితప్రజ్ఞః - తదా - ఉచ్యతే.

ప్రతి॥ హేపార్థ! = ఓఅర్జునా!, మనోగతాన్ = మనోగతములగు, సర్వాన్ = సమస్తములైన, కామాన్=కోరికలను(సంకల్పములను),యదా=ఎప్పుడు,

ప్రజహాతి= ప్రయత్నపూర్వకముగా విడుచుచున్నాడో, తదా = అప్పుడు. ఆత్మని ఏవ=తన ఆత్మయందే, ఆత్మనా= తన ఆత్మచేత, తుష్టః = ఆనందించువాడు, స్థితప్రజ్ఞః = నిశ్చలజ్ఞానముగలవాడని, ఉచ్యతే= చెప్పబడుచున్నాడు.

తా॥ ఓ అర్జునా ! అంతఃకరణములోగల సమస్తములైన కోరికలను (సంకల్పములను) ఎప్పుడు ప్రయత్నపూర్వకముగ విడుచుచున్నాడో, అప్పుడు శుద్ధమైన ఆత్మయగును. ఆ స్థితిలో ఆత్మకంటె భిన్నమైనవస్తువు గోచరించనందున తనలో తానే అఖండానందమననుభవించును. అట్టి స్థిరమైన జ్ఞానము గలవాడు స్థితప్రజ్ఞుడనబడును

వి॥ ఇచట 54-వ శ్లోకము మొదలు అధ్యాయాంతమువఱకు గల 19శ్లోకములును(స్థితప్రజ్ఞలక్షణములు)ప్రతిజిజ్ఞాసువుచే ముఖస్థము చేయవలసినవి.బ్రహ్మనిష్ఠులకు కావలసిన అనుష్ఠానములన్నియు ఈ శ్లోకములలో శ్రీకృష్ణునిచే ఉపదేశింపబడినవి. పూర్ణానుభవజ్ఞానముగలవాని లక్షణము ఈ55-వశ్లోకమున స్పష్టముగ తెలుపడమైనది. ఇంద్రియాది దృశ్యవిషయములలో నెంతవఱకురమించుచుండునో అంతవఱకు ప్రకృతిదోషము నశించనివాడనియు ఎప్పుడు ఆత్మానందములో నోలలాడుచుండునో అప్పుడే బంధవిముక్తి గలిగినవాడనియు తెలిసికొనవచ్చును. ఈస్థితప్రజ్ఞలక్షణభాగము భగవద్గీతయొక్క ప్రాణమనియే బ్రహ్మనిష్ఠులు తలంతురు. ఇయ్యది పరమభక్తులకును, యోగీశ్వరులకును, బ్రహ్మజ్ఞానులకును, సంబంధించినది.

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ 56

పద॥ దుఃఖేషు - అనుద్విగ్నమనాః - సుఖేషు - విగతస్పృహః,
వీతరాగభయక్రోధః - స్థితధీః - మునిః -ఉచ్యతే.

ప్రతి॥ దుఃఖేషు = దుఃఖములయందు. అనుద్విగ్నమనాః = దిగులు చెందని మనస్సు గలవాడును, సుఖేషు = సుఖములయందు, విగతస్పృహః= ఆశ లేనివాడును, వీతరాగభయక్రోధః = అనురాగము, భయము, క్రోధము పోయిన వాడునునైన, మునిః =మననశీలుడు (బ్రహ్మనిష్ఠుడు), స్థితధీః= స్థితప్రజ్ఞుడు అని, ఉచ్యతే - చెప్పబడుచున్నాడు.

తా॥ దుఃఖములయందు క్లేశముగలుగని మనస్సుగలవాడును, సుఖములయందు ఆసక్తిలేనివాడును, విషయములం దనురాగము,

భయము, కోపము లేనివాడునునైన మననశీలుడు, అచంచలమైన జ్ఞానము గలవాడని (స్థితప్రజ్ఞుడని) చెప్పబడుచున్నాడు.

వి॥ మౌనముచేత మునికాడు. బ్రహ్మతత్త్వమననముచేతనే మునియగుచున్నాడు.

శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్యశుభాశుభమ్ ।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 57

పద॥ యః - సర్వత్ర - అనభిస్నేహః - తత్ - తత్ - ప్రాప్య - శుభాశుభమ్, న - అభినందతి - న - ద్వేష్టి - తస్య - ప్రజ్ఞా - ప్రతిష్ఠితా.

ప్రతి॥ యః = ఎవడు, తత్‌తత్ = ఆయా, శుభాశుభం = మంచి చెడుగులను, ప్రాప్య =పొంది, సర్వత్ర =అంతట, అనభిస్నేహః =స్నేహానుబంధము (అభిమానము) లేనివాడై, న అభినందతి = ఆనందింపడో, న ద్వేష్టి= ద్వేషింపడో, తస్య = అట్టివానియొక్క, ప్రజ్ఞా = జ్ఞానము, ప్రతిష్ఠితా= మిక్కిలి స్థిరమైనది.

తా॥ ఎవడు ఆయా శుభాశుభములను బొంది మనోవికారము లేనివాడై శుభము చేకూరినపుడు పొగడకయు, దుఃఖము సంప్రాప్తమైనచో ద్వేషింపకయు నుండునో అట్టివానియొక్క జ్ఞానము సుస్థిరమైనదని తెలియవలయును.

వి॥ ఈ బ్రహ్మజ్ఞాని ద్వంద్వములు నశించినవాడు, అతడు ద్వంద్వాతీతుడు సముద్రమధ్యమునగల ఓడ అలలచే కదలుచుండును. ఒడ్డుననుండు పడవ చలించదు. ద్వంద్వములతో గూడిన వానియొక్కయు, సంసారసాగరమును తరించువాని యొక్కయు లక్షణములు ఈలాగున నుండును.

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 58

పద॥ యదా - సంహరతే - చ - అయం - కూర్మః - అంగాని- ఇవ - సర్వశః ఇంద్రియాణి - ఇంద్రియార్థేభ్యః - తస్య - ప్రజ్ఞా - ప్రతిష్ఠితా.

ప్రతి॥ (కిం) చ= మఱియు, కూర్మః = తాబేలు, అంగాని ఇవ = అవయవములనువలె, అయం = ఈ బ్రహ్మనిష్ఠుడు, యదా = ఎప్పుడు, సర్వశః = సమస్తములైన,ఇంద్రియార్థేభ్యః=దృశ్యవిషయములనుండి,ఇంద్రియాణి= ఇంద్రియములను, సంహరతే=మరలించుకొనుచున్నాడో,తదా= అప్పుడు,

తస్య = ఆ యోగియొక్క, ప్రజ్ఞా = జ్ఞానము, ప్రతిష్ఠితా = స్థిరమైనది అగుచున్నది.

తా॥ తాబేలు తన అవయవములను లోనికి ముడుచుకొను విధముగ, యోగియగువాడు ఎప్పుడుతన ఇంద్రియములను ఇంద్రియార్థములగు శబ్దాదివిషయములనుండి ఉపసంహరించు కొనుచున్నాడో, అప్పుడు ఆ యోగియొక్క ఆత్మజ్ఞానము సుస్థిరమైయుండును. ఇతడే సంయమి లేక స్థితప్రజ్ఞుడు అనబడును.

వి॥ ముముక్షువులు మూడుతరగతులుగనుందురు. (1) మీనవృత్తిగలవాడు, (2) మృగవృత్తిగలవాడు, (3) కూర్మవృత్తిగలవారు మీనము జలములో సంచరించునుగాని తీరమున విహరింపజాలదు, మృగము భూమిపై సుఖముగా జీవించును గాని, నీటిలో వాసముచేయజాలదు కూర్మము భూమియందును, జలమందును సమానముగా జీవించును. ఈలాగున కొందఱికి జనసముదాయములో నుండుట యిష్టముగను, ఏకాంతములో నుండుట కష్టముగను తోచును. కొందరికి నిర్జనప్రదేశములోనుండుట సంతోషకరముగను, జనమధ్యముననుండుటకష్టముగను నుండును. వీరుభయులును గొప్పబోధకులు కాజాలరు. కూర్మమేలాగున ఉదకమందును, భూమియందును, ఒకే విధముగానుండునో, ఆలాగున విజన ప్రదేశమందును, సంసారజనస్తోమమందును ఒకేవిధముగానుండుచూ, చలింపని జ్ఞానముగలవాడే యోగియగును, ఇట్టి స్వభావముగలవాడు ప్రవక్తలలో చేరినవాడు. తక్కినవారు సామాన్యభక్తులలోను ముముక్షువులలోను చేరినవారగుదురు.

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ 59

పద॥ విషయాః - వినివర్తంతే - నిరాహారస్య - దేహినః,
రసవర్జం – రసః – అపి – అస్య – పరం – దృష్ట్వా – నివర్తతే.

ప్రతి॥ నిరాహారస్య=ఆహారములేని, దేహినః =పురుషునకు, విషయా = విషయములు, రసవర్జం=అభిలాషను వదలి(విషయావాసన తప్ప), వినివర్తంతే= నివర్తించుచున్నవి. అస్య= ఇతనియొక్క, రసః అపి=విషయానురాగము, పరం = పరమాత్మస్వరూపమును, దృష్ట్వా = తెలిసికొనిన పిమ్మట, నివర్తతే = నివృత్తియగుచున్నది.

తా॥ ఆహారములేక తపమొనర్చెడు పురుషునకు విషయములు నివృత్తము లగుచున్నవి. కాని విషయములలోగల వాసన నశించుట

లేదు. దైవరసము గలుగునప్పుడే విషయరసము నశించును. కావున పరమాత్మదర్శనము గలుగునప్పుడే విషయవాసన సంపూర్ణముగ నశించును.

వి॥ శరీరతపస్సుచే నింద్రియములు విషయములలో ప్రవర్తింప శక్తి లేనివియే యగును. కాని లోపల వాసన నశింపదు. అరటిచెట్టు నరికి వేసినను, మూలము భూమి లోపల నుండుటవలన మఱల మొలకవచ్చును. ఆ దుంపను మూలముతో గూడ పెరికివేసిన మఱల మొలవదు. కావున బాహ్యతపస్సు మాత్రము చాలదు. ఆత్మ జ్ఞానాగ్నియందు అంతఃకరణములోగల వాసనలులేక వృత్తులనెడి కట్టెలను దహింపజేయవలెను, లేనిచో మఱల ఎప్పుడైన శరీరేంద్రియములకు పుష్టి కలుగు నప్పుడు విషయాభిలాష ఆవిర్భవించును. ఒకవేళ ఈ జన్మమువఱకు దేహతపస్సు గలిగియుండినను మఱియొక జన్మము వచ్చినపుడు విషయవృత్తులు అంకురించుమ. బీజములు మట్టిలోను నీటిలోను ఉంచిన మొలవవు. దేహతపస్సున్ను ఇట్టిదే. కానిమఱల నెప్పటికైన భూమిస్పర్శగాని జలస్పర్శగాని గలిగిన అంకురించును. ఆ విత్తనములనే నిప్పులో వేయించిన చూచువారికి బీజరూపముగా గనిపించినను. మఱల అంకురింపవు. అట్లే జ్ఞానాగ్ని యందు దగ్ధమైన హృదయమైనచో మఱల జన్మము గలుగదు, చూచువారికి సామాన్యమనుజుడుగా గనిపించినను ఆ పుణ్యాత్ముడు జీవన్ముక్తుడు. అయితే పవిత్రమైన నిష్కామబుద్ధితో జేసెడు దేహతపస్సు గూడ ఆత్మజ్ఞానమునకు సహాయపడును.

శ్లో॥ యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ 60

పద॥ యతతః - హి - అపి - కౌంతేయ! - పురుషస్య - విపశ్చితః,
ఇంద్రియాణి – ప్రమాథీని - హరన్తి - ప్రసభం - మనః.

ప్రతి॥ హేకౌన్తేయ! = ఓ అర్జునా!, యతతః = యత్నించుచున్న, విపశ్చితః = విద్వాంసుడైన, పురుషస్య=పురుషునియొక్క, మనః అపి = మనస్సును గూడ, ప్రమాథీని=క్షోభమును గలుగజేయునట్టి, ఇంద్రియాణి = ఇంద్రియములు, ప్రసభం=బలాత్కారముగ, హరంతి హి=హరించుచున్నవిగదా.

తా॥ ఓ అర్జునా! ఇంద్రియములను విషయములనుండి మరలించుటకై యత్నించుచున్న విద్వాంసుడైన పురుషునియొక్క మనస్సునుగూడ ప్రమాథకరములగు ఇంద్రియములు బలాత్కారముగ హరించుచున్నవి

వి॥ పండితుడై, సాధకుడై యుండువాని మనస్సునుగూడ విషయములు క్షోభను కలుగజేయుచుండగా, పాండిత్యము అనుష్ఠానమున్ను లేనివారలను గుఱించి యిక చెప్పవలెవా?

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 61

పద॥ తాని - సర్వాణి - సంయమ్య - యుక్తః - ఆసీత - మత్పరః,
వశే - హి - యస్య - ఇంద్రియాణి - తస్య - ప్రజ్ఞా - ప్రతిష్ఠితా.

ప్రతి॥ యుక్తః = యోగసాధన గలవాడు, సర్వాణి = సమస్తములైన, తాని= అట్టి ప్రమాదకరములగు ఇంద్రియములను, సంయమ్య = చక్కగా వశపరచుకొని, మత్పరః = నాయందాసక్తమైన చిత్తము గలవాడై, ఆసీత= ఉండవలెను. హి = ఏలననగా, యస్య = ఎవనియొక్క, ఇంద్రియాణి= ఇంద్రియములు, వశే = స్వాధీనమందున్నవో, తస్య = వానియొక్క, ప్రజ్ఞా = జ్ఞానము, ప్రతిష్ఠితా = సుస్థిరమైనది.

తా॥ అనుష్ఠానపరుడు సమస్తములైన యింద్రియములను చక్కగా వశపరచుకొని నాయందు అనగా పరమాత్మయందు ఐక్య పరచిన మనస్సు గలవాడై యుండవలెను. ఏలననగా ఎవనియొక్క ఇంద్రియములు తన ఆధీనమునందుంటున్నవో వానియొక్క జ్ఞానము స్థిరమైనది. అతడు స్థిత ప్రజ్ఞుడనబడును.

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంసస్సంగస్తేషూపజాయతే ।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥ 62

పద॥ ధ్యాయతః – విషయాన్ - పుంసః - సంగః – తేషు - ఉపజాయతే,
సంగాత్ - సంజాయతే - కామః – కామాత్ - క్రోధః - అభిజాయతే.

ప్రతి॥ విషయాన్ = విషయములను, ధ్యాయతః = చింతించుచున్న, పుంసః = పురుషునకు. తేషు=ఆ విషయములయందు, సంగః=ఆసక్తి, ఉపజాయతే= పుట్టుచున్నది. సంగాత్=అట్టి ఆసక్తివలన, కామః=కోరిక, సంజాయతే= కలుగుచున్నది, కామాత్=కోరికవలన, క్రోధః = కోపము, అభిజాయతే= కలుగుచున్నది.

తా॥ ఇంద్రియవిషయములను సదా చింతించుచున్న మనుజునకు ఆ విషయములయందు ఆసక్తి పుట్టుచున్నది. అట్టి యాసక్తివలన కోరిక గలుగుచున్నది. కోరికవలన కోపము జనించుచున్నది.

శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥ 63

పద॥ క్రోధాత్ – భవతి - సమ్మోహః - సమ్మోహాత్ – స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాత్ - బుద్ధినాశః - బుద్ధినాశాత్ - ప్రణశ్యతి.

ప్రతి॥ క్రోధాత్ = కోపమువలన, సమ్మోహః = అవివేకము, భవతి=గలుగుచున్నది. సమ్మోహాత్ = అవివేకమువలన, స్మృతిభ్రంశః = మతిభ్రమ గలుగుచున్నది. స్మృతిభ్రంశాత్ = మతిభ్రమవలన, బుద్ధినాశః = బుద్ధి నాశము సంభవించుచున్నది, బుద్ధినాశాత్ = బుద్ధినాశమువలన, ప్రణశ్యతి = నశించుచున్నాడు.

తా॥ కోపమువలన అవివేకము గలుగుచున్నది. యుక్తాయుక్త వివేకములేని అవివేకమువలన మతిభ్రమ గలుగుచున్నది. మతిభ్రమ వలన బుద్ధి నశించుచున్నది. అట్లు బుద్ధినాశమువలన తానున్ను తప్పక నశించుచున్నాడు.

వి॥ విషయచింతనవలన దానియందు (1) ఆసక్తియు, దానివల్ల(2)కామమును, కామమువలన (దానికి అడ్డుగలుగునప్పుడు)(3)కోపమును, కోపమువలన (4) యుక్తాయుక్తవివేకము లేకపోవుటయు. అట్టి వివేకజ్ఞానము నశించుటవలన (5)మతిభ్రమయును,మతిభ్రమవలన(6)యథార్థము తెలియక బుద్ధినాశనమును, బుద్ధినాశనమువలన(7)సర్వస్వనాశమున్నుగలుగుచున్నది.అనగా ఆత్మవినాశము గలుగుచున్నది. ఈ ఏడు విధములగు పరిణామములకును విషయచింతనయే కారణమగుచున్నది. ఒక చింతవిత్తనము మొలకవచ్చిన సమయమున దానిని గోరుతో సులభముగా త్రుంచివేయవచ్చును. అది కొమ్మలతో రెమ్మలతో పెరిగి పెద్ద చెట్టయిన పిమ్మట దానిని త్రుంచివేయుటకుగాని, మూలముతో నూడ పెరుకుటకుగాని,రహిత మొనర్చుటకుగాని ఎంతటిప్రయాసయో లేక తరముకాదో. అట్లే విషయవాసన కలిగిన వెంటనే దానిని రహిత మొనర్చుట సులభము. లేనిచో దానిని నాశన మొనర్చుట మహాప్రయాస యగును. అంతేగాక దానిచే ఆత్మ వినాశముగూడ సంభవించును.

శ్లో॥ రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥ 64

పద॥ రాగద్వేషవియుక్తైః - తు - విషయాన్ - ఇంద్రియైః - చరన్
ఆత్మవశ్యైః - విధేయాత్మా - ప్రసాదం - అధిగచ్ఛతి.

ప్రతి॥ విధేయాత్మా తు=మనస్సును స్వాధీనమందుంచుకొన్నవాడై తే,ఆత్మవశ్యైః తనకు వశీభూతములుగా నుండునట్టియు. రాగద్వేషవియుక్తైః=రాగద్వేషాదులులేనట్టివియునైన,ఇంద్రియైః=ఇంద్రియములచేత,విషయాన్=ఆత్మసంరక్షణముకొఱకు మాత్రము గల విషయములను, చరన్=అనుభవించుచున్నవాడైనను, ప్రసాదం=చిత్తశాంతిని, అధిగచ్ఛతి=పొందుచున్నాడు.

తా॥ మనస్సును తనస్వాధీనమందుంచుకొన్న సంయమవంతుడన్నవో తనకు వశములై యుండునట్టివియు, రాగద్వేషాదులు లేనట్టివియునగు ఇంద్రియములచేత దేహసంరక్షణకొరకు మాత్రము విషయములను అనుభవించుచున్నను ఆత్మప్రసన్నతను చిత్తప్రశాంతిని పొందుచున్నాడు.

వి॥ బ్రహ్మనిష్ఠుడు దేహసంరక్షణకొఱకు మాత్రముచేయు అన్నపానాదుల చేత తనఆత్మప్రసన్నతకు చిత్తశాంతికి భంగము గలుగనీయక యుంటున్నాడు. అనగా దేహసంరక్షణవలన జ్ఞానమున కావరణము గలుగదు. జీవించుటకు మాత్రము తినువాడు ముక్తుడు, తినుటకు జీవించువాడు బద్ధుడగును.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే॥ 65

పద॥ ప్రసాదే - సర్వదుఃఖానాం - హానిః - అస్య - ఉపజాయతే,
ప్రసన్నచేతసః - హి - ఆశు - బుద్ధిః - పర్యవతిష్ఠతే.

ప్రతి॥ ప్రసాదే=మనోనిర్మలత గలుగుచుండగా, అస్య=ఈ బ్రహ్మనిష్ఠునికి, సర్వదుఃఖానాం=సమస్తదుఃఖములయొక్క, హానిః= నాశము, ఉపజాయతే = కలుగుచున్నది, ప్రసన్న చేతసః=నిర్మలమైన చిత్తముగలవానికి,ఆశు=శీఘ్రముగా, బుద్ధిః = మతి, పర్యవతిష్ఠతే హి = నిలుకడగలదగుచున్నదికదా!

తా॥ చిత్తము నిర్మలమయిన దైనచో సకల దుఃఖములు నశించిపోవును. మఱియు నిర్మలమయిన చిత్తము గలవానికి త్వరలో ధ్యానమందు నిలుకడ గలుగును. అతని బుద్ధి సుస్థిరమగును.

వి॥ నిర్మలోదకముగల పాత్రయందు సూర్యప్రతిబింబము స్పష్టముగ కనిపించునట్లు విశుద్ధాంతఃకరణము గలవారికి ధ్యేయమగు ఆత్మసాక్షాత్కారము త్వరలోనే కలుగును.

శ్లో॥ నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।
న చాభావయతశ్శాన్తిరశాన్తస్య కుతస్సుఖమ్ ॥ 66

పద॥ న - అస్తి - బుద్ధిః - అయుక్తస్య - న - చ - అయుక్తస్య - భావనా, న - చ - అభావయతః - శాన్తిః - అశాన్తస్య - కుతః - సుఖమ్.

ప్రతి॥ అయుక్తస్య=మనోనిగ్రహము లేనివానికి, బుద్ధి =శుద్ధమైన లేక స్థిరమైన మనస్సు, న అస్తి = కలుగదు, మఱియు, అయుక్తస్య=మనోనిగ్రహము లేనివానికి, భావనా చ = ఆత్మజ్ఞానమందు ప్రవేశమును, న = గలుగదు, అభావయతః = ఆత్మభావనలేనివానికి, శాంతిః చ= ప్రకృతి శమనమును, న = కలుగదు, అశాన్తస్య = శాంతిలేనివానికి, సుఖం = ఆత్మసుఖము, కుతః = ఎక్కడిది?

తా॥ మనోనిగ్రహము లేనివారికి శుద్ధమనస్సు లేక స్థిరబుద్ధి గలుగదు. శుద్ధమనస్సు స్థిరబుద్ధిలేనివారికి ఆత్మజ్ఞానమందు ప్రవేశము గలుగదు. ఆత్మభావన లేనివానికి ప్రకృతి శమనము గలుగదు. ప్రకృతి నశింపనివానికి ఆత్మసుఖ మెక్కడిది? అనగా స్వస్థానమందు గాని, పుణ్యప్రదేశములందుగాని, పరమందుగాని మఱియెచ్చటను అతనికి ఆత్మసుఖము శాంతి గలుగదని భావము.

వి॥ (1) మనోనిగ్రహము లేనివానికి నిర్మలబుద్ధి యుండదు. (2) నిర్మల బుద్ధిలేనివానికి బ్రహ్మభావన గలుగదు. (3) బ్రహ్మభావన గలుగనివానికి ఆత్మ శాంతి గలుగదు (4) శాంతిలేనివాని కెచ్చటను సుఖములేదు. ఈ నాల్గును ఒక దానికంటె మఱియొకటి అధికముగా నుండును. కాని మొదటిదానియొక్క అను ష్ఠానము వలన తక్కిన మూడును క్రమముగా జేకూరును.

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥ 67

పద॥ ఇంద్రియాణాం - హి – చరతాం - యత్ – మనః – అనువిధీయతే, తత్ - అస్య – హరతి – ప్రజ్ఞాం – వాయుః - నావం - ఇవ - అంభసి.

ప్రతి॥ హి = ఏలననగా, చరతాం = విషయములయందు ప్రవర్తించుచున్న, ఇంద్రియాణాం – ఇంద్రియములలో, యత్ = ఏ, మనః = మనస్సు, అనువిధీయతే = అనుసరించి ప్రవర్తించుచున్నదో, తత్ = ఆమనస్సు, అస్య = ఈమనోనిగ్రహములేనివానియొక్క, ప్రజ్ఞాం = వివేకజ్ఞానమును, వాయుః = గాలి, అంభసి = ఉదకమునందు (సముద్రమునందు) నావం ఇవ = ఓడనువలె, హరతి = హరించుచున్నది.

తా॥ విషయములమీదికి పోవుచున్న ఇంద్రియములతో జేరుకొని మనస్సుగూడ విషయములమీదికి బోయెనేని అట్టి మనస్సు సముద్రము నందలి ఓడను తుపానుగాలి ముంచివేయు విధముగ, బ్రహ్మనిష్ఠునియొక్క ఆత్మజ్ఞానమును నశింపజేయుచున్నది. అనగా అట్టివాడు సంసారసాగరములో మునిగిపోవును.

వి॥ 'ఇంద్రియములు విషయములలో ప్రవర్తించుచున్నను దోషములేదు. మనస్సే ప్రధాన'మని చెప్పువారల గుఱించి శ్రీకృష్ణభగవాను డుపదేశించినది చూడుడు. సముద్రములో ప్రయాణము చేసెడు నావికులు తుపానుగాలియొక్క చిహ్నము గనిపించిన, ఓడను ఏలాగునలంగరువేసి నిలబెట్టుదురో లేక ఓడను రేవులోనికి జేర్చుదురో, ఆలాగునఎచ్చట నెట్లుండిన విషయదోషముచే మనస్సునకు మాలిన్యము లేక పతనము గలుగుననితోచునో, ఆస్థలమును వెంటనేవిడిచివెళ్ళవలెను. లేక యేకాంతమున ధ్యానములో నుండవలెను. అట్లుగానిచో సంసారసాగరములో మునుగుట నిక్కువము.

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో ! నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 68

పద॥ తస్మాత్ - యస్య - మహాబాహో! – నిగృహీతాని – సర్వశః, ఇంద్రియాణి - ఇంద్రియార్థేభ్యః – తస్య – ప్రజ్ఞా – ప్రతిష్ఠితా.

ప్రతి॥ తస్మాత్ = అందువలన, హేమహాబాహో! = ఓయర్జున!, యస్య=ఎవనియొక్క, ఇంద్రియాణి = ఇంద్రియములు, ఇంద్రియార్థేభ్యః=విషయములనుండి, సర్వశః=సర్వవిధముల, నిగృహీతాని= నిగ్రహింపబడుచున్నవో, తస్య = అతనియొక్క, ప్రజ్ఞా = జ్ఞానము, ప్రతిష్ఠితా = స్థిరమైనది.

తా॥ ఓ అర్జునా ! ఆ కారణము వలన ఏ బ్రహ్మనిష్ఠునియొక్క ఇంద్రియములు విషయములనుండి సర్వవిధముల నిగ్రహింపబడినవగుచున్నవో, అట్టి బ్రహ్మనిష్ఠుని జ్ఞానము స్థిరమైయుండును. అతడు స్థితప్రజ్ఞుడనబడును.

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ 69

పద॥ యా - నిశా - సర్వభూతానాం - తస్యాం - జాగర్తి - సంయమీ
యస్యాం - జాగ్రతి - భూతాని - సా - నిశా - పశ్యతః - మునేః.

ప్రతి॥ సర్వభూతానాం = సమస్తప్రాణులకు, యా=ఏది, నిశా = రాత్రియగుచున్నదో, తస్యాం=అట్టి రాత్రియందు, సంయమీ=ఇంద్రియనిగ్రహము గల యోగి, జాగర్తి=జాగరూకుడై యుండును. యస్యాం = దేనియందు, భూతాని = ప్రాణులు, జాగ్రతి = జాగరూకములగుచున్నవో, సా=అది, పశ్యతః=ఆత్మావలోకనము చేయుచున్న, మునేః=మననశీలునకు, నిశా= రాత్రిగా నుండును.

తా॥ సమస్తప్రాణులకు అనగా అజ్ఞానులకు ఏది(ఆత్మజ్ఞానము) రాత్రియగుచున్నదో (మనోదృష్టికి గోచరించక యుండునో) అట్టి యాత్మజ్ఞానమునందు ఇంద్రియ నిగ్రహముగల యోగి జాగరూకుడై యుండును, (ఆత్మావలోకనము జేయుచుండును.) దేనియందు (ఏ ఇంద్రియవిషయములందు) ప్రాణులు (అజ్ఞానులు) జాగరూకము లగుచున్నవో (విషయాసక్తితో ప్రవర్తించుచున్నవో) అది (ఇంద్రియ వ్యాపారము) ఆత్మావలోకనము చేయుచున్న మునికి రాత్రిగా నుండును.

వి॥ ఆత్మజ్ఞానికి ఏది పగలుగా నుండునో అజ్ఞానికి అది రాత్రిగా నుండును. అజ్ఞానికి ఏది పగలుగా నుండునో ఆత్మజ్ఞానికి అది రాత్రిగానుండును. ప్రపంచములో గల మనుష్యులే గాక ప్రాణికోట్లు సహా జాగ్రత్ స్వప్న సుషుప్తులకు హేతువులైన స్థూల, సూక్ష్మ, కారణ దేహములవఱకే సంచరించును. అనగా జాగ్రదవస్థలో స్థూలదేహమందును స్వప్నావస్థలో సూక్ష్మదేహమందును. సుషుప్తిఅవస్థలో కారణ దేహమందును, విహరింతురు, తరువాత సుషుప్తినుండి స్వప్నములోనికి. స్వప్నము నుండి జాగ్రద్దశలోనికి వచ్చుచుందురు. ఈ మూడును మాయలోకములు, లెస్సగా ఇంద్రియములను జయించినయోగి ఈ మూడింటికి విలక్షణమైయుండు మహా కారణమగు తురీయపదములో నుండును. అది స్వప్రకాశమైనది. అది జ్ఞాన నిలయము. తక్కినవి అజ్ఞానమయములు. అందువలన నవి చీకటి మయములుగా నుండును.

శ్లో॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।

తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తిమాప్నోతి న కామకామీ ॥ 70

పద॥ ఆపూర్యమాణం – అచలప్రతిష్ఠం – సముద్రం – ఆపః – ప్రవిశన్తి – యద్వత్ – తద్వత్ – కామాః - యం – ప్రవిశన్తి – సర్వే - సః - శాన్తిం - ఆప్నోతి – న - కామకామీ.

ప్రతి॥ ఆపూర్యమాణం=అనేక నదులలోనియుదకముచేతసంపూర్ణముగానిండింపబడినదియు,అచలప్రతిష్ఠం=హద్దుమీరని స్థిరమైన యునికి గలదియునగు, సముద్రం=సాగరమును, ఆపః = ఉదకము. యద్వత్ = ఏ విధముగా ప్రవిశన్తి=ప్రవేశించుచున్నదో, తద్వత్=ఆ విధముగా, సర్వే=సమస్తములైన, కామాః=కోర్కెలు, యం=ఎవనిని,ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవో, సః=అట్టివాడు, శాన్తిం = ఉపరతిని, ఆప్నోతి = పొందుచున్నాడు, కామకామీ=విషయాసక్తుడగువాడు, న =పొందజాలడు.

తా॥ అంతటను నిండింపబడినదియు, స్థిరమైన యునికి గలది (అనగా హద్దును మీరుటగాని తగ్గుటగాని లేక ఎల్లప్పుడునొకటేరీతిగా నుండునట్టిది)యునైన సాగరమును ఉదకములు (నదులు మొదలగునవి) ఏ విధముగా ప్రవేశించుచున్నవో, ప్రవేశించి తద్రూపములే అయిపోవుచున్నవో ఆ విధముగా సమస్తమైనకోరికలు ఏబ్రహ్మనిష్ఠుని యందు స్వరూపభూతములై అణగిపోవుచున్నవో, అతడు చిత్తోపరతిని పరమ శాంతిరూపమగు మోక్షమును పొందుచున్నాడు; విషయాసక్తుడగువాడు అట్టి పరమశాంతిని పొందజాలడు.

వి॥ అనేక నదీనదములచే సముద్రము నిండింపబడినను, దానివలన విశేషముగా పొంగుటగాని, లేక యెండాకాలములో నదులనుండి జలమురాకపోయిన తగ్గుటగాని యుండదో, అలాగున దశేంద్రియముల (నవద్వారములును, స్పర్శేంద్రియ మొకటి) ద్వారా శబ్దాదివిషయములు హృదయములో ప్రవేశించినను, ఏ విషయసంకల్పములు లేక హృదయము నిర్విషయముగానుండినను ఒకేవిధముగా ననగా హెచ్చుతగ్గులు లేక హర్షశోకములులేక యుండువాడే అచలుడగు యోగి యగును. అట్టివానికే పరమ శాంతి లభించును. ఉప్పొంగెడి వాడు యోగి కాజాలడు. అతడు కామదాసుడే యగును. అతనికి శాంతిలేదు,

శ్లో॥ విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకారస్స శాంతిమధిగచ్ఛతి ॥ 71

పద॥ విహాయ - కామాన్ - యః - సర్వాన్ - పుమాన్ - చరతి - నిస్పృహః, నిర్మమః - నిరహంకారః - సః - శాంతిం - అధిగచ్ఛతి.

ప్రతి॥ యఃపుమాన్ = ఏ పురుషుడు, సర్వాన్ = సమస్తములైన, కామాన్ = కోరికలను, విహాయ = విడిచి, నిస్పృహః = ఏ విషయములు కావలెనని తలంపు లేనివాడును, నిర్మమః = మమకారము లేనివాడును, నిరహంకారః = గర్వము లేనివాడునునై, చరతి = సంచరించుచున్నాడో, సః = వాడు, శాంతిం = పరమశాంతిని, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా॥ ఎవడు సమస్తములైన కోరికలను విడిచి నిస్పృహుడై (ఏ విషయములు కావలెనని తలంపు లేనివాడై) అహంకార మమకారములు లేనివాడై సంచరించుచున్నాడో (ఉంటున్నాడో) వాడు పరమ శాంతిని సకలదుఃఖనివృత్తిరూపమైన మోక్షమును పొందుచున్నాడు.

వి॥ దీనియందు 'యః' అని యచ్ఛబ్దప్రయోగము ప్రయోగింపబడుటచే ఇట్టి అవస్థగలవాడు ఏ మానవుడైనను జీవన్ముక్తుడగునని దెలియవలయును. ముందు 55-వ శ్లోకమున ప్రప్రథమమున శ్రీ భగవానునిచే ఏది యుపదేశింపబడెనో ఈ అంత్య భాగమునగూడ నదియే జెప్పడమైనది. తక్కిన మధ్యగల శ్లోకములు ఆ మొదటి శ్లోకార్థమును పోషించునవే.

శ్లో॥ ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాంప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ 72

పద॥ ఏషా - బ్రాహ్మీ - స్థితిః - పార్థ - న - ఏనాం - ప్రాప్య - విముహ్యతి, స్థిత్వా - అస్యాం - అంతకాలే - అపి - బ్రహ్మనిర్వాణం - ఋచ్ఛతి.

ప్రతి॥ హే పార్థ! = ఓ అర్జునా !, ఏషా = ఇది, బ్రాహ్మీ = బ్రహ్మసంబంధమైన, స్థితిః = నిష్ఠ, ఏనాం = ఈ నిష్ఠను, ప్రాప్య = పొంది, న విముహ్యతి = మోహమును చెందడు, అంతకాలే అపి = మరణకాలమందైనను, అస్యాం = ఈ నిష్ఠయందు, స్థిత్వా = ఉండినయెడల, బ్రహ్మనిర్వాణం = మోక్షమును, ఋచ్ఛతి = పొందున్నాడు.

తా॥ ఓ అర్జునా! ఇంతవఱకు జెప్పబడినది బ్రాహ్మీస్థితి. అనగా బ్రహ్మసంబంధమైన బ్రహ్మపదప్రాప్తికి సాధనమైన నిష్ఠ, ఈ నిష్ఠను

పొందినవాడు మోహమును జెందడు. మరణకాలమున గూడ ఈ నిష్ఠయందున్నవాడు అనగా ఉండినయెడల బ్రహ్మనిర్వాణమును లేక బ్రహ్మైక్యమును అనగా బ్రహ్మలో గలియుటను అనగా మోక్షమును పొందుచున్నాడు.

వి॥ ఈ శ్లోకము బ్రహ్మజ్ఞానము నుపదేశించు ఘట్టములో నంత్యమనచెప్ప బడుటచే వృద్ధులగు భక్తులపై శ్రీకృష్ణభగవానుడు కరుణారసమును ప్రసరింపజేసి నట్టినది. ఏలనన– యౌవనము, ఉద్యోగము, అధికారము స్వాధీనములోనుండు ధనము–అంతయుపోయిన తరువాత ముదుసలులైన తరువాత నేదో పుణ్యవిశేష ముచే మోక్షము కావలెనని తలంపు గలిగిన దనుకొనుడు. కాని యే సాధన చేయుటకును సమర్థతలేని స్థితి యేర్పడినది. అట్టివారిపై కరుణించి యిది యుప దేశించడమైనది. ప్రాణప్రయాణకాల మాసన్నమైనప్పుడు భగవచ్చింతనధ్యానము గలిగిన చాలుననియు, అట్టివారికి గూడ బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము నిర్వాణ ప్రాప్తి గలుగుననియు భగవంతుడు అనుగ్రహరూపముగా జెప్పెను. బహు కాలము అంధకారావృతమైయున్నను గుహయందు దీపము వెలిగించిన వెంటనే అందలి చీకటి తొలగి యెట్లు ప్రకాశవంతమగుచుండునో, అలాగున హృదయ గుహయందు చిరకాలమునుండి ఉంటున్న అజ్ఞాన తమస్సుగూడ భగవత్ చింతన గలిగినవెంటనే నశించిపోవును, అట్టైన బాల్యమునుండి లేక యౌవనకాలము నుండి బ్రహ్మనిష్ఠ యేల చేయవలయును? అంత్యకాలమందుచేసిన చాలదా? అని తలంచవలదు. జీవితము ఉత్తరక్షణము వఱకు నిలుచునని యెవ్వరు చెప్ప గలరు? మఱియు ఒక వేళ అంత్యకాలమువఱకు జీవించినను అప్పుడు దైవచిం తన గలుగునో లేదో యెవరికి దెలియును ! కావున తలంచునపుడే దైవచింతన గలిగేలాగున చూచుకొనవలెను. మఱియు బాల్యకాలమునుండి జ్ఞానము గలిగిన వానికి ముక్తిగలుగునా? లేదా? యని సందేహము గలుగదు. ఏలనన–ఒకడు తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనమునకు ఉదయమునుండి కనిపెట్టుకొని కూర్చొనియున్నాడు మఱియొకడు దర్శనమునకు తలుపు తీసిన సమయమున పరుగెత్తుకొని వచ్చినాడు. దర్శనము ఏక కాలమున భేదములేక ఉభయులకును లభించెను. అయితే ఉదయము నుండి వచ్చి కూర్చుండు వానికి దర్శన విషయమై సందేహము గలుగదు. దేవాలయమును భగవద్విభూతిని చూచి

ఆనందించుచుండును. అప్పుడే పరుగెత్తుకొనివచ్చినవాడు దర్శనము లభించునా? లేదా ?అని వ్యాకులముతో వచ్చుచుండును. అదే ఆఉభయులకు గల తారతమ్యము. అలాగున ఒక తీర్థయాత్రికుడు ఉదయము అన్నసత్రమునకు వెళ్ళి పేరు దాఖలుచేసుకొన్నాడు. మఱియొక యాత్రికుడు భోజనపు గంటకొట్టిన సమయమునకు వచ్చినాడు.ఉభయులకును ఏక కాలముననే సమృద్ధిగ భోజనము లభించెను. కాని ఉదయం వచ్చినవానికి భోజనమున సందేహము లేదు. అంతే కాదు. వాడు స్నానము చేసికొని జప ధ్యానాదులు చేసికొని ఆనందభరితుడై శాంతిగ కూర్చొని యుండెను. అప్పుడే యెండలో పరుగెత్తుకొని వచ్చు వాడు భోజనము దొరకునా? లేదా? అని వ్యాకులత జెంది యుండును. ఇదే యిరువురకుగల తారతమ్యము. కాన మరణాసన్న సమయమున భగవద్ధ్యానము. తత్స్మరణము చేయవచ్చునని భావింపక ముందునుండియే అభ్యాసము చేయుచుండిన యెడల అంత్యకాలమున సయితము భగవచ్చింతన గలిగి భగవత్ప్రాప్తి బ్రహ్మనిర్వాణము లేక మోక్షము తప్పక గలుగును

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జున సంవాదే సాంఖ్యయోగో నామ
ద్వి తీ యో ఽ ధ్యా యః

పద॥ ఇతి - శ్రీమద్ భగవద్గీతాసు - ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగ శాస్త్రే - శ్రీకృష్ణార్జునసంవాదే – సాంఖ్యయోగః - నామ - ద్వితీయః - అధ్యాయః,

ప్రతి॥ ఇతి = ఇట్లు, ఉపనిషత్సు = ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యాయాం = బ్రహ్మవిద్యాస్వరూపమును, యోగశాస్త్రే = యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జునసంవాదే= శ్రీకృష్ణార్జున సంవాదమునునగు, శ్రీభగవద్గీతాసు= శ్రీభగవద్గీతలలో,సాంఖ్యయోగః నామ = సాంఖ్యయోగమను, ద్వితీయః అధ్యాయః = రెండవ అధ్యాయము ముగిసెను.

తా॥ ఇట్లు ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీమద్భగవద్గీతయందుసాంఖ్య యోగమను పేరుగల రెండవ అధ్యాయము ముగిసినది.

ఓమ్ తత్ సత్



ఓమ్

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## తృతీయోఽధ్యాయః - తృతీయాధ్యాయము

## కర్మయోగః - కర్మయోగము



ద్వితీయాధ్యాయమున సాంఖ్యయోగమగు బ్రహ్మతత్త్వము నుపదేశించిన తరువాత మూడవ అధ్యాయమున కర్మయోగము నుపదేశించుటలో గొప్పభావము గలదు. వేదాంతశాస్త్రరీతిగా మొదట నిష్కామకర్మయోగముచే నంతఃకరణ శుద్ధియు, దైవోపాసనచే విక్షేప నివృత్తియు గలిగిన పిమ్మట ఆత్మతత్త్వజ్ఞాన ముపదేశింపవలసియుండును. ఏలన మనస్సులో మలవిక్షేప ఆవరణాత్మకములగు మూడు దోషములు గలవు. ఇవి పైన చెప్పబడిన మూడు విధులచే (కర్మోపాసన జ్ఞానములచే) తొలగవలసియుండును. కాన తొలుత కర్మోపాసనలగూర్చి చెప్పక, ముందుగ బ్రహ్మతత్త్వమునే ద్వితీయాధ్యాయమున నుపదేశించుట వేదాంత బోధన పరంపరాక్రమమునకు విరుద్ధముగా నుండును. మొదటి అధ్యాయము గీతయొక్క పీఠిక యగుటచే అచ్చట ధర్మోపదేశము గావింపబడియుండలేదు. కావున ద్వితీయాధ్యాయము 11-వ శ్లోకమునుండియే ధర్మోపదేశము ప్రారంభ మగుచున్నది. కాన అది మొదటిభాగమనియే చెప్పవచ్చును. అయితే త్రికాల జ్ఞానవేత్తయు సర్వజ్ఞుడగు భగవంతుడు తెలియక యిట్లు చేసినదిగాదు. ఆత్మ యొక్క సత్యత్వము నిత్యత్వము అమృతత్వము తెలిసికొనిన మఱల దేహ మును గుఱించిన భ్రాంతి గలుగదు. జ్ఞానమందు సుస్థిరత గలిగిన పిమ్మటనే కర్మయోగము నాచరించుటకు శక్తి గలుగునని తలంచియే భగవంతుడు అలా గున చేయుటకు కారణము. ఇందు వల్ల జ్ఞానము గలిగేలాగున ముందుగా బ్రయత్నించి తరువాత కర్మయోగమందు (సంసారకార్యములందు) ప్రవర్తించి నచో అతనికి దుఃఖము గలుగదు. పూర్వకాలమున బాల్యదశయందు గురుకుల వాసముచేసి బ్రహ్మచర్యముతో విద్యనభ్యసించి జ్ఞానము గలిగిన పిమ్మట ఇష్ట ముండువారు గృహస్థాశ్రమ మవలంబించ వచ్చునని నియమ మేర్పరచుటలో గల రహస్యము ఇదియే. ఇట్టి పద్ధతి కాలక్రమమున నశించి పోయినందుచే బాల్యకాలమునుండి జీవితాంతము వఱకు సంసారమున ఉండి దుఃఖ సాగర

ములో మునుగుచుండుటకు కారణమగుచున్నది. బ్రహ్మచర్యాశ్రమమున ఆత్మ జ్ఞానసుఖము నెరిగినవాడు ఒకవేళ విషయవాసనా సంస్కారబలమును జయింప జాలక కొంత కాలము గృహస్థాశ్రమములో నుండినను విషయవాసనాక్షయము గలుగుటతోడనే మఱల వానప్రస్థమునకు వెళ్ళుటకభిలషించును. ఇది పూర్వఋషి సంప్రదాయము. క్షీరము పాలుగా నున్నపుడుగాని పెరుగుగా మారినపుడుగాని చేతినుండి జారి నీటిలో పడిపోయిన నీటినుండి వేరుజేయుటకు సాధ్యముగాదు. పెరుగును తరచి నవనీతమును ఏర్పరచినచో (వెన్నదీసినచో)అదినీటిలోపడినను జలముతో గలియదు, వేరుగానే యుండునుగదా! అలాగున మొదటనే ఆత్మ తత్త్వజ్ఞానమును సంపాదించుకొన్నవాడు పిమ్మటసంసారములో బడినను చెడడు, అతని స్వరూపజ్ఞానమునకు ఆవరణము గలుగదు. కనుకనే సాంఖ్యయోగము నుపదేశించిన తరువాత కర్మయోగము నుపదేశించుటకు కారణమైనది. ఈ విష యమై సాంఖ్యయోగ ప్రారంభమున చెప్పినదియు చూడదగును.

అర్జున ఉవాచ:— అర్జునుడిట్లనెను.

శ్లో॥ జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన! ।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ! ॥ 1

పద॥ జ్యాయసీ - చేత్ - కర్మణః - తే - మతా - బుద్ధిః - జనార్దన!,
తత్ - కిం - కర్మణి - ఘోరే - మాం - నియోజయసి - కేశవ !,

ప్రతి॥ హే జనార్దన! = ఓ కృష్ణమూర్తీ! కర్మణః = కర్మయోగముకంటె, బుద్ధిః = జ్ఞానయోగము, జ్యాయసీ = మేలైనదని, తే = నీకు, మతా చేత్ = అభీష్టమైన యెడల, హే కేశవ!= ఓ శ్రీ కృష్ణమూర్తీ!, తత్ కిం= అదియేమి?మాం = నన్ను, ఘోరే = భయంకరమైన, కర్మణి = కర్మము నందు, నియోజయసి = నియమించుచున్నావు?

తా॥ ఓ జనార్దనా ! కర్మయోగముకంటె జ్ఞానయోగముమేలైన దని నీ అభిప్రాయమైన యెడల అదేల? నన్ను ఘోరమైన యీ యుద్ధకర్మమునందు నియమించుచున్నావు !

వి॥ రెండవ అధ్యాయమున జ్ఞానయోగముయొక్క మహిమ నుపదేశించిన శ్రీ కృష్ణుడు మఱల ఈ 3—వ అధ్యాయమున కర్మయోగము నుపదేశించుటకు కారణమేమని సందేహము గలవాడై పై విధముగా నర్జును డడిగెను.

శ్లో॥ వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్యయేన శ్రేయోఽహమాప్నుయామ్ ॥ 2

పద॥ వ్యామిశ్రేణ - ఇవ - వాక్యేన - బుద్ధిం - మోహయసి - ఇవ - మే,
తత్ - ఏకం - వద-నిశ్చిత్య - యేన - శ్రేయః - అహం - ఆప్నుయామ్.

ప్రతి॥ వ్యామిశ్రేణ ఇవ = మిశ్రమమైన దానివలెనున్న, వాక్యేన = వాక్యము చేత, మే బుద్ధిం = నాబుద్ధిని, మోహయసి ఇవ = కలవరపెట్టు వానివలె నున్నావు, అహం = నేను, యేన = దేనిచేత, శ్రేయః = మేలును, ఆప్నుయాం = పొందుదునో, తత్ఏకం = అట్టి ఒక్క దానిని, నిశ్చిత్య వద = నిర్ణయించి చెప్పుము.

తా॥ కర్మజ్ఞాన ప్రాధాన్యవిషయమై మిశ్రమమైన దానివలెనున్న సందిగ్ధ వచనముల చేత నీవు నాబుద్ధిని; కలవర పెట్టువానివలె నున్నావు. సందేహాస్పదమైన నా బుద్ధి సత్యమును నిర్ణయించి గ్రహింపజాలకున్నది. కాన నేను దేనిచేత (జ్ఞానయోగ కర్మయోగ ములు రెంటిలో దేనిచేత) శ్రేయస్సును బొందుదునో అట్టి శ్రేయో దాయకమైన ఒక దానిని నిర్ణయించి చెప్పుము.

శ్రీ భగవానువాచ:— శ్రీ కృష్ణు డిటుల చెప్పెను.

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ!।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥ 3

పద॥ లోకే - అస్మిన్- ద్వివిధా - నిష్ఠా - పురా -ప్రోక్తా - మయా - అనఘ!
జ్ఞానయోగేన - సాంఖ్యానాం - కర్మయోగేన - యోగినామ్.

ప్రతి॥ హే అనఘ ! = పాపరహితుడవగు ఓ అర్జునా!, అస్మిన్లోకే = ఈ లోకమునందు, సాంఖ్యానాం = సాంఖ్యయోగులకు, జ్ఞానయోగేన = జ్ఞానయోగముచేతను, యోగినాం = యోగులకు, కర్మయోగేన = నిష్కామ కర్మయోగముచేతను, ద్వివిధా = రెండువిధములైన, నిష్ఠా = అనుష్ఠానము,పురా = ముందు,మయా =నాచేత, ప్రోక్తా = చెప్పబడినది.

తా॥ పాపరహితుడవగు నోయర్జునా! సృష్ట్యాదియందు ఈ లోకమున సాంఖ్యయోగులకు జ్ఞానయోగమును,యోగులకు నిష్కామ కర్మయోగమును నేను ఏర్పరచితిని. రెండువిధములగు అనుష్ఠాన ములు (మోక్షోపాయములు) నాచేత చెప్పబడినవి.

వి॥ జీవులు సంస్కారభేదములచే ననేక తరగతులుగా నున్నారు. అంతః కరణశుద్ధి కలిగినవారికి జ్ఞానయోగమును అంతఃకరణశుద్ధికలుగనివారికి నిష్కామ కర్మయోగమును ఉండవలెను.

శ్లో॥ న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ 4

పద॥ న - కర్మణాం - అనారమ్భాత్ - నైష్కర్మ్యం - పురుషః - అశ్నుతే,
న - చ - సన్న్యసనాత్ - ఏవ - సిద్ధిం - సమధిగచ్ఛతి.

ప్రతి॥ పురుషః = పురుషుడు, కర్మణాం = పుణ్యకర్మలయొక్క, అనారంభాత్= ఆరంభింపకపోవుటవలన. నైష్కర్మ్యం = నిష్కామకర్మద్వారా బొంద దగిన ఫలమును, న అశ్నుతే = పొందడు, సన్న్యసనాత్ ఏవ చ = కర్మ ములను విడుచుటవలన మాత్రమే (కేవలము దేహసన్న్యాసముచేతనే) సిద్ధిం = జ్ఞానసిద్ధిని, న సమధిగచ్ఛతి = సరిగాబొందడు.

తా॥ పురుషుడు చేయవలసిన అనుష్ఠానములను జేయకపోవుట చేత నిష్కామకర్మముద్వారా బొందదగిన పదవిని (నిష్క్రియాత్మజ్ఞా నమును) పొందడు. నిష్కామకర్మానుష్ఠానమును వదలుటచేతను, లేక దేహసన్న్యాసము మాత్రము చేతను నైష్కర్మ్యసిద్ధిని పొందడు.

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ 5

పద॥ న - హి - కశ్చిత్ - క్షణం - అపి - జాతు - తిష్ఠతి - అకర్మకృత్,
కార్యతే – హి – అవశః – కర్మ – సర్వః – ప్రకృతిజైః – గుణైః.

ప్రతి॥ హి = ఏలననగా, కశ్చిత్=ఎవడును, జాతు = ఎప్పుడును, క్షణం అపి= క్షణకాలమైనను, అకర్మకృత్ = కర్మను ఆచరింపనివాడై, న తిష్ఠతి= ఉండడు, సర్వః = ప్రతివాడును, ప్రకృతిజైః = స్వభావమువల్ల గలిగిన, (ప్రకృతిజన్యములైన) గుణైః = గుణములచేత, అవశః = అస్వతంత్రు డై, కర్మ = కర్మమును, కార్యతేహి = చేయుచున్నాడుగదా!

తా॥ ఏలయనగా ఎవడును ఎప్పుడును క్షణకాలమును కర్మ నాచరించక యుండజాలడు. ప్రతివాడును స్వభావమువల్ల గలిగిన (ప్రకృతిజన్యములైన) సత్వరజస్తమోగుణములచేత నస్వతంత్రుడై వాటికి లొంగి కర్మమును జేయుచునే యున్నాడు.

వి॥ సోమరులు దేహముతో ఫలాపేక్షారహితములైన సత్కర్మలవేయక పోయినను అంతఃకరణములో సంస్కారములు వాసనలుండువఱకు వారిమనస్సు మాత్రము ప్రపంచములో సంచరించుచునే యుండును.

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।
ఇంద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే॥ 6

పద॥ కర్మేంద్రియాణి - సంయమ్య - యః - ఆస్తే - మనసా - స్మరన్, ఇంద్రియార్థాన్ — విమూఢాత్మా — మిథ్యాచారః — సః — ఉచ్యతే.

ప్రతి॥ యః=ఏ, విమూఢాత్మా = మూఢబుద్ధిగలవాడు. కర్మేంద్రియాణి=కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను, సంయమ్య = అణచిపెట్టి, ఇంద్రియార్థాన్ = ఇంద్రియవిషయములను, మనసా = మనస్సుచేత, స్మరన్ = స్మరింపుచు ఆస్తే = ఉంటున్నాడో, సః = వాడు. మిథ్యాచారః = కపటాచారము గలవాడు అని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ ఏమూఢబుద్ధిగలవాడు, కర్మేంద్రియములను జ్ఞానేంద్రియములను అణచిపెట్టి ఇంద్రియవిషయములను మనస్సుతో స్మరించుచున్నాడో వాడు మోసగాడని చెప్పబడుచున్నాడు.

వి॥ బాహ్యాభ్యంతరములు రెండును శుద్ధములుగా నుండవలెను. అప్పుడే నిష్కళంకుడగును· అట్టి నిర్మలాత్ముడు మాత్రమే శుద్ధాత్మను దర్శింపగలడు.

శ్లో॥ యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేర్జున! ।
కర్మేంద్రియైః కర్మయోగమసక్తస్స విశిష్యతే॥ 7

పద॥ యః-తు-ఇంద్రియాణి - మనసా - నియమ్య - ఆరభతే - అర్జున!, కర్మేంద్రియైః — కర్మయోగం — అసక్తః — సః — విశిష్యతే.

ప్రతి॥ హే అర్జునా! = ఓ అర్జునా!, యః = ఎవడైతే, మనసా = మనస్సుచేత, ఇంద్రియాణి=ఇంద్రియములను, నియమ్య = అణచిపెట్టి, కర్మేంద్రియైః= కర్మేంద్రియములచేత, కర్మయోగం=కర్మాచరణమును, అసక్తః=నిష్కాముడై. ఆరభతే = ప్రారంభించుచున్నాడో; సః = వాడు; విశిష్యతే = శ్రేష్ఠుడగుచున్నాడు.

తా॥ ఓ అర్జునా! ఎవడైతే మనస్సుచేత త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములనెడు జ్ఞానేంద్రియముల నణచిపెట్టి, వాక్పాణిపాద పాయూపస్థలనెడు కర్మేంద్రియములచేత కర్మాచరణమును నిష్కాముడగుచు చేయుచున్నాడో వాడు శ్రేష్ఠుడు.

వి॥ నిష్కామకర్మయోగముచే నిర్మలుడగును. విరేచనమునకు ఔషధము తీసికొనువానికి కడుపులో గల దుర్మలము బహిర్గతమగువఱకు అణచిపెట్టజూచిన ఎంత సంకటకరమో; దుర్మలములన్నియు బహిర్గతమైనచో ఎంతశాంతియో; అలాగున హృదయములో గల దోషములను అణచిపెట్టి సాధువేషమువేసికూర్చుండిన ఆత్మశాంతి గలుగదు. కనుక మనస్సులో దోషము నశించువఱకు సత్కర్మములు పరమేశ్వరార్పణబుద్ధితో చేయుచు; తపోధ్యానములు కలిగి యుండవలెను.

శ్లో॥ నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ 8

పద॥ నియతం - కురు - కర్మ - త్వం - కర్మ - జ్యాయః - హి - అకర్మణః.
శరీరయాత్రా - అపి - చ - తే - న - ప్రసిద్ధ్యేత్ - అకర్మణః.

ప్రతి॥ అకర్మణః=కర్మముచేయకుండుటకంటె, కర్మ=కర్మాచరణము, జ్యాయః-శ్రేష్ఠమైనది, తస్మాత్ = కాబట్టి, త్వం = నీవు, నియతం=ఆచరించుటకు శాస్త్రముచే నియమితమైన, కర్మ=కర్మమును, కురు = చేయుము హి = ఏలయనగా, అకర్మణః = కర్మము చేయకుండునట్టి, తే = నీకు, శరీర యాత్రా అపి చ = జీవనయాత్రకూడ, న ప్రసిద్ధ్యేత్ = సిద్ధింపజాలదు.

తా॥ ఎవరెవరు ఏ యే స్థితిలోనుందురో, వారివారికి తగిన యను ష్ఠానము చేయకుండుటకన్న చేయుట మేలైనది. కాబట్టి నీవు శాస్త్రముచే నియమింపబడిన అనుష్ఠానమును తప్పక చేయుము. ఏలననగా, కర్మము చేయకుంటివేని జీవయాత్రకూడ చక్కగా జరుగదు.

వి॥ ఇప్పుడు లోకములో ననేకులు సాధువులై యున్నారు. వారలలో చక్కని ఆచరణ గలవారెంతయో సుఖవంతులైయున్నారు. ఏ సత్కర్మమును అనుష్ఠానమును చేయనివారు భోజనాదులకైన దొరకక సంకటపడుచున్నారు కదా! వీరు ఈలోకములోను పరలోకములోను దుఃఖితులై యే యుందురు.

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగస్సమాచర ॥ 9

పద॥ యజ్ఞార్థాత్ - కర్మణః - అన్యత్ర - లోకః - అయం - కర్మబంధనః.
తదర్థం - కర్మ - కౌంతేయ! ముక్తసంగః - సమాచర,

ప్రతి॥ హే కౌంతేయ! = ఓ అర్జునా!, యజ్ఞార్థాత్ = యజ్ఞార్థమైన, కర్మణః= కర్మముకంటె. అన్యత్ర=ఇతరమగు కామ్యకర్మమందు, అయం లోకః

ఈజనము, కర్మబంధనః=కర్మముచేగట్టుబడియున్నది గనుక, తదర్థం= యజ్ఞార్థమైన (భగవత్ ప్రీతికరమైన లోకోన్నతికొరకైన), కర్మ= కర్మమును. ముక్తసంగః = నిరపేక్షకుడవై, సమాచర = ఆచరింపుము.

తా॥ ఓ అర్జునా! యజ్ఞార్థమైన(భగవత్ ప్రీతికరమైన) కర్మము కంటె ఇతరమగు కామ్యకర్మమందు ఈ జనము కర్మముచే గట్టు బడియున్నది. అనగా కామ్యకర్మములు బంధ హేతువులని భావము. కనుక భగవత్ప్రీత్యర్థమైన కర్మమును నిరపేక్షకుడవై ఫలాపేక్షా రహితుడవై ఆచరింపుము.

వి॥ "కర్మమంచిదైనను, చెడ్డదైనను ఫలమును గలుగజేయును. దానిని పరలోకములో ననుభవించవలసియుండును. అట్లు కానిచో మరు జన్మమైననెత్త వలసియుండును కాన ఏ కర్మము చేయకూడదు"అని కొందరు చెప్పుదురు.అది శాస్త్రజ్ఞానములేని మౌఢ్యమని భగవాను డుపదేశించియున్నాడు. ఫలాసక్తితో జేసెడు కర్మమే బంధమును గలుగజేయును. పరప్రాణుల మేలుకొఱకుగాని, ఈశ్వర ప్రీతికొఱకుగాని యే ఫలాసక్తి నుంచక జేసెడు కర్మముచే బంధము కలుగదు, అంతేగాక ఆత్మశుద్ధిని కలుగజేసి మోక్షమున కర్హత గలుగజేయును. అయితే తన బ్రహ్మనిష్ఠకు ప్రతిబంధము లేని కర్మమునే చేయవలయును. ఎల్లప్పుడును బ్రహ్మనిష్ఠయం దుండవలసియుండిన అంతఃకరణములో గలసంస్కారములు. వాసనలు నశించవలెను.

శ్లో॥ సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్ ॥ 10

పద॥ సహయజ్ఞాః – ప్రజాః – సృష్ట్వా – పురా – ఉవాచ – ప్రజాపతిః, అనేన – ప్రసవిష్యధ్వం – ఏషః – వః - అస్తు – ఇష్టకామధుక్.

ప్రతి॥ పురా=సృష్టికాలమునందు, ప్రజాపతిః=బ్రహ్మదేవుడు, ప్రజాః=ప్రజలను, సహయజ్ఞాః = యజ్ఞముతో గూడినవారినిగా. సృష్ట్వా = సృజించి, అనేన= ఈ యజ్ఞాది కర్మలచేత, ప్రసవిష్యధ్వం=వృద్ధిపొందుడు, ఏషః= ఈ యజ్ఞము, వః = మీకు, ఇష్టకాధుక్=ఇష్టములగు కోరికల నిచ్చునది. అస్తు = అగుగాక అని, ఉవాచ = చెప్పెను.

తా॥ సృష్టికాలమందు బ్రహ్మదేవుడు ప్రజలను యజ్ఞములతో గూడినవారినిగా సృజించి"ఈ యజ్ఞాది కర్మలచేత అభివృద్ధిపొందుడు,

ఈ యజ్ఞము మీకు కామధేనువువలె నిష్టార్థముల నిచ్చునది అగుగాక”
యని ఆశీర్వదించి చెప్పెను.

వి॥ యజ్ఞమనగా, పై చెప్పిన యీశ్వరారాధనయు, పరప్రాణులకొఱకు చేయు నుపకారము, ఆత్మధ్యానమును అగునని తెలియవలయును.

శ్లో॥ దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వః ।
పరస్పరం భావయంతశ్శ్రేయః పరమవాప్స్యథ ॥ 11

పద॥ దేవాన్ - భావయత - అనేన - తే - దేవాః - భావయన్తు - వః,
పరస్పరం - భావయంతః - శ్రేయః - పరం - అవాప్స్యథ.

ప్రతిః అనేన= ఈ యజ్ఞముచేత. దేవాన్ = దేవతలను, భావయత = తృప్తిపరచుడు, తే దేవాః = ఆ దేవతలు. వః = మిమ్ము, భావయన్తు = తృప్తి పొందింతురుగాక, పరస్పరం = అన్యోన్యము. భావయన్తః = తృప్తి బొందింపుచున్నవారై, పరం = మిక్కిలి, శ్రేయః = క్షేమమును, అవాప్స్యథ = పొందుడు.

తా॥ ఈ యజ్ఞ ములచేత దేవతలను తృప్తి పరుపుడు.ఆ దేవతలు మిమ్ము తృప్తిపొందింతురుగాక ! అన్యోన్యము తృప్తి బొందుచున్న వారై మిక్కిలి శ్రేయస్సును పొందుడు.

శ్లో॥ ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః !
తైర్దత్తానప్రదాయైభ్యోయో భుఙ్క్తే స్తేన ఏవ సః । 12

పద॥ ఇష్టాన్ - భోగాన్ - హి - వః - దేవాః - దాస్యన్తే - యజ్ఞభావితాః,
తైః - దత్తాన్ - అప్రదాయ ఏభ్యః - యః - భుఙ్క్తే - స్తేనః - ఏవ-సః,

ప్రతి॥ యజ్ఞభావితాః = యజ్ఞములచే బూజింపబడిన, దేవాః - దేవతలు, వః= మీకు, ఇష్టాన్ = ప్రియములైన,భోగాన్=భోగములను, దాస్యంతే హి = ఇవ్వగలరుగదా, తైః=ఆ దేవతలచేత,దత్తాన్=ఇవ్వబడినవాటిని, ఏభ్యః= ఈ దేవతలకు, అప్రదాయ=ఇవ్వక, యః= ఎవడు, భుఙ్క్తే=అనుభవించుచున్నాడో, సః = వాడు, స్తేనః ఏవ = చోరుడే.

తా॥ యజ్ఞములచే బూజింపబడిన దేవతలు మీకు వర్షాదులను గలుగజేసి ప్రియములైన భోగముల నివ్వగలరుగదా? ఆ దేవతల చేత నివ్వబడినదానిని ఈ యిష్టభోగముల నిచ్చు దేవతలకు ఇవ్వక యెవడనుభవించుచున్నాడో వాడు చోరుడే.

వి॥ దైవకార్యములు చేయక భుజించువాడు కృతఘ్నుడగును. వాయువు, వర్షము, సూర్యరశ్మి, భూమి మొదలగు వాటిని మనకొసంగి, విజ్ఞానమిచ్చి రక్షించెడు ఆ సర్వేశ్వరుని మరువవచ్చునా? మరువనివాడు కృతజ్ఞుడనబడును.

శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥ 13

పద॥ యజ్ఞశిష్టాశినః - సంతః - ముచ్యంతే - సర్వకిల్బిషైః,
భుంజతే -తే-తు- అఘం - పాపాః - యే - పచంతి - **ఆత్మకారణాత్**,

ప్రతి॥ యజ్ఞశిష్టాశినః=భగవదారాధన మొదలగు పంచ యజ్ఞములు చేసి మిగిలిన అన్నమును భుజించెడు, సంతః =సత్పురుషులు, సర్వకిల్బిషైః=సర్వపాపములచేత, ముచ్యంతే = విడువబడుచున్నారు, యే = ఎవరు, **ఆత్మ** కారణాత్ = తామే భుజించుటకై మాత్రము, పచంతి = వంట చేసికొనుచున్నారో, తే పాపాః తు = అట్టి పాపులై తేనో, అఘం = పాపమును, భుంజతే = అనుభవించుచున్నారు.

తా॥ భగవదారాధన మొదలగు పంచయజ్ఞములుచేసి మిగిలిన అమృతమయమగు అన్నమును భుజించెడు సత్పురుషులు సమస్త పాపములనుండి విడువబడుచున్నారు. ఎవరు తామువూత్రము భుజించుటకై వంటచేసికొనుచున్నారో అట్టివారు పాపులు. వారు భుజించెడు అన్నము అన్నముకాదు, పాపమే.

వి॥ ప్రతిరోజును ఏదైన దైవకార్యముచేసిన తరువాత మాత్రమే భుజింపవలెను. జనులు ఎంతజాగరూకతతో ప్రవర్తించినను ఐదువిధములగు పాపములు వచ్చుచునేయుండును. (1) దంచుట. (2) నూరుట, (3) నిప్పుమంట వేయుట (4) జలముపయోగపరచుట, (5) ఊడ్చుట ఐదు పాపములు అనివార్యములు మఱల దున్నుట, చెట్లు నరకుట, పారతో చెక్కుట, ఎరువు నుపయోగపరచుట బండికట్టుట మొదలగునవి కూడ హింసలో చేరినవే. ఈ ఐదింటికిని ప్రాయశ్చిత్తములు (1) బ్రహ్మయజ్ఞము: వేదోపనిషద్గీతాదిపఠనములు, ప్రణవాది మంత్రజపములు, (2) పితృయజ్ఞము: తర్పణాదులచే పితృదేవతలను తృప్తిపరచుట లేక మాతాపితరులను సంరక్షించుట, (3) దేవయజ్ఞము: దేవతారాధన అగ్నిహోత్రములు, (4) భూతయజ్ఞము: శునక వాయసాది ప్రాణులకు అన్నమిడుట, (5) అతిథియజ్ఞము:అ తిథులకును, బ్రహ్మచారులకును, యతులకును భోజనము

పెట్టుటయు, రోగులకు, దరిద్రులకు కబళము పెట్టుటయు అగును. పై చెప్పిన ఐదు విధములగు దోషములు ఈ పంచయజ్ఞములవలన నివృత్తియగును. గవర్న మెంటువారికి కట్టవలసిన పన్ను కట్టినచో ఆ భూమి యెల్లప్పుడును మనకుండును. కట్టనిచో జప్తుచేసి ఏలము పాడి అమ్మునట్లు పై యజ్ఞములు చేయనివాని ధనము. యశస్సు, విద్య, జ్ఞానము క్రమముగా నశించును. అంతేగాదు. వాడు దేవతలకు ఋణస్థుడగుచున్నాడు.

శ్లో॥ అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ 14

పద॥ అన్నాత్ - భవంతి - భూతాని - పర్జన్యాత్ - అన్నసంభవః,
యజ్ఞాత్ - భవతి - పర్జన్యః - యజ్ఞః - కర్మసముద్భవః.

ప్రతి॥ భూతాని=ప్రాణులు, అన్నాత్=అన్నమువలన, భవంతి=కలుగుచున్నవి, అన్నసంభవః= అన్నముయొక్క ఉత్పత్తి, పర్జన్యాత్=వర్షమువలన అగు చున్నది, పర్జన్యః = వర్షమునకు కారణమగు మేఘము, యజ్ఞాత్ = యజ్ఞమువలన. భవతి = కలుగుచున్నది. యజ్ఞః = యజ్ఞము, కర్మ సముద్భవః = కర్మమువలన గలుగుచున్నది.

తా॥ అన్నము శుక్లశోణితములుగ నేర్పడి వానివలన ప్రాణి కోట్లు ఏర్పడుచున్నవి. అట్టి యన్నము వర్షరూపముగా బరిణమించు మేఘమువలన కలుగుచున్నది. మేఘము యజ్ఞమువలన సంభవించు చున్నది. యజ్ఞము కర్మమువలన సిద్ధించుచున్నది. కావున కర్మ అవశ్యముగ జేయదగినది.

శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ 15

పద॥ కర్మ - బ్రహ్మోద్భవం - విద్ధి -బ్రహ్మ - అక్షరసముద్భవం,
తస్మాత్ - సర్వగతం - బ్రహ్మ - నిత్యం - యజ్ఞే - ప్రతిష్ఠితమ్.

ప్రతి॥ కర్మ=కర్మము, బ్రహ్మోద్భవం = బ్రహ్మవలన (వేదమువలన) బుట్టిన దానినిగాను, బ్రహ్మ=వేదము, అక్షరసముద్భవం=అక్షరపరబ్రహ్మము కారణముగా గలిగినదానినిగాను (అక్షరపరబ్రహ్మము నుండి కలిగిన దానినిగాను), విద్ధి తెలుసు కొనుము, తస్మాత్ = ఆ కారణమువలన,

సర్వగతం = సర్వవ్యాపియైన, బ్రహ్మ=బ్రహ్మము(పరమాత్మ), నిత్యం= ఎల్లప్పుడును. యజ్ఞే = యజ్ఞమందు, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠితమైయున్నది.

తా॥ కర్మము బ్రహ్మవలన(వేదమువలన) బుట్టినది. బ్రహ్మము వేదము) అక్షరమగు పరమాత్మవలన బుట్టినది. కావున సర్వ వ్యాపకమైన పరబ్రహ్మము యజ్ఞమునందు ప్రతిష్ఠితమై యున్నది. కాబట్టి యజ్ఞము చేయవలసినది.

వి॥ యజ్ఞమనగా పై చెప్పిన పంచయజ్ఞములని గ్రహించదగినది.

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ ! స జీవతి॥ 16

పద॥ ఏవం - ప్రవర్తితం - చక్రం - న - అనువర్తయతి -ఇహ - యః.
అఘాయుః - ఇంద్రియారామః - మోఘం - పార్థ! - సః - జీవతి.

పతి॥ హే పార్థ! = ఓ అర్జునా!, యః = ఎవడు, ఏవం = ఇట్లు, ప్రవర్తితం = ప్రవర్తింపజేయబడిన, చక్రం = జగచ్చక్రమును, ఇహ=ఈ లోకమునందున, అనువర్తయతి= అనుసరింపడో, సః=వాడు, అఘాయుః = పాపాత్ముడుగను. ఇంద్రియారామః = ఇంద్రియ విషయాసక్తుడుగనునై, మోఘం = వ్యర్థముగా; జీవతి = బ్రతుకుచున్నాడు.

తా॥ ఎవడు ఈ లోకమున పైచెప్పబడిన ప్రకారము ప్రవర్తింపజేయబడిన జగచ్చక్రమును అనుసరింపడో, వాడు పాపమయమగు జీవనము గలవాడును ఇంద్రియలోలుడును, విషయాసక్తుడునై వ్యర్థముగా బ్రతుకుచున్నాడు.

వి॥ ప్రజల యభివృద్ధికొఱకు సత్కర్మ చేయనివాడు పాపజీవి యనియు, వాడు వ్యర్థముగా జీవించువాడనియు, ఈశ్వరనిర్మితమగు జగచ్చక్రమునకు అనగా ప్రజాభివృద్ధికి తోడ్పడని వాడగుటచేతను. ఇంద్రియములలో రమించువాడగుట చేతను ఆత్మారాముడు గాజాలడనియు తెలియవలెను. వాడు వ్యర్థజీవుడు మాత్రమేగాదు. ఆత్మను అనర్థ మొనర్చినవాడుకూడ నగును.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే ॥ 17

పద॥ యః - తు -ఆత్మరతిః - ఏవ - స్యాత్ -ఆత్మతృప్తః - చ - మానవః.
ఆత్మని - ఏవ - చ - సంతుష్టః - తస్య - కార్యం - న - విద్యతే.

ప్రతి॥ యః = ఏ. మానవః=మానవుడైతే,ఆత్మరతిః ఏవ=తనయందే రమించువాడును, ఆత్మతృప్తః చ = తనలో తానే తృప్తిని పొందువాడును, ఆత్మని ఏవ = తనయందే, సంతుష్టః = సంతోషమును పొందువాడును స్యాత్ = అగునో. తస్య = ఆ యాత్మారామునకు, కార్యం=చేయదగినది. న విద్యతే = లేదు.

తా॥ ఏ మనుష్యుడైతే తనలో తానే యానందించువాడును, తనలో తానే తృప్తిపొందినవాడును,తనయందే సంతోషపడుచుండువాడును అగునో వానికి చేయదగిన కార్యమేదియునులేదు. అట్టి ఆత్మా రాముడు కృతకృత్యుడని భావము.

వి॥ అట్టి ఆత్మానందభరితునకు మాత్రము ఏ కర్మయును చేయవలయునను విధి లేదు, చేసినచో తప్పును లేదు. అనగా బంధమును లేదు. ఈ రెండింటిలో తనకు బంధమోక్షములు లేనప్పటికిని, చేయుటచే లోకమునకు మేలు గలుగుచుండును, అయితే కృతకృత్యుడైన పిమ్మటనే కృతార్థుడగును. కృతకృత్యుడనగా తాను చేయవలసిన కృత్యము లన్నిటిని కొంచెమైనను లోపములేక సంపూర్ణముగా జేసినవాడని భావము.

శ్లో॥ నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః॥ 18

పద॥ న - ఏవ - తస్య - కృతేన - అర్థః - న - అకృతేన - ఇహ - కశ్చన,
న - చ - అస్య - సర్వభూతేషు - కశ్చిత్ - అర్థవ్యపాశ్రయః,

ప్రతి॥ తస్య = వానికి, ఇహ = ఈ లోకమునందు. కృతేన =కర్మనుచేయుటచేత అర్థ=ప్రయోజనము,న ఏవ=లేనేలేదు, అకృతేన = కర్మనుచేయకుండుటచేతను, కశ్చన=ఏప్రయోజనమును, న=లేదు,అస్య=వీనికి,సర్వభూతేషు=సమస్తభూతములయందును అర్థవ్యపాశ్రయః చ = ప్రయోజనముకొఱకు ఆశ్రయింప తగినది, కశ్చిత్ = ఏదియును న = లేనేలేదు,

తా॥ అట్టి యాత్మానందభరితుడగు బ్రహ్మవేత్తకు ఈ లోకమునందు కర్మను చేయుటచేతగాని, కర్మను చేయకుండుటచేతగాని యెట్టి

ప్రయోజనమును లేదు. వీనికి ఏ ప్రయోజనముకొఱకుగాని సమస్త భూతములలో నాశ్రయింపదగినదేదియును లేదు.

వి॥ ముముక్షువులలో (1)జిజ్ఞాసువు, (2) సాధకుడు, (3)ఆరూఢుడు అని మూడుతరగతుల వారున్నారు. వీరువిద్యార్థి, ఉద్యోగి, పెన్‌షనర్ అనువార్లకు సమానులు. చక్కగ చదివి పరీక్షలో నుత్తీర్ణులై లెస్సగా నుద్యోగము చేసినందుచే పెంషను లభించును. ఇట్టి సుఖజీవనమును గడుపు పెన్షనర్‌ను చూచి విద్యార్థియు, ఉద్యోగియు పాఠశాలకు వెళ్లుటగాని, సమయమునకు ఉద్యోగమునకు పోవుటగాని అక్కరలేదని తలంచి యూరకుండిన వారిగతి యేమగును? ఆరూఢుడు చిరకాలమునుండి బ్రహ్మ విద్యను అభ్యసించి అనుష్ఠానముచేసి, యిప్పుడు జీవన్ముక్తుడైనాడు, అట్టి ముక్తాత్ముని చూచి జిజ్ఞాసువును సాధకుడును సరిగా అనుష్ఠానముచేయనిచో వ్యర్థజీవులగుదురు, కొందఱు పెన్‌షను తీసుకొనియు ఆరోగ్యము గలిగియుండిన. మఱల నేదైన యుద్యోగములో ప్రవేశింతురు, దానివలన వచ్చు ధనమును సర్వజనులకుగాని ధర్మార్థముగా పరులకుగాని వినియోగపరచెదరు అలాగున జీవన్ముక్తిని పొందిన వారలలో కొందఱు ముముక్షువులకొఱకు ధర్మకార్యము, జ్ఞానబోధలు చేయు చుందురు. కాని జీవన్ముక్తునకు అటుల చేయవలెనని విధి లేదు. ఉండకూడదు.

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర !
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ 19

పద॥ **తస్మాత్ - అసక్తః - సతతం - కార్యం - కర్మ - సమాచర,**
**అసక్తః - హి - ఆచరన్ - కర్మ - పరం - ఆప్నోతి - పూరుషః,**

ప్రతి॥ తస్మాత్ = ఆ కారణమువలన: అసక్తః=ఫలాపేక్షలేనివాడవై, సతతం= ఎల్లప్పుడును, కార్యం = చేయదగిన, కర్మ = కర్మమును, సమాచర = చేయుము, హి = ఏలననగా పూరుషః = పురుషుడు, అసక్తః = ఫలాపేక్షలేనివాడగుచు, కర్మ = కర్మమును, ఆచరన్ = చేయుచున్నవాడై, పరం = మోక్షమును, ఆప్నోతి – పొందుచున్నాడు.

తా॥ ఫలాభిలాషను వదలి విధిబోధితమైన కర్మమును జేయువాడు పరమపురుషార్థమగు మోక్షమును పొందును. కనుక నీవు ఫలాభిలాషను వదలి చేయదగిన (కర్తవ్య) కర్మమును జేయుము.

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్కర్తుమర్హసి ॥ 20

పద॥ కర్మణా - ఏవ - హి - సంసిద్ధిం - ఆస్థితాః - జనకాదయః,
లోకసంగ్రహం - ఏవ - అపి - సంపశ్యన్ - కర్తుం - అర్హసి.

ప్రతి॥ జనకాదయః = జనకచక్రవర్తి మొదలగువారు. కర్మణా ఏవ = కర్మము చేతనే, సంసిద్ధిం = మోక్షమును, ఆస్థితాః హి=పొందిరిగదా, తస్మాత్= కాబట్టి, త్వం = నీవు, లోకసంగ్రహం ఏవ అపి = లోకులకు మంచి మార్గమును జూపుటయను ప్రయోజనమునైనను, సంపశ్యన్ = లెస్సగా జూచినవాడవై. కర్తుం = కర్మము చేయుటకు, అర్హసి = తగుదువు.

తా॥ జనక చక్రవర్తి మొదలగువారు నిష్కామకర్మముచేతనే మోక్షమును పొందిరి గదా! కనుక నీవును లోకులకు మంచి మార్గమును జూపుట యను ప్రయోజనమునైనను (లోకక్షేమమునైనను) లెస్సగా చూచినవాడవై నిష్కామకర్మము చేయుటకు తగియున్నావు.

వి॥ జనకుడు మొదలగువారిని ఉదాహరించుటకు కారణమేమన వారు క్షత్రియులు; అర్జునుడును క్షత్రియుడు, వారు నిష్కామకర్మ యోగపరులై యుండి బ్రహ్మవిచారము చేయుటచే ముక్తులైరి. ఆదిశబ్దముచేత అశ్వపతి,అంబరీషుడు, భగీరథుడు, అజాతశత్రువు మొదలైనవారని గ్రహించునది. మఱియు, రాజ్యమును చేయుచుండిన మోక్షము గలుగునా? అను సందేహము గలుగునేమో యని తలంచి నిష్కామబుద్ధితో రాజ్యపాలనము జేయుచును బ్రహ్మవిచారము చేసి ముక్తి పొందినవారి పేర్లను నిరూపించడమైనది. జనకుడు శ్రీవసిష్ఠ, యాజ్ఞ్యవల్క్య, పంచశిఖ, అష్టావక్రాది మహర్షులవలన బ్రహ్మోపదేశము నొంది బ్రహ్మవిచారము, ఆత్మచింతన,తపస్సులు జేసినట్లు బ్రమాణములుగలవు.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ 21

పద॥ యత్ - యత్ - ఆచరతి - శ్రేష్ఠః - తత్ - తత్ - ఏవ - ఇతరః-జనః
సః - యత్ - ప్రమాణం - కురుతే - లోకః తత్ - అనువర్తతే.

ప్రతి॥ శ్రేష్ఠః = శ్రేష్ఠుడగువాడు, యత్ యత్ = ఏ యే కర్మను. ఆచరతి = ఆచరించుచున్నాడో, తత్ తత్ ఏవ = ఆ యాకర్మనే, ఇతరః = ఇతరు

డైన, జనః=మనుజుడు చేయుచున్నాడు. సః = వాడు, యత్ = దేనిని, ప్రమాణం = ప్రమాణముగా. కురుతే = చేయుచున్నాడో. లోకః = ప్రపంచము. తత్ = దానిని, అనువర్తతే =అనుసరించుచున్నది.

తా॥ ఉత్తముడు ఏయేకర్మను ఆచరించుచున్నాడో, ఇతరులైన ప్రాపంచిక జనులుకూడ ఆయాకర్మమునే ఆచరించుచున్నారు. మఱియు అట్టి యుత్తముడు దేనిని ప్రమాణముగా గ్రహించుచున్నాడో ప్రపంచజనులుగూడ దానినే ప్రమాణముగా నమ్మి చేయుచుందురు.

వి॥ శ్రేష్ఠపురుషుని ఆచరణను చూచియే యితరజనులు కూడ ఆచరింతురు కావున ఉత్తముడు తనకనుష్ఠానము అవసరములేనప్పటికిని ఇతరులకొరకైనను అనుష్ఠించవలెను. లోకోద్ధారకులై జన్మించువారు పుట్టినప్పటినుండి దేహము వీడు వఱకు లోకము ఏలాగున తరించునో అట్టి కార్యమునే సదా చేయుచుందురు. జీవన్ముక్తులలో తరించువారనియు, తరింపజేయువారనియు నిరు తెగలవారుగలరు. తరింపజేయువాడు తా నిదివఱలో తరించినవాడై యితరుల తరింపజేయుటకొరకు ఈశ్వరాజ్ఞచేతనో, మహర్షుల ఆదేశముచేతనో లేక స్వసంకల్పముచేతనో జన్మమెత్తును. వీరు దివ్యపురుషులు వీరి మనోమయాశక్తియు, వర్తనమును సామాన్యబ్రహ్మనిష్ఠుల కన్న విలక్షణమైయుండును. అదే దానికి గుఱుతు. ప్రపంచోద్ధారణమే వీరి జీవితాదర్శమైయుండును.

శ్లో॥ నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ 22

పద॥ న – మే – పార్థ! అస్తి – కర్తవ్యం – త్రిషు – లోకేషు – కించన.
న – అనవాప్తం – అవాప్తవ్యం - వర్తే – ఏవ - చ - కర్మణి.

ప్రతి॥ హేపార్థ! = ఓ యర్జునా!, త్రిషులోకేషు = మూడులోకములయందును, మే = నాకు, కర్తవ్యం = చేయదగినది, కించన = కొంచమైనను, న అస్తి = లేదు, అనవాప్తం = పొందబడనిదియు, అవాప్తవ్యం చ = పొందదగినదియు, న = లేదు (అట్లయినను). కర్మణి = కర్మమునందు వర్తే ఏవ చ = ప్రవర్తించుచునే యున్నాను:

తా॥ ఓ యర్జునా! నాకు చేయదగిన కర్మ మేదియును లేదు. మఱియు మూడు లోకములయందును కొంచమైనను నాచేత పొంద

బడనిదిగాని, పొందదగినదిగాని లేదు. అట్లు ఏదియును లేకపోయి నప్పటికిని నేను కర్మమునందు ప్రవర్తించుచునేయున్నాను.

వి॥ దైవాంశములో పుట్టినవారు భగవంతునివంటి ప్రవృత్తిగలిగి యుందురు. కావున జీవన్ముక్తులైనను లోకోద్ధరణకార్యములను జేయుచుందురు.

శ్లో॥ యది హ్యాహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః ॥ 23

పద॥ యది - హి - అహం - న - వర్తేయం - జాతు - కర్మణి - అతన్ద్రితః,
మమ – వర్త్మ – అనువర్తన్తే – మనుష్యాః – పార్థ! సర్వశః.

ప్రతి॥ హే పార్థ! = ఓ యర్జునా!. హి = ఏలయనగా, అహం = నేను.జాతు= ఎప్పుడును, కర్మణి = కర్మమునందు. సర్వశః = అన్నివిధముల, అతన్ద్రితః=అప్రమత్తుడనై (జాగరూకుడనై), నవర్తేయం యది=ప్రవర్తింపని యెడల, మనుష్యాః = జనులు, మమ = నాయొక్క, వర్త్మ = మార్గమును, అనువర్తన్తే = అనుసరించి ప్రవర్తించుచుందురు.

తా॥ ఓయర్జునా! నేను సర్వకాలములయందును జాగరూకుడనై కొంచమైనను పొరబాటులేక కర్మలను జేయకపోతినేని, లోకములోని మానవులందఱును నావలె నే కర్మములను జేయక యూరకుందురు. అట్లు జేయక పోవుటచేత వారు భ్రష్టులగుదురు.

వి॥ జీవన్ముక్తులకుచేయవలసినది యేమియు లేనప్పటికిని, వారినిచూచియే భక్తులు ప్రవర్తింతురుగాన, అట్టి భక్తుల ఆత్మజ్ఞానాభివృద్ధికొఱకు వారు సదా సత్కర్మముల. జేయుచుందురు దైవాజ్ఞచేతగాని, దైవాంశములోగాని జన్మ మెత్తని వారైనచో అధ్యయనము సత్కర్మ మొదలైనవానిని నిందించుచుందురు.

శ్లో॥ ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః ॥ 24

పద॥ ఉత్సీదేయుః - ఇమే - లోకాః - న - కుర్యాం - కర్మ - చేత్ - అహం,
సంకరస్య - చ - కర్తా - స్యాం - ఉపహన్యాం - ఇమాః - ప్రజాః.

ప్రతి॥ అహం = నేను, కర్మ =కర్మను, న కుర్యాంచేత్ = చేయకుందునేని, ఇమేలోకాః =ఈ జనులు, ఉత్సీదేయుః =చెడుదురు, సంకరస్య = కర్మ

సంకరమునకు, కర్తా చ = కర్తనుగాగూడ, స్యాం = అగుదును, ఇమాం ప్రజాః = ఈ జనులను, ఉపహన్యాం = చెడగొట్టిన వాడనగుదును.

తా॥ నేను కర్మమును జేయకుందునేని ఈ జనులు చెడుదురు. కర్మసంకరమునకు కర్తనుగాగూడ నగుదును. ఈ జనులను చెడగొట్టిన వాడనగుదును.

శ్లో॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।
కుర్యాద్విద్వాం స్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥ 25

పద॥ సక్తాః - కర్మణి - అవిద్వాంసః - యథా - కుర్వన్తి - భారత !
కుర్యాత్ - విద్వాన్ - తథా - అసక్తః - చికీర్షుః - లోకసంగ్రహమ్,

ప్రతి॥ హే భారత! = ఓ యర్జునా!, అవిద్వాంసః =అజ్ఞానులు. కర్మణి = కర్మమునందు, సక్తాః = అసక్తిగలవారై, యథా = ఎట్లు, కుర్వన్తి = చేయుచున్నారో, తథా = అట్లు, విద్వాన్ = ఆత్మజ్ఞానము గలవాడు, అసక్తః=అసక్తిలేనివాడై, లోకసంగ్రహం = లోకక్షేమమును,(జనులకు మంచిమార్గము జూపుటను), చికీర్షుః = చేయ నిచ్ఛగలవాడై కుర్యాత్ = చేయవలయును,

తా॥ ఓ యర్జునా! ఆత్మజ్ఞానములేనివాడు కర్మఫలము నాకు కావలయునని తలంపుగలవాడై ఏ విధముగా శ్రద్ధాభక్తులతో కర్మమును చేయుచున్నాడో, ఆ ప్రకారముగానే ఆత్మజ్ఞానము గలవాడును శ్రద్ధాభక్తుల నవలంబించి కర్మఫలమునందు అసక్తిలేనివాడై లోకక్షేమము నుద్దేశించి కర్మములను జేయవలయును.

వి॥ కర్మయందాసక్తిలేకుండ యెట్లు చేయగలము? అను సందేహ మనేకులకు గలదు. దానికి సమాధానము ఈ శ్లోకములో చెప్పబడినది.

శ్లో॥ న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్ ।
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తస్సమాచరన్ ॥ 26

పద॥ న - బుద్ధిభేదం - జనయేత్ - అజ్ఞానాం - కర్మసంగినాం,
జోషయేత్ - సర్వకర్మాణి - విద్వాన్ - యుక్తః - సమాచరన్.

ప్రతి॥ విద్వాన్ = ఆత్మజ్ఞానము గలవాడు, కర్మసంగినాం = కర్మయందాసక్తి గల, అజ్ఞానాం = పామరులకు, బుద్ధిభేదం = ఫలాపేక్షతో కర్మను

ఆచరించెడు బుద్ధికి చలనమును, న జనయేత్ = కలుగజేయకూడదు, యుక్తః= ఇంద్రియనిగ్రహము గలవాడై, సర్వకర్మాణి = సమస్తకర్మములను, సమాచరన్ = చేయుచున్నవాడై, జోషయేత్ = ఇతరులను ఆచరించునట్లు ప్రోత్సాహపరచవలెను.

తా॥ ఆత్మజ్ఞానము కలవాడు కర్మయం దాసక్తి గలిగి ఫలాపేక్షతో కర్మలనాచరించెడు పామరులకు బుద్ధిభేదమును కలిగింపగూడదు. తాను యోగయుక్తుడై సమస్తకర్మములను జేయుచున్నవాడై యితరుల నయితము కర్మల నాచరించుటకై ప్రోత్సాహపరుపవలెను.

వి॥ ఇప్పుడు లోకములో కొందఱు ఆత్మజ్ఞానము గలిగియో లేకయో కొన్ని వేదాంతవాక్యముల నేర్చుకొని సత్కర్మల జేయువానిని ఆక్షేపింతురు. ఒకవేళ తమకు ఆత్మజ్ఞానము గలిగియుండినచో తమవలెనే యితరులు విషయవిరక్తియు, ఆత్మశుద్ధియు గలిగియుండకపోవుటకు కారణము తెలిసికొనవలయును. కారణము లేక కార్యమెప్పటికిని గలుగదు. అందువలన ఈ జనులకు నిర్విషయస్థితి కలుగక పోవుటకును, తనకు అట్టి స్థితి గలిగియుండుటకును కారణ మాలోచింపవలెను. ఈ విషయమై జన్మాంతరములో జేసిన అనుష్ఠానవిశేషముచేతనే తనకు నిట్టినిర్విషయస్థితి గలిగియుండవచ్చునని నిశ్చయించుకొని, అట్లు కలుగనివారికి కలుగుటకు కారణమగు అనుష్ఠానవిశేషము నుదేశింప వలయును. లేనిచో రోగము లేనివాడు రోగము గలవానితో మీకు ఔషధపథ్యములు అవసరము లేదని చెప్పినచో ఆ రోగిగతి యేమగునో అతని గతియును అలాగుననే యుండును.

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే ॥ 27

పద॥ ప్రకృతేః - క్రియమాణాని - గుణైః - కర్మాణి - సర్వశః,
అహంకారవిమూఢాత్మా - కర్తా — అహం - ఇతి — మన్యతే,

ప్రతి॥ అహంకారవిమూఢాత్మా = అహంకారముచే మోహము నొందిన మనస్సుగలవాడు, ప్రకృతేః = మాయయొక్క, గుణైః = గుణములచేత, సర్వశః= నానావిధములుగా జేయబడుచున్న, కర్మాణి = కర్మములను, అహం =

నేను. కర్తా = చేయువాడను, ఇతి = ఇట్లని, మన్యతే = తలంచుచున్నాడు.

తా॥ "నేను" అనియెడు దురభిమానము గలవాడు స్వభావము వలన (ప్రకృతివలన) కలిగిన సత్త్వరజస్తమోగుణములచేత చేయబడుచున్న నానావిధములైన కర్మములను నేను చేయువాడను" అని తలంచుచున్నాడు.

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః ।
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ॥ 28

పద॥ తత్త్వవిత్ - తు - మహాబాహో ! - గుణకర్మవిభాగయోః.
గుణాః - గుణేషు - వర్తంతే - ఇతి - మత్వా - న - సజ్జతే.

ప్రతి॥ గుణకర్మవిభాగయోః = గుణకర్మవిభాగములయొక్క. తత్త్వవిత్ - తు = తత్త్వమును తెలిసినవాడైతేనో, గుణాః = సత్వాదిగుణ కార్యములైన యింద్రియములు, గుణేషు = గుణకార్యములే అయిన సాత్త్విక రాజసిక తామసిక కర్మలయందు, వర్తంతే ఇతి = ప్రవర్తించుచున్నవని, మత్వా= తలంచి, న సజ్జతే=వాటిని అంటడు, కర్తృత్వాభిమానమును బొందడు,

తా॥ గుణకర్మవిభాగములయొక్క రహస్యమునెఱిగిన తత్త్వవేత్తయైతేనో, సత్త్వాదిగుణములు(గుణకార్యములైన యింద్రియములు) గుణకార్యములే అయిన సాత్త్విక, రాజసిక, తామసిక కార్యములయందు ప్రవర్తించుచున్నవని తలంచి కర్తృత్వాభిమానమును బొందడు.

వి॥ ఆత్మ త్రిగుణరహితమై స్వప్రకాశజ్ఞానరూపమై యుండుననుబోధగలవాడు తనలో సత్త్వరజస్తమోగుణములు ఉండుటచేతనే కర్తృత్వాభిమానము కలుగుటకు కారణమని తలంచి వాటిని రహితమొనర్చ ప్రయత్నించును. అట్టివాడు బద్ధుడుకాడు.

శ్లో॥ ప్రకృతేర్గుణసమ్మూఢా స్సజ్జన్తే గుణకర్మసు ।
తానకృత్స్నవిదో మందాన్కృత్స్నవిన్న విచాలయేత్ ॥ 29

పద॥ ప్రకృతేః — గుణసమ్మూఢాః - సజ్జన్తే - గుణకర్మసు,
తాన్ - అకృత్స్నవిదః - మందాన్ - కృత్స్నవిత్ - విచాలయేత్.

ప్రతి॥ ప్రకృతేః =ప్రకృతివలన గలిగిన, గుణసమ్మూఢాః=గుణములచేత మిక్కిలి మూఢులైనవారు,గుణకర్మసు=గుణకర్మలయందు(సత్త్వాదిగుణములవలన గలిగెడు వ్యాపారములయందు),సజ్జన్తే =ఆసక్తులగుచున్నారు, తాన్ =అట్టి అకృత్స్నవిదః = ఏమియునెఱుంగని, మందాన్ = మందబుద్ధులైనవారిని కృత్స్నవిత్ = సమస్తమెఱింగినవాడు, (పూర్ణజ్ఞాని) న విచాలయేత్ = చలింపచేయకూడదు.

తా॥ ప్రకృతివలన గలిగిన గుణములచేత మిక్కిలి మూఢులైన వారు (అనగా ప్రకృతిగుణముల తత్త్వము నెఱుగనివారు) సత్త్వాది గుణములవలన గలిగెడి కర్మలయందు (గుణకర్మలయందు) ఆసక్తు లగుచున్నారు. కాన అట్టి ఏమియు నెఱుగని మందబుద్ధులైనవారలను సమస్త మెఱిగిన పూర్ణజ్ఞాని చలింప చేయకూడదు. అనగా వా రాచ రించునట్టి కర్మను వదలునట్లు చేయకూడదు.

వి॥ బోధకులు శ్రీ కృష్ణభగవానుని ఈ యగాధభావము నెఱుంగవలెను. ఈశ్వరార్పణబుద్ధితో సత్కర్మల నాచరింపనిచో సంసారములో నుండువారికి ఆత్మ శాంతి యెట్లు గలుగును? అంతేగాక సత్కర్మలచేయనివారు సర్వసంగ పరిత్యాగులై యేకాంతమున నిర్విషయస్థితిలో ఉండి బ్రహ్మచింతన చేయగలరా? కావున నిర్విషయస్థితి గలుగువఱకు పరమేశ్వరార్పణబుద్ధితో కర్మలనుచేయుచు బ్రహ్మ విచారముకూడ చేయుటయే యుక్తమధర్మమగును.

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥ 30

పద॥ మయి - సర్వాణి - కర్మాణి - సన్న్యస్య - అధ్యాత్మచేతసా
నిరాశీః - నిర్మమః - భూత్వా - యుధ్యస్వ - విగతజ్వరః.

ప్రతి॥ అధ్యాత్మచేతసా = ఆత్మజ్ఞానముగల మనస్సుతో, మయి = నా యందు సర్వాణి కర్మాణి = సమస్తకర్మలను, సన్న్యస్య = సమర్పించి. నిరాశీః= ఫలాపేక్ష లేనివాడవును, నిర్మమః =మమకారములేనివాడవును, భూత్వా= అయి, విగతజ్వరః = పోయినతాపముగలవాడవై, యుధ్యస్వ=యుద్ధము చేయుము.

తా॥ ఆత్మజ్ఞానముగల మనస్సుతో నాయందు సమస్తకర్మలను

సమర్పించి ఫలాపేక్షలేనివాడవును, మమకారము లేనివాడవును, పోయిన తాపము గలవాడవునై యుద్ధము చేయుము.

వి॥ ఈశ్వరాజ్ఞను శిరసావహించి పరమేశ్వరార్పిత మనస్సుతో కర్మను చేయువాడు బంధము నొందడు.

శ్లో॥ యే మే మతమిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః॥ 31

పద॥ యే - మే - మతం - ఇదం - నిత్యం - అనుతిష్ఠంతి - మానవాః.
శ్రద్ధావన్తః - అనసూయన్తః - ముచ్యన్తే - తే - అపి - కర్మభిః.

ప్రతి॥ యేమానవాః =ఏ మనుష్యులు, మే = నాయొక్క, ఇదం = ఈ, మతం= అభిప్రాయమును, శ్రద్ధావన్తః = శ్రద్ధగలవారును, అనసూయన్తః = అసూయలేనివారునునై, నిత్యం = ఎల్లప్పుడును, అనుతిష్ఠంతి = అనుసరించుచున్నారో. తే అపి =వారును, కర్మభిః = కర్మలచేత, ముచ్యన్తే = విడువబడుచున్నారు.

తా॥ ఏ మనుష్యులు నాయొక్క యీ చెప్పబడిన అభిప్రాయమును శ్రద్ధగలవారును, అసూయ లేనివారునునై యెల్లప్పుడును అనుసరించుచున్నారో, వారుగూడ కర్మలచేత విడువబడుచున్నారు. కర్మబంధనముచే బద్ధులు గారని భావము.

శ్లో॥ యేత్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః॥ 32

పద॥ యే - తు - ఏతత్ - అభ్యసూయన్తః - న - అనుతిష్ఠన్తి - మే - మతం, సర్వజ్ఞానవిమూఢాన్ - తాన్ - విద్ధి - నష్టాన్ - అచేతసః.

ప్రతి॥ యేతు = ఎవరైతే, ఏతత్ = ఈ, మే = నాయొక్క, మతం = అభిప్రాయమును, అభ్యసూయన్తః = ద్వేషించుచున్నవారై, న అనుతిష్ఠన్తి = అనుసరింపరో, తాన్ = వారలను, అచేతసః = బుద్ధిహీనులుగాను, సర్వజ్ఞాన విమూఢాన్ = బొత్తిగా జ్ఞానము లేనివారినిగాను, నష్టాన్ = చెడినవారినిగాను, విద్ధి = ఎఱుంగుము.

తా॥ ఎవరైతే ఈ నాయొక్క అభిప్రాయమును ద్వేషించిన వారై ఈశ్వరార్పణబుద్ధితో కర్మను చేయరో, వారలను బుద్ధిహీను

లనుగాను, బొత్తిగా జ్ఞానము లేనివారలనుగాను, చెడిన మనస్సుగల వారినిగాను నెఱుంగుము.

వి॥ ఈశ్వరార్పణబుద్ధితో సత్కర్మల జేయనవసరములేదని చెప్పువార లనుగురించి యీశ్లోకములో చెప్పడమైనది.

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥ 33

పద॥ సదృశం - చేష్టతే - స్వస్యాః - ప్రకృతేః - జ్ఞానవాన్ - అపి,
ప్రకృతిం – యాంతి – భూతాని – నిగ్రహః – కిం – కరిష్యతి.

ప్రతి॥ జ్ఞానవాన్ అపి = జ్ఞానవంతుడైనను, స్వస్యాః=తనయొక్క, ప్రకృతేః = స్వభావమునకు, సదృశం =తగినట్లుగా. చేష్టతే= ప్రవర్తించుచున్నాడు, భూతాని= ప్రాణులు, ప్రకృతిం = జన్మాంతరసంస్కారమువలన గలిగిన స్వభావమును. యాంతి=పొందుచున్నవి (కనుక), నిగ్రహః= నిరోధము, కిం కరిష్యతి = ఏమి చేయగలదు?

తా॥ సకల ప్రాణులు వారివారి జన్మాంతర సంస్కారమువలన గలిగిన స్వభావమును పొందుచున్నవి. స్వభావానుగుణముగ నడచు చున్నవని తాత్పర్యము. కనుక జ్ఞానవంతుడైనను తనయొక్క స్వభావమునకు తగినట్లుగా ప్రవర్తించుచున్నాడు. నిరోధమేమి చేయగలదు?

వి॥ ఈ శ్లోకవిషయమై అనేకులకు ఒక సందేహముకలదు. ఏలన, జ్ఞానవంతుడైనవాడుగూడ వాని సంస్కారముననుసరించియే ప్రవర్తించును. ఈ విషయమై నిరోధము చేయ తలంచుట వృథాకదా? ఎట్లనగా జ్ఞానవంతుడే తన స్వభావము ననుసరించి ప్రవర్తించుచుండగా అజ్ఞానులు తమస్వభావమునెట్లు మార్చుకొనగలరు? అని, సమాధానము: వేదాంతశాస్త్రములో జ్ఞానమనియు విజ్ఞానమనియు లేక జ్ఞానమనియు జ్ఞేయమనియు లేక శాస్త్రజ్ఞానమనియు అనుభవజ్ఞానమనియు నిరు తెగలు గలవు, లేక అభ్యాసియనియు - ఆరూఢుడనియు లేక ముముక్షువనియు - ముక్తుడనియు తారతమ్యములు గలవు. కావున నిచ్చట శాస్త్రజ్ఞానము గలవానిని గురించి చెప్పినదని గ్రహించవలయును. ఈజ్ఞాన జ్ఞేయ

ముల గుఱించి 13-వ అధ్యాయమున గనందగును. కావుననే ఈ శ్లోకము జూచి ప్రమాదములో పడుదురేమోనని తలంచియే క్రింది శ్లోకమున

> శ్లో॥ ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
> తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ ॥

అనితెలుపబడినది. ఈ అధ్యాయమున39,40,41,42,43 శ్లోకములనుచూచిన దీని రహస్యమును, శ్రీ కృష్ణాశయమును తెలిసికొనగలరు. మఱియు రెండవ అధ్యాయములోగల స్థితప్రజ్ఞుని లక్షణములను జూచిన నిది స్పష్టమగును. మఱియు వేదాన్తశాస్త్రమున సాధన చతుష్టయ సంపత్తిగలవాఁడే అధికారి యని నిరూపించబడమైనది. అందు నిత్యానిత్యవస్తువివేకజ్ఞానము మొదటిదియగును. అట్టి జ్ఞానమే యిచట తెలుపబడినది. ఇక ఇహాముత్రఫల భోగవిరాగము, శమాది షట్కసంపత్తి,ముముక్షుత్వముగూడ గల్గునప్పుడే బ్రహ్మవిద్యావిచారణకు అర్హుడగునని ఉంటున్నది గదా! మఱియు జ్ఞానజ్ఞేయములు రెండును గలిగిన మాత్రమే ప్రకృతి రాహిత్యము, సంస్కారరహితత్వము గలుగునని యీ గీతా ప్రమాణములే తెలుపుచున్నవి, అ. 6. శ్లో॥ 8 ''జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా'' జ్ఞానము చేతను; విజ్ఞానముచేతను పూర్ణానందముగలవాడే యోగియని తెలుపడమైనది మఱల అ.7.

> శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః।
> యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్ఞాతవ్యమవశిష్యతే॥

ఇచ్చటగూడా జ్ఞానమును విజ్ఞానమును తెలిసికొనిన మాత్రమే ఇహమున మఱల తెలిసికొనదగినది కొంచమైనను మిగిలియుండదని శ్రీభగవంతుడు తెలుపుట చేతనే జ్ఞేయమును తెలిసికొనకపోయిన సంపూర్ణుడు కాడని గోచరమగుటలేదా! మఱియు అ. 13 లో అర్జునుడు అడిగిన 6 ప్రశ్నలలో ''జ్ఞానం జ్ఞేయం చ కేశవ'' జ్ఞానమనగానేమి? జ్ఞేయమనగానేమి? అని ప్రశ్నించుటవలననే జ్ఞానము సాధనమనియు; జ్ఞేయము సాధ్యమనియు నర్థమగుచున్నది శ్రీకృష్ణభగవానుడు అ. 13;శ్లోకము 8 నుండి 12 వఱకు ''అమానిత్వ ''మను జ్ఞానమును ప్రారంభించి యుపదేశించెను. ఈ ఐదు శ్లోకములు ముముక్షువులచే తప్పక తెలిసి కొనదగినవి. కావుననే కట్టకడకు''ఏతజ్జ్ఞానమితిప్రోక్తం''అని స్పష్టీకరించి తెలుపుటకు కారణమైనది. ''ఈ జ్ఞానమువలననె కృతార్థుడయితినని తలంచు నేమోయని హృదయములో తలంచియే 13 వ శ్లోకమున ''జ్ఞేయంయత్తత్ప్రవ

జ్ఞ్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే'' జ్ఞేయమన నెట్టిదో దానిని తెలిసికొనిన మాత్రమే అమృతత్వము (అనగా బ్రహ్మానందప్రాప్తి) గలుగునని తెలిపెను గదా! ఈ సత్యము ననుభవజ్ఞుడగు గురుని ముఖమున గ్రహించుకొనక పోవుటయే ప్రమాదకరములగు ననర్థములలో పడిపోవుటకు కారణము. ప్రజలను శాసించెడు ఉన్నతోద్యోగి కావలసియుండిన దానికి తగిన విద్యలో నుత్తీర్ణుడు కావలెను. ఉత్తీర్ణుడయిన మాత్రమున జాలదు. ఉద్యోగముగూడ లభించవలెను. అప్పుడే అధికారమును దానిచే గలుగు ఫలమును లభించును. ఈ జ్ఞానము డిగ్రీని పొందుటవంటిదనియు, జ్ఞేయము ఉద్యోగప్రాప్తియనియు గ్రహించుకొనవలయును. స్వబుద్ధితో అర్థమును తెలిసికొననివాని స్థితి చుక్కాని లేని పడవవలె నుండునని మరువకూడదు.

శ్లో॥ వేదాన్తానామనేకత్వాత్ సంశయానాం బహుత్వతః।
వేద్యస్యాప్యతిసూక్ష్మత్వాత్ న జానాతి గురుం వినా॥

అని అనుభూతి ప్రకాశిక తెలుపుచున్నది. వేదాన్తమున అనేక మార్గములు గలవనియు సంశయములు అనేకము లావిర్భవించుననియు తెలియదగిన బ్రహ్మతత్త్వమతి సూక్ష్మమనియు, కావున ఆత్మానుభవముగల మహాత్ముడగు గురువు యొక్క బోధలేనిచో నెట్టివారికైనను నిజార్థము తెలియుటకు సాధ్యము గాదనియు తెలుపుటకు కారణమైనది.

శ్లో॥ ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్నవశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ॥ 34

పద॥ ఇన్ద్రియస్య - ఇన్ద్రియస్య - అర్థే - రాగద్వేషౌ - వ్యవస్థితౌ, తయోః- న - వశం - ఆగచ్ఛేత్ - తౌ - హి - అస్య - పరిపన్థినౌ.

ప్రతి॥ ఇన్ద్రియస్య ఇన్ద్రియస్య = ప్రతి ఇంద్రియముయొక్క, అర్థే = విషయమునందు, రాగద్వేషౌ = ఇష్టానిష్టములు, వ్యవస్థితౌ = కలిగియున్నవి కాబట్టి, తయోః = ఆ రాగద్వేషములకు, వశం=అధీనము, నఆగచ్ఛేత్= కాగూడదు. హి = ఏలయనగా, తౌ = ఆరాగద్వేషములు, అస్య = ఈ పురుషునకు, పరిపన్థినౌ = శత్రువులు.

తా॥ ప్రతి ఇంద్రియముయొక్క విషయమునందు ఇష్టానిష్టములు కలిగియుంటున్నవి. కావున ఆ రాగద్వేషముల కధీనము

కాకూడదు. ఏలయనగా ఆ రాగద్వేషములు ఈ ముముక్షువగు పురుషునకు శత్రువులు.

వి॥ పై చెప్పిన శ్లోకమున జీవులకు స్వభావము నైజమైనచో విధి నిషేధములను తెలుపువేదమే నిరర్ధకమగును.అదియునుగాక గురుశిష్య సంప్రదాయ ముపయోగపడదు. అంతేగాదు. ప్రవృత్తి నివృత్తి మార్గ ములేకపోవును.కావున పై జెప్పిన శ్లోకముననుసరించి యింద్రియముల ప్రవృత్తినుండి నివృత్తిని పొంద యత్నింపనిచో కలిగెడి అపాయము ఈశ్లోకమున తెలుపడమైనది మఱియు,శాస్త్ర జ్ఞానముచేతగాని, అభ్యాసముచేతగాని తృప్తిని బొందక అనుభవజ్ఞానము ఆరూఢ జ్ఞానము గలుగువరకు యత్నించవలెనని తెలుపడమైనది. మఱియు శాస్త్రజ్ఞానము కలవాడై విషయములను నిగ్రహింప సమర్థుడుగానిచో నిక శాస్త్రజ్ఞానము లేని వారినిగూర్చి వేరుగ జెప్పవలయునా? అని యూహింపవలయును. వీటి అన్నిటి యొక్క సారమేమన - ఇంద్రియనిగ్రహము కడుంగడు కష్టమైనది. మఱియు ముముక్షువులకును అభ్యాసకులకును సంపూర్ణ నిగ్రహము గలుగదనియు,ముక్తు నికి మాత్రమే కలుగుననియు తెలుపడమైనది. కావున నిర్విషయస్థితి గలుగువఱకు సాధన చతుష్టయ సంపత్తిగలవాడై సాధన చేయుచుండవలెనని తాత్పర్యము,

శ్లో॥ శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 35

పద॥ శ్రేయాన్ - స్వధర్మః - విగుణః - పరధర్మాత్ - స్వనుష్ఠితాత్,
స్వధర్మే - నిధనం - శ్రేయః - పరధర్మ - భయావహః,

ప్రతి॥ విగుణః = గుణములేని, స్వధర్మః = తన కేర్పడిన ధర్మము, స్వనుష్ఠితాత్=చక్కగ నాచరింపబడిన, పరధర్మాత్ = ఇతరులాచరించు ధర్మము కంటె, శ్రేయాన్=శ్రేష్ఠమైనది, స్వధర్మే= తన యాచరణయందు, నిధనం అపి =మరణము గలిగినను, శ్రేయః = శ్రేయస్కరము, పరధర్మః = ఇతరుల యాచారము, భయావహః = భయమును గలుగజేయునది,

తా॥ గుణము లేనిదైనను తనకేర్పడిన ధర్మము చక్కగా నాచరింపబడిన ఇతరులాచరించు ధర్మముకంటె నుత్తమమైనది. తన యాచరణయందు మరణము గలిగినను శ్రేయస్కరము. ఇతరుల ఆచారము భయమును కలుగజేయునది,

వి॥ ఇంద్రియ సౌఖ్యములందు కోరిక గలిగి తన ధర్మమును అనగా వ్రత నిష్ఠను పోగొట్టుకొనగూడదు. తన వ్రతనిష్ఠయందు ప్రాణముపోయినను అది వానికి మోక్షమును కలుగజేయును. కావున తమ వ్రతములను నిలబెట్టుటలో ధైర్యశాలురై యుండవలయునని యీశ్లోకముచే నుద్బోధించడమైనది.

అర్జున ఉవాచ :—అర్జునుడు చెప్పెను.

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ! బలాదివ నియోజితః ॥ 36

పద॥ అథ - కేన - ప్రయుక్తః - అయం - పాపం - చరతి - పూరుషః, అనిచ్ఛన్ - అపి - వార్ష్ణేయ! - బలాత్ - ఇవ - నియోజితః.

ప్రతి॥ హేవార్ష్ణేయ! = ఓశ్రీకృష్ణమూర్తీ!, అథ = అయితే, అయం పూరుషః = ఈ పురుషుడు, కేన = దేనిచేత, ప్రయుక్తః = ప్రేరేపింపబడినవాడై, అనిచ్ఛన్ అపి = ఇచ్ఛలేనివాడయ్యును, బలాత్ = బలాత్కారముగా, నియోజితః ఇవ = నియమింపబడినవాడువలె, పాపం = పాపకార్యమును, చరతి = చేయుచున్నాడు?

తా॥ ఓ కృష్ణా ! అయితే యీ పురుషుడు దేనిచేత ప్రేరేపింపబడినవాడై యిచ్ఛలేనివాడయ్యును బలాత్కారముగా నితరులచే ప్రేరేపింపబడిన వానివలె పాపకార్యమును చేయుచున్నాడు?

వి॥ అర్జునుడడిగిన ఈ ప్రశ్న ముముక్షువులందరికిని సంబంధించినది. అసత్యము పాపమని యెఱింగి సత్యమే చెప్పవలెనని తలంచినను ఒకానొకప్పుడు తెలియకనే అసత్యవాక్యము పలుకుట, తినరాని వస్తువులను మంచివి కావవి విడిచిపెట్టినను అటువంటి పదార్థములను జూచునపుడు మఱల తినవలెనని సంకల్పము కలుగుట, కోపము పాపమని యెఱింగియు ఒక్కొక్కప్పుడు హఠాత్తుగా కోపము గలుగుట, యీ మొదలగువాటికి కారణమేమి? అని అర్జును డడుగుచున్నాడు. ఇట్టి సంశయము అందఱికిని సహజముగనే గలుగుచుండును గదా?

శ్రీ భగవానువాచ :— శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥ 37

పద॥ కామః - ఏషః - క్రోధః - ఏషః - రజోగుణసముద్భవః,
మహాశనః - మహాపాప్మా - విద్ధి - ఏనం - ఇహ - వైరిణమ్.

ప్రతి॥ ఏషః = ఇది (నీచే యడుగబడిన ఈ హేతువు). రజోగుణసముద్భవః = రజోగుణమువలన పుట్టినదియు, మహాశనః = తృప్తినొందనిదియునగు, కామః = కోరిక, ఏషః = ఇది (ఈ హేతువు). మహాపాప్మా = గొప్ప పాతకమునకు హేతువైనదగు, క్రోధః=క్రోధమును అయియున్నది కాబట్టి, ఏనం = ఈ కామమును, ఇహ = ఈలోకమునందు, వైరిణం= శత్రువునుగా, విద్ధి = ఎఱుంగుము.

తా॥ రజోగుణము వలన పుట్టినదియు, తృప్తినొందనిదియు మహాపాతకమునకు హేతువైనదియునగు కామము, క్రోధము ఇవియే మనుష్యుని పాపకార్యమునకై ప్రేరేపించుచుండును. కావున ఈ కామము లేక క్రోధము ముముక్షువులకు పరమశత్రువులని తెలిసికొనుము.

వి॥ అర్జును డడిగిన ప్రశ్నకు నిచ్చట సమాధానము తెలుపడమైనది. అంతఃకరణములో నింకను రజోగుణ తమోగుణముల వాసనలు నశించలేదు. అందుచే విషయసుఖముల ననుభవించి తృప్తి పొందవచ్చునని తలంచుట భావ్యముగాదు. ఏలన అట్టి తలంపు మహాశనుడు అనగా అగ్నివంటిది. అగ్నిసమిధలచే వృద్ధినొందునేగాని శాంతినొందదు. అంతేగాదు. విషయవాసన మహాపాప స్వరూపమైనది. ఇది ఆత్మనిష్ఠులకు పరమశత్రువు భూమిలో నెండకాలమున బీజములు కనబడక పోయినను వర్షము కురిసినపుడు మొలకలెత్తుచుండునుగదా! దీనిచే నిదివరలో భూమియడుగున ఈ విత్తనము లుండియున్నట్లు ఏలాగున గ్రహించుచున్నామో, అట్లే దృశ్యవృత్తులు గలుగుచుండిన ఇంకను హృదయముయొక్క అడుగుభాగములో ఈ సంస్కారవాసనలున్నవనియు నశింపలేదనియు తలచి వాటిని రహిత మొనర్చవలెను. ప్రకృతవృత్తులు రహితము కానిచో తా ననుష్ఠించు బ్రహ్మబీజము పూర్ణఫలము నియ్యజాలదు. కలుపుతీయనిచో అవి పెరిగి పైరును అణచివేయునట్లుండును. అంతేగాదు ఈ సంవత్సరము కలుపుతీయనిచో మరు సంవత్సరము కలుపు పెరిగి భూమిని పాడుచేయును; అలాగున ఈ జన్మములో జాగ్రతగలిగి వృత్తుల నిర్మూలన మొనర్చనిచో, మరుజన్మములో మఱింత ప్రకృతిగుణములు గలిగి ఆత్మను చెరచును.

శ్లో॥ ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో మలేన చ ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్ ॥ 38

పద॥ ధూమేన - ఆవ్రియతే - వహ్నిః - యథా - ఆదర్శః - మలేన - చ.
యథా - ఉల్బేన - ఆవృతః = గర్భః -తథా- తేన - ఇదం - ఆవృతమ్

ప్రతి॥ యథా = ఏప్రకారముగా, ధూమేన = పొగచేత, వహ్నిః =అగ్ని, ఆవ్రియతే=కప్పబడుచున్నదో, యథా =ఏప్రకారముగా, మలేన=మాలిన్యముచేత, ఆదర్శః చ=అద్దమున్ను, ఆవ్రియతే=కప్పబడుచున్నదో, యథా= ఏప్రకారముగా, ఉల్బేన = మావిచేత, గర్భః = గర్భములోగల శిశువు. ఆవృతః= కప్పబడునో, తథా=అ ప్రకారముగా. తేన=అ కామముచేత, ఇదం = ఈ యాత్మజ్ఞానము, ఆవృతం = కప్పబడినది,

తా॥ పొగచేత నగ్నియు, మాలిన్యముచేత అద్దమును మావిచేత గర్భములోని శిశువును ఆవరింపబడునట్లు కామముచేత ఆత్మజ్ఞాన మావరింప బడియున్నది.

వి॥ ఆత్మ స్వప్రకాశమైనదిగదా? అట్లైనచో నది యేల కనబడుటలేదు? అను సందేహమునకు ఈ శ్లోకముచే సమాధానము చెప్పడమైనది. జ్ఞానికిని అజ్ఞానికిని ఇచ్చటనే భేదము గలుగుచున్నది. జ్ఞానియొక్క హృదయము శుభ్రముగాతుడిచిన చిమ్నిగల దీపమువలెనుండును. అజ్ఞానియొక్క హృదయము పొగబట్టిన లైటువలె నుండును, జ్ఞానియొక్క హృదయము ఆత్మవిచారణచే శుద్ధముగా తుడిచిన అద్దమువలె నుండును. దానియందు తన స్వరూపము స్పష్టముగా గనబడును. అట్టియాత్మ విచారములేనివాని మనస్సు మాలిన్యముతో నిండియుండుట వలన తన యాత్మస్వరూపము కనుపించుటలేదు. ఇంత ప్రకాశముగల సూర్యుడు మేఘముచే నావృతుడైనపుడు కనబడకపోవుచున్నాడు; గాలిచే మేఘము తొలగునపుడు సూర్యుడు కనుపించునట్లు, ఆత్మవిచారణవలన అనాత్మభావము తొలగునపుడు పరమాత్మగలదను జ్ఞానము గోచరమగును.

శ్లో॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేన చ ॥ 39

పద॥ ఆవృతం - జ్ఞానం - ఏతేన - జ్ఞానినః - నిత్యవైరిణా.
కామరూపేణ - కౌన్తేయ! - దుష్పూరేణ - అనలేన - చ.

ప్రతి॥ హే కౌన్తేయ ! = ఓ యర్జునా !. దుష్పూరేణ = ఎంత ప్రయత్నముతో నింపింప జూచినను నిండనిదియు, అనలేన చ=అగ్నివలె తృప్తి జెందని

దియు, కామరూపేణ=కోరికయే రూపముగాగలదియు, జ్ఞానినః = జ్ఞానికి, నిత్యవైరిణా = సర్వకాలములయందు శత్రువైనదియునగు, ఏతేన = ఈ కామముచేత, జ్ఞానం = జ్ఞానము, ఆవృతం = కప్పబడియున్నది.

తా॥ ఎంత నిండింప జూచినను నిండనిదియు, అగ్నివలె తృప్తి లేనిదియును;ఇచ్ఛారూపమైనదియును,జ్ఞానికి సర్వకాలములయందును శత్రువైనదియు నయిన కామముచేత జ్ఞానము ఆవరింపబడియున్నది.

వి॥ అగ్నిహోత్రుడు సమిధలచేతను, ఘృతముచేతను అంతకంతకువృద్ధి యగునట్లు విషయసుఖములు అనుభవింపగా ననుభవింపగా వృద్ధిపొందునేగాని శమింపవు.సముద్రము నదులచే నిండింపజూచినను నిండదు.విషయభోగములును అటువంటివే.కనుక సముద్రమును, అగ్నిని దృష్టాంతముగాజెప్పుటకుగారణము. అంతేగాదు, కామమును జ్ఞానమునకు పరమశత్రువునుగా దలంపవలెను. ఈ సంగతి తెలియక కొందఱు విషయాసక్తులు ఒకసారి అనుభవించిన కామము శమించునని వచింతురు వీరు ఆత్మశుద్ధిలేనివారు, వీరి వాక్యములు చాల అపాయమును గలుగ చేయునవి. సమిధలు వేయనిచో అగ్ని స్వయముగా చల్లారునట్లు విషయనివృత్తిగల హృదయములో మాత్రమే కామాగ్నిశమించును.

శ్లో॥ సర్పిషా కాష్ఠభారేణ వర్ధతేఽగ్నిశిఖా యథా।
ఉపభోగేన కామేన హ్యాశా చోపరివర్ధతే ॥

ఘృతముచేతను అనేక బారువుల కట్టెలచేతను హోమించిన అగ్నిఅంత కంతకు పెరుగునట్లు కామభోగములచే భోగాశ అంతకంతకు వృద్ధియగునేగాని శమింపదు అని శ్రుతి, మైత్రేయశ్రుతి చెప్పినదియు చూడుడు.

"యథా నిరింధనో వహ్నిస్స్వయమేవోపశామ్యతి ।
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయమేవోపశామ్యతి॥"

దీని యర్థము పైన జెప్పినదే.

శ్లో॥ ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠానముచ్యతే ।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥ 40

పద॥ ఇన్ద్రియాణి - మనః - బుద్ధిః - అస్య - అధిష్ఠానం - ఉచ్యతే,
ఏతైః - విమోహయతి - ఏషః - జ్ఞానం - ఆవృత్య - దేహినమ్.

ప్రతి॥ ఇన్ద్రియాణి = ఇంద్రియములు, మనః = మనస్సు, బుద్ధిః =బుద్ధియున్ను, అస్య = ఈ కామమునకు, అధిష్ఠానం = ఆశ్రయమని, ఉచ్యతే = చెప్ప

బడుచున్నవి, ఏషః = ఈ కామము, ఏతైః = ఈ ఇన్ద్రియాదులచేత, జ్ఞానం = జ్ఞానమును, ఆవృత్య = ఆవరించి, దేహినం = మనుష్యుని, విమోహయతి = మిక్కిలి మోహింపజేయుచున్నది.

తా॥ ఇన్ద్రియములు, మనస్సు, బుద్ధియును ఈ కామమున కాశ్రయములని చెప్పబడుచున్నవి. ఈ కామము ఇన్ద్రియాదులచేత జ్ఞానము నావరించి మానవుని మిక్కిలి మోహింపజేయుచున్నది.

వి॥ ఫల పుష్ప పత్ర పల్లవాదులచే విస్తరింపబడిన వృక్షమునకు మూలము (మొదలు) కారణమెటులో అలాగుస సర్వానర్థములకీ కామమే కారణము. కావున కోరిక యనెడు ఈ మొదలును ఛేదించిన మాత్రమే మనస్సు ఇన్ద్రియములు శాంతించును. అంతియేగాక ఈ కోర్కె ఆత్మదృష్టిలో నిలువనీయక జ్ఞానమును మరుగుపరచి దృశ్యమును ప్రకాశింపజేయుచుండును.

శ్లో॥ తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ !।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ 41

పద॥ తస్మాత్ - త్వం - ఇన్ద్రియాణి - ఆదౌ - నియమ్య - భరతర్షభ!, పాప్మానం - ప్రజహి - హి - ఏనం - జ్ఞానవిజ్ఞాననాశనమ్.

ప్రతి॥ హే భరతర్షభ! = ఓ యర్జునా!, హి = ఏ కారణమువలన(కామము, మోహయతి = మోహపెట్టుచున్నదో), తస్మాత్ = ఆ కారణమువలన, త్వం = నీవు, ఆదౌ=మొదట, ఇన్ద్రియాణి = ఇన్ద్రియములను, నియమ్య =నిగ్రహించి, జ్ఞానవిజ్ఞాననాశనం = ఆత్మయొక్క పరోక్షజ్ఞానమును, అనుభవజన్యజ్ఞానమును నశింపజేయునదియును, పాప్మానం=పాపస్వరూపమునైన ఏనం = ఈ కామమును,ప్రజహి = ప్రయత్నపూర్వకముగా విడువుము.

తా॥ ఏ కారణమువలన నింద్రియమనోబుద్ధు లాధారముగాగల కామము జీవుని మోహపెట్టుచున్నదో, ఆ కారణమువలన నీవు ఇంద్రియములను స్వాధీనములో నుంచుకొని, శాస్త్రములచేతను గురువులచేతను శ్రవణము చేయబడిన జ్ఞానమును, ఆత్మసాక్షాత్కార విజ్ఞానమును నశింపజేయునదియును, పాపస్వరూపమునగు ఈ కామరూపమైన కోరికను ప్రయత్నపూర్వకముగానైనను విడిచిపెట్టుము. విజ్ఞానమునుగూడ కామము నశింపజేయునని చెప్పుట కామముచే

గలిగెడు దోషము అంతదుష్టమని తెలుపుటకొఱకును, మఱియు దాని యొక్క శక్తి అంత మహిమాతిశయముతో గూడినదని తెలియుటకొఱకని గ్రహించవలయును.

వి॥ కోరిక పాపస్వరూపమగుటచేతను అది జ్ఞానమును విజ్ఞానమును సహా నశింపజేయునది యగుటచేతను దానిని ప్రయత్నపూర్వకముగానైనను త్యజింపవలయును.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥ 42

పద॥ ఇన్ద్రియాణి - పరాణి - ఆహుః - ఇంద్రియేభ్యః - పరం - మనః,
మనసః - తు - పరా - బుద్ధిః -యః - బుద్ధేః - పరతః - తు - సః.

ప్రతి॥ ఇంద్రియాణి = ఇన్ద్రియములు, పరాణి = దేహముకన్న శ్రేష్ఠములైనవి, ఇంద్రియేభ్యః = ఇంద్రియములకంటె, మనః = మనస్సు, పరం = శ్రేష్ఠమైనది, మనసః తు = మనస్సుకంటెను, బుద్ధిః=బుద్ధి, పరా=శ్రేష్ఠమైనది, బుద్ధేః తు = బుద్ధికంటెను, యః = ఎవడు, పరతః = శ్రేష్ఠుడో, సః=వాడు ఆత్మయని, ఆహుః = బ్రహ్మవేత్తలు చెప్పుదురు.

తా॥ బ్రహ్మవేత్తలు దేహమునకన్న కర్మేంద్రియములు చైతన్యము గలవియనియు, వాటికన్న జ్ఞానేన్ద్రియములు చైతన్యవంతములనియు, అట్టి యింద్రియములకంటె మనస్సు చైతన్యవంతమైనదనియు, మనస్సుకంటెను బుద్ధి చైతన్యవంతమైనదనియును, అట్టి బుద్ధికంటెను మిక్కిలి చైతన్యముగలది యాత్మయనియు చెప్పుదురు. మఱికొందఱు శరీరముకన్న కర్మేన్ద్రియములు పైభాగములోను, కర్మేన్ద్రియములకన్న జ్ఞానేన్ద్రియములు పైభాగమునను, అట్టి కర్మేన్ద్రియ జ్ఞానేన్ద్రియములకంటె మనస్సు పైభాగమునను, మనస్సుకంటె పైభాగమున నుండునది బుద్ధియనియు, ఆ బుద్ధికంటె పైభాగమున నుండునది యాత్మయనియు వచింతురు.

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్ ॥ 43

పద॥ ఏవం - బుద్ధేః - పరం - బుద్ధ్వా - సంస్తభ్య - ఆత్మానం - ఆత్మనా,
జహి - శత్రుం - మహాబాహో! - కామరూపం - దురాసదమ్.

ప్రతి॥ హే మహాబాహో! = ఓయర్జునా!. ఏవం = ఇట్లు, బుద్ధేః = బుద్ధికంటెను. పరం=శ్రేష్ఠమైనదానినిగా, బుద్ధ్వా=ఎఱింగి,ఆత్మనా=తనచేత,ఆత్మానం= తనను, సంస్తభ్య =నిశ్చలముగాజేసి (సుస్థిరమొనర్చుకొని), దురాసదం= జయింప ప్రయాసమైనదియు, కామరూపం = కామరూపమైనదియునునగు, శత్రుం = శత్రువును, జహి = విడువుము (గెలువుము.)

తా॥ ఓ యర్జునా! ఈవిధముగా బుద్ధికంటె వ్యతిరిక్తమైన యాత్మను జ్ఞానస్వరూపముగా నెఱింగి; తన్ను తాను నిశ్చలముగా చేసికొని సుస్థిరమొనర్చుకొని జయింప ప్రయాసమైనదియు, కామ స్వరూపమైనదియునైన శత్రువును (మూలప్రకృతిని) త్యజింపుము లేక వధింపుము లేక జయింపుము.

వి॥ ధ్యానకాలములో దేహమును, కర్మేన్ద్రియములను, జ్ఞానేంద్రియము లను, మనస్సును, బుద్ధిని 'యిదికాదు, ఇది కాద'ని వదలించుచు బుద్ధికి సాక్షియై స్వప్రకాశమై యుండు ఆత్మయే తానని దృఢనిశ్చయమును జేసికొనవలయును. అట్టి తురీయాత్మయందు నిలుకడగలిగిన మాత్రమే యిన్ద్రియనిగ్రహముగలుగును. అట్లు కానిచో ఆసనములచే దేహమును, ముద్రలచే నిన్ద్రియములను,ప్రాణాయామ ముచే మనస్సును, ధ్యానముచే బుద్ధిని స్వాధీనపరుపచూచినను, మనోజయము గలుగదు. ఒకరైలు ఇంజను వెళ్లునపుడు పెట్టెలను, చక్రములను పట్టి నిలుప జూచిన నెట్లు సాధ్యముకాదో, యింజనుయొక్క మరను త్రిప్పిన తక్షణమే రైలు ఎట్లాగిపోవునో, అలాగుననే ఆత్మచైతన్యము మూలావిద్యతో సంబంధపడి నందున బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, దేహము ప్రవర్తించుచున్నవో అట్టి మూలావిద్యను విడిచిన మాత్రమే యాత్మయందు నిలుకడ గలుగును. ఇట్లుగాక తపస్సుచే శరీరమును శుష్కింపచేసినను. ఇంద్రియములను చలింపక నిలిపినను, మనస్సుచే దేనిని చింతింపకయుండినను, బుద్ధితో ధ్యానించుచుండినను ఇన్ద్రియ నిగ్రహము గలుగదు. ఇట్టివాడెంత వృద్ధుడై శరీరేంద్రియములను శుష్కింపజేసి నను మనోజయము గలుగదు. పెద్దయంత్రములో మూలచక్రమునకు తగిలించి యుండు పట్టా తిరుగునపుడు ఉపచక్రములను పట్టి నిలుపజూచిన నది అసాధ్యపు పనియే యగును. ప్రధానచక్రముతో సంబంధింపబడిన పట్టాను తొలగించిన ఆ క్షణములోనే యంత్రమంతయు స్తంభించిపోవునట్లు బుద్ధికి పరమగు నాత్మ తానని నిశ్చయించి, అనాత్మరూపములగు బుద్ధ్యాదులను తొలగించిన మాత్రమే యిన్ద్రియనిగ్రహము గలుగును, పై జెప్పినవన్నియు సహాయపడును. ఇట్టి ఆత్మ

బోధము గలవాడు ఇన్ద్రియసౌష్ఠవము గలిగి యౌవనస్థుడైయుండినను అతని యిన్ద్రియములన్నియు స్తంభించిపోవును. ఇంతవఱకు కర్మయోగము నుపదేశించి కట్టకడకు జ్ఞేయమగు బ్రహ్మములో జేరుటకు లేక తాదాత్మ్యము నొందుటకు తగిన పరమార్థమంతయు నీ రెండు శ్లోకములలో భగవానునిచే నుపదేశించబడ మైనది. ఇది వేదాంతముయొక్క పరమసారము. కఠోపనిషత్తు ఉపదేశించినది చూడుడు.

"ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।
మనసశ్చ పరా బుద్ధిః బుద్ధేరాత్మా మహాన్పరః ॥
మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః ।
పురుషాన్నపరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః " ॥

దీని యర్థము పైశ్లోకములో నిరూపించినదే. "సా కాష్ఠా సా పరాగతిః" అదేనిష్ఠ యొక్క పరాకాష్ఠయనియు, అదే సర్వోత్కృష్టమగు మోక్షమనియు తెలుపడ మైనది. అది శివము, అమృతము, ఆనందము అద్వైతము కర్మయోగమని చెప్పుటచే - నిట్టి నిష్కామయోగమును శుద్ధముగ నాచరించిన పరమాత్మైక్య జ్ఞానము గలుగును. నిష్కామకర్మయోగము లెస్సగ నాచరించిన నదియే ఆత్మ జ్ఞానములోనికి తీసుకొని వెళ్ళును - అని కర్మయోగముయొక్క ప్రయోజనము చరమలక్ష్యము చెప్పినట్లైనది.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే కర్మయోగో నామ
తృ తీ యో ఽ ధ్యా యః

పద॥ ఇతి-శ్రీమద్భగవద్గీతాసు - ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే - కర్మయోగః - నామ - తృతీయః - అధ్యాయః,

ప్రతి॥ ఇతి = ఇట్లు, ఉపనిషత్సు = ఉపనిషదర్థ ప్రతిపాదకమును. బ్రహ్మ విద్యాయాం=బ్రహ్మవిద్యాస్వరూపమును. యోగశాస్త్రే= యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదే = శ్రీకృష్ణార్జున సంవాదమును నగు, శ్రీమద్భగవ ద్గీతాసు = శ్రీ భగవద్గీతలలో, కర్మయోగః నామ =కర్మయోగమను, తృతీయః అధ్యాయః = మూడవ అధ్యాయము ముగిసెను.

తా॥ ఇట్లు ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీమద్భగవద్గీతయందు కర్మ యోగమను తృతీయాధ్యాయము ముగిసినది. ఓమ్ తత్ సత్.



ఓమ్
శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## చతుర్థోఽధ్యాయః - చతుర్థాధ్యాయము
## జ్ఞానయోగః - జ్ఞానయోగము



శ్రీ భగవానువాచ:— శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।
వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ 1

పద॥ ఇమం - వివస్వతే - యోగం - ప్రోక్తవాన్ - అహం - అవ్యయం.
వివస్వాన్ - మనవే - ప్రాహ - మనుః - ఇక్ష్వాకవే - అబ్రవీత్,

ప్రతి॥ అహం = నేను, అవ్యయం = నాశరహితమైన, ఇమం = ఈ, యోగం= కర్మయోగమును,వివస్వతే=సూర్యునికొఱకు,ప్రోక్తవాన్=చెప్పియుంటిని, వివస్వాన్ = సూర్యుడు, మనవే = వైవస్వతమనువుకొఱకు, ప్రాహ = చెప్పెను, మనుః = వైవస్వతమనువు, ఇక్ష్వాకవే = ఇక్ష్వాకుమహారాజు కొఱకు, అబ్రవీత్ = చెప్పెను.

తా॥ నాశరహితమైన ఈ గీతాశాస్త్రమును కర్మయోగమును నేను పూర్వము సూర్యునికి జెప్పితిని. సూర్యుడు వైవస్వతమనువున కుపదేశించెను. వైవస్వతమనువు ఇక్ష్వాకుమహారాజున కుపదేశించెను.

వి॥ శాశ్వతమైన ఈనిష్కామకర్మయోగము ఈ నాటిది కాదు. నేను పూర్వమే సూర్యునికి ఉపదేశించితిని. ఇయ్యది ఆత్మశుద్ధిని కలుగజేసి తద్ద్వారా మోక్షమును కలుగజేయునని భావము.

శ్లో॥ ఏవం పరంపరాప్రాప్తమిమం రాజర్షయో విదుః ।
న కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప! ॥ 2

పద॥ ఏవం - పరంపరాప్రాప్తం - ఇమం - రాజర్షయః - విదుః,
న - కాలేన - ఇహ - మహతా - యోగః - నష్టః - పరంతప !

ప్రతి॥ హే పరంతప! = ఓ అర్జునా!. ఏవం = ఇట్లు, పరంపరాప్రాప్తం = వంశ పారంపర్యముగా ననుష్ఠింపబడుచు వచ్చిన, ఇమం = ఈ నిష్కామకర్మ

యోగమును, రాజర్షయః = రాజర్షులు, విదుః = ఎఱుంగుదురు, సః యోగః = ఆ యోగమార్గము, మహతా కాలేన = బహుకాలము గడచు టచే, ఇహ = ఈలోకమునందు, నష్టః = నశించినదాయెను.

తా॥ ఓ యర్జునా ఇట్లు సూర్యునినుండి వంశపారంపర్యముగా ప్రాప్తమైనదియును- నిష్కామకర్మజ్ఞాననిష్ఠారూపమునైన యీ యోగమును ఇక్ష్వాకు మొదలగువారివలన రాజశ్రేష్ఠులు తెలిసికొని యుండిరి. ఇట్లు పరంపరా ప్రాప్తమై అనుష్ఠింపబడుచు వచ్చిన యీ యోగము చిరకాలమునుండి చెప్పువారందఱును గతించుట వలన నిప్పుడు నశించెను.

వి॥ సూర్యునినుండి పారంపర్యముగా వచ్చుచుండిన ఈ నిష్కామ కర్మ యోగ రహస్యము బహుకాలము క్రిందటనే నశించిపోవుటకు కారణమేమై యుండునా యని అనేకులకు సందేహముగలదు. ఉపదేశించువారు లేకపోవు టచే నశించినదని కొందఱు వచించిరి. అట్లైన ఉపదేశించువారు లేకపోవుటకు కారణమేమైయుండునను సందేహము నిలిచియున్నది. మహాభారతమున ఆది పర్వమందు ఈ విషయము తెలుపడమైనది. శ్రీ పరశురాముడు 21 సారులు క్షత్రియులను నశింప జేయుటచే నా కాలమందుండిన యోగనిష్ఠాపరులగు రాజులు నశించిరి. క్షత్రియుల నెందుకు సంహరించ వలసివచ్చెనో ఆ కథ భారతమున కనదగును; – కార్తవీర్యార్జునరాజు పరశరాముని తండ్రియగు జమదగ్నిని వధించి కామధేనువు నపహరించెను. అట్టి కాలములో రాజులు గర్వులై ధర్మహీనులైయుండిరి. లేనిచో నతడు ఋష్యాశ్రమములో ప్రవేశించి పరమఋషిసత్తముడగు జమదగ్నినివధించి ఆశ్రమములోనుండు కామధేనువును హరించునా? కనుక "దుష్టక్షత్రియఘాతకః" అనుటచే దుష్టులగు క్షత్రియులను మాత్రమే సంహరించడమైనదని తెలియుచున్నది. ఇది త్రేతాయుగమున జరిగెను. ద్వాపరాంతమున గీత ఉపదేశించడమైనందుచే బహుకాలము క్రిందటనే ఈ నిష్కామకర్మ యోగరహస్యము నశించిపోయినదని చెప్పుట సరిగా నున్నది. మఱియొక అర్థముగూడ గలదు. "రాజర్ష యో విదుః" రాజర్షులు గ్రహించిరి. అనుటచే ఆ కాలమున రాజులు ఋషులవంటి వారలై యుండిరి. తరువాత వారి యందు ఋషిత్వము నశించిపోయి రాజత్వము మాత్రమేమిగిలెను. అందువలన వారు ఋషిధర్మమును విడిచి రాజభోగపరులై యుండుటచే ఈ బ్రహ్మవిద్యను

గ్రహించుటకు అర్హులు గాకపోయిరి. అందువలన పరంపరగావచ్చిన ఈ యోగ విద్య నశించుటకు కారణమైనదనిగూడ చెప్పవచ్చును. కనుకనే "వార్ధకే ముని వృత్తీనాం" అని రఘువంశములో వర్ణించడమైనది. ఎప్పుడు అట్టి మునివృత్తి నశించెనో అప్పుడు మునులు మననముచే పొందవలసిన బ్రహ్మవిద్యగూడ నశించెను. కావున రాజర్షులు అని శ్రీ కృష్ణభగవానుడు చెప్పిన ఋషిత్వ మును గూడ రాజులు సంపాదించు కొనులాగున చూడవలెను.

శ్లో॥ స ఏవాయం మయాతేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోఽసి మే సఖాచేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥ 3

పద॥ సః - ఏవ - అయం - మయా - తే- అద్య-యోగః -ప్రోక్తః-పురాతనః, భక్తః-అసి - మే - సఖా - చ - ఇతి - రహస్యం-హి - ఏతత్-ఉత్తమమ్.

ప్రతి॥ మే = నాకు, భక్తః = భక్తుడవును, సఖా చ = సఖుడవును, అసి ఇతి = ఐతివని. పురాతనః = అనాదియైన, సః=అట్టి, అయం యోగఃఏవ = ఈ నిష్కామకర్మయోగమే, అద్య = ఇప్పుడు, తే = నీకు, మయా = నాచేత. ప్రోక్తః = చెప్పబడినది, ఉత్తమం = శ్రేష్ఠమైన, ఏతత్ = ఈ నిష్కామ కర్మయోగము, రహస్యం హి = గోప్యమైనదిగదా.

తా॥ నాకు భక్తుడవును; మిత్రుడవు నైనందున పురాతన మైనట్టి ఈ నిష్కామ కర్మయోగము నిప్పుడు నీకు నేను చెప్పితిని. ఇది శ్రేష్ఠమైనదనియు, రహస్యమైనదనియు గ్రహించుకొనుము.

వి॥ నిష్కామకర్మయోగ రహస్యమగు ఈ గీతాశాస్త్రము శ్రీకృష్ణ భగ వానుడు స్వయముగా కల్పనచేసి చెప్పినది కాదనియు, అనాదిగా నుండిన దనియు తెలియవలయును. ఒక్కొక్క కాలమున ఒక్కొక్క విద్య యంతర్ధాన మగుచుండును. మఱల దానిని ఆవిర్భవింప జేయుటకు ఒక మహాపురుషుడవత రించును. ఇది నిష్కామకర్మయోగ విషయము మాత్రమే కాదు. భక్తియోగ మందును, జ్ఞానయోగమందును సయితము పైన చెప్పినటుల తత్తదుద్ధరణకై యెవరో ఒకరు మహాత్ములు అవతరించుచుందురు. దీనియందు రహస్యమనియు, ఉత్తమమనియు రెండు పదములు గలవు. ఋషులు వనములో తప మొనర్చి పొందదగిన ఆత్మజ్ఞానమును, నిష్కామకర్మయోగ మవలంబించి రాజ్యపాలనము చేయుచున్నప్పటికిని (ఋషులు పొందిన అసంగత్వ ఆత్మజ్ఞానమును) పొంద వచ్చునని తాత్పర్యము. సముద్రములో నుండి అలలు ఏలాగున కట్టపైకివచ్చి మఱలలోపలికి పోవుచుండునో, అలాగున ఒక్కొక్క విద్యయు ఆవిర్భావతిరో

భావముల నందుచుండును. దేశముయొక్కయు, జాతియొక్కయు స్థితి యును ఈలాగుననే యుండును. దేశముగాని, జాతిగాని నిమ్నోన్నతములతోగూడి యుండును. కావుననే సంసారమును సముద్రముగా వర్ణించడమైనది. గ్రీక్ రోమన్‌దేశముల పూర్వస్థితిని చూడుడు. అవి ఒకప్పుడు అన్నిరంగములలోను ఉన్నత శిఖరమునందుకొని తరువాత అవనతములైనవి.

అర్జున ఉవాచ:— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥ 4

పద॥ అపరం - భవతః - జన్మ - పరం - జన్మ - వివస్వతః,
కథం - ఏతత్ - విజానీయాం - త్వం - ఆదౌ - ప్రోక్తవాన్ - ఇతి.

ప్రతి॥ వివస్వతః=సూర్యునియొక్క, జన్మ=జన్మము, పరం=ముందటిది, భవతః= నీయొక్క. జన్మ = జన్మము, అపరం = వెనుకటిది, ఆదౌ = ఆదియందు, త్వం = నీవు, ఏతత్=దీనిని,ప్రోక్తవాన్ ఇతి = చెప్పితివని, కథం=ఎట్లు, విజానీయాం = తెలిసికొనగలను?

తా॥ సూర్యునియొక్క జన్మము ముందటిది. నీయొక్క జన్మము వెనుకటిది: కాన నీవు ఆదియందు సూర్యునికి ఈ యోగమునుచెప్పితి వని నేనెట్లు తెలిసికొనగలను?

వి॥ వసుదేవపుత్రుడవై జన్మించిన వాసుదేవుడవగు నీవు నా సమకాలికుడవు కదా? అట్లుండ ఆదికాలమున సూర్యుని కుపదేశించితినని నీవు ఎట్లు చెప్పగలవని యర్జునునకు సందేహము కలిగెను. భగవంతు డీ సందేహమును ఈ క్రింది శ్లోకము ద్వారా నివారించు చున్నాడు.

శ్రీ భగవానువాచ:—శ్రీభగవంతుడు చెప్పెను.

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున! ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప! ॥ 5

పద॥ బహూని - మే - వ్యతీతాని - జన్మాని - తవ - చ - అర్జున !,
తాని - అహం - వేద - సర్వాణి - న - త్వం - వేత్థ -పరంతప! .

ప్రతి॥ హే అర్జున! = ఓ యర్జునా!, మే = నాకును, తవ చ=నీకును, జన్మాని= జన్మములు, బహూని = అనేకములు, వ్యతీతాని = గడచిపోయినని, హే పరంతప! = అరిమర్దనుడవగు ఓ యర్జునా!. అహం = నేను, తాని =

ఆ జన్మములను, సర్వాణి=అన్నిటిని, వేద = ఎఱుంగుదును, త్వం=నీవు న వేత్థ = ఎఱుంగవు.

తా॥ ఓ యర్జునా! నాకును నీకును జన్మము లనేకములు గడచిపోయినవి. ఓ పరంతపా! అర్జునా! నేను ఆ జన్మముల నన్నిటిని ఎఱుగుదును. కాని నీ వెఱుగవు.

వి॥ భగవంతుడు సనాతనుడును, సర్వజ్ఞుడును, నిరావరణ జ్ఞానము గల వాడును నగుటచే త్రికాలజ్ఞానము గలవాడు, ఆవరణజ్ఞానము గలవాడగుటచే నర్జునునికి త్రికాలజ్ఞానము లేకపోయెను. పై సందేహము సామాన్యజనులకు నయితము కలుగవచ్చునని తలంచి అర్జునుడు పై ప్రశ్న నడుగవలసివచ్చినది.

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥ 6

పద॥ అజః - అపి - సన్ - అవ్యయాత్మా - భూతానాం–ఈశ్వరః-అపి- సన్, ప్రకృతిం - స్వాం - అధిష్ఠాయ - సంభవామి – ఆత్మమాయయా.

ప్రతి॥ అహం=నేను, అజః అపి సన్ = పుట్టువు లేనివాడనైనను, అవ్యయాత్మా అపి సన్ = నాశరహితస్వభావము కలవాడనైనను, భూతానాం = భూతములకు, ఈశ్వరః అపి సన్ = ఈశ్వరుడనైనను, ఆత్మమాయయా = స్వకల్పితమగు మాయచేత, స్వాం=స్వకీయమైన, ప్రకృతిం=స్వభావమును, అధిష్ఠాయ = ఆశ్రయించియే, సంభవామి = పుట్టుచున్నాను.

తా॥ నేను చావు పుట్టువులు లేనివాడనయ్యు, పిపీలికాది బ్రహ్మ పర్యంతముగల సమస్త భూతములకును నియామకుడనయ్యు నా సంబంధమైనదియును, త్రిగుణాత్మికమైనదియునైన మాయ నవలంబించి నా యిష్టమునుబట్టి పుట్టుచున్నాను.

వి॥ జీవులు ప్రకృతికి లోబడియుందురు. అట్టి ప్రకృతి ఈశ్వరాధీనమై యున్నది. కావున సర్వేశ్వరుడు సర్వస్వతంత్రుడు, జీవులు అస్వతంత్రులు.

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత !।
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్ ॥ 7

పద॥ యదా - యదా - హి -ధర్మస్య - గ్లానిః - భవతి - భారత !, అభ్యుత్థానం - అధర్మస్య - తదా - ఆత్మానం - సృజామి - అహమ్.

ప్రతి॥ హే భారత! =భరతవంశమున బుట్టిన ఓ యర్జునా!, హి = ఏలయనగా, యదా యదా = ఎప్పుడెపుడు, ధర్మస్య=ధర్మమునకు, గ్లానిః=క్షీణదశ, అధర్మస్య = అధర్మమునకు, అభ్యుత్థానం= అభివృద్ధియు, భవతి = అగుచున్నదో, తదా=అప్పుడు, అహం=నేను, ఆత్మానం=నన్ను, సృజామి= సృజించుకొనుచున్నాను.

తా॥ భరతకులోద్భవుడవగు ఓ యర్జునా! అట్లు నేనవతరించుచుండుట యెందుకనగా, ఎప్పుడు ధర్మము క్షీణించుచున్నదో, అధర్మమభివృద్ధి యగుచున్నదో, అప్పుడు అధర్మము నణచుటకును, ధర్మము నుద్ధరించుటకును నన్ను నేనే సృజించుకొనుచున్నాను. అనగా నేను స్వయముగా అవతరించు చున్నాను.

వి॥ భగవంతుడు, జీవన్ముక్తులును అధర్మము నణచుటకు. ధర్మము నుద్ధరించుటకును అవతరింతురు, వారు ప్రకృతి బద్ధులుగారు, కర్మశేషముగల వారునుగారు, వారు స్వతంత్రులు.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ 8

పద॥ పరిత్రాణాయ - సాధూనాం - వినాశాయ - చ - దుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ - సంభవామి - యుగే - యుగే.

ప్రతి॥ సాధూనాం = సాధువులయొక్క, పరిత్రాణాయ = సంరక్షణముకొఱకు, దుష్కృతాం = దుష్టులయొక్క, వినాశాయ = నాశనముకొఱకు, ధర్మసంస్థాపనార్థాయ చ = ధర్మమును లెస్సగా స్థాపించుటకొఱకును, యుగే యుగే = ప్రతియుగమునందును, సంభవామి = పుట్టుచున్నాను.

తా॥ నేను సన్మార్గనిష్ఠ గలవారిని రక్షించుటకొఱకును, సాధుసజ్జనులను బాధించువారిని పరిమార్చుట కొఱకును, ధర్మమును లెస్సగా స్థాపించుటకొఱకును ప్రతి యుగమునందును బుట్టుచున్నాను. అనగా ధర్మము నశించి అధర్మము పెరుగు నప్పుడంతయు శ్రీ భగవానుడు లేక భగవదాజ్ఞ పొందినవారు అవతరించుచుందురు.

వి॥ "పరిత్రాణాయ సాధూనాం "సాధువుల యొక్క రక్షణము కొఱకని భగవంతుడు స్వయముగా జెప్పుటచే ఒక జాతినిగాని, ఒక ఆశ్రమమునుగాని సంబంధపరచక సాధువృత్తిగలవారందఱి రక్షణకొఱకు తానవతరింతునని

విశాల భావముతో వచించెనని గ్రహింపవలయును. "సాధనాత్ సాధవః" "సాధనపరులు అనగా ధర్మానుష్ఠానపరులు సాధువులని సాధుశబ్దార్థము.

శ్లో॥ జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున!॥ 9

పద॥ జన్మ - కర్మ - చ - మే - దివ్యం - ఏవం - యః - వేత్తి-తత్త్వతః, త్యక్త్వా-దేహం-పునః-జన్మ - న - ఏతి - మాం - ఏతి - సః- అర్జున!

ప్రతి॥ హే అర్జున! = ఓ యర్జునా!, యః = ఎవడు, ఏవం= ఈప్రకారముగా, మే=నాయొక్క, దివ్యం=అప్రాకృతమైన, జన్మ=జన్మమును, కర్మ చ = కర్మమును, తత్త్వతః = యథార్థముగా, వేత్తి=ఎఱుంగుచున్నాడో,సః = వాడు, దేహం = శరీరమును, త్యక్త్వా=విడిచి, పునః= మఱల, జన్మ = పుట్టుకను, న ఏతి = పొందడు, మాం=నన్ను, ఏతి = పొందుచున్నాడు.

తా॥ ఓ అర్జునా! ఎవడు ఇట్లు నాయొక్క అమానుషములైన జన్మకర్మములను యథార్థముగా తెలుసుకొనుచున్నాడో, వాడు శరీరమును విడిచినపిమ్మట మఱల పుట్టడు, మఱి యేమగును? నన్నే పొందును, అనగా నాయందైక్య మగును.

శ్లో॥ వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః॥ 10

పద॥ వీతరాగభయక్రోధాః - మన్మయాః - మాం - ఉపాశ్రితాః, బహవః జ్ఞానతపసా - పూతాః - మద్భావం -ఆగతాః.

ప్రతి॥ వీతరాగభయక్రోధాః = పోగొట్టబడిన అనురాగము భయము క్రోధము గలవారును, మన్మయాః= నాయొక్క స్వరూపస్థితి గలవారును, మాం = నన్ను,ఉపాశ్రితాః=ఆశ్రయించినవారును నగు, బహవః=అనేకులు, జ్ఞానతపసా=జ్ఞానమనెడు తపస్సుచేత, పూతాః=పరిశుద్ధాత్ములై, మద్భావం= నా భావమును (నా స్వరూపమును), ఆగతాః = పొందినవారైరి.

తా॥ కామక్రోధ భయములను వీడినవారును నా యొక్క స్వరూపమును పొందినవారును, నన్ను ఆశ్రయించినవారును నగు అనేకులు జ్ఞానమనెడి తపస్సుచే పవిత్రులై, నా భావమును అనగా మోక్షమును బొందినవారైరి

వి॥ "జ్ఞానతపసా" అనుటచే ఆత్మజ్ఞానముచేతను, తపస్సుచేతను భగవత్ స్వరూపులు గావలయునని దెలియుచున్నది. కర్మతపస్సు శరీరశోషణమాత్రమే యగును. జ్ఞానతపస్సువలననే యనేకులు భగవత్సాక్షాత్కారమును బొందిరి. లేక జ్ఞానమును, తపస్సును గలిగియుండవలెను, తపస్సుచేత దేహేంద్రియ శుద్ధియు. జ్ఞానముచేత ఆత్మశుద్ధి లేక భగవత్సాక్షాత్కారమును గలుగును.

శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్ ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః ॥ 11

పద॥ యే - యథా - మాం - ప్రపద్యంతే - తాన్-తథా-ఏవ-భజామి-అహం
మమ - వర్త్మ - అనువర్తంతే - మనుష్యాః - పార్థ! - సర్వశః.

ప్రతి॥ హే పార్థ! = ఓ అర్జునా!, యే = ఎవరు, మాం = నన్ను, యథా=ఎట్లు ప్రపద్యంతే = ప్రపత్తిచేయుచున్నారో, తాన్ = వారిని, తథా ఏవ = ఆలాగుననే. అహం = నేను, భజామి = పొందుచున్నాను, మనుష్యాః= మనుజులు, సర్వశః=అన్నివిధములచేతను, మమవర్త్మ ఏవ = నా మార్గమునే, అనువర్తన్తే = అనుసరించుచున్నారు.

తా॥ ఓ యర్జునా! నన్ను ఎవరు ఎట్లు ఆరాధింతురో, నేను వారలను ఆలాగుననే అనుగ్రహించుచున్నాను. ఆ కారణము వలన జనులు అన్నివిధములచేతను నా మార్గమునే అనుసరించు చున్నారు.

వి॥ భగవంతుని యెవరు ఏకోర్కెతో భజింతురో వారలకు అతడు అట్టి కోరికల నొసగుచున్నాడు. ముక్తిని కోరువారికి మోక్షము నొసగుచున్నాడు. ఇక భగవంతుని యెవరు ఏ రూపముతో ధ్యానము చేయుదురో దాని ననుసరించి వారిని అనుగ్రహించుచున్నాడు. ఎట్లన, కల్పవృక్షమువద్దకు వెళ్ళి ఎవరెవరు ఏ మేమి కోరుదురో వారికి ఆ యా ఫలము లభించునట్లుండునని భావము. భగవదైక్యమును కోరువారికి భగవదైక్యమును, భగవద్భావము నపేక్షించువారికి భగవద్భావమును గలుగజేయును.

శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥ 12

పద॥ కాంక్షంతః - కర్మణాం - సిద్ధిం - యజంతే - ఇహ - దేవతాః,
క్షిప్రం - హి - మానుషే - లోకే - సిద్ధిః - భవతి - కర్మజా.

ప్రతి॥ కర్మణాం = కర్మములయొక్క, సిద్ధిం = ఫలమును, కాంక్షంతః = కోరునట్టివారు, దేవతాః = దేవతలను, యజంతే = ఆరాధించుచున్నారు,

హే = ఏలనన!, ఇహ మానుషే లోకే=ఈమనుష్యలోకమందు, కర్మజా= కర్మముల వలన సంభవించెడు, సిద్ధిః = ఫలము, క్షిప్రం = శీఘ్రముగా. భవతి = కలుగుచున్నది.

తా॥ ఈ మనుష్యలోకమందు కర్మములవలన గలిగెడు ఫలము శీఘ్రముగా సిద్ధించుచున్నది. కావున కర్మములయొక్క ఫలములను కోరువారు దేవతలను ఆరాధించుచున్నారు.

వి॥ మనుష్యలోకము కర్మలోకమనబడును.తక్కిన స్వర్గాది ఊర్ధ్వలోకములును,అతలాది పాతాళలోకములును, మనుష్యశరీరముతో నీలోకమున ఆచరించెడు పుణ్యపాప ఫలములను అనుభవించుట కేర్పడినవి. ఈ మనుష్యలోకమున కర్మమునకు ఫలము శీఘ్రముగా గలుగును. కావున త్వరలో సత్కర్మానుష్ఠాన పరులగుట మంచిది. ఫలాపేక్షగలవారికి తత్ఫలమును, ఫలాకాంక్షారహితులకు మోక్షమును గలుగును.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ 13

పద॥ చాతుర్వర్ణ్యం - మయా - సృష్టం - గుణకర్మవిభాగశః,
తస్య - కర్తారం - అపి - మాం - విద్ధి - అకర్తారం - అవ్యయమ్.

ప్రతి॥ గుణకర్మవిభాగశః=సత్త్వ రజ స్తమోగుణములయొక్కయు. ఆ గుణముల వలన చేయబడు కర్మల (పనుల) యొక్కయు విభజనమునుబట్టి, చాతుర్వర్ణ్యం=బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను వర్ణచతుష్టయము, మయా= నాచేత, సృష్టం=సృజింపబడినది, తస్య=ఆ సృష్టికి, కర్తారం అపి= కర్తనైనను, మాం = నన్ను, అకర్తారం = కర్త కానివానినిగను, అవ్యయం= నాశరహితునిగను, విద్ధి =ఎఱుంగుము.

తా॥ బ్రహ్మ క్షత్రియాది వర్ణచతుష్టయము సత్త్వాది గుణములయొక్కయు, తపశ్శమదమాది కర్మములయొక్కయు విభాగముచేత సృజింపబడినది. అటువంటి సృష్టికి నేను కర్తనైనప్పటికిని నన్ను కర్తను కానివానినిగాను, నాశము లేనివానినిగాను తెలిసికొనుము.

వి॥ సత్త్వగుణము గలవారిని బ్రాహ్మణునిగాను, రజస్సు అధికముగను సత్త్వము స్వల్పముగను గలవానిని క్షత్రియునిగాను, సత్త్వము కొంచెముగను రజస్సు తమస్సు అధికముగను గలవానిని వైశ్యునిగాను, తమస్సు, అధికము

గాను రజస్సు స్వల్పముగను గలవానిని శూద్రునిగాను గుణములచే తెలిసికొన దగును. అలాగున శమదమాదులు గలిగి తపస్సు చేయుటచే బ్రాహ్మణునిగాను, ధైర్య శౌర్యాదులు గలిగి రణరంగములో ప్రవేశించుటచే క్షత్రియునిగాను, ధనార్జన విషయమై వ్యాపారాదులు చేయుటచే వైశ్యునిగాను, శుచి ఆచారము లేనివాడై, ప్రాణి హింసాపరుడై, క్రూరకృత్యములు చేయుటచే శూద్రునిగాను ఎఱుగదగును. ఈలాగున ఆయా గుణములను బట్టియు, పనులను బట్టియు వారి వారిని తెలిసికొనదగును.

శ్లో॥ న మాం కర్మాణి లింపన్తి న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ 14

పద॥ న - మాం - కర్మాణి - లింపన్తి - న - మే - కర్మఫలే - స్పృహా,
ఇతి - మాం - యః - అభిజానాతి - కర్మభిః - న - సః - బధ్యతే.

ప్రతి॥ మాం=నన్ను, కర్మాణి=కర్మములు, న లింపన్తి = అంటవు, మే =నాకు, కర్మఫలే = కర్మఫలమునందు, స్పృహా=ఇచ్ఛ, న =లేదు, ఇతి = ఇట్లు, యః = ఎవడు, మాం = నన్ను, అభిజానాతి = ఎరుంగుచున్నాడో, సః= వాడు, కర్మభిః = కర్మములచేత, న బధ్యతే = కట్టుబడడు.

తా॥ 'నన్ను కర్మలు అంటవు, నాకు కర్మఫలమునందు ఇచ్ఛ లేదు' అని యెవడు నన్నెఱుగుచున్నాడో, వాడు కర్మఫలము చేత కట్టుబడడు.

వి॥ ప్రకృతికి పరమైయుండుటచేతను, ఏలాటి ఇచ్ఛయున్ను లేనందు చేతను భగవంతునికి కర్మ అంటదు, పైశ్లోకమునందు చెప్పిన చాతుర్వర్ణ్య విభాగము గుణ కర్మముల ననుసరించి చేసినందుచే పక్షపాతదోషము తనకు లేదని తెలుపడమైనది.

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరంకృతమ్॥15

పద॥ ఏవం - జ్ఞాత్వా - కృతం - కర్మ -పూర్వైః - అపి - ముముక్షుభిః,
కురు - కర్మ-ఏవ - తస్మాత్ - త్వం-పూర్వైః - పూర్వతరం-కృతమ్.

ప్రతి॥ ముముక్షుభిః = మోక్షాకాంక్షులైన. పూర్వైః అపి=పూర్వికులచేతగూడ, కర్మ = కర్మము, ఏవం జ్ఞాత్వా = ఈ ప్రకారమెఱిగి, కృతం = చేయబడినది, తస్మాత్ = ఆ కారణమువలన, త్వం = నీవు, పూర్వైః =

పూర్వికులచేత, కృతం = చేయబడినదియు, పూర్వతరం = పురాతనమై నదియు నగు! కర్మ ఏవ = కర్మమునే, కురు = చేయుము.

తా॥ మోక్షాపేక్షకులైన పూర్వికులచేతగూడ కర్మ యీ ప్రకార ముగా నెఱిగి చేయబడినది. ఆ కారణమువలన నీవు పూర్వికులచేత చేయబడినదియు. పురాతనమైనదియు నగు కర్మమునే చేయుము.

శ్లో॥ కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥ 16

పద॥ కిం - కర్మ - కిం - అకర్మ - ఇతి - కవయః - అపి - అత్ర-మోహితాః
తత్ - తే- కర్మ - ప్రవక్ష్యామి- యత్ -జ్ఞాత్వా - మోక్ష్యసే- అశుభాత్

ప్రతి॥ కర్మ=కర్మము, కిం = ఎట్టిది, అకర్మ = అకర్మము, కిం = ఎట్టిది,ఇతి= ఇట్లని, అత్ర= ఈ కర్మాకర్మములవిషయమై, కవయః అపి=ప్రజ్ఞావంతులు గూడ, మోహితాః = మోహమును చెందిరి (ఇందువలన), యత్=ఏకర్మా కర్మములను, జ్ఞాత్వా = తెలిసికొని, అశుభాత్=అజ్ఞానమునుండి,మోక్ష్య సే = విడువబడగలవో, తత్ = ఆ, కర్మ = కర్మమునుగుఱించి, తే = నీకు, ప్రవక్ష్యామి = చక్కగా చెప్పెదను.

తా॥ కర్మ మనగా నెట్టిదో, అకర్మమనగా నెట్టిదో, తెలియజా లక, ఈకర్మాకర్మముల విషయమై జ్ఞానులుగూడ మోహమును చెందిరి. కాబట్టి ఏ కర్మాకర్మములను తెలిసికొని దుఃఖకరమైన యజ్ఞానము నుండి విడువబడగలవో, అట్టి కర్మరహస్యమును నీకు చక్కగా చెప్పెదను.

వి॥ శ్రీ కృష్ణభగవాను లుపదేశించిన విషయము వర్తమాన కాలములో కూడ కనబడుచున్నది. కొందఱు తత్త్వవేత్తలు—ముముక్షువులు బాహ్యకర్మలు చేయకూడదనియు, మఱికొందఱు జ్ఞానులు. బాహ్యసత్కర్మలు ముముక్షువులకు అవసరము లేకపోయినను ఇతరులు తరించుటకు వారు తప్పక చేయవలయు ననియు–వచింతురు. ఏలన,ముముక్షుత్వము అనేక జన్మములలో ఈశ్వరార్పణ బుద్ధితో చేసిన సత్కర్మములవల్లనే గలుగును. ముముక్షువైనవాడుగూడ ఆత్మ శుద్ధి బాగుగా గలుగుటకొఱకు బ్రహ్మవిచారముతో సహ ఈశ్వరార్పణబుద్ధితో సత్కర్మలాచరించవలయును, ఫలాపేక్షతో చేసినమాత్రమే అవి బంధమును కలుగజేయును. ఫలాపేక్షను విడిచి చేయు సత్కర్మలు జ్ఞానమునకు తోడ్పడును

దీపప్రకాశముచేతనే చీకటి నశించునదియైనను, దీపమునుపోషించునది తైలమగు నట్లు పుణ్యకర్మము ఆత్మజ్ఞానమునకు సహాయకారి యగును.

శ్లో॥ కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః॥ 17

పద॥ కర్మణః - హి - అపి - బోద్ధవ్యం - బోద్ధవ్యం - చ - వికర్మణః,
అకర్మణః - చ - బోద్ధవ్యం - గహనా - కర్మణః - గతిః.

ప్రతి॥ కర్మణః =వేదోక్తమైన సత్కర్మముయొక్క తత్త్వము, బోద్ధవ్యం=తెలియ దగినది, వికర్మణః అపి చ= చేయగూడదని వేదములచే నిషేధింపబడిన కర్మములయొక్క తత్త్వముగూడ,బోద్ధవ్యం=తెలియదగినది, అకర్మణఃచ= కర్మరహిత తూష్ణీంభావముయొక్క తత్త్వమున్ను, బోద్ధవ్యం = తెలియ దగినది, హి = ఏలయనగా, కర్మణః = కర్మముయొక్కయు, వికర్మ యొక్కయు, అకర్మముయొక్కయు, గతిః=యథార్థస్వరూపము, గహనా= తెలియ నశక్యమైనది.

తా॥ శాస్త్రములచే విధింపబడిన కర్మములయొక్కయు, శాస్త్రములచే నిషేధింపబడిన కర్మములయొక్కయు, ఏమియు చేయక నూరకుండుట యను అకర్మయొక్కయు స్వరూపమును తెలిసికొన వలెను. ఏలయనిన, ఈ కర్మాకర్మ వికర్మములయొక్క తత్త్వము తెలిసికొనుట మిక్కిలి ప్రయాసకరమైనది; దురూహ్యమైనది.

వి॥ చేయదగినదేది? చేయదగనిదేది? ఈ రెండింటికన్న విలక్షణమగు ఏమియు చేయనిస్థితి యెటువంటిది? అని తెలిసికొనుటకు సామాన్యులకు సాధ్యమైనదికాదు. కొందఱు దైవప్రీతికొఱకై లేక పరప్రాణుల మేలుకొఱకై చేయునది మాత్రమే నిష్కామకర్మయోగమని తలంతురు. కరణములచే జేయబడునదగుటచే కర్మ యనబడును. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, దేహము, అంతఃకరణ చతుష్టయము ఇవన్నియు కరణములే. వాక్కుతో చేసెడు ప్రార్థనాదులును, మనస్సుతో చేసెడు మననమును, చిత్తముతో చేసెడు చింతనయు, బుద్ధితో చేసెడు ధ్యానమును కర్మలలో చేరినవే. ఈ యింద్రియములకు అందనిది బ్రహ్మవస్తువు, అనగా ఆత్మస్వరూపము. అది యేకర్మముచేయునది కాదు. అది నిత్యశుద్ధ స్వయంప్రకాశము. అదే జ్ఞేయము. తెలిసికొనదగిన వస్తువు లన్నిటిలో నది ముఖ్యమైనది, దానిని తెలిసికొనకపోయినచో జ్ఞానము నిష్ప్రయోజనమే

యగును. తెలియబడిన వస్తువులన్నియు నశించునవి. బ్రహ్మవస్తువు లేక ఆత్మ నశించునది కాదు. కనుకనే దీనిని తెలిసికొనుట మిక్కిలి ప్రయాసమని చెప్పుటకు కారణమైనది. మనస్సుతో మననము చేయువారును, బుద్ధితో ధ్యానము చేయు వారును, వాక్కుతో ప్రార్థన చేయువారును ఫలాపేక్షారహితులై యుండవలెను. ఈ తత్త్వమును ప్రతి బ్రహ్మనిష్ఠుడును తప్పక తెలిసికొనవలయును. అప్పుడే నిష్కామకర్మయోగము సిద్ధించును.

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ 18

పద॥ కర్మణి - అకర్మ - యః - పశ్యేత్ - అకర్మణి - చ - కర్మ - యః, సః - బుద్ధిమాన్ — మనుష్యేషు - సః — యుక్తః - కృత్స్నకర్మకృత్.

ప్రతి॥ యః=ఎవడు, కర్మణి=కర్మమునందు, అకర్మ=కర్మాభావమును, పశ్యేత్= చూచుచున్నాడో, యః=ఎవడు, అకర్మణి = అకర్మమునందు, కర్మ చ = కర్మను జూచుచున్నాడో, సః = వాడు, మనుష్యేషు = మానవులయందు, బుద్ధిమాన్ = బుద్ధిమంతుడును, సః=వాడే, యుక్తః=యోగియు, కృత్స్న కర్మకృత్ = సకల కర్మల నాచరించినవాడును నగుచున్నాడు.

తా॥ ఎవడు కర్మమునందు కర్మాభావమును, అకర్మమునందు కర్మమును జూచుచున్నాడో వాడు మానవులయందు బుద్ధిమంతుడు, వాడే యోగియు నగుచున్నాడు; వాడు సకల కర్మములను ఆచరించిన వాడగుచున్నాడు.

వి॥ కొందఱు సాధువులు తాము ఏ కర్మయు చేయుటలేదని చెప్పుచు, ఎప్పుడును లోకవ్యవహారము మాట్లాడుచు సత్కర్మములచేయుచుండు పుణ్యాత్ము లను దూషించుచుందురు. వీరు దేహముతో కర్మము చేయకపోయినను మనస్సుతో సదా కర్మము చేయువారగుదురు. మఱికొందఱి బ్రహ్మనిష్ఠుల ఇంద్రియములు మనస్సు ఊరకుండవు. వాటిని ఏదైన సత్కర్మములు చేయు టలో నుంచుదురు. దానియందే నిలుకడ గలిగియుండుటచేతను, వేరు విషయ ములో మనస్సు పోవుట కవకాశము లేకపోవుటచేతను, అట్టివారు కర్మచేసినను, కర్మచేయనివారే యగుదురు. మఱియు ఆత్మను ఎల్లప్పుడును నిష్క్రియ, నిర్వి కార, జ్ఞానస్వరూపమని యెఱింగి పరప్రాణుల కుపకారము చేయుట విధి యని తలంచి ప్రాణికోట్లకు హితమగు కర్మల చేయుచుందురు. వీరును కర్మచేయు వారైనను చేయనివారే యగుదురు. అన్నిటకిని మనస్సే ప్రధానమగుటచే

కర్మచేయువారియొక్కయు, చేయనివారియొక్కయు. భావము ననుసరించి ఫలము గలుగుచుండును. ముముక్షువులు బ్రహ్మనిష్ఠకు ప్రతిబంధములేని సత్కర్మముల చేయుచుండవలెను. ముముక్షుత్వస్థితికి రానివారు ఫలాపేక్షవిడిచి ఈశ్వరార్పణబుద్ధితో సత్కర్మల నాచరించవలెను; అట్లు గానిచో నాత్మశుద్ధి గలుగ జాలదు.

"నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తిరుపజాయతే ।
ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తిఫలభాగినీ ॥"

అని అష్టావక్రముని జనకమహారాజును గుఱించి అష్టావక్రగీతయం దుపదేశించెను. మూఢుడైనవానికి నివృత్తియు ప్రవృత్తియే యగును. ఆత్మజ్ఞానముగల ధీశాలికి ప్రవృత్తికూడ నివృత్తిఫలమునే గలుగజేయును. ఏలన మూఢుడు ప్రవృత్తిలేని ఆత్మయందు ప్రవృత్తిని కల్పన చేయుచున్నాడు, అది అజ్ఞానము. జ్ఞాని ఆత్మయందు ప్రవృత్తిలేదను పరమతత్త్వము నెఱింగిన వాడగుటచే సదా నివృత్తిరూపు డగుచున్నాడు.

శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః ॥ 19

పద॥ యస్య - సర్వే - సమారంభాః - కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం - తం - ఆహుః - పండితం - బుధాః,

ప్రతి॥ యస్య = ఎవనియొక్క, సమారంభాః = కార్యారంభములు, సర్వే = అన్నియు, కామసంకల్పవర్జితాః = కామసంకల్పములచే విడువబడినవో, జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం=జ్ఞానమనెడు అగ్నిచే దహింపబడిన కర్మములుగల, తం = అట్టివానిని, బుధాః = ఆత్మబోధముగలవారు, పండితం =పండితునిగా, ఆహుః = చెప్పుదురు.

తా॥ ఎవనియొక్క కార్యారంభములు అనగా కర్మములన్నియు కామసంకల్పములచే విడువబడినవో అనగా ఫలాపేక్షారహితములో, అట్టి జ్ఞానమనెడు అగ్నిచేత దహింపబడిన కర్మలు గలవానినిపెద్దలు పండితునిగా (జ్ఞానపరునిగా) జెప్పుదురు.

వి॥ ఈశ్లోకములో పండితునియొక్క లక్షణము తెలుపడమైనది. ఫలాపేక్షను వదలి ఈశ్వరార్పణబుద్ధితో కర్మల నాచరించువాడు, జ్ఞానమను అగ్నియందు సమస్తకర్మలను దహింపచేసినవాడును పండితుడు అనబడును. అంతియేగాని లౌకిక పుస్తక జ్ఞానమును సంపాదించినంతమాత్రమున పండితుడు కాజాలడు.

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః ॥ 20

పద॥ త్యక్త్వా - కర్మఫలాసంగం - నిత్యతృప్తః - నిరాశ్రయః,
కర్మణి - అభిప్రవృత్తః - అపి - న - ఏవ - కించిత్ - కరోతి - సః.

ప్రతి॥ సః = వాడు, కర్మఫలాసంగం= కర్మఫలమునందలియాసక్తిని, త్యక్త్వా= విడిచిపెట్టి, నిత్యతృప్తః = ఎప్పుడును తృప్తిపొందిన మనస్సు గలవాడును, నిరాశ్రయః = దేనిని ఆశ్రయింపనివాడునునై, కర్మణి =కర్మమునందు, అభిప్రవృత్తః అపి = ప్రవర్తించినవాడైనను, కించిత్ = కొంచమైనను, న కరోతి ఏవ = చేయనివాడేయగును.

తా॥ కర్మఫలమునందలి యాసక్తిని విడిచిపెట్టి యెల్లప్పుడును తృప్తిబొందిన మనస్సు గలవాడై దేనిని ఆశ్రయింపనివాడు కర్మమునందు ప్రవర్తించినవాడైనను కొంచమైనను ఏ కర్మమునైనను చేయనివాడే యగును.

శ్లో॥ నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21

పద॥ నిరాశీః - యతచిత్తాత్మా - త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం - కేవలం - కర్మ - కుర్వన్ - న - ఆప్నోతి - కిల్బిషమ్.

ప్రతి॥ నిరాశీః = ఆశలేనివాడును, యతచిత్తాత్మా =మనోనిగ్రహముగలవాడును, త్యక్తసర్వపరిగ్రహః=విడువబడిన సమస్తవస్తుస్వీకారము గలవాడునునై, కేవలం శారీరం=దేహధారణకుమాత్రమైన, కర్మం = విధిననుసరించిన కర్మను,కుర్వన్=చేయువాడు,కిల్బిషం=పాపమును,న ఆప్నోతి=పొందడు.

తా॥ దేనియందును ఆశ లేనివాడును, చిత్తమును దేహమును స్వాధీనములో నుంచువాడును. సమస్త వస్తుసంపాదనయందు ప్రీతి లేనివాడునునై. శరీరముమాత్రము నిలుచుటకు తగిన నిషిద్ధముగాని పనిని చేయుచుండినను, అజ్ఞానస్వరూపమగు సంసారబంధమును పొందడు. అట్టి కర్మవలన అట్టి సంయమికి పాపము గలుగదు.

వి॥ యాచనావృత్తిని వర్తించుటకొఱకు ఈ శ్లోకము చెప్పడమైనది. శరీరము నిలుచుటకొఱకు మాత్రము నిషిద్ధము కానిపనిని చేయుటచే బంధముగాని,

పాపముగాని కలుగదు. పరవస్తువులచే జీవించినచో వారి పాపముగూడ వస్తువులద్వారా భుజించువారికి చేరును. లేనిచో ఆ పాపము నడ్డగించుకొనునంత గొప్ప తపశ్శక్తినయినను గలిగియుండవలెను. లేనిచో నితని పూర్వపుణ్యము గూడ నశించును.

శ్లో॥ యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే ॥ 22

పద॥ యదృచ్ఛాలాభ సంతుష్టః - ద్వంద్వాతీతః - విమత్సరః,
సమః - సిద్ధౌ - అసిద్ధౌ చ కృత్వా - అపి న - నిబధ్యతే,

ప్రతి॥ యదృచ్ఛాలాభ సంతుష్టః=అప్రయత్నముగా తనంతట లభించినవస్తువులతో తృప్తినొందినవాడును, ద్వంద్వాతీతః = సుఖదుఃఖములను ద్వంద్వములచే అంటనివాడును, విమత్సరః = మాత్సర్యము లేనివాడును. సిద్ధౌ అసిద్ధౌ = ప్రాప్తాప్రాప్తములయందు, సమఃచ =సమబుద్ధిగలవాడుననగు యోగి, కృత్వాఅపి = దేహధారణకు కావలసిన భోజనాదులకు తగిన కృత్యములచేసినను, న నిబధ్యతే = బద్ధుడుగాడు.

తా॥ అప్రయత్నముగా దనంతట లభించిన ఆహారాదులతో తృప్తిబొందినవాడును, సుఖదుఃఖములవలన హర్షశోకముల నొందనివాడును ఇతరులపై మాత్సర్యము లేనివాడును, ప్రాప్తాప్రాప్తములయందు సమబుద్ది గలవాడునునైన యోగి దేహధారణకు అవసరమైన పనులు మాత్రము చేసినను కర్మబద్ధుడు గాడు.

శ్లో॥ గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ 23

పద॥ గతసంగస్య - ముక్తస్య - జ్ఞానావస్థితచేతసః,
యజ్ఞాయ - ఆచరతః - కర్మ - సమగ్రం - ప్రవిలీయతే

ప్రతి॥ గతసంగస్య = దేనియందును సంగములేనివాడును, ముక్తస్య=ఫలాసక్తిలేనివాడును, జ్ఞానావస్థితచేతసః = ఆత్మజ్ఞానమునందే నిలబడినమనస్సుగలవాడును, యజ్ఞాయ = భగవత్ప్రీత్యర్థము (పరప్రాణుల హితార్థము). ఆచరతః = కర్మమునాచరించువానియొక్క, కర్మ= కర్మము, సమగ్రం= సంపూర్ణముగ, ప్రవిలీయతే = కొంచమైనను మిగులక నశించుచున్నది.

తా॥ దేనియందును సంగములేనివాడును,అనగా రాగద్వేషాది బంధములనుండి విడుదల బొందినవాడును, ఆత్మజ్ఞానమునందే నిలుకడ గలవాడును. భగవత్ప్రీత్యర్థముగాని పరప్రాణుల హితార్థముగా గాని కర్మము నాచరించు వానియొక్క కర్మము యావత్తును నశించుచున్నది.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా ॥ 24

పద॥ బ్రహ్మ - అర్పణం - బ్రహ్మ -హవిః - బ్రహ్మాగ్నౌ - బ్రహ్మణా-హుతం, బ్రహ్మ - ఏవ - తేన - గంతవ్యం - బ్రహ్మకర్మసమాధినా.

ప్రతి॥ బ్రహ్మణా= బ్రహ్మజ్ఞానసంపన్నుడగువానిచేత, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మమను అగ్నియందు, హుతం = వ్రేల్చబడిన, హవిః = హవిస్సు, బ్రహ్మ = బ్రహ్మమే యగుచున్నది, అర్పణం = అర్పణక్రియ, బ్రహ్మ = బ్రహ్మమే, (అట్లు) బ్రహ్మకర్మసమాధినా = సర్వము బ్రహ్మరూపమే యను చిత్తైకాగ్రతతోనుండునట్టి, తేన = వానిచేత, గంతవ్యం = పొందబడదగినదియు, బ్రహ్మ ఏవ = పరబ్రహ్మమే.

తా॥ హోమసాధనము లైన స్రుక్స్రువాదులు, అర్పణక్రియ, అన్నమునెయ్యి మొదలుగాగల హోమద్రవ్యసముదాయములు,యజమానుడు, అగ్ని, హవనక్రియ, బ్రహ్మరూపమగు కర్మమునందు చిత్తైకాగ్రతగల యజమానునిచేత (కర్మమునందు బ్రహ్మభావము గలవానిచేత) పొందదగిన ఫలము అనునిట్టి సర్వమును బ్రహ్మస్వరూపమేగాని బ్రహ్మముకంటె భిన్నముగాదు.

వి॥ స్రుక్ స్రువములు: స్రుక్ అనగా యజ్ఞములో కొయ్యతో చేయబడిన గరిటెవంటి యే పాత్రచే హవిస్సు అన్నాదులు హోమింపబడునో దాని పేరు. స్రువమనగా హోమములో కొయ్యతో జేయబడిన యే పాత్రచే ఘృతమును ఎత్తి హోమింతురో దానియొక్క పేరు. ఈ రెండు పాత్రలును ఆకారముచే వేరువేరుగా నుండును. 'బ్రహ్మార్పణ' మను శ్లోకములో జెప్పబడిన హోతయు, హవిస్సును, అగ్నియు యజ్ఞోపకరణములు, అంతయు పరమాత్మభావనగా జేయువాని కర్మయు బ్రహ్మమే యగుచున్నది.

శ్లో॥ దైవమేవాఽపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
**బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥ 25**

పద॥ దైవం - ఏవ - అపరే - యజ్ఞం - యోగినః - పర్యుపాసతే,
బ్రహ్మాగ్నౌ - అపరే - యజ్ఞం - యజ్ఞేన - ఏవ - ఉపజుహ్వతి.

ప్రతి॥ అపరే=కొందఱు, యోగినః = యోగులు, దైవంఏవ = దేవతారాధనమే యజ్ఞం = యజ్ఞమునుగా, పర్యుపాసతే = ఆచరించుచున్నారు, అపరే = మఱికొందఱు, యజ్ఞేన ఏవ = యజ్ఞముచేతనే, యజ్ఞం = హవిస్సును, బ్రహ్మాగ్నౌ= బ్రహ్మమనెడు అగ్నియందు, ఉపజుహ్వతి=వ్రేల్చుచున్నారు.

తా॥ కొందఱు యోగులు దైవారాధనమునే యజ్ఞముఁగా నుపాసించుచున్నారు. మఱికొందఱు యజ్ఞముచేతనే హవిస్సును బ్రహ్మ భావనయను అగ్నియందు హోమించుచున్నారు.

శ్లో॥ శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయానన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥ 26

పద॥ శ్రోత్రాదీని - ఇంద్రియాణి - అన్యే - సంయమాగ్నిషు - జుహ్వతి,
శబ్దాదీన్ - విషయాన్ - అన్యే - ఇంద్రియాగ్నిషు - జుహ్వతి.

ప్రతి॥ అన్యే = కొందఱు, శ్రోత్రాదీని = శ్రోత్రము మొదలగు, ఇంద్రియాణి= ఇంద్రియములను, సంయమాగ్నిషు = నిగ్రహములనెడు అగ్నులయందు, జుహ్వతి = వ్రేల్చుచున్నారు. అన్యే = మఱికొందఱు, శబ్దాదీన్=శబ్దము మొదలగు, విషయాన్ =విషయములను, ఇంద్రియాగ్నిషు=ఇంద్రియము లనెడు అగ్నులయందు, జుహ్వతి = హోమము చేయుచున్నారు.

తా॥ కొందఱు శ్రోత్రము మొదలగు ఇంద్రియములనెడు హవిస్సులను సంయమములనెడు అగ్నులయందు వ్రేల్చుచున్నారు. మఱికొందఱు శబ్దము మొదలగు విషయములనెడు హవిస్సులను ఇంద్రియములనెడు అగ్నులయందు హోమించుచున్నారు.

శ్లో॥ సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ 27

పద॥ సర్వాణి - ఇంద్రియకర్మాణి - ప్రాణకర్మాణి - చ - అపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ - జుహ్వతి - జ్ఞానదీపితే,

ప్రతి॥ అపరే=మఱికొందఱు, జ్ఞానదీపితే=ఆత్మజ్ఞానముచే ప్రకాశింప జేయబడిన, ఆత్మసంయమయోగాగ్నౌ = మనోనిగ్రహయోగ మనెడు అగ్నియందు,

సర్వాణి = సమస్తములైన, ఇంద్రియకర్మాణి = ఇంద్రియ వ్యాపారములను, ప్రాణకర్మాణి చ = పంచప్రాణముల వ్యాపారములను, జుహ్వతి= హోమము చేయుచున్నారు.

తా॥ మఱికొందఱు జ్ఞానముచే ప్రకాశింపబడిన మనోనిగ్రహ యోగమనెడి అగ్నియందు సమస్తములైన ఇంద్రియవ్యాపారములను పంచప్రాణముల వ్యాపారములను వ్రేల్చుచున్నారు.

శ్లో॥ ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాఽపరే ।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశిత వ్రతాః ॥ 28

పద॥ ద్రవ్యయజ్ఞాః - తపోయజ్ఞాః - యోగయజ్ఞాః - తథా - అపరే,
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః - చ - యతయః -సంశితవ్రతాః.

ప్రతి॥ అపరే = మఱికొందఱు, ద్రవ్యయజ్ఞాః=సద్విషయములందు ద్రవ్యమును వినియోగించుటయే యజ్ఞముగా గలవారు, తథా = అలాగుననే, తపో యజ్ఞాః=తపస్సే యజ్ఞముగాగలవారును, యోగయజ్ఞాః=యమనియమాద్యష్టాంగయోగములనే యజ్ఞముగా గలవారును, స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః చ= వేదాధ్యయనము చేయుటయు అందలి యర్థము నెఱుంగుటయు అలాగున నాచరించుటయు యజ్ఞముగాగలవారును, యతయః సంశితవ్రతాః=యత్నపరులై తీక్ష్ణములైన వ్రతములే యజ్ఞముగా గలవారును నగుచున్నారు.

తా॥ కొందఱు సత్పాత్రమునకు ద్రవ్యాదుల నిచ్చుటయే యజ్ఞమని భావించుచున్నారు. మఱికొందఱు తపస్సే యజ్ఞముగా భావించి ఆచరించుచున్నారు, వేరు కొందఱు అష్టాంగయోగానుష్ఠానమే యజ్ఞమని తలంచి అనుష్ఠించుచుందురు. ఇంక కొందఱు వేదాధ్యయనమే యజ్ఞమని భావించి స్వాధ్యాయ మొనర్చుచున్నారు. మఱికొందఱు తీక్ష్ణమైన వ్రతములు గలవారై బ్రహ్మప్రాప్తికొఱకు దీక్షతో యత్నించుచు నదియే యజ్ఞమని భావించుచున్నారు.

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే ।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః ॥ 29

పద॥ అపానే - జుహ్వతి - ప్రాణం - ప్రాణే - అపానం - తథా - అపరే,
ప్రాణాపానగతీ - రుద్ధ్వా - ప్రాణాయామ పరాయణాః,

ప్రతి॥ ప్రాణాయామ పరాయణాః = ప్రాణాయామమును చేయువారగు, అపరే= మఱికొందఱు, ప్రాణాపానగతీ = ప్రాణాపానముల గతులను, రుద్ధ్వా= నిరోధించి, ప్రాణం = ప్రాణమును, అపానే =అపానమునందును. తథా= అలాగున, అపానం=అపానమును, ప్రాణే=ప్రాణమునందును, జుహ్వతి= వ్రేల్చు చున్నారు.

తా॥ ప్రాణాయామమును జేయువారగు కొందఱు ప్రాణాపానముల గతులను నిరోధించి ప్రాణమును అపానమునందును, అలాగే మఱికొందఱు అపానమును ప్రాణమునందును వ్రేల్చుచున్నారు. వీరును యజ్ఞము నాచరించువారే యగుదురు.

శ్లో॥ అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి!
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥ 30

పద॥ అపరే – నియతాహారాః - ప్రాణాన్ - ప్రాణేషు - జుహ్వతి,
సర్వే - అపి - ఏతే - యజ్ఞవిదః - యజ్ఞక్షపితకల్మషాః,

ప్రతి॥ అపరే = మఱికొందఱు, నియతాహారః= నియమితకాలములో నియమిత ఆహార నియమముగలవారై, ప్రాణాన్= ప్రాణములను, ప్రాణేషు=ప్రాణములయందు, జుహ్వతి =హోమముచేయుచున్నారు, ఏతే=పైచెప్పబడిన ఈ, యజ్ఞవిదః =యజ్ఞముల నెఱింగినవారు అనగా యజ్ఞముచేయువారు, సర్వే అపి = అందఱును, యజ్ఞక్షపితకల్మషాః = యజ్ఞముచేత నశింప జేయబడిన పాపము గలవారగుచున్నారు.

తా॥ పైజెప్పబడిన అందరును యజ్ఞముల నెఱింగినవారు అనగా వివిధయజ్ఞముల జేయువారందఱును, యజ్ఞముచేత సమస్త పాపములు నశింప చేసికొన్నవారగుచున్నారు.

వి॥ ఇచట పదునాల్గు విధములైన యజ్ఞములు చెప్పబడినవి. కొందఱు ప్రాణమును అపానమునందును,అపానమునుప్రాణమునందును హోమించుదురు. కొందఱు రేచక పూరక కుంభకములను మూడింటిని మూడు యజ్ఞములుగాను, మఱికొందఱు ఈ మూడునుజేరి ఒకటిగాను వ్యాఖ్యానము జేయుచున్నారు. అప్పుడు 12 యజ్ఞములే యగుచుండును. వీటిలో నేదైన నొకటి యాచరించు వాడుగూడ యజ్ఞము చేసినవాడే యగును. దానివలన సమస్తపాపములును నశించును. శ్రీ భగవంతు డుపదేశించిన యజ్ఞములలో పశుహింసాయుతమగు పాపకర

మైన యజ్ఞము ఒకటియైనను చెప్పియుండలేదు. ఇట్టి పావనమార్గముండగా పశు హింసాత్మకమైన పాపకరమగు యజ్ఞము నేల చేయుచున్నారో దురూహ్యముగా నుంటున్నది. దీనియందు శక్తియున్నవారికిని లేనివారికిని మార్గము జూపబడినది. సుగమమార్గముండగా, కంటకావృతమగు దుర్గమమార్గములో నేలనడువవలెను? ఇవి యన్నియు ఆత్మయజ్ఞముతో సంబంధించినవి. కట్టకడకు ఒకవ్రతమునైనను తప్పక ఆచరించుటకూడ యజ్ఞమని చెప్పెను. దానికిని సాధ్యము కాకపోయిన నియమితకాలములో నియమిత ఆహారమును నియమప్రకారము భుజించుటయు యజ్ఞమని విధించెను. ఆహారనియమము గలవానికే మనస్సు స్వాధీనములో నిలుచును. కావున నది సామాన్యమని తలంచరాదు. ఆత్మనియమము కావలసియుండిన ఆహారనియమము నవలంబించవలెను.

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ! ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ! ॥ 31

పద॥ యజ్ఞశిష్టామృతభుజః - యాంతి - బ్రహ్మ - సనాతనం,
న - అయం - లోకః - అస్తి - అయజ్ఞస్య - కుతః - అన్యః - కురుసత్తమ.

ప్రతి॥ హే కురుసత్తమ! = కురుశ్రేష్ఠుడవగు ఓ యర్జునా!, యజ్ఞశిష్టామృతభుజః= పైజెప్పినయజ్ఞములలో నేదైన ఒకటైననుచేసిన తరువాత భుజించెడువారు (అట్టి అన్నము అమృతమువంటిదగును), సనాతనం=శాశ్వతమైన, బ్రహ్మ= బ్రహ్మమును, యాన్తి = పొందుచున్నారు, అయజ్ఞస్య = పై యజ్ఞములలో నే ఒక్కదానినిగూడ చేయనివానికి, అయం లోకః= ఈ లోకసుఖమైనను, న అస్తి = లేదు. అన్య = పరలోకసుఖము, కుతః = ఎక్కడిది? కలుగ నేరదని భావము.

తా॥ ఓ కురువీరా ! అర్జునా ! పై చెప్పిన యజ్ఞములలో ఏ ఒక్కదాని నైనను చేసిన తరువాత భుజించువారు అమృతమునే భుజించుచున్నారు. అందువలన శాశ్వతమైన బ్రహ్మమును పొందు చున్నారు. పై నిరూపించిన యజ్ఞములలో తనకు శక్తి గలదాని నొక్కదానినైనను చేయనివానికి ఇహలోకసుఖము గూడ నుండదు. అట్లుండగా మఱి పరలోక సుఖ మెక్కడిది?

వి॥ ప్రతివారు ఏదైన నొకదైవకార్యము జేసిన తరువాతనే భోజనము చేయవలెనను నియమము పెట్టుకొనవలెను. "స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ" అధ్య

యనముగూడ యజ్ఞమని భగవానుడు తెలిపెను. అధ్యయనములో ప్రణవ, నారాయణ, శివ,రామ, కృష్ణాది దివ్యమంత్రజపములును, ఉపనిషద్భగవద్గీతాది పారాయణములును, దేవతార్చనలును చేరియున్నవి. యజ్ఞశబ్దమునకు అర్థము పాణిని మహర్షియొక్క వ్యాకరణ సూత్రమునం దిట్లు గలదు. 'యజ = దేవపూజాసంగతికరణదానేషు' 'దేవాన్ పూజయతి సంగమయతి దదాతి' దైవపూజ, ఐక్యము, దానము అని యజధాతువున కర్థము గలదు.'దేవపూజ అనగా అర్చన, స్మరణ, కీర్తన, ధ్యాన, సమాధులని అర్థము జెప్పనగును. 'సంగతికరణ' అనుదానికిశివజీవుల ఐక్యము,ఆత్మపరమాత్మలఏకత్వము,ధ్యానమందు మనస్సునులయపరచుట మొదలగు అర్థములుగలవు.'దాన' శబ్దమునకు అన్నదానాది షోడశమహాదానములని అర్థము గలదు. ప్రతిరోజును పై జెప్పబడినవాటిలో నేదైన నొకదానిని చేసినచో నిత్యమును వస్త్రము ఉతికి స్నానము చేయువాడేలాగున స్వచ్ఛత గలిగియుండునో ఆలాగున అతనిమనస్సు నిర్మలమైయుండును. లేక ప్రతిరోజును శుభ్రముగ తుడిచిన చిమ్నియందు వెలిగెడు దీపమువలె అతనియాత్మజ్ఞానము నిరావరణముగ ప్రకాశించుచుండును.అదే దీనిచే గలిగెడుఫలము. అట్లుగానిచో గుడ్డలు ఉతుకకయు, స్నానము చేయకయు నుండు మలినుని స్థితియే గలుగును.తుడువని గ్లాసులో పొగనిండి వెలుతురు గనపడనట్లు దృశ్యవాసనలచే హృదయము మలినమై అజ్ఞానావరణముచే ఆత్మజ్ఞానము ప్రకాశింపదు. అట్టివాడు మూఢుడై తమస్సులో పడిపోవును.

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్విద్ధితాన్సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ 32

పద॥ ఏవం - బహువిధాః - యజ్ఞాః - వితతాః - బ్రహ్మణః - ముఖే, కర్మజాన్ - విద్ధి - తాన్ - సర్వాన్ - ఏవం - జ్ఞాత్వా - విమోక్ష్యసే.

ప్రతి॥ ఏవం = ఇట్లు, బహువిధాః = నానావిధములైన, యజ్ఞాః = యజ్ఞములు, బ్రహ్మణః ముఖే=బ్రహ్మముఖమునందు లేక వేదమునందు,వితతాః=విస్తరింపబడియున్నవి. తాన్=ఆ యజ్ఞములను,సర్వాన్=అన్నిటిని,కర్మజాన్=కర్మమువలన బుట్టినవానినిగా, విద్ధి=ఎఱుంగుము, ఏవం=ఇట్లు, జ్ఞాత్వా=ఎఱింగి, విమోక్ష్యసే=సంసారబంధమునుండి విడువబడగలవు.

తా॥ ఇవ్విధముగా అనేకవిధములయిన యజ్ఞములు వేదమునందు విస్తారముగా జెప్పబడినవి, లేక బ్రహ్మదేవుడు చెప్పియున్నాడు.

ఆ యజ్ఞములన్నియు కర్మమువలన నేర్పడినవని దెలిసికొనుము. ఈవిధముగా దెలిసికొనినచో సంసారమునుండి విడువబడినవాడ వగుదువు.

వి॥ ఈ యజ్ఞములన్నియు మనోవాక్కాయ కర్మములచే చేయదగినవి గనుక వీటిచే త్రికరణశుద్ధి గలుగును. అప్పుడు అట్టి నిర్మలాంతఃకరణునికి సాక్షియై స్వప్రకాశమైన ఆత్మోదయమగును. అట్టియాత్మను తెలిసికొనుటకు ఇవి యన్నియు నుపాయములు. కనుక మానవులు ఈ పూర్వోక్తయజ్ఞముల తప్పక నాచరింప వలయును.

శ్లో॥ శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప!।
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥ 33

పద॥ శ్రేయాన్ - ద్రవ్యమయాత్ - యజ్ఞాత్ - జ్ఞానయజ్ఞః - పరంతప ।
సర్వం - కర్మ - అఖిలం - పార్థ ! జ్ఞానే - పరిసమాప్యతే.

ప్రతి॥ హే పరంతప ! =ఓ యర్జునా!. ద్రవ్యమయాత్ =ద్రవ్యములచే జేయబడు, యజ్ఞాత్ = యజ్ఞముకంటె, జ్ఞానయజ్ఞః = జ్ఞానయజ్ఞము, శ్రేయాన్ శ్రేయస్కరమైనది. హేపార్థ ! = ఓ యర్జునా !, సర్వం కర్మ = సమస్త కర్మములు, అఖిలం = నిశ్శేషముగా, జ్ఞానే = ఆత్మజ్ఞానమందు, పరిసమాప్యతే = ముగియుచున్నవి.

తా॥ పరంతపుడవగు ఓ యర్జునా! సాధనభూతములైన ఘృతతిలాది ద్రవ్యములచే సాధ్యమైన యజ్ఞముకంటే జ్ఞానమనియెడు యజ్ఞము శ్రేష్ఠమైనది. అన్ని కర్మములును నిరవశేషముగా జ్ఞానము నందు పరిసమాప్తిని పొందుచున్నవి. కర్మములన్నిటికిని జ్ఞానమే పరమ గమ్యమని భావము.

వి॥ పై జెప్పిన యజ్ఞములన్నిటికన్న ఆత్మయజ్ఞము అనగా ఆత్మసాక్షాత్కార జ్ఞానము మిక్కిలి శ్రేష్ఠమైనది. అంతియే కాదు. పైనజెప్పిన యజ్ఞముల కంటె ఈ యాత్మయజ్ఞము, నదీనదముల కన్నిటికి సముద్రమేలాగున గమ్యమై గొప్పదిగ నుండునో, ఆలాగున కర్మయజ్ఞము అన్నిటికన్న మిన్నయై పరమ గమ్యమైయుండును. మఱియు పై జెప్పిన యజ్ఞములన్నియు ఫలాపేక్ష లేక ఈశ్వరార్పణ బుద్ధితో, శ్రద్ధాభక్తులతో జేసిన అంతఃకరణశుద్ధిని గలిగించి ఆత్మ జ్ఞానమునే గలుగ జేయును.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥ 34

పద॥ తత్ - విద్ధి - ప్రణిపాతేన - పరిప్రశ్నేన - సేవయా,
ఉపదేక్ష్యంతి - తే - జ్ఞానం - జ్ఞానినః - తత్త్వదర్శినః.

ప్రతి॥ తత్త్వదర్శినః = తత్త్వవేత్తలయిన, జ్ఞానినః = జ్ఞానులు, తే = నీకు, జ్ఞానం = జ్ఞానమును, ఉపదేక్ష్యంతి = ఉపదేశించెదరు. తత్ = అజ్ఞానమును, ప్రణిపాతేన = నమస్కారముచేతను, పరిప్రశ్నేన = సమయము జూచి యడుగుటచేతను, సేవయా=గురువునకు ప్రీతికరమగు కార్యములు చేయుటచేతను, విద్ధి = తెలిసికొనుము.

తా॥ తత్త్వవేత్తలైన ఆత్మజ్ఞానులు నీకు జ్ఞానము నుపదేశింపగలరు. అట్టి జ్ఞాన మెట్లు గలుగుననిన, వినయముతో చేయు నమస్కారముచేతను, సమయమునుకనిపెట్టి యడుగుటచేతను గుర్వాజ్ఞను పాలించుటచేతను వారు చెప్పగలరు.

వి॥ గురువు అవసరమా? అనవసరమా? అని ప్రశ్నచేయువారికి సమాధానముగా భగవంతుడే గురువు అవసరమని ఉపదేశించుచున్నాడు. మఱియు గురుకులవాస మెట్లుజేయవలెనో అదిన్ని యిచట తెలుపడమైనది.ఐతే భగవంతుడేల అర్జునునకు జ్ఞానము తెలుపగూడదన — భగవంతుడు భక్తుల కనుగ్రహము జేయువాడు మాత్రమే, బ్రహ్మతత్త్వజ్ఞానమును మహాత్ములవలననే పొందవలసినదిగా భగవంతుడు తన లోకసృష్టికార్యములో నిశ్చయించుకొన్నాడు. అట్టి జ్ఞానము గలుగుటకు ఏమేమి సహాయము కావలెనో అదంతయు భగవంతుడు భక్తులకు అనుకూలము జేయును. సాక్షాత్ భగవంతుడు రామకృష్ణాద్యవతారము లెత్తియు వసిష్ఠ సాందీపాదులను గురువులుగా గ్రహించుకొనెను. ఇదియే ఋషిపరంపర, ప్రాచీన పద్ధతి. సార్వభౌమునకు తనరాజ్యములో సర్వాధికారము గలదు. కాని ఆ చక్రవర్తిని ఎవరైన భూమి కావలెనని ప్రార్థించినచో దానిని తానివ్వతలంచినను ఆయా డిపార్టుమెంటువారికి తెలిపి వారిచేతనే యిప్పించును. ఇది సృష్టియొక్క నియతియైయున్నది. అంతియేగాని సర్వేశ్వరునకు జ్ఞానము ఉపదేశించుటకు శక్తి లేక యిట్లు చెప్పినాడని గాదు. రామకృష్ణాద్యవతారములు బ్రహ్మజ్ఞాన ముపదేశించుటకు గ్రహించిన యుపాధులు గావు. అవి లోకసంరక్షణార్థముగా గ్రహించిన క్షత్రియశరీరములు.భగవంతుడు జ్ఞాన ముపదేశించుటకు

శ్రీ దత్తాత్రేయ, శ్రీ వ్యాస, శ్రీ కపిలాది శరీరములను గ్రహించియున్నారు. కావుననే భగవదవతారములలో ముఖ్యములగు 21 అవతారములలో దత్తాత్రేయ వ్యాస కపిలాదులను చేర్చుకొనుటకుకారణమైనది.జ్ఞానోపదేశధర్మము ఋషులది, దుష్టనిగ్రహ శిష్టపరిపాలన ధర్మము భగవంతునిది. దీనివల్ల మహాత్ములపై సర్వేశ్వరుని కెంత అభిమానము గలదో గోచరము గాగలదు. 'తత్త్వదర్శినః' అని గురులక్షణము తెలిపినదానిని జ్ఞాపకముంచదగినది. అనగా బ్రహ్మతత్త్వజ్ఞానము గలవారే గురువు లగుదురు.

శ్లో॥ యజ్జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాండవ ! ।
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ 35

పద॥ యత్ - జ్ఞాత్వా - న- పునః - మోహం - ఏవం - యాస్యసి - పాండవ!,
యేన - భూతాని - అశేషేణ - ద్రక్ష్యసి - ఆత్మని - అథః - మయి.

ప్రతి॥ హే పాండవ! = ఓ యర్జునా!, యత్ = ఏ జ్ఞానమును. జ్ఞాత్వా=తెలిసికొని పునః = మఱల, ఏవం = ఈ విధముగా, మోహం = మోహమును, న యాస్యసి = పొందవో, యేన = ఏజ్ఞానముచేత, అశేషేణ = నిశ్శేషముగా. భూతాని = భూతములను, ఆత్మని = నీయందే, ద్రక్ష్యసి = చూడగలవో; అథః = పిమ్మట, మయి = నాయందును చూడగలవో అటువంటి జ్ఞానమును. (విద్ధి = తెలిసికొనుము.)

తా॥ పాండుకుమారుడవగు ఓ యర్జునా ! ఏ జ్ఞానమును తెలిసికొనిన మఱల నిటువంటి మోహమును చెందవో, ఏ జ్ఞానముచేత నిశ్శేషముగా సకల భూతములను మొదట నీయందును పిమ్మట నాయందును జూడగలవో అటువంటి జ్ఞానమును తెలిసికొనుము.

వి॥ భగవంతు డుపదేశించిన జ్ఞానమెటువంటిదో దీనియందు తెలుపడమైనది. సర్వచరాచరములను తనయందును, తనను సకల చరాచరములలోను నుండువానిని గను, అనగా అన్నిటిలోగల ఆత్మ ఒకటేయని తెలిసికొను జ్ఞానమే బ్రహ్మజ్ఞాన మనబడును. తక్కిన జ్ఞానమంతయు కర్మజ్ఞాన మనబడును.

శ్లో॥ అపి చేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥ 36

పద॥ అపి - చేత్ - అసి - పాపేభ్యః - సర్వేభ్యః - పాపకృత్తమః,
సర్వం - జ్ఞానప్లవేన - ఏవ - వృజినం - సంతరిష్యసి.

ప్రతి॥ (నీవు) సర్వేభ్యః పాపేభ్యః = పాపాత్ములకందరికంటె. పాపకృత్తమః = విశేషపాపములుచేసినవాడవు, అపిచేత్ అపి=అయినవాడవైనను,సర్వం= సమస్తమైన, వృజినం=పాపమును (పాపసముద్రమును),జ్ఞానప్లవేన ఏవ= జ్ఞానమనెడు తెప్పచేతనే, సంతరిష్యసి = లెస్సగా దాటగలవు.

తా॥ నీవు పాపాత్ములందరికంటెను మిక్కిలి పాపాత్ముడవైనను జ్ఞానమనెడు పడవచేత పాపమనెడు సముద్రమును లెస్సగా దాటగలవు.

వి॥ శ్రీ భగవానుని కరుణ యెట్టిదో దీనివలన తెలిసికొనవచ్చును. మనవారిలో పండితులనియు జ్ఞానులనియు తమను తలంచుకొనుచుండు కొందఱు,పాపముగల వారు భగవద్గీత చదువకూడదనియు, దైవకార్యము చేయకూడదనియు - చెప్పుదురు. ఇది యెటువంటిదనగా పాపముచేతనే రోగము గలిగినది, దానికి ఔషధమివ్వరాదు. ఆ పాపము తా ననుభవించియే తీరవలె ననుటవంటిదే.రోగులకొఱకే వైద్యుడును, వైద్యాలయములును, ఔషధములును ఏర్పడినవను తత్త్వము మన వారిలో చాలమంది మరచిపోయిరి. పాపుల పాప విమోచనము కొఱకే పుణ్యమును, పుణ్యస్థానమును, పుణ్యగ్రంథములును, పుణ్యమును బోధించెడువారును, ఏర్పడిరను తత్త్వము మనవారిలో గల ఆచార్యులు గురువులు మరచిపోయిరి. కావుననే ఈ దేశమింత దీనస్థితికి వచ్చుటకు కారణమైనది. సముద్ర మపారముగా నుండినను అనేక క్రూరజంతువుల కాలవాలమైనను చిన్నఓడచేత నెట్లు తరించవచ్చునో, అలాగున సముద్రమంత పాపము జేసినవాడైనను, అనేక దుష్టగుణములు గలవాడైనను, కొంచమైనను ఆత్మధ్యానముండిన దానివలన జననమరణ దుఃఖసాగరమును దాటవచ్చును.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున !
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 37

పద॥ యథా - ఏధాంసి - సమిద్ధః - అగ్నిః - భస్మసాత్ - కురుతే - అర్జున !, జ్ఞానాగ్నిః - సర్వకర్మాణి - భస్మసాత్ - కురుతే - తథా

ప్రతి॥ హే అర్జున! = ఓ యర్జునా! యథా = ఏప్రకారము. సమిద్ధః అగ్నిః = చక్కగా రగులుచుండెడునిప్పు, ఏధాంసి=సమిధలను, భస్మసాత్కురుతే= భస్మము చేయుచున్నదో, తథా = ఆ ప్రకారముగానే, జ్ఞానాగ్నిః = జ్ఞానమనెడు అగ్ని, సర్వకర్మాణి = సమస్తకర్మలను, భస్మసాత్ కురుతే = భస్మము జేయుచున్నది.

తా॥ ఏ ప్రకారము చక్కగా రగులుచుండెడు అగ్ని హెూత్రుడు సమిధల ననగా కట్టెలను హెూమద్రవ్యములను భస్మము చేయుచున్నాడో ఆ ప్రకారముగానే జ్ఞానమనెడు అగ్ని సమస్తకర్మలను భస్మము చేయుచున్నది.

వి॥ ప్రజ్వలించుచుండెడు హెూమాగ్ని నవధాన్యములను నవవిధ సమిధలను హెూమద్రవ్యముల నెట్లు బూడిదగా జేయుచుండునో, అలాగున జ్ఞానమనెడు అగ్ని ప్రజ్వలించిన సర్వకర్మలను దాని ఫలములతో సహ భస్మము జేయును. కొందఱు ప్రారబ్ధకర్మము తప్ప సంచిత ఆగామికర్మలను భస్మమొనర్చుననియు ప్రారబ్ధము ననుభవించియే తీరవలెననియు చెప్పుదురు. "సర్వకర్మాణి" అని సర్వనామప్రయోగము చేసియుండుటచే ప్రారబ్ధముగాని మఱియేదైనగాని నిలుచుట కవకాశము లేదు. బ్రహ్మజ్ఞానులైనను దృశ్యవిలయముగాని వారలట్లు చెప్పుదురు. దృశ్యము బ్రహ్మమందు విలయమొందిన మఱల కర్త, కర్మ, క్రియ అనెడు భేదములుండవు. లేక అట్లు చెప్పినది సామాన్యజ్ఞానులను, భక్తులను, యోగులను గుఱించి యుండవచ్చునని తలంచవలెను. పూర్ణజ్ఞానదశలో ఒకేదైవము తప్ప మఱియొకటి యుండదు. అప్పుడు కర్తయగు తానొకడు బ్రహ్మమున కన్యముగా నుండినగదా కర్మముచేయ నవకాశము గలుగును. దైవమున కన్యముగా పరమాణువైనను లేదను జ్ఞానము కలుగుటయే పూర్ణదైవసాక్షాత్కారజ్ఞానమగును. ఈవిషయమై తేజోబిందూపనిషత్తున గల వాక్యములను, అపరోక్షానుభూతిలో శ్రీశంకరులు వ్రాసినదియు చూడుడు:

> "రజ్జురూపే పరిజ్ఞాతే సర్పఖండం న తిష్ఠతి ।
> అధిష్ఠానే తథా జ్ఞాతే ప్రపంచే శూన్యతాం గతే ॥"
> "దేహస్యాపి ప్రపంచత్వాత్ప్రారబ్ధావస్థితిః కుతః ।
> అజ్ఞానిజనబోధార్థం ప్రారబ్ధం వక్తివై శ్రుతిః ॥"

రజ్జువునందు సర్పభ్రాంతి గలిగినవారు అధిష్ఠానమగు రజ్జువును తెలిసికొనిన సర్పము అనునది యెట్లు లేకపోవుచున్నదో, అలాగున పరమాత్మయందు కల్పితమైన ప్రపంచము, పరమాత్మజ్ఞానము పూర్ణముగా గలుగునప్పుడు నశించును. అయితే శ్రుతియందు ప్రారబ్ధమనుభవించియే తీరవలెనని చెప్పుటకు కారణమేమన అజ్ఞానిజనుల కొఱకట్లు చెప్పడమైనది. లేనిచో వారికి మనస్సమాధానముగలుగదు. ప్రారబ్ధకర్మమని చెప్పినచో 'ఇక యేమిచేయవలయును? అనుభవించే తీరవలయు' నని మనస్సమాధానము గలుగును.

శ్లో॥ న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥ 38

పద॥ న - హి - జ్ఞానేన - సదృశం - పవిత్రం - ఇహ - విద్యతే,
తత్ - స్వయం - యోగసంసిద్ధః - కాలేన - ఆత్మని - విందతి.

ప్రతి॥ ఇహ = ఈలోకమునందు, జ్ఞానేన = జ్ఞానముతో. సదృశం = సమానమైన దియు, పవిత్రం = పావనమైనదియు, న విద్యతే హి = లేనేలేదుగదా, తత్ = అట్టి జ్ఞానమును, కాలేన = కాలక్రమముచేత, యోగసంసిద్ధః = యోగసిద్ధిని పొందినవాడు, ఆత్మని=తన ఆత్మయందే, స్వయం=తనంతట తానే, విందతి = పొందుచున్నాడు.

తా॥ లోకమునందు జ్ఞానముతో సమానమైనదియు, పవిత్ర మైనదియునైన వస్తువు మఱియొకటి లేదు. అట్టి జ్ఞానము కాల క్రమముచేత లెస్సగా యోగసిద్ధిని బొందినవాడు తనయందు తనంతట తానే పొందుచున్నాడు.

వి॥ కొందఱు మాకెప్పుడు జ్ఞానము కలుగును? ఎప్పుడు ముక్తిగలుగునని యడుగుదురు. దానికి సమాధానము ఈశ్లోకమున నుపదేశింపబడినది.దీనియొక్క సారమును గ్రహించిన నెవరిని అడుగకనే తనకు సమాధానము లభించును. ఎప్పుడు అజ్ఞానము నశించునో, అప్పుడు జ్ఞానము గలుగును. ఎప్పుడు బంధము నశించునో అప్పుడు ముక్తియును గలుగును. అయితే అజ్ఞానబంధమెప్పుడు నశిం చును? అను దానికి కాలపరిమితి లేదు. కావుననే 'కాలేనాత్మని విందతి' అని ఈశ్లోకములో శ్రీ భగవానునిచే తెలుపబడినది. అది (జ్ఞానము) జీవునియొక్క జన్మాంతర సంస్కారము ననుసరించి ఈ జన్మములో తాను జేయు ప్రయత్నము ననుసరించి త్వరితముగగాని, ఆలస్యముగాగాని గలుగును. అది మఱియొక్క స్థలములోగాని, దేశములోగాని గలుగునదిగాదు తనలోనే ధ్యానము పరిపక్వావస్థ కలుగునప్పుడుదయించును. విత్తనమును భూమిలో పెట్టి నీళ్ళతో తడుపుచుండిన నేలాగున విత్తనపు లోభాగమునుండి చెట్టు పుట్టునో, చెట్టు పుట్టునప్పుడు విత్తన మేలాగున చెట్టులోనైక్యమగునో, అలాగున సాధనచే జీవునియందు గల శివత్వ ముదయమగు నప్పుడు జీవత్వము శివత్వములో నైక్యమై పోవును. లేక స్వప్న ములో గనిన కలలు జాగ్రదవస్థలో నెట్లు మిథ్యారూపములై పోవునో, అలాగున అజ్ఞానదశలోగల భ్రాంతులన్నియు జ్ఞానోదయకాలములో తొలగిపోవును. ఈ విషయమై శ్రద్ధ గలిగియుండవలెనని క్రింది శ్లోకము చెప్పుచున్నది.

శ్లో॥ శ్రద్ధావాఀల్లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధిగచ్ఛతి ॥ 39

పద॥ శ్రద్ధావాన్ - లభతే - జ్ఞానం - తత్పరః - సంయతేంద్రియః.
జ్ఞానం - లబ్ధ్వా - పరాం - శాంతిం - అచిరేణ - అధిగచ్ఛతి.

పతి॥ శ్రద్ధావాన్ = జ్ఞానమును సంపాదించుకొనుటయందు శ్రద్ధగలవాడును, తత్పరః = తదేకనిష్ఠగలవాడును, సంయతేంద్రియః = లెస్సగా ఇంద్రియ నిగ్రహము గలవాడును, జ్ఞానం = జ్ఞానమును, లబ్ధ్వా= పొంది, పరాం= సర్వోత్కృష్టమైన, శాంతిం = చిత్తోపరతిని, అచిరేణ = శీఘ్రముగా, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా॥ గురూపదిష్ట వేదాంత వాక్యార్థములయందు నమ్మకము గలవాడును, గురూపదిష్ట వేదాంతవాక్యార్థమును తెలిసికొని యను ష్ఠించుటయందాసక్తి గలవాడును, జయింపబడిన యింద్రియములు గలవాడు నయిన పురుషుడు బ్రహ్మజ్ఞానమును పొందుచున్నాడు, అట్టి జ్ఞానమును పొందిన పిమ్మట సర్వోత్తమమైన శాంతిని పొందు చున్నాడు.

వి॥ మనము కాశీయాత్రకై వెళ్ళతలంచిన యెద్దుల బండిలోకన్న మోటారు కారులో నెంత శీఘ్రముగా వెళ్ళవచ్చునో, మఱియు ప్యాసింజరులోను, దానికన్న ఎక్స్‌ప్రెస్‌లోను, దానికన్న విమానములోను ఏలాగున ఒకదానికన్న ఒకదానిలో త్వరలో ముందుగా పోయి చేరవచ్చునో, అలాగున ముముక్షువుయొక్క వైరాగ్య ధ్యానముల తీవ్రత ననుసరించి ప్రకృతికి పరమగు పరమాత్మను పొందవచ్చును. లేక కొబ్బరిచెట్లు, మామిడిచెట్లు, పనసచెట్లు పెట్టి చక్కగా పోషించిన నేలాగున నవి 3, 4, సంవత్సరములలో ఫలమునిచ్చునో, ఆ చెట్లను చక్కగా పోషింపక పోయిన 10, 16 సంవత్సరములకైన నెట్లు ఫలింపవో, అనుష్ఠానముయొక్క స్థితియు నాలాగున నుండును. ఎంతకెంతకు జీవుడు పరిశుద్ధుడగునో అంత కంతకు నతనికి ప్రకృతిలో విరక్తియు, ఆత్మలో అనగా దైవములో రక్తియు, అనగా ప్రీతియు గలుగుచుండును. ఇక శ్రద్ధలేనివాని స్థితి క్రింది శ్లోకమున తెలుపబడుచున్నది.

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥ 40

పద॥ అజ్ఞః - చ - అశ్రద్దధానః - చ - సంశయాత్మా - వినశ్యతి,
న - అయం - లోకః - అస్తి - న - పరః-న- సుఖం -సంశయాత్మనః.

ప్రతి॥ అజ్ఞః చ = జ్ఞానము లేనివాడునై, అశ్రద్దధానః చ = శ్రద్ధలేనివాడునై సంశయాత్మా = గురువేదాంతవాక్యములయందు సంశయము గలవాడు. వినశ్యతి = తప్పక నశించుచున్నాడు. సంశయాత్మనః = అట్లు సంశయముతోగూడిన మనస్సుగలవానికి. అయంలోకః = ఈలోకము. నాస్తి = లేదు. పరః = పరలోకమును, న = లేదు, సుఖం = ఇహపరలోకగతమైన సౌఖ్యమును, న = లేదు.

తా॥ గురూపదిష్ట వాక్యార్థమును తెలిసికొనజాలనివాడు, గురువు చెప్పెడు వాక్యములను శ్రద్ధతో విననివాడు,గురువు చెప్పెడు వాక్యార్థమునందు సందేహముతో గూడినమనస్సుగలవాడు నశించుచున్నాడు. సంశయముతోగూడిన మనస్సుగలవానికి ఇహసుఖము లేదు. పరసుఖములేదు, మఱియెచ్చటను సుఖములేదు.

వి॥ సందేహము పాపమువలననే గలుగుచుండును. అట్టి సంశయాత్మునికి నింకను ప్రశాంతమైన ఆత్మసుఖము ననుభవించుటకు తగిన కాలము రాలేదని తెలియవలయును.

శ్లో॥ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్ !
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తిధనంజయ ! ॥ 41

పద॥ యోగసన్న్యస్తకర్మాణం - జ్ఞానసంఛిన్నసంశయం,
ఆత్మవన్తం - న - కర్మాణి - నిబధ్నన్తి - ధనంజయ !

ప్రతి॥ హేధనంజయ ! = ఓ యర్జునా !. యోగసన్న్యస్తకర్మాణం = నిష్కామకర్మయోగముచేత విడువబడిన కర్మఫలము గలవాడును, జ్ఞానసంఛిన్నసంశయం = జ్ఞానోదయమగుటచే ఛేదింపబడిన సంశయము గలవాడునైన, ఆత్మవన్తం = ఆత్మసాక్షాత్కారజ్ఞానముగల జ్ఞానిని, కర్మాణి = కర్మములు, న నిబధ్నన్తి = బందింపవు.

తా॥ ఓ యర్జునా ! నిష్కామకర్మయోగముచే కర్మఫలాసక్తిని విడచినవాడును, జ్ఞానయోగముచేత విడువబడిన కర్మములుగలవాడును, జ్ఞానముచేత ఛేదింపబడిన సంశయములు గలవాడును నైన బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము గల జ్ఞానిని కర్మములు బందింపజాలవు.

వి॥ జ్ఞానముచేత పరమాత్మయందైక్యము గలుగునని తెలుపుటచేత, జ్ఞానయోగమని పేరు వచ్చినది.

శ్లో॥ తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత ! ॥ 42

పద॥ తస్మాత్ - అజ్ఞానసంభూతం - హృత్థ్సం - జ్ఞానాసినా - ఆత్మనః.
ఛిత్త్వా - ఏనం - సంశయం - యోగం - ఆతిష్ఠ - ఉత్తిష్ఠ - భారత !

ప్రతి॥ తస్మాత్ = కాబట్టి, హేభారత! = ఓ అర్జునా!, ఆత్మనః = నీయొక్క, హృత్థ్సం = హృద్గతమైనదియు, అజ్ఞానసంభూతం = అజ్ఞానమువలన గలిగినదియునగు, ఏవం సంశయం = ఈ సంశయమును, జ్ఞానాసినా= జ్ఞానమనెడు కత్తిచేత, ఛిత్త్వా = ఛేదించి, యోగం=నిష్కామకర్మయోగా నుష్ఠానమును, ఆతిష్ఠ = ఆచరింపుము, ఉత్తిష్ఠ = లెమ్ము.

తా॥ భరతపుత్రుడవగు నో యర్జునా! నీయొక్క హృద్గతమై నదియు, అజ్ఞానమువలన గలిగినదియునగు ఈ సంశయమును జ్ఞానమనెడు ఖడ్గముచేత ఛేదించి నిష్కామ కర్మయోగానుష్ఠానమును ఆచరింపుము. లెమ్ము.

వి॥ అజ్ఞానమును ఛేదించుటకు ఆత్మసాక్షాత్కారజ్ఞానమనెడు ఖడ్గమొకటియే యుపయోగపడును. అట్టియాత్మజ్ఞానవిషయమున ప్రవర్తించినచో, ఆత్మజ్ఞానము సంపాదించినచో చాలును. ఇతర కర్మలుగాని, ఉపాసనలుగాని, యోగములు గాని, అవిద్యాహృదయగ్రంథిని ఛేదింపజాలవు. కావుననే "జ్ఞానాసినా" అని ప్రయోగించుటకు కారణమైనది.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే జ్ఞానయోగో నామ చతుర్థోఽధ్యాయః.

పద॥ శ్రీమద్భగవద్గీతాసు - ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే - జ్ఞానయోగః - నామ - చతుర్థః- అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇట్లు, ఉపనిషత్సు = ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మ విద్యాయాం =బ్రహ్మవిద్యాస్వరూపమును, యోగశాస్త్రే=యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదే=శ్రీకృష్ణార్జునసంవాదరూపమునునగు,శ్రీమద్భగవ ద్గీతాసు = శ్రీమద్భగవద్గీతలలో, జ్ఞానయోగో నామ = జ్ఞానయోగమనెడు చతుర్థః అధ్యాయః = నాల్గవ అధ్యాయము ముగిసెను.

తా॥ ఇట్లు ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీమద్భగవద్గీతయందు జ్ఞాన యోగమనెడు నాల్గవ అధ్యాయము ముగిసెను.

ఓమ్ తత్ సత్



ఓమ్

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## పంచమోఽధ్యాయః - పంచమాధ్యాయము

## కర్మసన్న్యాస యోగః - కర్మసన్న్యాసయోగము



అర్జున ఉవాచ:— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥ 1

పద॥ సన్న్యాసం - కర్మణాం - కృష్ణ! - పునః - యోగం - చ - శంససి,
యత్ - శ్రేయః - ఏతయోః - ఏకం - తత్ - మే - బ్రూహి -సునిశ్చితమ్.

ప్రతి॥ హే కృష్ణ = ఓకృష్ణమూర్తీ! కర్మణాం = కర్మములయొక్క,సన్న్యాసం= పరిత్యాగమును,పునః = మఱల, యోగం చ = నిష్కామకర్మయోగమును, శంససి = చెప్పుచున్నావు, ఏతయోః = ఈ రెండింటిలోపల, యత్ =ఏది, శ్రేయః = శ్రేష్ఠమైనదిగా(నీచేత), సునిశ్చితం = చక్కగా నిశ్చయింపబడు చున్నదో, తత్ = అట్టి, ఏకం = ఒక్కదానిని, మే = నాకు, బ్రూహి = చెప్పుము.

తా॥ ఓ కృష్ణమూర్తీ! ఒకవైపు కర్మపరిత్యాగమును, మఱి యొకవైపు నిష్కామకర్మయోగమును జెప్పుచున్నావు. ఈ రెంటి లోపల నేది శ్రేయస్కరమైనదో అట్టి ఒక దానిని నాకు నిష్కర్షగాతేల్చి చెప్పుము.

వి॥ అర్జునుడు సందేహగ్రస్తుడై ఈ ప్రశ్న చేయుచున్నాడు. ఇదివరలో నాల్గు అధ్యాయములవఱకు అచ్చటచ్చట నిష్కామకర్మయోగము శ్రేష్ఠమనియు, కొన్నిస్థలములలో నాత్మజ్ఞానమే ముఖ్యమనియు చెప్పుచు వచ్చినందుచే ఈ సందేహము సహజముగానందఱికిని కలుగును. ఈ యధ్యాయమునకు 'కర్మసన్న్యాస యోగ' మని పేరు. కర్మమును సన్న్యసించెడు యోగమని యర్థము, ఇచట కర్మత్యాగమా! లేక కర్మఫలత్యాగమా? అని సందేహము జిజ్ఞాసులకు గలుగును. **ఆత్మశుద్ధిగలుగువఱకు కర్మఫలత్యాగరూపమగు నిష్కామకర్మయోగము,ఆత్మశుద్ధి**

గలిగిన తరువాత నిర్విషయ బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముకొఱకు కర్మత్యాగమును విధింపబడెను. మఱల ప్రకృతియొక్క వికృతులు నశించి నిజాత్మానందమందు నిలకడ గలిగిన తదుపరి ఫలాపేక్షలేక కర్మచేసినను బంధము గలుగదు. ఈ సత్యమునే యీ యధ్యాయ ముపదేశించుచున్నది.

శ్రీ భగవానువాచ:— శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ।
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే॥ 2

పద॥ సన్న్యాసః - కర్మయోగః - చ - నిశ్శ్రేయసకరౌ - ఉభౌ,
తయోః — తు - కర్మసన్న్యాసాత్ - కర్మయోగః - విశిష్యతే,

ప్రతి॥ సన్న్యాసః = కర్మపరిత్యాగము, కర్మయోగః చ = నిష్కామకర్మయోగ మును, ఉభౌ = ఈ రెండును, నిశ్శ్రేయసకరౌ = శ్రేయస్సునుగలుగజేయు నవే, తయోః=ఆ రెంటిలో, కర్మయోగః తు =నిష్కామకర్మయోగమైతేనో, కర్మసన్న్యాసాత్=కర్మపరిత్యాగముకంటె, విశిష్యతే = శ్రేష్ఠమగుచున్నది.

తా॥ కర్మలయొక్క పరిత్యాగము, కర్మలయొక్క అనుష్ఠానము అను నీరెండును శ్రేష్ఠములే. అయినను ఆ కర్మసన్న్యాస నిష్కామ కర్మయోగములలో కర్మసన్న్యాసముకంటె నిష్కామకర్మయోగమే శ్రేష్ఠమైనది.

వి॥ అర్జునుడు నిర్విషయస్థితి పొందియుండనందుచే ఇట్టి స్థితిలో నుండు వారికి ఈశ్వరార్పణబుద్ధితో జేయు కర్మముచేత అంతఃకరణశుద్ధి గలుగవలసి యుండుటచే నిట్లుచెప్పడమైనది. అట్టి స్థితిలో నుండువారు కర్మత్యాగము చేసినచో వారు పతితు లగుదురు. నిష్కామకర్మయోగముచేత — జ్ఞానము కలిగిన వారికిని, ఆత్మజ్ఞానము గలుగని వారికిని శ్రేయస్సే గలుగును గాని కీడు గలుగదు.

శ్లో॥ జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి।
నిర్ద్వంద్వో హి మహాబాహో!సుఖంబంధాత్ప్రముచ్యతే॥ 3

పద॥ జ్ఞేయః - సః - నిత్యసన్న్యాసీ - యః - న - ద్వేష్టి - న కాంక్షతి,
నిర్ద్వంద్వః - హి - మహాబాహో! - సుఖం - బంధాత్ - ప్రముచ్యతే.

ప్రతి॥ హే మహాబాహో! = ఓయర్జునా!, యః = ఎవడు, న ద్వేష్టి = దేని యందును ద్వేషములేక యుంటున్నాడో, నకాంక్షతి=దేనియందును కోరిక లేక యుంటున్నాడో, సః = వాడు, నిత్యసన్న్యాసీ = సదాసన్న్యాసి అని,

జ్ఞేయః = ఎఱుగదగినవాడు, నిర్ద్వన్ద్వః =సుఖదుఃఖాది ద్వన్ద్వరహితుడైన అట్టియోగి, బంధాత్ = సంసారబంధమునుండి, సుఖం = సులభముగా ప్రముచ్యతే = విడువబడుచున్నాడు.

తా॥ ఓ యర్జునా! ఎవడు దేనియందును కోరికగాని ద్వేషము గాని లేక అనగా రాగద్వేషరహితుడై యుంటున్నాడో, వాడు నిత్య సన్న్యాసియని తెలియవలయును. అట్టి సుఖదుఃఖాది ద్వంద్వరహితు డగువాడు భవబంధనమునుండి సుఖముగా విడువబడుచున్నాడు.

వి॥ దీనియందు "నిత్యసన్న్యాసి" యని ప్రయోగించుటచే అనిత్యసన్న్యాసి మఱియొకడు కలడని అర్థమగుచున్నది. సుఖ దుఃఖ స్తుతి నిందా లాభనష్టములను ద్వంద్వములను విడుచుటయే ఆత్మసన్న్యాసమగును. అట్టి ఆత్మసన్న్యాసి 'నిత్య సన్న్యాసి' అని తెలియదగును. అట్టి ఆత్మ సన్న్యాసము లేనివాడై కారణాంతర ముచే బాహ్యసన్న్యాసవేషమును వేసికొని చూపరులకు పరమత్యాగివలె నుండు వాడు నిత్యసన్న్యాసికాడు. మఱి యాతడుమిథ్యా సన్న్యాసియే యగును.

శ్లో॥ సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః।
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విన్దతే ఫలమ్॥ 4

పద॥ సాంఖ్యయోగౌ - పృథక్ — బాలాః - ప్రవదన్తి - న - పండితాః,
ఏకం - అపి - ఆస్థితః - సమ్యక్ - ఉభయోః -విన్దతే - ఫలమ్.

ప్రతి॥ బాలాః = అజ్ఞానులులేక బాలురు, సాంఖ్యయోగౌ = కర్మసన్న్యాస కర్మాను ష్ఠానయోగములను, పృథక్ = భిన్నముగా, ప్రవదన్తి = చెప్పుచున్నారు, పండితాః = జ్ఞానులు, న = అట్లు చెప్పరు, ఉభయోః = కర్మసన్న్యాస నిష్కామకర్మయోగానుష్ఠానములు రెండింటిలో, ఏకం అపి = ఒక్కదాని నైనను, సమ్యక్ = చక్కగా, ఆస్థితః = ఆచరించినవాడు, ఫలం = జ్ఞాన ఫలమును లేక మోక్షఫలమును, విన్దతే = పొందుచున్నాడు.

తా॥ అవివేకులు లేక బాలస్వభావము గలవారు, కర్మసన్న్యాస నిష్కామకర్మానుష్ఠానయోగములను రెంటిని వేఱైనవానినిగా జెప్పు చున్నారు. జ్ఞాను లట్లు చెప్పరు. ఆ కర్మసన్న్యాస కర్మనుష్ఠాన యోగములు రెండింటిలో ఒకదానినైనను చక్కగా నాచరించినవాడు జ్ఞానఫలమును పొందుచున్నాడు.

వి॥ గృహస్థాశ్రమమే శ్రేష్ఠము లేక సన్న్యాసాశ్రమమే శ్రేష్ఠము అని దేహముయొక్క వేషము ననుసరించి చెప్పువారు తత్త్వమెఱిగిన వారుగారు. ఈ రెండింటిలో దేనియం దనుకూలమని తోచునో, దానియందు చక్కగా నాచరణ గలిగియుండిన ముక్తిగలుగుటలో సందేహములేదు. ఈ రెండును ఒకేరౌండు రోడ్డువంటివి. రోడ్డుకు కుడిప్రక్కనఒక్కడును, ఎడమప్రక్కగ మఱియొక్కడును ప్రయాణముచేసిన నుభయులును ఒకే కేంద్రస్థానములో చేరుచుందురు.ఎవరైనను దీనియందు 3-వ శ్లోకములో చెప్పబడినట్లు, నిత్యసన్న్యాసియు,ద్వంద్వాతీతుడును కావలయును.

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥ 5

పద॥ యత్ - సాంఖ్యైః - ప్రాప్యతే -స్థానం - తత్ -యోగైః - అపి - గమ్యతే, ఏకం - సాంఖ్యం - చ -యోగం - చ - యః - పశ్యతి - సః - పశ్యతి.

ప్రతి॥ యత్ = ఏ, స్థానం = మోక్షస్థానము, సాంఖ్యైః = సాంఖ్యయోగులచేత, ప్రాప్యతే = పొందబడుచున్నదో, తత్ = ఆ మోక్షస్థానము యోగైఃఅపి= నిష్కామకర్మ యోగులచేతను, గమ్యతే=పొందబడుచున్నది, యః=ఎవడు, సాంఖ్యం చ = కర్మసన్న్యాసయోగమును, యోగం చ = నిష్కామకర్మానుష్ఠానయోగమును, ఏకం = అభేదముగా, పశ్యతి = చూచుచున్నాడో, సః= వాడు, పశ్యతి = నిజమును చూచినవాడు.

తా॥ జ్ఞాననిష్ఠులైన సన్న్యాసులచేత పునరావృత్తిరహితమైన ఏ మోక్షము పొందబడుచున్నదో, అట్టి మోక్షము కర్మయోగులచేత గూడ చిత్తశుద్ధిద్వారా పొందబడుచున్నది.కావున ఏ పురుషుడు సాంఖ్య యోగము, నిష్కామకర్మయోగము రెండును ఒక్క ఫలమునకే కారణములగుచున్నవని తెలిసికొనుచున్నాడో, అట్టివాడే పరమార్థమును జక్కగా తెలిసినవాడగును. సాంఖ్యయోగులు సాక్షాత్తుగాను, కర్మయోగులు పరంపరగాను ముక్తి నొందెదరు.

వి॥ దీనియందు కర్మసన్న్యాసముగల సాంఖ్యులేస్థానమును పొందుదురో, నిష్కామకర్మయోగులును ఆ స్థానమునే పొందుదురని చెప్పుటచే నిష్కామకర్మ యోగియు నిష్కామకర్మలద్వారా అంతఃకరణశుద్ధిగలవాడై సాంఖ్యులు పొందు స్థానమునే పొందుట కర్హుడగునని చెప్పినట్లైనది. యథార్థముగా వీరుభయులును

ఒకే ముక్తిని పొందుచున్నారని యెవడు తెలిసికొనుచున్నాడో వాడే దివ్యదృష్టిగల వాడు, తక్కినవాడు దేహదృష్టిగలవాడు మాత్రమే యగును.

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖమాప్తుమయోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి ॥ 6

పద॥ సన్న్యాసః - తు - మహాబాహో! - దుఃఖం - ఆప్తుం - అయోగతః,
యోగయుక్తః - మునిః - బ్రహ్మ - న-చిరేణ - అధిగచ్ఛతి.

ప్రతి॥ హే మహాబాహో! = ఓ అర్జునా!, సన్న్యాసః తు = సన్న్యాసయోగము, అయోగతః = యోగానుష్ఠానములేకయే (నిష్కామకర్మయోగానుష్ఠానముచే అంతఃకరణము శుద్ధిగానిచో), ఆప్తుం = పొందుటకు, దుఃఖం = అసాధ్యమైనది, యోగయుక్తః=అనుష్ఠానపరుడగు. మునిః =మననశీలుడు లేక మితభాషి, బ్రహ్మ= బ్రహ్మపదమును, నచిరేణ = శీఘ్రముగా, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా॥ మహాబాహువులుగల ఓ అర్జునా! సన్న్యాసయోగము కర్మానుష్ఠానములేకయే పొందుట కష్టము. అనుష్ఠానపరుడగు మననశీలుడు బ్రహ్మపదమును శీఘ్రముగా పొందుచున్నాడు.

వి॥ ఆచరణలేని వాచాజ్ఞాన విషయమై ఈశ్లోకము చెప్పడమైనది.

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ 7

పద॥ యోగయుక్తః - విశుద్ధాత్మా - విజితాత్మా - జితేంద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా - కుర్వన్ - అపి - న - లిప్యతే,

ప్రతి॥ విశుద్ధాత్మా = శుద్ధాంతఃకరణుడును, విజితాత్మా = జయింపబడిన మనస్సుగలవాడును, జితేంద్రియః = ఇంద్రియనిగ్రహము గలవాడును, సర్వభూతాత్మభూతాత్మా = సమస్తప్రాణులు తనవంటివేయని సమభావము గలవాడు నగు, యోగయుక్తః = యోగనిష్ఠాపరుడు, కుర్వన్ అపి = కర్మలనాచరించుచున్నవాడైనను, న లిప్యతే = ఆ కర్మలచే బద్ధుడుగాడు.

తా॥ పరిశుద్ధమైన మనస్సుగలవాడును, స్వాధీనమనస్కుడును, ఇంద్రియ నిగ్రహుడును,సమస్తప్రాణులుతనవంటివేయని సమభావము గలవాడును లేక సమస్తప్రాణులలో గల ఆత్మయు తన యాత్మయు

ఒకేరూపముగా నున్నవను జ్ఞానముగలవాడును నగు కర్మానుష్ఠాన పరుడు కర్మను అచరించుచున్నవాడైనను ఆ కర్మచే నంటబడడు.

శ్లో॥ నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యఙ్శృణ్వన్ స్పృశఞ్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపఞ్శ్వసన్॥8

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిష న్నిమిషన్నపి ।
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥ 9

పద॥ న - ఏవ - కించిత్ - కరోమి - ఇతి - యుక్తః - మన్యేత-తత్త్వవిత్, పశ్యన్ - శృణ్వన్ - స్పృశన్ - జిఘ్రన్ - అశ్నన్ - గచ్ఛన్ - స్వపన్, శ్వసన్ - ప్రలపన్ - విసృజన్ - గృహ్ణన్ - ఉన్మిషన్ - నిమిషన్ -అపి ఇంద్రియాణి - ఇంద్రియార్థేషు - వర్తంతే - ఇతి - ధారయన్.

ప్రతి॥ తత్త్వవిత్=పరమార్థ తత్త్వమును తెలిసికొన్నవాడైన, యుక్తః=నిష్కామ కర్మానుష్ఠానపరుడగు యోగి (లేక ఆత్మసంయమముగలయోగి), పశ్యన్ చూచుచున్నను,శృణ్వన్=వినుచున్నను,స్పృశన్=తాకుచున్నను,జిఘ్రన్= అఘ్రాణించుచున్నను, అశ్నన్ = తినుచున్నను, గచ్ఛన్=నడచుచున్నను, స్వపన్ = నిద్రించుచున్నను, శ్వశన్=ఊపిరి విడుచుచున్నను, ప్రలపన్= మాట్లాడుచున్నను,విసృజన్=(మలమూత్రముల) విడుచుచున్నను,గృహ్ణన్ గ్రహించుచున్నను, ఉన్మిషన్ = కన్నులుతెరచుచున్నను, నిమిషన్ అపి= కన్నులమూయుచున్నను, ఇంద్రియాణి=ఇంద్రియములు, ఇంద్రియార్థేషు= ఇంద్రియవిషయములయందు, వర్తన్తే ఇతి = ప్రవర్తింపుచున్నవని, ధార యన్ = ఎంచుకొన్నవాడై, కించిత్ ఏవ = కొంచమైనను, న కరోమి ఇతి= నేను చేయుటలేదని, మన్యేత = తలంచును,

తా॥ బ్రహ్మజ్ఞానసంపన్నుడైన యోగి అనగా నిష్కామకర్మాను ష్ఠానపరుడు చూచుచున్నను, వినుచున్నను, తాకుచున్నను, అఘ్రా ణించుచున్నను, తినుచున్నను, నడచుచున్నను, నిద్రించుచున్నను, శ్వాసించుచున్నను, మాటలాడుచున్నను, మలమూత్ర విసర్జనము చేయుచున్నను, ఏదైన గ్రహించుచున్నను, కన్నుల తెరచుచున్నను, కన్నుల మూయుచున్నను ఇంద్రియములు విషయములందు ప్రవర్తించుచున్నవని యెంచుకున్నవాడగుచు కొంచమైనను నేను చేయుటలేదని తలంచును.

వి॥ ఇంద్రియములు ఇంద్రియవిషయములలో ప్రవర్తించుచున్నను, నాకు బంధములేదని యెట్టివాడు చెప్పవచ్చునో అదియిచ్చట నిరూపించడమైనది. దీనిలో గల7-వ శ్లోకమున లక్షణము చెప్పడమైనది, (1)యోగయుక్తుడు, (2)విశుద్ధాత్ముడు (3) విజితాత్ముడు, (4) జితేంద్రియుడు, (5)సర్వభూతాత్మభూతాత్ముడు, ఇట్టిఐదు లక్షణములును ఒక్కనియందే యుండవలెను. ఈ లక్షణములలో ఒకటైనను సంపూర్ణముగా కలవారు కనిపించుట అరుదు, ఈ 7వశ్లోకమును స్మరించకయే 8,9శ్లోకములను చెప్పుచువిహరించు వాచావేదాంతులుకొందఱుగలరు. అధికారము గల జడ్జి, దోషికి ఉరిశిక్ష విధించిన బంధము నొందడు. అనధికారి ఒకరిని ఉరి వేయించిన యతనికిని అట్టి మరణశిక్ష గలుగును. ఇచట 'పశ్యన్' శృణ్వన్ 'అని చెప్పెడివాక్యములు బ్రహ్మజ్ఞానసంపన్నుడు గూడా నిర్విషయుడై దేహధారకార్యములు చేయుచున్నను, ఇతరమానవునివలె బాహ్యదృష్టిగలవారికి గనిపించినను అతడు బద్ధుడుగాడని సూచించుచున్నవి. కనుకనే అట్టి దివ్యపురుషునికి 5లక్షణములు నిరూపించడమైనది .అట్లు శరీరసంరక్షణకొఱకు మాత్రము చేయువృత్తులు లేనిచో, అతడు లోకమునకు ధర్మము నెట్లు బోధించగలడు? అతని ఇంద్రియములుడకబెట్టిన (వేయించబడిన)శనగల రీతిగానుండును, అవి భూమిలో వేసినమొలకెత్తవు. వాటిలో అంకురశక్తి నశించిపోయినది, అట్లుజ్ఞానాగ్నిలో సంస్కారములు నశించనివారు పచ్చిశనగలవలెనుందురు, వారికి విషయసాంగత్యముచే వృత్తులు ఆవిర్భవించును. అదియే దానికి గుఱుతు, లేక పుటముచే విషమునశించిన పాషాణము దివ్యౌషధమగును. ఇది రోగముచే మరణమాసన్నమైనవానినిగూడ రక్షించును. పుటము వేయబడని పాషాణమైనచో, అది యారోగ్యముగల మనుజునిగూడ నశింపచేయును, ఇదియే జ్ఞానియొక్కయు. అజ్ఞానియొక్కయు లక్షణమనిగ్రహించదగినది.

"శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వా చ యో నరః ।
న హృష్యతి న చ ద్వేష్టి స విజ్ఞేయో జితేంద్రియః" అని మనుస్మృతి,

స్తుతి నిందలను వినిగాని, స్పృశ్యాస్పృశ్యములను స్పృశించిగాని, సురూపకురూపములను చూచిగాని, రుచి అరుచులను భుజించిగాని, సుగంధ దుర్గంధములను ఆఘ్రాణించిగాని ఏ యోగి హర్షమునుగాని, శోకమునుగాని పొందడో వాడే జితేంద్రియుడగును.

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా ॥ 10

పద॥ బ్రహ్మణి - ఆధాయ-కర్మాణి -సంగం - త్యక్త్వా - కరోతి-యః.
లిప్యతే - న - సః - పాపేన - పద్మపత్రం - ఇవ - అంభసా.

ప్రతి॥ యః = ఎవడు, కర్మాణి = కర్మములను, బ్రహ్మణి = పరమాత్మయందు, ఆధాయ = అర్పించి, సంగం = ఫలాపేక్షను, త్యక్త్వా = విడిచి,కరోతి = చేయుచున్నాడో, సః = వాడు, అంభసా=ఉదకముచేత·పద్మపత్రం ఇవ= తామరాకువలె, పాపేన = పాపముచేత, న లిప్యతే = అంటబడడు.

తా॥ ఏ మానవుడు సకల కర్మములను పరమాత్మయందు సమర్పించి ఫలమునందు కోర్కెలేక యుంటున్నాడో అటువంటి యోగియు, ఉదకముచేత తామరాకు తడవనట్లు (అంటనట్లు) పుణ్య పాపరూపమైన స్వర్గనరకములచే బంధనమును పొందడు.

వి॥ ఇచటగూడ ప్రకృతినుండి విముక్తిగలిగిన జీవన్ముక్తుని తామరాకుగా వర్ణించడమైనది. తామరాకుపై నెంత వానకురిసినను, ఎంతనీరు జనులుపోసినను ఒక బొట్టయినను నిలువక యెట్లు జారిపోవుచుండునో, అలాగున ప్రపంచములో నుండినను ప్రపంచవిషయముల కంటనివాడు ముక్తుడగును. తామరాకునకు మాత్రమట్టి శక్తిగలదు. కాని యితరములగు ఆకులు నీళ్లచే తడిపిన అంటుకొను చుండును; నీటిలో మునిగిపోవుచుండును. మఱియు కుమ్మరపురుగును, నవనీత మునుగూడ కొందఱు దృష్టాంతముగా జెప్పుచుందురు. కుమ్మరపురుగు బురదలో నుండినను బురదచే అంటబడదు. వెన్న మజ్జిగలో నున్నను దానిలో కలియదు. బురదతో నంటుకొనిన అది కుమ్మరపురుగుగాదు; కంబళిపురుగే. నీటిలో కరిగిన అది వెన్నకాదు; సున్నమే. ఈ దృష్టాంతమును చూచుకొనిన ముక్తుడా? బద్ధుడా? అని తెలిసికొనవచ్చును. పాలనుకాచి తోడుపెట్టి పెరుగైన తరువాత తరచిన పిమ్మట వెన్న యేర్పడినది. అలాగున నిర్మలాత్ముడై గురూపదిష్ట నిష్ఠహృదయ ములో గలిగి ఆత్మను మనన నిదిధ్యాసములచే వేరుపరచినవానికే పై వాక్యము చెల్లును. లేనిచో పాలయవస్థలోను, పెరుగు అవస్థలోను నీటిలో బోసినట్లగును. ఇది సప్త భూమికలలో నాల్గవ భూమిక లేక ఐదవ భూమికయగు అసంసక్తి స్థితిలో గలవానికే చెల్లును.

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియైరపి ।
యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే ॥ 11

పద॥ కాయేన - మనసా - బుద్ధ్యా - కేవలైః - ఇంద్రియైః - అపి.
యోగినః - కర్మః - కుర్వన్తి - సంగం - త్యక్త్వా - ఆత్మశుద్ధయే.

ప్రతి॥ యోగినః = యోగులు (నిష్కామకర్మయోగులు), ఆత్మశుద్ధయే = ఆత్మ శుద్ధి కొఱకు, సంగం = ఫలాపేక్షను, త్యక్త్వా = వదలి, కాయేన = శరీరముచేతను, మనసా = మనస్సుచేతను, బుద్ధ్యా=బుద్ధిచేతను, కేవలైః ఇంద్రియైః అపి = మమత్వాభిమానశూన్యములైన ఇంద్రియములచేతను, కర్మ = కర్మను, కుర్వన్తి = చేయుచున్నారు.

తా॥ నిష్కామకర్మ యోగమును, లేక ధ్యానయోగమును అవలంబించిన వారు కర్మఫలమును కోరక, చిత్తశుద్ధికొఱకు మమత్వ శూన్యములైన మనోవాక్కాయముల చేతను, ఇంద్రియముల చేతను ఈశ్వరార్పణ బుద్ధితో కర్మమును చేయుచున్నారు.

వి॥ వాక్కుతో మాత్రము ధర్మబోధల చెప్పుటే కాదు; కరచరణాదీంద్రియ ములచేతను దేహముచేతను కర్మను జేయుచున్నారు. మనస్సులోను శుద్ధముగా నుండవలెనను తలంపుతో జేయుచున్నారు. దీనివలన యోగులైనవారుగూడ వాక్కుతో ధర్మబోధ యొనర్చుటయు ఉపనిషదాదుల చదువుటయు, చేతులతో నిరభిమానులై కర్మలు చేయుటయు శీతోష్ణములను సహించి దేహముతో సత్క ర్మముల ననుష్ఠించుటయు చేయుచున్నారు. దేనికొఱకనిన ఆత్మశుద్ధికొఱకని భగవంతుడే తెలిపియున్నాడు.

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వాశాంతిమాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ 12

పద॥ యుక్తః - కర్మఫలం - త్యక్త్వా - శాంతిం - ఆప్నోతి - నైష్ఠికీం, అయుక్తః - కామకారేణ - ఫలే - సక్తః - నిబధ్యతే.

ప్రతి॥ యుక్తః = యోగసాధకుడు, కర్మఫలం=కర్మఫలమునందలి యపేక్షను, త్యక్త్వా = విడిచి, నైష్ఠికీం =నిష్ఠాపర్యవసానమగు, శాంతిం=చిత్తోపరతిని ఆప్నోతి=పొందుచున్నాడు, అయుక్తః = కామ్యకర్మానుష్ఠానపరుడైననో, కామకారేణ = కోరిక గలవాడగుటచే, ఫలే = కర్మఫలమందు. సక్తః = ఆసక్తిగలవాడగుచు, నిబధ్యతే = సంసారమందు బద్ధుడగు చున్నాడు.

తా॥ నిష్కామ కర్మయోగి ఫలాభిలాషను వదలి కర్మలను జేయుచు, చిత్తశుద్ధిద్వారా ఆత్మనిష్ఠ గలిగినందుచేత మోక్షమును బొందుచున్నాడు: ఫలాభిలాషతో కర్మను జేయువాడు, కోర్కెచేత **ఫలము నందాసక్తి గలవాడై కర్మచేత బంధింపబడును.**

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ॥ 13

పద॥ సర్వకర్మాణి - మనసా - సన్న్యస్య - అస్తే - సుఖం - వశీ,
నవద్వారే - పురే - దేహీ - న - ఏవ - కుర్వన్ - న కారయన్,

ప్రతి॥ వశీ =ఇంద్రియములను వశపరచుకొన్నవాడగు, దేహీ=దేహి, మనసా = మనస్సుచేత,సర్వకర్మాణి=సమస్త కర్మములను, సన్న్యస్య= పరిత్యజించి, న ఏవ కుర్వన్ = తానేమియు చేయనివాడును, న కారయన్=చేయింపని వాడునునై, నవద్వారే = తొమ్మిది వాకిళ్ళుగల, పురే=పట్టణప్రాయమైన శరీరమందు, సుఖం = హాయిగా, అస్తే = ఉంటున్నాడు.

తా॥ ఇంద్రియములను వశపరచుకొన్నవాడు, మనస్సుచేత సమస్త కర్మములను పరిత్యజించి తానేమియుచేయనివాడై, ఒకరిచేత జేయింపనివాడునునై తొమ్మిది వాకిళ్ళుగల పట్టణప్రాయమైన శరీర మందు హాయిగా నుంటున్నాడు.

వి॥ నవద్వారములలో, అంతటను స్పర్శేంద్రియము వ్యాప్తమై యుంటూ యున్నది.దానితోగూడ పది యింద్రియములగుచున్నవి. నేత్రద్వారములు రెండు, శ్రోత్రద్వారములు రెండు, ఘ్రాణ ద్వారములు రెండు, నోరు ఒకటి, ఏడును శిరముపై నుండును. జలమల విసర్జనము చేయు రెండు ద్వారములు క్రిందిభాగ మందుండును. కావున తొమ్మిది ద్వారములని చెప్పడమైనది.సర్వకర్మల యొక్క ఫలమును పరిత్యజించుట యని కొందరును, సర్వకర్మములను మనస్సుతో సహా విడుచుట యని మఱికొందఱును చెప్పుచున్నారు. ఆత్మకు బంధనములేనిసత్కర్మ ములను ఈశ్వరార్పణబుద్ధితో చేయవచ్చును. "వశీ" అను శబ్దముయొక్క అర్థ మును బాగుగా జ్ఞాపకము జేసికొనవలెను,

శ్లో॥ నకర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ 14

పద॥ న - కర్తృత్వం - న - కర్మాణి - లోకస్య - సృజతి - ప్రభుః.
న - కర్మఫలసంయోగం - స్వభావః - తు - ప్రవర్తతే.

ప్రతి॥ ప్రభుః = ఈశ్వరుడు, లోకస్య=ఈప్రపంచమునందలి జీవజంతువులకు, కర్తృత్వం =కర్తృత్వమును, న సృజతి = సృజించడు, కర్మాణి=కర్మము

లను, న = సృజింపడు, కర్మఫలసంయోగం = కర్మఫలముతోటి సంబంధ
మును, న = సృజింపడు. (కిం) తు = మఱి యేమనిన. స్వభావః =
జన్మాంతర సంస్కారము, ప్రవర్తతే = ప్రవర్తింపజేయుచున్నది.

తా॥ ఈశ్వరుడు ఈ ప్రపంచమునందలి జీవకోట్లకు కర్తృత్వ
మునుగాని, కర్మలనుగాని, కర్మఫలముతోటి సంబంధమునుగాని
సృజింపడు. మఱేమనిన; ప్రకృతిసంబంధమువలన గలిగిన జన్మాం
తర సంస్కారము కర్తృత్వాదులకు కారణమగుచున్నది.

వి॥ కర్తృత్వము అవిద్యచేత గలుగుచున్నది.

శ్లో॥ నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః ॥ 15

పద॥ న ఆదత్తే - కస్యచిత్ - పాపం - న - చ - ఏవ - సుకృతం - విభుః.
అజ్ఞానేన - ఆవృతం - జ్ఞానం - తేన - ముహ్యన్తి - జంతవః.

ప్రతి॥ విభుః = ఈశ్వరుడు, కస్యచిత్ ఎవనియొక్కయు, పాపం = పాపమును,
న ఆదత్తే=గ్రహింపడు, సుకృతం చ=పుణ్యమునుగూడ, న ఏవ=గ్రహిం
పడు, జ్ఞానం = ఆత్మజ్ఞానము, అజ్ఞానేన= అజ్ఞానముచేత, ఆవృతం=కప్ప
బడియున్నది, తేన=దానిచేత, జంతవః = జీవకోట్లు, ముహ్యన్తి=మోహ
మును పొందుచున్నవి,

తా॥ ఈశ్వరుడు ఎవనియొక్క పాపమునుగాని, పుణ్యమును
గాని గ్రహించుటలేదు. జ్ఞానము అజ్ఞానముచేత కప్పబడియున్నది.
దానిచేత జీవులు భ్రమను జెందుచున్నారు.

వి॥ సర్వేశ్వరుడు సర్వప్రాణికోట్లలో సాక్షిగా నుంటున్నాడను నీ సత్య
మును ఆత్మజ్ఞానులు సాక్షాత్కారజ్ఞానముచే కనుగొనగలరు. మేఘము సూర్యుని
కనబడనివానినిగా చేయునట్లు అజ్ఞానము ఆత్మను తెలియనీయకున్నది.ఇట్లనుటచే
ఈశ్వరభజన,జప, పూజాదులకు ఫలములేదని తలంచరాదు. జీవేశ్వరులఏకత్వా
వస్థ గలుగువఱకు ఈశ్వరుడు ఆయా యీశ్వరభజనాది పుణ్యకర్మలకుఫలమును
గలుగ జేయుచుండును, లేక ఆ కర్మలవలన అంతఃకరణమునందుగల పాపములు
నశించును. కల్పవృక్ష సమీపమున దేనిని సంకల్పించినను ఆ ఫలము గలిగే
స్వభావము దాని యందున్నట్లు సర్వేశ్వర ప్రార్థన ధ్యానాదులకు గూడా
ఫలము గలదు.

శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ 16

పద॥ జ్ఞానేన - తు - తత్ - అజ్ఞానం - యేషాం - నాశితం - ఆత్మనః.
తేషాం - ఆదిత్యవత్ - జ్ఞానం - ప్రకాశయతి - తత్ - పరమ్.

ప్రతి॥ తత్ = అట్టి జ్ఞానము నావరించియుండునట్టి, అ అజ్ఞానం తు = అజ్ఞానమైతేనో, ఆత్మనః జ్ఞానేన=ఆత్మయొక్క జ్ఞానముచేత, యేషాం = ఎవరికి, నాశితం=నశింపజేయబడినదో, తేషాం = అట్టివార్లకు, జ్ఞానం= జ్ఞానము ఆదిత్యవత్ = సూర్యునివలె, తత్ పరం=ఆ పరబ్రహ్మ స్వరూపమును, ప్రకాశయతి = ప్రకాశింప జేయుచున్నది.

తా॥ అట్టి యజ్ఞానమును జ్ఞానముచేత నెవరు నాశము చేయుచున్నారో, అట్టివారలకు జ్ఞానము, సూర్యునివలె అనగా సూర్యుడు వస్తువుల ప్రకాశింపజేయునట్లు ఆ పరబ్రహ్మస్వరూపమును ప్రకాశింప జేయుచున్నది.

వి॥ గాలిచే మేఘము తొలగునపుడు సూర్యుడు ప్రకాశించునట్లుబ్రహ్మవిచారణధ్యానములచే అజ్ఞానావరణము తొలగునప్పుడు జ్ఞానము స్వయముగానే ప్రకాశించును. లేక రాత్రులలో చీకటిమహిమచే ఏమియు కనపడకపోయినను, సూర్యుడుదయించునప్పుడన్నియు నెట్లు స్పష్టముగా గనిపించునో, అట్లే అజ్ఞానము వదలిపోయి జ్ఞానముదయించినవారికి ఈ సృష్టియొక్క తత్త్వము స్పష్టముగ తెలియబడును.

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః !
గచ్ఛ న్త్యపునరావృ త్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః ॥ 17

పద॥ తద్బుద్ధయః - తదాత్మానః - తన్నిష్ఠాః - తత్పరాయణాః.
గచ్ఛన్తి - అపునరావృత్తిం - జ్ఞాననిర్ధూతకల్మషాః.

ప్రతి॥ తద్బుద్ధయః= పై శ్లోకమునందు చెప్పిన బ్రహ్మజ్ఞానోదయము గలిగినవారు లేక ఆ పరమాత్మయందే బుద్ధి గలవారు,తదాత్మానః=ఆ పరమాత్మయందే మనస్సు గలవారును, తన్నిష్ఠాః = ఆ పరమాత్మయందే నిష్ఠగలవారును, తత్పరాయణాః = ఆ పరమాత్ముని ఆశ్రయించినవారును, జ్ఞాననిర్ధూత కల్మషాః = జ్ఞానముచే పోగొట్టబడిన పాపము గలవారునునై, అపునరావృత్తిం = పునర్జన్మములేని మోక్షపదవిని, గచ్ఛన్తి = పొందుచున్నారు.

తా॥ ఆ పరమాత్మయందే బుద్ధిని మనస్సును నిల్పినవారు, ఆ పరమాత్మయందే ఆసక్తి గలవారును, ఆ పరమాత్మయే ఆశ్రయముగ గలవారును, జ్ఞానముచే నశింపజేయబడిన పాపములుగలవారునునై పునరావృత్తిలేని పదవియగు మోక్షమును బొందుచున్నారు.

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః ॥ 18

పద॥ విద్యావినయసంపన్నే - బ్రాహ్మణే - గవి - హస్తిని,
శుని - చ - ఏవ - శ్వపాకే - చ - పండితాః - సమదర్శినః

ప్రతి॥ విద్యావినయసంపన్నే=వేదార్థపరిజ్ఞానముతోడను వినయముతోడను కూడుకొనిన, బ్రాహ్మణే=బ్రాహ్మణునియందును, గవి=గోవునందును, హస్తిని=ఏనుగునందును, శుని చ ఏవ = కుక్కయందును, శ్వపాకేచ=కుక్కమాంసమును తిను చండాలునియందును, పండితాః = జ్ఞానులు (పండితులు), సమదర్శినః = సమమగు పరబ్రహ్మమునే దర్శించుదురు.

తా॥ విద్య వినయము పూర్తిగాగల బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్కను తినెడు శ్వపచునియందును అంతర్యామియై ఒకేసర్వేశ్వరుండు వెలుగుచున్నాడని తెలిసికొనువారే జ్ఞానము గలవారగుదురు. ఇట్టి దివ్యతత్త్వము గలవారే బుద్ధిగలవారే పండితు లనబడుదురు.

వి॥ కుక్కమాంసము తినెడు శ్వపచులని ఒక జాతి పూర్వముండెను. ఇప్పుడట్టివారు ప్రపంచములో లేరు. దుఃఖముతో నున్నప్పుడు బ్రాహ్మణుని కేలాగున సహాయము చేయుదురో, అలాగున సంకటమందున్నప్పుడు శ్వపచునిగూడ ఆదరించవలెను. గోవును ఎట్లు రోగము గలిగియున్నప్పుడు రక్షింతురో, అట్లు కుక్కలనుగూడ దుఃఖములో నున్నప్పుడు సంరక్షించవలెను. అట్టి గుణము గలవాడు పండితుడు. ఆత్మజ్ఞానియును అగును.

శ్లో॥ ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥ 19

పద॥ ఇహ - ఏవ - తైః - జితః - సర్గః - యేషాం - సామ్యే - స్థితం - మనః,
నిర్దోషం - హి - సమం - బ్రహ్మ - తస్మాత్ - బ్రహ్మణి - తే - స్థితాః,

ప్రతి॥ యేషాం = ఎవరియొక్క. మనః = మనస్సు, సామ్యే = సామ్యావస్థయందు (సకలప్రాణుల యెడల సమభావమునందు), స్థితం=స్థిరమైయుంటున్నదో, తైః =వారిచేత, ఇహ ఏవ=ఈదేహముతో నీ లోకమునందే, సర్గః=జనన మరణములకు హేతువగు సంసారబంధము. జితః = జయింపబడినది, బ్రహ్మ=పరబ్రహ్మము, సమం=సమభావము గలదియును, నిర్దోషం హి= దోషరహితమైనదియు గదా!, తస్మాత్ = ఆ కారణమువలన, తే= అట్టి బ్రహ్మానుభవము గలవారు, బ్రహ్మణి ఏవ =పరబ్రహ్మమునందే, స్థితాః = ఉన్నవారగుదురు.

తా॥ ఎవరియొక్క మనస్సు సకల భూతములయందును బ్రహ్మము సమముగా నున్నదను విషయమునందు నిశ్చలమై యున్నదో, అట్టివారు ఈలోకమునందే జన్మమును జయించినవారగుచున్నారు. మఱియు బ్రహ్మము ప్రకృతిదోషరహితమైనది. కనుక అట్టి సమత్వబుద్ధిగలవారు దోషరహితులు, సదా బ్రహ్మమునందున్నవారు నగుచున్నారు.

వి॥ ఈ జన్మములోనే ముక్తి పొందేలాగున యత్నించుకొనవలెను. బ్రహ్మము ఏలాగున నిర్దోషియో అలాగునజీవునకుకూడప్రకృతిదోషములేని స్థితిగలుగునపుడే బ్రహ్మమునందు నిలకడ గలుగును. జలములో జలమును తైలములో తైలమును ఏకీభవించునేగాని, తైలములో జలము, జలములో తైలమును ఐక్యము కాదు. అలాగున బ్రహ్మము శుద్ధమగుటచే, నట్టిశుద్ధాత్ములు మాత్రమే పరమాత్మయందైక్యము జెందగలరు. ఇచ్చటనే దేహమునందుండునప్పుడే జననమరణములను జయించుకొనవలెను. పరలోకములు ఈ మనుష్యలోకములో చేసిన శుభాశుభ ఫలముల ననుభవించుట కేర్పడినవి. మఱల జన్మమును గలుగజేయని జ్ఞానము గలిగినవాడే జన్మించినవాడగును. మఱల మరణించనివాడేమరణించినవాడగును. తక్కినవారు లెక్కలో చేరినవారు కారు. జన్మమెత్తినగదా మరణించుట? కావున జన్మమెత్తనివాడని భావము.

శ్లో॥ న ప్రహృష్యేత్ప్రియంప్రాప్య నోద్విజేత్ప్రాప్య చా ప్రియమ్ ।
స్థిరబుద్ధిరసంమూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥ 20

పద॥ న - ప్రహృష్యేత్ - ప్రియం - ప్రాప్య - న - ఉద్విజేత్ - ప్రాప్య - చ - అప్రియం - స్థిరబుద్ధిః - అసంమూఢః - బ్రహ్మవిత్ - బ్రహ్మణి - స్థితః.

ప్రతి॥ స్థిరబుద్ధిః = చలింపని చిత్తము గలవాడును, అసంమూఢః =మోహరహితుడును, బ్రహ్మణి స్థితః=పరమాత్మయందుస్థితిగలవాడునునైన, బ్రహ్మవిత్ = బ్రహ్మజ్ఞానముగలవాడు (బ్రహ్మవేత్త), ప్రియం=ఇష్టమైనదానిని, ప్రాప్య = పొందినప్పుడు, న ప్రహృష్యేత్ = సంతోషింపడు, అప్రియం = ఇష్టము కానిదానిని, ప్రాప్య = పొందినప్పుడు, న ఉద్విజేత్ చ = వ్యసనమునున్ను బొందడు.

తా॥ చలింపని చిత్తముగలవాడును, మోహరహితుడును, పరబ్రహ్మమందు స్థితి గలవాడును నైన బ్రహ్మజ్ఞానము గల బ్రహ్మవేత్త యిష్టమైన దానిని పొందినపుడు సంతోషింపడు; ఇష్టము కానిదానిని పొందినపుడు క్లేశమును పొందడు. ద్వంద్వములయందు సముడై యుండును.

వి॥ ఇట్టిద్వంద్వాతీత స్థితిగలిగేలాగున బ్రహ్మనిష్ఠులుచూచుచుండవలెను. ఇష్టానిష్టములుప్రకృతిలో నెల్లప్పుడుఉండును వాటితో నంటుకొనకయుండుటయే ద్వంద్వాతీతమనబడును.దీనినిమనస్సుయొక్క నిగ్రహముచేగలుగచేసికొనవలెను. సామాన్య బ్రహ్మనిష్ఠులకు ఇష్టానిష్టము లొక్కక్షణకాల ముండవచ్చును. మఱల వెంటనే ఆత్మభావములోనికి వెళ్ళునపుడు ఇష్టానిష్ఠభావము లేకపోవును. చేతితో జలాశయమునుకలబెట్టిన,ఒక్కక్షణము అలలేర్పడి యుత్తరక్షణములోమహాజలముతోనైక్యమొందునట్లుండును.ఇదియులేనివారు వ్యవహారరహితులై యుందురు.

శ్లో॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।
న బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥ 21

పద॥ బాహ్యస్పర్శేషు - అసక్తాత్మా - విన్దతి - ఆత్మని - యత్ - సుఖం,
సః - బ్రహ్మయోగయుక్తాత్మా - సుఖం - అక్షయం - అశ్నుతే.

ప్రతి॥ బాహ్యస్పర్శేషు=బాహ్యములైన విషయములందు. అసక్తాత్మా=ఆసక్తిలేని మనస్సుగల బ్రహ్మనిష్ఠుడు, ఆత్మని = ఆత్మయందు, యత్ = ఏ, సుఖం= సుఖముగలదో, తత్ = ఆసుఖమును, విందతి = పొందుచున్నాడు, బ్రహ్మయోగయుక్తాత్మా =బ్రహ్మసమాధితో (నిర్వికల్పసమాధితో) గూడుకొనిన మనస్సుగలవాడై (నిరంతరబ్రహ్మాను సంధానతత్పరుడై), సః =ఆ బ్రహ్మనిష్ఠుడు, అక్షయం =నాశరహితమైన, సుఖం=బ్రహ్మసుఖమును, అశ్నుతే= అనుభవించుచున్నాడు.

తా॥ బాహ్యావిషయములందు ఆసక్తిలేని మనస్సుగల బ్రహ్మనిష్ఠుడు ఆత్మయందే యేసుఖముగలదో, ఆ సుఖమును బొందుచున్నాడు. బ్రహ్మసమాధితో (నిర్వికల్పసమాధితో) కూడుకొనిన మనస్సుగలవాడై అనగా నిరంతర బ్రహ్మానుసంధానతత్పరుడై ఆ బ్రహ్మనిష్ఠుడు నాశరహితమగు బ్రహ్మానందము ననుభవించుచున్నాడు.

వి॥ బ్రహ్మసుఖము శాశ్వతమనియు, ప్రకృతిసుఖము దుఃఖముతోకూడినదనియు,అనిత్యమైనదనియు తెలియదగును.

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే !
అద్యంతవంతః కౌంతేయ! న తేషు రమతే బుధః ॥ 22

పద॥ యే - హి - సంస్పర్శజాః - భోగాః - దుఃఖయోనయః - ఏవ - తే,
ఆద్యంతవంతః - కౌంతేయ! - న - తేషు - రమతే - బుధః.

ప్రతి॥ హే కౌంతేయ! = కుంతీపుత్రుడవగు ఓ యర్జునా!, హి = ఏలననగా, యే = ఏవి, సంస్పర్శజాః = విషయసంయోగమువలనగలిగిన, భోగాః= సుఖములో, తే= అవి, దుఃఖయోనయః ఏవ = దుఃఖమును గలుగజేయునవియే. (మఱియునవి)ఆద్యంతవంతః =ఉత్పత్తివినాశనములుగలవియు (నగును.కాబట్టి), బుధః = బుద్ధిమంతుడు, తేషు = ఆ విషయసుఖముల యందు, న రమతే = రమించడు.

తా॥ విషయేంద్రియ సంయోగమువలన గలిగిన సుఖానుభవములు దుఃఖమునకు కారణములైనవియు, ఆద్యంతములు గలవియును నగుననితలచి నిర్మలబుద్ధిగలవాడు విషయసుఖములయందు ఆసక్తిలేనివాడై యుండును.

వి॥ విషము కలియని యన్నమును, విషము కలిసిన క్షీరాన్నమును ఎఱింగినవాడు ఎట్లు విషాన్నమును ముట్టక మంచియన్నమును భుజించి తృప్తిగలవాడగునో, నిర్మలబుద్ధియు, మంచిజ్ఞానమును గలవాడీలాగున విషయసుఖముల నాశింపక వాటిని విషతుల్యముగ భావించి విరక్తుడై, ఆత్మసుఖానురక్తుడై యుండును.

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ॥ 23

పద॥ శక్నోతి - ఇహ - ఏవ - యః - సోఢుం - ప్రాక్ - శరీర విమోక్షణాత్.
కామక్రోధోద్భవం - వేగం - సః - యుక్తః - సః - సుఖీ - నరః,

ప్రతి॥ యః = ఎవడు, ఇహ ఏవ = ఈ లోకమునందే, శరీరవిమోక్షణాత్ = శరీరము విడుచుటకు, ప్రాక్ = ముందుగానే. కామక్రోధోద్భవం = కామక్రోధ జన్యమగు, వేగం = తీవ్రతను, సోఢుం = సహించుటకొఱకు, శక్నోతి = శక్తుడగుచున్నాడో. సః నరః = అట్టి మనుజుడు, యుక్తః = యోగసిద్ధి గలవాడగుచున్నాడు. సః = వాడు, సుఖీ = శాశ్వతమైన సౌఖ్యము గలవాడగుచున్నాడు.

తా॥ ఏ పురుషుడు బ్రతికియున్నప్పుడే కామక్రోధముల యొక్క వేగమును సహింప శక్తిగలిగియున్నాడో, అట్టి పురుషుడు ఇంద్రియ నిగ్రహముగలవాడును, శాశ్వతానందముగలవాడును నగుచున్నాడు.

వి॥ "శక్నోతీహైవ" "ప్రాక్శరీరవిమోక్షణాత్" అను ప్రయోగములు చాల జాగరూకతతో గమనింపదగినవి, ఈ దేహముతో నున్నప్పుడే సర్వేశ్వరుడొసంగిన శరీరము పడిపోకముందుగానే ఇంద్రియ జయము గలిగి ప్రకృతి వికారము నణచు శక్తిగలవానికి మాత్రమే మోక్షము గలుగును. ఈ యధ్యాయమున 19-వ శ్లోకమున "ఇహైవతైర్జితః" అను ప్రయోగమున్ను ఈతత్త్వమునే యుపదేశించుచున్నది, జీవించునప్పుడే ప్రకృతినుండి విమోచనము గలవాడే జీవన్ముక్తుడనబడును, జీవితమెంతకాలమువఱకు నిలుచునో తెలియ సాధ్యముకాదు. అది మెరుపువంటిదనియు, నీటిబుడగలవంటిదనియు విజ్ఞులు దెలిపియున్నారు.

శ్లో॥ యోఽన్తస్సుఖోఽన్తరారామస్తథాఽన్తర్జ్యోతిరేవ యః ।
న యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ 24

పద॥ యః - అన్తస్సుఖః - అన్తరారామః - తథా - అన్తర్జ్యోతిః - ఏవ - యః,
సః - యోగీ - బ్రహ్మనిర్వాణం - బ్రహ్మభూతః - అధిగచ్ఛతి.

ప్రతి॥ యః = ఎవ్వడు, అన్తస్సుఖః = ఆత్మయందే సుఖించువాడును. అన్తరారామః-ఆత్మధ్యానమందే క్రీడించువాడునైయున్నాడో,తథా=అలాగుననే, యః=ఎవడు, అన్తర్జ్యోతిః ఏవ=అంతరాత్మయందే ప్రకాశముగలవాడై యున్నాడో, సః యోగీ = అట్టి ధ్యానయోగి. బ్రహ్మభూతః = బ్రహ్మస్వరూపుడై, బ్రహ్మనిర్వాణం = బ్రహ్మానందమును, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా॥ ఎవడు ఆత్మయందే ఆనందించువాడును, ఆత్మయందే రమించువాడును అగుచున్నాడో, అలాగున ఎవడాత్మయందే ప్రకాశము (జ్ఞానము) గలవాడై యున్నాడో, అట్టి ధ్యానయోగపరుడు బ్రహ్మ స్వరూపుడై బ్రహ్మసాక్షాత్కారమును పొందుచున్నాడు.

వి॥ బాహ్యసుఖములో రమించనివాడై ఆత్మసుఖమందుండు వాడును, బాహ్యక్రీడలు లేనివాడై పరమాత్మయందు క్రీడించువాడును, అంతరాత్మ ప్రకాశము (జ్ఞానము) గలవాడునునై యుండునో వాడు బ్రహ్మానుభవము గలవాడగును, ఈ గుఱుతును చూచిన చాలును.

శ్లో॥ లభన్తే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మానస్సర్వభూతహితేరతాః ॥ 25

పద॥ లభన్తే - బ్రహ్మనిర్వాణం - ఋషయః - క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధాః - యతాత్మానః - సర్వభూతహితే - రతాః.

ప్రతి॥ క్షీణకల్మషాః = నశించిన పాపము గలవారును. ఛిన్నద్వైధాః=పోగొట్టబడిన ద్వంద్వములు గలవారును యతాత్మానః=స్వాధీనమైన మనస్సు గలవారును. సర్వభూతహితేరతాః=సమస్తప్రాణులయెడ ప్రీతిగలవారును నగు,ఋషయః=ఇంద్రియాతీత జ్ఞానముగల ఋషులు, బ్రహ్మనిర్వాణం= బ్రహ్మానందమును, లభన్తే = పొందుచున్నారు.

తా॥ పాపరహితులును తొలగించబడిన ద్వంద్వములుగల వారును, నిగ్రహింపబడిన మనస్సు మొదలగు ఇంద్రియములు గల వారును, సకల ప్రాణులయొక్క మేలునందు ప్రీతిగలవారును, నగు అతీంద్రియజ్ఞానులు బ్రహ్మానందమును పొందుచున్నారు.

వి॥ బ్రహ్మనిర్వాణము ఎవరికి గలుగునో వారి లక్షణము ఈశ్లోకములో శ్రీభగవానునిచే నుపదేశింపబడినది.

శ్లో॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥ 26

పద॥ కామక్రోధవియుక్తానాం - యతీనాం - యతచేతసాం,
అభితః - బ్రహ్మనిర్వాణం - వర్తతే - విదితాత్మనామ్.

ప్రతి॥ కామక్రోధవియుక్తానాం=కామక్రోధములచే విడువబడినవారును,యతచేతసాం = స్వాధీనమైన మనస్సుగలవారును, విదితాత్మనాం = తెలిసికొనిన ఆత్మజ్ఞానము గలవారునునగు, యతీనాం=యత్నశీలురగు సన్న్యాసులకు, బ్రహ్మనిర్వాణం=బ్రహ్మానందరూపమగు మోక్షము.అభితః = అంతటను. వర్తతే = ఉంటున్నది.

తా॥ కామక్రోధములు లేనివారును,బాహ్యవిషయములమీదికి పోకుండునట్లు నియమింపబడిన అంతఃకరణము గలవారును, ఆత్మతత్త్వమును తెలిసికొనినవారును నయిన సన్న్యాసులకు (త్యాగులకు) ఈ శరీరముతో నున్నప్పుడును, ఈ శరీరము పోయిన వెనుకను అంతటను బ్రహ్మనిర్వాణము అనగా మోక్షము ఉండనే యున్నది.

వి॥ సన్న్యాసుల లక్షణము విచ్చట నిరూపింపబడమైనది. కర్మఫలత్యాగము గలవారుగూడ సన్యాసులే. "యతయః = యత్నశీలాః" యతులనగా ప్రకృతి గుణములనుండి విడుదలపొందుటకును, వేదార్థములను గ్రహించుటకును,గ్రహించిన ధర్మమును లోకములో బోధించుటకును ప్రయత్నము గలవారని యర్థము. కావున సాధువులుగా నుండదలంచువారును, సాధువులై యుండువారును ఈ భగవద్వాక్యములను జ్ఞాపక ముంచుకొనవలెను.

శ్లో॥ స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాంతరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ ॥ 27

,, యతేంద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః ॥ 28

పద॥ స్పర్శాన్ - కృత్వా - బహిః - బాహ్యాన్ - చక్షుః - చ - ఏవ - అంతరే- భ్రువోః - ప్రాణాపానౌ - సమౌ - కృత్వా - నాసాభ్యంతరచారిణౌ. యతేంద్రియమనోబుద్ధిః - మునిః - మోక్షపరాయణః, విగతేచ్ఛాభయక్రోధః - యః - సదా - ముక్తః - ఏవ - సః.

ప్రతి॥ యః=ఎవడు, బాహ్యాన్=బాహ్యములగు, స్పర్శాన్=స్పర్శాది విషయములను, బహిఃకృత్వా = బయటనేయుంచి మనస్సునందు చొరనీయక, చక్షుః చ = దృష్టిని, భ్రువోః = కనుబొమ్మలయొక్క, అంతరే ఏవ = మధ్యప్రదేశమునందే, కృత్వా = నిలిపి,నాసాభ్యంతరచారిణౌ = ముక్కులోపల సంచరించునట్టి, ప్రాణాపానౌ = ప్రాణాపానవాయువులను, సమౌ = సమ

ముగా, కృత్వా = చేసి, యతేంద్రియమనోబుద్ధి = స్వాధీనములైన యింద్రియములు మనస్సు బుద్ధియు గలవాడో. విగతేచ్ఛాభయక్రోధః = పోయిన ఆశ భయము క్రోధమున్ను గలవాడో, మోక్షపరాయణః = మోక్షమునందాసక్తిగలవాడో, సః మునిః = అట్టి మననశీలుడు లేకమౌన నిష్ఠగలవాడు, సదా = ఎల్లప్పుడు, ముక్తః ఏవ = ముక్తుడే.

తా॥ ఏ పురుషుడు వెలుపలనున్న శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయములను వెలుపలనే యుండునట్లు చేసి, యిటు నటు పోకుండునట్లుచూపును కనుబొమ్మలయొక్క మధ్య ప్రదేశమునందు నిలిపి, ప్రాణాపానవాయువులను సమానగతి గలవాటినిగాను నాసిక యొక్క, మధ్యప్రదేశమందే సంచరించువాటినిగాను చేసి, ఇంద్రియ ములను మనస్సును బుద్ధిని జయించినవాడును, మోక్షమును కోరు చున్నవాడును, మననశీలుడును, విషయాపేక్ష భయము క్రోధము అనునవి లేనివాడునునై యుండునో, అటువంటివాడు సర్వకాలముల యందును మోక్షమును పొందినవాడే యగుచున్నాడు.

వి॥ ఇచ్చట చెప్పబడిన ప్రాణాపానముల నిగ్రహము కేవలకుంభకముతో చేరినది. రేచక పూరకములుగల కుంభకముతో కూడినదికాదు, అయితే రేచక, పూరకములుగల కుంభకముచే శరీరేంద్రియమనస్సులకు త్వరలో పరిణామము గలుగును కాని దానియొక్క నియమములు చాల కఠినములు. అట్టి నియమబద్ధ ముగా దాని ననుష్ఠింపకపోయినచో యోగము రోగముగా పరిణమించును దానికి మూడునియమములు ముఖ్యములు. (1)శుద్ధసాత్త్వికాహారము. (2) అస్ఖ లిత బ్రహ్మచర్యము, (3) నిర్జనప్రదేశ నివాసము ఈ మూడును అనుకూలపడని వారు ఆయోగమును ముట్టనేకూడదు. ఇచ్చట శ్రీకృష్ణభగవాను డుపదేశించినది కేవలకుంభకము. దీనిని ఎల్లప్పుడును, ఎచ్చోటనైనను అనుష్ఠింపవచ్చును. ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములను నిరోధించి, దైవభావములోగాని ఆత్మలోగాని నిలకడ గలిగియుండుటయే కేవలకుంభకమగును. ప్రణవమునుగాని,ఇక నేవియైన యక్షరసంఖ్యతక్కువగల'సోఽహం'ఇత్యాది మంత్రములనుగాని భావనచేసికొను టయు చేయవచ్చును. అలాగున జ్ఞేయైకస్థితిలో బాధకలుగక యెంతసేపుఉండుట కనుకూలముండునో,అంతసేపు ప్రాణాపానముల చలనము లేక నిలిపి అభ్యసించు టయే కేవలకుంభకమగును. నేత్రములు తెరవఁబడియుండినను, మూసియుండినను

విరోధములేదు. ఈ అభ్యాసమును క్రమముగా శీలించుకొని, ప్రాణాపానముల గతినిచాలవఱకు నిగ్రహించుకొన వచ్చును. ఇచట మనోలయము ముఖ్యమగుటచే దానితో సహా ప్రాణమును లయమొందగల్గును. దీనిని అనుష్ఠించుచు రాగారాగా ప్రాణమున్ను క్రమముగ సన్నగిలివచ్చును. దీని కేలాటి అపాయమును లేదు. దీనికి విశేషాహారాది నియమములంత అక్కరలేదు. ఎచ్చోటనుండి అయినను చేయవచ్చును. ఇది రెండవవారికి తెలియదు, ఇట్టి సాధకులుమాత్రమే తెలిసికొన గలరు. పరమశాన్తియు నిరతిశయానందమును దీనియందు కల్గును. కావుననే నాల్గవ అధ్యాయమున యోగవిషయమై చెప్పిన స్థలమున దీనిని చెప్పక ఇదియొకటి మాత్ర మిచట తెలుపడమైనది. ఇది పరమరహస్యము. యోగశాస్త్రకర్తయగు శ్రీ పతంజలి యభిప్రాయమున్ను ఇదియే, పాతంజల యోగదర్శనము సాధన పాదము 49-వ సూత్రము: ''తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః'' ఉచ్ఛ్వాస నిశ్వాసములయొక్క గమనాగమనముల నిరోధము చేయుటయే ప్రాణాయామ మనంబడును.

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి॥ 29

పద॥ భోక్తారం - యజ్ఞతపసాం - సర్వలోకమహేశ్వరం,
సుహృదం - సర్వభూతానాం — జ్ఞాత్వా - మాం - శాంతిం - ఋచ్ఛతి.

ప్రతి॥ యజ్ఞతపసాం = యజ్ఞములకును తపస్సులకును, భోక్తారం = భోక్తనుగను సర్వలోకమహేశ్వరం=సర్వలోకములకుప్రభువునుగను, సర్వభూతానాం= సమస్తప్రాణులకు,సుహృదం=ప్రతిఫలమునుకోరక హితమునొనర్చువానిని గను, మాం = నన్ను, జ్ఞాత్వా = ఎఱింగి, శాంతిం = ప్రకృతి శమన రూపమగు శాంతిని, ఋచ్ఛతి = పొందుచున్నాడు.

తా॥ మననశీలుడు నన్ను యజ్ఞములకును, తపస్సులకును భోక్తనుగను, సమస్తలోకములకు ప్రభువునుగను, సమస్త ప్రాణులకు హితునిగను ఎఱింగి ప్రకృతి శమించిన పరమపదమగు మోక్షమును పొందుచున్నాడు.

వి॥ సుహృత్ అనియు, మిత్రుడనియు ఇరుతెగలవారు గలరు. ప్రతిఫలము ఎప్పుడైనను గలుగునని తలంచి యుపకారమొనర్చువాడు మిత్రుడు. ఏ ప్రతిఫలమును ఎప్పుడును కోరకనే యుపకార మొనర్చువాడు సుహృత్ అనబడును,

సుహృత్తుగాని మిత్రుడుగాడు. ఎవరికన - "సర్వభూతానాం" సమస్త ప్రాణుల కును, ఈయధ్యాయములోగల 14-వశ్లోకమున "నకర్తృత్వం" 15-వశ్లోకమున "నాదత్తే" అను శ్లోకములజూచిభక్తులు సందేహముగలవారై యుందురు.ఆసందే హము ఈయధ్యాయాంతమున శ్రీ భగవానునిచే నివృత్తి చేయడమైనది. పై చెప్ప బడిన శ్లోకములో వర్ణింపబడినవారుబ్రహ్మసాక్షాత్కారము గలవారు.వారికి ప్రకృ తియేలేదు ఇప్పుడు ఈశ్లోకముచే బ్రహ్మమును లేక భగవంతుని పొందుటకిచ్ఛగల ముముక్షువులేక భక్తుడుండవలసిన విధానము తెలుపడమైనది.అధ్యాయాంతమున ఈ శ్లోకము తెలుపుటచే ఇందువల్లనే ప్రకృతిరహితమగు స్థానము పొందవలసి యుండుననియు, భక్తియే ముక్తికి సాధనమనియు ఉపదేశించడమైనది. తైల మేలాగున జ్యోతిగామారుచుండునో ఆలాగున శుద్ధమైన భక్తియే జ్ఞానజ్యోతిగా మారుచుండును. కర్మసన్న్యాసయోగముచేతను పరమాత్మయం దైక్యజ్ఞానము గలుగుటచేతను ఈ యధ్యాయమునకు కర్మసన్న్యాసయోగమని పేరు వచ్చినది.

ఇతి శ్రీ మద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాస యోగోనామ
పంచమో௨ధ్యాయః

పద॥ ఇతి-శ్రీమద్భగవద్గీతాసు -ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే-కర్మసన్న్యాసయోగః-నామ-పంచమః - అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇట్లు, ఉపనిషత్సు = ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మ విద్యాయాం = బ్రహ్మవిద్యాత్మకమును. యోగశాస్త్రే = యోగశాస్త్రంబును. శ్రీకృష్ణార్జునసంవాదే=శ్రీకృష్ణార్జునసంవాదరూపమునునైన, శ్రీమద్భగవ ద్గీతాసు = శ్రీమద్భగవద్గీతలలో, కర్మసన్న్యాసయోగో నామ = కర్మ సన్న్యాసయోగమనెడి, పంచమః అధ్యాయః = అయిదవ అధ్యాయము ముగిసెను.

తా॥ ఇట్లు ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యాస్వరూ పమును, యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదరూపమునునైన శ్రీమద్భగవద్గీతయందు కర్మసన్న్యాసయోగమనెడి అయిదవ అధ్యా యము ముగిసినది.

ఓమ్ తత్ సత్



ఓమ్
శ్రీ కృష్ణ పర బ్రహ్మణే న మః

# శ్రీమద్భగవద్గీతా

## షష్ఠోఽధ్యాయః - షష్ఠాధ్యాయము
## ఆత్మసంయమయోగః - ఆత్మసంయమయోగము



ఈ యధ్యాయము ఆత్మసంయమయోగ మనంబడును. ఆత్మను పరమాత్మతో నైక్యముజేయు యోగమగుటచే దీనికి "ఆత్మసంయమయోగ" మని పేరు వచ్చినది, దీనికి 'ధ్యానయోగ' మనిగూడ పేరుగలరు. ప్రపంచములోగల జనులలో ధ్యానము చేయు స్వభావము గలవారు పెక్కుమంది గలరు. వారు ఈ యధ్యాయమును తప్పక చదివిన ధ్యానయోగవిషయమై తెలిసికొనదగిన విషయములన్నియు తెలియగలవు, దీనియందు హఠయోగపద్ధతి నెక్కువగా నవలంబింపక పాతంజలయోగ శాస్త్రమును, యోగకుండ ల్యుపనిషత్తును, యోగచూడామ ణ్యుపనిషత్తును ఆధారముగ జేసికొని అభ్యాసయోగము విస్తారముగ జెప్పబడినది. హఠయోగము కేవలము మోటుజనుల కుపయోగపడునది. మనసు కొంత శుద్ధమైనవారికిని, బుద్ధి కొంత వికసించినవారికిని మానసిక యోగము చాలును. అట్టివారిని గురించియే యీ యధ్యాయము తెలుపుచున్నది. అయినను హఠయోగసంబంధమైన ఆసనము, ముద్ర, స్థలము మొదలైనవాటిని విడిచిపెట్టలేదు. ఈఆత్మసంయమయోగము శీలించుటకు ప్రతివారికిని చాల సులభముగా నుండును,

శ్రీ భగవానువాచ:—శ్రీభగవంతుడు చెప్పెను.

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
న సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః ॥ 1

పద॥ అనాశ్రితః - కర్మఫలం - కార్యం - కర్మ - కరోతి - యః,
సః - సన్న్యాసీ - చ - యోగీ - చ - న - నిరగ్నిః - న - చ - అక్రియః.

ప్రతి॥ యః = ఎవడు, కర్మఫలం = కర్మఫలమును, అనాశ్రితః =కోరనివాడై, కార్యం = చేయదగిన, కర్మ = కర్మను, కరోతి= చేయుచున్నాడో, సః= వాడు. సన్న్యాసీ చ=కర్మను సన్న్యసించినవాడును, యోగీ చ =యోగము (నిష్కామకర్మను ఆచరించువాడును) అగుచున్నాడు. నిరగ్నిః = కార్య

ములను వదలినవాడు, న=సన్న్యాసికాడు, అక్రియః చ = నిత్యనైమిత్తి కాది కర్మల వదలినవాడును, న = కాడు.

తా॥ లోకములో నెవడు కర్మఫలమును కోరనివాడై చేయ దగిన కర్మను జేయుచున్నాడో, వాడు కర్మను సన్న్యసించినవాడును యోగియు నగుచున్నాడు. అట్లుగాక అగ్నికార్యములగు ఉపాసనాది కర్మలను వదలినవాడు సన్న్యాసి కాడు, యోగియు కాడు.

వి॥ బ్రహ్మచారికి గృహస్థ వానప్రస్థులకు అగ్నికార్యము విధింపబడినది. వానప్రస్థములో కొందఱు అగ్నిని ఆత్మయందారోపించి జ్ఞానాగ్నిలో కర్మలను కట్టెలను కాల్చివేయుదురు. సన్న్యసించినప్పుడు ప్రతివారును అగ్నికర్మలేగాక, సర్వ కర్మల నాత్మయందారోపించి హోమము చేయుదురు. పై చెప్పిన కర్మల నంతః కరణ శుద్ధి గలుగువఱకు చేయవలయును. ఆలాగున యోగియు పూర్ణ జ్ఞానము గలుగువరకు జ్ఞాననిష్ఠాద్యనుష్ఠానముల విడువరాదు. అదేరీతిగా నిష్కామ కర్మ యోగియు ఈశ్వరార్పణబుద్ధితో పరప్రాణుల ఉపకారార్థమై సత్క ర్మల చేయవలయును, లేనిచో నంతఃకరణశుద్ధిగలిగి జ్ఞానోదయము గలుగదు. గుమ్మడి. సొర, దొండ మొదలుగునవి మొదట పుష్పించి పిందెవేసి కాయ కొంచము పెరుగు నప్పుడు పుష్పము స్వయముగా నశించిపోవుచున్నది. మొద టనే పుష్పమవసరము లేదని తలంచి తీసివేసిన కాయలుకూడ చెడిపోవును, ఆలాగున తురీయజ్ఞానమందు స్థితప్రజ్ఞత్వము గలుగువఱకు ననుష్ఠానములను విడువకూడదు. దృఢాత్మజ్ఞానము గలిగినమీదట లోకహితార్థమై సత్కర్మము లాచరించినను నవి బంధకములు గావు, ఆ స్థితికి వచ్చునప్పుడు తప్పక మహ నీయులందఱును ప్రాణికోట్లమీద దయగలవారై వారి క్షేమము నుద్దేశించి కర్మ చేయుచునే యుందురు. అదియొక పుణ్య కర్మము మాత్రమే కాదు. రోగులకు ఔషధమిచ్చి యాదరించుటయు, విద్యలేనివారికి విద్యనేర్పు టయు, అస్వతంత్రులకు స్వాతంత్ర్యము కలుగుజేయుటకు యత్నించుటయు, అజ్ఞానస్థితిలో నుండువారికి జ్ఞానానుష్ఠానములు బోధించుటయు, భక్తిలేనివారికి భగవద్ధర్మము నుపదేశించుటయు కర్మమే యగును. ఏమన దేహమునుండి బుద్ధి పర్యంతముగల యింద్రియములన్నియు కరణములేయగును. కరణములచే చేయ బడినదగుటచే కర్మశబ్దము గలిగెను. కాన తాము చేయు పూజలు, భజనలు, పారాయణలు, మననము, నిదిధ్యాసమువస్తుస్వరూపనిశ్చయాత్మక బుద్ధితోచేయు భావనయును కర్మయే యగును. పై చెప్పిన వాటితో వారి వారి సంస్కారము

ననుసరించి యెవరు దేనిని చేసినను వారందఱునుకర్మముచేయువారేయగుదురు. ఇవి యన్నియు లోకమునకు కావలసినవే. "మూఢోత్తారణమేవ హి స్వభావో మహతామితి". తా॥ అజ్ఞానదశలోనుండుజనులనుద్ధరించుట మహాత్ముల స్వభావమై యున్నదిగదా!

శ్లో॥ యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ ।
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన ॥ 2

పద॥ యం - సన్న్యాసం - ఇతి - ప్రాహుః - యోగం -తం -విద్ధి - పాండవ!
న - హి - అసన్న్యస్తసంకల్పః - యోగీ - భవతి - కః - చ - న.

ప్రతి॥ హే పాండవ! = పాండు తనయుడవగు ఓ యర్జునా, యం = దేనిని, సన్న్యాసం ఇతి = సన్న్యాసమని, ప్రాహుః = చెప్పుచున్నారో, తం ఏవ= దానినే, యోగం = యోగమునుగా,విద్ధి=ఎఱుంగుము, హి = ఏలననగా, అసన్న్యస్తసంకల్పః=సంకల్పరహితుడుగానట్టి, కశ్చన =ఎవడును,యోగీ= యోగి, న భవతి = కానేరడు.

తా॥ ఓ యర్జునా! దేనిని సన్న్యాసమని చెప్పుచున్నారో, దానినే యోగమని యెఱుంగుము. ఏలయనగా, సంకల్పరహితుడు గానట్టి వాడెవడును యోగి కానేరడు.

వి॥ సంకల్ప రాహిత్యముగలుగువఱకునిష్కామకర్మయోగానుష్ఠానమును, ధ్యానయోగానుష్ఠానమును, కర్మయోగియు,ధ్యానయోగియు గలిగియుండవలెను.

శ్లో॥ ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే ॥ 3

పద॥ ఆరురుక్షోః - మునేః - యోగం - కర్మ - కారణం - ఉచ్యతే,
యోగారూఢస్య - తస్య - ఏవ - శమః - కారణం - ఉచ్యతే.

ప్రతి॥ యోగం=యోగసిద్ధియగు యోగారూఢత్వదశను, ఆరురుక్షోః = ఎక్కుటకు నిచ్ఛగించిన, మునేః = మననశీలునకు లేక మునికి, కర్మ = నిష్కామ కర్మానుష్ఠానము (అనుష్ఠానము) కారణం=సాధనముగా(ఉపాయముగా), ఉచ్యతే = చెప్పబడుచున్నది. యోగారూఢస్య = యోగసిద్ధిని పొందిన, తస్య ఏవ = ఆ మననశీలునకే, శమః = చిత్తోపరతి, కారణం = సాధనముగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ యోగసిద్ధిని అనగా యోగారూఢత్వదశను పొందుటకు నిచ్ఛగించిన అనగా పొందగోరిన మననశీలునకు లేక మునికి

నిష్కామ కర్మానుష్ఠానము (ఆచరణ) సాధనముగా జెప్పబడుచున్నది. యోగసిద్ధిని పొందిన ఆ మునికే కర్మసన్న్యాసము (శమము) లేక యుపరతి మోక్షమునకు సాధనముగా జెప్పబడుచున్నది.

వి॥ పైన చెప్పిన 'అనాశ్రితః' 'యం సన్న్యాసం' అను నీశ్లోకముల నాధారము చేసికొని ఫలాపేక్షనువదలి యెల్లప్పుడును నిష్కామకర్మయోగియై యుండవలెనని కొందరు వచింతురు. ఈ మూడవశ్లోకమున అట్టి నిష్కామకర్మ యోగానుష్ఠాన మెంతవఱకుండవలెనో నిరూపించడమైనది. యోగనిలయమును ఆరోహణము చేయతలంచువానికి నిష్కామకర్మయోగమున్ను, సమాధిస్థితిని పొందిన వానికి అట్టి బ్రహ్మభావమునుండి చలనము గలుగకుండుటకొఱకు చిత్తోపరతియు ఉపదేశించడమైనది.

శ్లో॥ యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే ॥ 4

పద॥ యదా - హి - చ - ఇంద్రియార్థేషు - న -కర్మసు - అనుషజ్జతే,
సర్వసంకల్పసన్న్యాసీ - యోగారూఢః - తదా - ఉచ్యతే.

ప్రతి॥ యదా హి = ఎప్పుడైతే, ఇంద్రియార్థేషు = ఇంద్రియవిషయములఛదు, కర్మసు చ = కర్మలయందును, న అనుషజ్జతే= సక్తుడు కాడో, తదా = అప్పుడు, సర్వసంకల్పసన్న్యాసీ = సమస్తసంకల్పములను విడిచినవాడై, యోగారూఢః = యోగరూఢుడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ ఎప్పుడైతే యింద్రియ విషయములయందును, కర్మల యందును ఆసక్తుడుగాడో అప్పుడు సమస్తములగు కోరికలను విడిచిన వాడగుచున్నాడు. అప్పుడే యోగారూఢుడని చెప్పబడుచున్నాడు.

వి॥ 'యదా హి నేంద్రియార్థేషు' అనిపాఠాంతరముగలదు.అర్థమొకటియే. ఇప్పుడు యోగసిద్ధినిపొందినవారమని తలంచువారు ఈ శ్రీకృష్ణభగవానుని యుప దేశమునుగ్రహించదగును. దీనియందుమూడులక్షణములుచెప్పబడినవి.ఇంద్రియ ములు విషయములందును,మనస్సుకామ్యకర్మములందును తగలనివాడును,'సర్వ సంకల్ప సన్న్యాసీ' సమస్త సంకల్పములు నశించినవాడును గావలసియుండును.
**అట్టి స్థితి గలుగువరకు అనుష్ఠానమును విడువరాదు. అటు తరువాత యితర భక్తు లకు మార్గదర్శకుడై యుండవలసియుండుటచే ఆచరణపరుడై యుండవలెను.**

శ్లో॥ ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ॥ 5

పద॥ ఉద్ధరేత్ - ఆత్మనా - ఆత్మానం - న - ఆత్మానం - అవసాదయేత్.
ఆత్మా - ఏవ - హి - ఆత్మనః - బంధుః - ఆత్మా - ఏవ - రిపుః-ఆత్మనః

ప్రతి॥ ఆత్మానం =విషయమాలిన్యోన్ముఖమైన మనస్సును, ఆత్మనా = నిర్విషయమైన శుద్ధమనస్సుచేత, ఉద్ధరేత్ = ఉద్ధరించుకొనవలెను, ఆత్మానం=తన యాత్మను. న అవసాదయేత్ = నశింపనీయకూడదు, హి = ఏలయనగా, ఆత్మా ఏవ = తన శుద్ధమైన మనస్సే, ఆత్మనః = తనకు, బంధుః = మేలు గలుగజేయు బంధువు, ఆత్మా ఏవ=తన మలిన మనస్సు, ఆత్మనః తనకు, రిపుః = కీడు కలుగజేయు శత్రువు.

తా॥ విషయసంకల్పము గల మనస్సే తనకు విరోధియును, విషయసంగము లేని మనస్సే తనకు బంధువును అగుచున్నది. కనుకవిషయ సంగాదులను వదలినదియును శుద్ధమును నగు మనస్సు చేత సంసారసముద్రమందు మునిగిన తననుతానే యుద్ధరించుకొనవలెను. తన యాత్మను భవసాగరములో ముంచుకొనగూడదని భావము.

వి॥ సర్వేశ్వరుడు జీవులకుకొంత యధికారమిచ్చియున్నాడు. దానివి వారు వినియోగపరచుకొనవలెను. అట్లుగాక దుఃఖము వచ్చినప్పుడు భగవంతుడు ఇట్లు చేసినాడని చెప్పుట సరియైనదిగాదని నిరూపించడమైనది. సేనాధిపతికి ప్రభుత్వము కొంత అధికారమిచ్చియున్నది. దానిని వాడు చక్కగా వినియోగపరచకపోయిన ఆపత్తు గలిగినచో, ప్రభుత్వమువారు నీకిచ్చిన అధికారమును ఏల వినియోగపరచలేదని అడుగుదురు. అలాగున భగవంతుడు మనకు వేదముద్వారా 'పాపము చేయకుము, పుణ్యము చేయుము, అజ్ఞానములో పడకుము. జ్ఞానము కలుగజేసికొనుము' అని యుపదేశించుచున్నాడు. వేదాదిశాస్త్రములను చదివి తెలిసికొనుట కందరికి సాధ్యము గాదని తలంచి, పరమకారుణికుడగు సర్వేశ్వరుడు దైవధర్మమును బోధించుటకొఱకు మహాత్ములను అనగా ప్రవక్తలను పంపుచున్నాడు. వారు పుస్తకముల ద్వారా, పత్రికల ద్వారా, లోకమున సంచరించి ధర్మబోధలు చేయుట ద్వారా దైవధర్మమును బోధపరచుచున్నారు. ఇంతకన్న భగవంతుడు ఏమి చేయగలడు? ప్రభుత్వమువారు రాజశాసనమును నిర్మించి పత్రికల ద్వారా

ప్రకటన చేయుచు నుద్యోగుల ద్వారా గ్రామగ్రామమునకు బోధించుచుందురు. అయినను మఱల తప్పుపని చేసిన వారిని శిక్షించుట తప్ప వేరుమార్గము లేదుకదా ఉద్యోగికిచ్చిన అధికారమును దుర్వినియోగపరచినను వినియోగపరచకపోయి నను తప్పిదమే యగును.

శ్లో॥ బంధురాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥ 6

పద॥ బంధుః - ఆత్మా - ఆత్మనః - తస్య - యేన - ఆత్మా - ఏవ - ఆత్మనా - జితః - అనాత్మనః - తు - శత్రుత్వే - వర్తేత - ఆత్మా - ఏవ - శత్రువత్.

ప్రతి॥ యేన = ఎవనిచేత, ఆత్మనః = తనయొక్క, ఆత్మా = ఆత్మ, ఆత్మనా = ఆత్మచేత,(బుద్ధిచేత). జితః=జయింపబడుచున్నదో, తస్య = వానియొక్క, ఆత్మా ఏవ=ఆత్మయే, బంధుః=బంధువగుచున్నది, అనాత్మనఃతు=ఆత్మను జయింపనివానికైతేనో, ఆత్మా ఏవ=ఆత్మయే, శత్రువత్ = విరోధివలె, శత్రుత్వే = ద్రోహము చేయుటయందు. వర్తేత = ప్రవర్తించుచుండును.

తా॥ ఎవనిచేత తనయొక్క మలిన మనస్సు శుద్ధమైన బుద్ధిచేత జయింపబడుచున్నదో, వానియొక్క మనస్సే బంధు వగుచున్నది. అనగా మేలు చేయుచున్నది. మనస్సును శుద్ధమైన మనస్సుచే జయింపనివాని కైతేనో అట్టి మనస్సే విరోధి వలె కీడు చేయుట యందు ప్రవర్తించుచుండును.

వి॥ నిర్మలమై స్వాధీనమై యుండు మనస్సు ఎప్పుడున్ను బంధువువలె మేలొనరించుచుండును. మలినమై స్వాధీనముగాని మనస్సు శత్రువువలె తన్ను ఎల్లప్పుడును పీడించుచుండును. ఈ రెండు శ్లోకములును ఒకేయర్థమును బోధించుటకు కారణమేమన, ఇది చాలా ప్రయాసమగు విషయమగుటచే త్రిప్పి త్రిప్పి చెప్పడమైనది. గ్రహింప ప్రయాసమగు విషయమును తెలుపునపుడు ద్విరుక్తిని ప్రయోగింతురు.

శ్లో॥ జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥ 7

పద॥ జితాత్మనః - ప్రశాన్తస్య - పరమాత్మా - సమాహితః, శీతోష్ణసుఖదుఃఖేషు - తథా - మానవమానయోః,

ప్రతి॥ జితాత్మనః =మనోజయముగలవాడగు, ప్రశాన్తస్య=ప్రశాంతమైన చిత్తము గలవానియొక్క మనస్సునందు, పరమాత్మా = పరమాత్మ (ప్రకాశించును). అట్టివాడు, శీతోష్ణసుఖదుఃఖేషు=శీతోష్ణాదులవలనకలిగెడుసుఖదుఃఖముల యందును, తథా =అలాగుననే, మానావమానయోః = మానావమానముల యందును, (మిక్కిలి), సమాహితః = సమభావము గలిగియుండును.

తా॥ మనోజయము గలవాడగు ప్రశాంతమైన చిత్తముకలవాని మనస్సునందు పరమాత్మ ప్రకాశించును.అట్టివాడు శీతోష్ణాదులవలన గలిగెడు సుఖదుఃఖములయందును, ఆలాగుననే మానావమానముల యందును సమభావము గలిగియుండును.

వి॥ శీతోష్ణముల సహించి తాను చేయవలసిన కార్యములను చేసే స్వభావము గలిగియుండవలెను. ఆ శీతోష్ణములు సాధారణముగా లోకములో నున్నవనియే గ్రహించదగును. ఇంతియేగాని యగ్నివంటి యుష్ణమును హిమమువంటి శీతలమునుసహించుట కాదని తెలియదగును.అలాగునతనయందుదోషము లేకనే కలిగెడు అవమానమును గ్రహించుట సత్త్వగుణసహన మగును. తనయందు దోషముగలిగివచ్చెడు అవమానమును సహించుట తమోగుణస్వభావమే యగును.

శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః !
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః ॥ 8

పద॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా - కూటస్థః - విజితేంద్రియః.
యుక్తః - ఇతి - ఉచ్యతే - యోగీ - సమలోష్టాశ్మకాంచనః.

ప్రతి॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా =శాస్త్రజ్ఞానముచేతను అనుభవజ్ఞానముచేతను తృప్తి పొందిన మనస్సుగలవాడును, కూటస్థః = సుఖదుఃఖాది ద్వంద్వములచే వికారమును పొందనివాడును, విజితేంద్రియః=ఇంద్రియముల జయించిన వాడును, సమలోష్టాశ్మకాంచనః = మట్టిగడ్డ గాజు రాయి బంగారు వీటియందు సమభావము గలవాడునునగు, యోగీ=యోగనిష్ఠుడు, యుక్తః ఇతి = (నిజమైన) యోగి యని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు,

తా॥ జ్ఞానవిజ్ఞానములచేతపూర్ణత్వమునొందినవాడును,ద్వంద్వములచేత చలింపనివాడును, ఇంద్రియములను జయించినవాడును నగు పురుషుడు"యోగి" అని చెప్పబడును. అట్టివాడు మట్టిగడ్డను బంగారమును రాయిని సమముగా తలచును.

వి॥ కూటస్థుడనగా కూటమువలె స్థిరముగ నుండువాడని అర్థము. కూటమనగా బంగారుపనివా రుపయోగపరచెడు ఇనుము, దీనికి దాగలియని పేరు. దీనిపై సువర్ణ రజతాదులను పెట్టి, కొట్టి అనేకరూపములుగా పనివారు మార్పుచెందించినను దానికి మాత్రము మార్పుకలుగుటలేదు. అలాగున అనేకగుణములుహృదయములో ప్రవేశించినను, నిజాత్మస్వరూపములో నేలాటి మార్పు గలుగకూడదు. ఇతరుల సొమ్మును మట్టిపెళ్ల, రాయివలె తలంచుట సామాన్యముగాను, తనసొమ్మయినను మట్టిగడ్డ రాయివలె తలంచి ఆసక్తిలేక యుండుట విశేషస్థితియనియు గ్రహించవలెను. మట్టిగడ్డ, గాజుపెంకు ఏలాగున ఆత్మజ్ఞానమున కుపయోగపడదో, సువర్ణముగూడ అలాగున పరమాత్మ ప్రాప్తికి నుపయోగపడునదిగాదని తలంచి ధ్యాననిష్ఠుడు నిశ్చలుడు గావలెను.

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥ 9

పద॥ సుహృత్ - మిత్ర - అరి - ఉదాసీన - మధ్యస్థ - ద్వేష్య -బంధుషు,
సాధుషు - అపి - చ - పాపేషు - సమబుద్ధిః - విశిష్యతే.

ప్రతి॥ సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు=సుహృత్= ప్రతిఫలాపేక్షలేక ఉపకారముచేసినవానియందును, మిత్ర= ప్రతిఫలమెప్పుడైన గలుగునని తలంచిమేలొనర్చినవానియందును, అరి=శత్రువునందును, ఉదాసీన= తనయెడలమిత్రత్వముగాని శత్రుత్వముగానిలేనివానియందును, మధ్యస్థ= తనయెడల మిత్రత్వ శత్రుత్వములయందు సమానముగాప్రవర్తించువానియందును, ద్వేష్య = తనచే ద్వేషింపబడతగినవారియందును, బంధుషు= చుట్టములయందును, సాధుషు అపి = సజ్జనులయందును, పాపేషు చ = దుర్జనులయందును, సమబుద్ధిః= సమానమైన బుద్ధిగలవాడు, విశిష్యతే = ఉత్కృష్టుడగుచున్నాడు.

తా॥ ప్రత్యుపకారము నపేక్షింపకయే మేలునుచేయు నట్టివారియందును, స్నేహవశముచేత మేలుచేయువారియందును, చాటున అపకారము చేయువారియందును, వివాదమునుచేయుచున్న యిరువురి పక్షములో నెవని పక్షమును అవలంబింపక యూరకయుండువానియందును, వివాదమును చేయుచున్న యిరువురికి హితమును చెప్పువారి యందును, ప్రత్యక్షముగా అపకారము చేయువారియందును,

లేక అపకారము చేసినందుకు బదులుగా అపకారము చేయువారి యందును, చుట్టములయందును, శాస్త్రోక్త ఆచారముల ననుసరించు నట్టి సాధువుల యందును, శాస్త్రనిషిద్ధములగు కార్యముల నాచ రించునట్టి పాపాత్ముల యందును సమమైన బుద్ధిగలవాడు సర్వోత్త ముడు లేక ముక్తుడు.

వి॥ ఇది వ్యవహారము నశించిన ఉదాసీనునిలక్షణము,ధర్మవ్యవహారము నడుపుచు సమత్వము గలవారు మైత్రి. కరుణ, ముదిత. ఉపేక్ష అను ధర్మముల ననుసరించియేచేయగలరు.లేనిచోధర్మవ్యవహారము జరుగదు.ఇతనికి అనగా ధర్మ కార్యము నిర్వహించువానికి నిచట ఉపేక్షయే ధర్మమని గ్రహించవలెను, పాప కార్యములు చేయువారి జోలికి పోక యుండుటయే యుపేక్ష యనబడును.

శ్లో॥ యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥ 10

పద॥ యోగీ - యుంజీత - సతతం - ఆత్మానం - రహసి - స్థితః,
ఏకాకీ - యతచిత్తాత్మా - నిరాశీః - అపరిగ్రహః.

ప్రతి॥ యోగీ = ధ్యానయోగము నభ్యసించువాడు, యతచిత్తాత్మా = నియమింప బడిన మనో బుద్ధీంద్రియములు గలవాడును, నిరాశీః = దేనియందును ఆశలేనివాడును, అపరిగ్రహః = పరవస్తువును గ్రహించనివాడును అనగా దేహము నిలుచుటకు మాత్రము ఇతరులిచ్చుదానిని గ్రహించు వాడును, రహసి=ఏకాంతస్థలమునందు, ఏకాకీ =ఒంటరిగా, స్థితః=ఉన్న వాడుననగుచు, సతతం = ఎల్లప్పుడు, ఆత్మానం = మనస్సును, యుంజీత = ఆత్మయందు ధ్యానము చేత లయ మొనర్పవలెను.

తా॥ యోగము నభ్యసించువాడు నియమింపబడిన మనోబుద్ధీం ద్రియములుగలవాడును, ఆశలేనివాడును, అనగా దేనిని కోరని వాడును, దేనిని సంపాదించుట యందిచ్ఛలేనివాడును, ఏకాంతస్థల మునందొంటరిగా నున్నవాడునునై, ఎల్లప్పుడును మనస్సును ఆత్మ యందు లయ పరుపవలెను.

వి॥ ఏకాంతమనగా నెవరిచేతను బాధలేని స్థలము. ఏకాకి యనగా ధ్యానము చేయు గదిలోగాని, గుహలోగాని రెండవవారుండకూడదు. ఉండిన వాడేమి

చేయుచున్నాడో అను దృశ్యసంకల్పము కలుగును. లేక అపానవాయువుచేత మనస్సున భేదముగలుగును. ఏ ద్వారముగుండానైనను మరొకడు చూచేలాగున నుండకూడదు.పరవస్తు ప్రతిగ్రహముచే వీనిపుణ్యము ఇచ్చువారికి పోవుచుండును వారి పాపము వీనికి చేరుచుండును. ఒకవేళ నిస్సహాయుడయినచో శరీరము నిలుచుటకు మాత్రమే పరవస్తువును గ్రహించవలెను. అట్టి తీవ్రతరానుష్ఠానము చేయక పరవస్తువును గ్రహించుచుండిన పూర్వపుణ్యముగూడ నశించిపోవు చుండును. పాపము చేసిన దుర్గుణములు గలుగుట, విషయాసక్తి జనించుట, అనుష్ఠానమందు తీవ్రత తగ్గుట మొదలగునవి గలుగును. ఇవియే దానికి గురుతు. ప్రతిగ్రహవిషయమై మనుమహర్షి చెప్పినది చూడుడు!

"ప్రతి గ్రహసమర్థోఽపి ప్రసంగం తత్ర వర్జయేత్ ।
ప్రతిగ్రహేణ హస్యాశు బ్రాహ్మం తేజః ప్రశామ్యతి॥"

ప్రతిగ్రహమందు సమర్థతగలిగియుండినను దానియందుగల స్వభావమునుమాన వలెను. ప్రతి గ్రహముచేత ఈ బ్రహ్మనిష్ఠుని బ్రహ్మతేజస్సు నశించును. కావున తీవ్రబ్రహ్మనిష్ఠ చేయువాడైనను శరీరసంరక్షణకు మాత్రము పరవస్తువును గ్రహించవచ్చునేగాని అధికముగ గ్రహింపగూడదు. మంచి భోజనముచే, క్షీర ఘృతాదులచే నెక్కువ ప్రాణాయామయోగాదులు చేయవచ్చునని కొందఱు తలంతురు. అది మంచిదికాదు. శుద్ధమైన యాహారము కొంచెముండినను దానిచే నెక్కువ నిష్ఠచేయకపోయినను విరోధము లేదు. ప్రతిగ్రహము "ఎక్కువవడ్డీకి తీసికొనిన డబ్బుచే వ్యాపారము చేసిన" ట్లుండును.

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్ ॥ 11

" తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః ।
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మ విశుద్ధయే ॥ 12

పద॥ శుచౌ - దేశే - ప్రతిష్ఠాప్య - స్థిరం - ఆసనం - ఆత్మనః,
న - అత్యుచ్ఛ్రితం - న - అతినీచం - చేలాజినకుశోత్తరమ్.
తత్ర - ఏకాగ్రం - మనః - కృత్వా - యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్య - ఆసనే - యుంజ్యాత్ - యోగం - ఆత్మవిశుద్ధయే.

ప్రతి॥ శుచౌ = పరిశుద్ధమైన, దేశే = ప్రదేశమందు, న అత్యుచ్ఛ్రితం = మిక్కిలి యెత్తుగా నుండనిదియు, న అతినీచం= మిక్కిలి పల్లముగా నుండనిదియు

నగు స్థలమున, చేలాజినకుశోత్తరం = వస్త్రము, కృష్ణాజినము, దర్భాసనము అనునవి ఉత్తరోత్తరముగా నొక్కొక్కటి ఒక్కొక్కదానికిమీద గలదియును, స్థిరం = కదలనిదియును అయిన, ఆత్మనః = తనయొక్క, ఆసనం = ఆస్తరణమును, ప్రతిష్ఠాప్య = వేసుకొని,

ప్రతి॥ తత్ర ఆసనే = అట్లు అమర్చబడిన ఆ యాస్తరణమునందు, ఉపవిశ్య= కూర్చుండి. మనః=మనస్సును,ఏకాగ్రం=నిశ్చలమైనదానినిగా, కృత్వా= చేసి, యతచిత్తేంద్రియక్రియః = చిత్తము యొక్కయు ఇంద్రియముల యొక్కయు, వ్యాపారములను నియమించినవాడగుచు, ఆత్మవిశుద్ధయే = మనశ్శుద్ధికొఱకు, యోగం = ధ్యానయోగమును, యుంజ్యాత్=అభ్యసించవలెను.

తా॥ పరిశుద్ధమైన ప్రదేశమునందు మిక్కిలి యెత్తుగా నుండనిదియును,మిక్కిలి తగ్గుగా నుండనిదియును, వస్త్రము, కృష్ణాజినము, దర్భాసనము అనునవి ఉత్తరోత్తరము ఒకదానికి ఒకటి మీదు మీదుగా గలదియును, అనగా దర్భాసనము, దానిపై కృష్ణాజినము, దానిపై వస్త్రమును గలదియు, కదలనిదియునైన తన యాస్తరణమును (ఆసనమును) వేసికొని దానియందు కూర్చుండి మనస్సును శబ్దాదివిషయములనుండి మరల్చి నిశ్చలమైన దానినిగా చేసి చిత్తము యొక్కయు ఇంద్రియముల యొక్కయు వ్యాపారమును మాని ఆత్మశుద్ధికొఱకు యోగాభ్యాసమును అనగా ధ్యానమును చేయవలసినది.

వి॥ భగవంతునిచే సర్వుల కుపయోగమయ్యేలాగున శుద్ధమైన స్థలము విధించడమైనది, లేనిచో కొందఱు వ్రాసినట్లు పర్వతగుహానదీప్రదేశాదుల తెలిపి యుండును. అంతేగాక ఉత్తర దిశాముఖముగా కూర్చొనవలయుననిగాని, సిద్ధాసనాది ఆసనములు వేయవలెననిగాని చెప్పియుండును. అట్లు చెప్పియుండలేదు, ఆసనము మిక్కిలి యెత్తుగాగాని పల్లముగాగాని యుండకూడదు. ఎత్తైనచో నెక్కువసేపు ధ్యానములో నున్నప్పుడు కొందఱికి మైకమువచ్చి పడిపోయినచో అపాయము కలుగును, పల్లపు ప్రదేశమైన బహిః ప్రదేశములో ధ్యానము చేయువారికి వర్షముండిన జలము వచ్చును, కొంచమెత్తుగానుండిన ఏవైన పురుగులు వచ్చునప్పుడు ఆసనమడ్డుగానుండిన అవి పైకి ప్రాకక తప్పించుకొని పోవును కనుక యిట్లు చెప్పడమైనది. "చైలాజిన "మని పాఠాంతరము.

శ్లో॥ సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥ 13

శ్లో॥ ప్రశాన్తాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః ।
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥ 14

పద॥ సమం - కాయశిరోగ్రీవం - ధారయన్ - అచలం - స్థిరః.
సంప్రేక్ష్య - నాసికాగ్రం - స్వం - దిశః - చ - అనవలోకయన్
ప్రశాన్తాత్మా - విగతభీః - బ్రహ్మచారివ్రతే - స్థితః,
మనః - సంయమ్య - మచ్చిత్తః - యుక్తః - ఆసీత - మత్పరః.

ప్రతి॥ కాయశిరోగ్రీవం = శరీరశిరః కంఠములను, సమం = సమముగాను, అచలం = నిశ్చలముగాను, ధారయన్ = ధరించుచున్నవాడగుచు, స్థిరః= సుస్థిరస్వభావముగలవాడై, స్వం=స్వకీయమైన, నాసికాగ్రం=భ్రూమధ్యమును, సంప్రేక్ష్య=చూచి, దిశః చ=దిక్కులనుగూడ, అనవలోకయన్= చూడనివాడగుచు, ప్రశాన్తాత్మా = మిక్కిలి శాంతమైన యంతఃకరణము గలవాడును. విగతభీః=భయములేనివాడును, బ్రహ్మచారివ్రతే = బ్రహ్మచర్యవ్రతమునందు, స్థితః=ఉన్నవాడును, మనః=మనస్సును, సంయమ్య మచ్చిత్తః = నాయందే చిత్తముగలవాడును, మత్పరః = నేనేపరమగతి యని నమ్మకముగలవాడును, యుక్తః=చిత్తసమాధానము గలవాడునునై ఆసీత = ఉండవలయును.

తా॥ శరీర శిరః కంఠములను సమముగాను, నిశ్చలముగాను ధరించుచున్న వాడగుచు, సుస్థిరస్వభావము గలవాడై, తననాసికాగ్రమును జూచుచు ఇతర దృశ్యములను వేటినిచూడని వాడగుచు, ప్రశాంతమైన యంతఃకరణము గలవాడును, భయములేనివాడును, బ్రహ్మచర్యవ్రతమందుండువాడును, మనస్సును విషయము మీాదికి పోనీయక నాయందే యుంచబడిన చిత్తముగలవాడును, నేనే పరమగతియని నమ్మకము గలవాడునునై యుండవలెను.యోగాభ్యాసమును లేక ధ్యానానుష్ఠానమును చేయవలెనని భావము.

వి॥ ధ్యానకాలములో శరీరశిరఃకంఠములు చక్కగానుండవలెను. ఇడా పింగళ సుషుమ్నానాడులు చక్కగ నుండిన మాత్రమే ధ్యానమందు ధ్యేయాకారమున కన్యములగు విషయములలోనికి మనస్సు పోవక యుండును. విద్యుచ్ఛక్తి

తీగలు మరి దేనితోనైన తగిలిన కరంటు భూమిలోనికి ఆకర్షింపబడునట్లు. ఈ మూడు నాడులలో ముఖ్యమగు సుషుమ్నానాడి చక్కగా నుండిన మాత్రమే దృశ్యసంకల్పములు గలుగకుండును. ముక్కుకొనను చూడవలెనని చెప్పుటచే నాసికయొక్క అగ్రభాగమును (కొనను) చూచుచుండిన మనస్సు నిశ్చలముగా నుండునని తెలియవలెను. ఇది 'భూచరీముద్ర' యనబడును. దీనివలనమనోనిశ్చలతయు, వ్యష్టిశరీరమునకు సాక్షియగు ఆత్మ తానను బోధయు గలుగును. నాసికయొక్క పైభాగము రెండు కనుబొమ్మల మధ్యప్రదేశము, లలాటముయొక్క మధ్యప్రదేశము జూచిన 'ఖేచరీముద్ర' యగును, దీనివల్ల సమష్టికి సాక్షియైన స్వప్రకాశ ఈశ్వరభావము గలుగును. ఇక బ్రహ్మచర్యవ్రతము గలిగియుండవలెనని శ్రీకృష్ణ భగవాను లుపదేశించడమైనది, వ్రతములన్నిటిలోను బ్రహ్మచర్యవ్రతము రాజుఅని శాస్త్రములలో తెలుపడమైనది. ఇది(1)నైష్ఠిక బ్రహ్మచర్యమనియు, (2) గృహస్థబ్రహ్మచర్య మనియు, (3) విధురబ్రహ్మచర్య మనియు మూడు విధములు (1) నైష్ఠికబ్రహ్మచర్యవ్రతమనగా బాల్యమునుండి దేహపతనము వఱకుగల బ్రహ్మచర్యవ్రతము. (2) గృహస్థ బ్రహ్మచర్య వ్రతమన, ఋతు కాలములో మాత్రము విషయములో ప్రవేశించుట ఇతరకాలములలో బ్రహ్మచర్యవ్రత నిష్ఠ గలిగియుండుట. ఈ కాలనియమము 'శుష్కవేదాంత తమోభాస్కర 'గ్రంథమున గనదగును. (3) విధుర బ్రహ్మచర్యవ్రతము అనగా భార్యాభర్తలు కొంతకాలము సంసారమందుండి వైరాగ్యము గలిగియో లేక దంపతులలో నే ఒక్కరికో దేహ వియోగము గలిగినప్పటి నుండి బ్రహ్మచర్యవ్రతము ననుష్ఠించి తపస్సు మొదలయినవి చేయుట యగును. తైలయంత్రమునకు పెట్రోలు కురుడాయిలు ఎటువంటివో, శరీరమను యంత్రమునకు శుక్లమటువంటిదే. నూనె నశించిన ఎట్లు యంత్రము నిలిచిపోవునో వీర్యనష్టము గలిగిన మానవుడు గూడ నిర్వీర్యుడగును. ఎముకల మధ్య మజ్జ (మూలగ) యనుదానిలో నుండి వీర్యము శరీర సర్వావయవముల వ్యాపించి శారీరక మానసిక క్రియలను నడుపుచుండును. దీనియందు దృఢవిశ్వాసము లేని బ్రహ్మచర్యరహితుని మనస్సు, ప్రజ్ఞ, దేహము; బుద్ధియును నిస్సారములై పోవును. నువ్వులనుండి నూనెయు, పాలనుండి వెన్నయు, చెరకునుండి రసమును తీసిన తరువాత గానుగపిండియు మజ్జిగయు, చెరకుపిప్పియు నెట్లుండునో బ్రహ్మచర్యము నశించిన జీవునియొక్క స్థితియు అలాగున నుండును. తైలము నశించిన దీపమేలాగున ఆరిపోవునో,

అలాగున బ్రహ్మచర్య తేజస్సు నశించిన మనుజుని యొక్క ప్రజ్ఞయు, ఓజస్సును నశించును. ప్రపంచములోగల మహా ప్రజ్ఞానవంతులందరును, మహా కార్యములు చేసిన ధీమంతులందఱును ఈ బ్రహ్మచర్య వ్రతము గలిగియే యుందురు. మఱియు నాల్గు అంతస్థులుగల సౌధమును నిర్మించ తలంచువానికి పునాది యెట్లు దృఢముగా నుండవలసి వచ్చునో, లేనిచో, భవనమెట్లు కూలునో, అలాగున బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసము లనెడు చతురాశ్రమములలో, మొదటిది బ్రహ్మచర్యాశ్రమమగును. దీనియందు పటుత్వము లేనిచో గృహస్థాశ్రమము నందున్నప్పుడు మనస్సును ధర్మకార్యములలో నిలబెట్టుటకును, వానప్రస్థములో శీతోష్ణములు సహించి తపమొనర్చుటకును, యోగము శీలించుటకును, తురీయాశ్రమమున సంకల్పములు నశించి జ్ఞేయబ్రహ్మములో సుస్థిరముగా నిలుచుటకును, శక్తిగలిగియుండదు. ఈ బ్రహ్మచర్యమును ఎనిమిది అంగములుగా ఋషులు వర్ణించిరి.

> శ్రవణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణమ్ ।
> సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృతిరేవ చ ॥
> ఏతన్మైథునమష్టాంగం ప్రవదన్తి మనీషిణః ।
> "విపరీతం బ్రహ్మచర్య మనుష్ఠేయం ముముక్షుభిః ॥

(1) విషయ సంబంధములైన మాటలను వినుట. (2) వాక్కుతో విషయములను గుఱించి యుచ్చరించుట, (3) స్త్రీలతో నాటలాడుట, (4)దుష్టభావముతో చూచుట, (5) ఆ విషయమై స్త్రీలతో రహస్యముగా మాట్లాడుట, (6) ఆ విషయమై ప్రవర్తించుటకు ఆలోచించుట. (7) ఆ విషయమై స్థిరము చేసికొనుట, (8) విషయములలో ప్రవర్తించుట, ఈ యెనిమిది విధములగు దోషములులేనిదే శుద్ధమైన బ్రహ్మచర్య వ్రతమనబడును. ఇది నైష్ఠిక బ్రహ్మచర్య లక్షణము.

> **ఋతుకాలాభిగామీ యః స్వదారనిరతశ్చ యః।**
> స సదా బ్రహ్మచారీ హి విజ్ఞేయస్స గృహాశ్రమీ'' ॥

**ఎవడు ఋతుకాలములో మాత్రము స్వభార్యయందు ప్రవర్తించునో, అతడుగూడ బ్రహ్మచారులలో పరిగణింపబడును.అట్టి గృహస్థాశ్రమములోనుండు స్త్రీ గూడ బ్రహ్మచారిణి యనబడును. ఇవి యన్నియు శరీరమునకుసంబంధించిన బ్రహ్మచర్య ధర్మములే యగును. బ్రహ్మభావమందు నిరంతరము మనస్సును**

సంచరింప జేయువాడు సత్యమైన బ్రహ్మచారి యగును. పై జెప్పిన లక్షణములు గల బ్రహ్మచారిగూడ బ్రహ్మవిచారము గలిగియుండిన మాత్రమే పూర్ణబ్రహ్మచారి కాగలడు.

"ఆయుస్తేజోబలం వీర్యం ప్రజ్ఞా శ్రీశ్చ మహద్యశః।
పుణ్యం చ మత్ప్రియత్వం న లభ్యతే బ్రహ్మచర్యయా"

బ్రహ్మచర్యముచే పూర్ణాయువు, బ్రహ్మతేజస్సు, దేహమనస్సులకు బలము పరాక్రమము, అమానుషప్రజ్ఞ, గొప్ప యశస్సు, మహాపుణ్యము, భగవత్ ప్రీతి యివి యన్నియు గలుగును.

"మాత్రా వా న దుహిత్రా వా న స్వస్రా కాంతశీలతా।
బలవంతీంద్రియాణ్యత్ర మోహయంత్యపి కోవిదాన్" ॥

నైష్ఠిక బ్రహ్మచర్య వ్రతనిష్ఠగలవాడు తల్లితోగాని, తోబుట్టువుతోగానీ, కుమార్తెతోగాని ఏకాంతమున నుండకూడదు. ఇంద్రియములు మిక్కిలి బలకరములైనవి. ఇవి ఋషులకైనా మోహమును గలుగజేయును. అదేరీతిగా బ్రహ్మచర్య వ్రతనిష్ఠ గల స్త్రీయు తండ్రితో, సోదరునితో, కన్నపుత్రునితో గూడ ఏకాంతమున నుండరాదు. అనగా అట్టివారలను కూడ నమ్మరాదని విధించుచుండగా ఇతర స్త్రీలతో బ్రహ్మచారులగు పురుషులును ఇతర పురుషులతో బ్రహ్మచారిణులగు స్త్రీలును ఉండుట యెంత అపాయకరమో యోచించుకొనవలెను.

అంగార సదృశా నారీ ఘృతకుంభసమః పుమాన్।
అస్పర్శాత్ దృఢతామేతి తత్సంపర్కాత్ విలీయతే ॥

అగ్నికుండమువంటిది స్త్రీ, నేతికుండవంటివాడు పురుషుడు. నిప్పులో నేతికుండ పెట్టనంతవరకే నెయ్యికరగకుండును. అగ్నిసంపర్కముచే నెయ్యి కరుగునట్లు, స్త్రీ సమీపమున పురుషుని మనస్సుగూడ కరిగిపోవును. నిప్పు సమీపమున నేతికుండ యే కాలమున కరుగదో అట్టికాలమున మాత్రమే స్త్రీ సమీపములో నుండినను మనస్సు విషయాకారముగా మారదని చెప్పబడినది.

శ్లో॥ యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః।
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ 15

పద॥ యుంజన్ - ఏవం - సదా - ఆత్మానం - యోగీ - నియతమానసః,
శాంతిం - నిర్వాణపరమాం -మత్సంస్థాం - అధిగచ్ఛతి.

ప్రతి॥ నియతమానసః = మనోనిగ్రహముగల, యోగీ = ధ్యానయోగపరుడు, ఏవం=ఇట్లు, సదా=ఎల్లప్పుడు, ఆత్మానం=మనస్సును, యుంజన్=ధ్యానమగ్నము చేసినవాడై, అభ్యసించుచున్నవాడై, నిర్వాణపరమాం=మోక్షమే పర్యవసానముగా గలదియు, మత్సంస్థాం = నాయందుండునట్టిదియు నగు, (నాస్వరూపమైనదియు నగు) శాంతిం = పరమశాంతిని, అధిగచ్ఛతి =పొందుచున్నాడు,

తా॥ మనోనిగ్రహముగల యోగి పై చెప్పబడిన ప్రకారము ఎల్లప్పుడాత్మను పరమాత్మ యందైక్యపరచి ధ్యానించెడు అలవాటు గలవాడై, బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమే అంతముగాగలదియు, నాయందుండు నట్టిదియు నగు ప్రకృత్యుపశమ రూపమైన పరమ శాంతిని పొందుచున్నాడు.

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున! ॥ 16

పద॥ న అత్యశ్నతః - తు - యోగః - అస్తి - న - చ - ఏకాంతం - అనశ్నతః న - చ - అతిస్వప్నశీలస్య - జాగ్రతః - న - ఏవ - చ - అర్జున!

ప్రతి॥ హే అర్జున ! = ఓయర్జునా!. యోగః = యోగసిద్ధి, అత్యశ్నతః తు= మిక్కుటముగా తినువానికి, న అస్తి = కలుగదు. ఏకాంతం = బొత్తిగా, అనశ్నతః చ = భుజింపనివానికిని, న = గలుగదు, అతిస్వప్నశీలస్య = అధికముగా నిద్రించువానికిని, న = కలుగదు, జాగ్రతః చ ఏవ = మిక్కిలిగా మేలుకొని యుండువానికిని. న = కలుగదు.

తా॥ ఓ అర్జునా! అధికముగా భోజనము చేయువానికిని, బొత్తిగా భుజింపని వానికిని, అధికముగా నిద్రించువానికిని, బొత్తిగా నిద్రింపని వానికిని యోగము సిద్ధింపదు.

వి॥ "ద్వౌ భాగౌ పూరయే దన్నైస్తోయేనైకం ప్రపూరయేత్ ।
మారుతస్య ప్రచారార్థం చతుర్థమవశేషయేత్"

ఉదరమును అర్ధభాగము అన్నాదులచేతను, పాతికభాగము జలముచేతను నింపి, ప్రాణసంచారార్థము నెల్లప్పుడు పాతికభాగముఖాళీగా నుంచవలెను, ఇట్టి వానికి నెల్లప్పుడును ధ్యానాద్యనుష్ఠానములు చేయుటకు అనుకూలముండును.

"యదుహ వా ఆత్మసమ్మితమన్నం, తదవతి తన్న హినస్తి
"యద్భూయో హినస్తి తద్వత్కనీయో న తదవతి"

తా॥ ఎంత అన్నము తన దేహమునకు చాలునో అంత అన్నము తన్ను కాపాడును, అది కీడుచేయదు,దానికన్న అధికముగా తినుఅన్నము దేహమునకు కీడు గలుగజేయును. దానికన్న తక్కువయగు అన్నము దేహమును సంరక్షించుట లేదు, అని శతపథ బ్రాహ్మణము.

శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥ 17

పద॥ యుక్తాహారవిహారస్య - యుక్తచేష్టస్య - కర్మసు.
యుక్తస్వప్నావబోధస్య - యోగః - భవతి - దుఃఖహా,

ప్రతి॥ యుక్తాహారవిహారస్య = ఉచితమైన ఆహారవిహారములు గలవాడును, కర్మసు = కాలోచితమగు కర్మలను నెరవేర్చుటయందు, యుక్తచేష్టస్య= ఉచితమగు ప్రవర్తనలు గలవాడును, యుక్తస్వప్నావబోధస్య = ఉచితమైన నిద్రా జాగరణములు గలవాడును నగు యోగికి, యోగః = యోగము, దుఃఖహా=కష్టములను పోగొట్టునదిగ, భవతి =అగుచున్నది.

తా॥ యథోచితములైన ఆహార విహారములు గలవాడును. కాలోచితములైన యనుష్ఠానములను నెరవేర్చుటయం దుచితమగు ప్రవర్తనముగలవాడును, ఉచితములైన నిద్రాజాగరణములు గలవాడును నగు యోగికి సమస్తదుఃఖముల పోగొట్టునటువంటి ధ్యానయోగసిద్ధి గలుగును.

వి॥ ఎక్కువ భుజించువానికిని, భోజనములేనివానికిని, అధికనిద్రగలవానికిని సరిగా నిద్రలేనివానికిని, ఎక్కువ పని గలవానికిని, ఏపని చేయనివానికిని, సర్వదుఃఖముల నశింపజేసెడు ధ్యానయోగసిద్ధి గలుగదు. ఆహారము తగ్గించినను నిద్ర మాత్రము తగ్గించరాదు. బడలిక నశించుటకు ఎంతనిద్ర కావలయునో అంతనిద్ర కావలెను. అనుష్ఠానముచే సత్త్వగుణము వృద్ధియగునప్పుడు నిద్ర స్వయముగా తగ్గిపోవును. అట్లుగాక బలాత్కారముగా తగ్గించిన మనస్సున ఉత్సాహము,ప్రసన్నత, జ్ఞాపకశక్తి గలుగదు ధ్యానమందున్నప్పటికిని మైకము గలుగును. నిద్రయందు దేహములో గల విషవాయువులు బహిర్గతములై, స్వచ్ఛమైన ప్రాణవాయువు లోన ప్రవేశించి సౌఖ్యమును గలుగజేయును గాన నిద్ర యవసరము.

శ్లో॥ యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।
నిస్స్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥ 18

పద॥ యదా - వినియతం - చిత్తం - ఆత్మని - ఏవ - అవతిష్ఠతే,
నిస్స్పృహః - సర్వకామేభ్యః - యుక్తః - ఇతి - ఉచ్యతే - తదా.

ప్రతి॥ వినియతం = నియమింపబడిన, చిత్తం = మనస్సు, యదా = ఎప్పుడు, ఆత్మని ఏవ = ఆత్మయందే, అవతిష్ఠతే= నిలకడకలిగియున్నదో, తదా= అప్పుడు వాడు, సర్వకామేభ్యః = సమస్తములగు కోరికలనుండి, నిస్స్పృహః= అపేక్షలేనివాడై, యుక్తః ఇతి = యోగసిద్ధిని పొందిన వాడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ ఎపుడు లెస్సగా నియమింపబడిన మనస్సు ఆత్మయందే నిల్చియుంటున్నదో, అప్పుడు వాడు సమస్తవాంఛలయందు అపేక్ష లేనివాడై యోగసిద్ధిని బొందినవాడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ యథాదీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ॥
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః ॥ 19

పద॥ యథా - దీపః - నివాతస్థః - న - ఇఙ్గతే - సా - ఉపమా - స్మృతా,
యోగినః - యతచిత్తస్య - యుఞ్జతః - యోగం - ఆత్మనః.

ప్రతి॥ యతచిత్తస్య =నియమింపబడిన చిత్తము గలవాడును, యోగం = ధ్యాన యోగమును, యుఞ్జతః = అభ్యసించువాడును నగు, యోగినః = ఆత్మ ధ్యానయోగియొక్క, ఆత్మనః = మనస్సునకు, నివాతస్థః = గాలిలేని చోట నుండెడు, దీపః = దీపము, యథా = ఏ ప్రకారము, న ఇఙ్గతే = చలింపకయుండునో, సా = అట్టి నిశ్చలస్థితి, ఉపమా = ఉపమాన ముగా, స్మృతా = చెప్పబడినది.

తా॥ నియమింపబడిన చిత్తముగలవాడును, ధ్యానయోగము నభ్యసించుచున్నవాడును నగు యోగియొక్క మనస్సునకు గాలిలేని చోట నుండు దీపమేప్రకారము చలింపకయుండునో, అట్టి యచలస్థితి ఉపమానముగా జెప్పబడినది.

వి॥ ఇట్టి స్థితి ధ్యానమందు కలిగినదా? లేదా? అని ధ్యానయోగనిష్ఠుడు ఆలోచించుకొనవలెను. ధ్యానమునందు బ్రహ్మస్వరూపభావన తప్ప తక్కిన యే భావనయు గలుగ గూడదు.

శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥ 20
,, సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్ ।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥ 21
,, యం లబ్ధ్వాచాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే ॥ 22
,, తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥ 23

పద॥ యత్ర - ఉపరమతే - చిత్తం - నిరుద్ధం - యోగసేవయా,
యత్ర - చ - ఏవ - ఆత్మనా - ఆత్మానం - పశ్యన్ - ఆత్మని - తుష్యతి,
,, సుఖం - ఆత్యన్తికం - యత్ - తత్ - బుద్ధిగ్రాహ్యం - అతీంద్రియం,
వేత్తి - యత్ర - న - చ - ఏవ - అయం - స్థితః - చలతి - తత్త్వతః.
,, యం - లబ్ధ్వా చ - అపరం - లాభం - మన్యతే - న - అధికం - తతః,
యస్మిన్ - స్థితః - న - దుఃఖేన - గురుణా - అపి-విచాల్యతే.
,, తం - విద్యాత్-దుఃఖసంయోగవియోగం - యోగసంజ్ఞితం,
సః - నిశ్చయేన - యోక్తవ్యః - యోగః - అనిర్విణ్ణచేతసా.

ప్రతి॥ యత్ర = ఏకాలమందు, చిత్తం = మనస్సు, యోగసేవయా = యోగానుష్ఠానముచేత, నిరుద్ధం = నిగ్రహింపబడినదై, ఉపరమతే = పరమాత్మయందు విశ్రాంతిని పొందుచున్నదో, (కిం) చ = మఱియు, యత్ర = ఏకాలమునందు, (యోగీ = యోగి), ఆత్మనా = పరిశుద్ధమైన మనస్సుచేత, ఆత్మానం = పరమాత్మను, ఆత్మని ఏవ = తన ఆత్మయందే, పశ్యన్ = దర్శించుచు, తుష్యతి = ఆనందించుచున్నాడో

(కిం) చ = మఱియు, బుద్ధిగ్రాహ్యం = పరిశుద్ధమైన బుద్ధిచేత తెలియదగినదియును, అతీన్ద్రియం = ఇంద్రియములకు గోచరము కానిదియు, ఆత్యన్తికం = అంతము లేనిదియును, అయిన, యత్ = ఏ, సుఖం = సుఖము (గలదో), తత్ = ఆ సుఖమును, యత్ర = ఎప్పుడైతే, వేత్తి = అనుభవ పూర్వకముగా తెలుసుకొనుచున్నాడో, అయం = ఈ ధ్యానయోగి, స్థితః = ఆత్మస్వరూపమునందుస్థిరముగా నున్నవాడై, తత్త్వతః = తత్త్వస్వరూపమునుండి, నైవ చలతి = చలింపనే చలింపడో,

(కిం) చ = మఱియు, యం = ఏ ఆత్మసుఖమును, లబ్ధ్వా = పొంది, అపరం = యితరమైన, లాభం = లాభమును (సుఖమును), తతః = దాని కంటె, అధికం = అతిశయమైనదానినిగా, న మన్యతే = తలంపడో, యస్మిన్ = ఏ ఆత్మసుఖమునందు. స్థితః = ఉన్నవాడై, గురుణా = గొప్పది యగు, దుఃఖే నాపి = దుఃఖముచేతను, న విచాల్యతే = చలింపబడడో.

(కిం) దుఃఖసంయోగవియోగం = దుఃఖసంబంధముయొక్క వియోగము గల (దుఃఖసంబంధములేనట్టి), తం=అట్టి ఆత్మసుఖమును, యోగసంజ్ఞితం = యోగమను పేరుగల దానినిగా, విద్యాత్ = ఎఱుగవలయును, సః యోగః = ఆ యోగము, నిశ్చయేన = దృఢనిశ్చయముచే, అనిర్విణ్ణచేతసా = నిర్వేదము నొందని (కలతజెందని) చిత్తముచేతను, యోక్తవ్యః = పొందదగినది.

తా॥ ఏ కాలమున మనస్సు యోగానుష్ఠానముచేత నిగ్రహింప బడినదై బాహ్యావిషయములందు ప్రవేశింపక విశ్రాంతిని పొందు చున్నదో, మఱియు యోగి యేకాలమున పరిశుద్ధమైన మనస్సుచేత పరమాత్మను తన (శుద్ధ) అంతఃకరణమునందే దర్శించుచు (అనుభ వించుచు) సంతోషించుచున్నాడో, మఱియు అంతములేనిదియు, పవిత్రమైన బుద్ధిచే మాత్రమే గ్రహించదగినదియు, ఇంద్రియాగోచర మైనదియు నైన ఆత్మసుఖమును యెపుడు (అనుభవపూర్వకముగా) తెలిసికొనుచున్నాడో, ఎపుడు ఈ బ్రహ్మనిష్ఠుడు ఆత్మస్వరూపము నందు నిలకడగలవాడై అతత్త్వస్వరూపమునుండి యెన్నటికినిచలిం పనే చలింపడో, ఏ ఆత్మసుఖమును పొంది దానికంటె మఱి వేరగు గొప్ప లాభము (సుఖము) ఉన్నదని భావింపడో, ఏ ఆత్మసుఖము నందు స్థిరముగనున్నవాడై యెట్టి గొప్ప దుఃఖము సంభవించినను విచలితుడుగాడో,దుఃఖసంబంధరహితమైన అట్టిస్థితిని(దుఃఖసంయోగ వియోగమును)యోగమునుగా దెలియవలయును.అనగాదుఃఖసంబంధ వియోగమే యోగమనిభావము.అట్టియోగమునుసాధించి తీరవలయునను దృఢనిశ్చయముచేతను, లేక శాస్త్రాచార్యవచనములచే దెలియబడిన యర్థము సత్యమను నిశ్చయముచేతను, అవాంతరములవలన గలిగిన దుఃఖముచే కలతజెందని మనస్సుచేతను సాధింపదగినదై యున్నది.

ఎన్ని విఘ్నములు సంప్రాప్తమైనను నిరాశజెందక, ఓపిక, సాధించి తీరవలయునను పట్టుదల, ఉత్సాహము గలవానికే యీ ఆత్మస్వరూపావస్థానరూపమగు యోగము సిద్ధించునని భావము.

వి॥ బుద్ధిగూడ ఇంద్రియములలో చేరినదేగదా! అట్టిచో "బుద్ధిగ్రాహ్య" మనుట యెట్లు సంభవించును! అని కొందఱు సంశయించెదరు. నిజమే, బుద్ధిగూడ ఇంద్రియకోటికి చెందినదే. కాని 'బుద్ధిగ్రాహ్యం' అనగా పరిశుద్ధమైన బుద్ధిచేతనే బ్రహ్మస్వరూపము గ్రహింప సాధ్యమగునని అభిప్రాయము, 'అతీంద్రియం' అనగా ఇంద్రియాగోచరమని యెఱుగవలయును. విషయాసక్తిచే మలినములైన యింద్రియములకు బ్రహ్మతత్త్వము గోచరము కానిదని భావము సూర్యకాంతమణియందు సూర్యరశ్మి పడునపుడు ప్రజ్వలించునట్లు శుద్ధాంతఃకరణమునందు బ్రహ్మచైతన్యము ప్రకాశించును, బుద్ధి శుద్ధమైనచో, బుద్ధి యనుఉపాధియే యుండదు.అయినను పరిశుద్ధమైన బుద్ధిలేనిచో గ్రహించిన ఆబ్రహ్మతత్త్వమును ఇతరులకు బోధింపజాలడు. మలినాత్ములకు బ్రహ్మతత్త్వముబోధపడదని తాత్పర్యము.

విషయవృత్తి వ్రణమువంటిది, వ్రణమనగా పుండు. దేహమందు కురుపులు గలవానికెట్లు శాంతి గలుగదో అట్లే మనస్సులో విషయవృత్తి గలవానికి నెన్నటికిని శాంతి గలుగదు. మఱియు శరీరమందంతయు వ్రణము గలవాడు యేకార్యమునుగాని చక్కగ జేయుట కెట్లు సమర్థుడు కాడో, అట్లే దుష్టసంకల్పములు గలవాడు, విషయవాసనలు గలవాడు ఆధ్యాత్మిక నిష్ఠలో ప్రయత్నము చేయజాలడు. ఈ ధ్యానయోగమునుగూర్చి యింత యెక్కువగాచెప్పుటకు కారణమేమన, ధ్యానయోగము చాల ముఖ్యమని శాస్త్రములలో బహువిధముల ధ్యానయోగ మహత్త్వము వర్ణింప బడుటయే. చూడుడు:—

"నాస్తి ధ్యానం వినాజ్ఞానం నాస్తి జ్ఞానమయోగినః।
ధ్యానం జ్ఞానం చ యస్యాస్తి తీర్ణస్తేన భవార్ణవః॥

తా॥ ధ్యానయోగము లేనివానికి జ్ఞానము గలుగదు. జ్ఞానము లేనివానికి ధ్యానయోగము సిద్ధించదు. ఎవడు జ్ఞానధ్యానయోగములు రెండును గలిగి యుండునో వాడు సంసారసాగరమును సులభముగా తరింపగలడు.

"నాస్తి ధ్యానసమం తీర్థం నాస్తి ధ్యానసమం తపః।
నాస్తి ధ్యానసమో యజ్ఞస్తస్మాద్ధ్యానం సమాచరేత్ ॥"

తా॥ గంగాది పవిత్రతీర్థములుగాని, తపస్సు, యజ్ఞముగాని ధ్యానయోగ మునకు సమానములు గావు. అందువలన ధ్యానమునే సదా చేయవలయును.

"యథా వహ్నిర్మహాదీప్త శ్శుష్కమార్ద్రం చ నిర్దహేత్ ।
తథా శుభాశుభం కర్మ జ్ఞానాగ్నిర్దహతే క్షణాత్ ॥"

తా॥ ప్రజ్వలించుచుండు అగ్ని, యేలాగున యెండిన కట్టెలను పచ్చికట్టెలను కాల్చివేయునో, ఆలాగున జ్ఞానమనెడు అగ్ని పుణ్యాపాప కర్మలను, కర్మ ఫలములను భస్మ మొనర్చును.

శ్లో॥ సంకల్పప్రభవాన్ కామాంస్త్యక్త్వా సర్వానశేషతః ।
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమన్తతః ॥ 24

" శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా ॥
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్॥ 25

పద॥ సంకల్పప్రభవాన్ - కామాన్ - త్యక్త్వా - సర్వాన్ - అశేషతః,
మనసా - ఏవ - ఇంద్రియగ్రామం - వినియమ్య - సమన్తతః.
" శనైః - శనైః - ఉపరమేత్ - బుద్ధ్యా - ధృతిగృహీతయా.
ఆత్మ సంస్థం - మనః - కృత్వా - న కించిత్ - అపి - చింతయేత్.

ప్రతి॥ సంకల్పప్రభవాన్ = సంకల్పమువలన బుట్టెడు, సర్వాన్ కామాన్=సమస్తములైన కోరికలను, అశేషతః=నిశ్శేషముగా, త్యక్త్వా = విడిచిపెట్టి, ఇంద్రియగ్రామం = ఇంద్రియసమూహమును. మనసైవ=మనస్సుచేతనే, సమన్తతః = అన్నివిషయములనుండి. వినియమ్య = లెస్సగ మఱలించి.

" ధృతిగృహీతయా=ధైర్యము నవలంబించిన,బుద్ధ్యా=బుద్ధిచేత,శనైఃశనైః మెల్లమెల్లగా,మనః=మనస్సును, ఉపరమేత్ = ఉపరతిని పొందించవలయును(అట్లు మనస్సును).ఆత్మసంస్థం=తన యాత్మయందున్నదానినిగా, కృత్వా = చేసి, కించిత్ అపి = ఆత్మేతరమగు ఇతరవిషయమునుకొంచమైనను, నచింతయేత్ = తలంపకూడదు,

తా॥ సంకల్పమువలన గలుగునట్టి సమస్త విషయములను నిశ్శేషముగా విడిచిపెట్టి,మనస్సుచేతనే యింద్రియసముదాయమును చక్కగా సకల విషయములనుండి నిగ్రహించి, ధైర్యము నవలంబించిన దృఢమైన బుద్ధిచేత మనస్సును ఆత్మయందు నిలిపి మెల్లమెల్లగా ఉపరతిని పొందింపవలయును. అనగా మనస్సును ఆత్మలో

లయ పరచవలెను,అట్లు లయపఱచిన తరువాత ఆత్మతత్త్వముకంటె నితరమైనదానిని కొంచమైనను చింతన చేయకూడదు. నిశ్చింతుడు కావలెను.

వి॥ ఆత్మనిష్ఠుడు ఎట్లున్నతస్థితిని పొందవలసియుండునో, ఆక్రమమిచట నిరూపించబడినది 'శనైశ్శనైః' మెల్లమెల్లగ అనుష్ఠానమును వృద్ధిపరచుకొనవలసినదే గాని, తొందరపడి మొదటనే తీవ్రముగా సాధనచేయకూడదు. చిన్న యగ్నికణమును దూదిలో పెట్టి ఊదుచు, సన్నని పుల్లలచే వెలిగించి క్రమక్రమముగా పెద్ద పెద్ద కట్టెలు వేసి ప్రజ్వలింపజేయునట్లు సాధన యుండవలయును. మొదటనే పెద్ద పెద్ద కట్టెలు వేసినచో మండుచున్న కొద్దినిప్పుకూడఆరిపోవును. అలాగున ప్రారంభములోనే తీవ్రవైరాగ్య మవలంబించి తీవ్రనిష్ఠచేసినచో రోగాదులచే విఘ్నము వాటిల్లును. అప్పుడు పూర్వముండిన అనుష్ఠానము కూడ లేకపోవును. మఱియు మట్టిగోడ పెట్టునప్పుడు కొంచెముగా పెట్టి ఆరిన తరువాత కట్టుచుండిన యెంత యెత్తైనా కట్టుచుండవచ్చును. తొందరపడి కట్టినచో అంతయు పడిపోవును. అదియును వానచినుకులుండిన ఇక చెప్పనక్కరలేదు. అలాగున సంపూర్ణముగా శుద్ధముగాని దేహేంద్రియ మనస్సులు గలవాడైనచో తీవ్రనిష్ఠ పనికిరాదు. మఱియు ఏటవాలుగాను, నున్నగాను పాచిపట్టినదిగాను నుండు బండపై నెక్కునపుడు ఎంతోజాగ్రత్తగ నడువవలసి యుండును. లేనిచో జారిపడిపోదురు. అట్లే ఆత్మశుద్ధియు,మనశ్శుద్ధియు, దేహశుద్ధియు లేనివారు తీవ్రముగ నిష్ఠ సలిపిన ఆహారములు మానిన, ఆహారములో మార్పులు చేసినచో వ్యాధులచేతను, మతిభ్రష్టత్వముచేతను పతితులగుదురు. పాచి యెండి పోయిన మఱల కొంత త్వరగా నడువవచ్చును. అలాగున ధ్యానముచేత దేహేంద్రియ మనస్సులు శుద్ధములైనచో కొంత తీవ్రముగా నిష్ఠ సలుపవచ్చును. అయితే ఏటవాలుగాను నున్నగాను నుండు పర్వతముపై నెక్కునప్పుడు జాగ్రత్తగలిగియే యుండవలెను.అలాగున ధ్యాననిష్ఠలో నెల్లప్పుడును మెలకువ గలిగియే యుండవలెను. మఱియు ఆత్మజ్ఞానజ్యోతి లైటు వంటిది దానిని మితముగ వెలిగించిన యెంత సేపైనను వెలుగుచుండును. ప్రకాశమెక్కువ కావలయునని తలంచి వత్తి నెక్కువ చేసిన పొగపట్టి పోవుటయేగాక చిమ్నీగూడ పగిలిపోవును. ధ్యానయోగముకూడ నిట్టిదే. పరిమితి దాటి యనుష్ఠించువారికి అయ్యది మిక్కిలి అపాయమును గలుగజేయును. కావుననే యోగశాస్త్రమం దిటుల జెప్పబడినది.

"ప్రాణాయామాదియుక్తేన సర్వరోగక్షయో భవేత్ ।
యుక్తాభ్యాసేన యోగేన సర్వసిద్ధిసముద్భవః ।
అయుక్తాభ్యాసయోగేన సర్వరోగసముద్భవః"॥

**తా॥** ప్రాణాయామములచేత సమస్తరోగములు నశించుచున్నవి మితముగా చేయు సాధనవలన యోగము సిద్దించును. మితిమీరిజేసిన యోగసాధన వలన ననేక రోగములు గలుగును.యోగసిద్ధికి ముందుగా రోగసిద్ధియే గల్గునని భావము.

శ్లో॥ యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్।
తత స్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥ 26

పద॥ **యతః** - యతః - నిశ్చరతి - మనః - చంచలం -అస్థిరం
**తతః - తతః** - నియమ్య - ఏతత్ - **ఆత్మని** - ఏవ - వశం - నయేత్.

ప్రతి॥ చంచలం = చపలమైనదియు, అస్థిరం = నిలకడ లేనిదియునైన, మనః= మనస్సు, యతః యతః=ఎచ్చటెచ్చట, నిశ్చరతి = సంచరించుచుండునో, **తతః తతః** = **అచ్చటచ్చటనుండి**,ఏతత్ =ఈ మనస్సును,నియమ్య= మరలించి, **ఆత్మని** ఏవ = తన ఆత్మయందే, వశం = అధీనమును, నయేత్= పొందింపవలయును.

**తా॥** అధికముగా చపలమైనది గనుకనే స్థిరముగా నుండని మనస్సు ఏయే విషయములమీదికి బోవుచుండునో, ఆ యా విషయములనుండి దానిని మరల్చి తన యాత్మస్వరూపమునందు నిలిచి యుండుదానినిగా చేయవలయును.

**వి॥** ఇచట మనస్సును తన యాత్మయందే నిలిపేలాగున శ్రీ భగవంతునిచే తెలుపడమైనది. అట్లుగాక యితర దైవములపై నిలుపమని చెప్పుటలేదు. ఏది యెచ్చట నుండి పుట్టునో అది అచటనే లయమగును. మనస్సు ఆత్మనుండి పుట్టినదగుటచే దానిని ఆత్మలో నిలుపమని ఉపదేశించడమైనది. అట్లైన మాత్రమే శాంతియు, ఆనందమును గలుగును. మనస్సును నిలుపుటకు మూడు ఉపాయములు గలవు వాటిలో మొదటిది, శ్రీకృష్ణుడు పై శ్లోకములో ఉపదేశించిన మార్గమే సర్వజనులకు సులభమైనది. రెండవమార్గము - మనస్సు దేని దేనిపై పోవుచుండునో ఆయా దాని యందుగల సుఖదుఃఖములను విమర్శించి

అచ్చటనుండి మనస్సును మరలించు కొనుట, ఇయ్యదిసామాన్యమైనదికాదు. నిత్యానిత్యవస్తు వివేక జ్ఞానము గలవానికే ఇది సాధ్యమగును. మూడవది - మనస్సనునది ఒకటిలేదు; అది సంకల్పమాత్రము. బ్రహ్మమున కన్యముగా తృణమంతైన నేదియు లేదని భావన గలిగియుండుట. ఇది మననము దాటి నిది ధ్యాసములో లేక యోగసమాధిలో నుండు బ్రహ్మనిష్ఠునకు మాత్రమే సాధ్యమగును. కాని కట్టకడకు అందఱును అచ్చోటికి రావలసియుందురు. అవిద్య యుండు వఱకే మనస్సుండును. అది నశించిన మనస్సనునది ఒకటి యుండదు.

శ్లో॥ ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥ 27

పద॥ ప్రశాంతమనసం - హి - ఏనం - యోగినం - సుఖం - ఉత్తమం,
ఉపైతి - శాంతరజసం - బ్రహ్మభూతం - అకల్మషమ్.

ప్రతి॥ ప్రశాంతమనసం=మిక్కిలిశాంతినొందినమనస్సుగలవాడును,శాంతరజసం= శమించిన రజోగుణము గలవాడును, అకల్మషం = పాపరహితుడును, (తమోగుణము సంపూర్ణముగ నశించినవాడును), బ్రహ్మభూతం =బ్రహ్మస్వరూపుడును నగు, ఏనం = ఈ, యోగినం = యోగిని, ఉత్తమం = ఉత్కృష్టమైన, సుఖం = బ్రహ్మానందము, ఉపైతి హి=స్వయముగా వచ్చి చేరుచున్నది.

తా॥ మిక్కిలి శాంతినొందిన మనస్సుగలవాడును, శమించిన రజోగుణము గలిగినవాడును, పాపరహితుడును, తమోగుణము సంపూర్ణముగా నశించినవాడును, బ్రహ్మస్వరూపుడును అనగా జీవన్ముక్తుడును, నగు ఈ ధ్యాననిష్ఠుని ఉత్కృష్టమైన బ్రహ్మానందము స్వయముగా నిచ్చటనే వచ్చి చేరుచున్నది. "హి" యని ప్రయోగించుటచే ఈ దేహముతో నున్నప్పుడు ఈ లోకమునందే అట్టి సుఖము కలుగుచున్నదని భావము.

వి॥ ముక్తి కాంత యెవరిని వరించునో యిచ్చట తెలుపడమైనది. శ్రీమంతుడై శ్రేష్ఠుడై సర్వ విధములగు మంచిలక్షణములు గలవానిని రాజకుటుంబమువారు పిలిచి రాజకన్య నిచ్చుచుందురు. హీన జాతిలో పుట్టి, రోగగ్రస్తుడై, ధనహీనుడైనవాడు రాజకన్య కావలెనని యెంత కోరినను లభించునా? అలాగున బ్రహ్మ

భూతుడై యీ శ్లోకములో చెప్పిన గుణములు గలవానిని ముక్తికాంత లేక పరమశాంతి లేక మోక్షము స్వయముగానే వచ్చి వరించును. అట్లుగానివాడగు విజ్ఞానహీనుడు,దుర్గుణ భూయిష్ఠుడు వైరాగ్యరహితుడు మోక్షము కావలెనని యెంతకోరినను లభించదు.

శ్లో॥ యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ విగత కల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యంతం సుఖమశ్నుతే ॥ 28

పద॥ యుంజన్ - ఏవం - సదా - ఆత్మానం - యోగీ - విగతకల్మషః,
సుఖేన - బ్రహ్మసంస్పర్శం - అత్యంతం - సుఖం - అశ్నుతే.

ప్రతి॥ ఏవం = ఈ ప్రకారము, యోగీ = యోగధ్యానపరుడు, ఆత్మానం=తనమనస్సును, సదా = ఎల్లప్పుడు, యుంజన్ = ఐక్యపరచుచు, విగతకల్మషః = కల్మషరహితుడై, బ్రహ్మసంస్పర్శం = బ్రహ్మానుభవరూపమైనట్టి, అత్యంతం సుఖం = మిక్కిలి యానందమును, సుఖేన=సులభముగా, అశ్నుతే = అనుభవించుచున్నాడు.

తా॥ ఇదివఱకుచెప్పబడిన విధముగ సర్వకాలములయందును మనస్సును ఆత్మయం దనుసంధానము చేయుచున్నవాడును, పాపరహితుడు నయిన ధ్యానయోగి అనాయాసముగా బ్రహ్మసాక్షాత్కారరూపమును సర్వోత్తమమును అయిన సుఖమును పొందుచున్నాడు.

వి॥ "సుఖేన" అని ప్రయోగింపబడుటచే పైజెప్పబడిన గుణములు గలవాడు అనాయాసముగా బ్రహ్మానందమునుపొందును.అట్టి గుణములు లేనివాడు ప్రయాసపడినను ఆ నిరతిశయసుఖమతనికి లభించదని దెలియవలెను.

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29

పద॥ సర్వభూతస్థం - ఆత్మానం - సర్వభూతాని - చ - ఆత్మని.
ఈక్షతే - యోగయుక్తాత్మా - సర్వత్ర - సమదర్శనః

ప్రతి॥ యోగయుక్తాత్మా =యోగముతో గూడుకొనిన మనస్సుగలవాడు.సర్వత్ర= సమస్త జంతువులయందును, సమదర్శనః = సమభావముగలవాడై, ఆత్మానం=తనను, సర్వభూతస్థం = సమస్త భూతములయందున్న వానినిగాను, సర్వ భూతాని = సమస్తభూతములను, ఆత్మని చ=తనయందున్న వానినిగాను, ఈక్షతే = చూచుచున్నాడు.

తా॥ యోగముతో గూడుకొనిన మనస్సుగలవాడు సమస్త జంతువులయందు సమభావముగలవాడై, తనను సమస్త భూతముల యందున్నవానినిగాను, సమస్తభూతములు తనయందున్న వానిని గాను చూచుచున్నాడు.

వి॥ ఈ శ్లోకమునకె నించుమించుగా నిదేరీతిగా కైవల్యోపనిషత్తునందును గలదు. ఇది బ్రహ్మసాక్షాత్కారము గలవాని స్థితిని గురించి తెలుపుచున్నది.

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ 30

పద॥ యః - మాం - పశ్యతి - సర్వత్ర - సర్వం - చ - మయి - పశ్యతి,
తస్య - అహం - న - ప్రణశ్యామి - సః - చ -మే - న - ప్రణశ్యతి.

ప్రతి॥ యః=ఎవడు, సర్వత్ర = చరాచరప్రపంచమందంతటను, మాం = నన్ను, పశ్యతి = చూచుచున్నాడో, సర్వం = సమస్త ప్రపంచమును, మయి చ = నాయందును, పశ్యతి = చూచుచున్నాడో, తస్య=వానికి, అహం = నేను, న ప్రణశ్యామి = కనబడకపోను, సః చ = వాడును, మే = నాకు, న ప్రణశ్యతి = కనబడకపోడు.

తా॥ ఏ పురుషుడు సకల భూతములయందు నన్ను జూచుచున్నాడో, సకలభూతసముదాయమును నాయందు జూచుచున్నాడో, అట్టి వానికిని నాకును భేదము లేదు. కనుక వానికి నేను కనబడకపోను, నాకు వాడు కనబడకపోడు.

వి॥ అన్నిటిలోను ఎవడు దైవమును జూచునో, అట్టి దైవ మెల్లప్పుడును వీనిని చూచుచుండును, ఇదిన్ని ఉపనిషద్వాక్యమే.

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ 31

పద॥ సర్వభూతస్థితం - యః - మాం - భజతి - ఏకత్వం - ఆస్థితః=
సర్వథా - వర్తమానః - అపి - సః - యోగీ - మయి - వర్తతే.

ప్రతి॥ సర్వభూతస్థితం = సమస్తభూతాంతరాత్ముడనగు, మాం = నన్ను, యః = ఎవడు,ఏకత్వం ఆస్థితః-అభేదబుద్ధిగలవాడై, ఒకే ఆత్మగా తెలిసినవాడై,

భజతి = భజించుచున్నాడో, సః యోగీ = అట్టి ఆత్మధ్యానయోగి, సర్వథా వర్తమానః అపి = సర్వవిధముల వర్తించుచున్నవాడైనను, మయి = నాయందు, వర్తతే = ఉండువాడగుచున్నాడు.

తా॥ సర్వభూతాంత రాత్ముడనగు నన్నేకు ఏకాత్మజ్ఞానము గలవాడై సేవించుచున్నాడో (ధ్యానించుచున్నాడో) అట్టి ధ్యానయోగి యెల్లప్పుడును లోకహితకర్మల చేయుచుండినను ఏ మార్గమునందున్నను, నాయందుండువాడే యగుచున్నాడు.

వి॥ ఆత్మజ్ఞాని పరమాత్మను తనను ఏకముగానే చూచుచుండును. అట్టివాడెల్లప్పుడును లోకహితార్థకార్యముల చేయుచుండినను,ఏమియుచేయకయుండినను సదా నాయందే యుంటున్నాడు. అట్టివానికి మోక్షవిషయమై యెట్టి యవరోధము గలుగదు.

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున! ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥ 32

పద॥ ఆత్మౌపమ్యేన - సర్వత్ర - సమం - పశ్యతి - యః - అర్జున! ,
సుఖం - వా - యది - వా - దుఃఖం - సః - యోగీ - పరమః - మతః.

ప్రతి॥ హే అర్జున ! = ఓ యర్జునా!, యః = ఎవడు, సర్వత్ర = సమస్తజీవుల యందలి, సుఖం వా = సుఖమునుగాని, దుఃఖం వా = దుఃఖమునుగాని, ఆత్మౌపమ్యేన=ఆత్మసాదృశ్యముతో (తనవంటివే తక్కిన జీవాత్మలనెడు భావముతో), సమం=తన సుఖదుఃఖములతో సమముగా, పశ్యతి=చూచుచున్నాడో, సః యోగీ=అట్టి ధ్యానయోగి,పరమః=యోగులలో శ్రేష్ఠుడని, మతః = భావింపబడుచున్నాడు (ఇట్లని నా మతము.)

తా॥ ఓ యర్జునా! ఏ యోగి సుఖము తన కేవిధముగా అనుకూలమైయుండునో అటులనే సకలభూతములకు సుఖము అనుకూలమైయుండుననియును, దుఃఖము తనకు ప్రతికూలమైయున్న విధముగానే సకల భూతములకు దుఃఖము ప్రతికూలమై యుండుననియును తలంచి ప్రవర్తించుచున్నాడో, అట్టి యోగి యోగులందఱిలోను శ్రేష్ఠుడని నా యభిమతము.

వి॥ 29, 30, 31, 32 ఈనాల్గు శ్లోకములును ఉపనిషద్భాగములు. ఇచట బ్రహ్మాత్మానుభవముగల లేక ఆత్మ సాక్షాత్కారజ్ఞానముగల యోగిని గుఱించి తెలుపడమైనది. కట్టకడకు వాడు తన సుఖదుఃఖములవలె నితర ప్రాణుల సుఖదుఃఖములను కూడ చూచువాడగుటచే యోగులలో శ్రేష్ఠుడనియు భగవంతునికి సమ్మతమైనవాడనియు తెలుపుటకు కారణమైనది. అఖండార్థము:- గీత అ. 6 లో 29, 30 31, 32 ఈశ్లోకములు అఖండార్థమును బోధించు నవి ఇదివరలో,

శ్లో॥ యదా విनियतం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।
నిఃస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥ అ.6. శ్లో॥18

తా॥ లెస్సగా నియమింపబడిన మనస్సు ఎప్పుడు ఆత్మయందే నిల్చి యుండునో అప్పుడు వాడు సమస్తవాంఛలనుండి విడివడినవాడై. యోగసిద్ధిని బొందినవాడని చెప్పబడుచున్నాడు. "ఆత్మన్యేవావతిష్ఠతే" అని చెప్పుటచే వ్యష్టికి సాక్షియగు యాత్మ యందు నిలకడ గలవాడని నిరూపించడమైనది· అదేప్రకారము "యత్రోపరమతే చిత్తం" 20-వశ్లోకము "యతో యతో నిశ్చరతి"26వ శ్లోకము మొదలుగా గలశ్లోకములన్నియు వ్యష్టిసాక్షిత్వస్థితిని చెప్పుచు వచ్చినవి యోగశాస్త్రము అంతవఱకే తెలుపును. యోగశాస్త్రప్రకారము జీవేశ్వరుల ఐక్యము లేక జీవేశ్వరుల యేకత్వము సిద్ధింపదు. జీవుడు అన్నిబంధములనుండి విముక్తిని బొంది స్వస్వరూపమగు నిజానందమున నుండుటయే మోక్షమని యోగశాస్త్రము దెలుపును. జ్ఞానశాస్త్రము జీవేశ్వరుల ఐక్యము (ఏకత్వమును)ను బోధించుచుండును. ఇచట వ్యష్టికి సాక్షిత్వము భావించుచు లేక యనుష్ఠించుచు రాగా రాగా సమష్టికి సాక్షిత్వము జీవేశ్వరుల యేకత్వము గలుగునని నిరూపించడమైనది. ఇట్టి ఖండార్థములో నిష్ఠ బాగుగ కుదిరినచో ఉపాధులు దొలగు నప్పుడు అఖండాకారమై మారుచుండునని దీనివలన యర్థమగుచున్నది. జీవుని యొక్క యవిద్యోపాధి తొలగునప్పుడు వ్యష్టికి సాక్షిత్వమును ఈశ్వరుని యొక్క మాయోపాధి వదలిపోవునప్పుడు సమష్టికి సాక్షిత్వమున్ను గలుగునులేక ఉపాధిద్వయము విలయమొందగా "ఏకమేవాద్వితీయం" అను వేదాంతప్రతిపాదకమగు ఒకే సద్వస్తువు బ్రహ్మము మాత్రమే యగునని పై జెప్పిన నాలుగు శ్లోకములవల్ల బోధపడుచున్నది. నది నిలకడలేక ప్రవహించి పోగా పోగా సముద్రముయొక్క కట్ట దాటునప్పుడెలాగున అఖండాకారమై సముద్రమయముగా మారుచుండునో, అలాగున ధ్యానానుష్ఠానములు ఎడతెగక అనుష్ఠించు

వాడుగూడ ఉపాధిద్వయములను భేదించినవాడై యఖండాకారమును బొందు చుండును. కట్టదాటువఱకు మాత్రమే నదియొక్క వ్యక్తములగు నామరూపము లుండును.కట్టను దాటిన తరువాత నామరూపములు విలయములై అవ్యక్తమగు సముద్రముగా పరిణామమొందునట్లు, యోగియొక్క యనుభవమును అనం తాత్మయై మారుచుండును. శ్రీకృష్ణభగవానుడు వ్యష్టి సాక్షిత్వ జీవత్వమును జెప్పుచు రాగారాగా అదియే అనంతాకారముగా మారిపోయెను. ఒకడు ఆధ్యాత్మిక జ్ఞానవిషయమై చిన్నగ (నెమ్మదిగ) నుపన్యసింప ప్రారంభింపగ క్రమక్రమముగ నదే యనంతాకారమై మారుచుండును. ఈ ధర్మమే క్రిందనిరూపింపబడు నాలుగు శ్లోకములవలన గోచరమగుచున్నది.

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29

" యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మేన ప్రణశ్యతి॥ 30

" సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ 31

" ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున! ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥ 32

అర్జున ఉవాచ:—

శ్లో॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూధన ! ।
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥ 33

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ ! నీ చేత జీవాత్మ పరమాత్మల ఏకత్వరూపమగు నే ఆత్మయోగము జెప్పబడునో, దానిని నేను దెలిసికొన జాలకున్నాను. ఏలన మనస్సు చంచలమైనదగుటచే దీనియొక్క స్థిరమైన నిలకడను నెఱుంగజాలను.

అర్జునుడు ఈ ప్రశ్న జేయకపోయినచో, ఇట్టి ఆత్మజ్ఞానామృత ప్రవాహ రూపములగు శ్లోకముల శ్రీకృష్ణభగవానుడు ఇంకెన్నిటినో చెప్పియుండవచ్చును అట్టి భాగ్యము ముముక్షువులకును భక్తులకును లేకపోయెను. ఒకడు అఖండమై అనంతమై అగాధమైయుండు భావములను బోధించునప్పుడు మఱియొకడు వెంటనే లేచి మీరు జెప్పినది నా కర్థము గావడములేదని జెప్పుట యెటువం టిదో. యర్జునుని ప్రశ్నయును అలాగుననే యుంటున్నది. అర్జును డూరక

యుండినను ఎంతో మేలుగా నుండును. ఇట్లనేకు లనేకవిధములుగా జెప్పు చుందురు. ఈ విషయమై యోగశాస్త్రమున దెలిపినది జూడుడు.

"శుద్ధేచేతసి తస్యైవ స్వాత్మజ్ఞానం ప్రకాశతే ।
తస్మాద్ధ్యానం భవేద్యోగాజ్జన్మనైకేనపద్మజ!"

తా॥ ఓ బ్రహ్మదేవా ! అనుష్ఠానము జేయుచు రాగారాగా మనస్సు శుద్ధ మగు నప్పుడు అట్టి సాధకునకు స్వయముగానే యాత్మజ్ఞానము ప్రకాశించును. అట్టి యోగసాధనవలన కలిగెడు జ్ఞానము అ జన్మలోనే ముక్తిని గలుగజేయును అర్జునుని మనస్సు ఏ కారణము వల్ల భగవంతు డుపదేశించిన యఖండార్థమును దెలిసికొనక పోయినదనగా "చంచలత్వాత్స్థితింస్థిరామ్" మనస్సుయొక్క చల నత్వముడుగనందు వల్ల దెలిసికొనకపోయినదని తానే సత్యమును జెప్పెను. తనకనుభవము లేనిదానిని జెప్పినచో, ఉన్న యనుభవము అంతర్ధానమగుటయే గాక రానున్న యనుభవము కూడ రాకనేపోవునని ఆమహాపురుషుడగు అర్జును నకు దెలియును. అంతియేగాక 'నానృతాత్పాతకం పరం' అనగా అసత్యమునకు మించిన పాతకములేదని యెఱింగినవాడగుటచేతనే యున్నదున్నట్లు జెప్పుటకు గారణమైనది. ఇప్పుడుండు శిష్యులలో కొందఱు మహావాక్యమును గూర్చి గురు దేవుడు బోధించునప్పుడు తమకవగాహనము గాకపోయినను తెలిసినవారివలె శిరఃకంపనము జేసి పిదప ప్రకృతిగుణములకు లోబడి పాపమును బొందు చున్నారు.అట్టిపాతకమునకు యర్జునుండొడబడలేదు. అర్జునుడు తనలో బాగుగా నాలోచించుకొనియే ప్రశ్న వేయుటకు గారణమైనది. తనకే అవగాహనము గాన ప్పుడు ఇక సామాన్యమనుష్యులకు మనోబుద్ధ్యతీతమగు ఈ బ్రహ్మ భావము గలుగునా యని ఆలోచించియే జెప్పెను. మఱియు అసత్యభాషణము అసుర స్వభావమని అర్జునుడు తెలిసికొనియుండుటచేతనే యున్నదున్నట్లు దెలుపుటకు గారణమైనది. అర్జును డసురగుణము గలవాడుగాడు; దేవగుణము గలవాడు. కావుననే సత్యము జెప్పుటకు గారణమైనది. మఱియు ఆత్మసంయమము లేని వానికి అనగా సర్వేంద్రియనిగ్రహములేనివానికి యోగప్రాప్తి గలుగదని అర్జును డెరిగినవాడగుటచేత అట్లు వచించెను. ఒకవేళ సమ్ముఖమున గురుశిష్య ప్రశ్నో త్తరమార్గము జెప్పక పోయినను గురు శిష్యసంవాదరూపముగా గ్రంథకర్తలు నిర్మాణమునందు రాబోవు శిష్యప్రశ్నకు తగిన భావమును పురస్కరించి గురు లైనవారు జెప్పుటగూడ గలదు. ఆలాగున యఖండార్థమును బోధించినచో దానిని గ్రహించుటకు శిష్యునికి మనఃపరి పక్వతగూడ యుండవలయునని భగ

వానుడాలోచించియు, అర్జునుడే దానికి సమాధానము జెప్పిన బాగుండునని తలంచియు, ఇట్లగుచో లోకహితార్థముగా నుండునని భావించుటయే యీ యఖండభావము బోధించుటకు గారణమైనది. ఏ అధ్యాత్మిక గ్రంథమందైనను ఆత్మయొక్క అనంతత్వము, దైవత్వము, ఏకత్వము జెప్పకపోయిన ఆ గ్రంథమును అచేతనముగాను, జడముగాను,మహాత్ములు తలంచెదరని యూహించియే శ్రీ కృష్ణభగవానుడు పరబ్రహ్మతత్వము యొక్క స్వరూపమును, అట్లే బ్రహ్మాత్మ భావముగల యాత్మజ్ఞానియొక్క స్థితిని గుఱించియు దీనియందు నిరూపించెను. ఇట్టి మహాపరిశుద్ధ్యము వర్తమాన కాలములో బాలమందికి గలుగకపోవుట చేతనే పూర్వీక ఋషులు యోగులు బొందిన స్థితిని బొందకపోవుటకు గారణమని గ్రహించుకొనవలయును. కావుననే కఠోపనిషత్తున నీలాగున దెలుపుటకు గారణమైనది

మూ॥ నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః ।
నాశాన్తమానసో వాఽపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥

తా॥ దుశ్చేష్టలనుండి విరమింపనివాడు ఈ యాత్మను బొందజాలడు. ఇంద్రియ చాపల్యము గలవాడీయాత్మను బొందజాలడు. ఏకాగ్రచిత్తము లేని వాడీయాత్మను బొందజాలడు. మనోనిర్మలత్వమును, శాంతియు (ఉపరతి) బొందనివాడీయాత్మను బొందజాలడు. బ్రహ్మవిజ్ఞానముచేతనే యీ యాత్మను పొందనగును.

మూ॥ పరాఞ్చిఖాని వ్యతృణత్స్వయం భూస్తస్మాత్పరాఙ్పశ్యతినాన్తరాత్మన్।
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్ ॥

తా॥ పరమేశ్వరుడు ఇంద్రియములను బహిర్వృత్తిగలవానినిగా సృష్టించెను. అందువలన నా యింద్రియములు శబ్దాదివిషయజాతమునే గాంచుచున్నవి; అంతరాత్మను చూచుటలేదు. వైరాగ్యబోధోపరతుల బొందిన యొకానొక యంతఃకరణ శుద్ధిగల ధీరుడు మోక్షమును గోరుచున్నవాడై మరలింపబడిన యింద్రియ సమూహముగలవాడై పరమాత్మను జూచుచున్నాడు. ఒక యద్దమును బహిర్ముఖముగా త్రిప్పిన దృశ్యమంతయు దానియందు కనబడునే గాని తన స్వరూపమేలాగున గనిపించదో, అలాగున మనస్సు బహిర్ముఖముగ నుండు వరకు తనలోనుండు పరమాత్మను జూడజాలడు.దర్పణమును తనవైపు త్రిప్పునప్పుడు దృశ్యము దానియందు ప్రతిబింబించక తన స్వరూపము మాత్ర

మేలాగున స్పష్టముగా గనిపించునో, ఆలాగున బహిర్దృష్టియొక్కయు. అంతర్దృష్టియొక్కయు స్థితి యుండునని గ్రహించునది.

మూ॥ ఏష సర్వేషు భూతేషు గూఢోఽత్మా న ప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥

తా॥ ఈ యాత్మ సర్వభూతములయందు నిగూఢముగా నున్నందున కనబడక యున్నది. గాని సూక్ష్మదర్శులగు జ్ఞానుల సూక్ష్మైకాగ్రబుద్ధిచే నయ్యది గనబడు చున్నది. ఇట్టి చిత్తైకాగ్రతయు, చిత్తశుద్ధియు, ఇంద్రియాతీత ప్రత్యగాత్మయందు నిలకడయు గలవారికే బ్రహ్మతత్త్వము బోధపడునని యుద్దేశించియే కృష్ణభగవానుడా నాలుగు శ్లోకముల నుపదేశించుటకు గారణమైనది. అయితే అర్జునుడుజేసిన ప్రశ్నసరిగానున్నదని శ్రీ కృష్ణభగవాను డంగీకరించెనేగాని యిది మందబుద్ధి యొక్క ప్రశ్నయనిగాని అయోగ్యతను నిరూపించుచున్నదనిగాని చెప్పక ఈక్రింది విధముగ భగవానుడు దెలిపెను. ఎప్పుడును పృచ్ఛకుని మనస్సు నుత్సాహ భరితము చేయవలసినదేగాని నిరుత్సాహ పఱచరాదు. అట్టి ధర్మ మిచట కనుపరచడమైనది.

శ్రీ భగవానువాచ;-

శ్లో॥ అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే ॥

తా॥ ఓ యర్జునా! మనస్సు నిగ్రహింప శక్యముగానిది: మిగుల చపలమైనది యను విషయమున సందేహములేదు. అది నిజమే. అయినను అట్టి మనస్సును అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను నిగ్రహించుకొనవచ్చును. దీనియందు మనోనిరోధము ప్రయాసమైనదని నిరూపించి యభ్యాసవైరాగ్యములు గలవానికి సాధ్యమైన దనియు దెలుపుటచే అభ్యాసవైరాగ్యములు గలవారు తప్పక ఆ బ్రహ్మపదమును బొందగలరని తన యాశయమును భగవానుడు తెలిపెను. ఇపుడెవరైన బ్రహ్మభావమందు మనస్సు నిలకడ లేదనిగాని, సంకల్పము నశించలేదనిగాని చెప్పువారుండిన వారు అభ్యాస వైరాగ్యములు తమకు పూర్తిగ లేవని తెలిసికొనవలయును. శ్రీ పతంజలి మహర్షియు నీలాగుననే యోగదర్శనము నందు దెలిపిరి.

సూ॥ అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః ॥

తా॥ అభ్యాసవైరాగ్యములచే మనోనిగ్రహము గలుగును. అని

అర్జున ఉవాచ:—అర్జునుడు చెప్పెను.

శ్లో॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన।
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్॥ 33

పద॥ యః - అయం - యోగః - త్వయా - ప్రోక్తః - సామ్యేన - మధుసూదన !-ఏతస్య - అహం - న - పశ్యామి-చంచలత్వాత్-స్థితిం-స్థిరామ్.

ప్రతి॥ హే మధుసూదన ! = ఓ శ్రీకృష్ణమూర్తీ ! త్వయా = నీచేత, సామ్యేన= జీవాత్మ పరమాత్మల ఏకత్వముచేత, యః=ఏ, అయం= ఈ, యోగః = యోగము, ప్రోక్తః = చెప్పబడినదో, ఏతస్య = ఈ యోగముయొక్క, స్థిరాం = స్థిరమైన, స్థితిం = నిలకడను, చంచలత్వాత్ = మనస్సు చపలమైనదగుట వలన, అహం = నేను, న పశ్యామి = తెలిసికొనజాలకున్నాను,

తా॥ శ్రీకృష్ణమూర్తీ! నీచేత జీవాత్మ పరమాత్మల ఏకత్వమనెడు ఏయోగము చెప్పబడినదో, ఆ యోగముయొక్క స్థిరమైన నిలకడను,మనస్సు చంచలమైనదగుట వల్ల నేను ఎఱుంగజాలకున్నాను.

వి॥ పైనాల్గు శ్లోకములలో శ్రీకృష్ణ డుపదేశించినదే నిజమైన బ్రహ్మ సాక్షాత్కారజ్ఞానమగు యోగమగును. అది చాల ప్రయాసమగుటచే నర్జునుని బుద్ధికిగూడ అవగాహనముగాలేదు. దీనివలన ఇంద్రియముల నిగ్రహము, ప్రాణ సంయమనము, మనోలయము చేసికొని తాను గొప్పయోగినని తలంచవలదని గ్రహించుట కొఱకిట్లు తెలుపడమైనది. ఇట్లే ఏదో కొంత పరప్రాణుల కుప కారము చేయుటచేతను తాను గొప్ప నిష్కామ కర్మయోగినని తలంచవలదని గ్రహించేది, అయితే ఇంద్రియ నిగ్రహ, ప్రాణాయామ, మనోలయాదులు ఈ యాత్మయోగమును పొందుటలో గల ఆటంకములను తొలగించును. పైన చెప్పిన నాల్గు శ్లోకముల యతీత భావము అర్జునునకు అవగాహనమై యుండినచో ఇంకను అలాటి భావమును గూర్చి శ్రీకృష్ణభగవానుడు ఎంతయో చెప్పియుండును, అట్టి భాగ్యములోకమునకు లేకపోయెను. మనోనిశ్చ లతలేనందుచే మనోబుద్ధీంద్రియముల కతీతమగు భావము అవగాహనము గాలేదని చెప్పిన వెంటనే శ్రీభగవంతుడు క్రిందికిదిగి మనోనిశ్చలతకొరకు మరల ఉపదేశించెను. ఇంద్రియాతీతమగు బ్రహ్మమునుగూర్చి విచారణచేయు వారికి ఇట్టి మనోనిశ్చలత్వము ఉన్నదా లేదా యని బాగుగా యోచించుకొన

వలెను. అర్జునుడు తనయొక్క స్థితిని ఉన్నదున్నట్లు సత్యముగ చెప్పెను. ఇప్పుడు లోకములో చాలమంది తమకు అవగాహనముగాని యతీతవిషయ మునుగూడ చెప్పుచు అనుభవమున్నట్లు నటింతురు. అట్లు చేయవలదని యీ పరమ సత్యము తెలుపుచున్నది. అట్లు చేసినచో ఆత్మ వంచనయే యగును.

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ ! ప్రమాథి బలవద్దృఢమ్ ।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥ 34

పద॥ చంచలం - హి - మనః - కృష్ణ! - ప్రమాథి - బలవత్ - దృఢం.
తస్య - అహం - నిగ్రహం - మన్యే - వాయోః - ఇవ - సుదుష్కరమ్

ప్రతి॥ హే కృష్ణ!= ఓకృష్ణమూర్తీ! హి = ఏ కారణమువలన, మనః = మనస్సు చంచలం = చంచలస్వభావముగలదో మఱియు, ప్రమాథి=దేహేంద్రియ ములను అధికముగా క్షోభపెట్టునదో, మఱియు, బలవత్ = మిక్కిలిబల వత్తరమైనదో, నియమింప ప్రయాసమైనదో, మఱియు, దృఢం= విష యములలో దృఢాసక్తమైయున్నదో, అందువలన, అహం= = నేను, తస్య = ఆ మనస్సుయొక్క, నిగ్రహం=నిరోధమును, వాయోః=వాయు వుయొక్క, నిగ్రహం ఇవ = నిరోధమువలె, సుదుష్కరం = మిగుల ప్రయాసమైనదానినిగా, మన్యే =తలంచుచున్నాను,

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! మనస్సు మిక్కిలి చపలస్వభావము గలది; దేహేంద్రియములను అధికముగా క్షోభపెట్టునది; మఱియు ఎవనిచేతను నిరోధింప సాధ్యముకానిది. కావున అట్టి మనస్సును నిగ్రహించుట వాయువును నిరోధించుట ఎట్లు శక్యముకాదో, ఆలా గున శక్యముగాదని నేను తలంచుచున్నాను.

వి॥ మనస్సు కోతివంటిది. అట్టికోతి కల్లుత్రాగిన ఎట్లుండునో, అంతే గాక తేలుగూడ కుట్టిన ఎట్లుండునో, అదియుగాక దయ్యముగూడ పట్టిన ఎట్లుండునో అట్లే, మనస్సుగూడ కోతియొక్క స్వభావముగలది. అయితే అట్టి కోతికి ఇంజక్షన్ ఇచ్చిన యే లాగున చలనములేక పడియుండునో, మఱియు పిచ్చివానివలె బహుచాపల్యముగల మనుష్యునికి ఇంజక్షన్ వేసిన ఎట్లు చపల ముడిగియుండునో, ఆలాగున మదమనెడు మద్యముచేతను, అసూయ అనెడు **తేలుకాటుచేతను, అహం కారమనెడు దయ్యముచేతనుకూడిన యీ మనస్సుకు బ్రహ్మధ్యానము లేక భగవత్చింతన యను ఇంజక్షన్ యిచ్చినచో అదిశాంతి నొందును.**

"కపిరపి చ కాపిశాయనమదమత్తో వృశ్చికేన సందష్టః ।
అపి చ పిశాచగ్రస్తః కిం బ్రూమస్తస్య వైచిత్ర్యమ్ ॥"

దీని అర్థము పైన జెప్పినదే.

శ్రీభగవానువాచ.— శ్రీభగవంతుడు చెప్పెను.

శ్లో॥ అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే ॥ 35

పద॥ అసంశయం - మహాబాహో! - మనః - దుర్నిగ్రహం - చలం, అభ్యాసేన - తు - కౌంతేయ! - వైరాగ్యేణ - చ గృహ్యతే.

ప్రతి॥ హే మహాబాహో ! = ఓ యర్జునా !, మనః = మనస్సు. చలం = చంచల స్వభావముగలది, దుర్నిగ్రహం=ప్రయాసచే నిగ్రహింపదగినది, అసంశయం=ఈ విషయములో సందేహములేదు. అయినను, అభ్యాసేన తు=అభ్యాసముచేతను, వైరాగ్యేణ చ=వైరాగ్యము చేతను, గృహ్యతే = నిగ్రహింపబడుచున్నది.

తా॥ ఓ అర్జునా! మనస్సు నిగ్రహింప శక్యముగానిది, మిగుల చపలమైనది అనునట్టి విషయమునందు సందేహమేమియు లేదు. అయినను, ఓ కుంతీపుత్రా ! ఆ మనస్సును అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను నిగ్రహింపవచ్చును.

వి॥ మనస్సు చంచలమైనదనియు, నిరోధించుటకు దుష్కరమైనదనియు శ్రీ భగవంతుడు ఒప్పుకొన్నాడు. అయినను జీవన్ముక్తులందరును మనస్సును జయించినవారే. వారెట్లు జయించిరనగా ఆత్మ యందలి అభ్యాసముచేతను విషయములలో గల వైరాగ్యముచేతను నిగ్రహించుకొన్నారు, పైన 29. 30. 31. 32, ఈ నాల్గు శ్లోకములలో తెలుపబడిన ఇంద్రియ నిగ్రహరూపమగు నీ సాధన వల్లనే పొందదగినదని తెలుపుటకు ఈ రెండుశ్లోకములు భగవంతునిచే నుపదేశింప బడినవి, "అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః" అని పతంజలి మహర్షి తెలిపెనుగదా!

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥ 36

పద॥ అసంయతాత్మనా - యోగః - దుష్ప్రాపః - ఇతి - మే - మతిః, వశ్యాత్మనా - తు - యతతా - శక్యః - అవాప్తుం - ఉపాయతః,

పతి॥ యోగః = యోగము. అసంయతాత్మనా = మనోనిగ్రహము లేనివాని చేత. దుష్ప్రాపః = పొందదగినదిగాదు, (కిం) తు = మఱియేమన, యతతా = యత్నించుచున్న, వశ్యాత్మనా=మనోనిగ్రహముగలవానిచేత, ఉపాయతః = అభ్యాసవైరాగ్యములనెడి యుపాయములవలన, అవాప్తుం = పొందుటకు, శక్యః = సాధ్యమైనది. ఇతి = అని, మే=నాయొక్క మతిః = మతము.

తా॥ (అభ్యాసవైరాగ్యములచేత) నిగ్రహింపబడని మనస్సు గలవాడు యోగమును బొంచజాలడు. మాటిమాటికిని ఎడతెగక ప్రయత్నించుచు అభ్యాస వైరాగ్యములతో గూడినమనోనిగ్రహమను నట్టి యుపాయమువలన యోగము పొందనగునని నా యభిప్రాయము.

అర్జున ఉవాచ:— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ! గచ్ఛతి ॥ 37

పద॥ అయతి - శ్రద్ధయా - ఉపేతః - యోగాత్ - చలితమానసః,
అప్రాప్య - యోగసంసిద్ధిం - కాం - గతిం - కృష్ణ ! గచ్ఛతి.

ప్రతి॥ హేకృష్ణ! = ఓకృష్ణమూర్తీ! . శ్రద్ధయా = శ్రద్ధచేత, ఉపేతః = కూడుకొన్నవాడు, అయతిః=నిగ్రహశక్తిలేనివాడగుటచే, యోగాత్ =యోగము నుండి, చలితమానసః= చలింపబడినమనస్సుగలవాడై, యోగసంసిద్ధిం= యోగారూఢత్వమును, (యథార్థజ్ఞానమును) అప్రాప్య = పొందక, కాం గతిం = ఏ గతిని, గచ్ఛతి = పొందుచున్నాడు ?

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ ! శ్రద్ధతో కూడుకొన్న వాడైనను, నిగ్రహశక్తి లేనివాడగుటచే యోగమునందు చలించిన మనస్సుగల వాడు యోగారూఢత్వమును అనగా సమ్యగ్జ్ఞానమును పొందక యే గతిని పొందుచున్నాడు?

వి॥ బ్రహ్మనిష్ఠలో ప్రవేశించి మనోనిగ్రహము లేనివాడై పూర్ణజ్ఞానమును పొందుటకు ముందుగా చనిపోయినచో వానిగతి ఏమగును? **అనగాఫలిత మున్నదా? లేదా?** అని అర్జునుని సంశయము.

శ్లో॥ కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి॥ 38

పద॥ కచ్చిత్ - న - ఉభయ విభ్రష్టః - ఛిన్నాభ్రం - ఇవ - నశ్యతి,
అప్రతిష్ఠః - మహాబాహో! విమూఢః - బ్రహ్మణః - పథి.

ప్రతి॥ హేమహాబాహో! = ఓ కృష్ణమూర్తీ!, బ్రహ్మణః పథి = మోక్షమార్గ మగు యోగమునందు, అప్రతిష్ఠః = స్థిరతలేనివాడగు, విమూఢః = మూఢాత్ముడు, ఉభయవిభ్రష్టః= ఇహపరసౌఖ్యములకు రెండింటికినిచెడిన వాడగును, ఛిన్నాభ్రం ఇవ = చెదరిన మేఘమువలె, న నశ్యతికశ్చిత్= నశింపడాయేమి?

తా॥ ఓ కృష్ణమూర్తీ! మోక్షమార్గమగు యోగమునందు పట్టు దల లేని మూఢాత్ముడు ఇహపరసౌఖ్యముల రెంటికిని చెడినవాడై చెదరిన మేఘమువలె ఫలము నొందక చెడిపోడా యేమి?

వి॥ యోగమునందు ప్రవేశించియు స్థిరతలేక విషయములలో పడిపోయిన వానిని గురించి యిచట అడుగబడినది.

శ్లో॥ ఏతన్మే సంశయం కృష్ణ! ఛేత్తుమర్హస్యశేషతః।
త్వదన్యస్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే॥ 39

పద॥ ఏతత్ - మే - సంశయం - కృష్ణ! - ఛేత్తుం - అర్హసి - అశేషతః,
త్వత్ - అన్యః - సంశయస్య - అస్య - ఛేత్తా - న - హి- ఉపపద్యతే.

ప్రతి॥ హే కృష్ణ! = ఓ కృష్ణమూర్తీ!, మే=నాయొక్క, ఏతత్=ఈ,సంశయం = సందేహమును, అశేషతః = నిశ్శేషముగా, ఛేత్తుం = నివర్తింప చేయుటకు నీవు, అర్హసి = తగుదువు, హి = ఏలయనగా, అస్య = ఈ, సంశయస్య = సందేహమును, ఛేత్తా = ఛేదించువాడు, త్వత్ = నీకంటె అన్యః = మఱి యొకడు, న ఉపపద్యతే = లభింపడు.

తా॥ ఓ శ్రీ కృష్ణమూర్తీ! నీవు నా సందేహమును నిశ్శేషముగా పోగొట్టుటకు తగినవాడవు. నా యీసంశయమును నివర్తించువాడు నీకంటె నితరుడు మఱియెవడును లేడు.

శ్రీ భగవానువాచ:— శ్రీభగవండుతు చెప్పెను.

శ్లో॥ పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే।
న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత! గచ్ఛతి ॥ 40

పద॥ పార్థ! - న - ఏవ - ఇహ - న - అముత్ర - వినాశః - తస్య - విద్యతే
న - హి - కల్యాణకృత్ - క శ్చిత్ - దుర్గతిం - తాత ! - గచ్ఛతి.,

ప్రతి॥ హేపార్థ ! = ఓయర్జునా!, తస్య = అట్టి యోగభ్రష్టునికి, ఇహ = ఈ లోకమందుగాని, అముత్ర = పరలోకమందుగాని, వినాశః = నాశము, న ఏవ విద్యతే = కలుగనే గలుగదు. హి = ఏలయనగా, తాత? = ఓతండ్రి!, కల్యాణకృత్ = మంచిపని చేయువాడు, కశ్చిత్ = ఎవడును, దుర్గతిం = దుర్గతిని, న గచ్ఛతి = పొందడు.

తా॥ ఓ యర్జునా ! యోగభ్రష్టునకు ఈ లోకమునందుగాని, పరలోకమునందుగాని వినాశము లేనేలేదు. ఓ నాయనా ! శుభకర మగు జ్ఞానయోగములో ప్రవేశించినవాని కెవనికిని దుర్గతి గలుగదు.

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగ భ్రష్టోఽభిజాయతే॥ 41

పద॥ ప్రాప్య - పుణ్యకృతాం - లోకాన్ - ఉషిత్వా - శాశ్వతీః - సమాః.
శుచీనాం - శ్రీమతాం - గేహే - యోగభ్రష్టః - అభిజాయతే.

ప్రతి॥ యోగభ్రష్టః = యోగభ్రష్టుడు, పుణ్యకృతాం = పుణ్యము చేసిన వారి యొక్క, లోకాన్ ప్రాప్య = స్వర్గాది లోకములను పొంది (అచట), శాశ్వతీఃసమాః = అనేక సంవత్సములవఱకు, ఉషిత్వా = నివసించి, శుచీనాం=సదాచారవంతులైన, శ్రీమతాం = శ్రీమంతులయొక్క, గేహే = గృహమునందు. అభిజాయతే = పుట్టుచున్నాడు.

తా॥ యోగభ్రష్టుడు అశ్వమేధాది యాగమును చేసినవారు పొందునట్టి పుణ్యలోకములనుపొంది, అక్కడ బహుకాలము స్వర్గ సుఖమనుభవించి, సదాచారము గలవారును, శ్రీమంతులు నయిన వారి యొక్క గృహమునందు పుట్టుచున్నాడు.

వి॥ యోగభ్రష్టులు రెండు విధములైనవారు గలరు. (1) ఒకడు యోగమందు ప్రవేశించి మనోనిగ్రహము జాలక విషయములలోనికి జారిపోయినవాడు. (2)

రెండవవాడు — అనుష్ఠానమును చక్కగా జేయుచు మోక్షపదవి గలుగుటకు ముందుగా ప్రారబ్దవశమున శరీరము పడిపోయినవాడు. అనగా చనిపోయిన వాడు. మొదటి వాడు-విషయవాసన గలవాడగుటచే స్వర్గలోకములోగల సుఖ మను భవించి తరువాత శుచిత్వముగల శ్రీమంతుల గృహములో జన్మించి కొంత కాలమువఱకు విషయ సుఖ మనుభవించి వాసనాక్షయముచే వైరాగ్యముగలిగి పిమ్మట యోగమార్గములో ప్రవేశించును. రెండవవారు—మనోనిగ్రహముగల్గి యోగనిష్ఠలో ప్రవేశించినను, జీవన్ముక్తి గలుగుటకు ముందుగా శరీరము వీడి పోయినచో స్వర్గలోకమునకు పైన ఉండు తపోలోక సత్యలోకములకుబోయి అచట కొంతకాలము ఉండి మఱల శ్రేష్ఠవంశములో పుట్టి చిన్న (బాల్య) కాలమునుండి వైరాగ్యము గలిగి బ్రహ్మ నిష్ఠ చేయుచు, ఆ జన్మములో జీవన్ము క్తుడగును, స్వర్గలోకములో మాత్రమే విషయ వాంఛగల వారికి రంభాది విషయసుఖములు గలుగును, ఇహాముత్రఫలభోగ విరాగముగల విరక్తుడు ఇచ్చ టనే విషయములను విషప్రాయముగా చూచినవాడగుటచే వాడు సనకసనందనాది ఋషులుండెడు తపస్సత్యలోకాదులజేరి అచట నుండును. అయితే పై యుభ యులకును ఏ యాటంకమువలన మొదటి జన్మములో ముక్తి గలుగలేదో, అట్టి ఆటంకములు గలుగని జన్మము గలుగును. కొందఱికి దారిద్ర్యముచేతను, కొందరికి రోగముచేతను, కొందఱికి బుద్ధిమాంద్యముచేతను, కొందఱికి స్వాతంత్ర్యముగల జన్మము లేకపోవుట చేతను, అడ్డుగలిగియుండిన అట్టి దోషము లేవియులేని జన్మము గలుగును, అయితే స్త్రీలలో కొందఱు పురుషుడై పుట్టిన స్వాతంత్ర్యము గలుగుననియు, బ్రాహ్మణేతరులు బ్రాహ్మణుడై పుట్టిన వేదాధ్యయనములో, శాస్త్రపఠనములో అనుకూల్యము ఏర్పడుననియు తలం తురు. అట్లు మాత్రము తలంపకూడదు, ఏలన, అంత్యకాలములో జీవుడు ఏ భావముతో శరీరము వదలిపోవునో, ఆ భావమునే పొందును, బ్రాహ్మ ణేతరులకు వర్తమానకాలమున వేదశాస్త్రముల నధ్యయనము చేయుటలో ఆటంక మేమియులేదు.

పూర్వము మాత్రముండెను. అయినను బ్రాహ్మణేతరులలోనే జన్మించినచో ఇతరులకు గూడ బోధించుటకు అనుకూల ముండును. బ్రాహ్మణేతరులకు గూడ అట్టివానినిజూచి, యితడు మనబోటివాడేగదా, మనమేల అట్టి స్థితికి రాకూడదని ధైర్యము గలుగును, కావున ఒకవేళ జన్మము వచ్చినను, బ్రాహ్మణేతరులలోనే జన్మించవలెనని తలంచవలెను. అలాగుననే స్త్రీలుగూడ భావింపవలెను. ప్రస్తు

తము ఆధ్యాత్మికలోకములో స్త్రీలకు ఏలాటి ఆటంకమున్ను లేదు. జ్ఞానవతులగు స్త్రీలను జూచి 'అబలలమగు మనకు పురుషులవలె జ్ఞానాధికారముగలదా! లేదా! యని నారీమణులకు కొంతమందికి గల సందేహము పోవును. ఏలన ఈ మహిళామణియు మనబోటి మానినీమణులలో చేరినవారుగదా! మనమును ఆలాగున జ్ఞానము నేల పొందగూడదు? అను ధీరత్వము వారికి గలుగును. కావున జన్మము వచ్చినచో స్త్రీలు స్త్రీలుగానే పుట్టవలెనను భావమే యుండవలెను, స్వర్గలోక మొకటిమాత్రము కాదు. కావుననే "లోకాన్" లోకములని బహువచన ప్రయోగము చేయుటకు కారణము. ఊర్ధ్వలోకము లేడింటిలో దేని యందైన నుండవచ్చును. విషయ విరక్తిగల వానికి స్వర్గనరకములు రెండును లేవు. ఏలన; నరకజీవియయినచో అధ్యాత్మజ్ఞాన మందు ప్రవృత్తిగలుగదు. ఇహాముత్ర ఫలభోగ విరక్తిగలవాడగుటచే స్వర్గము నిచ్ఛగింపడు. కావున, అతడు త్వరలోనే జన్మమునకు వచ్చును. సామాన్యముగా పదిమాసములే ఆలస్యము ఉన్నత పరీక్షలో నుత్తీర్ణుడైనవాడు ఉద్యోగము చేయవలెనని నిర్బంధములేదు· కారాగృహప్రవేశ మిష్టము లేనప్పటికిని చోరత్వము మొదలగు క్రూరకార్యములు చేయువానికి తప్పదు, వారు రాజభటులచే బలాత్కారముగా కారాగృహమునకు నెట్టబడుదురు. స్వర్గనరకముల స్థితియు నిటువంటిదే.

శ్లో॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥ 42

పద॥ అథవా - యోగినాం - ఏవ - కులే - భవతి - ధీమతాం,
ఏతత్ - హి - దుర్లభతరం - లోకే - జన్మ - యత్ - ఈదృశమ్.

ప్రతి॥ అథవా = అట్లుగాక (లేక), ధీమతాం = బుద్ధిమంతులైన, యోగినాం = యోగులయొక్క, కులే ఏవ=వంశమునందే, భవతి = జన్మించుచున్నాడు. ఈదృశం జన్మ = ఈలాటి జన్మము, యత్ = ఏదిగలదో, ఏతత్ = అది. లోకే = ఈలోకమునందు, దుర్లభతరం హి = మిక్కిలి అరుదైనది గదా!

తా॥ లేక అనుష్ఠాన తత్పరుడై సిద్ధిని పొందకముందే శరీరమును విడచిన యోగి జ్ఞానవంతులైన యోగులయొక్క వంశమునందే జన్మించుచున్నాడు. అయితే ఈలాటి జన్మము ఈలోకమునందు మిక్కిలి అరుదైనది.

వి॥ విషయాసక్తిచే యోగభ్రష్టుడైనవాడు శుచివ్రతులు శ్రీమంతులునగువారి కులములో పుట్టినట్లైనమాత్రమే అతని సుఖానుభవమునకు అనుకూలపడును. రెండవవాడు మహాత్ముల వంశములో పుట్టుటచే అతనికి బాల్య కాలమునుండియే భక్తిజ్ఞాన వైరాగ్యములు అలవడుటకు అవకాశముండును, అట్టి మహనీయుల వంశములో పుట్టుటకు మహాభాగ్యము గలిగియుండవలెను.

శ్లో॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ ।
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన ! ॥ 43

పద॥ తత్ర - తం - బుద్ధిసంయోగం - లభతే - పౌర్వదైహికం ।
యతతే - చ - తతః - భూయః - సంసిద్ధౌ - కురునందన!

ప్రతి॥ హే కురునందన! = కురుకుమారుడవగు ఓ యర్జునా!, తత్ర = ఆ మరు జన్మమునందు, పౌర్వదైహికం=మునుపటి జన్మమున సంభవించిన, తం=ఆ బుద్ధిసంయోగం = ఆత్మవిషయిక జ్ఞానసంబంధమును, లభతే = పొందు చున్నాడు, తతః= అట్లు పొందుట వలన, లేక అంతకంటెను, సంసిద్ధౌ = యోగసిద్ధి విషయమై, భూయః=మఱల, అధికముగా, యతతే చ = ప్రయత్నము చేయుచున్నాడు గూడ,

తా॥ పరిశుద్ధులును, జ్ఞానవంతులు నయిన యోగులయొక్క కులమునందు బుట్టినయోగ భ్రష్టుడు, పూర్వజన్మమునందు కలిగియున్న ఆత్మ విషయమైన బుద్ధితో సంబంధమును పొందుచున్నాడు. అనంతరము జ్ఞానసిద్ధి నిమిత్తమై అంతకంటె అధికముగా యత్నమును జేయుచున్నాడు గూడా.

శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ 44

పద॥ పూర్వాభ్యాసేన - తేన - ఏవ - హ్రియతే - హి - అవశః - అపి - సః.
జిజ్ఞాసుః - అపి - యోగస్య - శబ్దబ్రహ్మ - అతివర్తతే.

ప్రతి॥ సః = ఆ యోగభ్రష్టుడు, అవశః అపి = యోగము నభ్యసించుటకు తానుగా ప్రయత్నము చేయనివాడైనను, తేన = అట్టి కొరతబడిన. పూర్వాభ్యాసేన ఏవ=కుందటిజన్మమందు చేయబడిన అభ్యాసవాసనావశముచేతనే, హ్రియతేహి = లాగ (ఆకర్షింప) బడుచున్నాడుగదా, యోగస్య జిజ్ఞాసుః అపి =

యోగనిష్ఠను ఆచరించుటకు ఇచ్ఛగలవాడు గూడ, శబ్దబ్రహ్మ = వేదోక్త కర్మానుష్ఠాన ఫలమును, అతివర్తతే = అతిక్రమించుచున్నాడు.

తా॥ ఆ యోగభ్రష్టుడు విషయసౌఖ్యములకు లోబడియున్న వాడైనను, అట్టి కొరతబడిన పూర్వాభ్యాసవాసనావశముచేత విషయములనుండి దైవముఖముగా ఆకర్షింపబడుచున్నాడు. బ్రహ్మవిచారము చేయవలెనను ఇచ్ఛగలవాడు సహితము వేదములందు జెప్పబడిన కర్మల కతీతుడగు ఈశ్వరుని పొందుచున్నాడు.

వి॥ ఇచ్ఛకలవాడే వేదముల కతీతమగు బ్రహ్మమును పొందుచుండగా ఆచరణ చేయువానిని గురించి మఱి చెప్పవలెనా? పూర్వజన్మమున అనుష్ఠానము గలవాడు ఈ జన్మమున విషయసుఖపరవశుడైనను సూదంటురాయి సూదులను ఆకర్షించు నట్లు, అట్టివాని మనస్సు ఎల్లప్పుడున్ను సంసారమునుండి నివృత్తము కావలెనని సంకల్పించుచునే యుండును. ఇదియే అతని పూర్వసంస్కారమునకు గురుతు.

శ్లో॥ ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥ 45

పద॥ ప్రయత్నాత్ - యతమానః - తు - యోగీ - సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధః - తతః - యాతి - పరాం - గతిమ్.

ప్రతి॥ ప్రయత్నాత్ = పట్టుదలవలన, యతమానః=యత్నించుచున్న, యోగీతు= యోగి అయితేనో, సంశుద్ధకిల్బిషః=కల్మషరహితుడై, అనేకజన్మసంసిద్ధః= అనేక జన్మములయందభ్యసింపదగిన యోగసిద్ధిని బడసినవాడై, తతః=ఆ పిమ్మట, పరాం గతిం = సర్వోత్తమమైన మోక్షమును, యాతి = పొందుచున్నాడు.

తా॥ పట్టుదలతో యత్నించుచున్న యోగనిష్ఠుడు పాపరాహిత్యముగలవాడై అనేక జన్మములయందు అభ్యాసముచే పొందదగిన యోగసిద్ధిని పొంది, అటుపిమ్మట, అట్టి యోగసిద్ధిన పొందిన తరువాత సర్వోత్తమమగు మోక్షమును పొందుచున్నాడు.

వి॥ అనేకజన్మములలో కొంచెము కొంచెముగా అనుష్ఠించుచు వచ్చిన యోగసాధనవలన సంపూర్ణ అంతఃకరణశుద్ధి గలిగి జీవన్ముక్తుడగుచున్నాడు. అనేకజన్మ

ములు పోయిన తరువాత మోక్షము గలుగునని తలంచి మందప్రజ్ఞులైయుండ రాదు. ఇదివఱలో అనేక జన్మములనుండి బ్రహ్మనిష్ఠ చేయుచు వచ్చుటచేతనే, ఇప్పుడు ఇంత ఆత్మశుద్ధియు, జ్ఞానమున్ను గలిగినదని తలంచవలెను. ఏలన, అనేకజనులు విద్యచేతను, ధనముచేతను గూడియుండినను, విషయములలోనే పడియున్నారు. కావున అట్టి యంతఃకరణశుద్ధి గలుగుట అనేకజన్మసాధనఫలమే యని మరువకూడదు.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥ 46

పద॥ తపస్విభ్యః - అధికః - యోగీ - జ్ఞానిభ్యః - అపి - మతః - అధికః,
కర్మిభ్యః - చ - అధికః - యోగీ - తస్మాత్ - యోగీ - భవ - అర్జున

ప్రతి॥ హే అర్జున! = ఓ యర్జునా!, యోగీ = ధ్యానయోగి, తపస్విభ్యః=తపస్సు చేయువారికంటెను, అధికః = శ్రేష్ఠుడు, జ్ఞానిభ్యః అపి=శాస్త్రజ్ఞానము గల వారికంటెనుగూడ, అధికః=శ్రేష్ఠుడుగా. మతః = తలంపబడెను.మరియు యోగీ = ధ్యానయోగనిష్ఠుడు, కర్మిభ్యః చ = కర్మానుష్ఠానపరులకంటెను గూడ, అధికః = శ్రేష్ఠుడు. తస్మాత్ = ఆ కారణమువలన, యోగీభవ= ధ్యానయోగివగుము.

తా॥ ఓ అర్జునా! ధ్యానయోగాభ్యాసము చేయుచున్నవాడు కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులను జేయువారికంటెను, శాస్త్రవిచారము మాత్రముగలిగి జ్ఞానవిచారము చేయనివారికంటెను, అగ్నిహోత్రాది కర్మలను జేయువారికంటెను శ్రేష్ఠుడని నా అభిప్రాయము. కాబట్టి నీవు ధ్యానయోగాభ్యాసపరుడవగుము.

వి॥ గురుముఖమునుండి వేదాంతార్థమును శ్రవణము చేయువానినిజ్ఞాని యనియు, అట్టివేదాంతార్థజ్ఞానమును అనుభవమునకు దెచ్చుకొనుటకు మనన నిదిధ్యాసములు జేయుచు సాక్షాత్కారము నొందినవానిని విజ్ఞానియనియుచెప్పుదురు.

శ్లో॥ యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।
శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః॥ 47

పద॥ యోగినాం - అపి - సర్వేషాం మద్గతేన - అంతరాత్మనా,
శ్రద్ధావాన్ - భజతే - యః - మాం - సః -మే - యుక్తతమః - మతః

ప్రతి॥ సర్వేషాం యోగినాం అపి = యోగులందఱిలోను, యః = ఎవడు, మద్గతేన = నాయందు ఆసక్తమైన, అంతరాత్మనా = మనస్సుతోడ, శ్రద్ధావాన్ = శ్రద్ధ గలవాడై, మాం = నన్ను, భజతే = ధ్యానము చేయుచుండునో, సః = అట్టివాడు, యుక్తతమః = యోగులలో నుత్తముడు, మే = నాకు, మతః = సమ్మతుడు,

తా॥ యోగులందఱిలోను యెవడు నా యందు ఆసక్తమైన అంతరంగముతోడ భక్తిగలవాడై నన్ను భజంచుచున్నాడో, అట్టివాడు యోగులలో నుత్తముడని నాయొక్క యభిప్రాయము.

వి॥ ఐదవ యధ్యాయాంతమున చెప్పినట్లు ఈ యధ్యాయాంతమునగూడ భక్తికి అధిక్యమివ్వడమైనది, ఈ యధ్యాయములో జెప్పబడిన యోగసిద్ధియు, ఆత్మజ్ఞానసిద్ధియు భక్తివలననే కలుగవలసియున్నది. అంతేగాదు, యోగసాధన, బ్రహ్మవిచారము సామాన్యులకు సాధ్యముకాదు. భక్తియన్ననో సర్వులకు మిక్కిలి సులభసాధ్యము. అట్టిభక్తివలననే పాపక్షయము, అంతఃకరణశుద్ధియు గలుగవలసియుండును. మరియు ఎంత సారవంతమైన భూమియైనను శ్రేష్ఠమైన విత్తనమును దానియందు వేసినను వర్షము లేనిచో యెట్లుఫలము నొసగజాలదో అవి యెన్నిరకముల విత్తనములైనను సరి అన్నిటికిని జలమే ఆధారము, జలమున్ననే అవి పూర్ణ ఫలము నీయగలవు. వర్షములేని విత్తనములు ఎట్లు నష్టములగునో అట్లే భక్తిలేని సాధనలన్నియు వ్యర్థములై ఫలమును గలుగ జేయజాలవు. కనుకనే భక్తికి శాస్త్రమింత అధిక్యమివ్వడమైనది. భక్తిలేని యోగముగాని, తపస్సుగాని, గొప్పదిగాదని తాత్పర్యము.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే ఆత్మసంయమ యోగోనామ
షష్ఠోఽధ్యాయః.

పద॥ ఇతి - శ్రీమద్భగవద్గీతాసు - ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే- శ్రీ కృష్ణార్జునసంవాదే - ఆత్మసంయమయోగః - నామ - షష్ఠః - అధ్యాయః,

ప్రతి॥ ఇతి = ఇది, ఉపనిత్సు = ఉపనిషదర్థ ప్రతిపాదకమును. బ్రహ్మవిద్యాయాం = బ్రహ్మ విద్యారూపమును, యోగశాస్త్రే = యోగశాస్త్రమును,

శ్రీకృష్ణార్జున సంవాదే = శ్రీకృష్ణార్జున సంవాదరూపమునగు, శ్రీమత్ భగవద్గీతాసు = శ్రీభగవద్గీతలయందు, ఆత్మసంయమయోగః = పరమాత్మయందు ఆత్మను ఐక్యపరచెడు యోగమని, నామ = ప్రసిద్ధిగల, షష్ఠః = ఆరవ, అధ్యాయః = అధ్యాయము సంపూర్ణము.

**తా॥** ఇట్లు ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యాస్వరూపమును, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమునునైన శ్రీ భగవద్గీతయందు ఆత్మసంయమయోగమనెడి ఆరవ అధ్యాయము ముగిసినది.

**ఓమ్ తత్ సత్**





ఓమ్

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## సప్తమోఽధ్యాయః - సప్తమాధ్యాయము

## విజ్ఞానయోగః - విజ్ఞానయోగము



వేదము కాండత్రయాత్మకమైనది. అనగా కర్మ, భక్తి, జ్ఞానము లనెడు మూడుకాండలతో గూడియున్నది. అలాగుననే శ్రీ భగవద్గీతలోని మొదటి ఆరు అధ్యాయములు ధర్మయుక్తమగు నిష్కామకర్మయోగమును, ఏడునుండి పదిరెండవ అధ్యాయమువఱకు గల రెండవభాగము భగవదుపాసనను,పదమూడునుండి పదునెనిమిది యధ్యాయముల వఱకుగల మూడవభాగము జ్ఞానమునుగుఱించియు నుపదేశించు చున్నదని విజ్ఞుల మతము. ధర్మానుష్ఠాన పరమగు నిష్కామకర్మ యోగాచరణముచే అంతఃకరణశుద్ధియు,భగవదుపాసనచే చిత్త నిశ్చలత్వము లేక విక్షేప నివృత్తియు,మూడవదగు బ్రహ్మవిచారముచే ఆత్మయొక్క ఆవరణనివృత్తియు గలుగునని మహనీయుల అభిమతము. ఇప్పుడు ప్రారంభించబోయెడు సప్తమాధ్యాయము విజ్ఞానయోగ మను పేరుగలది. విజ్ఞానమనగా విశేషజ్ఞానమని అర్థము, ఇట్టి విశిష్ట జ్ఞానము వలననే, పరమాత్మైక్యబోధ గలుగుట చేత యోగమని చెప్పబడినది.

**శ్రీ భగవానువాచ:- శ్రీ భగవంతుడు చెప్పెను.**

శ్లో॥ మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుంజన్మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥ 1

పద॥ మయి - ఆసక్తమనాః - పార్థ! - యోగం - యుంజన్ - మదాశ్రయః,
అసంశయం - సమగ్రం - మాం - యథా - జ్ఞాస్యసి - తత్ - శృణు.

ప్రతి॥ హే పార్థ! = ఓ యర్జునా!, మయి = నాయందు, ఆసక్తమనాః = చేర్చబడిన మనస్సు గలవాడవై,మదాశ్రయః = నేనేఆశ్రయము గాగలవాడవై, అనగా నన్నే ఆశ్రయించిన వాడవై, యోగం = ధ్యానయోగమును, యుంజన్ = ఆచరించుచు, మాం = నన్ను, సమగ్రం = సంపూర్ణ

ముగా, అసంశయం = సంశయములేక, యథా = ఎట్లు, జ్ఞాస్యసి = ఎఱుంగగలవో, తత్ = దానిని, శృణు = వినుము.

తా॥ ఓ యర్జునా! నీవు నాయందు చేర్చబడినమనస్సు గలవాడవై, నన్నే ఆశ్రయించినవాడవై ధ్యానయోగమును ఆచరించుచు సంపూర్ణుడనైన నన్ను సంశయములేక యెట్లు తెలిసికొనగలవో దానిని గుఱించి చెప్పెద వినుము.

శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః ।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యజ్జ్ఞాతవ్యమవశిష్యతే ॥ 2

పద॥ జ్ఞానం - తే - అహం - సవిజ్ఞానం - ఇదం - వక్ష్యామి - అశేషతః,
యత్ - జ్ఞాత్వా - న - ఇహ - భూయః - అన్యత్ - జ్ఞాతవ్యం- అవశిష్యతే.

ప్రతి॥ యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొన్నపిమ్మట, ఇహ = ఈలోకమునందు, భూయః=మఱల, జ్ఞాతవ్యం = తెలిసికొనదగినది, అన్యత్ =మఱియొకటి, న అవశిష్యతే = మిగిలియుండదో, ఇదం = అట్టి యీ, సవిజ్ఞానం = అనుభవ సహితమైన, జ్ఞానం = జ్ఞానమును, అశేషతః = నిశ్శేషముగా, తే = నీకు, అహం = నేను, వక్ష్యామి = చెప్పబోవుచున్నాను.

తా॥ అపరోక్షమైన యే జ్ఞానమును దెలిసికొనిన పిమ్మట మోక్షమును పొందుటకు దెలియదగిన యితర జ్ఞానమేదియును(పురుషార్థ సాధన మేదియును) లేకపోవునో, అట్టి స్వానుభవముతో గూడిన జ్ఞానమును నిశ్శేషముగా నీకు జెప్పెదను వినుము.

వి॥ జ్ఞానమును విజ్ఞానమును సంపూర్ణముగా తెలిసిన మాత్రమే అధ్యాత్మ జ్ఞానము సంపూర్ణముగా తెలియబడినదగును 13-వ అధ్యాయమున జెప్పబడిన అమానిత్వాదులు జ్ఞానమనియు, విజ్ఞానము దానిలోనే చెప్పబడిన జ్ఞేయమనియు తెలియ దగినది.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ 3

పద॥ మనుష్యాణాం - సహస్రేషు - కశ్చిత్ - యతతి - సిద్ధయే
యతతాం - అపి - సిద్ధానాం - కశ్చిత్ - మాం - వేత్తి- తత్త్వతః.

ప్రతి॥ మనుష్యాణాం = మానవులలో, సహస్రేషు = వేలకొలది సంఖ్యలయందు, కశ్చిత్ = ఒకానొకడు, సిద్ధయే= ఆత్మజ్ఞానసిద్ధికొఱకు, యతతి=యత్నించు చున్నాడు. యతతాం = అట్లు యత్నించుచున్నవారలలో, సిద్ధానాం అపి= సిద్ధిని పొందినవారలలో సహితము, కశ్చిత్ = ఒకానొకడు, మాం=నన్ను, తత్త్వతః = నిజముగా, వేత్తి = తెలిసికొనుచున్నాడు.

తా॥ వేలకొలది మనుష్యులలో ఒకానొకడు పూర్వపుణ్యవిశేష ముచే ఆత్మజ్ఞానసిద్ధికొఱకు ప్రయత్నము చేయుచుండును. అట్లు ప్రయత్నము చేయుచు సిద్ధిని పొందినవారలలో సహితము యే ఒక్కడో నన్ను యథార్థముగా తెలిసికొనుచున్నాడు.

వి॥ వేలసంఖ్యగల జనులలో పూర్వపుణ్య విశేషమువల్ల యెవడో ఒకడు సంసారమునుండి విముక్తిని కోరును.అట్లు కోరినవారలలో నొకానొకడు మాత్రమే నిజతత్త్వమగు బ్రహ్మమును నెఱుంగగలడు. అయితే తక్కిన ఇతరసాధకులు వ్యర్థులు గారు. ఈ సంవత్సరము మొదటి తరగతిలో నుత్తీర్ణుడైనవాడు మరు సంవత్సరము రెండవ తరగతికి, ఆ మరుసంవత్సరము మూడవ తరగతికి వెళ్ళు నట్లుండును. మఱియు ఒక చెట్టు పూయునపుడు విశేషముగా పువ్వులుండును, వాటిలోను చాల రాలిపోవును. కొన్ని మాత్రమే పిందెలుగా నేర్పడును. వాటి లోను చాల రాలిపోవును. ముదిరి పండైనకాయలు చాల తక్కువగా నుండును. అలాగున, అనేకులు జ్ఞాన మార్గములో ప్రవేశింతురు. మనస్సును నిలుపజాలక చాలమంది విడిచిపెట్టుదురు.చాలమంది వైరాగ్యమును అవలంబించి చాలవఱకు సాధింతురు. వారిలోను నిర్విషయ స్థితిలోను, సత్యములోను నిలువజాలక చాల మంది జారిపోవుదురు. కట్ట కడపట శరీరాంతము వఱకు అనుష్ఠానమును విడు వక జ్ఞానముగలిగి మోక్షమును పొందువారు చాల అరుదుగా నుందురు. అయితే మొదటి తరగతిలో చేరిన యిరువురును చెడరు. శ్రీ తిరుపతి వేంకటే శ్వరుల కొండ యెక్కెడి వారలలో కొందఱు ఒకటి రెండు పర్వతము లెక్కిన తర్వాత రాత్రియైనచో, అచ్చట మండపములో పండుకొని ఉదయము మఱల అచ్చోటినుండి ప్రయాణము చేసెదరు. అట్లు ప్రయాణముచేసిన చాలును. అలా గున నాలుగైదు కొండలెక్కినవారు రాత్రి అచ్చట పండుకొని మరురోజు అచ్చోటినుండి ప్రయాణముజేసిన చాలును. ఆలాగున ప్రయాణ మొనర్చినచో ఏడుకొండలుదాటి ముక్తిస్థానమగు పరమాత్మను శ్రీమన్నారాయణమూర్తిని

దర్శింపవచ్చును. అట్లే సప్తజ్ఞాన భూమికలలో ఈ జన్మమున నెన్ని భూమికల దాటగలుగునో మరుజన్మములో అచ్చటినుండి ప్రయాణముచేసిన చాలును. అయితే ఒక్కొక్క భూమికను దాటినవానికి మరుజన్మములో నిప్పటికన్న శ్రేష్ఠ మగు జన్మము, జ్ఞానమున్ను గలుగును. కొండనెక్కువాడు క్రిందటిరోజు ఎన్ని కొండ లెక్కిపోయెనో, మరురోజు అక్కడినుండియే ప్రయాణము చేయవలసి యుండును. కాని తిరిగి క్రిందనుండి యెక్క నవసరములేదు. అలాగున ఈ జన్మములో సప్తభూమికలలో ఎన్నింటిని దాటునో, మరుజన్మమున అచ్చటి నుండి పైకి వెళ్ళినజాలును.

శ్లో॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధిరేవచ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥ 4

పద॥ భూమిః - అపః - అనలః - వాయుః - ఖం - మనః - బుద్ధిః - ఏవ - చ,
అహంకారః - ఇతి - ఇయం - మే - భిన్నా - ప్రకృతిః - అష్టధా.

ప్రతి॥ మే = నాయొక్క, ఇయం = ఈ, ప్రకృతిః = మాయ, భూమిః = భూమి, ఆపః = జలము, అనలః = అగ్ని, వాయుః = గాలి, ఖం = ఆకాశము, మనః = మనస్సు,బుద్ధిః = బుద్ధి, అహంకారఃఏవచ = అహంకారమును, ఇతి = అని, అష్టధా = ఎనిమిది విధములుగా, భిన్నా = విభజింపబడినది,

తా॥ నాయొక్క యీ మాయ భూమి, జలము, అగ్ని, గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అని యెనిమిది విధము లుగా విభజింపబడినది.

వి॥ తత్త్వములు 24 అనియు, 38 అనియు; 96 అనియు నీలాగున వివరించి చెప్పుటగలదు. ఇచ్చట సంక్షిప్తముగా 8 విధములుగా తెలుపడమైనది. ముఖ్యముగా గ్రహించదగినదేమన మనస్సు, బుద్ధి అహంకారముకూడ ప్రకృతి తత్త్వమేయని

శ్లో॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్ ॥ 5

పద॥ అపరా - ఇయం - ఇతః - తు - అన్యాం - ప్రకృతిం - విద్ధి - మే -
పరాం - జీవభూతాం - మహాబాహో - యయా -ఇదం-ధార్యతే -జగత్.

ప్రతి॥ హే మహాబాహో! = ఓ యర్జునా!, ఇయం తు = ఈ ప్రకృతి యన్ననో, అపరా = తక్కువైనది, యయా = దేనిచేత, ఇదం జగత్ = ఈ ప్రపంచము, ధార్యతే = ధరింపబడుచున్నదో, జీవభూతాం = జీవరూపమైనట్టి, మే = నాయొక్క, అన్యాం ప్రకృతిం=మరియొక ప్రకృతిని, ఇతః = ఇంతకంటె, పరాం = శ్రేష్ఠమైనదానినిగా, విద్ధి = ఎఱుంగుము.

తా॥ ఓ యర్జునా! పై జెప్పిన యీ ప్రకృతి యన్ననో తక్కువైనది. దేనిచేత ఈ ప్రపంచము ధరింపబడుచున్నదో, జీవరూపమైన అట్టి నాయొక్క మఱియొక ప్రకృతిని ఇంతకంటె శ్రేష్ఠమైన దానినిగా నెఱుంగుము.

వి॥ భగవంతుని జడప్రకృతిని భగవంతుని చేతన ప్రకృతి ధరించుచున్నది, అనగా చేతన ప్రకృతిచే జడప్రకృతి నడుపబడుచున్నది. పై చెప్పిన బుద్ధ్యాది అష్టప్రకృతులను జీవచైతన్యము నడుపుచుండును. అది ఈశ్వరునికి సంబంధించినది. జీవుడు ఈశ్వరాంశుడు శుద్ధచైతన్య స్వరూపుడు.

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా ॥ 6

పద॥ ఏతత్ యోనీని - భూతాని - సర్వాణి - ఇతి - ఉపధారయ,
అహం - కృత్స్నస్య - జగతః - ప్రభవః - ప్రళయః - తథా.

ప్రతి॥ సర్వాణి = సమస్తములైన. భూతాని = ప్రాణులు, ఏతత్ యోనీని = ఈ సూక్ష్మప్రకృతియే ఉత్పత్తికి కారణముగాగలవి, ఇతి=అని, ఉపధారయ= తెలిసికొనుము, కనుక, అహం=నేను, కృత్స్నస్య జగతః=జగత్తునకంతటికిని, ప్రభవః = (ఉత్పత్తికి) కారణభూతుడనైయున్నాను, తథా =అలాగుననే, ప్రళయః = లయకారణభూతుడనైయున్నాను.

తా॥ ఈ నా పరాపర ప్రకృతులనుండియే సకల భూతములును బుట్టుచున్నవి. ఈ రెండు ప్రకృతులద్వారా సమస్త జగత్తుయొక్క సృష్టి ప్రళయములకు కారణుడను నేనే యని యెఱుంగుము.

శ్లో॥ మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ 7

పద॥ మత్తః - పరతరం - న - అన్యత్ - కించిత్ - అస్తి - ధనంజయ !
మయి - సర్వం - ఇదం - ప్రోతం - సూత్రే - మణిగణాః - ఇవ.

ప్రతి॥ హే ధనంజయ! = ఓ అర్జునా!, మత్తః = నాకంటె, పరతరం = శ్రేష్ఠతరమైనది. అన్యత్ = మఱియొకటి, కించిత్ = ఇంకొకటి, న అస్తి = లేదు. మణిగణాః = పూసల సమూహములు, సూత్రే ఇవ = దారమునందువలె, ఇదం = ఈ, సర్వం = సమస్తప్రపంచము, మయి=నాయందు, ప్రోతం= కూర్చబడి యున్నది.

తా॥ నాకంటె శ్రేష్ఠతరమైనది మఱియొకటి కొంచెమైనను లేదు. పూసల సమూహములు దారమునందువలె ఈ సమస్త ప్రపంచము నాయందు కూర్చబడీయున్నది.

వి॥ సువర్ణరజత ప్రవాళ (పగడ) తులసీ రుద్రాక్షాదిపూసలు, రక్త శుక్ల కృష్ణ పీతాది వర్ణములతో కూడినవైనను ఒకే దారములో కూర్చబడునట్లు చేతనాచేతన స్థూల సూక్ష్మప్రపంచములన్నియు పరమాత్మలో కూర్చబడినవి. దారములో పూసలవలె అంతర్యామియైయుండువాడు సర్వేశ్వరుడని గ్రహింపవలయును.

శ్లో॥ రసోఽహమప్సు కౌన్తేయ । ప్రభాఽస్మి శశిసూర్యయోః ।
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ 8

పద॥ రసః - అహం - అప్సు - కౌంతేయ! - ప్రభా - అస్మి - శశిసూర్యయోః,
ప్రణవః - సర్వవేదేషు - శబ్దః - ఖే - పౌరుషం - నృషు.

ప్రతి॥ హే కౌంతేయ ! = ఓ అర్జునా!, అహం = నేను, అప్సు = ఉదకములయందలి, రసః = రుచియును, శశిసూర్యయోః = చంద్రసూర్యులయందు, ప్రభా = ప్రకాశమును, సర్వవేదేషు = సమస్తవేదములయందు, ప్రణవః = ఓంకారముగను, ఖే = ఆకాశమందు, శబ్దః = శబ్దముగను, నృషు = నరులయందు, పౌరుషం = పరాక్రమముగను, అస్మి = అయియున్నాను,

తా॥ నేను ఉదకముల యందు రుచియును, చంద్రసూర్యుల యందు ప్రకాశముగను, సమస్తవేదములయందు ఓంకారముగను, ఆకాశమునందు శబ్దముగను, నరులయందు పరాక్రమముగను అయియున్నాను. ధర్మయుక్తమగు పౌరుషము భగవత్స్వరూపమేయని తెలియవలెను.

**వి॥** ఇచట ద్వైతాద్వైత విశిష్టాద్వైతములరహస్యము తెలియదగియున్నది. భగవంతుడు జలములో రసరూపముగా వ్యాపించియున్నాడు. ఇది అద్వైతేతరులు చెప్పెడు అర్థము. అద్వైతులు రసము, జలము వేరుకాదని చెప్పుదురు. చంద్ర సూర్యులలో ప్రకాశరూపుడై సర్వేశ్వరుడు వ్యాపించియున్నాడు అని అద్వైతేతరులును, ప్రకాశము వినా చంద్రసూర్యులే లేరని అద్వైతులును, వేదములయందు ప్రణవ రూపముగా పరమాత్మ వ్యాపించియున్నాడని అద్వైతేతరులును, ప్రణవ మునుండియే వేదములు పుట్టినవని అద్వైతులును చెప్పెదరు. ఫలపల్లవపుష్పాదులతో వేరు వేరు రూపముగా వృక్షము కనిపించినను అది బీజము నుండియే పుట్టెను. బీజములేక యెట్లు వృక్షములేదో, అట్లే సూక్ష్మరూపములగు శబ్దస్పర్శ రూప రస గంధములయొక్క వికాసమే ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి యగును. సామాన్యదృష్టి గలవారికి సర్వేశ్వరుడు పైజెప్పిన వాటి యన్నిటిలోను వ్యాపించియున్నాడనిన సులభముగా గ్రాహ్యమగును. అంతయును భగవన్మయమని శుద్ధమైన మనస్సుతో నాలోచించిన మాత్రమే గోచరము గాగలదు. కావుననే ఈ యధ్యాయమునకు విజ్ఞానయోగమని నామకరణము చేయుటకు కారణమైనది.

శ్లో॥ పుణ్యో గంధః పృథివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥ 9

పద॥ పుణ్యః - గంధః - పృథివ్యాం - చ - తేజః - చ - అస్మి - విభావసౌ, జీవనం - సర్వభూతేషు - తపః - చ - అస్మి - తపస్విషు.

ప్రతి॥ పృథివ్యాం = భూమియందలి, పుణ్యః గంధః చ = సువాసనయును, విభావసౌ = అగ్నియందలి, తేజః చ = దీప్తియును, అస్మి = అయియున్నాను, సర్వభూతేషు = సమస్తభూతములయందలి, జీవనం = ఆయువును, తపస్విషు = తాపసులయందలి, తపః చ = జ్ఞానతపస్సును, అస్మి = అయియున్నాను.

తా॥ భూమియందలి సువాసనయును, అగ్నియందలి దీప్తియును, సర్వభూతములయందలి యాయువును, తాపసులయందలి జ్ఞానతపస్సును నేనే అయియున్నాను.

**వి॥** పైచెప్పిన ప్రకారము భూమియందు గంధరూపముగా పరమాత్మ వ్యాపించియున్నాడని అద్వైతేతరులును, గంధములేకభూమిలేదని అద్వైతులును,

అగ్నియందలి దీప్తిరూపముగా సర్వేశ్వరుడు వ్యాపించియున్నాడని అద్వైతేతరులును, దీప్తివినా అగ్నిలేదని అద్వైతులును భావింతురు. ఇటుల సమస్త భూతములయందు పరమాత్మ జీవరూపముగా నుంటున్నాడనియు, జీవకోట్ల మేలు కొఱకు తపస్సు చేయువారలలో తపోరూపముగా భగవంతుడే యుంటున్నాడనియు తెలుపడమైనది.

శ్లో॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ ! సనాతనమ్ ।
బుద్ధి ర్బుద్ధిమతామస్మి తేజ స్తేజస్వినామహమ్ ॥ 10

పద॥ బీజం - మాం - సర్వభూతానాం - విద్ధి - పార్థ! - సనాతనం,
బుద్ధిః - బుద్ధిమతాం - అస్మి - తేజః - తేజస్వినాం - అహమ్.

ప్రతి॥ హే పార్థ! = ఓ యర్జునా!, మాం = నన్ను, సర్వభూతానాం = సమస్త భూతములకును, సనాతనం = శాశ్వతమైన, బీజం = బీజమునుగ, విద్ధి = తెలిసికొనుము, అహం = నేను, బుద్ధిమతాం = ధర్మబుద్ధి గలవారియొక్క, బుద్ధిః = నిర్మలమైన బుద్ధిగను, తేజస్వినాం = సాత్త్వికతేజస్సు గలవారి, తేజః = తేజస్సుగను, అస్మి = ఉన్నాను.

తా॥ ఓ యర్జునా! నన్ను ధర్మబుద్ధిగలవానియొక్క నిర్మలమైన బుద్ధిగాను, సాత్త్వికతేజోవంతులయొక్క తేజస్సుగను, సమస్త భూతములకును బీజరూపముగ నున్నవానినిగాను తెలిసికొనుము.

వి॥ బీజాంకురన్యాయమును చెప్పువారు ఈ శ్లోకమును చదివి గ్రహించిన బాగుండును.

శ్లో॥ బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ! ॥ 11

పద॥ బలం - బలవతాం - చ - అహం - కామరాగవివర్జితం,
ధర్మావిరుద్ధః - భూతేషు - కామః - అస్మి - భరతర్షభ!

ప్రతి॥ హే భరతర్షభ = భరతకులశ్రేష్ఠుడవగు ఓ యర్జునా, అహం = నేను, బలవతాం = ధర్మముతోగూడిన బలవంతులయొక్క, కామరాగవివర్జితం = ఆశయును, అనురాగమునులేని, బలం = బలమును, భూతేషు = ప్రాణులయందు, ధర్మావిరుద్ధః = ధర్మమునకు విరుద్ధముగాని, కామః చ = కోరికగను, అస్మి = ఉన్నాను.

తా॥ ఓ యర్జునా! నేను బలవంతులయొక్క ఆశయును అనురాగమును లేని బలముగను, ప్రాణులయందు ధర్మశాస్త్రమునకు విరుద్ధముగాని కోరికగను ఉన్నాను.

వి॥ ధర్మవిరుద్ధమైన కోరిక కూడదు. ధర్మబద్ధమైన తనవస్తువును సంరక్షించుట దోషముకాదు. అది కోరికలో చేరదు. అలాగున ధర్మవిరుద్ధమగు సుఖము కూడదు. ధర్మవిరుద్ధముగాని సుఖమును అనుభవింప వచ్చును.

శ్లో॥ యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చయే ।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి॥ 12

పద॥ యే - చ - ఏవ సాత్త్వికాః - భావాః - రాజసాః - తామసాః - చ - యే, మత్తః - ఏవ - ఇతి - తాన్ విద్ధి - న - తు - అహం - తేషు - తే - మయి.

ప్రతి॥ యే = ఏవి, సాత్త్వికా ఏవ = సత్త్వగుణముచేతనే గలిగిన, భావాః = భావములో (వస్తువులో), యే = ఏది, రాజసాః చ = రజోగుణముచే గలిగినవియో, తామసాః చ = తమోగుణముచే గలిగినవియో, తాన్ = వాటిని, మత్తః ఏవ ఇతి = నా వలన కలిగినవే యని, విద్ధి = ఎఱుంగుము, అహం = నేను, తేషు = వానియందు, న = లేను, (కిం) తు = పఱియేమన, తే = అవి, మయి = నాయందు ఉన్నవి.

తా॥ సాత్త్విక రాజసిక తామసిక భావములు (వస్తువులు) ఏవిగలవో అవి అన్నియు నా వలననే గలిగినవి యనియు, నేను వాటియందు లేననియు, అవి నాయందు ఉన్నవనియు నెఱుగుము.

శ్లో॥ త్రిభిర్గుణమయైరేభిస్సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥ 13

పద॥ త్రిభిః - గుణమయైః - భావైః - ఏభిః - సర్వం - ఇదం - జగత్, మోహితం - న - అభిజానాతి - మాం - ఏభ్యః - పరం - అవ్యయమ్.

ప్రతి॥ త్రిభిః = మూడైన, గుణమయైః = సత్త్వరజస్తమములనెడు గుణముల యొక్క వికారములైన, ఏభిః = ఈ పైచెప్పబడిన. భావైః = భావముల చేత, (వస్తువులచేత), ఇదం జగత్ = ఈప్రపంచము, సర్వం = అంతయు, మోహితం = మోహింపబడినదై, మాం = నన్ను, ఏభ్యః =

ఈ మూడుగుణములకంటె, పరం = విలక్షణునిగను, అవ్యయం = నాశ రహితునిగను, న అభిజానాతి = తెలిసికొనజాలకున్నది.

తా॥ ఈ పైజెప్పబడిన మూడువిధములగు సత్త్వరజస్తమోగుణ వికారములుగల భావములచేత (వస్తువులచేత) ఈ ప్రపంచమంతయు మోహము పొందింపబడినదై నన్ను, ఈమూడుగుణములకంటె విలక్షణునిగను, నాశరహితునిగను తెలిసికొనజాలకున్నది.

వి॥ ఈ జనులందరు సత్త్వరజస్తమోగుణములతో కూడియుండుటచే ఈశ్వర తత్త్వమును తెలిసికొనజాలకయున్నారు. సత్త్వగుణముకూడ మోహమును గలుగ జేయునని తెలియదగును. సత్త్వగుణముకూడ నశించి విశుద్ధసత్త్వములో అనగా తురీయమందుండు జీవన్ముక్తునికే యీశ్వరస్వరూపము బోధపడగలుగును.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతేమయామేతాం తరంతి తే॥ 14

పద॥ దైవీ - హి - ఏషా - గుణమయీ - మమ - మాయా -దురత్యయా,
మాం - ఏవ - యే - ప్రపద్యంతే - మాయాం - ఏతాం - తరంతి- తే

ప్రతి॥ హి = ఏలయనగా, ఏషా = ఈ, గుణమయీ = త్రిగుణాత్మకమైనట్టి, మమ = నాయొక్క, మాయా = ప్రకృతి, దైవీ = దేవసంబంధమైనది గనుక, దురత్యయా = సామాన్యులకు దాటుటకు శక్యము గానిది. యే = ఎవరు, మాం ఏవ = నన్నే, ప్రపద్యంతే = శరణు పొందుచున్నారో, తే = వారు, ఏతాం మాయాం = ఈమాయను, తరంతి = తరించుచున్నారు.

తా॥ ఏలయనగా, త్రిగుణాత్మకమైన యీ నాయొక్క ప్రకృతి (మాయ) దేవసంబంధమైనది. అనగా నావలన కలిగినది. కనుక నిది సామాన్యులచే దాట శక్యము గానిదిగా నుండుచున్నది. కానియెవరు నన్ను శరణు పొందుచున్నారో, వారు ఈ మాయను సులభముగా దాటగలుగుచున్నారు.

వి॥ సముద్రము దాటుట కష్టమైనదైనను ఓడను ఆశ్రయించినవారు ఏలాగున ప్రయాసలేక దాటుచున్నారో, అలాగున పరమాత్మను శరణు బొందిన

వారికి లేక సమస్తమును సర్వేశ్వరునకు అర్పించినవారికి లేక ఆత్మను పర మాత్మలో ఐక్యపఱచి ధ్యానించువారికి మాయాసముద్రమును దాటుట ప్రయాస ముగాదు.

శ్లో॥ న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః ।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ॥ 15

పద॥ న - మాం - దుష్కృతినః - మూఢాః - ప్రపద్యంతే - నరాధమాః,
మాయయా - అపహృతజ్ఞానాః- ఆసురం - భావం - ఆశ్రితాః.

ప్రతి॥ దుష్కృతినః = దుష్కర్మల చేయువారును, మూఢాః = మూఢులును. మాయయా = మాయచేత, అపహృతజ్ఞానాః =అపహరింపబడిన జ్ఞానము గలవారును, ఆసురం భావం = రాక్షసస్వభావమును, ఆశ్రితాః = ఆశ్ర యించినవారును నగు, నరాధమాః = మనుష్యాధములు. మాం= నన్ను న ప్రపద్యంతే = పొందరు.

తా॥ పాపముచేయువారును, మూఢులైనవారును, మాయచేత నపహరింపబడిన ఆత్మజ్ఞానము గలవారును, రాక్షసధర్మములైన హింస అసత్యాదుల నాశ్రయించిన వారును నైన మానవాధములు నన్ను పొందజాలరు.

వి॥ అసత్యము, హింస, విషయేచ్ఛ మొదలగు అసురగుణములున్నవారు దైవమును పొందజాలరు.

శ్లో॥ చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున!
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ! ॥ 16

పద॥ చతుర్విధాః - భజంతే - మాం - జనాః - సుకృతినః - అర్జున!
ఆర్తః - జిజ్ఞాసుః - అర్థార్థీ - జ్ఞానీ - చ - భరతర్షభ!,

ప్రతి॥ భరతర్షభ ' = భరతవంశశ్రేష్ఠుడవైన, హే అర్జున! = ఓ యర్జునా!, ఆర్తః = ఆర్తిని చెందినవాడును, జిజ్ఞాసుః = నన్ను తెలిసికొన నపే క్షించినవాడును, అర్థార్థీ = చతుర్విధ పురుషార్థములలో ఒకదానియొక్క ప్రయోజనమును కోరువాడును, జ్ఞానీ చ = జ్ఞానియును నగు, చతుర్వి ధాః = ఈ చెప్పబడిన నాలుగు విధములైన, సుకృతినః జనాః=పుణ్యా త్ములగు జనులు, మాం =నన్ను, భజంతే = భజించుచున్నారు.

తా॥ భరతకులశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! దుఃఖముతోకూడిన వాడును, భగవత్తత్త్వమును తెలిసికొనదలచినవాడును, ధనమును కోరుచున్నవాడును, ఆత్మానాత్మవివేకము కలవాడునునగు నాలుగు రకముల పుణ్యాత్ములు నన్ను సేవించుచున్నారు.

వి॥ వీరు నలుగురును పాపులుకారు. ఆపత్కాలమున భగవంతుడే రక్షకుడని తలంచి దుఃఖవిమోచనముకొఱకు సర్వేశ్వరుని ప్రార్థించువారు గనుకనే పుణ్యాత్ములని చెప్పడమైనది,

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః ॥ 17

పద॥ తేషాం - జ్ఞానీ - నిత్యయుక్తః - ఏకభక్తిః - విశిష్యతే,
ప్రియః - హి - జ్ఞానినః - అత్యర్థం - అహం - సః - చ - మమ - ప్రియః,

ప్రతి॥ తేషాం = ఆ నలుగురిలో, నిత్యయుక్తః = నిత్యసంబంధముగలవాడును, (ఎల్లప్పుడుయోగమునతోకూడినవాడును), ఏకభక్తిః = ఒక్కనాయందుమాత్రమే భక్తిగలవాడును నగు, జ్ఞానీ = ఆత్మజ్ఞాని, విశిష్యతే = శ్రేష్ఠుడగుచున్నాడు. హి = ఏలయనగా. అహం = నేను, జ్ఞానినః = జ్ఞానియగువానికి. అత్యర్థం = మిక్కిలి, ప్రియః = ప్రియుడను, స చ = ఆ జ్ఞానియును, మమ = నాకు, ప్రియః = (మిక్కిలి) ప్రియుడు,

తా॥ పైచెప్పబడిన నలుగురిలో సర్వకాలములయందు సమాహితచిత్తుడును, సర్వేశ్వరుడనైన నాయందే భక్తిగలవాడును నయిన ఆత్మవేత్త సర్వశ్రేష్ఠుడగుచున్నాడు ఏలయన, ఆత్మవేత్తయగు వానికి నేను మిగుల ఇష్టుడను, కనుకనే అట్టి ఆత్మవేత్తగూడ నాకుపరమ ప్రియుడు.

వి॥ భగవంతుని జ్ఞానము గావలెనని లేక మోక్షము గలుగవలెనని కోరిక గలిగి భజించుటగూడ కామ్యముతో కూడినదిగదా? అనికొందరు ప్రశ్నించెదరు. ఎల్లకోరికలు నశించిపోవలెనను భావము గలవారగుటచే, అది కామ్యమను కోరికలో చేరినది కాదు, మఱియు నితరవాంఛ లేమియు లేక కేవలము ఈశ్వరసాక్షాత్కారమును కోరుటచేతనే భగవంతునిపై వానికి మిక్కిలి ప్రీతిగలిగియుండుటచే, భగవంతుడును అట్టిపరమభక్తునిపై మిక్కిలి ప్రీతిగలిగియుండునని చెప్పబడినది,

శ్లో॥ ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవమే మతమ్ ।
ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥ 18

పద॥ ఉదారాః - సర్వే - ఏవ - ఏతే - జ్ఞానీ - తు - ఆత్మా - ఏవ - మే - మతం,
ఆస్థితః - సః - హి - యుక్తాత్మా - మాం - ఏవ - అనుత్తమాం - గతిమ్.

ప్రతి॥ ఏతే= ఈ చెప్పబడిన, సర్వే= అందఱును, ఉదారాః ఏవ=ఉత్కృష్టులే.
జ్ఞానీతు = జ్ఞానియన్ననో, ఆత్మా ఏవ = నేనే యని, మే = నాయొక్క,
మతం = అభిప్రాయము, హి = ఏలయన, సః = ఆ జ్ఞానియగువాడు
యుక్తాత్మా = నాయందే చేర్చిన మనస్సుగలవాడై, మాం ఏవ = నన్నే
అనుత్తమాం = సర్వోత్తమమైన, గతిం = ప్రాప్యమునుగా (గతినిగా).
ఆస్థితః = ఎంచుచున్నాడు, (ఆశ్రయించి ఉన్నాడు.)

తా॥ ఈ పై చెప్పబడిన ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి అందఱును ఉత్కృష్టులే. కాని వారిలో జ్ఞానియో నాయొక్క స్వరూపుడే యని నాయొక్క అభిప్రాయము. ఏలయనగా, ఆ జ్ఞానియగువాడు తన మనస్సును నాయందే చేర్చిననాడై, నన్నే సర్వోత్తమమైన ప్రాప్యమునుగా గమ్యమునుగా భావించి నన్నే ఆశ్రయించి ఉంటున్నాడు.

వి॥ జ్ఞానమే సర్వోత్కృష్టమైనది, అట్టి జ్ఞానము ఏదనగా – "ప్రజ్ఞానం బ్రహ్మ" అను మహావాక్యముచే బోధింపబడినదని గ్రహింపవలెను,జ్ఞానియైనవాడు పరమాత్మయే తన ఆత్మగా వెలుగుచున్నాడని ఏకత్వబోధగలవాడగుటచే తన యాత్మయు,ఈ జగత్తంతయు కేవలము శ్రీమన్నారాయణమయమేయనిపరమాత్మ స్వరూపమేయని భావనజేయుచున్నాడు. కనుకనే జ్ఞానులపై సర్వేశ్వరున కెక్కువ ప్రీతి గలదు. ఈ కారణముచేతనే జ్ఞాని నా యాత్మస్వరూపుడని చెప్పబడినది.

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ 19

పద॥ బహూనాం - జన్మనాం - అన్తే - జ్ఞానవాన్ - మాం - ప్రపద్యతే,
వాసుదేవః - సర్వం - ఇతి - సః - మహాత్మా - సుదుర్లభః,

ప్రతి॥ బహూనాం = అనేకములైన, జన్మనాం = జన్మములయొక్క అంతే = కడపట, జ్ఞానవాన్ = జ్ఞానవంతుడు, సర్వం = సమస్తప్రపంచమును, వాసుదేవః=వాసుదేవస్వరూపము, ఇతి=అని, మాం=నన్ను, ప్రపద్యతే =

పొందుచున్నాడు; సః = అట్టి, మహాత్మా=మహానుభావుడు, సుదుర్లభః= మిక్కిలి దుర్లభుడు,

తా॥ అనేక జన్మములలో నాచరించిన పుణ్యసంస్కారమువలన నంతఃకరణ పారిశుద్ధ్యమును బడిసి కట్టకడపట జ్ఞానము గలవాడై నన్ను పొందుచున్నాడు. సర్వమువాసుదేవస్వరూపమని భావించు అటువంటి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడు. లోకములో అరుదుగ నుండునని భావము.

వి॥ అంతయు 'విష్ణుమయము' 'బ్రహ్మమయము' 'శివమయము' అను జ్ఞానముగల మహాత్ముడు లభించుట చాల ప్రయాసము. పై శ్లోకమున "జ్ఞానియే నేను" అని, ఈ శ్లోకమున "అట్టి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడు" అని భగవంతుడే జ్ఞానిని స్తోత్రముసెచేను. కావున ఎవరెవరు తమ్ముగొప్పజ్ఞానులుగా తలంచుచున్నారో వారు ఆత్మసాక్షిగా తమకు "ఇదంతయు భగవన్మయము" అని అనుభవము గలిగినదా? లేదా? అని యోచించుకొనవలయును.

శ్లో॥ కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః ।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యానియతాస్స్వయా॥ 20

పద॥ కామైః - తైః - తైః - హృతజ్ఞానాః- ప్రపద్యంతే - అన్యదేవతాః,
తం - తం - నియమం – ఆస్థాయ - ప్రకృత్యా - నియతాః - స్వయా॰

ప్రతి॥ తైః తైః = ఆ యా స్వభావముల కనుగుణ్యములగు, కామైః= కోరికలచేత, హృతజ్ఞానాః= అపహరింపబడిన జ్ఞానముగలవారలు, స్వయా= స్వకీయమైన, ప్రకృత్యా = స్వభావముచేత, నియతాః=ప్రేరేపింపబడినవారై,తం తం - అయా దేవతల కనుగుణమగు, నియమం = నిష్ఠను, ఆస్థాయ =అవలంబించి, అన్యదేవతాః = ఇతరదేవతలను, ప్రపద్యంతే = శరణు పొందుచున్నారు.(ఉపాసించుచున్నారు.)

తా॥ ఆత్మీయమైన స్వభావముచేత అనగా జన్మాంతరమునందు సంపాదింపబడిన సంస్కారముచేత ప్రేరేపింప బడినవారై, ఆయా కోరికలతో పోగొట్టబడిన ఆత్మజ్ఞానము గలవారు ఆ యా దేవతలను ఆరాధించుటకు తగిన నియమముల నవలంబించి, యితర దేవతలను సేవించుచున్నారు.

వి॥ మానవులు అనేక ప్రాపంచికమైన కోరికలను సాధించుటకొరకు అనేక దేవతలను ఆరాధించుటవలన సాక్షాత్ సర్వేశ్వరజ్ఞానము లేక ఆత్మ సాక్షాత్కార (స్వరూప) జ్ఞానము లేనివారగుచున్నారు.

శ్లో॥ యో యో యాం యాం తనుంభక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥ 21

పద॥ యః - యః - యాం - యాం - తనుం -భక్తః-శ్రద్ధయా-అర్చితుం-ఇచ్ఛతి, తస్య - తస్య - అచలాం- శ్రద్ధాం - తాం - ఏవ - విదధామి - అహమ్.

ప్రతి॥ యః యః భక్తః = ఏయే భక్తుడు, యాం యాం తనుం = ఏయే దేవతా స్వరూపమును, శ్రద్ధయా = ఆసక్తితో, అర్చితుం =ఆరాధించుటకొఱకు, ఇచ్ఛతి = ఇచ్ఛగించుచున్నాడో, తస్య తస్య = ఆ యా భక్తునియొక్క, తాం శ్రద్ధాం ఏవ = అట్టి యాసక్తినే, అచలాం = చలింపనివానినిగా, అహం =నేను .విదధామి = చేయుచున్నాను.

తా॥ ఏ యే కోర్కెగలభక్తుడు, ఏ యే దేవతాస్వరూపమును విశ్వాసముతో పూజింపగోరుచున్నాడో, ఆ యా కోర్కెలుగల భక్తునికి ఆ యా దేవతలయందు తగిన భక్తిని శ్రద్ధను నేను స్థిరమైనదానినిగా చేయుచున్నాను.

వి॥ కోరికలచే ఇతరదేవతల నారాధించుటవలన ఆత్మస్వరూపజ్ఞానమును పోగొట్టుకొనుచున్నారని పై శ్లోకములో చెప్పబడినది. ఇప్పుడు ఆ కోరికలను తానే సఫలము చేయునట్లును, ఆయా దేవతలయందు శ్రద్ధాభక్తిని స్థిరపరచునట్లును తానే చెప్పడమైనది. జీవులసంస్కారము ననుసరించి కోరికలు గలుగుచుండును. అట్టి స్థితిలో వారికి అవే సరిపడును. ఒక మహారాజు కుమారుడు బాల్యావస్థలో ఆటవస్తువులనే కోరుచుండును, అప్పుడు వానికి అవి యిచ్చిననే సంతుష్టి గలుగును. ఆ తరుణమున ఒక గవర్నరు స్థానము నిచ్చెదనన్న అత డంగీకరింపడు.

శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే।
లభతే చ తతః కామాన్మయైవ విహితాన్హితాన్॥ 22

పద॥ సః - తయా - శ్రద్ధయా - యుక్తః - తస్య - ఆరాధనం - ఈహతే, లభతే - చ - తతః - కామాన్ - మయా - ఏవ - విహితాన్ - హితాన్.

ప్రతి॥ సః = ఆ భక్తుడు, తయా శ్రద్ధయా = అట్టి శ్రద్ధతోడ, యుక్తః = కూడు కొనినవాడై, తస్య ఆరాధనం = ఆ దేవతయొక్క ఆరాధనమును, ఈహతే = ఇచ్ఛతోచేయుచున్నాడు,తతః చ = అట్టిఆరాధన వలనగూడ, మయా ఏవ= నాచేతనే, విహితాన్ =గలుగజేయబడినవియు, హితాన్ = ఇష్టములైనవియునగు,కామాన్ = కోరికలను, లభతే = పొందుచున్నాడు.

తా॥ ఆ భక్తుడు అట్టి శ్రద్ధతో గూడుకొనినవాడై ఆ దేవత యొక్క ఆరాధనమును (ఇచ్ఛతో) చేయుచున్నాడు. అట్టి దేవతా రాధనమువలనగూడ వాస్తవముగా నాచేతనేగలుగజేయబడునవియు, ఇష్టములైనవియు నగు కోరికలను పొందుచున్నాడు.

వి॥ ప్రభుత్వోద్యోగులు తమ క్రిందపనివారికి వారివారి పనులకు తగిన కూలిని ఇచ్చుచున్నను అది ప్రభుత్వముచేతనే యివ్వబడినదిగాను, నిర్ణయించ బడినది గాను ఉండును. అట్లే, ఇతర ఇంద్రాదిదేవతల నారాధించి పొందెడు ఫలముగూడ భగవత్ప్రదత్తమే యగుచున్నది.

శ్లో॥ అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।
దేవాన్దేవయజో యాన్తి మద్భక్తాయాంతి మామపి ॥ 23

పద॥ అంతవత్ - తు - ఫలం - తేషాం - తత్ - భవతి - అల్పమేధసాం.
దేవాన్ - దేవయజః - యాన్తి - మద్భక్తాః - యాన్తి - మాం - అపి.

ప్రతి॥ అల్పమేధసాం = అల్పబుద్ధిగల, తేషాం = అన్య దేవతారాధన పరులగు వారలకు, తత్ = ఆ, ఫలం తు = ఫలమన్ననో, అన్తవత్ = అంతము గలదిగా, భవతి=అగుచున్నది,దేవయజః=అన్యదేవతారాధనచేయువారు, ,దేవాన్=అట్టి దేవతలను, యాన్తి = పొందుచున్నారు, మద్భక్తాః అపి= నాభక్తులన్ననో, మాం = నన్ను, యాంతి = పొందుచున్నారు.

తా॥ అల్పబుద్ధిగలవారలగు అన్యదేవతారాధనపరులకు అట్టి దేవతారాధనమువలన గలిగెడు ఫలమన్ననో, అంతము గలదిగా నగుచున్నది. అన్యదేవతారాధనము చేయువారలు అట్టి దేవతలను పొందుచున్నారు. నా భక్తులన్ననో నన్ను పొందుచున్నారు.

వి॥ బ్రహ్మోపాసన తప్ప తక్కిన దేవతోపాసనలుచేయువారు, స్వల్ప బుద్ధిగలవారని భగవంతుడే యుపదేశించినాడు, సర్వేశ్వరభక్తి బ్రహ్మప్రాప్తికి

సాధనమగుచున్నది. తక్కిన దేవతల నుపాసించువారు ఆయా దేవతల లోక మును, ఫలమును మాత్రమే పొందుదురు. అవి యన్నియు నశాశ్వతములు.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః ।
పరం భావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్ ॥ 24

పద॥ అవ్యక్తం - వ్యక్తిం - ఆపన్నం - మన్యంతే - మాం - అబుద్ధయః,
పరం - భావం - అజానంతః -మమ - అవ్యయం - అనుత్తమమ్.

ప్రతి॥ అబుద్ధయః = మంద బుద్ధులు, అవ్యయం = నాశము లేనిదియును, అనుత్తమం = ఉత్తమోత్తమమైనదియు, పరం= ప్రకృతికంటె విలక్షణ మైనదియు నగు, మమ భావం = నాయొక్క నిజస్వరూపమును, అజా నంతః = తెలిసికొనజాలనివారై, అవ్యక్తం = చక్షురాదీంద్రియములకు గోచరింపని, మాం = నన్ను, వ్యక్తిం ఆపన్నం = ఇంద్రియ గోచరత్వ మును పొందిన వానినిగా (వ్యక్తమైనవానినిగా), మన్యంతే = తలంచు చున్నారు.

తా॥ మందబుద్ధులు వ్యయములేనిదియు, ఉత్తమోత్తమమైన దియు, ప్రకృతికంటె విలక్షణమైనదియునైన నా స్వరూపమును తెలియనివారై,చక్షురాదీంద్రియములకు గోచరించని నన్ను ఇంద్రియ గోచరత్వమును పొందినవానినిగా వ్యక్తునిగా తలంచుచున్నారు.

వి॥ సాక్షాత్ శ్రీకృష్ణతత్త్వము సర్వోత్తమమగు పరబ్రహ్మస్వరూపమని తెలిసికొనజాలని మలినబుద్ధిగలవారు. శ్రీ కృష్ణపరమాత్మను శ్రీదేవకీ వసు దేవులకు బుట్టిన యీ కనిపించెడు మానవ స్వరూపమునుగా తలంతురు.

శ్లో॥ నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్॥ 25

పద॥ న - అహం - ప్రకాశః - సర్వస్య - యోగమాయాసమావృతః,
మూఢః-అయం - న- అభిజానాతి - లోకః - మాం - అజం - అవ్యయమ్.

ప్రతి॥ అహం = నేను, యోగమాయాసమావృతః = యోగమాయచే కప్పబడిన వాడనై, సర్వస్య = సమస్తజనులకును, ప్రకాశః = ప్రకాశించువాడను, న = కాను, మూఢః = ఆత్మజ్ఞానములేని, అయం = ఈ, లోకః=జనము,

మాం = నన్ను, అజం = జన్మరహితునిగను, అవ్యయం = నాశరహితునిగను, న అభిజానాతి = ఎఱుంగుటలేదు.

తా॥ నేను యోగమాయచే గప్పబడినవాడనై సమస్త జనమునకు (అందఱికిని) గోచరించువాడనుకాను. వివేకములేని యీజనము (లోకము) నన్ను జన్మరహితునిగను, నాశరహితునిగను ఎఱుగజాలకున్నది.

వి॥ సర్వేశ్వరుడు తనచే కల్పింపబడిన యోగమాయాశక్తిచే ఆవృతుడై యున్నందున అందఱును అతనిని జూడజాలకున్నారు. ఎవడు తనఅంతఃకరణము యొక్క యావరణము నశించినంతట తన ఆత్మస్వరూపమును దర్శింప శక్తుడగునో, వాడు సర్వేశ్వరుని నిరావరణముగ చూడగలుగును, తన శరీరమును జూడజాలని గ్రుడ్డివాడు ఇతరుల శరీరముల నెట్లు జూడజాలడో, తనశరీరమును జూడ నేత్రము గలవాడు ఇతరశరీరములన్నిటిని ఎట్లు చూడగలుగునో. అటులనే ముందు తనలోని ఆవరణ తొలగినచో సర్వేశ్వరుని నిరావరణముగ దర్శింపగలడు, ఇదియే దీనియొక్క రహస్యము, ఇది జ్ఞానమార్గము, ఇక భక్తి మార్గమొకటి గలదు. పరదా లోపలనుండు రాణివాసము గలవారిని ఇతరపురుషులు జూడజాలకపోయినను, తన బిడ్డలకు ఎల్లప్పుడును, అడ్డులేకనే వచ్చి చూచిపోవుటకు ఎట్లనుకూలముండునో, ఆలాగున పరమ భక్తులకు భగవంతుడు అడ్డులేకనే దర్శన మిచ్చుచుండును.

శ్లో॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున !
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26

పద॥ వేద – అహం – సమతీతాని – వర్తమానాని – చ – అర్జున !,
భవిష్యాణి – చ – భూతాని – మాం – తు – వేద – న – కశ్చన.

ప్రతి॥ హే అర్జున ! = ఓ యర్జునా !, అహం = నేను, సమతీతాని = గడచిపోయి నట్టియు, వర్తమానాని చ = ఇప్పుడుండునట్టియు. భవిష్యాణిచ = ఇక ముందు గలుగబోవునట్టియు, భూతాని = ప్రాణులను, వేద–ఎఱుంగుదును, మాం తు = నన్ననన్ననో, కశ్చన = ఎవడును, వేద=ఎఱుంగడు

తా॥ ఓ అర్జునా! ఇదివఱకు గతించినవియును, ఇప్పుడు ఉన్నవియును, ఇకమీద ఉండబోవునట్టివియు నయిన ప్రపంచము

లను లేక ప్రాణులను నేనెఱుగుదును. ఆ ప్రాణులలో ఆత్మజ్ఞాని లేక పరమైకాంత భక్తుడు తప్ప తక్కినవారు నన్నెఱుగరు.

శ్లో॥ ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత !।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప ! ॥ 27

పద॥ ఇచ్ఛాద్వేషసముత్థేన – ద్వంద్వమోహేన – భారత !,
సర్వభూతాని – సమ్మోహం – సర్గే - యాంతి - పరంతప !.

ప్రతి॥ హే భారత ! = ఓ యర్జునా!, సర్వభూతాని = సకలజంతువులు, ఇచ్ఛాద్వేషసముత్థేన =కామక్రోధములవలన గలిగిన, ద్వంద్వమోహేన= సుఖదుఃఖాది ద్వంద్వరూపమగు మాయచేత, సమ్మోహం = మిక్కిలి యజ్ఞానమును, సర్గే = జనన కాలమునందు. యాంతి = పొందుచున్నవి.

తా॥ శత్రుసంతాపకుడవగు ఓ యర్జునా ! సకల ప్రాణులును పుట్టుకతోడనే కామక్రోధములవలన గలిగిన సుఖదుఃఖాది ద్వంద్వ రూపమగు యాయచేత మిక్కిలి యజ్ఞానమును పొందుచున్నవి.

వి॥ భగవత్సాక్షాత్కారజ్ఞానము అందఱికిని యెందులకు గలుగుట లేదో యెందువలన అందఱుమ భవబంధవిముక్తిని పొందుటలేదో ఆ విషయము ఈశ్లోకమున నిరూపింపబడినది. ఇచ్ఛాద్వేషములు, సుఖదుఃఖములు.రుచి అరుచులు. శత్రుమిత్రులు అను ఈ ద్వంద్వములలో తగిలియుండుటచేత అవియే బంధరూపములుగా పరిణమించుచున్నవి. వానిని ఆత్మజ్ఞాన ఖడ్గముచే ఛేదించిన భవబంధ విమోచనము గలుగును. ఇట్టి స్థితి తనకు గలిగినదా? అని ప్రతి వారును ఆలోచించు కొనిన చాలును. అప్పుడు ఎందుకు మోక్షము గలుగలేదో భగవద్దర్శనము ఎందుకు గలుగలేదో మఱియొకరిని అడుగకనే తన యాత్మ నుండియే స్పష్టముగా సమాధానము లభించును. ఇచ్ఛాద్వేషములే మోక్షద్వారముయొక్క రెండు తలుపులు, వీనిని తెరువ వలయును. అనగా విడువవలెను.

శ్లో॥ యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః ॥ 28

పద॥ యేషాం– తు - అంతగతం- పాపం - జనానాం - పుణ్యకర్మణాం,
తే- ద్వంద్వమోహనిర్ముక్తాః- భజంతే - మాం-దృఢవ్రతాః.

ప్రతి॥ పుణ్యకర్మణాం = పుణ్యకర్మలు చేసినట్టి, జనానాం = మనుష్యులలో, యేషాం = ఎవరియొక్క, పాపం తు = పాపమైతే, అంతగతం = నశించిన దగుచున్నదో, తే = అట్టివారు, ద్వంద్వమోహనిర్ముక్తాః = శీతోష్ణాది ద్వంద్వమోహమువలన గలిగెడు సుఖదుఃఖరూపమగు అజ్ఞానముచే విడువబడిన వారును, దృఢవ్రతాః = దృఢమైన వ్రతనిష్ఠ గలవారునై. మాం = నన్ను, భజంతే = భజించుచున్నారు.

తా॥ చిత్తశుద్ధికి కారణమైన సత్కార్మానుష్ఠానమునుచేసి సకల పాపములను నశింపజేసికొనిన మహానుభావులు రాగద్వేషములవలన గలిగిన యవివేకముచేత విడువబడినవారును, నిశ్చలమైన నియమము గలవారునై నన్ను పొందుచున్నారు.

వి॥ ఏదిఏమైన ఒక్క బ్రహ్మచర్యవ్రతమునుగాని, అనుష్ఠానవ్రతమును గాని అహింసావ్రతమునుగాని, సత్యవ్రతమునుగాని, ఆహారనియమమునుగాని యేర్పరచుకొని బ్రహ్మనిష్ఠ చేయ నారంభించినచో అప్పుడప్పుడు వ్రతభంగము గలిగి తన నిష్ఠ పూర్తిగాకపోవుటకు కారణము దీనియందు తెలుపడమైనది. అట్టి వారి అంతఃకరణములో జన్మాంతరపాపము నశించలేదు. అట్టి పాపమెట్లు నశించుననగా పుణ్యకర్మములచేతనే నశించును. మలినవస్త్రమందుగాని, క్రొత్తవస్త్రమైనను గంజి, పిండి మొదలైనవి గలిగి యుండినగాని, ఉతికి శుభ్రము చేయక రంగులో నద్దిన, నీటిలో తడిపిన వెంటనే యెట్లు రంగు వదలిపోవునో, ఆలాగున ఆత్మశుద్ధిలేని వారి నియమములన్నియు నిలువకయే పోవుచుండును. మఱియు మట్టిగోడపై సిమెంటుపూతవేసిన నీళ్ళచే తడుపు వఱకు గట్టిగా నుండును. కాని నీళ్ళు తడిపిన వెంటనే మట్టి కరగి సిమెంటును త్రోసివేయుచుండును. పచ్చియిటుకలతో గట్టిన గోడకైనను అదేగతి సంభవించును. కాలిన యిటుకలతో గట్టిన గోడయైనచో నీటిచే నెంత తడిపినను అంతకంతకు బలము అధికరించునేగాని గోడనుండి సిమెంటు వదలిపోదు. పుణ్యకర్మలచే నాత్మశుద్ధి గలిగినవారి వ్రతములకు ఎంత హాని గలిగినను, అది అంతకంతకు బలపడునేగాని, సడలుటయనునది గలుగనే కలుగదు. ఈ తత్త్వమును గుర్తెఱింగినచో పుణ్య కర్మలను ఆక్షేపించుచు తత్త్వవిచారణ చేయవలెనని చెప్పుచుండుకొందఱి వేదాంతుల స్థితి యేమగునో తెలిసికొనవచ్చును,

శ్లో॥ జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మచాఖిలమ్ ॥ 29

పద॥ జరామరణమోక్షాయ – మాం – ఆశ్రిత్య – యతంతి – యే.
తే-బ్రహ్మ - తత్ - విదుః - కృత్స్నం-అధ్యాత్మం - కర్మ - చ - అఖిలమ్,

ప్రతి॥ యే = ఎవరు, జరామరణమోక్షాయ = జననమరణములనుండి విముక్తి కొఱకు, మాం = నన్ను, ఆశ్రిత్య = ఆశ్రయించి, యతంతి = యత్నించు చున్నారో, తే = అట్టివారు, కృత్స్నం అధ్యాత్మం = ప్రపంచము నందలి సకల చరాచరములయందు వ్యాపించి యుండునట్టి ఆత్మను, అఖిలం కర్మ చ=సమస్తకర్మమును, తత్=ఆ, బ్రహ్మ = బ్రహ్మస్వరూప మునుగా, విదుః = ఎఱుంగుచున్నారు.

తా॥ ఎవరు పరబ్రహ్మమునగు నన్ను ఆశ్రయించి జరామరణ ములనుండి ముక్తినొందుటకై అనగా మోక్షముకొఱకు ప్రయత్నిం చుచున్నారో, అట్టివారు ప్రపంచమందలి సకల చరాచరములయందు వ్యాపించియుండునట్టి ఆత్మను,సమస్తకర్మములను ఆ బ్రహ్మస్వరూప ముగా నెఱుగుచున్నారు.

శ్లో॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్త చేతసః ॥ 30

పద॥ సాధిభూతాధిదైవం – మాం – సాధియజ్ఞం - చ – యే - విదుః ।
ప్రయాణకాలే - అపి – చ - మాం – తే - విదుః – యుక్తచేతసః ॥

ప్రతి॥ యే = ఎవరు, మాం=నన్ను, సాధిభూతాధిదైవం = అధిభూత అధి దైవము లతో గూడినవానినిగాను, సాధియజ్ఞం చ = అధి యజ్ఞముతో గూడిన వానినిగాను, విదుః = తెలిసికొందురో, తే = వారలు, ప్రయాణకాలే అపి చ = ప్రాణ ప్రయాణసమయమందు సయితము, యుక్తచేతసః = మనోనిగ్రహముగలవారై, మాం = నన్ను, విదుః = ఎఱుంగగలరు.

తా॥ అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతోగూడినవానినిగా నన్ను తెలిసికొనినవారు ఇంద్రియవ్యాకులతగల మరణకాలమందు సయితము నాయందైక్యపరచిన మనస్సు గలవారగుటచే నన్ను తెలిసికొనగలరు.

వి॥ మరణకాలములో నింద్రియములకు వికారములు గలుగుట సహజము. అయినను పరమాత్మయందు మనస్సును ఐక్యపరచినవారలకు అట్టి విషమస్థితిలో గూడ ఆత్మజ్ఞానము భగవద్భావము మరపునకు రావు. ఒకవేళ వీడు మరచి నను భయపడనక్కరలేదు. భగవంతుడు వీనిని మరచుటలేదు, ఇక నేమి కావ లెను? దేహమునుండి వియోగము కలిగిన వెంటనే పూర్వము కలిగియుండు ఆత్మభావములో నుండునని తాత్పర్యము. అధియజ్ఞాదులను గుఱించి, అష్టమా ధ్యాయమున తెలుపబడును.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే విజ్ఞానయోగో నామ
స ప్త మో ఽ ధ్యా య ః.

పద॥ ఇతి - శ్రీమద్భగవద్గీతాసు-ఉపనిషత్సు- బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే – విజ్ఞానయోగః - నామ - సప్తమః – అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇది, ఉపనిషత్సు = ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యా యాం = బ్రహ్మవిద్యారూపమును, యోగశాస్త్రే = యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదే = శ్రీకృష్ణార్జున సంవాదరూపమునగు, శ్రీమత్ భగవద్గీతాసు = శ్రీభగవద్గీతయందు, విజ్ఞానయోగః = పరమాత్మయందు ఆత్మను ఐక్యపరచెడు యోగమని, నామ = ప్రసిద్ధిగల, సప్తమః = ఏడవ, అధ్యాయః = అధ్యాయము సంపూర్ణము.

తా॥ ఇట్లు ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యాస్వరూ పమును, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీమద్భగవద్గీతయందు విజ్ఞానయోగమని ప్రసిద్ధిచెందిన యేడవ యధ్యాయము సంపూర్ణము.

ఓమ్ తత్ సత్.



ఓమ్

శ్రీ కృష్ణ పర బ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## అష్టమోఽధ్యాయః - అష్టమాధ్యాయము

## అక్షరపరబ్రహ్మయోగః - అక్షరపరబ్రహ్మయోగము



ఈ యష్టమాధ్యాయమునకు "అక్షరపరబ్రహ్మయోగ"మని పేరు. అనగా నాశములేని పరమాత్మయందు ఐక్యమును గలుగజేయునదని యర్థము ఋషులు బాలురకు బాల్యమున అక్షరాభ్యాసము నేర్పించుటలోగల రహస్యము ఇదియే. అనగా పరమాత్మైక్యమును బోధించుటకే మొదటనే పరబ్రహ్మమును తెలిపెడు 'ఓం' అను ప్రణవము నుపదేశించుటకు కారణమైనది. అంత్యమందును ఆత్మ జ్ఞానులు ఈ ప్రణవమును ధ్యానించియే పరమాత్మయందు ఐక్యము నొందుచున్నారు, అనగా ఏకత్వావస్థగలవారగుచున్నారు. లేక భక్తిమార్గమైనచో పరమాత్మ దగ్గఱకు చేరుచున్నారు. ఇదిమొదటిది. మఱియు యోగము ననుసరించి యొకటి, జ్ఞానము ననుసరించి యింకొకటి, యుపాసన ననుసరించి మఱియొకటి పద్ధతులు గలవు, క్షరమైన "అపరవిద్య"లోనే అనగా శాస్త్రపఠనములోనే కాలము గడుపక అంత్య కాలమునందైనను పరవిద్యయగు బ్రహ్మవిద్యయందు ప్రవేశించి, అక్షరాభ్యాస కాలము నందు ఏ ఓంకార ముపదేశింపబడి యున్నదో, అట్టి ప్రణవోపాసనా పరుడై పరమపురుషుడగు శ్రీమన్నారాయణునియందైక్యము గావలెనని తలంపుగలిగి పరమకరుణతో ఋషులిట్టి పద్ధతి నేర్పరచిరి. ఏలన. ఈ ప్రజలు ఋషుల సంతాన మగుటచే వీరును ఆ ఋషిత్వమును పొంది శాశ్వతమగు బ్రహ్మసాక్షాత్కారము గలవారు గావలయుననియే వారి యభిమతము.

అర్జున ఉవాచ:— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ! ।
అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే ॥ 1

పద॥ కిం - తత్ — బ్రహ్మ - కిం - అధ్యాత్మం - కిం - కర్మ - పురుషోత్తమ !
అధిభూతం - చ - కిం - ప్రోక్తం - అధిదైవం - కిం - ఉచ్యతే.

ప్రతి॥ హే పురుషోత్తమా! = పురుషోత్తముడవగు శ్రీకృష్ణమూర్తీ!. తత్ బ్రహ్మ కిం=(1)ఆ బ్రహ్మమెట్టిది? అధ్యాత్మం కిం?=(2)అధ్యాత్మమనగా నెట్టిది,

కర్మ కిం?= (3) కర్మయనగా నెట్టిది? అధిభూతం చ కిం ప్రోక్తం?= (4) ఏది యధిభూతమని చెప్పబడుచున్నది?,అధిదైవం కిం ఉచ్యతే ? = (5) ఏది యధిదైవమని చెప్పబడుచున్నది;

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! (1) బ్రహ్మమననేది? (2) అధ్యాత్మ మేది? (3) కర్మమన నెట్టిది ? (4) అధిభూతమనునది యేది ? (5) అధిదైవ మేది?

శ్లో॥ అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్మధుసూధన !
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ 2

పద॥ అధియజ్ఞః - కథం - కః - అత్ర - దేహే - అస్మిన్ - మధుసూదన!, ప్రయాణకాలే - చ - కథం - జ్ఞేయః - అసి - నియతాత్మభిః,

ప్రతి॥ హే మధుసూదన! = ఓ కృష్ణమూర్తీ, అస్మిన్ దేహే = ఈదేహమునందు అధియజ్ఞః = (6) అధియజ్ఞుడు, కః = ఎవడు, అత్ర = ఈదేహమునందు, కథం = ఎట్లున్నాడు, నియతాత్మభిః=మనోనిగ్రహము గలవారిచేత(నీవు), ప్రయాణకాలే చ=ప్రాణప్రయాణ సమయమునందును,కథం జ్ఞేయః అసి= (7) ఎట్లెరుంగబడుచున్నావు?

తా॥ ఓ కృష్ణమూర్తీ, ఈ దేహమునందు (6) అధియజ్ఞు డెవడు? ఎట్లున్నాడు? మనోనిగ్రహము గలవారిచేత నీవు ప్రాణ ప్రయాణ సమయమునందును(7) ఎట్లు ఎఱుంగబడుచున్నావు?

వి॥ దీనిలో గల 7 ప్రశ్నలలో 6 ప్రశ్నలు సామాన్యములు. 7 వ ప్రశ్న ముఖ్యమైనది. ఇయ్యది ప్రతిముముక్షువును దెలిసికొనదగినది. ఏలన,అంత్యకాలమున ధ్యానయోగపరులెట్లు భగవంతుని పొందగలరు?లేక భగవంతునియం దైక్యము నెట్లు చెందగలరు! లేక భగవత్సాక్షాత్కారస్థితిలో ఎట్లు నిలువగలరు? అను విషయిము తెలిసికోదగినదికదా? అంత్యకాలమున భగవద్భావన గలిగి భగవత్ సాయుజ్యమును పొందుటకు గదా భక్తులందఱు ముముక్షువులందఱు యోగులందఱు చిరకాలమునుండి ధ్యానాద్యనుష్ఠానము జేయుచున్నారు.

శ్రీ భగవానువాచ:—శ్రీభగవంతుడు చెప్పెను.

శ్లో॥ అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।
భూత భావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ 3

పద॥ అక్షరం - బ్రహ్మ - పరమం - స్వభావః - అధ్యాత్మం - ఉచ్యతే, భూతభావోద్భవకరః - విసర్గః - కర్మసంజ్ఞితః,

ప్రతి॥ బ్రహ్మ = బ్రహ్మము (పరమాత్మ), పరమం = సర్వోత్కృష్టమైన, అక్షరం = అక్షరమనియు, స్వభావః = జీవసంజ్ఞగల ప్రత్యగాత్మ భావము, అధ్యాత్మం = అధ్యాత్మమనియు, ఉచ్యతే = చెప్పబడుచున్నది భూతభావోద్భవకరః=సమస్తభూతములకు నుత్పత్తికారణమగు, విసర్గః= దేవతల నుద్దేశించి మంత్రపూర్వకముగా నగ్నియందు చేయబడు హోమము లేక అందు యివ్వబడు ఆహుతి, కర్మసంజ్ఞితః= కర్మయని చెప్పబడుచున్నది.

తా॥ (1) నిరతిశయమైనదియు, నాశము లేనిదియు బ్రహ్మ మనబడును. (2) ఆ పరబ్రహ్మముయొక్క యంశమైన జీవసంజ్ఞగల ప్రత్యగాత్మయొక్క యే స్వభావముగలదో యది యధ్యాత్మ మన బడును. (3) స్థావరజంగమాది సకలభూతములయొక్క యుత్పత్తికి కారణభూతమైనదియు, దేవతోద్దేశముచేత మంత్రపూర్వకముగా జేయబడునదియును నగు యజ్ఞము కర్మమనబడును.

శ్లో॥ అధిభూతం క్షరోభావః పురుషశ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర! ॥ 4

పద॥ అధిభూతం - క్షరః - భావః – పురుషః - చ - అధిదైవతం, అధియజ్ఞః - అహం - ఏవ - అత్ర - దేహే - దేహభృతాంవర !

ప్రతి॥ దేహభృతాంవర ! = దేహధారులలో శ్రేష్ఠుడవగు నో యర్జునా!, అధి భూతం = అధిభూతమనునది, క్షరఃభావః = నశించునట్టి స్వభావము గలది, అధిదైవతం చ = అధిదైవతమన్ననో, పురుషః = అక్షరుడగు హిరణ్యగర్భుడే, అత్రదేహే = ఈ దేహమునందు, అధియజ్ఞః=అధియజ్ఞు డను వాడను, అహంఏవ = నేనే.

తా॥ (4) దేహధారులలో శ్రేష్ఠుడవగు నో అర్జునా! నశించు నట్టి స్వభావముగల శరీరాదిపదార్థములు అధిభూతమనబడును. (5)అధిదైవతమన్ననో అక్షరుడగు హిరణ్యగర్భుడు. (6) ఈ దేహ మునందు సర్వాత్మకుడనైన నేనే అధియజ్ఞు డనబడుచున్నాను.

శ్లో॥ అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః ॥ 5

పద॥ అంతకాలే - చ - మాం - ఏవ - స్మరన్ - ముక్త్వా - కళేబరం,
యః - ప్రయాతి - సః - మద్భావం - యాతి - నాస్తి-అత్ర-సంశయః

ప్రతి॥ యః = ఎవ్వరు, అంతకాలే చ = మరణకాలమందును, మాం ఏవ = నన్నే, స్మరన్ = ధ్యానించుచు (స్మరించుచు), కళేబరం = దేహమును, ముక్త్వా = విడిచి, ప్రయాతి =పోవుచున్నాడో, సః=వాడు, మద్భావం= నాస్వరూపమును, యాతి = పొందుచున్నాడు, అత్ర = ఈ విషయము నందు, సంశయః = సందేహము, న అస్తి = లేదు.

తా॥ (7) ఎవడైతే మరణకాలమునందు నన్నే స్మరించుచు లేక ధ్యానించుచు దేహమునువిడిచి పోవుచున్నాడో, వాడు నాయొక్క విష్ణు స్వరూపమును లేక మోక్షమును పొందుచున్నాడు; ఈ విషయము నందు కొంచమైనను అనుమానము లేదు.

వి॥ దీనియందు "ఎవడైనను" అని చెప్పియుండుటచే ఏ వ్యక్తి యయి ననుసరే అంత్యకాలమున భగవత్స్మరణముగాని, ధ్యానముగాని గలిగియుండ వలసియుండినచో ముందుగానే అట్టి యనుష్ఠానము గలిగియుండవలెను. ఒక వేళ జన్మాంతర సుకృత విశేషముచే నంత్యకాలమున భగవత్స్మృతి గలిగినను గలుగవచ్చును, కాని ఆలాగున గలుగుట దుస్తరము, పరీక్షాసమయమున పుస్తకముల కట్టవిప్పి చూడదలంచినవాడు పరీక్షలో నెట్లు ఉత్తీర్ణుడు కాగలడు ! సంవత్సరమంతయు శ్రద్ధగా చదువుచుండిననేకదా పరీక్షలో ప్రశ్నకు సమాధాన మీయగలడు. సంవత్సరము పొడుగున చదివిన వారిలోగూడ ఎందరో తప్పిపోవుచున్నారు. బహుకాలమునుండి ధ్యానస్మరణాదులు చేయుచున్నవానికి అంత్యకాలమున భగవత్స్మరణధ్యానవిస్మృతి కలిగినను దోసములేదు,శరీరము నందు గల శ్లేష్మదోషముచే స్మృతి తప్పియుండవచ్చును. శరీరమునుండి ఆత్మ విడుదల అయిన వెంటనే తనయొక్క పూర్వపు స్మరణ జ్ఞాన ధ్యానములు తప్పక గలుగును. పగలు చదివిన పాఠము నిద్రలో మరచిపోయినను, మరురోజు జాగ్రదవస్థలో ఎట్లు జ్ఞాపకమునకు వచ్చునో. ఇదియు నటువంటిదే. అర్జునుడు జేసిన యేడు ప్రశ్నలకు శ్రీ భగవంతుడు చెప్పిన సమాధానము నొక్కొక్క దానిని నెంబరు ప్రకారము చూచుకొనిన బోధపడగలదు.

శ్లో॥ యం యం వాఽపి స్మరన్భావం త్యజత్యన్తే కళేబరమ్ ।
తం తమేవైతి కౌంతేయ ! సదా తద్భావ భావితః ॥ 6

పద॥ యం - యం - వా - అపి - స్మరన్ – భావం - త్యజతి - అన్తే - కళేబరం, తం - తం - ఏవ - ఏతి - కౌంతేయ! - సదా - తద్భావభావితః.

ప్రతి॥ హే కౌంతేయ ! = ఓ యర్జునా ! (ఎవడు), అన్తే = మరణకాలమునందు యం యం భావం అపి వా = ఏ యే భావమునైనను సరియే స్మరన్ = స్మరించుచున్నవాడై, కళేబరం = దేహమును, త్యజతి = విడుచు చున్నాడో(వాడు), సదా=ఎల్లప్పుడును, తద్భావభావితః=ఆ యారూపము (భావము) యొక్క స్మరణముచేత గలిగిన సంస్కారముగలవాడై తం తం ఏవ = ఆయా స్వరూపమునే, ఏతి=పొందుచున్నాడు.

తా॥ ఓ యర్జునా ! ఎవడు మరణకాలమందు ఏయే భావము గలవాడై యేయే రూపమును స్మరించుచున్నవాడై దేహమును విడుచు చున్నాడో, వాడెల్లప్పుడును ఆ యా రూపముయొక్క స్మరణముచేత గలిగిన సంస్కారము గలవాడై నందున ఆ యా స్వరూపమునే(జన్మ మునే) పొందుచున్నాడు.

వి॥ జనులారా ! సంస్కారబలము సామాన్యమైనదిగాదు. జడభరతుడుగొప్ప రాజర్షి. ఆతడు పయస్వినీ నదీతీరమున పర్ణశాలను నిర్మించుకొని యేకాంతమున గొప్ప తపస్సు జేయుచుండెను. ఇట్లు మహాతపస్వియు, యోగియు నయినను, అంత్యకాలమున తాను పెంచుచుండిన జింకయొక్క స్మరణము గలిగినందుచే మఱల లేడిజన్మ మెత్తవలసివచ్చెను. శ్రీమత్ భాగవతమున ఈ గాథగనందగును. ఇట్లుండగా ఏలాటి యనుష్ఠానములేక ఇహ దృశ్యములతో కట్టబడియుండు మనస్సు గలవాడు అంత్యకాలమున ఈ బంధముల నన్నిటిని విస్మరింప చేసి కొని పరమాత్మను ఎట్లు స్మరింప గలుగునో యోచించుకొనుడు.

శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః ॥ 7

పద॥ తస్మాత్ - సర్వేషు - కాలేషు - మాం - అనుస్మర- యుధ్య - చ, మయి - అర్పితమనోబుద్ధిః - మాం - ఏవ - ఏష్యసి- అసంశయః.

ప్రతి॥ తస్మాత్ = కాబట్టి. సర్వేషు కాలేషు = సర్వకాలములయందును,మాం అనుస్మర = నన్నే స్మరించుచుండుము (ధ్యానించుచుండుము). యుధ్య చ= యుద్ధమునున్ను చేయుము, మయి అర్పితమనోబుద్ధిః = నాయందే సమర్పింపబడిన మనసును బుద్ధియును గలవాడవై, మాం ఏవ ఏష్యసి= నన్నే పొందగలవు. అసంశయః = ఈ విషయమున సంశయములేదు.

తా॥ దేహత్యాగకాలమందలి భావన దేహాంతర ప్రాప్తికి కారణము గనుక సర్వకాలముల యందును నన్నే స్మరింపుము, మనస్సును, బుద్ధిని నాయందే సమర్పించిన వాడవై యుద్ధమును చేయుము. ఇట్లు చేసినయెడల నీవు నన్నే పొందగలవు సందేహము లేదు.

వి॥ ఒక లక్ష్యమునుగూర్చి విడిచిపెట్టబడిన బాణము ఆ లక్ష్యమునే చేరునట్లు అంత్యకాలమున ఏ భావముండునో దాని ననుసరించిన జన్మమే కలుగును. బ్రహ్మభావము గలవాడు ముక్తుడగును.

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥ 8

పద॥ అభ్యాసయోగయుక్తేన - చేతసా - న - అన్యగామినా,
పరమం - పురుషం-దివ్యం - యాతి - పార్థ! అనుచింతయన్.

ప్రతి॥ హే పార్థ! = ఓ యర్జునా!, అభ్యాసయోగయుక్తేన = అభ్యాసమనెడు యోగముతో కూడినదియు, న అన్యగామినా= ఇతరవిషయములందు ప్రవర్తింప నిదియు నగు, చేతసా = మనస్సుచేత, అనుచింతయన్= చింతించుచున్నవాడై, దివ్యం=అప్రాకృతుడైనట్టియు, పరమం = శ్రేష్ఠుడైనట్టియు, పురుషం = పరమపురుషుని, యాతి = పొందుచున్నాడు.

తా॥ ఓ యర్జునా! అభ్యాసమనియెడు యోగముతో గూడుకొనినదియును, అన్యాయత్తము కానిదియు నయిన చిత్తముచేత పరమ పురుషుని ధ్యానముచేయుచు ఆ పరమ పురుషునే పొందుచున్నాడు.

వి॥ దీనివలన ఎంత తత్త్వవేత్తయయినను ధ్యానయోగాభ్యాసము గలిగియుండవలెనని తెలుపడమైనది.

శ్లో॥ కవిం పురాణమనుశాసితారమణోరణీయాంసమనుస్మరేద్యః ।
సర్వస్యధాతారమచింత్యరూపమాదిత్యవర్ణంతమసః పరస్తాత్॥ 9

పద॥ కవిం – పురాణం-అనుశాసితారం - అణోః -అణీయాంసం-అనుస్మరేత్-యః, సర్వస్య-ధాతారం-అచింత్యరూపం-ఆదిత్యవర్ణం-తమసః-పరస్తాత్.

ప్రతి॥ యః = ఏ పురుషుడు, కవిం = సర్వజ్ఞుడును, పురాణం = అనాదియైన వాడును, అనుశాసితారం = జగన్నియామకుడును, అణోః = సూక్ష్మము కంటె, అణీయాంసం = మిగుల సూక్ష్మమైనవాడును, సర్వస్య=సమస్తమును, ధాతారం రక్షించువాడును, అచింత్యరూపం= చింతింప నలవి కాని స్వరూపము కలవాడును, ఆదిత్యవర్ణం = సూర్యునియొక్క ప్రకాశమువంటి కాంతిగలవాడును, తమసః = అజ్ఞానాంధ కారముకంటె, పరస్తాత్=అతీతుడును అయిన పరమ పురుషుని, అనుస్మరేత్ =స్మరించునో, వాడు ఆ దివ్యపురుషుని పొందుచున్నాడు.

తా॥ ఏ పురుషుడు సర్వజ్ఞుడును, జగన్నియామకుడును, సూక్ష్మముకంటెను మిక్కిలి సూక్ష్మమైనవాడును, సమస్తమును రక్షించు వాడును, చింతింప నలవికాని స్వరూపము కలవాడును, సూర్యుని యొక్క ప్రకాశమువంటి కాంతిగలవాడును, అజ్ఞానాంధ కారముకంటె నతీతుడును అయిన పరమపురుషుని స్మరించునో వాడు ఆ దివ్యపురుషుని పొందుచున్నాడు.

శ్లో॥ ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగ బలేన చైవ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
సతం పరం పురుషముపైతి దివ్యమ్॥ 10

పద॥ ప్రయాణకాలే - మనసా - అచలేన - భక్త్యా - యుక్తః –యోగబలేన-చ - ఏవ - భ్రువోః - మధ్యే - ప్రాణం - ఆవేశ్య - సమ్యక్ - సః - తం - పరం - పురుషం - ఉపైతి - దివ్యమ్.

ప్రతి॥ ఎవడు, ప్రయాణకాలే = మరణకాలమందు, అచలేన = నిశ్చలమైన, మనసా = మనస్సుతోడను, భక్త్యా = భక్తితోడను, యోగబలేన చ ఏవ = యోగబలము తోడను, యుక్తః = కూడుకొనినవాడై, భ్రువోః =

కనుబొమ్మల యొక్క, మధ్యే = మధ్యయందు, ప్రాణం = ప్రాణవాయువును, సమ్యక్ = బాగుగ, ఆవేశ్య = స్థాపించి, తం = ఆ పరమపురుషుని, అనుస్మరేత్ = స్మరించునో, సః = ఆ పురుషుడు. దివ్యం = ప్రకాశాత్ముడును. పరం = సర్వోత్తముడును అయిన, పురుషం =పరమపురుషుని, ఉపైతి = పొందుచున్నాడు.

తా॥ ఎవడు అంత్యకాలమున నిశ్చలమైన మనస్సుతోడను, భక్తితోడను, యోగబలముతోడను కూడుకొనినవాడగుచు, కనుబొమ్మలయొక్క మధ్యయందు ప్రాణవాయువు నుంచి యప్రమత్తుడై ఆ పరమపురుషుని స్మరించునో, ఆ మనుజుడు ప్రకాశాత్ముడును, సర్వోత్తముడు నయిన పరమపురుషుని బొందుచున్నాడు.

వి॥ దీనియందు బ్రహ్మాభ్యాస మెట్లుచేయవలయునో తెలుపడమైనది. కేవలము యోగము మాత్రము చాలదు. కేవలము ఒక్కభక్తిమాత్రము చాలదు. రెండును గలిగియుండవలెను. యోగసాధన లేనిచో ఇంద్రియవశీకరణము. చిత్తైకాగ్రత గలుగదు, భక్తిలేనిచో అహంకారము నశించదు. తెల్ల కిరసనాయిలును, గాలియును కలిసియున్నప్పుడు గ్యాస్‌గా మారి గ్యాస్‌లైటు వెలుగుచుండును, వీనిలో ఏదైన ఒకటి మాత్రముండిన చాలదు, అలాగున నిప్పు, నీరు రెండింటియొక్క శక్తిగల్గియున్నప్పుడు స్టీము (ఆవిరి) ఏర్పడుచుండును. అప్పుడు రైలింజను ఏలాగున అతివేగముగా పోవుచుండునో, అలాగున భక్తియును యోగమును గలవాడు ముక్తిపదమును సులభముగా పొందును.

శ్లో॥ యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయోవీతరాగాః
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥ 11

పద॥ యత్ - అక్షరం - వేదవిదః - వదంతి - విశంతి - యత్-యతయః-వీతరాగాః, యత్ - ఇచ్ఛంతః - బ్రహ్మచర్యం - చరంతి - తత్- తే- పదం - సంగ్రహేణ - ప్రవక్ష్యే.

ప్రతి॥ వేదవిదః = వేదవేత్తలు (వేదార్థసారమెరింగినవారు), యత్ దేనిని, అక్షరం = నాశములేనిదానినిగా, వదంతి=చెప్పుచున్నారో, వీతరాగాః=

రాగరహితులైన, యతయః = సన్న్యాసులును, యత్ = దేనిని, విశంతి = ప్రవేశించుచున్నారో, యత్ = దేనిని, ఇచ్ఛంతః = కోరుచున్నవారై, బ్రహ్మచర్యం = బ్రహ్మచారి వ్రతమును, చరంతి = ఆచరించుచున్నారో, తత్ పదం = ఆస్థానమును, తే = నీకు, సంగ్రహేణ = సంక్షేపముగా, ప్రవక్ష్యే = చెప్పుచున్నాను.

తా॥ వేదార్థము నెఱిగిన తత్త్వవేత్తలు దేనిని నాశరహితమైన దని చెప్పుచున్నారో, కామక్రోధములను జయించిన యతులు దేనిని ప్రవేశించుచున్నారో, మఱియు వారలు దేనిని పొందగోరిన వారలై బ్రహ్మచర్యవ్రతము నవలంబించుచున్నారో, అట్టి మోక్షపదమును నీకు సంగ్రహముగా వివరించి చెప్పెదను.

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్॥ 12

శ్లో॥ ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం సయాతి పరమాం గతిమ్ ॥ 13

పద॥ సర్వద్వారాణి - సంయమ్య - మనః - హృది - నిరుధ్య - చ, మూర్ధ్ని – ఆధాయ - ఆత్మనః - ప్రాణం – ఆస్థితః - యోగధారణామ్.

పద॥ ఓం - ఇతి - ఏకాక్షరం - బ్రహ్మ - వ్యాహరన్ - మాం - అనుస్మరన్, యః - ప్రయాతి - త్యజన్ - దేహం - సః - యాతి - పరమాం-గతిమ్.

ప్రతి॥ యః=ఎవడు,సర్వద్వారాణి=సకలేంద్రియములను, సంయమ్య=చక్కగా నియమించి, మనః=మనస్సును, హృది = హృదయమునందు, నిరుధ్య చ=నిరోధించి, ఆత్మనః =తనయొక్క, ప్రాణం=ప్రాణమును,మూర్ధ్ని= మూర్ధస్థానమునందు, ఆధాయ=ఉంచి, యోగధారణాం = యోగస్థైర్యమును, ఆస్థితః =ఆశ్రయించినవాడై, బ్రహ్మ=బ్రహ్మవాచకమైన, ఓం ఇతి='ఓం' అనునట్టి, ఏకాక్షరం=ఏకాక్షరమును, వ్యాహరన్ = ఉచ్చరించుచున్నవాడై, మాం=నన్ను, అనుస్మరన్ = చింతించుచున్నవాడై, దేహం=శరీరమును, త్యజన్-విడుచుచున్నవాడై, ప్రయాతి= పోవుచున్నాడో, సః=వాడు. పరమాం=సర్వోత్తమమైన. గతిం = స్థానమును (మోక్షమును) పొందుచున్నాడు,

తా॥ ఎవడు సకలేంద్రియములను చక్కగా నియమించి మనస్సును హృదయమునందు నిరోధించి తనయొక్క ప్రాణమును, (ప్రాణమును ప్రేరణచేసెడు ముఖ్యప్రాణమగు ఆత్మను)మూర్ధస్థానమునందు (బ్రహ్మరంధ్రమునందు) ఉంచి యోగధ్యానమును స్థిరముగా జేయువాడై బ్రహ్మమును ప్రతిపాదించు 'ఓమ్, అనునట్టిప్రణవమును ముఖ్యమైన లేక ఒకటియైన యక్షరమునుచ్చరించుచు ఆ యోంకారమున కర్థమైన పరమాత్మయగు నన్ను స్మరించుచు శరీరమును విడుచుచున్నాడో, అట్టివాడు సర్వోత్తమమైన గతిని అనగా మోక్షమును పొందుచున్నాడు.

వి॥ ఈ ప్రణవ మొక్కటిమాత్రమే వేదముయొక్క ప్రాణమైయుండుట వలన వేదములలో దీనిని ఏకాక్షరమని చెప్పుటకు కారణమైనది. ఈ 11, 12 13, శ్లోకములు ఒకదానికొకటి సంబంధించియున్నవి. 'అంత్యకాలములో దేనిని స్మరించి దేహము వీడిపోయిన పరమాత్మ సాక్షాత్కారజ్ఞానము గలుగును?' అను ప్రశ్నకు నిదిపూర్ణమైన సమాధానమగును. దీనియందు "యః ప్రయాతి" అని ప్రయోగింపబడుటచే ఎవడైనను అను అర్థము స్పష్టమగు చున్నది. 'బ్రాహ్మణేతరులు' స్త్రీలు మొదలైనవారలు ప్రణవధ్యానము చేయవచ్చునా? కూడదా? యని సందేహము గల వారికి ఇది సమాధానముగా నుంటున్నది.మఱియుప్రణవ ధ్యానము చేయకూడదని యెవరైన మారుమూలలలో చెప్పుచుండినచో 'భగవద్వాక్యమును నమ్మవలెనా? సామాన్యమానవుడవగు నీ వాక్యమును నమ్మవలయునా?అని వారినియడిగిన చాలును.మఱియు,అట్టివారుండిన వారితో'భగవద్గీత పఠించిన చాలునా? లేక దానిలో నున్నట్లుఆచరించవలయునా?'అని యడిగినచో ఆచరణ యుండవలయుననియే చెప్పుదురు. అట్లయిన అంత్యకాలములో దేనిని యుచ్చరించి పరమాత్మను ధ్యానించవలెనని భగవంతుడు కరుణగలిగిచెప్పియున్నాడో అది యీ"ఓం"కారముగదా అని పుస్తకమువిప్పి చూపవలెను.భగవద్గీతనుకూడ స్త్రీ శూద్రాదులు చదువకూడదని చెప్పెడి పాపకాల మొకటుండెను,అది కాలగర్భములో కలిసిపోయినందుచే నిప్పుడు దానిని గుఱించి తడవు టనవసరము మఱియు, రణభూమిలో గృహస్థుడైన క్షత్రియకులములో పుట్టిన యర్జునునికి పరబ్రహ్మోపాసనారూపమగు ఈ ప్రణవోపాసనము ఉపదేశింపబడినది రణరంగములో నెన్నియో యక్షౌహిణీజనులుండిరి. అచ్చట సర్వజాతులవారుందురు. అట్టి మహావిశాలమైన ప్రదేశములో శ్రీకృష్ణుడు జీవులు తరించుటకొఱకు

దీని నుపదేశించిరి. ఒక చెట్టు క్రిందనో, గుట్టప్రక్కనో నిర్జన ప్రదేశములోనో కొండగుహలోనో దీని నుపదేశింపలేదు.

కారుచిచ్చుచే రగులుచుండు అరణ్యము కుంభవృష్టిచే చల్లారునట్లు, అతి చంచలమై వ్యాకులమై తపించుచుండు అర్జునుని హృదయసీమయందలి తాప మంతయు ఈ శ్రీకృష్ణుని బ్రహ్మోపదేశమను జడివానవలన చల్లారిపోయెను. అట్టి శాంతిలోనికి తెచ్చిన దివ్యమంత్ర మిదియే, ఏదైన జాతిని గుఱించిగాని, స్త్రీ పురుష వ్యక్తిని గుఱించిగాని అధికారభేదము ఉండియుండినచో నిచ్చటనే శ్రీకృష్ణభగవానుడే దానిని తెలిపియుండును. అయితే యోగ్యతను మాత్రము నిరూపించకపోలేదు. సర్వేంద్రియములయొక్క సంయమనశక్తిగలిగి భగవద్భ క్తియు, ధ్యానయోగమును గలిగియుండవలెనని తెలిపియున్నాడు. 11-వ శ్లోక మున "యదక్షరం" అని ముగ్గురినిసాక్ష్యమిచ్చి యీ ప్రణవమును శ్రీకృష్ణుడుప దేశించినాడు. వారెవరనగా (1) వేదవేదార్థములను బాగుగా నెఱింగిన ఋషు లును, (2) రాగములు నశించిన పరమహంస పరివ్రాజకులగు యతీశ్వరులును (3) బ్రహ్మప్రాప్తికొఱకు బ్రహ్మచర్యమనుష్ఠించెడు సనకాదులవంటివారును, ఈ ముగ్గురు సాక్షులకన్న నిక సృష్టిలో గొప్పవారెవఱును లేరు.అట్టివారినిసాక్షిగా నిరూపించి పరబ్రహ్మస్వరూపమగు ఈ ప్రణవ ముపదేశింపబడినది. దీనివలననే యీ ప్రణవము యొక్క మహిమను దెలిసికొనవచ్చును, దీని మహిమను కఠోప నిషత్తునందు యమధర్మరాజు నచికేతసుడను ఋషిపుత్రున కుపదేశించెను. ఈ ప్రణవోపాసనను గుఱించి కఠోపనిషత్తునందును మాండూక్యోపనిషత్తునం దును, అధర్వశిఖోపనిషత్తునందును చెప్పబడిన దానిని ఈ క్రిందచూడ గలరు,

మూ॥ సర్వే వేదా యత్పదమామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి ।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తితత్తే పదం సఙ్గ్రహేణబ్రవీమ్యోమిత్యేతత్॥

ఓ నచికేతుసుడా! వేదములన్నియు, ఉపనిషత్తులన్నియు, నియమములతో గూడిన తపస్సులన్నియు నే స్వరూపము నుద్దేశించి చెప్పుచున్నవో దేనిని కోరిన వారై యతీశ్వరులు బ్రహ్మచర్యవ్రతము నాచరించుచున్నారో అట్టి పొందదగిన స్వరూపమును నీకు సంగ్రహముగా చెప్పుచున్నాను. "అది ఓంకారమే"

"ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥"

ఈ యక్షరమే బ్రహ్మస్వరూపము ఈ యక్షరమే శ్రేష్ఠమైనది. ఈ యక్షర మును తెలిసికొని యెవడు దేనిని కోరుచున్నాడో వాని కది లభించుచున్నది.

తా॥ ఈ ఓంకారరూపమగు బ్రహ్మప్రాప్తి సాధన ముత్కృష్టమైనది. ఈ ఓంకారరూపమైన బ్రహ్మస్వరూప ప్రాప్తిసాధనమును తెలిసికొని బ్రహ్మస్వరూప మైన లోకమందు పూజ్యుడగుచున్నాడు. సర్వోత్కృష్టు డగుచున్నాడు.

శ్లో॥ అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ ! నిత్యయుక్తస్య యోగినః ॥ 14

పద॥ అనన్యచేతాః – సతతం - యః - మాం - స్మరతి - నిత్యశః,
తస్య - అహం - సులభః - పార్థ ! - నిత్యయుక్తస్య - యోగినః.

ప్రతి॥ హే పార్థ ! = ఓ యర్జునా !, యః = ఎవడు, నిత్యశః = ప్రతిదినమును, సతతం = ఎల్లప్పుడు, అనన్యచేతాః = ఇతరచింతలేనివాడగుచు మాం = నన్ను, స్మరతి = స్మరించుచున్నాడో, తస్య = అట్టి, నిత్యయుక్తస్య = నిరంతర ధ్యానపరుడైన, యోగినః = ధ్యానయోగికి, అహం=నేను, సులభః= సులభముగా పొందదగినవాడను.

తా॥ ఓ యర్జునా ! ఏ యోగి యితర విషయకమైన చింతలేని వాడై బ్రతికియున్నంతవరకును ఎడతెగక నన్ను స్మరించుచుండునో, సర్వకాలములయందును సమాహిత చిత్తుడైన యట్టి యోగికి నేను సులభుడనై యుందును.

వి॥ భక్తులపై మిక్కిలి కరుణగలిగి భగవంతుడీ శ్లోకము నుపదేశించెను. ఏలన, పై శ్లోకమున చెప్పిన సర్వేంద్రియనిగ్రహము ప్రణవధ్యానము సామాన్యులకు సులభమైనదిగాదు. అందువలన మనోనియమము గలిగి భగవత్ స్మరణ చేయువారికి భగవంతుడు సులభసాధ్యుడని యుపదేశించడమైనది. ఐతే యిట్టి సులభమార్గముండగా నేల ప్రయాసమార్గము నవలంబించవలెనని కొందఱు తలంతురు. దానియొక్క భావము అదికాదు. పైన చెప్పిన ధ్యానము చేయుటకు శక్తిలేనివారికి భగవత్ స్మరణచాలుననియు, ఇది సులభమార్గమనియు తెలుపడమయినది. ఎట్లన, గడియారము లమ్మెడు ఒక గొప్పకంపెనీకి వెళ్ళి గొప్పదగు దృఢతరమగు ఒక గడియారముయొక్క వెల యడుగగా చాల యెక్కువ ఖరీదు చెప్పినందుచే అంత గొప్పది కొనుటకు సాధ్యము లేనివారికి ఇక తక్కువ తక్కువ వెలగల గడియారమును చూపినచో కొనేవారు తమ శక్తికితగిన గడియారమును కొని యెట్లు సంతుష్టులగుదురో, ఇచట గూడ అట్లేయని గ్రహించవలయును.

శ్లో॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః ॥ 15

పద॥ మాం - ఉపేత్య – పునః – జన్మ – దుఃఖాలయం – అశాశ్వతం,
న – అప్నువంతి - మహాత్మానః - సంసిద్ధిం - పరమాం - గతాః.

ప్రతి॥ పరమాం సంసిద్ధిం = సర్వోత్తమమగు ముక్తిపదమును, గతాః = పొందిన, మహాత్మానః = మహానుభావులు, మాం ఉపేత్య = నన్ను పొందినవారై, దుఃఖాలయం = దుఃఖభాజనమైనదియు, అశాశ్వతం = అనిత్యమైనదియునగు, జన్మ=జన్మమును, పునః=మఱల, న అప్నువంతి=పొందరు.

తా॥ పరమపదమును పొందిన మహనీయులు నన్ను పొందినవారై ఆధ్యాత్మికాది సకల దుఃఖములను కలిగించునట్టిదియును, అనిత్యమైనదియునగు జన్మమును మఱల పొందరు.

వి॥ మోక్షమును పొందకపోయిన నేమి నష్టమని కొందరు తలంతురు. నష్టమేమన, మోక్షమును పొందనిచో అనేకదుఃఖములతోగూడిన జననమరణములనెడు బాధను మాటిమాటికి పొందవలసియుండును. అదే దానికి శిక్ష యని శాస్త్రము చెప్పుచున్నది,

శ్లో॥ ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున !
మాముపేత్య తు కౌంతేయ ! పునర్జన్మ న విద్యతే ॥ 16

పద॥ ఆబ్రహ్మభువనాత్ - లోకాః -పునరావర్తినః - అర్జున !
మాం - ఉపేత్య- తు - కౌంతేయ! - పునః - జన్మ - న - విద్యతే.

ప్రతి॥ హే అర్జున! = ఓ యర్జునా !, ఆబ్రహ్మభువనాత్ లోకాః = బ్రహ్మలోకపర్యంతముగల లోకములన్నియు, పునరావర్తినః = పునర్జన్మమును కలుగజేయునట్టివి, హేకౌంతేయ!= ఓ యర్జునా!, మా ఉపేత్య తు=నన్ను పొందినట్టైనచో, పునః=మఱల, జన్మ= జన్మము, న విద్యతే =కలుగదు.

తా॥ కుంతీపుత్రుడవగు ఓ యర్జునా! బ్రహ్మలోకపర్యంతము సకల లోకములును తిరిగి వచ్చెడు స్వభావముగలవి. అనగా బ్రహ్మలోకము వఱకునుగల సకల లోకములలో నే లోకమునకు బోయినను, అక్కడినుండి తిరిగివచ్చి మఱల ఈలోకమున పుట్టవలసినదే. నా స్థానమును పొందినవారికి మాత్రము మఱల జన్మలేదు. వారు జన్మరహితులు కాగలరు.

వి॥ ముక్తిహొందినవానికి గలిగెడు లాభము దీనిలో నిరూపించడమైనది.

శ్లో॥ సహస్ర యుగపర్యంత మహర్యద్బ్రహ్మణో విదుః।
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహెూరాత్రవిదో జనాః॥ 17

పద॥ సహస్రయుగపర్యంతం - అహః - యత్ - బ్రహ్మణః - విదుః,
రాత్రిం - యుగసహస్రాంతాం - తే - అహెూరాత్రవిదః - జనాః.

ప్రతి॥ హేజనాః = ఏ జనులు. బ్రహ్మణః = చతుర్ముఖబ్రహ్మయొక్క, యత్ అహః = ఏ పగటిని, సహస్రయుగపర్యంతం = వెయ్యియుగములుగల దానిని గను, రాత్రిం=రాత్రిని, యుగసహస్రాన్తాం=వేయి యుగములపరిమితి గలదానినిగను, విదుః=ఎఱుంగుచున్నారో, తే=అట్టివారలు, అహెూరాత్ర విదః=అహెూరాత్రముల నెఱింగినవారలగుదురు.

తా॥ ఎవరు చతుర్ముఖబ్రహ్మయొక్క యే పగటిని వేయియుగములు గలదానినిగాను, రాత్రిని వేయి యుగములు పరిమితి గల దానినిగాను నెఱుంగుచున్నారో, అట్టివారు అహెూరాత్రములనెఱింగిన వారలగుదురు. అనగా మనుజుల వేయియుగములు బ్రహ్మదేవుని కొక పగలనియు, ఆలాగున వేయియుగము లొకరాత్రియనియు చెప్పుదురు.

శ్లో॥ అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవన్త్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే॥ 18

పద॥ అవ్యక్తాత్ - వ్యక్తయః - సర్వాః - ప్రభవంతి - అహరాగమే,
రాత్ర్యాగమే - ప్రలీయన్తే - తత్ర - ఏవ - అవ్యక్తసంజ్ఞకే.

ప్రతి॥ అహరాగమే=పగలు ప్రారంభముకాగానే, వ్యక్తయః=చక్షురాదీంద్రియములకు గోచరించెడు, సర్వాః=స్థావరజంగమములన్నియు, అవ్యక్తాత్=చక్షురాదీంద్రియములకు గోచరింపని ప్రకృతినుండి, ప్రభవంతి=పుట్టుచున్నవి. రాత్ర్యాగమే=రాత్రియగుటతోడనే, అవ్యక్తసంజ్ఞకే=అవ్యక్తమను పేరుగల, తత్ర ఏవ = ఆ మూలప్రకృతియందే, ప్రలీయన్తే=లీనమగుచున్నవి.

తా॥ చక్షురాదీంద్రియములకు గోచరించెడు స్థావరజంగమము లన్నియు బ్రహ్మదేవుని పగలు ప్రారంభమగుటతోడనే చక్షురాదీంద్రియములకు గోచరించని ప్రకృతినుండి పుట్టుచున్నవి. మఱల రాత్రికాగానే అవ్యక్తమను పేరుగల ఆ మూలప్రకృతియందే లీనమగుచున్నవి.

వి॥ వస్తువులకు నాశములేదు. ఘటము నిర్మింపబడునప్పుడు వ్యక్తమగు చుండును. అదియే ఘటము పగులునప్పుడు భూమిలో నైక్యమై అవ్యక్త మగుచుండును.

శ్లో॥ భూతగ్రామస్స ఏవాయం భూత్వాభూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ ! ప్రభవత్యహరాగమే ॥ 19

పద॥ భూతగ్రామః - సః - ఏవ - అయం - భూత్వా - భూత్వా- ప్రలీయతే।
రాత్ర్యాగమే - అవశః - పార్థ ! - ప్రభవతి - అహరాగమే.

ప్రతి॥ హే పార్థ ! = ఓ యర్జునా !, సః అయం = అట్టి ఈ, భూతగ్రామః ఏవ=భూతసముదాయమే, అవశః = స్వాతంత్ర్యములేనిదై, భూత్వా భూత్వా=పుట్టి పుట్టి(అనేకజన్మలెత్తి), రాత్ర్యాగమే=రాత్రిరాగా. ప్రలీయతే=లీనమగుచున్నది. మఱల, అహరాగమే=పగలురాగా, ప్రభవతి= పుట్టుచున్నది.

తా॥ ఓ యర్జునా ! పూర్వకల్పమందు పుట్టిన ప్రాణి సమూహమే బ్రహ్మకు పగలు వచ్చిన కాలమునందు బుట్టి, మఱలబ్రహ్మకు రాత్రి వచ్చినకాలమున లీనమైపోవుచున్నది. ఈలాగున సకల ప్రాణి సముదాయమును పుట్టుచు లీనమగుచున్నది.

వి॥ ఈలాగున పుట్టుచు గిట్టుచు జీవన్ముక్తిగలుగువఱకు జీవులు సంసార మహాచక్రమున తిరుగుచుందురు.

శ్లో॥ పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ 20

పద॥ పరః - తస్మాత్ - తు - భావః - అన్యః - అవ్యక్తః - అవ్యక్తాత్ - సనాతనః, యః - సః - సర్వేషు - భూతేషు - నశ్యత్సు - న - వినశ్యతి.

పతి॥ యః = ఏ, భావః = భావము (ఏ అక్షరపరబ్రహ్మస్వరూపము),తస్మాత్= పూర్వోక్తమైన,అవ్యక్తాత్=భూతసముదాయమునకుకారణమును, అవిద్యాస్వరూపము నయిన అవ్యక్తముకంటె. అన్యః=ఇతరమైనదియును, పరః= శ్రేష్ఠమైనదియును, అవ్యక్తః= ఇంద్రియములకు కనబడనిదియును, సనాతనః=పురాతనమును అయినదో, సః=ఆ అక్షరపరబ్రహ్మము, సర్వేషు= సమస్తములైన, భూతేషు = చతుర్ముఖబ్రహ్మ మొదలగు భూతములు, నశ్యత్సు= నశించుచున్నప్పటికిని, న వినశ్యతి = నశింపదు.

తా॥ పూర్వోక్తమైన అవ్యక్తము (ప్రకృతి)కంటె ఇతరమైనది యును, శ్రేష్ఠమైనదియును, ఇంద్రియాగోచరమైనదియును, అనాదిగా నుండునదియు నగు ఏ వస్తువుకలదో యా యక్షరపరబ్రహ్మము, బ్రహ్మ మొదలగు సమస్తములైన భూతములు నశించుచున్నప్పటికిని నశింపదు.

శ్లో॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥ 21

పద॥ అవ్యక్తః-అక్షరః-ఇతి-ఉక్తః - తం - ఆహుః - పరమాం - గతిం,
యం -ప్రాప్య - న - నివర్తంతే - తత్ - ధామ - పరమం - మమ.

ప్రతి॥ (ఏ పరమాత్మ) అవ్యక్తః = ఇంద్రియములకు గోచరముగానివాడు, అక్షరః= నాశరహితుడు, ఇతి = ఇట్లని, ఉక్తః = చెప్పబడెనో, తం = అట్టి పరమాత్మను, పరమాం = సర్వోత్తమమైన, గతిం =ప్రాప్యస్థానము నుగా, ఆహుః=చెప్పుచున్నారు, యం=దేనిని (ఏ పరమాత్మను),ప్రాప్య= పొంది, న నివర్తంతే = తిరిగిరారో, తత్ = అది, మమ = నాయొక్క పరమం=సర్వోత్తమమైన, ధామ = స్థానము.

తా॥ ఏ పరమాత్మను ఇంద్రియములకు గోచరము కానివాడ నియు, నాశరహితుడనియు చెప్పుచున్నారో అ పరమాత్మనే ఉత్తమ మైన ప్రాప్యస్థానమనియును చెప్పుదురు. దేనిని పొందినచో పునరా వృత్తి లేదో అనగా తిరిగి జన్మించరో అదియే భగవంతుడనగు నాయొక్క సర్వోత్తమమయిన స్థానము.

శ్లో॥ పురుషస్స పరః పార్థ ! భక్త్యా లభ్యస్త్వనన్యయా ।
యస్యాంతస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥ 22

పద॥ పురుషః - సః - పరః - పార్థ! - భక్త్యా - లభ్యః - తు - అనన్యయా,
యస్య - అంతస్థాని - భూతాని - యేన - సర్వం - ఇదం - తతమ్.

ప్రతి॥ హే పార్థ! = ఓ యర్జునా!, భూతాని =సర్వప్రాణులు, యస్య అంత స్థాని=ఎవని లోపల నుంటున్నవో, ఇదంసర్వం=ఈ ప్రపంచమంతయు యేన తతం= ఎవనిచే వ్యాపింపబడియున్నదో, సః పరః పురుషః తు= అట్టి పరమపురుషుడన్ననో, అనన్యయా భక్త్యా = అచంచలమైన భక్తి చేత, లభ్యః =పొందదగినవాడు.

తా॥ ఓ యర్జునా ! చరాచరాత్మకములగు సకల ప్రాణులును ఏ పరమపురుషుని లోపల నివసించియున్నవో, ఏ పరమపురుషుని చేత చరాచరాత్మకమైన ఈ ప్రపంచమంతయు వ్యాపింపబడియున్నదో, అట్టి పరమపురుషుడు అచంచలమైన భక్తిచేత మాత్రమే పొందదగినవాడు.

వి॥ ఇదివరలో ప్రతి యధ్యాయము భక్తియోగముతోనే అంతమగుచు వచ్చినట్లు ఈ యధ్యాయముగూడ భక్తియోగముతోనే యంతము గాబోవుచున్నది. ఇదివరలో చెప్పిన అగ్రాహ్యాజ్ఞానమంతయు భక్తివల్లనే గ్రాహ్యముగాగలదనియు భక్తి మార్గములో ప్రతివారికిని సులభముగా ప్రవేశము గలుగుననియు తలంచుటయే యీ అధ్యాయమును భక్తియోగముతో సమాప్తి చేయుటకు కారణమగుచున్నది.

శ్లో॥ యత్రకాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ 23

పద॥ యత్ర - కాలే – తు - అనావృత్తిం - ఆవృత్తిం - చ - ఏవ - యోగినః ప్రయాతాః - యాంతి - తం - కాలం - వక్ష్యామి - భరతర్షభ !.

ప్రతి॥ హే భరతర్షభ ! - ఓ యర్జునా !. యోగినః = యోగులు, యత్ర కాలే తు = ఏకాలమునందైతే, ప్రయాతాః =దేహమును వదలిపోయినవారై, అనావృత్తిం=అపునరావృత్తిని(పునర్జన్మరాహిత్యమును),ఆవృత్తిం ఏవ చ=పునరావృత్తినిన్ని, యాంతి=పొందుచున్నారో, తం కాలం=ఆ కాలమును, వక్ష్యామి=చెప్పుచున్నాను.

తా॥ ఓ యర్జునా ! ఏ కాలమునందు మరణమును పొందినవారై యోగులు మఱల పుట్టుదురో, ఏ కాలమునందు దేహమును వదలినవారై యోగాభ్యాసకులు పునర్జన్మమును పొందరో యట్టి కాలమును చెప్పెదను,

శ్లో॥ అగ్నిర్జ్యోతి రహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ 24

పద॥ అగ్నిః - జ్యోతిః - అహః - శుక్లః - షణ్మాసాః - ఉత్తరాయణం, తత్ర - ప్రయాతాః - గచ్ఛన్తి - బ్రహ్మ - బ్రహ్మవిదః- జనాః

ప్రతి॥ అగ్నిః = అగ్న్యభిమానదేవతయు. జ్యోతిః = జ్యోతిరభిమానదేవతయు, అహః = దివసాభిమానదేవతయు, షణ్మాసాః ఉత్తరాయణం = ఆరు మాసముల ప్రమాణముగల యుత్తరాయణాభిమానదేవతయగు సూర్యుడుండునట్టిది, శుక్లః = శుక్లమార్గము, బ్రహ్మవిదః = బ్రహ్మవిదులైన, జనాః = జనులు, తత్ర = ఆశుక్లమార్గమునందు, ప్రయాతాః = పోయినవారై, బ్రహ్మ = పరబ్రహ్మమును గచ్ఛంతి = పొందుచున్నారు.

తా॥ కాలాభిమానదేవతయును, ప్రకాశాభిమానదేవతయును దివసాభిమానదేవతయును, శుక్లపక్షాభిమానదేవతయును, ఆరు నెలలు గల ఉత్తరాయణాభిమానదేవతయును గల మార్గము శుక్ల మార్గమనబడును. ఆ మార్గమున బోయిన బ్రహ్మవేత్తలు క్రమముగా పర బ్రహ్మమును పొందుచున్నారు.

శ్లో॥ ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25

పద॥ ధూమః - రాత్రిః - తథా - కృష్ణః - షణ్మాసాః - దక్షిణాయనం, తత్ర - చాంద్రమసం - జ్యోతిః - యోగీ - ప్రాప్య - నివర్తతే.

ప్రతి॥ తథా = పైశ్లోకమున చెప్పినలాగుననే, ధూమః = ధూమాభిమానిదేవతయు, రాత్రిః = రాత్ర్యభిమానిదేవతయు, కృష్ణః = కృష్ణపక్షదేవతయు, షణ్మాసాః దక్షిణాయనం = ఆరు మాసముల పరిమితిగల దక్షిణాయనాభిమానిదేవతయు, కృష్ణమార్గము, తత్ర = ఆ మార్గమునందు (పోయినట్టి), యోగీ = యోగి, చాంద్రమసం = చంద్రసంబంధమైన, జ్యోతిః = ఇష్టాపూర్తాదిఫలమును, ప్రాప్య = పొంది, నివర్తతే = మరలుచున్నాడు, (పునర్జన్మమును పొందు చున్నాడనుట)

తా॥ ధూమాభిమానదేవతయును, రాత్ర్యభిమానదేవతయును ఆ విధముగానే కృష్ణపక్షాభిమానదేవతయు, షణ్మాసాత్మకమైన దక్షిణాయనమున కభిమానదేవతయును గల మార్గమున బోయిన యోగి చంద్రసంబంధమైన తేజస్సును పొందె అనగా స్వర్గాదిలోకములను పొంది, అట్టి పుణ్యము ముగిసినపిమ్మట మరల మానవలోకమునకు వచ్చుచున్నాడు.

శ్లో॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే।
ఏకయా యాత్య నావృత్తిమన్యయాఽఽవర్తతే పునః॥ 26

పద॥ శుక్లకృష్ణే - గతీ - హి - ఏతే - జగతః - శాశ్వతే - మతే,
ఏకయా - యాతి - అనావృత్తిం - అన్యయా - ఆవర్తతే - పునః,

ప్రతి॥ జగతః =జగత్తునకు, ఏతే = ఈ పైచెప్పబడిన, శుక్లకృష్ణే = శుక్లకృష్ణము అనెడు, గతీ= రెండు మార్గములు, శాశ్వతే=శాశ్వతములైనవని, మతేహి= నా యభిప్రాయము, ఏకయా=ఒకదానిచేత, అనావృత్తిం యాతి =పునర్జన్మ రాహిత్యమును పొందుచున్నాడు. అన్యయా = మఱియొకదానిచేత' పునః ఆవర్తతే = మఱల పుట్టుచున్నాడు.

తా॥ ఈ రెండు మార్గములలో నుత్తరాయణ మార్గము జ్ఞాన ప్రకాశయుతమగుటచేత శుక్లమార్గమనియును, దక్షిణాయనమార్గ మట్టిది కాక తమోమయమైనదగుటవలన కృష్ణమార్గమనియు చెప్ప బడెను. ఇట్లు ప్రసిద్ధములైన యీ రెండుమార్గములలో మొదటిదగు శుక్లమార్గమున వెళ్ళినవాడు పునరావృత్తిరహితమగు మోక్షమును పొందుననియు, రెండవదియగు కృష్ణమార్గమున వెళ్లినవాడు తిరిగి వచ్చుననియు తెలియవలెను.

వి॥ ఉత్తరాయణములో పోయెడువారికి ''ముక్తియనియు'' దక్షిణాయన ములో పోయెడువారికి ''ఆవృత్తియనియు''చెప్పుటలో నేదైన రహస్యముండవలెను ఏలన, బ్రహ్మవేత్తలుగానివారుత్తరాయణములోను, బ్రహ్మవేత్తలైనవారు దక్షిణా యనములోను శరీరమును వదలిపోవుచున్నారు, అప్పుడిదియే సత్యమైనచో బ్రహ్మ వేత్తలు గానివారికికూడ మోక్షము గలుగవలసియుండును. బ్రహ్మవేత్తలైనవారికి మోక్షము లేకపోవలసి యుండును, బహ్మము నెఱిగినవారికి బ్రహ్మప్రాప్తి గలుగు నని శ్రుతి శాసించుచున్నది. అప్పుడు దీనికెట్లు సమన్వయ మేర్పరచవలెనని సంశయము గలుగును. జ్ఞానమైన స్వబోధమగు ప్రకాశముతో దేహము వీడి పోవువాడుత్తరాయణ మార్గుడనియు, ఆత్మబోధములేక మూఢత్వముగ పోయెడి వాడు పితృయానమార్గమున వెళ్ళినవాడనియు తెలియదగును. మఱియు సత్త్వ గుణము నిర్మలమైనది, ప్రకాశమైనది, తమోగుణము అంధకారమయమైనది, నలుపుతోకూడినది అనిగూడ తెలియదగును. మఱియు, ఇడా పింగళా అను

రెండు నాడులు గలవు. కుడిప్రక్క నుండునది పింగళయనియు ఎడమ ప్రక్క నుండునది ఇడాయనియు వ్యవహరింపబడును, యోగి యైనవాడు యోగబలముచే సూర్యనాడిమార్గముగా వెళ్ళును. అట్టి యోగసాధన లేనివాడు ఇడానాడిద్వారా చంద్రమండలమును పొందును. పింగళనాడి సూర్యనాడి యనియు, ఇడానాడి చంద్రనాడి యనియు ప్రసిద్ధములు, వీని నాధారము చేసికొనియే పై విధముగా చెప్పబడినది. ఇదియే దీనియొక్క అంతరార్థము. ఈ విషయమై ఉత్తరగీతలో శ్రీ భగవంతుడు స్పష్టముగా తెలిపినది చూడుడు.

> "దక్షిణే పింగళా నాడీ వహ్ని మండల గోచరా ।
> దేవయానమితి జ్ఞేయం పుణ్యకర్మానుసారిణీ ॥"

దక్షిణపార్శ్వమునందున్నదియు, అగ్నిమండలగోచరమైనదియు, పుణ్యకర్మములను అనుసరించునదియునగు, పింగళయను నాడి దేవయానమని తెలియదగినది. ఇది శరీరముయొక్క కుడిభాగము నాశ్రయించి యుండును.

> "ఇడా చ నామ నిశ్వాసా సోమమండలగోచరా ।
> పితృయానమితి జ్ఞేయం వామమాశ్రిత్య తిష్ఠతి ॥"

తా॥ ఎడమభాగమునందున్నదియు, చంద్రమండల గోచరమైనదియు నయిన శ్వాసము 'ఇడా' యని ప్రసిద్ధిజెందినది. దీనినే పితృయానమని అందురు. ఈ నాడి శరీరముయొక్క వామభాగము నాశ్రయించియున్నది.

దీనిలో వర్ణింపబడిన యోగు లుభయులును శరీరమును విడిచిపోయే వారలు. ఒక డావరణరహితుడు, రెండవవా డావరణమింకను సంపూర్ణముగా నశించనివాడు. కనుకనే చీకటిగా వర్ణించుటకు గారణమైనది. అయితే "సంయోగ విప్రయోగాంతాః" సంయోగమునకు వియోగమే యంతము వచ్చినవాడు పోవుటయు, పోయినవాడు వచ్చుటయు ప్రకృతియొక్క నియమము. కావునరాకడ పోకడ లేని స్థితియే బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమగును. ఏలన, బ్రహ్మము అంతట పరిపూర్ణమైనవస్తువు. అందువల్ల రాకపోకల కితరస్థలములేదు. అయితే యట్టి మోక్ష మెట్టిదని కొందఱికి సందేహము గలుగవచ్చును. అజ్ఞానమను ఆవరణము దొలగుటయే (యట్టి బ్రహ్మనిష్ఠునకు) మోక్షమనబడును. మఱియు దీనియందు సూర్యచంద్రుల నాడులను గురించియే వర్ణించబడినది ఇది జీవలక్షణముతో గూడినది అగ్నినాడియను పింగళాసుషుమ్నానాడి యొకటి గలదు. అది యిచట నిరూపింపబడలేదు. సూర్యచంద్రాగ్నిలోచనములు గలవాడు పరమేశ్వరుడు.

అగ్నియందు సమస్తవస్తువులు భస్మమైపోవునట్లు అగ్నినాడిలో నిలుకడ గలిగి నప్పుడే కర్మములన్నియు భస్మములైపోవును. అట్టి త్రినేత్రము (ఈశ్వరునికి సంబంధించినది.) దానిని సామాన్యముగా జ్ఞాననేత్రమందురు. అట్టి జ్ఞాననేత్రము బ్రహ్మజ్ఞానులకే గలిగియుండును. అది గలిగినవా డీశ్వరసదృశుడు.

"యత్ర యత్ర మృతో జ్ఞానీ యేన కేనాపి మృత్యునా।
యథా సర్వగతం వ్యోమ తత్ర తత్ర లయం గతః॥

తా॥ జ్ఞానియగువాడు ఎచ్చటెచ్చట ఎట్టి మృత్యువుచే మరణించినను, సర్వమును వ్యాపించియున్న యాకాశమువలె అచ్చటచ్చట బ్రహ్మైక్యమును పొందును.

శ్లో॥ నైతే సృతీ పార్థ! జానన్యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున 27

పద॥ న - ఏతే - సృతీ - పార్థ! - జానన్ - యోగీ - ముహ్యతి - కః - చ - న, తస్మాత్ - సర్వేషు - కాలేషు - యోగయుక్తః - భవ - అర్జున!

ప్రతి॥ హే పార్థ! = ఓ యర్జునా!, ఏతే సృతీ = ఈ రెండు మార్గములను, జానన్ = ఎఱింగినట్టి, యోగీ కః చ న = యోగియెవడును, న ముహ్యతి= మోహమును పొందడు, తస్మాత్ = కాబట్టి, అర్జున! = ఓ అర్జునా! సర్వేషు కాలేషు = సమస్తకాలములయందును, యోగయుక్తః భవ= యోగయుక్తుడవు కమ్ము.

తా॥ ఓ యర్జునా! ఈ మార్గములను రెంటిని దెలిసిన ధ్యాన యోగి యెవడును మోహమును పొందడు. కావున నో యర్జునా! సర్వకాలములయందును నీవు ధ్యానయోగపరుడ వగుము.

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥ 28

పద॥ వేదేషు - యజ్ఞేషు- తపస్సు - చ - ఏవ - దానేషు - యత్ పుణ్యఫలం- ప్రదిష్టమ్, అత్యేతి - తత్ - సర్వం - ఇదం - విదిత్వా - యోగీ - పరం- స్థానం - ఉపైతి - - చ - ఆద్యమ్.

ప్రతి॥ యోగీ = ధ్యానయోగపరుడు, ఇదం విదిత్వా = ఈ యుభయమార్గముల సంగతి నెఱింగినవాడై, వేదేషు = వేదములయందును, యజ్ఞేషు = యజ్ఞములయందును, దానేషు = దానములయందును, తపస్సు చ ఏవ = తపస్సులయందును, యత్ పుణ్యఫలం = ఏ పుణ్యఫలము, ప్రదిష్టం = చెప్పబడియున్నదో, తత్ సర్వం = దానినంతయు, అత్యేతి = అతిక్రమించుచున్నాడు. లేక అది స్వల్పమని తలంచి, ఆద్యం స్థానం = సమస్తమునకాదికారణమును సర్వోత్కృష్టమునైన బ్రహ్మమును ఉపైతి చ = పొందుచున్నాడు.

తా॥ ధ్యానయోగియగువాడు నియమపూర్వకముగా వేదవేదాంతములను చదువుటవలనను. సాంగోపాంగముగా యజ్ఞములను నాచరించుటవలనను, కాయశోషణాదులచేత కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సుల నాచరించుటవల్లను దేశ కాల పాత్రానుసారముగా దానములను ఆచరించుటవలనను కలిగెడు పుణ్యఫలములను అతిక్రమించుచున్నాడు. అనగా, ఈ ఫలములకన్న పై భాగముననుండు స్థానమును పొందుచున్నాడు. మొదటి కారణమును అనగా సర్వకారణమును సర్వోత్తమమును అయిన స్థానమును, అనగా బ్రహ్మపదమును పొందుచున్నాడు.

వి॥ బీదభక్తులయందు చాల జాలిగలిగి శ్రీ భగవంతుడు ఈ శ్లోకమును ఉపదేశించెను. ఏలన మేము సంస్కృతము, వేదము, చదవలేదు. యజ్ఞాదులాచరించలేదు. మేముశరీరశోషణపరమగు తపస్సును ఏకాంతప్రదేశమునచేయలేదు. మేము బీదవారమగుటచే నితరులవలె దానధర్మాదు లేమియు చేయలేదు. అట్టి మాకు మోక్షమెట్లు గలుగునను తపనము గలవారు కొందఱు గలరు. కావుననే పైన జెప్పబడినవేదాధ్యయనాదులవలన గలిగెడు ఫలితము, మఱియు స్వర్గాది లోకములు అన్నియు నశించుననియు, చేసిన పుణ్యము నశించినతోడనే మఱల అందఱును భూలోకమున జన్మ మెత్తవలసియే యుండుననియు, పరమాత్మనునిరంతరము ధ్యానము చేయుటవలన గలిగెడు ఫలము మాత్రము నశించదనియు, అట్టి పరమాత్మ ధ్యానమే శాశ్వతమోక్షమును భగవత్ స్థానమును గలుగజేయుననియు భగవంతుడు కరుణతో నుపదేశించెను. అట్లు ధ్యానించు

టకు మాత్రము మనోనైర్మల్యము చిత్తైకాగ్రతయు అవసరము. ఇటుల పరిశుద్ధ హృదయముతో, చిత్తైకాగ్రతతో ఎల్లప్పుడును బ్రహ్మచింతన చేయుచుండిన చాలును. ఓహెూ ఇది ఎంత సులభమార్గము.

ఇతి శ్రీ మద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే అక్షరపరబ్రహ్మయోగోనామ
అ ష్ట మో ఽ ధ్యా యః

పద॥ ఇతి-శ్రీమద్భగవద్గీతాసు -ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే. శ్రీకృష్ణార్జునసంవాదే-అక్షరపరబ్రహ్మయోగః-నామ-అష్టమః - అధ్యాయః

ప్రతి॥ ఇతి = ఇది, ఉపనిషత్సు = ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మ విద్యాయాం = బ్రహ్మవిద్యాత్మకమును. యోగశాస్త్రే = యోగశాస్త్రమును. శ్రీకృష్ణార్జునసంవాదే=శ్రీకృష్ణార్జునసంవాదరూపమును నైన, శ్రీ మద్భగవ ద్గీతాసు = శ్రీమద్భగవద్గీతలలో, అక్షరపరబ్రహ్మయోగః నామ =అక్షర పరబ్రహ్మయోగమని, ప్రసిద్ధిగల, అష్టమః అధ్యాయః = ఎనిమిదవ అధ్యాయము ముగిసెను.

తా॥ ఇట్లు ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యాస్వరూపమును, యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదరూపమును నైన శ్రీ మద్భగవద్గీత యందు అక్షర పరబ్రహ్మ యోగమనెడి ఎనిమిదవ అధ్యాయము ముగిసినది.

ఓం తత్సత్ ఓమ్.



ఓమ్
శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## నవమోఽధ్యాయః - నవమాధ్యాయము
## రాజవిద్యా రాజగుహ్యా యోగః - రాజవిద్యా రాజగుహ్యా యోగము



ఈ యధ్యాయమునకు రాజ విద్యారాజగుహ్యా యోగమని పేరు. రాజవిద్య యనగా రాజర్షులచే ననుష్ఠింపబడిన విద్యయనియు లేక విద్యలన్నిటిలో నీ నిష్కామ కర్మ యోగవిద్య రాజు అనియు లేక రాజగుహ్యాము అనగా రాజర్షులచే రహస్యముగా నుంచబడి యుండినదనియు లేక రాజరహస్యము అనగా రహస్యములలోకెల్ల రహస్యమైనదనియు తెలియవలెను. దీనివలన గూడ పరమాత్మైక్యజ్ఞానము గలుగుట వలన దీనికి రాజయోగమనియు నామము గలిగెను. ఈ యధ్యాయముయొక్క మహిమ 'రాజవిద్యా రాజగుహ్యాయోగ' మను పేరుతోనే నిరూపింప బడినది.

శ్లో॥ ఇదం తు తే గుహ్యాతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ 1

పద॥ ఇదం - తు - తే - గుహ్యాతమం - ప్రవక్ష్యామి - అనసూయవే.
జ్ఞానం - విజ్ఞానసహితం - యత్ - జ్ఞాత్వా - మోక్ష్యసే - అశుభాత్.

ప్రతి॥ యత్ = దేనిని. జ్ఞాత్వా = ఎఱిగి, అశుభాత్ = దుఃఖరూపమగు సంసార బంధమునుండి, మోక్ష్యసే = ముక్తుడవు కాగలవో (అట్టి), విజ్ఞాన సహితం = అనుభవజ్ఞాన సహితమైనట్టియు, గుహ్యాతమం = పరమ రహస్యమైనట్టియు, ఇదం = ఈ, జ్ఞానం తు = జ్ఞానమును, అనసూయవే= అసూయా రహితుడవగు, తే = నీకు, ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను.

తా॥ దేనిని తెలిసికొనిన జనన మరణరూపమగు సంసార బంధనమునుండి విముక్తుడవు గాగలవో, అట్టి యనుభవ జ్ఞాన సహితమైనట్టియు, పరమరహస్యమైనట్టియు జ్ఞానమును అసూయారహితుడవగు నీకు చెప్పబోవుచున్నాను.

వి॥ శాస్త్రజ్ఞానములేక ఆచార్యముఖము నుండి శ్రవణము చేసిన జ్ఞానము మాత్రము చాలదు. అనుభవజ్ఞానము గలిగినమాత్రమే భవబంధవిమోచనము గలుగును. అమానిత్వాదులు జ్ఞానమనియు, జ్ఞేయము విజ్ఞానమనియు 13 వ అధ్యాయమున చెప్పినది చూడదగును.

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్॥ 2

పద॥ రాజవిద్యా - రాజగుహ్యం - పవిత్రం - ఇదం - ఉత్తమం,
ప్రత్యక్షావగమం - ధర్మ్యం - సుసుఖం - కర్తుం - అవ్యయమ్.

ప్రతి॥ ఇదం = ఈ చెప్పబోయెడు జ్ఞానము, రాజవిద్యా=విద్యలలో రాజు అగుటచే రాజవిద్యయు, రాజగుహ్యం=పరమరహస్యమైనదియు, పవిత్రం = పావన మైనదియు, ఉత్తమం = ఉత్తమమైనదియు. ప్రత్యక్షావగమం = అనుభవము వలన తెలిసికొనదగినదియు, కర్తుం = అనుష్ఠించుటకు, సుసుఖం = మిక్కిలి సులభమైనదియు, ధర్మ్యం = ధర్మములన్నిటికిని మూలమైనదియు, అవ్యయం = నాశరహితమైనదియునై యున్నది.

తా॥ ఈ బ్రహ్మజ్ఞానము సకలవిద్యలలో నుత్తమమైనదియును రహస్యములలో శ్రేష్ఠమైనదియును, అత్యంతపావనమైనదియును, ప్రత్యక్షమైన ఫలము కలదియును, ధర్మయుక్తమైనదియును, అనుష్ఠించుటకు మిగులసులభ మైనదియును,నాశములేనిదియునై యున్నది.

వి॥ బ్రహ్మవిద్య ఒకటిమాత్రమే జీవించియున్నప్పుడు ప్రత్యక్షముగా ఫలము నిచ్చునది. యజ్ఞాది క్రతువులు బహుద్రవ్య సహాయముచేతను, అనేక జనుల సహాయము చేతను చక్కగ నిర్వహింపబడినను ప్రత్యక్షఫల మేమియు గనుపించదు, మరణానంతరము స్వర్గాదిలోకప్రాప్తి గలుగునని చెప్పబడుచున్నది. నిశ్చయముగ గలుగునను నమ్మకమేమియులేదు. మఱియు, ఈ నిష్కామ కర్మరూపమగు యోగము నాచరించుటలో నేలాటిప్రయాసమునులేదు. కట్టకడకు భక్తియోగము సహా మరణానంతరము భగవల్లోకప్రాప్తిని గలుగ జేయుననియే చెప్పబడుచున్నది.

శ్లో॥ అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని ॥ 3

పద॥ అశ్రద్ధధానాః - పురుషాః - ధర్మస్య - అస్య - పరంతప,
అప్రాప్య - మాం - నివర్తంతే - మృత్యుసంసారవర్త్మని.

ప్రతి॥ హేపరంతప ! = శత్రువినాశకుడవగు ఓ యర్జునా!, అస్య = ఈ, ధర్మస్య = ధర్మమునందు, అశ్రద్ధధానాః=మంచిశ్రద్ధలేని, పురుషాః = మానవులు, మాం అప్రాప్య = నన్నుపొందక, మృత్యుసంసారవర్త్మని=మరణరూపమగు సంసారమార్గమునందే, నివర్తంతే= నిశ్చయముగా వరించుదురు, (తిరుగుచుందురు,)

తా॥ శత్రుసంహారకుడవగు ఓ యర్జునా! ఈ యాత్మజ్ఞానమనెడు ధర్మముయొక్క స్వరూపమునందు నమ్మకముగలిగి శ్రద్ధతో నాచరింపని విశ్వాసరహితులైన మానవులు నన్ను బొందజాలక మృత్యువుతో గూడుకొనిన (మృత్యురూపమగు) సంసారమార్గమునందే నిశ్చయముగా తిరుగుచున్నారు.

వి॥ మనుజులకు శ్రద్ధయే ముఖ్యముగా నుండవలయుననియు. అది(శ్రద్ధ) లేనిచో, సంసారదుఃఖవిమోచనము కానేరదనియు శ్రీకృష్ణభగవానుడే తెలిపెను. పైరునుగాని, ఫలవృక్షములనుగాని శ్రద్ధతో సంరక్షించిన మాత్రముననే అవి మంచి ఫలము నిచ్చును. కట్టకడకు వంటచేయునప్పుడు గూడ అన్ని పదార్థములు శుద్ధముగా నుండినను శ్రద్ధలేక వండినచో మంట అధికమై పొంగిపోవుటయో, లేక మాడిపోవుటయో జరుగును. అట్లే మంట తక్కువగుచో సరిగా ఉడుకకపోవుటయు సంభవించును, ఇట్లుండగా ఆధ్యాత్మికమార్గమును గూర్చి మరియు చెప్పవలయునా! అధ్యాత్మిక మార్గమున శ్రద్ధ అత్యంత ముఖ్యమైనది.

శ్లో॥ మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా !
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥ 4

పద॥ మయా - తతం - ఇదం - సర్వం - జగత్ - అవ్యక్తమూర్తినా,
మత్స్థాని - సర్వభూతాని - న - చ - అహం - తేషు - అవస్థితః'

ప్రతి॥ ఇదం సర్వం జగత్ = ఈ ప్రపంచమంతయు, అవ్యక్తమూర్తినా = అగోచర మూర్తినగు, మయా = నాచేత, తతం =వ్యాపింపబడియున్నది. సర్వభూతాని = సమస్తభూతములు, మత్స్థాని= నాయందున్నవి, అహం చ = నేనన్ననో, తేషు = ఆ భూతములయందు, న అవస్థితః = ఉన్నవాడనుగాను.

తా॥ ఇంద్రియములకు గోచరముగాని నాచేత చరాచరాత్మకమగు ప్రపంచమంతయును వ్యాపింపబడెను. సకల జీవులును నాయందుండునట్టివి. నేనైతే ఆభూతములయందుండునట్టివాడను గాను.

శ్లో॥ న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్ ।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥ 5

పద॥ న - చ - మత్స్థాని - భూతాని - పశ్య - మే - యోగం – ఐశ్వరం, భూతభృత్ - న - చ - భూతస్థః - మమ - ఆత్మా - భూతభావనః.

ప్రతి॥ భూతాని=బ్రహ్మాది స్థావరాంతములగు భూతములు, మత్స్థాని=నాయందున్నవి, న చ = కావు, మే = నాయొక్క, ఐశ్వరం = ఈశ్వరసంబంధమైన, యోగం=యోగమహిమను, పశ్య=చూడుము, మమ=నాయొక్క ఆత్మా=ఆత్మస్వరూపము, భూతభృత్=ప్రాణులనుధరించుచున్నదియును భూతభావనః=ప్రాణులను వృద్ధిని పొందించుచున్నదియును అగుచు, భూతస్థః=భూతములయందున్నది' న చ= కాదు.

తా॥ బ్రహ్మాది స్థావరాంతములగు సకల భూతములును నాయందున్నవి. అయినను యోగదృష్టితో జూచిన అవి నాయందులేవు. నాయొక్క ఈశ్వరసంబంధమగు యోగమహిమ యిట్టిదని తెలిసికొనుము. నా యాత్మ ప్రాణులను ధరించుచున్నదియును, ప్రాణులను వృద్ధిని పొందించుచున్నదియును అగుచుండినను యథార్థముగా విచారించిన భూతములందున్నది గానేకాదు.

వి॥ ఇదిగదా భగవన్మాయామహిమ! ఐంద్రజాలికుడు తన యందనేక మహిమలను గనబరచుచు, తాననేకములలోనుండి మహిమలను చూపుచు,యథార్థముగా తనయందేమియు లేదనియు, తాను దేనియందును లేననియు ఏలాగున తెలిసికొనుచున్నాడో, అలాగున సచ్చిదానందమయుడగు సర్వేశ్వరునియందు లోకములుగాని, లోకములలో తానుగాని యున్నట్లు గనిపించినను వాస్తవముగా అటులలేదు.

శ్లో॥ యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ ॥ 6

పద॥ యథా - ఆకాశస్థితః - నిత్యం - వాయుః - సర్వత్రగః - మహాన్,
తథా - సర్వాణి - భూతాని - మత్స్థాని - ఇతి–ఉపధారయ,

ప్రతి॥ యథా = ఏ ప్రకారముగా, సర్వత్రగః = సర్వవ్యాపకమగు, మహాన్ వాయుః = మహావాయువు. నిత్యం=నిత్యము, ఆకాశస్థితః = ఆకాశమందణగియున్నదో, తథా = అట్లు, సర్వాణి=సమస్తములైన, భూతాని=భూతములు, మత్స్థాని=నాయందణగియుంటున్నని. ఇతి=అని, ఉపధారయ=గ్రహింపుము.

తా॥ అంతటను సంచరించునట్టిదియును, పరిమాణమునుబట్టి పెద్దదియు నగు వాయువు సర్వకాలములయందును ఏ విధముగా నాకాశము నంటకయే యాకాశమునందున్నదో, ఆ విధముగానే సమస్త భూతములు నాయందున్నవని తెలిసికొనుము.

శ్లో॥ సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్ ।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥ 7

పద॥ సర్వభూతాని - కౌంతేయ ! - ప్రకృతిం - యాంతి - మామికాం.
కల్పక్షయే - పునః - తాని - కల్పాదౌ -విసృజామి-అహమ్.

ప్రతి॥ హే కౌంతేయ! =కుంతీతనయుడవగు ఓ యర్జునా!సర్వభూతాని=సమస్త భూతములు,కల్పక్షయే=కల్పాంతమందు. మామికాం=నాసంబంధమగు ప్రకృతిం=ప్రకృతిని, యాంతి=పొందుచున్నవి. తాని=ఆ భూతములను పునః=మఱల, కల్పాదౌ=కల్పాదియందు, అహం = నేను, విసృజామి= సృజించుచున్నాను.

తా॥ ఓ యర్జునా! బ్రహ్మప్రళయకాలమునందు సకల భూతములు నా సంబంధమైన మాయను బొందుచున్నవి. సృష్టికాలమందు ఆ భూతములను మఱల నేను సృజించుచున్నాను.

శ్లో॥ ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్ ॥ 8

పద॥ ప్రకృతిం - స్వాం - అవష్టభ్య - విసృజామి - పునః-పునః.
భూతగ్రామం - ఇమం - కృత్స్నం - అవశం - ప్రకృతేః - వశాత్.

ప్రతి॥ ప్రకృతేఃవశాత్ = ప్రకృత్యధీనమువలన, అవశం = స్వతంత్రశక్తిలేని, ఇమం=ఈ, కృత్స్నం =సమస్తమైన, భూతగ్రామం = భూతసముదాయమును(నేను) స్వాం ప్రకృతిం=నాదియగు ప్రకృతిని, అవష్టభ్య=అవలంబించి, పునః పునః = మఱల మఱల, విసృజామి = సృజించుచున్నాను.

తా॥ స్వకీయమగు మాయ నవలంబించి ప్రాచీనకర్మమే నిమిత్తముగా గల ఆ యా భూతములయొక్క స్వభావమువలన అవిద్యాది దోషములచే పరవశమైన సమస్త భూతసముదాయమును వాటి వాటి పురాకృతసంస్కారము ననుసరించి ప్రతికల్పమునందును పుట్టించుచున్నాను.

శ్లో॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ ! ।
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు ॥ 9

పద॥ న - చ - మాం - తాని - కర్మాణి - నిబధ్నంతి - ధనంజయ!
ఉదాసీనవత్ - ఆసీనం - అసక్తం - తేషు - కర్మసు·

ప్రతి॥ హే ధనంజయ!=ఓ యర్జునా!, అట్లు సృజించినవాడనైనను, తేషు కర్మసు= ఆ కర్మలయందు, అసక్తం = ఆసక్తిలేనివాడను, ఉదాసీనవత్ ఆసీనం = సాక్షిభూతుడుగానున్నవాడనునైన, మాం=నన్ను, తానికర్మాణి=ఆకర్మలు న నిబధ్నంతి = బంధింపవు.

తా॥ ఓ యర్జునా! ఆ కర్మలయందు ఆసక్తి (సంబంధము) లేనివాడను, ఉపేక్షకునివలె ఊరకనున్నవాడను నయిన నన్ను భూతసముదాయముయొక్క విషమసృష్టికి నిమిత్తములయిన కర్మలు, బద్ధునిగా జేయజాలవు.

వి॥ ఒకనిని మంచివానినిగాను, ఒకనిని చెడ్డవానినిగాను భగవంతుడు సృష్టించెనట్లు సామాన్యులు తలంతురు. వారి వారి జన్మాంతరసంస్కారము ననుసరించిన దేహేంద్రియాదులను పరమేశ్వరుడు సృష్టించుచున్నాడేగాని తక్కిన మార్పులన్నియు జీవుల కర్మల ననుసరించియే జరుగుచున్నవి.

శ్లో॥ మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునాఽనేన కౌంతేయ జగద్విపరివర్తతే ॥ 10

పద॥ మయా - అధ్యక్షేణ - ప్రకృతిః - సూయతే - సచరాచరం,
హేతునా - అనేన - కౌంతేయ! - జగత్ - విపరివర్తతే.

ప్రతి॥ హేకౌంతేయ ! = ఓ యర్జునా!. ప్రకృతిః=ప్రకృతి. సచరాచరం= చరాచర ప్రపంచమును, అధ్యక్షేణమయా =సాక్షిభూతుడనగు నాచేత, సూయతే= సృజింపజేయుచున్నది, అనేన హేతునా=ఈ హేతువుచేతనే. జగత్ =ప్రపంచము. విపరివర్తతే = ప్రవర్తించుచున్నది.

తా॥ ఓయర్జునా! సాక్షిమాత్రుడనగు నాచేత ప్రకృతి ఆ యా స్థావర జంగమములతోగూడిన ప్రపంచమును గనుచున్నది. కావున ఈ హేతువుచేతనే ప్రపంచము నానావిధములుగాప్రవర్తించుచున్నది.

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్ ॥ 11

పద॥ అవజానన్తి - మాం - మూఢాః - మానుషీం - తనుం - ఆశ్రితం,
పరం - భావం - అజానంతః - మమ - భూతమహేశ్వరమ్,

ప్రతి॥ భూతమహేశ్వరం = సర్వభూతములను నియమించునట్టిదియును పరం = సర్వోత్తమమైనదియు నయిన, మమ = నాయొక్క, భావం= తత్త్వమును, అజానన్తః=తెలియనట్టి,మూఢాః=అవివేకులు, మాం=నన్ను. మానుషీం= మనుష్యసంబంధమైన, తనుం = శరీరమును, ఆశ్రితం =ఆశ్రయించిన వానినిగా మాత్రము తలంచి, అవజానన్తి = అలక్ష్యముచేయుచున్నారు.

తా॥ సర్వభూతములను నియమించునట్టిదియును, సర్వోత్తమ మైనదియు నయిన నాతత్త్వమును దెలియని మూఢులు, నన్ను మనుష్యసంబంధమైన దేహమును మాత్రము ధరించినవానినిగా దలచి యవమానించుచున్నారు.

వి॥ సాక్షాత్ భగవంతుడే తన్ను శిశుపాల దుర్యోధనాదులు అవమానపరచుచున్నారని చెప్పగా,సామాన్యజనులను గుఱించి లేక సామాన్యభక్తులను లేకసాధువులను గుఱించి మఱల చెప్పవలయునా? భక్తజనోద్ధరణకొఱకు సాక్షాత్ భగవంతుడే శ్రీకృష్ణరూపముగా నవతరించినట్లు మూఢాత్ములు తెలిసికొనజాలరని భగవంతుడే స్వయముగా తెలిపెను. అట్టి మూఢులగువారి మాటలనువిని విశ్వాసము లేనివాడవు కాకుమని యర్జునుని ఉద్దేశించి చెప్పెను.

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ 12

పద॥ మోఘాశాః - మోఘకర్మాణః - మోఘజ్ఞానాః - విచేతసః.
రాక్షసీం - అసురీం - చ - ఏవ - ప్రకృతిం - మోహినీం - శ్రితాః

ప్రతి॥ మోఘాశాః = వ్యర్థములైన యాశలుగలవారును, మోఘకర్మాణః = వ్యర్థములైన కర్మములు గలవారును. మోఘజ్ఞానాః=వ్యర్థమైన జ్ఞానము గలవారును, విచేతసః = మూఢులును, మోహినీం = మోహమునుగలుగ జేయునట్టిదియు, రాక్షసీం = రాక్షససంబంధమైనదియు, అసురీం = అసురసంబంధమైనదియు నగు. ప్రకృతిం = స్వభావమును. శ్రితాః = ఆశ్రయించిన వారగుచున్నారు.

తా॥ వ్యర్థములైన యాశలుగలవారును, వ్యర్థములైన కర్మ కాండప్రవృత్తిగలవారు, వ్యర్థమైన జ్ఞానముగలవారును, జ్ఞాన హీనులు నగువారు రాక్షస సంబధమైనదియు, నసురసంబధమైన దియు నగు స్వభావమును ఆశ్రయించిన వారగుచున్నారు.

శ్లో॥ మహాత్మానస్తు మాం పార్థ ! దైవీం ప్రకృతిమాశ్రితాః ।
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ॥ 13

పద॥ మహాత్మానః - తు - మాం - పార్థ - దైవీం - ప్రకృతిం - ఆశ్రితాః,
భజంతి - అనన్యమనసః - జ్ఞాత్వా - భూతాదిం - అవ్యయమ్.

ప్రతి॥ హే పార్థ ! = ఓ యర్జునా !, మహాత్మానః తు=మహాత్ములన్ననో, దైవీం ప్రకృతిం=దైవస్వరూపమును, ఆశ్రితాః=అవలంబించినవారై, మాం = నన్ను, భూతాదిం=సమస్తభూతములకు నాదికారణునిగను, అవ్యయం= నాశరహితునిగను, జ్ఞాత్వా=ఎఱిగి, అనన్యమనసః= ఇతరచింతలు లేని వారలై, భజంతి=భజించుచున్నారు.

తా॥ ఓ యర్జునా ! మహానుభావులు శమ, దమ, దయాదులే స్వరూపముగాగల దైవసంపద నాశ్రయించినవారగుచు, ఇతర చింతలులేనివారై నన్ను భూతములకును, ప్రాణులకును ఆదికారణు డుగను, నాశములేనివాడుగను దెలిసికొని సేవించుచున్నారు.

వి॥ 12 వ శ్లోకములో రాక్షసాసుర స్వభావము గలవారిని గుఱించి చెప్పబడినది. వారు రాజస, తామస ప్రకృతిగలవారు. వారిప్రయత్నములన్నియు వ్యర్థములు. ఇప్పుడు మహాత్ముల కుండవలసిన సాత్త్వికప్రకృతిని అనగా దైవస్వభావమును గురించి తెలుపడమైనది. 16-వ యధ్యాయమున మొదటి 3శ్లోకములచే నీదైవప్రకృతి వర్ణించడమైనది. మహాత్ములుదైవస్వభావము గలిగి యుండవలెనని యుపదేశించడమైనది. దైవగుణముగలవాడు దైవమును, అసురగుణముగలవాడు అసురులను, రాక్షస స్వభావము గలవాడు రాక్షసులను భూతప్రేతపిశాచస్వభావముగలవాడు భూతప్రేత పిశాచములనుమరణాంతమున పొందగలడు.

శ్లో॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః ।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ 14

పద॥ సతతం - కీర్తయంతః - మాం - యతంతః - చ - దృఢవ్రతాః.
నమస్యన్తః -చ- మాం - భక్త్యా - నిత్యయుక్తాః - ఉపాసతే.

ప్రతి॥ దృఢవ్రతాః=అచంచలమైన వ్రతముగలవారును.యతంతః చ = నన్ను పొందుటకు నిరంతరము యత్నించు స్వభావముగలవారును నైన కొందఱు, మాం=నన్ను, సతతం=ఎల్లప్పుడు, కీర్తయంతః=కీర్తించుచున్నవారును. నమస్యన్తః చ=నమస్కరించుచున్న వారునునై, భక్త్యాః= భక్తిచేత, నిత్యయుక్తాః =ఎల్లప్పుడును నాయందే చిత్తమును చేర్చినవారై మాం=నన్ను, ఉపాసతే=ధ్యానించుచున్నారు.

తా॥ సర్వకాలములయందును బ్రహ్మస్వరూపుడనగు నన్ను గురించి వేదాంతశ్రవణము, ప్రణవజపము అనువానిని చేయుచున్న వారును; ఇంద్రియనిగ్రహము, శమము, దమము, దయ, అహింస మొదలగునవియే లక్షణముగా గల ధర్మముచేత ప్రయత్నించుచున్న వారును, స్థిరమైన బ్రహ్మచర్యాది వ్రతములు కలవారై నమస్కారము చేయుచున్నవారును, భక్తిచేత నెల్లప్పుడు ఏకాగ్రచిత్తము గలవారు నునై కొందఱు హృదయేశుడనగు నన్ను సేవించుచున్నారు.

వి॥ ఇది సాకారభక్తియైనచో నామస్మరణ, కీర్తనలను, పూజలును నమస్కారములును గలిగియుండును.

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥ 15

పద॥ జ్ఞానయజ్ఞేన - చ - అపి - అన్యే - యజంతః - మాం - ఉపాసతే,
ఏకత్వేన - పృథక్త్వేన - బహుధా - విశ్వతోముఖమ్.

ప్రతి॥ అన్యే=మఱికొందరు మహాత్ములు, విశ్వతోముఖం=సర్వాంతర్యామినైన మాం=నన్ను, ఏకత్వేన=అద్వైత భావముచేతను, పృథక్త్వేన = ద్వైత భావముచేతను, బహుధా=బహుప్రకారములుగను, జ్ఞానయజ్ఞేన చ అపి= జ్ఞానయజ్ఞముచేతనైనను, యజంతః=పూజించుచున్నవారై ఉపాసతే = ఉపాసన చేయుచున్నారు.

తా॥ కొందఱు మహాత్ములు సర్వాంతర్యామినైన నన్ను బ్రహ్మము ఒకటే యను జ్ఞానముచేత నుపాసించుచున్నారు. మఱి కొందరు మహాత్ములు వేరువేరు రూపములుగా నుపాసనచేయు చున్నారు. కొందఱు మహాత్ములు జ్ఞానయజ్ఞమనెడు ఆత్మయజ్ఞముచే నుపాసన చేయుచున్నారు. ఈ విధముగా ననేక భావములతో పర మాత్మనగు నన్నొక్కనినే భజించుచున్నారు.

శ్లో॥ అహం క్రతురహం యజ్ఞస్స్వధాఽహమహమౌషధమ్ ।
మన్త్రోఽహమహమేవాజ్యమహమగ్నిరహం హుతమ్ ॥ 16

పద॥ అహం - క్రతుః - అహం - యజ్ఞః - స్వధా - అహం - అహం - ఔషధం.
మన్త్రః - అహం - అహం - ఏవ - ఆజ్యం - అహం - అగ్నిః - అహం - హుతం.

ప్రతి॥ అహం క్రతుః = క్రతువును నేనే, అహం యజ్ఞః = యజ్ఞమును నేనే, అహం స్వధా = స్వధమును నేనే, అహం ఔషధం = ఔషధమును నేనే, అహం మన్త్రః = మన్త్రమును నేనే, అహం ఆజ్యః =ఆజ్యమును నేనే, అహం అగ్నిః = అగ్నియును నేనే, అహం ఏవ హుతం = హోమ కర్మమును నేనేయై యున్నాను.

తా॥ వేదచోదిత కర్మమగు నగ్నిష్టోమాదికము, స్మృతిచోదిత మగు వైశ్వదేవాది పంచమహాయజ్ఞములు, పితృదేవతలకు నీయబడు శ్రాద్ధాద్యన్నము, సకలప్రాణులచేతను భుజింపబడుచున్న యన్నము

లేక వ్యాధులను పోగొట్టెడు ఔషధము, దేవతలకును పితృదేవతల కును హవ్యకవ్యాదులనిచ్చు నపుడు చెప్పెడు మంత్రము, హోమ మునకు గావలసిన నెయ్యి మొదలుగాగల హోమద్రవ్యములు, గార్హపత్యాహవనీయ దక్షిణాగ్నులు హోమాదికర్మ మనునవియును నేనే.

వి॥ ఇవి యన్నియు భగవత్ స్వరూపముగా తోచునది జ్ఞానయజ్ఞ మనం బడును. అన్నియు భగవదర్పితముచేయునది దైవయజ్ఞమనంబడును, వేరు వేరు భావము గలిగినది కర్మయజ్ఞ మనంబడును.

శ్లో॥ పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవచ ॥ 17

పద॥ పితా – అహం – అస్య – జగతః - మాతా - ధాతా - పితామహః.
వేద్యం - పవిత్రం - ఓంకారః - ఋక్ - సామ – యజుః – ఏవ - చ.

ప్రతి॥ అస్యజగతః =ఈ జగత్తునకు, పితా=తండ్రియును, మాతా = తల్లియును, పితామహః = తాతయును. ధాతా =రక్షకుడును, వేద్యం = తెలిసికొన దగిన, పవిత్రం = పవిత్రమైన వస్తువును, ఓంకారః = ప్రణవమును, ఋక్సామయజుః = ఋగ్వేదము సామవేదము యజుర్వేదము, అహం ఏవ = నేనే యగుచున్నాను.

తా॥ ఈ జగత్తునకుత్పత్తిని కలుగజేయు తండ్రియు, తల్లియు, పుణ్యాపుణ్యకర్మఫల ప్రదాతయు, తండ్రికి తండ్రియగు తాతయు, ఈశ్వరుడును, వేద్యమగు బ్రహ్మము, పరిశుద్ధకారణమగు కర్మాది కము, తెలియదగిన బ్రహ్మము తెలిసికొనుటకు ధ్యానసాధనమగు ప్రణవము, ఋక్ సామ యజుర్వేదము లన్నియును నేనే యగు చున్నాను.

వి॥ దీనియందు బ్రహ్మమును తెలిసికొనుటకు ప్రణవమొకటియే సాధన మనియు, ఆ ప్రణవము సాక్షాత్ బ్రహ్మవిష్ణుస్వరూపమనియు తెలుపడమైనది, అదియే తెలియందగినదనియు, పవిత్రమనియు, ఓంకారమనియు నుపదేశిం పడమైనది.

శ్లో॥ గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయస్థానం నిధానం బీజమవ్యయమ్ ॥ 18

పద॥ గతిః–భర్తా–ప్రభుః–సాక్షీ–నివాసః–శరణం–సుహృత్,
ప్రభవః – ప్రలయః – స్థానం – నిధానం – బీజం – అవ్యయం.

ప్రతి॥ గతిః = గతియును, భర్తా=రక్షకుడును, ప్రభుః=ఈశ్వరుడును, సాక్షీ = సాక్షియును, నివాసః=ఉనికిపట్టును. శరణం = ఆశ్రయింపదగినవాడును సుహృత్=ప్రతిఫలమునుకోరకఉపకారముచేయువాడును, = ప్రభవః = ఉత్పత్తిస్థానమును,ప్రలయః=లయస్థానమును,స్థానం=స్థితియును. నిధానం =నిక్షేపమును. అవ్యయం = నాశరహితమైన, బీజం = బీజమును నేనే.

తా॥ కర్మఫలమును, కర్మఫల ప్రదాతయును, స్వామియును, ప్రాణుల పుణ్యాపుణ్యములను చూచువాడును, కార్యకారణ ప్రపంచమునకు సర్వమున కధిష్ఠానమును, ఆర్తులును ప్రసన్నులు నగువారి యొక్క దుఃఖమును పోగొట్టి కాపాడువాడును, ప్రత్యుపకారమును కోరకయే యుపకారమును చేయువాడును, లోకముల కుత్పత్తిస్థానమును, లయస్థానమును,స్థితిస్థానమును,అనగా ఉత్పత్తిస్థితిలయములు మూటికిని స్థానమైనవాడును, కాలాంతర మందుపయోగించునట్టి నిక్షేపమును, నాశములేని కారణమును నేనే యగుచున్నాను.

వి॥ 'గతిర్భర్తా' అను శ్లోకమునే మీరాబాయి, తరికొండ వెంగమాంబగారలు నిరంతరము పఠనము జేయుచుండిరి. ఈ చరాచరమగు జగత్తును, తన్నును తన భర్తనుకూడ భరించువాడు ఆ సర్వేశ్వరుడు. అతనిని భరించువారికి లేక వరించువారికి దుర్గతిలేదు. నిత్యసుమంగళులు. అట్టి వారికి వైధవ్యమను వ్యథ నేకాలమందును పొందరు. గోపికా స్త్రీలిట్టి పరమాత్మనే భజించిరి, వారు శ్రీవైకుంఠములో నిత్యసుమంగళులై యుంటున్నారు, (అయితే భర్తలు గల స్త్రీలు ధర్మయుక్తుడగు ఐహికభర్తను ఉపేక్షింపవలెనని అర్థముకాదు. ఈ ప్రతి సేవ చేయుచున్నను అంతరాత్మలో పరమాత్మసేవను విడువరాదు.దేహముతో పతిసేవ జేయుచు, ఆత్మలో పరమాత్మ సేవయు గలిగియుండవలెను. భర్తలు లేని వారికంతయు నా పరాత్పరుడే గతి.

శ్లో॥ తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామిచ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున!॥ 19

పద॥ తపామి - అహం - అహం - వర్షం - నిగృహ్ణామి - ఉత్సృజామి - చ,
అమృతం-చ-ఏవ-మృత్యుః - చ - సత్ - అసత్ - చ - అహం - అర్జున!

ప్రతి॥ హే అర్జున! = ఓ యర్జునా!, అహం = నేను, తపామి = (లోకములను) తపింపచేయుచున్నాను, అహం = నేను, వర్షం=వర్షమును, ఉత్సృజామి= కురిపించుచున్నాను. నిగృహ్ణామి చ = నిలుపుచున్నానుగూడ, అమృతం చ = జీవనాధారమైన అమృతమున్ను, మృత్యుః చ =మరణమున్ను, సత్ అసత్ చ = సదసత్ పదార్థములు రెండును, అహం ఏవ=నేనే అయి యున్నాను.

తా॥ ఓ యర్జునా ! నేను సూర్యునియందుండి కొన్ని కిరణములచే ఎండను గలుగజేయుచున్నాను. నేను కొన్ని కిరణములచే సూర్యునియందుండి వర్షమును గురిపింపజేయుచున్నాడను. అమృతమును (జీవనాధారమున్ను), మరణ కారణమును సదసత్ పదార్థములు రెండును నేనే యగుచున్నాను.

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే।
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక-
మశ్నంతి దివ్యాన్దివి దేవభోగాన్ ॥ 20

పద॥ త్రైవిద్యాః - మాం - సోమపాః - పూతపాపాః - యజ్ఞైః - ఇష్ట్వా - స్వర్గతిం - ప్రార్థయన్తే - తే - పుణ్యం - అసాద్య - సురేంద్రలోకం - అశ్నంతి - దివ్యాన్ - దివి - దేవభోగాన్.

ప్రతి॥ (ఎవరు) త్రైవిద్యాః=ఋగ్యజుస్సామములను మూడువేదముల నెరింగినవారై, యజ్ఞైః = ఆ వేదములందు చెప్పబడియుండు యజ్ఞములచేత, మాం=నన్ను, ఇష్ట్వా = పూజించి, సోమపాః = సోమపానము చేసినవారును, పూతపాపాః=విగతకల్మషులునునై, స్వర్గతిం = స్వర్గప్రాప్తిని, ప్రార్థయన్తే = ప్రార్థించుచున్నారో, తే = అట్టివారు, పుణ్యం = పవిత్రమైన, సురేంద్రలోకం = దేవేంద్రలోకమును, అసాద్య=పొంది, దివి=ఆ దేవేంద్రలోకమునందు, దివ్యాన్= దివ్యములగు, దేవభోగాన్ = దేవభోగములను, అశ్నంతి = అనుభవించుచున్నారు.

తా॥ ఎవరు ఋగ్యజుస్సామములను తెలిసినవారై. జ్యోతిష్టోమాది క్రతువులచేతనన్నారాధించి యజ్ఞశిష్టమగు సోమమును పానము

చేసినవారై ,పాపరహితులై స్వర్గమనెడుప్రాప్య స్థానమును కోరు చున్నారో అట్టివారుపుణ్యఫలమైన దేవేంద్రుని స్థానమునుపొంది స్వర్గ ము నందు సర్వోత్తమములైన దేవభోగములననుభవించుచున్నారు.

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
ఏవం త్రయీధర్మమను ప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే। 21

పద॥ తే - తం - భుక్త్వా - స్వర్గలోకం - విశాలం - క్షీణే - పుణ్యే - మర్త్య లోకం - విశన్తి - ఏవం - త్రయీధర్మం - అనుప్రపన్నాః- గతాగతం- కామకామాః - లభన్తే.

ప్రతి॥ తే = అట్టివారు, విశాలం= విశాలమైన, తం స్వర్గలోకం = ఆ స్వర్గలోక మును, భుక్త్వా = అనుభవించి, పుణ్యే క్షీణే = పుణ్యము క్షీణించినదగు చుండగా, మర్త్యలోకం విశన్తి= భూలోకమునకు వచ్చుచున్నారు.ఏవం= ఈ ప్రకారముగా, త్రయీధర్మం అనుప్రపన్నాః = కామఫలప్రదంబు లగు వేదోక్తకర్మల ననుష్ఠించునట్టి, కామకామాః = కామాత్మకులు. గతాగతం =రాకపోకలను, లభంతే = పొందుచున్నారు.

తా॥ స్వర్గమును కోరువారు విస్తారమైన స్వర్గలోకసుఖము ననుభవించి పుణ్యము క్షీణించిన తరువాత భూలోకమున జన్మించు చున్నారు. ఈ ప్రకారముగా కామ్యఫలప్రదంబులగు వేదోక్త కర్మ ముల ననుష్ఠించునట్టి కామాత్మకులు (సకామపురుషులు) జననమర ణములను పొందుచున్నారు.

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ॥
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥ 22

పద॥ అనన్యాః - చింతయంతః - మాం - యే - జనాః -పర్యుపాసతే,
తేషాం - నిత్యాభియుక్తానాం - యోగక్షేమం - వహామి - అహమ్.

ప్రతి॥ అనన్యాః=ఇతరచింతలులేనివారై, మాం=నన్ను, చిన్తయంతః=చింతించు వారై, యే జనాః = ఏ జనులు, పర్యుపాసతే = ఉపాసించుచున్నారో, నిత్యాభియుక్తానాం = ఎల్లప్పుడును నా యందే చిత్తమునుచేర్చి ధ్యానము

చేయునట్టి, తేషాం = వారలయొక్క, యోగక్షేమం = యోగక్షేమమును, అహం = నేను, వహామి = వహించుచున్నాను.

తా॥ ఏ పరమభక్తులు ఇతర చింతలులేనివారై, పరమదైవమగు పరమాత్మనగు నన్ను ఎల్లప్పుడును ధ్యానించువారై సేవించుచున్నారో, అట్లు సర్వకాలములయందు సమాహితచిత్తులైన వారి యొక్క యోగక్షేమములను నేను వహించుచున్నాను.

వి॥ అప్రాప్తమైనదానిని ప్రాప్తించుట యోగమనంబడును. ప్రాప్తమైన దానిని చెడకుండ సంరక్షించుట క్షేమమనంబడును. తదేకధ్యానపరులగు మహాత్ములకు ఏ కాలమున నేది ప్రాప్తించవలెనో, ప్రాప్తమై యుండుదాని నెట్లు సంరక్షించ వలయునో యీ రెండు కార్యములను వారికి సర్వేశ్వరుడే నిర్వహించుచున్నాడు. గీతావాక్యములను అమోఘరత్నములచే చేయబడిన దివ్యహారమునకు ఈ శ్లోకము మధ్యాధ్యాయమందుండుటచే నాయకమణివంటిది. రెండవ అధ్యాయము 11- వశ్లోకము బీజమగును. అనగా నారంభము. ఇక 18-వ అధ్యాయమున 66-వశ్లో॥'సర్వధర్మాన్' అనునది అంత్యమగును. దీనికే 'శక్తి' యనియు, 'కీలక' మనియు పేరు. కావుననే యవి అంగన్యాసములో చేర్చబడినవి. అనన్యపదమునకు నాలుగు విధముల యర్థములు గలవు. (1) విష్ణుభక్తులైనచో శ్రీ మన్నారాయణుని తప్ప శివభక్తులైనచో శ్రీ పరమేశ్వరుని తప్ప యితరదేవతల పేర్లైనను పలుకకూడదనియు ఇతరభక్తులతో సహవాసము చేయరాదనియు చెప్పుదురు. అట్లు చేసిన పతివ్రతయగు స్త్రీ తన భర్తను విడిచి పరపురుషుని ఆశ్రయించినట్లని చెప్పుదురు. ఇదియు నొక విధమగు భక్తియైనను చాల సంకుచితమైన మూఢభక్తి యనంబడును, (2) ఏదేవతల యందు గాని, ఏ ధర్మానుష్ఠాన పరులయందుగాని ద్వేషములేక తన యిష్ట దైవమును మాత్రము ధ్యానించుచు నితర విషయములలో చిత్తము పోకుండుట యనన్యభక్తి యనం బడును. ఇది చాలవరకు మంచి పద్ధతి యనదగును. మొదటివానికన్న ఇతని హృదయము వేయిరెట్లు అధిక విశాలభావమును నిర్మలత్వమును గలిగియున్నది. సామాన్యముగా మహాభక్తులందఱును ఈ లాగుననే యుందురు. (3) అనేకత్వములో నేకత్వమును కనుగొనుటయే అనన్యభక్తి యందురు. ఇది 'సూత్రే మణిగణా ఇవ' అనేకరకములగు మణులలో ఒకే దారము వ్యాపించియున్నట్లు బ్రహ్మాదిస్థావరాంతముగల చరాచర ప్రాణికోట్లలో

నుండు పరమాత్మ ఒకడేయని గలిగిన జ్ఞానము చాల గొప్పది. ఉపనిషత్తులలో ఎక్కువభాగము యిట్టి దైవోపాసనయే గనుపించుచున్నది. ఇతడు పై జెప్పిన రెండవవానికన్న వేయిరెట్లధికమైన హృదయవైశాల్యమును, ఆత్మ శుద్ధియున్ను గలిగియుండువాడు. ఇతడన్నిటిలోను తన యుపాసనా మూర్తియగు ఇష్ట దైవ మునే చూచుచుండును. (4) "న అన్యం అనన్యం" పరబ్రహ్మమున కన్యముగా నొక్క పరమాణువైనను లేదని గలిగెడు జ్ఞానము అనన్యమనబడును. ఇది వేదాంతముయొక్క పరాకాష్ఠ యగును. 3-వ వానికన్న ఈ మహాత్ముడు వేయి రెట్లధిక హృదయ వైశాల్యమును విశుద్ధజ్ఞానము గలవాడగును. ఇతని కంతయు బ్రహ్మమయముగానే గనిపించును. "వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదు ర్లభః" అని 7 అ 19 వ శ్లోకమున శ్రీ భగవంతుడుపదేశించిన మహాత్ముడిట్టి వాడే. అట్టి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడని గూడ శ్రీ భగవంతుడు దెలిపెను. గీత అ. 18. శ్లో॥ 20, 21, 22లో 'సర్వభూతేషు యేనైకం'' పృథక్త్వేన తు యద్జ్ఞానం, యత్తుకృత్స్నవదేకస్మిన్, అను నీ మూడు శ్లోకములలో జెప్పబడిన జ్ఞానముయొక్క లక్షణమును బాగుగా తెలిసికొనిన అనన్యభక్తియొక్క స్వరూ పము లక్షణము ఎట్టిదో గోచరము గాగలదు. అట్టి జ్ఞానమును తెలిసికొనక పోవుటయే శైవవైష్ణవాది, ద్వైతాద్వైతాది, హిందూమహమ్మదీయాది కలహ ములకు హేతువగుచున్నది. ఇట్టి భేదజ్ఞానమే ద్వేషానలముగా బరిణమించి పవిత్రమగు సోదరభావమును నశింపజేసి దేవాసురులవలె శత్రువులనుగా జను లను జేయుచున్నది.

శ్లో॥ యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాఽన్వితాః ।
తేఽపి మామేవ కౌంతేయ ! యజంత్యవిధిపూర్వకమ్ ॥ 23

పద॥ యే - అపి -అన్యదేవతాభక్తాః - యజంతే - శ్రద్ధయా - అన్వితాః,
తే - అపి-మాం - ఏవ - కౌంతేయ! - యజన్తి - అవిధిపూర్వకమ్.

ప్రతి॥ హే కౌంతేయ! = ఓ యర్జునా!, యే అపి = ఎవరైతే, అన్యదేవతాభక్తాః= నా కంటె నితరదేవతలయెడ భక్తిగలవారగుచు, శ్రద్ధయా అన్వితాః= శ్రద్ధతో గూడినవారై, యజన్తే= అరాధించుచున్నారో, తే అపి = అట్టి వారలుగూడ, మాం ఏవ = నన్నే, అవిధిపూర్వకం = విధ్యుక్తమార్గము నవలంబింపక యజంతే = ఆరాధించుచున్నారు.

తా॥ ఏ జనులు ఇతర దేవతలందాసక్తిగలవారగుచు, ఆస్తిక్య బుద్ధితో గూడుకొనినవారై, ఆ యితరదేవతలనే పూజించుచున్నారో,

అట్టి జనులు మోక్షమును కలిగించునట్టి రీతిని తెలియక నన్నే సేవించుచున్నారు.

వి॥ సర్వాంతర్యామియగు పరమాత్మను తెలిసికొనక నామరూపములతో గూడిన దేవతల నుద్దేశించి ఆరాధించువారగుటచే ఫలప్రాప్తియు వేరువేరుగా నేర్పడుటకు కారణమగుచున్నది.

శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ ।
న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవంతి తే ॥ 24

పద॥ అహం - హి - సర్వయజ్ఞానాం - భోక్తా - చ - ప్రభుః - ఏవ - చ,
న - తు - మాం - అభిజానన్తి - తత్త్వేన - అతః - చ్యవంతి - తే.

ప్రతి॥ హి = ఏలయనగా, సర్వయజ్ఞానాం = సమస్తవిధములగు యజ్ఞములకు. భోక్తాచ = అనుభవించువాడను, ప్రభుః చ = ప్రభువును, అహం ఏవ = నేనే, తు = అయినను, మాం=నన్ను, తత్త్వేన =యథార్థముగా. న అభిజానన్తి=ఎరుగరు. అతః=ఈకారణమువలన. తే=అట్టివారలు. చ్యవంతి = జారిపడిపోవుచున్నారు, (పునర్జన్మమును పొందుచున్నారు.)

తా॥ సమస్త యజ్ఞములయందు హవిర్భాగమును భుంజిచువాడను, ఆకర్మలకు ప్రభుడను నేనే యను ప్రసిద్ధవిషయమును వాస్తవముగా తెలిసికొనజాలనివారు జారిపడిపోవుచున్నారు. జనన మరణ ప్రవాహమున మునుగుచున్నారు.

శ్లో॥ యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్యాంతి పితృవ్రతాః ।
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపిమామ్॥25

పద॥ యాంతి - దేవవ్రతాః - దేవాన్ - పితౄన్ - యాంతి - పితృవ్రతాః.
భూతాని-యాంతి - భూతేజ్యాః - యాంతి - మద్యాజినః - అపి - మామ్.

ప్రతి॥ దేవవ్రతాః=దేవతలనారాధించువారు, దేవాన్ = ఆ దేవతలను,యాంతి= పొందుచున్నారు. పితృవ్రతాః=పితృదేవతల నారాధించువారు,పితౄన్= ఆ పితృదేవతలను, యాంతి=పొందుచున్నారు, భూతేజ్యాః=భూతముల నారాధించువారు, భూతాని =ఆ భూతములను, యాంతి=పొందుచున్నారు మద్యాజినః అపి = నన్నారాధించువారన్ననో, మాం = నన్ను, యాంతి= పొందుచున్నారు.

తా॥ దేవతలను సేవించువారు ఆ దేవతాలోకములలో దేవతలుగా బుట్టుచున్నారు. పితృదేవతల నారాధించువారు పితృదేవతాలోకములను పొందుచున్నారు. భూతప్రేతపిశాచముల నారాధించువారు ఆ భూత ప్రేతపిశాచలోకములను బొందుచున్నారు. సాక్షాత్ ఆ పరమాత్మను ధ్యానించి యారాధించువారు విష్ణులోకమును లేక శ్రీమన్నారాయణుని పొందుచున్నారు.

వి॥ ఎవరెవరేయే దేవతల నుపాసింతురో,వారు ఆయాదేవతల లోకములను పొందుదురు. కావున నీచదేవతోపాసనచేయువారు మరణానంతరమున ఆ దుష్ట దేవతలై భూతప్రేతపిశాచములై యుండవలసియుండును. సాక్షాత్ పరమేశ్వరుని యారాధించువారు శివవిష్ణ్వాదిలోకములను పొందుదురు. ఆత్మయే పరమాత్మగా నెఱింగి బ్రహ్మధ్యానపరులై యుండువారు పూర్ణబ్రహ్మాకారస్థితి గలవారగుదురు. వీరెచ్చోటికిన్ని పోవుటలేదు. పోవువారందఱును తిరిగివచ్చువారలే.

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః ॥ 26

పద॥ పత్రం - పుష్పం - ఫలం - తోయం - యః-మే-భక్త్యా-ప్రయచ్ఛతి,
తత్ - అహం - భక్త్యుపహృతం - అశ్నామి - ప్రయతాత్మనః.

ప్రతి॥ యః = ఎవడు, మే = నాకు, పత్రం = దళమును గాని, పుష్పం = పుష్పను గాని, ఫలం= పండునుగాని, తోయం=జలమునుగాని, భక్త్యా= భక్తితో, ప్రయచ్ఛతి=సమర్పించుచున్నాడో, ప్రయతాత్మనః=పరిశుద్ధాంతఃకరణుడగు, తస్య = వానియొక్క, భక్త్యుపహృతం= భక్తితో సమర్పింపబడిన, తత్ = దానిని, అహం = నేను, అశ్నామి = భుజించుచున్నాను.

తా॥ పరిశుద్ధమైన మనస్సుగల పురుషుడు భక్తిచేత సమర్పించునట్టి పత్ర పుష్ప ఫలోదకములను నేనుమిగుల ప్రేమతో నారగించుచున్నాను.

వి॥ దీనియందు "ప్రయతాత్మనః" పరిశుద్ధమైన మనస్సుగలవాడని ప్రయోగించినది బాగుగా జ్ఞాపకము చేసికొనవలెను. అట్లుకాని బహుళపూజలన్నియు, కళాయిలేని పాత్రలో వండిన పప్పుపులుసు చిలుముపట్టిపోవు నట్లుండును.

మఱియు బీదభక్తులను గుఱించి యీ శ్లోక ముపదేశించడమైనది. ఒక్కొక్కరనేక విధోత్సవములు, నైవేద్యములు, సమారాధనలు చేయుచున్నారే; మాకు అట్టి పుణ్యములేదేయని తలంచి సంకటపడ నక్కరలేదు. ''పత్రం పుష్పం ఫలం తోయం'' అన్నట్లు దేనిని సమర్పించినను చాలును. అయితే నిర్మలమైన మనస్సు గలిగి యుండవలెను.కుచేలు డిచ్చిన యటుకులను,విదురుడిచ్చిన యాకుకూరను గంజిని భగవంతుడెంత ప్రేమతో భుజించెనో గదా! ఈ తత్త్వమును మరువ కుండిన చాలును.

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ ! తత్కురుష్వ మదర్పణమ్ ॥ 27

పద॥ యత్ - కరోషి - యత్ - అశ్నాసి - యత్-జుహోషి-దదాసి-యత్
యత్- తపస్యసి - కౌంతేయ - తత్ - కురుష్వ-మదర్పణమ్.

ప్రతి॥ హే కౌంతేయ=ఓ యర్జునా!, యత్ కరోషి=దేనిని చేయుచున్నావో,యత్ అశ్నాసి=దేనిని తినుచున్నావో, యత్ జుహోషి=దేనిని హోమము చేయుచున్నావో, యత్ దదాసి=దేనిని దానమిచ్చుచున్నావో. యత్ తపస్యసి=దేనిని తపమొనర్చుచున్నావో, తత్ = దానిని, మదర్పణం కురుష్వ= నాకర్పించుము.

తా॥ ఓ యర్జునా ! ఏ పనిని చేయుచున్నావో, దేనిని భుజించు చున్నావో, దేనిని వ్రేల్చుచున్నావో, దేనిని దానమిచ్చుచున్నావో, యే తపమొనర్చుచున్నావో వానినన్నిటిని నాకర్పణము చేయుము.

వి॥ ఈలాగున చేయుపనులన్నియు సర్వేశ్వరార్పితముగ చేయువానికం తయు యీశ్వరమయముగానే గనుపించును. లేక అట్టి మహాత్ముని సమస్తకార్య ములను సర్వేశ్వరుడే నిర్వహించును. అయితే భగవంతునికిని అశుద్ధ పదార్థము నెట్లు నివేదింపరో, పరిశుద్ధవస్తువును మాత్రమెట్లు భక్తులు నివేదనముచేయుదురో అలాగున పాప కార్యము చేయక పుణ్యకార్యమునే చేయుచుండవలెను. జనులు అశుద్ధవస్తువును భుజింపక శుద్ధాహారమునే తినుచుందురుగదా ?

శ్లో॥ శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తోమాముపైష్యసి ॥ 28

పద॥ శుభాశుభఫలైః - ఏవం - మోక్ష్యసే - కర్మబంధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా - విముక్తః - మాం=ఉపైష్యసి.

ప్రతి॥ ఏవం=ఇట్లు, త్వం = నీవు. సన్న్యాసయోగయుక్తాత్మా= సన్న్యాసయోగ ముతో గూడినమనస్సుగలవాడవై, శుభాశుభఫలైః=పుణ్యపాపములే.ఫల ములుగాగల, కర్మబంధనైః=కర్మబంధములచేత. మోక్ష్యసే=విడువబడ గలవు. విముక్తః=అట్లు విడువబడినవాడవై. మాం ఉపైష్యసి = నన్ను పొందగలవు.

తా॥ సకల కర్మములను నాయందర్పించుచున్నయెడల ఇష్టానిష్టఫలములుగల కర్మములనియెడు బంధములనుండి విడువబడినవాడవగుదువు. అందువలన నన్ను పొందగలవు.

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।
యే భజంతి తు మాం భక్త్యా మయితే తేషు చాప్యహమ్॥ 29

పద॥ సమః - అహం - సర్వభూతేషు-న- మే - ద్వేష్యః - అస్తి - న- ప్రియః, యే-భజంతి - తు - మాం - భక్త్యా - మయి - తే-తేషు-చ-అపి - అహమ్.

ప్రతి॥ అహం=నేను, సర్వభూతేషు=సమస్తభూతములయందు, సమః =సమానుడను, మే=నాకు, ద్వేష్యః=ద్వేషింపదగినవాడు, న అస్తి=లేడు, ప్రియః=ప్రియుడు, న=లేడు, యే తు=ఎవరైతే, భక్త్యా=భక్తితోడ, మాం=నన్ను భజంతి= భజించుచున్నారో, తే=వారలు, మయి = నాయందు (ఉంటున్నారు). తేషు = వారియందు. అహం అపి చ=నేనును (ఉంటున్నాను).

తా॥ నేను సకల ప్రాణులయందును సమానుడను. నాకు శత్రువుగాని, మిత్రుడుగాని లేడు. ఎవరైతే నన్ను భక్తిచేత సేవించుచున్నారో, అట్టివారు నాయందును, నేను వారియందును సమముగానుంటున్నాము.

వి॥ అందరిలోను భగవంతుడు సమానుడుగా నుండువాడనియు తనకు శత్రువుగాని, మిత్రుడుగాని లేడనియు చెప్పినది నిజమైనచో, కొందఱు సుఖులు కొందఱు దుఃఖులు. కొందఱు ముక్తులు అను నిట్టి భేదము గలుగుటకు కారణమే మని కొందఱు తలంతురు. భగవంతు డందరిలోను సమానముగా నుండినను, భగవంతుని యందు అందఱును సమానముగా నుండుటలేదు. అంతే భేదము. రాత్రులలో చలికాలమున నెవరు నెగడి (చలిమంట) దగ్గఱకు చేరుదురో వారికి చలియు, చీకటియు నశించును. వారికి ప్రకాశమును గలుగును. కల్పవృక్షము

దగ్గఱకు ఎవరు వెళ్ళి యేది ప్రార్థింతురో, వారికది లభించును. అగ్గిదగ్గఱకు రానివారి చలియు, చీకటియు నశింపవు.వారికి వెలుతురునులభించదు.కల్పవృక్ష మైనను దగ్గరకు వెళ్ళనివారికి నేమియును గలుగజేయదు. భగవత్‌స్థితియు నీలా గుండును, కావున జాతివర్ణములు గొప్పవిగావు; వారి వారి పవిత్రవర్తనమే గొప్పదని గ్రహించుకొనవలెను.

శ్లో॥ అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః ॥ 30

పద॥ అపి - చేత్ - సుదురాచారః - భజతే - మాం - అనన్యభాక్.
సాధుః - ఏవ - సః - మంతవ్యః - సమ్యక్ - వ్యవసితః - హి-సః

ప్రతి॥ సుదురాచారః అపి=మిక్కిలి దురాచారము గలవాడైనను, మాం=నన్ను అనన్యభాక్=అనన్యగతికుడై, భజతే చేత్=భజించినయెడల, సః=వాడు సాధుః ఏవ=శ్రేష్ఠుడేయని మంతవ్యః= తలంపదగియున్నాడు. హి=ఏల యన!, సః=అట్టివాడు. సమ్యక్ వ్యవసితః=నాయెడదృఢమైననిశ్చయము గలవాడగుచున్నాడుగదా !

తా॥ మిగుల నిందితములగు దురాచారములు గలవాడైనను పాపసంకల్పములు మాని, ఆత్మస్వరూపుడనగు నన్ను సేవించిన యెడల అట్టివాడు చక్కని నమ్మకముగలవాడు గనుక సత్పురుషుడనియే,శ్రేష్ఠుడనియే తలంచవలెను.

వి॥ ఓహెూ!భగవంతుడెట్టి సత్యమును న్యాయమును ఉపదేశించినాడు. ఈ ప్రకారము బోధకులు వర్ణాశ్రమ సంరక్షకులగు మఠాధిపతులు నడచిన యీ మనుష్యలోకము బ్రహ్మలోకమై యుండునుగదా! దుష్టకృత్యములు చేయు వారిని దూరముగా నిలుపుట సరియైనను దుష్టకృత్యములు మాని శిష్టాచారులైన వారినిగూడ దోషులుగా పరిగణించుట యెంత అధర్మము! రోగులను దూరముగా నుంచుట ధర్మమే. రోగము లేనివారిని లేక రోగము గలవారు ఔషధ సేవచేసి ఆరోగ్యవంతులైన పిమ్మటగూడ వారిని రోగులని చెప్పుచు దూరముగా నుంచుట యెంత భగవద్వాక్య విరుద్ధము! శ్రీ భగవద్గీతను పరమ ప్రమాణముగ శిరసా వహించి సదా భగవదారాధన చేయువారి దృష్టిలో ఈ శ్లోకము కనిపించక పోయినదిగదా! భగవన్నామస్మరణ చేసిన, శంఖ చక్ర

ధారణ చేసిన, వైష్ణవ మంత్రము జపించిన లేక శివమంత్రము జపించినను, చాల కాలమునుండి అరణ్యములో పడియుండు కట్టెలన్నియు ఒక రవ్వ నిప్పు పడిన భస్మమై పోవునట్లు, వీని జన్మ జన్మాంతర పాపములన్నియు క్షణకాలములో భస్మమై పోవుచున్నవని మహానందముతో ఉపన్యాస వేదికలపై సింహ గర్జనము చేయువారి వాక్యములకు ఆయుస్సు ఆ పీఠమునుండి దిగువరకు మాత్రమే యుంటున్నది. ఉపన్యాస పీఠములపై కూర్చుండి వ్యాఖ్యానము చేయు వారి వచనముకూడ అచ్చటినుండి లేచువఱకు మాత్రమే ప్రాణవంతమై యుండును. చెప్పుటలో మహాసమర్థులు గలరు. కాని చేయుటలో నేర్పరులు ఎవరును లేకపోయిరి. కనుకనే మన భారతదేశమింత పతన మొందుటకు కారణమైనది.

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31

పద॥ క్షిప్రం - భవతి - ధర్మాత్మా - శశ్వత్ - శాంతిం - నిగచ్ఛతి ।
కౌంతేయ! - ప్రతిజానీహి - న - మే - భక్తః - ప్రణశ్యతి.

ప్రతి॥ పై చెప్పబడినట్టివాడు, క్షిప్రం = శీఘ్రముగా, ధర్మాత్మా = ధర్మాత్ముడు, భవతి=అగుచున్నాడు, శశ్వత్ = శాశ్వతమైన, శాంతిం = పరమశాంతిని (ఉపరతిని), నిగచ్ఛతి=నిశ్చయముగా పొందుచున్నాడు, హే కౌంతేయ!= ఓ యర్జునా!, మే = నాయొక్క, భక్తః = భక్తుడు, న ప్రణశ్యతి = నాశము నొందడు అని, ప్రతిజానీహి = ప్రతిజ్ఞచేసి చెప్పుము,

తా॥ పై చెప్పిన స్వభావముగలవాడు అతిత్వరగా ధర్మాత్ముడగుచున్నాడు. శాశ్వతమైన పరమశాంతిని (చిత్తోపరతిని) పొందుచున్నాడు. ఓ యర్జునా! 'నాయందు భక్తిగలవాడు చెడడు' అని సభలో భేరీమ్రోగించి రెండుచేతులు పైకెత్తుకొని ప్రతిజ్ఞచేసి చెప్పుము.

వి॥ పరమాత్మ ధ్యానముచేయువాడెంత పాపియైనను పుణ్యాత్ముడుగాను, భగవంతుని ప్రియమైన వాడుగాను నగునని, భగవద్భక్తుడెప్పుడును చెడడని ఆత్మగుణమును చూడక పుట్టినగుణమునుబట్టి వర్ణాశ్రమ ధర్మములను, కర్మకాండను చెప్పువారి మధ్యలో భేరీ వాయించి కరములు పైకెత్తి 'యిది సత్యము, భగవదాజ్ఞ' యని ప్రమాణము చేయుచు తెలుపుము. ఓహో! ఎంత నమ్మకమును శ్రీ భగవంతుడు తెలిపెను! శ్రీ కృష్ణచైతన్య శ్రీ యేసుక్రీస్తు. మొదలగు

ప్రవక్తలు మహానుభావు లిట్టి నమ్మకము గలవారై యుండిరి. గ్రుడ్లగూబలకు సూర్యప్రకాశము అంధకారమగునట్లు కేవలము దేహాభిమానము గలవారికి **ఆత్మజ్ఞాన** ప్రకాశము కూడ తమోమయముగానే పరిణ మించును.

శ్లో॥ మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః।
స్త్రియోవైశ్యాస్తథాశూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥ 32

పద॥ మాం - హి - పార్థ - వ్యపాశ్రిత్య - యే - అపి - స్యుః - పాపయోనయః, స్త్రియః - వైశ్యాః - తథా - శూద్రాః - తే అపి - యాంతి - పరాం-గతిమ్.

ప్రతి॥ హే పార్థ! = ఓ యర్జునా!, హి = ఏ కారణమువలన, యే = ఎవరు, పాప యోనయః = పాపజన్మము గలవారు, స్యుః = అగుదురో, తే అపి = అట్టి వారును, స్త్రియః = స్త్రీలును, వైశ్యాః = వైశ్యులును, శూద్రాః చ =శూద్రులును, మాం = నన్ను, వ్యపాశ్రిత్య = ఆశ్రయించి, పరాం = సర్వోత్తమమైన, గతిం = గతిని, యాంతి = పొందుచున్నారు.

తా॥ ఓ యర్జునా! పాపజన్మముగలవారైతే యెవరెవరు గలరో అట్టివారును, పాపులుకాని స్త్రీలు, వైశ్యులు, శూద్రులు మొదలగు వారందఱును నన్ను శరణుపొంది ధ్యానాదుల జేసిన యెడల వారు సర్వోత్తమమగు మోక్షమును పొందుదురు.

వి॥ కొందఱు ఈ శ్లోకమునకు స్త్రీలు శూద్రులు వైశ్యులు మొదలైనవారు పాపయోనిసంభూతులని వ్యాఖ్యానము చేసియున్నారు. ఇదియెంత పాతకము! తన తల్లినిపాపాత్మురాలని తలంచువాడుగూడ పాపియే యగును. తనతల్లినిపుణ్యాత్మురాలని తలంచువాడు పుణ్యాత్ముడగును. శ్రీశ్రీధర,శ్రీశంకరానందగిరి మొదలైన వారి వ్యాఖ్యానము చూచినచో నచటవారు "యేఽపి పాపయోనయః"స్యుః=పాప యోనిసంభూతులెవరుగలరో వారిని,అట్లుకానివారగుస్త్రీ,వైశ్య,శూద్రులనువేరుగా చేసివ్యాఖ్యానము చేసియున్నారు,అదియే నిజమైన వ్యాఖ్యానము లేక "మాతృదేవో భవ" తల్లియే దైవముఅను వేదవాక్యమున కేమియర్థము చెప్పగలరు? మఱియు శ్రీ కృష్ణుడు గోపికాస్త్రీలను తన ప్రాణమువలె ప్రేమించినవాడుగదా! శ్రీరామచంద్రుడు ఋషుల యాశ్రమములలో మొట్టమొదట శబరిదగ్గఱకు వెళ్ళి యట్టి పుణ్యవతి యిచ్చిన యెంగిలిపండ్లను పరమానందముతో భుజించినవాడుగదా అట్టి పరమభక్తులను ఏలాగున పాపజీవులని చెప్పగలరు? ఇంతమాత్రమయిన

యీశ్లోకవ్యాఖ్యాతలు తలంచక పోయినారు. పాపయోనిసంభూతులగు కిరాత వంశములో వాల్మీకియు, శబరియు, అసురవంశములో ప్రహ్లాదుడు, రాక్షస వంశములో విభీషణుడు మొదలగు వారిని గ్రహించుకొనిన చాలును.

శ్లో॥ కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా।
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వమామ్ ॥ 33

పద॥ కిం - పునః - బ్రాహ్మణాః - పుణ్యాః - భక్తాః - రాజర్షయః - తథా, అనిత్యం - అసుఖం - లోకం - ఇమం - ప్రాప్య - భజస్వ - మాం.

ప్రతి॥ పుణ్యాః = పుణ్యవంతులగు, బ్రాహ్మణాః = బ్రాహ్మణులును, తథా = అలాగుననే, భక్తాః = భక్తులునగు, రాజర్షయః = రాజర్షులును, కిం పునః = పరమపదమును పొందుదురని మఱల చెప్పనేల, కాబట్టి, అనిత్యం = అశాశ్వతమైనదియు, అసుఖం = సుఖకరము కానిదియు నగు, ఇమం లోకం = ఈ లోకమును, ప్రాప్య = పొంది, మాం=నన్ను భజస్వ = భజింపుము,

తా॥ పుణ్యాత్ములగు బ్రాహ్మణులును, అలాగున భక్తులగు రాజర్షులును ముక్తిని పొందుదురని మఱల చెప్పవలెనా ? కావున క్షణభంగురమును సుఖరహితమునైన యీలోకమును పొంది నన్ను సేవింపుము.

వి॥ పాపాత్ములైన వారును, ఇతరులగు స్త్రీవైశ్య శూద్రులును పరమాత్మను భజించి ముక్తిని పొందుచుండగా ఇక పుణ్యాత్ములగు బ్రాహ్మణులనుగుఱించియు. భక్తులగు రాజర్షులను గుఱించియు. మఱల చెప్పవలెనా? లేకరాజర్షులనియొకే పదములో ప్రయోగించుటచే ఆ కాలమందుండెడు రాజులు ఋషుల వంటివారని తెలుపడమైనది. జనకవిశ్వామిత్రాది రాజులను రాజర్షులని శాస్త్రములో పేర్కొని యున్నారు. ఇప్పుడుండు రాజులుగూడ తమ పూర్వీకులకుండిన ఋషిత్వమును సంపాదించుకొన వలెనని యత్నము గలిగియుండవలెను. మఱియు రాజులు తమ జీవితములో మూడవదశ ప్రారంభించునపుడు తప్పక వనమున కేగి తప మొనర్చవలసి యుందురు. అపుడే నాల్గాశ్రమములను పాలించినవారగుదురు.

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు!
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః ॥ 34

పద॥ మన్మనాః - భవ - మద్భక్తః - మద్యాజీ - మాం - నమస్కురు.
మాం - ఏవ - ఏష్యసి - యుక్త్వా -ఏవం - ఆత్మానం-మత్పరాయణః.

ప్రతి॥ మన్మనాః=నాయందు చేర్చిన మనస్సుకలవాడవును,మద్భక్తః=నాయందు భక్తిగలవాడవును, మద్యాజీ=నన్నారాధించెడువాడవును, భవ=అగుము, మాం=నన్ను, నమస్కురు=నమస్కరింపుము.ఏవం=ఈ విధముగా, ఆత్మానం=మనస్సును,యుక్త్వా=నాయందు చేర్చి, మత్పరాయణః=నన్నేపరమ ప్రాప్యముగా నెంచిన వాడవై, మాం ఏవ=నన్నే, ఏష్యసి= పొందగలవు.

తా॥ నాయందు మనస్సుగలవాడవును, నాయందు భక్తిగల వాడవును, నన్ను పూజించువాడవును అగుము. నన్ను నమస్కరింపుము.ఈ విధముగా నాయందు ప్రీతిగలవాడవగుచు నన్నే పరమప్రాప్యముగా భావించి మనస్సును నాయందు చేర్చినవాడవై నన్నేపొందగలవు.

వి॥ పై విధముగా మనస్సును పరమాత్మయందైక్యపఱచి నిరంతరము ధ్యానము చేయువాడు ఆ పరమాత్మనే పొందగలడు.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యా రాజగుహ్యాయోగోనామ
న వ మో ఽ ధ్యా య ః.

పద॥ ఇతి - శ్రీమత్ భగవద్గీతాసు - ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం— యోగ శాస్త్రే—శ్రీకృష్ణార్జునసంవాదే —రాజవిద్యా రాజగుహ్య యోగః – నామ – నవమః— అధ్యాయః.

తా॥ ఇట్లు ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగ శాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదరూపము నగు శ్రీమద్భగవద్గీతయందు రాజవిద్యా రాజగుహ్య యోగమను తొమ్మిదవ అధ్యాయము సమాప్తము,

ఓం తత్ సత్.



ఓమ్
శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## దశమోఽధ్యాయః — దశమాధ్యాయము

## విభూతి యోగః — విభూతి యోగము

:-(౦):-

ఈ యధ్యాయమునకు విభూతియోగమని పేరు. విభూతియనగా ఈశ్వరునికి సంబంధించిన మహిమాతిశయమును తెలుపునదనిభావము. భగవదైశ్వర్యమును బోధించుననిగూడ యర్థము గలదు. అట్టి భగవన్మహిమాతిశయమును తెలిసికొనుటగూడ ఒక యోగమనబడును. అనగా దీనివలనగూడ భగవదైక్యము చిత్త నిశ్చలత్వము, భగవత్సాక్షాత్కారమును గలుగును. కావున దీనిని యోగమని చెప్పుటకు కారణమైనది.

శ్రీ భగవానువాచ:— శ్రీభగవంతుడు చెప్పెను,

శ్లో॥ భూయ ఏవ మహాబాహో ! శృణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥ 1

పద॥ భూయః - ఏవ - మహాబాహో ! - శృణు - మే - పరమం-వచః.
యత్ - తే - అహం - ప్రీయమాణాయ - వక్ష్యామి-హితకామ్యయా.

ప్రతి॥ హే మహాబాహో! = గొప్పబాహువులుగల ఓ యర్జునా!. ప్రీయమాణాయ =ప్రీతితో వినుచున్న, తే=నీకు, భూయః=మఱల, హితకామ్యయా ఏవ= మేలు చేయవలెననెడు కోరికతోనే, అహం=నేను. యత్ వక్ష్యామి=దేనిని చెప్పబోవుచున్నానో అట్టి, మే పరమం వచః=నాయొక్క పరమోత్కృష్ట మైన వాక్యమును, శృణు, = వినుము.

తా॥ అమృతపానమువలన సంతసించువానివలె నా వాక్యామృతమువలన ప్రీతిజెందెడు నీకు హితము గలుగజేయవలయునను తలంపుతో మఱల చెప్పదలచుకొన్నదియును, సర్వోత్కృష్టమును నగు నా వాక్యమును వినుము.

వి॥ ధర్మబోధ మొనర్చువారు చెప్పెడు వాక్యములలో ప్రీతి కనబరచిన మాత్రమే వారుధర్మరహస్యములను బోధించగలరని ఈ శ్లోకమువే వ్యక్తమగు చున్నది.

శ్లో॥ న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః ।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥ 2

పద॥ న - మే - విదుః - సురగణాః - ప్రభవం - న -మహర్షయః,
అహం - ఆదిః - హి - దేవానాం - మహర్షీణాం- చ- సర్వశః.

ప్రతి॥ మే = నాయొక్క, ప్రభవం=ఉత్పత్తిని, సురగణాః=దేవసమూహములు న విదుః = ఎఱుగరు, మహర్షయః = మహర్షులు, న=ఎఱుగరు, హి= ఏలనన, అహం=నేను, సర్వశః = అన్నివిధములచేతను, దేవానాం= దేవతలకును, మహర్షీణాం చ=మహర్షులకును, ఆదిః=మొదటివాడను.

తా॥ నా యొక్క ఉత్పత్తిని దేవసంఘములు ఎఱుంగవు. మహాఋషులును ఎఱుంగరు. ఏలననగా, అన్నివిధముల నేను దేవత లకును, మహర్షులకును మొదటివాడను.

వి॥ మానవులకంటె అధికజ్ఞానముగలవారు దేవతలు. వారికన్న మిక్కిలి జ్ఞానముగలవారు ఋషులు. వారు సహా పరబ్రహ్మముయొక్క సంపూర్ణజ్ఞానము గల వారు గారని చెప్పుటచే సామాన్య మనుజుడగు అర్జును డెట్లెరుంగ గలడు? బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముయొక్క మహిమాతిశయ మీలాగున దురూహ్యమని వర్ణించడమైనది.

శ్లో॥ యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసమ్మూఢస్సమర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3

పద॥ యః - మాం – అజం - అనాదిం - చ - వేత్తి - లోకమహేశ్వరమ్.
అసమ్మూఢః - సః - మర్త్యేషు - సర్వపాపైః-ప్రముచ్యతే.

ప్రతి॥ యః=ఎవడు, మాం=నన్ను. అజం=పుట్టుకలేనివానిగను,అనాదిం చ= ఆదిలేనివానిగను, లోకమహేశ్వరం = లోకములకు నియామకుడుగను, వేత్తి = ఎరుగుచున్నాడో, సః = వాడు. మర్త్యేషు=మనుష్యులయందు, అసమ్మూఢః=మోహరహితుడై, సర్వపాపైః = సమస్తపాపములచేత ప్రముచ్యతే–విడువబడుచున్నాడు.

తా॥ నన్ను కారణము లేనివానినిగను, కనుకనే పుట్టుక లేనివానినిగను, సమస్తలోకములకు మహేశ్వరునిగను ఎవడు తెలిసికొనుచున్నాడో వాడు మనుష్యులలో మోహరూప ఆవరణము లేనివాడై వివేకవంతుడై సర్వపాపముల నుండియు విడువబడు చున్నాడు, అనగా మోక్షమును బొందుచున్నాడు.

శ్లో॥ బుద్ధిర్జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాఽభయమేవ చ। 4

" అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః ।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః॥ 5

పద॥ బుద్ధిః - జ్ఞానం - అసమ్మోహః – క్షమా – సత్యం – దమః – శమః.
సుఖం–దుఃఖం–భవః–అభావః–భయం–చ–అభయం–ఏవ–చ,

,, అహింసా–సమతా–తుష్టిః–తపః–దానం–యశః–అయశః,
భవన్తి–భావాః–భూతానాం–మత్తః–ఏవ–పృథగ్విధాః,

ప్రతి॥ బుద్ధిః = నిర్మలబుద్ధియు, జ్ఞానం = జ్ఞానమును, అసమ్మోహః = మోహ రాహిత్యము, క్షమా=ఓర్పు, సత్యం = సత్యము, దమః = బాహ్యేంద్రియ నిగ్రహము, శమః=అంతరింద్రియ నిగ్రహము. సుఖం=సుఖము, దుఃఖం = దుఃఖము, భవః = పుట్టుకయును, అభావః=నాశము, భయం చ = భయ మును, అభయం ఏవ చ = భయములేకపోవుట, భూతానాం = ప్రాణి కోట్లకు గలిగెడు, అహింసా = హింసచేయకపోవుటయు, సమతా = సమ చిత్తత్వమును, తుష్టిః = సంతుష్టియు. తపః = తపస్సును, దానం = దానమును. యశః=కీర్తియు, అయశః = అపకీర్తియు, మొదలుగాగల పృథగ్విధాః = నానా విధములైన, భావాః = భావములు, భూతానాం= ప్రాణులకు, మత్తః ఏవ = నావలననే, భవంతి = కలుగుచున్నవి.

తా॥ మిక్కిలి సూక్ష్మములైన యర్థములను తెలిసికొనునట్టి బుద్ధియును, ఆత్మానాత్మపదార్థములను తెలిసికొనెడు జ్ఞానమును, మోహరాహిత్యము, ద్వంద్వముల సహించెడు ఓర్పు, సత్యము, బాహ్యేంద్రియనిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, సుఖము,

దుఃఖము, జన్మించుట, నశించుట, భయమును, భయము లేకపోవుటయు, అహింసయు, సమచిత్తత్వమును, సంతుష్టియును, తపస్సును, దానబుద్ధియు, కీర్తియు, నపకీర్తియు నివి మొదలుగాగల నానావిధములైన గుణములు సకలప్రాణులకు పరమేశ్వరుడనగు నావలననే కర్మానుగుణ్యముగా కలుగుచున్నవి.

వి॥ సర్వేశ్వరుడు కర్మఫలప్రదాత యనునది నిరూపించుచున్నాడు. భూమి, మధుర, ఆమ్ల కట్వాది వివిధ రుచులుగల యసంఖ్యాకములగు బీజములకు తగిన ఫలముల నిచ్చుచున్నట్లు జీవకోట్ల పాప పుణ్య మిశ్ర, కామ్య, నిష్కామ కర్మల ననుసరించి ఫలము గలుగుచున్నది. కావున కర్మయందు జాగ్రత గలిగియుండనిచో సర్వేశ్వరుడు గూడ ఏమియు చేయజాలడు.

శ్లో॥ మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥ 6

పద॥ మహర్షయః - సప్త - పూర్వే - చత్వారః - మనవః - తథా,
మద్భావాః - మానసాః - జాతాః - యేషాం - లోకే-ఇమాః-ప్రజాః.

ప్రతి॥ లోకే = లోకమునందలి. ఇమాః, ప్రజాః = ఈ ప్రజలు, యేషాం (జాతాః)= ఎవరికి సంబంధించిరో అనగా ఎవరివలన పుట్టిరో యట్టి, పూర్వే=పూర్వికులైన, సప్తమహర్షయః=సప్తమహర్షులును, చత్వారః=నలుగురు సనకాదులును, తథా = అలాగుననే, మనవః = స్వాయంభువాది మనువులును, మద్భావాః=మద్గతభావనులై నాయొక్క ధ్యానము(లేక) ప్రభావము గలవారలై, మానసాః జాతాః=నా మనస్సంకల్పమువలన పుట్టినవారైరి.

తా॥ లోకమునందలి యీ సకల జనులును ఎవరినుండిపుట్టిరో, మఱియు పుత్రపౌత్రులుగాను, శిష్యప్రశిష్యులుగాను అయిరో యట్టి నామీఁదప్రేమము గలవారును. నాయొక్క ధ్యానముకలవారును, అయోనిజులు నయిన భృగువు మొదలుగాగల సప్తమహర్షులును, వారికి పూర్వులగు సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులును, స్వాయంభువు మొదలుగాగల చతుర్దశ మనువులును పరమేశ్వరుడనగు నాయొక్క మనస్సంకల్పమువలననే కలిగిరి.

వి॥ మనువునుండి పుట్టినవారగుటచేతనే యీ జనులందరికిని, మానవులనియు, మనుజులనియు, మనుష్యులనియు పేర్లు వచ్చినవి. ప్రపంచములోనుండు మానవులందఱును మనుసంతానములే. అగ్రజాతినుండి యంత్యజాతివఱకును ఇతరులైన మతాంతరులకును మానవులనియు, మనుష్యులనియు, మనుజులనియు పేర్లు గలవు. ఈ ప్రపంచములో గలవారందఱును వారి సంతతివారే. వీరిలో మనువులు ప్రవృత్తి మార్గధర్మముల నుపదేశించువారు. సనకాదులు నివృత్తిమార్గమం దధికారము గలవారికి ఆత్మతత్త్వము నుపదేశించువారలు. ధర్మానుష్ఠానముచే అంతఃకరణ శుద్ధి కావలసి నందుచే మన్వాదులు ప్రవృత్తి ధర్మ బోధకులైరి. ఆత్మశుద్ధి గలవారికి నివృత్తి మార్గమే కావలసినందుచే సనకాదులు వైరాగ్య జ్ఞానబోధకులుగా నేర్పడిరి. పుత్ర పౌత్ర పరంపర ననుసరించి చూచినచో మానవులందఱును మనుసంతతి వారలే. శిష్య పరంపర ననుసరించి చూచిన అందఱును సనకాది ఋషులయొక్క పరంపరలో చేరినవారే. కావున వంశముచేతను శిష్యపరంపరచేత నీ జనులందఱును(మనుజులందఱును) ఋషిసంతానములే. కాలాంతరమున కాపరిలేని గొఱ్ఱెల గుంపువలె ఈ జనులకిట్టి సత్యమును బోధించువారు లేకపోవుటచే నానాజాతులై నానామతములై దిక్కులేనివారలైరి. ఇక నిట్టి పరమసత్యము నెఱింగియే జనుల సంస్కరించి ధర్మబోధచేయు దివ్యపురుషు లవతరించినప్పుడే ఉపన్యాసములలోచెప్పెడు "సోదరీ సోదరులారా!" అను సంబోధనవాక్యము సార్థకతనొందును. అంతవఱకు అట్టివిశాలమైన పవిత్రమగు శబ్దము నిరర్థకమే యగును. దానికి దీర్ఘాయుస్సులేదు. అల్పాయుస్సు మాత్రమే గలదు. అనగా ఉపన్యాసవేదికనుండి దిగువఱకు మాత్రమే ఆ వాక్యమునకు ఆయుస్సుగలదు.

శ్లో॥ ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః॥ 7

పద॥ ఏతాం - విభూతిం - యోగం - చ మమ - యః - వేత్తి-తత్త్వతః,
సః - అవికంపేన-యోగేన - యుజ్యతే - న - అత్ర-సంశయః.

ప్రతి॥ మమ=నాయొక్క. ఏతాంవిభూతిం = ఈ సృష్టిమహిమను, యోగం చ=యోగమును, తత్త్వతః = యథార్థముగా, యః వేత్తి=ఎవడెఱుంగుచున్నాడో, సః=వాడు, అవికంపేన=చలింపని, యోగేన=యోగముచేత

యుజ్యతే=కూర్చబడుచున్నాడు, అత్ర=ఈ విషయమునందు, సంశయః= సందేహము, న = లేదు.

తా॥ నాయొక్క విభూతిని, యోగమును జక్కగా తెలిసికొనిన వాడు నిశ్చలమగు యోగముతో గూడుకొనుచున్నాడు. ఇందులకు సందేహ మేమియును లేదు.

వి॥ సనకాది ఋషులకును, స్వాయంభువాది మనువులకును ఇట్టిమహిమ దేనివలన గలిగిన దనగా, తపోయోగముల వలననే కావున ఈ తత్త్వమెరింగిన వాడు తప్పక ధ్యాన యోగ తపస్సులలో ప్రవేశించును. సందేహములేదు. ఎవరికి ఏవిద్య చేత నున్నతోద్యోగము లభించెనో, దానిని ఎఱింగినవాడు అట్టి యున్నతో ద్యోగమునకు చదువవలసిన విద్య నభ్యసించును.

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః ॥ 8

పద॥ అహం–సర్వస్య–ప్రభవః–మత్తః–సర్వం - ప్రవర్తతే,
ఇతి - మత్వా – భజంతే - మాం - బుధాః - భావసమన్వితాః.

ప్రతి॥ అహం = నేను, సర్వస్య=సమస్త ప్రపంచమునకు, ప్రభవః =ఉత్పత్తి కారణము, సర్వం =సమస్తప్రపంచము, మత్తః=నావలననే, ప్రవర్తతే= ప్రవర్తించుచున్నది, ఇతి=అని, మత్వా=తలంచి, బుధాః = జ్ఞానులు, భావసమన్వితాః= నాయందు భక్తిభావముతో గూడినవారై, మాం భజన్తే =నన్ను భజించుచున్నారు.

తా॥ పరబ్రహ్మనైన నేను సకల ప్రపంచమున కుత్పత్తికార ణుడననియు, సకల ప్రపంచము నావలననే ప్రవర్తించుచున్నదనియు తెలిసికొనిన తత్త్వవేత్తలు యథార్థము గురుతెరింగినవారై, పరమార్థ తత్త్వమును గ్రహించవలెనను దృఢమైన భక్తిభావము గలవారై పరబ్రహ్మనైన నన్ను ధ్యానించుచున్నారు.

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్ ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥ 9

పద॥ మచ్చిత్తాః – మద్గతప్రాణాః - బోధయంతః - పరస్పరం,
కథయంతః - చ - మాం - నిత్యం - తుష్యంతి - చ - రమంతి - చ

ప్రతి॥ పై చెప్పిన ధ్యానపరులు, మచ్చిత్తాః = నాయందుంచబడిన చిత్తముగల వారును, మద్గతప్రాణాః=నన్ను పొందిన ప్రాణముగలవారును, పరస్పరం=ఒకరికొకరు, మాం=నన్ను (నా చరిత్రమును), బోధయంతః= బోధించువారును, కథయంతః చ = చెప్పుకొనుచుండెడు వారునునై, నిత్యం=ఎల్లప్పుడును, తుష్యంతి చ=తృప్తులగుచున్నారు. రమంతి చ= ఆనందించుచున్నారు.

తా॥ నేనే పరమాత్మయను తత్త్వమును గుర్తెఱింగిన బుద్ధిమంతులు భగవంతుడనైన నాయందుచంబడిన చిత్తము గలవారును, తదేక ధ్యానముతో నాయందుంచబడిన సకలేంద్రియములు గల వారును,శ్రుతులచేతను, యుక్తియుక్తములగు వాక్యములచేతను, తమకు గలిగిన యనుభవముచేతను పరస్పరము చర్చించుకొనుచు, నన్ను గూర్చి భక్తుల కుపదేశించుచున్నవారునునై, యెల్లప్పుడు నిట్టిపరమాత్మను ధ్యానించుట, స్మరించుట, దర్శించుట మొదలగునవి గలిగినవి కనుక నింతకంటె మనకేమి కావలెనని తలంచి తమలో తాము సంతోషించుచున్నారు. అంతియేగాక, ఆత్మారాములై పరమానందమనుభవించుచున్నారు.

వి॥ ఉత్తమబ్రహ్మనిష్ఠులు పరమభక్తులుండే స్థితి దీనిలో తెలుపడమైనది. ఇదే నలుగురొక ఆశ్రమములోగాని, సంఘములోగాని యుండిన గలిగెడు ప్రయోజనము. అంతియేగాని వ్యర్థపుమాటలచేతగాని, లోకవ్యవహారముల చేత గాని లేక అన్యోన్యము ప్రేమ లేకుండగ గాని కాలము గడుపగూడదు.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే॥ 10

పద॥ తేషాం - సతతయుక్తానాం - భజతాం - ప్రీతిపూర్వకం,
దదామి - బుద్ధియోగం - తం - యేన - మాం - ఉపయాంతి -తే.

ప్రతి॥ తే = పై చెప్పిన స్థితిగలవారు,యేన = దేనిచేత, మాం = నన్ను, ఉపయాంతి = పొందగలరో, తం బుద్ధియోగం = అట్టి జ్ఞానయోగమును, సతతయుక్తానాం = నిత్యయుక్తులైనట్టియు, ప్రీతిపూర్వకం = ప్రీతి

పూర్వకముగా, భజతాం = నన్నుధ్యానయోగముచే భజించునట్టియునగు, తేషాం = వారలకు, దదామి = ఇచ్చుచున్నాను.

తా॥ ఎల్లప్పుడును భగవంతుడనగు నాయందేకాగ్రచిత్తులును, ప్రీతిపూర్వకముగా నన్ను భజించువారును నైన, నిరంతర ధ్యానపరులకు పరమేశ్వరుడనగు నన్ను పొందుటకు సాధనమగు ఏ జ్ఞానము గలుగవలెనో అట్టిదానిని గలిగించుచున్నాను.

వి॥ ఇట్టి భగవదర్పిత చిత్తముతో ధ్యానము చేయువారికి ఏ జ్ఞానమువలన భగవత్ ప్రాప్తి గలుగునో అట్టిదానిని నేను స్వయముగా గాని, అంతర్యామిత్వ రూపముగా గాని లేక స్వప్నరూపముగా గాని లేక మఱియెవరైన మహాత్ముల ననుసంధింపజేసిగాని కలుగ జేయుదును. పరమభక్తుల తరింపజేయుట భగవత్ ప్రతిజ్ఞ యగుటచే అట్టి విశ్వాసము గలవారికి భగవంతుడే తప్పక జ్ఞానమును గలుగ జేయును.

శ్లో॥ తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ 11

పద॥ తేషాం - ఏవ - అనుకంపార్థం - అహం - అజ్ఞానజం - తమః.
నాశయామి - ఆత్మభావస్థః - జ్ఞానదీపేన - భాస్వతా.

ప్రతి॥ అహం=నేను, తేషాం అనుకంపార్థం ఏవ = వారిని కనికరించుటకొరకయ్యే, అజ్ఞానజం = అజ్ఞానమువలన గలిగిన,తమః = అంధకారమును, ఆత్మభావస్థః - వారియంతః కరణమందున్నవాడనై, భాస్వతా = ప్రకాశించుచున్న, జ్ఞానదీపేన = జ్ఞానమను దీపముచేత, నాశయామి = నశింప చేయుచున్నాను.

తా॥ ఎల్లప్పుడును ధ్యానముచేయు భక్తుల ననుగ్రహించుటకొఱకే వారి అంతఃకరణమందున్నవాడనై, వారియొక్క అజ్ఞాన జన్యమైన మోహాంధకారమును వెలుగుచున్న జ్ఞానమనెడు దీపము చేత పోగొట్టుచున్నాను.

వి॥ అట్టి జ్ఞాన దీపమునకు అంతఃకరణశుద్ధియనెడు ప్రమిదయు, భగవదనుగ్రహమనెడు తైలము,ఇంద్రియనిగ్రహమను వత్తియు గలిగియుండిన అప్పుడు సాక్షాత్ భగవత్ స్వరూపజ్ఞానమనెడు జ్యోతి వెలుగును. ప్రతిబంధమనెడు గాలి వలన దీపము నారిపోనీయక ఆత్మసంయమమనెడు చిమ్నీయు గలిగియుండ

వలయును. అవియన్నియు భక్తులపై కరుణచే మాత్రము సర్వేశ్వరుండు కలుగచేయును. ఇట్టి తైలము వత్తి ప్రమిదగలిగి గాలిలేని ప్రదేశములో దీపము వెలిగించువారు స్త్రీలైనను, పురుషులైనను, సన్యాసులైనను, గృహస్థులైనను, బ్రాహ్మణేతరులైనను, స్వగ్రామమందైనను, బదరికాశ్రమమునందైనను జ్ఞానజ్యోతి వెలుగుచుండును. దీనిలో ఏ ఒక్కటేని కొరతయైనచో నెవరైన నెచ్చటనైనను దీపమును వెలిగింపజాలరు. ఇట్టి పరమతత్త్వమునే పరమకారుణికుడగు శ్రీకృష్ణభగవానుడుపదేశించెను.

అర్జున ఉవాచ:- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ పరం బ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్ ॥ 12

,, ఆహుస్త్వామృషయస్సర్వే దేవర్షిర్నారదస్తథా ।
అసితో దేవలో వ్యాసస్స్వయం చైవ బ్రవీషి మే ॥- 13

పద॥ పరం - బ్రహ్మ - పరం - ధామ - పవిత్రం - పరమం - భవాన్.
పురుషం – శాశ్వతం - దివ్యం - ఆదిదేవం - అజం - విభుమ్.

,, ఆహుః - త్వాం-ఋషయః - సర్వే - దేవర్షిః - నారదః – తథా,
అసితః-దేవలః - వ్యాసః - స్వయం - చ - ఏవ – బ్రవీషి – మే.

ప్రతి॥ భవాన్ = నీవు, పరం బ్రహ్మ = పరబ్రహ్మవనియు, పరంధామ = పరంధాముడవనియు, పరమం పవిత్రం = పరమపావనుడవనియు, శాశ్వతం దివ్యం పురుషం=శాశ్వతుడవగు దివ్యపురుషుడవనియు, ఆదిదేవం=దేవతలలో మొదటివాడవనియు, అజం = పుట్టుక లేనివాడవనియు, విభుం = సమస్తమునకు ప్రభుడవనియు, త్వాం = నిన్ను, దేవర్షిః నారదః = దేవర్షి యగు నారదుడు, అసితః = అసితుడు, దేవలః = దేవలుడు, వ్యాసః = వ్యాసుడు మొదలగు, సర్వేఋషయః = సమస్తమహర్షులును, ఆహుః = చెప్పుచున్నారు, తథా ఏవ = ఆ ప్రకారముగానే, స్వయం చ = స్వయముగా నీవును, మే = నాకు, బ్రవీషి = చెప్పుచున్నావు.

తా॥ నీవు పరబ్రహ్మవనియు, పరంధాముడవనియు, పరమపావనుడవనియు, శాశ్వతుడవగు దివ్యపురుషుండవనియు, దేవతలలో మొదటివాడవనియు, పుట్టుకలేనివాడవనియు, నమస్తమునకు ప్రభుడ

వనియు, నిన్ను దేవర్షియగు నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు మొదలగు సమస్తఋషులును స్తుతించుచున్నారు. ఆ ప్రకారముగానే స్వయముగా నీవును నాతో చెప్పుచున్నావు.

వి॥ 10, 11 శ్లోకములలో భగవంతుడుపదేశించిన అపార కరుణాపూరిత వాక్యములను విని అర్జునున కనంతానందము గలిగి యిట్లు స్తుతించదొడంగెను.

శ్లో॥ సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ! ।
న హి తే భగవన్! వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥ 14

పద॥ సర్వం - ఏతత్ - ఋతం - మన్యే- యత్ - మాం - వదసి - కేశవ,
న - హి - తే - భగవన్ - వ్యక్తిం - విదుః - దేవాః - న —దానవాః,

ప్రతి॥ హే కేశవ! = ఓ శ్రీకృష్ణమూర్తీ!, యత్ =దేనిని, మాం = నన్నుగూర్చి వదసి =చెప్పుచున్నావో, ఏతత్ సర్వం = ఇదియంతయు, ఋతం = సత్యమైనదని, మన్యే = తలంచుచున్నాను, హే భగవన్! = ఓ భగవంతుడా! తే=నీయొక్క, వ్యక్తిం=నిజస్వరూపమును,దేవాః=దేవతలును, దానవాః= అసురులును, న విదుః హి = ఎఱుంగజాలకయున్నారుగదా!

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! దేనిని గూర్చి నాకు చెప్పుచుంటివో, అదియంతయు నిశ్చయమని తలంచుచున్నాను; ఓ భగవంతుడా, నీయొక్క నిజస్వరూపమును దేవతలుగాని, అసురులుగాని యెఱుంగ జాలకున్నారుగదా!

శ్లో॥ స్వయమేవాఽఽత్మనాఽఽత్మానం వేత్థత్వం పురుషోత్తమ!
భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే ॥ 15

పద॥ స్వయం—ఏవ—ఆత్మనా—ఆత్మానం—వేత్థ —త్వం—పురుషోత్తమ.
భూతభావన— భూతేశ!- దేవదేవ!—జగత్పతే !

ప్రతి॥ భూతభావన! = సమస్తప్రాణులను సృజించువాడవును, భూతేశ! = సకల ప్రాణులను పరిపాలించువాడవును, దేవదేవ!=దేవతలకు దేవుడైన వాడవును, జగత్పతే!=జగన్నాథుడవునైన, హేపురుషోత్తమ!=ఓ పురుషోత్తమా ఆత్మానం = నిన్ను (ఆత్మను,) ఆత్మనా = నీచేత (తనచేత), స్వయం= స్వయముగా, త్వం ఏవ = నీవే, వేత్థ = ఎఱుంగుదువు.

తా॥ సకలభూతములను పుట్టించువాడవు, సకల భూతము లకు ప్రభువును, సకల దేవతలచేత పూజింపబడువాడవును, సకల జగద్రక్షకుడవు నైన ఓ పురుషోత్తమా! నీవు స్వయముగానే నీ రూప మును నీ స్వరూపముచే తెలిసికొనుచున్నావు. అనగా నిన్ను నీవే యెఱుగుచున్నావు.

శ్లో॥ వక్తుమర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మ విభూతయః ।
యాభిర్విభూతిభిర్లోకానిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16

పద॥ వక్తుం—అర్హసి—అశేషేణ—దివ్యాః—హి—ఆత్మ విభూతయః.
యాభిః—విభూతిభిః—లోకాన్—ఇమాన్ - త్వం—వ్యాప్య—తిష్ఠసి.

ప్రతి॥ త్వం = నీవు, యాభిః విభూతిభిః = ఏ మహిమలచేత, ఇమాన్ లోకాన్= ఈ లోకములను,వ్యాప్య తిష్ఠసి=వ్యాపించియున్నావో, ఆత్మవిభూతయః= అట్టి నీమహిమలు,దివ్యాః హి=దివ్యములయినవిగదా! కాబట్టి ఆ మహిమ లను, అశేషేణ = నిశ్శేషముగా, వక్తుం = చెప్పుటకు (నీవే), అర్హసి = తగుదువు.

తా॥ నీవు ఏమహిమలచేత నీ లోకములను వ్యాపించియున్నావో అట్టి నీ మహిమలు దివ్యము లైనవి గదా! కాబట్టి ఆ మహిమాతిశయ ముల నన్నిటిని చెప్పుటకు నీవే తగుదువు,

శ్లో॥ కథం విద్యామహం యోగిం స్త్వాం సదా పరిచిన్తయన్।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా ॥ 17

పద॥ కథం—విద్యా—అహం—యోగిన్!—త్వాం—సదా—పరిచిన్తయన్.
కేషు—కేషు—చ—భావేషు—చిన్త్యః—అసి—భగవన్!—మయా.

ప్రతి॥ హే భగవాన్ ! = ఓ భగవంతుడా! (నీవు), మయా=నాచేత, కేషు కేషు చ భావేషు = ఏ యే విభూతులయందు ఏ యే రూపములు గలవాడవుగా, చిన్త్యః అసి =చింతింపదగినవాడవగుచున్నావు? హేయోగిన్=ఓ యోగీ శ్వర!, అహం=నేను, త్వాం = నిన్ను, కథం = ఏ యే రూపములు గలవానినిగా, సదా పరిచిన్తయన్ = ఎల్లప్పుడును ధ్యానము చేయుచు (చింతన జేయుచు), విద్యామ్= తెలిసికొనగలను ?

తా॥ ఓ భగవంతుడా! నీవు నాచేత ఏ యే విభూతులయందే యే రూపములు గలవాడవుగా చింతింపదగినవాడ వగుచున్నావు? ఓయోగీశ్వరా! నేను నిన్ను ఏ యే రూపములు గలవానినిగా ధ్యానము చేయుచు తెలిసికొనగలను ?

శ్లో॥ వి స్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన! ।
భూయః కథయ తృ ప్తిర్హి శృణ్వతో నా స్తి మేఽమృతమ్॥ 18

పద॥ వి స్త రేణ - ఆత్మనః - యోగం - విభూతిం - చ - జనార్దన !,
భూయః - కథయ–తృ ప్తిః - హి - శృణ్వతః - న - అ స్తి-మే-అమృతమ్

ప్రతి॥ హే జనార్దన ! =ఓ శ్రీకృష్ణమూ ర్తీ!, ఆత్మనః = నీయొక్క, యోగం= యోగ మహిమను, విభూతిం చ=లీలా విభూతులను, భూయః= మఱల వి స్తరేణ=సవిస్తారముగా, కథయ = చెప్పుము, హి = ఏలయనగా, అమృతం=నీ వాక్యామృతమును, శృణ్వతః మే = వినుచున్న నాకు తృ ప్తిః న అ స్తి=తనివి లేకున్నది.

తా॥ ఓ శ్రీకృష్ణమూ ర్తీ! నీయొక్క సర్వజ్ఞత్వాది యోగవిశేషమును లీలావిభూతియును, మఱల సవిస్తారముగా చెప్పుము. ఏలయనగా నీ వాక్యామృతమును వినుచున్న నాకు తృ ప్తి లేకున్నది.

వి॥ భగవద్వాక్యముల నెంత వినినను తృ ప్తి గలుగక, మరల మరల వినవలెనను స్వభావము పరమభక్తులకు యుండును. అట్లుండవలెను.

శ్రీ భగవానువాచ:—శ్రీభగవంతుడు చెప్పెను.

శ్లో॥ హ న్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ ! నా స్త్యన్తో వి స్తరస్య మే ॥ 19

పద॥ హ న్త - తే - కథయిష్యామి–దివ్యాః-హి-ఆత్మవిభూతయః,
ప్రాధాన్యతః-కురుశ్రేష్ఠ ! - న - అ స్తి - అ న్తః - వి స్తరస్య-మే.

ప్రతి॥ హే కురుశ్రేష్ఠ! = ఓ యర్జునా!, మే=నాయొక్క, వి స్తరస్య=లీలావిభూతి వి స్తరమునకు, అ న్తః =అంతము, న అ స్తి హి=లేదుగదా, హ న్త=అయినను ఇప్పుడు, తే=నీకు, దివ్యాః = దివ్యములైనట్టియు, ప్రాధాన్యతః= ముఖ్యములైనట్టియు, ఆత్మవిభూతయః = నా లీలావిభూతులను, కథయిష్యామి=చెప్పుచున్నాను.

తా॥ కురుశ్రేష్ఠా ! ఓ యర్జునా ! నా మాహాత్మ్యమునకు లేక విభూతులకు అంతములేదు.అయినను వానిలో ముఖ్యములును,దివ్యములు నగు వానిని నీకు చెప్పెదను.

వి॥ భగవంతుడెట్లనంతస్వరూపుడో, అట్లే అతని మహిమయు శక్తియు ననంతముగానే యుండును.

శ్లో॥ అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ॥ 20

పద॥ అహం - ఆత్మా - గుడాకేశ! - సర్వభూతాశయస్థితః,
అహం-ఆదిః - చ - మధ్యం - చ - భూతానాం - అన్తః - ఏవ-చ.

ప్రతి॥ హే గుడాకేశ! =ఓ యర్జునా!, అహం=నేను, సర్వభూతాశయస్థితః = సకలభూతములయం దంతర్యామిగా నుండునట్టి, ఆత్మా = జీవాత్మను భూతానాం=భూతములయొక్క, ఆదిః చ = ఆదియును (సృష్టియును), మధ్యం చ=మధ్యమును(స్థితియును), అంతః చ = అంతమును (లయమును), అహం ఏవ=నేనే యగుచున్నాను.

తా॥ ఓ యర్జునా ! నేను సకలభూతములయొక్క హృదయకమలమందుండు ప్రత్యగాత్మను, సమస్తభూతములయొక్క సృష్టి స్థితి లయములును లేక ఆది మధ్యాంతములును నేనే.

వి॥ సృష్టికి పూర్వమిదియంతయు భగవత్ స్వరూపమే. ఇప్పుడు గూడ భగవత్ స్వరూపమే. ఇకను భగవత్ స్వరూపముగానే యుండును.నిజముగా జెప్పిన ఇది యంతయు సర్వదా పరబ్రహ్మస్వరూపమే.

శ్లో॥ ఆదిత్యానా మహం విష్ణుర్జ్యోతిషాం రవి రంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణా మహం శశీ ॥ 21

పద॥ ఆదిత్యానాం - అహం - విష్ణుః - జ్యోతిషాం - రవిః - అంశుమాన్,
మరీచిః - మరుతాం - అస్మి - నక్షత్రాణాం - అహం-శశీ.

ప్రతి॥ అహం = నేను, ఆదిత్యానాం = ద్వాదశాదిత్యులలో, విష్ణుః = విష్ణువనువాడను, జ్యోతిషాం = ప్రకాశింపజేయువారిలో, అంశుమాన్=కిరణములుగల, రవిః = సూర్యుడను, మరుతాం = సమస్తమరుత్తులలో, మరీచిః =

మరీచియనువాడను, నక్షత్రాణాం=నక్షత్రములలో, శశీ = చంద్రుడను, అహం అస్మి = నేనే యైయున్నాను,

తా॥ ద్వాదశాదిత్యులలో విష్ణు వనువాడు, ప్రకాశింప జేయు వారిలో కిరణములు గల సూర్యుడు నేనే, సప్తవాయువులలో మరీచి యను వాడను నేనే,నక్షత్రములలో చంద్రుడును నేనే యైయున్నాను.

వి॥ ఆదిత్యుడొక్కడై యున్నను పండ్రెండు నెలలలో ఒక్కొక్కరాశియందుదయించుటచే, ఆ యా నెలలు, రాసులనుబట్టి ద్వాదశాదిత్యులని చెప్పబడును. అది సంవత్సరారంభమగు చైత్రమాసమునుండి ప్రారంభింపబడును. వారి పేర్లు (1)ధాత. (2) అర్యమ. (3)మిత్రుడు,(4)వరుణుడు'(5)ఇంద్రుడు. (6)వివస్వంతుడు. (7)పూషుడు, (8)పర్జన్యుడు, (9)అంశవు, (10) భగుడు, (11) త్వష్ట, (12)విష్ణువు.

శ్లో॥ వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥ 22

పద॥ వేదానాం - సామవేదః - అస్మి - దేవానాం - అస్మి - వాసవః.
ఇన్ద్రియాణాం - మనః - చ - అస్మి - భూతానాం - అస్మి - చేతనా.

ప్రతి॥ వేదానాం = వేదములలో, సామవేద = సామవేదమును, అస్మి = అగుచున్నాను, దేవానాం = దేవతలలో, వాసవః=దేవేంద్రుడను, అస్మి=అగుచున్నాను, ఇన్ద్రియాణాం = ఇంద్రియములలో, మనః చ = మనస్సును, అస్మి=అగుచున్నాను, భూతానాం = భూతములలో. చేతనా = చైతన్యమును. అస్మి = నేనే యగుచున్నాను.

తా॥ ఋగ్యజుస్సామాథర్వణము లనియెడు నాల్గు వేదముల లోపల సామవేదమును, దేవతల లోపల దేవేంద్రుడును, ఇంద్రియముల లోపల మనస్సును, భూతముల లోపల చైతన్యమును నేనే యగుచున్నాను.

వి॥ నాల్గు వేదములలో గానమాధుర్యముచేతను, భక్తిమయమగుటచేతను, భగవత్ స్వరూపమును బాగుగా వివరించి చెప్పియుండుటచేతను సామవేదము భగవత్ స్వరూపమని చెప్పుటకు కారణమైనది.

శ్లో॥ రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్ ॥ 23

పద॥ రుద్రాణాం- శంకరః - చ - అస్మి - విత్తేశః - యక్షరక్షసాం,
వసూనాం - పావకః - చ - అస్మి - మేరుః - శిఖరిణాం - అహమ్

ప్రతి॥ అహం = నేను, రుద్రాణాం=ఏకాదశరుద్రులలో, శంకరః=శంకరుడను, యక్షరక్షసాం=యక్షరాక్షసులలో, విత్తేశః చ = కుబేరుడను, అస్మి = అగుచున్నాను, వసూనాం = అష్టవసువులలో, పావకః = అగ్నియు, శిఖరిణాం = శిఖరములుగల పర్వతములలో, మేరుః చ = మహామేరుపర్వతమును, అస్మి = అగుచున్నాను.

తా॥ ఏకాదశరుద్రులలోపల శంకరుడనురుద్రుడను, యక్షులు, రక్షస్సులు అను వారిలోపల కుబేరుడను, అష్టవసువులలోపల అగ్నియను వసువును, శిఖరములు కలవానిలోపల అనగా పర్వతములలో మేరువను పర్వతమును నేనే యగుచున్నాను.

వి॥ ఏకాదశరుద్రు లెవరవగా (1)అజుడు, (2)ఏకపాదుడు, (3)అహిర్బుధ్న్యుడు, (4) త్వష్ట, (5)రుద్రుడు, (6) హరుడు, (7)శంభువు,(8)త్ర్యంబకుడు (9)అపరాజితుడు, (10) ఈశానుడు, (11) త్రిభువనుడు.

శ్లో॥ పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిమ్ ।
సేనానీనా మహం స్కన్ద స్సరసామస్మి సాగరః ॥ 24

పద॥ పురోధసాం - చ - ముఖ్యం - మాం- విద్ధి - పార్థ! - బృహస్పతిం.
సేనానీనాం-అహం - స్కన్దః - సరసాం - అస్మి–సాగరః.

ప్రతి॥ హే పార్థ=ఓ యర్జునా!. మాం = నన్ను, పురోధసాం = పురోహితులలో, ముఖ్యం=శ్రేష్ఠుడగు, బృహస్పతిం=బృహస్పతినిగా, విద్ధి = ఎఱుంగుము. అహం = నేను, సేనానీనాం = దేవసేనానాయకులలో. స్కన్దః = కుమారస్వామియు, సరసాం = సరస్సులలో, సాగరః చ = సముద్రమును. అస్మి = అగుచున్నాను.

తా॥ ఓ యర్జునా! దేవపురోహితులలోపల ప్రధానపురోహితుడగు బృహస్పతియును, సేనాధిపతులలో దేవసేనాధిపతి యగు కుమారస్వామియును, సరస్సుల లోపల (జలాశయములలోపల) సముద్రమును నేనే యగుచున్నాను.

శ్లో॥ మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥ 25

పద॥ మహర్షీణాం - భృగుః - అహం - గిరాం -అస్మి-ఏకం-అక్షరం
యజ్ఞానాం - జపయజ్ఞః - అస్మి - స్థావరాణాం - హిమాలయః.

ప్రతి॥ అహం=నేను, మహర్షీణాం=మహర్షులలో, భృగుః=భృగుమహర్షియును గిరాం=వాక్కులలో (వేదములలో), ఏకం అక్షరం = ఏకాక్షరమగు ప్రణవమును, అస్మి = అగుచున్నాను, యజ్ఞానాం = యజ్ఞములలో, జపయజ్ఞః=జపయజ్ఞమును,స్థావరాణాం=స్థావరములలో,హిమాలయః = హిమాచలమును, అస్మి = అగుచున్నాను.

తా॥ మహర్షులలోపల భృగుమహర్షిని, వేదములలోపల నేకాక్షర మగు ప్రణవమును, యజ్ఞములలోపల జపయజ్ఞమును (మానసయజ్ఞ మును) స్థిరముగా నుండువానిలోపల హిమవత్పర్వతమును నేనే యగుచున్నాను.

వి॥ మహర్షులలో భృగుమహర్షి గొప్ప ధర్మబోధకుడైయుండెను. యజ్ఞము లలో జపయజ్ఞము హింసారహితమగుటచేతను, ప్రతివారనుష్ఠించుటకు సులభ మగుటచేతను, గొప్పదగు మోక్షమే దానికి ఫలమగుటచేతను. వేదములయొక్క ప్రాణము ప్రణవమగుటచేతను ఈ మూడును సాక్షాద్విష్ణుస్వరూపములని తెలు పడమైనది.

శ్లో॥ అశ్వత్థస్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥ 26

పద॥ అశ్వత్థః - సర్వవృక్షాణాం - దేవర్షీణాం - చ - నారదః,
గంధర్వాణాం - చిత్రరథః - సిద్ధానాం - కపిలః - మునిః,

ప్రతి॥ సర్వవృక్షాణాం=సమస్తవృక్షములలో, అశ్వత్థః=రావిచెట్టును,దేవర్షీణాం= దేవర్షులలో, నారదః చ =నారదుడను, గంధర్వాణాం=గంధర్వులలో, చిత్రరథః =చిత్రరథుడను, సిద్ధానాం=సిద్ధపురుషులలో, కపిలః మునిః= కపిలమునియు నగుచున్నాను.

తా॥ అన్నిచెట్లలోపల రావిచెట్టును, దేవర్షులలోపల నారదు డను, గంధర్వులలోపల చిత్రరథుడను గంధర్వుడను, సిద్ధపురుషుల లోపల కపిలమహామునియును నేనే యగుచున్నాను.

వి॥ ఋషులలో దేవర్షులనియు, బ్రహ్మర్షులనియు, రాజర్షులనియు, ఋషులనియు వారివారి జన్మలనుబట్టి పేర్లు గలవు.

శ్లో॥ ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ 27

పద॥ ఉచ్చైశ్శ్రవసం–అశ్వానాం - విద్ధి - మాం - అమృతోద్భవం, ఐరావతం - గజేన్ద్రాణాం - నరాణాం - చ - నరాధిపమ్.

ప్రతి॥ మాం=నన్ను, అశ్వానాం=గుఱ్ఱములలో, అమృతోద్భవం = అమృతములో బుట్టిన, ఉచ్చైశ్శ్రవసం=ఉచ్చైశ్శ్రవసమను పేరుగల గుఱ్ఱముగను, గజేంద్రాణాం = ఏనుగులలో, ఐరావతం = ఐరావతముగను, నరాణాం = మనుష్యులలో. నరాధిపం చ = ధర్మముతో పాలించెడు రాజుగను, విద్ధి = ఎఱుంగుము.

తా॥ గుఱ్ఱములలో "ఉచ్చైశ్శ్రవస" మను పేరుగల గుఱ్ఱముగను, గజశ్రేష్ఠములలో ఐరావతముగను, మానవులలో ధర్మ పరిపాలనము చేసెడు రాజునుగా నన్ను ఎఱుంగుము.

వి॥ 'రంజయతీతి రాజా' రక్షణముచేతను, పాలనముచేతను, ప్రజల సంతోషపఱచెడివాడగుటచే 'రాజు' అను శబ్దము గలిగెను.

శ్లో॥ ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పస్సర్పాణామస్మి వాసుకిః ॥ 28

పద॥ ఆయుధానాం - అహం - వజ్రం - ధేనూనాం - అస్మి - కామధుక్. ప్రజనః - చ - అస్మి - కందర్పః - సర్పాణాం - అస్మి - వాసుకి.

ప్రతి॥ అహం=నేను, ఆయుధానాం = ఆయుధములలో, వజ్రం = వజ్రాయుధమును, ధేనూనాం = గోవులలో, కామధుక్=కామధేనువును,అస్మి=అగుచున్నాను, ప్రజనః = ప్రజల యుత్పత్తికి కారణభూతుడైన, కందర్పః= మన్మథుడను. అస్మి=అగుచున్నాను,సర్పాణాం=సర్పములలో,వాసుకిః= వాసుకినిన్ని,(నేనే), అస్మి= అగుచున్నాను,

తా॥ ఆయుధములలోపల వజ్రాయుధమును నేనే, ధేనువుల లోపల కామధేనువును నేనే, పుత్రోత్పత్తిని కలుగజేయునట్టి ధర్మ

యుక్తమగు కామమును నేనే, సర్పభేదముల లోపల వాసుకి యను సర్పరాజమును నేనే యగుచున్నాను.

వి॥ 'ప్రజనశ్చాస్మి కందర్పః' ధర్మబద్ధమగు సంతానోత్పత్తికొఱకుమాత్రము గలిగెడు కామమువిష్ణుస్వరూపము అట్లుగాకఅధర్మప్రవర్తనతో గలిగెడు కామము అసురస్వభావమని తెలియదగును. అడవులలో వసిష్ఠాశ్రమము మొదలగు కొన్ని గొప్పమహర్షుల యాశ్రమములలో నుండిన కామధేనువు విష్ణుస్వరూపము. ఈ కామధేనుత్వము తపస్సుచే గలిగెడు ఒక్క మహాసిద్ధి యనబడును, అట్టి తపస్సిద్ధి గల ఋషులు కొద్దిమంది మాత్రమే యుండిరి. కావుననే వారి యాశ్రమములలో మాత్రము కామధేను వుండుటకు కారణము. ఇది తపస్సుచే ఒక విధమగు దైవమహిమ యగును. కామధేనువు, కల్పవృక్షము, చింతామణి యను ఈ మూడును ఋషుల తపస్సిద్ధి స్వరూపములగును. ఇవి యుండేస్థలములోనికివెళ్ళు వారు మనస్సులో ఏ కోరిక కలిగియుందురో, అది యప్పుడే ఫలించును. ఎప్పుడు కామనారహితుడగునో అనగా జితకాముడగునో, అప్పుడు కామధేనుత్వసిద్ధియు ఎప్పుడు సంకల్పరహితుడగునో అనగా నిశ్చింతుడగునో, అప్పుడు కల్పవృక్షత్వ సిద్ధియు, ఎప్పుడు చింతనా రహితుడగునో అనగా నిశ్చింతుడగునో, అప్పుడు చింతామణిత్వ సిద్ధియు మహాయోగులకు, మహాపురుషులకు గలుగును. కావుననే, అట్టి మహాత్ములుండు స్థలము కామధేనువువలెను, కల్పవృక్షమువలెను, చింతామణి వలెను వెలుగుచుండును. అట్టివారెచ్చటికి వెళ్ళకనే యెవరిని ఏమియు నడుగకనే వారుండే స్థలమునందే వారి సంకల్పాను సారము సర్వము జరుగు చుండుటకు కారణమిదియే.

శ్లో॥ అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।
పితౄణామర్యమా చాస్మి యమ స్సంయమతామహమ్ ॥ 29

పద॥ అనంతః చ - అస్మి - నాగానాం - వరుణః - యాదసాం - అహం, పితౄణాం - అర్యమా-చ-అస్మి - యమః - సంయమతామ్ - అహమ్.

ప్రతి॥ అహం = నేను, నాగానాం = నాగుపాములలో. అనంతః చ = అనంతుడను, యాదసాం = జలదేవతలలో, వరుణః = వరుణుడను, అస్మి = అగుచున్నాను, అహం = నేను, పితౄణాం = పితృదేవతలలో, అర్యమా చ = అర్యముడను, సంయమతాం = నియమించువారిలో, యమః = యమధర్మరాజును, అస్మి =అగుచున్నాను.

తా॥ నాగుపాములలో నేను అనంతుడను, జలదేవతలలో వరుణుడను, పితృదేవతలలో అర్యముడను, పాపపుణ్యముల ననుసరించి ప్రతివారిని స్వర్గ నరకాదిలోకములయందు నియమించుటలో సత్యముగాను, ధర్మముగాను ప్రవర్తించు వారలలో యమధర్మరాజును నేనే యగుచున్నాను.

వి॥ 28 వ శ్లోకమున చెప్పిన సర్పమునకును, దీనియందు చెప్పిన నాగమునకును భేదమేమన సర్పమున కొక శిరస్సు మాత్రమే యుండును. అదియును గాక ఆ శిరస్సు విషముతో గూడియుండును. నాగమున కన్ననో అనేక శిరస్సులుండును. ఆ శిరస్సులలో విషముండదు. గనుక సర్ప - నాగముల రెంటికిని ఇంతభేదము గలదు.

శ్లో॥ ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్॥30

పద॥ ప్రహ్లాదః - చ - అస్మి - దైత్యానాం - కాలః - కలయతాం - అహం,
మృగాణాం - చ - మృగేంద్రః - అహం - వైనతేయః - చ - పక్షిణామ్.

ప్రతి॥ అహం = నేను, దైత్యానాం=అసురుల లోపల, ప్రహ్లాద = ప్రహ్లాదుడను, కలయతాం = లెక్కపెట్టువారి లోపల, కాలః చ = కాలమును, అస్మి = అగుచున్నాను, అహం = నేను, మృగాణాం = మృగములలో, మృగేంద్ర చ = సింహమును, పక్షిణాం = పక్షులలో, వైనతేయః చ = గరుత్మంతుడను అగుచున్నాను.

తా॥ దైత్యులలో పరమసాత్త్వికుడును, పరమభక్తుడునగు ప్రహ్లాదుడను నేను, శుభాశుభములను వృద్ధిక్షయములను చేయుచున్నవారిలోపల కాలస్వరూపుడను నేను, మృగములలో సింహమును, పక్షులలో గరుత్మంతుడను నేనే యగుచున్నాను.

వి॥ ఏ జాతిలో పుట్టినను సత్త్వగుణము, దైవభక్తి గలవాడు విష్ణుస్వరూపుడగును. కావున కులము గొప్పదికాదు. గుణము గొప్పదని గ్రహించవలెను. ప్రహ్లాదుడు అసుర కులమున, విభీషణుడు రాక్షస కులమున బుట్టినను వారు విష్ణు స్వరూపులైరి.

శ్లో॥ పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్ ।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥ 31

పద॥ పవనః - పవతాం - అస్మి - రామః - శస్త్రభృతాం - అహం,
ఝషాణాం - మకరః - చ - అస్మి - స్రోతసాం - అస్మి - జాహ్నవీ.

ప్రతి॥ అహం = నేను, పవతాం = వేగవంతులలో (వీచువానిలో) పవనః = వాయువును, శస్త్ర భృతాం = ధనుర్ధరులలో, రామః = శ్రీరాముడను, అస్మి = అగుచున్నాను, ఝషాణాం = జలచరములలో, మకరః చ = మకరమును, అస్మి = అగుచున్నాను, స్రోతసాం =నదులలో, జాహ్నవీ= గంగానదిని, అస్మి = అగుచున్నాను.

తా॥ పరిశుద్ధతను లేక వేగమును గలుగ జేయువానిలోపల వాయుదేవుడను, ఆయుధమును ధరించువారిలోపల శ్రీరామచంద్రుడను, జలజంతువులలోపల మకరమును, నదులలోపల గంగానదియును నేనగుచున్నాను.

శ్లో॥ సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున! ।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥ 32

పద॥ సర్గాణాం - ఆదిః - అంతః చ - మధ్యం చ - ఏవ - అహం - అర్జున!,
అధ్యాత్మవిద్యా - విద్యానాం - వాదః - ప్రవదతాం - అహమ్.

ప్రతి॥ హే అర్జునా! = ఓ యర్జునా!. సర్గాణాం = సృష్టులకు, ఆదిః మధ్యః చ అంతః చ = ఆదియును మధ్యమును అంతమును, అహం ఏవ = నేనే యగుచున్నాను, విద్యానాం = విద్యలలో, అధ్యాత్మవిద్యా=ఆత్మజ్ఞానము గలుగజేయు విద్యయును, ప్రవదతాం = వాదించువారి వాదజల్పవితండములలో, వాదః = వాదము, అహం = నేను యగుచున్నాను.

తా॥ సమస్త ప్రపంచముయొక్క సృష్టులకుత్పత్తియు,స్థితియు, లయమును నేనే, సకల విద్యలలోపల బ్రహ్మవిద్యయునేనే. వాదించువారి వాద జల్పవితండములలోపల వాదమును నేనే యగుచున్నాను.

వి॥ వాదము మూడు విధములు. అవి (1) వాదము, (2) జల్పము, (3) వితండము. వాదమనునది రాగద్వేషరహితులై భక్తిశ్రద్ధలతో సావధానముగా మాట్లాడుచు తెలియదగినదానిని తెలిసికొనుట. ఇది సత్త్వగుణముతోను తత్త్వార్థగ్రహణముతోను గూడినదగుటచే విష్ణుస్వరూపమని చెప్పబడినది. (2) జల్పమనగా శాస్త్రప్రమాణములచేతను, యుక్తులచేతను తనవాదమును స్థాపించి

యితరపక్షమును ఖండించుట యగును (3) వితండమనగా తన సిద్ధాంతమును తెలుపకయు,స్థాపింపకయు కుతర్కములతో నితరుల సిద్ధాంతమును ఖండించుట నిందించుటయగును. లేక యితరుల వాక్యములను విననీయక చేయుట యగును. మొదటిది యుత్తమము.రెండవది మధ్యమము. మూడవది యధమ మనబడును. విద్యలలో బ్రహ్మవిద్య విష్ణుస్వరూపముగా వర్ణించడమైనది. పూర్వకాలమున ఇప్పుడుండెడు యూనివర్సిటీ కాలేజీ హైస్కూళ్ళవలె ఆత్మవిద్యానంస్థ లుండెను. కాలాంతరమున నవి నశించినందుచే దైవజ్ఞానము క్షీణించడమైనది. ఇప్పుడు కూడ కాశీ మొదలగు స్థలములలో నామకార్థముగా కొన్నిగలవు. ఇప్పుడు పాశ్చాత్యవిద్య నభ్యసించెడు విద్యార్థులవలె బ్రహ్మచర్యవ్రతనిష్ఠ గల సాధనపరులగు బ్రహ్మచారు లాకాలమున నుండిరి.

శ్లో॥ అక్షరాణామకారోఽస్మి ద్వంద్వస్సామాసికస్య చ ।
అహమేవా క్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః ॥ 33

పద॥ అక్షరాణాం – అకారః - అస్మి – ద్వంద్వః - సామాసికస్య - చ.
అహం - ఏవ - అక్షయః - కాలః - ధాతా - అహం - విశ్వతోముఖః.

ప్రతి॥ అహం=నేను, అక్షరాణాం = అక్షరములలో, అకారః = 'అ' అను వర్ణమును, సామాసికస్య = సమాసముల (పదములకూడిక)లో, ద్వంద్వః చ = ద్వంద్వ సమాసమును, అస్మి = అగుచున్నాను. అక్షయః=నాశము లేని, కాలః = కాలమును. విశ్వతోముఖః = అంతట ముఖములుగల, ధాతా చ = బ్రహ్మయును, అహం ఏవ = నేనే యగుచున్నాను.

తా॥ అక్షరములలోపల అకారమును,(పూర్వపదార్థ ప్రధానమైన అవ్యయీభావసమాసము, ఉత్తరపదార్థప్రధానమగు తత్పురుష సమాసము, అన్యపదార్థ ప్రధానమగు బహువ్రీహి సమాసము అనునీ మొదలగు సమాసములలో ఉభయపదార్థప్రధానమగు) ద్వంద్వ సమాసమును నేనే, నాశములేని కాలమును, సర్వతోముఖుడగు బ్రహ్మయును నేనేయగుచున్నాను.

వి॥ ఈ సమాసములు "సమాసకుసుమావళి" యను గ్రంథమున చూడదగును. వీనిలో ఆరు సమాసములు ముఖ్యములు. ఇవి కావ్యములు చదువుకొన్న వారికి బోధపడును. సమాసమనగా ననేకపదములను ఒకదానితో నొకటి చేర్చి ఒకటే పదము చేయుట యగును.

శ్లో॥ మృత్యుస్సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ 34

పద॥ మృత్యుః - సర్వహరః - చ - అహం - ఉద్భవః - చ - భవిష్యతాం,
కీర్తిః - శ్రీః -వాక్-చ-నారీణాం - స్మృతిః - మేధాః - ధృతిః - క్షమా,

ప్రతి॥ అహం = నేను, సర్వహరః=సమస్తమును హరించునట్టి, మృత్యుఃచ = మృత్యుదేవతయును. భవిష్యతాం =ఇకముందుత్పత్తికాబోవు వాటికన్నిటికిని, ఉద్భవః చ = పుట్టుకయును, (కారణమును) నగుచున్నాను, నారీణాం = స్త్రీలలో, కీర్తిః = యశస్సును, శ్రీః = సంపదయును, వాక్ = మృదువైన వాక్కును, స్మృతిః = జ్ఞాపకశక్తియును, మేధా = ధారణశక్తిగల బుద్ధియును, ధృతిః = ధర్మకార్యములోగల ధైర్యమును,క్షమా, చ=ఓర్పును (నేనే) అస్మి = అగుచున్నాను.

తా॥ ప్రళయకాలములో సమస్తమును తనలో లయపరచెడు మృత్యుదేవతయును, ఉద్భవించబోవు సకల ప్రాణిజాతమునకు ఉత్పత్తికాలమున పుట్టుకయును(కారణమును)నేనే యగుచున్నాను. స్త్రీ ల లో ధర్మగుణమునుబట్టి కలుగు (1) కీర్తియు, (2) జ్ఞానము ధనము వీనివల్ల గలిగెడు లక్ష్మియు, (3) మధురమగు వాక్కును, (4) జ్ఞాపకశక్తియు, శాస్త్రార్థమును ధర్మజ్ఞానములను మరుపులేక ధరించెడు మేధావిశేషమును, (5) ధర్మకార్యములలో ప్రవర్తించెడు ధైర్యమును, (6) ఎంత సహించియైనను వ్రతములు సల్పుట, పిల్లలను పోషించుట, భర్తను ఆదరించుట యను సహనమును నేనై యున్నాను.

వి॥ భగవంతుడు స్త్రీలపైనెంత కరుణగలవాడో, ఈ శ్లోకమువలన తెలియదగును. ఋషులలో, పురుషులలో,రాజులలో భగవదంశ యొక్కొక్కటిమాత్రము చెప్పుచు, స్త్రీలలో భగవదంశము ఏడుపాళ్ళధికము గలదని నిరూపించినాడు. అయితే భగవంతుడుపదేశించిన, (1) కీర్తి, (2) శ్రీ, (3) వాక్, (4) స్మృతి, (5) మేధ, (6) ధృతి, (7) క్షమ ఈ ఏడు గుణములను స్త్రీలు సంరక్షించుకొనవలెను. గోవులు నివసించెడు స్థలములలో పెద్దపులులు ప్రవేశించిన యవి యన్నియు నెట్లు పారిపోవునో అలాగున కోపము, క్రూరత్వము మొదలగు అసుర

గుణాదులు హృదయసీమలో ప్రవేశించిన పై చెప్పిన దైవగుణము-లన్నియు తమ్ము వదలిపోవునని సదాజ్ఞాపకముంచవలెను. స్త్రీలపై శ్రీకృష్ణభగవానునకు ఎంత దయారసముగలదో, గోపికాస్త్రీలే దీనికి తార్కాణము. కావుననే దేవకీ దేవికి మొట్టమొదట తననోటిలో బ్రహ్మాండరూపుడుగా నున్నట్లు విశ్వరూప దర్శన మిచ్చియున్నాడు. సాక్షాత్ భగవంతుడే "స్మృతిర్మేధాధృతిః" అని ప్రయోగించియుండగా స్త్రీలకు మేధాశక్తి లేదనియు, పుణ్యబుద్ధి లేదనియు, ధర్మబుద్ధి లేదనియు పురుషులెట్లు చెప్పుచున్నారో తెలియకయున్నది. ఎందరో దివ్య పురుషులు తల్లిదండ్రులను సాక్షాత్ దైవరూపులుగా దలంచుచున్నారు.ధర్మవ్యాధుని యొక్క చరిత్రమే దీనికి చాలును. మాతృభక్తి గలిగి తల్లిని దైవభావముగా జూచనివానికి దైవగుణము గల జ్ఞానము గలుగదు. మాతృభక్తిలేనివాడు పశువు కన్న హీనుడు. తల్లియందు దైవభావము గల్గిన మాత్రమే అట్టి పుణ్యవతి గర్భములో పుట్టినవారము గావున మనమును పవిత్రభావము చేయుటకు శక్తి గలుగుచున్నది. మఱియు మనుమహర్షి మాతృదేవతను గురించి చెప్పినది చూడుడు. శాస్త్రము లన్నిటిలోను మనుస్మృతి మొట్టమొదటిది.

"ఉపాధ్యాయాన్ దశాచార్య అచార్యాణాం శతం పితా।
సహస్రం తు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే ॥"

తా॥ పదుగురుపాధ్యాయులకంటె ఒక యాచార్యుడు అధికుడు. నూర్గురాచార్యులకంటె నొక తండ్రి యధికుడు. వెయ్యిమంది తండ్రులకంటె నొకతల్లి గౌరవముచే నధికురాలు. విద్య చెప్పువారుపాధ్యాయులు గాను, ధర్మోపదేష్టలగు గురువు లాచార్యులుగాను, గ్రహించదగినది, ఇచట ఆత్మతత్త్వము నుపదేశించిన జ్ఞానగురుని గుఱించి చెప్పబడినదని గ్రహించగూడదు. స్త్రీలకు జ్ఞానము వికసించుటకు తగిన విద్యయు, యౌవనకాలమువరకు బ్రహ్మచర్యము బ్రహ్మనిష్ఠయు గలిగి యుండినగదా? అట్లేమియు అవకాశము గలుగజేయక స్త్రీలకు జ్ఞానములేదని వ్యర్థపుమాటలు చెప్పిన, ఏమిప్రయోజనము! అగ్నికణమును దూదిలోనుంచి వెలిగించి చిన్నచిన్న కట్టెలువేసి మఱల పెద్దకట్టెలచే వృద్ధిపరచిన కదా దానియొక్క ప్రకాశము తెలియును. ఆలాగుననే బీజమును భూమిలోనాటి సరిగా పోషించినగదా అది అంకురించి ఫలపల్లవ పుష్పాదులచే పూర్ణత్వము నొంది జనుల కుపయోగపడును. ఇట్లు తగిన అవకాశమును గలుగచేయకపోవుటచేతచే స్త్రీలోకము అధఃపతనము నొందెను.ఇక స్త్రీలకు విద్యాధ్యయనమునకై కన్యాగురుకులము, బ్రహ్మవిద్యాసాధనయు నుండిన మాత్రమే స్త్రీలోక మున్నత స్థితికి రాగలదు.

శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీఛందసామహమ్।
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః ॥ 35

పద॥ బృహత్సామ - తథా - సామ్నాం - గాయత్రీ - ఛందసాం-అహం.
మాసానాం - మార్గశీర్షః - అహం - ఋతూనాం - కుసుమాకరః.

ప్రతి॥ అహం = నేను, సామ్నాం=సామగానములలో, బృహత్సామ=బృహత్సామమును, ఛందసాం = ఛందస్సులలో, గాయత్రీ = గాయత్రియునగుచున్నాను, తథా=అలాగుననే, అహం=నేను, మాసానాం = పంత్రెండు మాసములలో, మార్గశీర్షః=మార్గశీర్షమాసమును,ఋతూనాం=అరుఋతువులలో, కుసుమాకరః=వసంతఋతువు నగుచున్నాను.

తా॥ సామగానములలో బృహత్సామమును, ఛందస్సులలో గాయత్రియు, చైత్రాదులగు పంత్రెండు మాసములలోపల మార్గశీర్ష మాసమును, వసంతఋతువు మొదలుగాగల అరు ఋతువులలో వసంతమను ఋతువును నేనగుచున్నాను.

వి॥ మకరమాసమునందు వచ్చు ఉత్తరాయణమునకు ముందుగా సూర్యోదయమునకు ముందు అరుణోదయమువలె నుండుటచేతను, ఈ మాసమున సమస్త ధాన్యములును, సమస్త ఫలమూలములును సమృద్ధిగానుండుటచేతను, మిక్కిలి యుష్ణము గాని మిక్కిలి చలిగాని లేక సమశీతోష్ణముగా నుండుట చేతను, మఱియు నీ మాసమున జలాశయములన్నియు శుద్ధోదకములచే నిండి యుండుటచే దైవారాధనకును తపో ధ్యానాదులకును, అనుకూలమగుటచేతను పశువులు బలిష్టములై ప్రసన్నములై దేశము పాడిపంటలచే సమృద్ధిగలిగి యుండుటచేతను, మార్గశీర్షమాసము విష్ణుస్వరూపముగా వర్ణించబడినది. అందువలననే విష్ణు క్షేత్రములన్నిటిలోను, ఇతర క్షేత్రములలోను ధనుర్మాసపూజలు సలుపుటకు కారణమగుచున్నది. అలాగున అరు ఋతువులలో వసంతఋతువునకు ముందుగా హేమంత, శిశిరఋతువులలో వృక్షములలోగల పత్రములన్నియు రాలిపోయి వనమందలి వృక్షములన్నియు మాడిపోయినట్లుండును. వసంతకాలము వచ్చుటతోడనే అవన్నియు చిగిరించి పల్లవముల చేతను పుష్పముల చేతను శోభాయమానములై సుగంధపుష్పశోభితములై యుండుట చేతను మఱియు నపుడు చలి నశించి తీవ్రోష్ణములగు మండుటెండలు వచ్చుటకు ముందుండు కాలమగుటచే సమశీతోష్ణమై సుఖప్రద మగుటచేతను

వసంతఋతువు విష్ణుస్వరూపముగా వర్ణించబడినది. కావుననే యిట్టికాలముననసేక దేవాలయములలో వసంతోత్సవములు జరుపబడుచుండును. శ్రీరామావతార మును ఈ ఋతువులోనే యేర్పడియుండుట చేతను నియ్యది (వసంతఋతువు) విశిష్టముగా జెప్పబడుటకు కారణమైనది.

శ్లో॥ ద్యూతం ఛలయతా మస్మి తేజస్తే జస్వినా మహమ్ ।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్॥ 36

పద॥ ద్యూతం - ఛలయతాం - అస్మి - తేజః - తేజస్వినాం - అహం.
జయః - అస్మి - వ్యవసాయః - అస్మి - సత్త్వం - సత్త్వవతాం - అహమ్.

ప్రతి॥ అహం = నేను, ఛలయతాం = వంచకవ్యాపారములలో, ద్యూతం = జూద మును, అస్మి = అగుచున్నాను, తేజస్వినాం = తేజోవంతులలో, తేజః = తేజస్సును, అస్మి = అగుచున్నాను, జయః = జయమును, వ్యవసాయః = పవిత్రప్రయత్నమును, సత్త్వవతాం = సాత్త్వికులలో, సత్త్వం = సత్త్వగుణ మును, అహం అస్మి = నేనే అగుచున్నాను.

తా॥ వంచకులలో జూదమును, తేజోవంతులలోని తేజస్సును జయమును, పవిత్రప్రయత్నమును, సాత్త్వికులలోని సత్త్వగుణమును నేనే అయియున్నాను.

వి॥ జూదము నీచమైనదిగదా, అది యెట్లు భగవత్ స్వరూపమగును? అని సందేహము గలుగవచ్చును. అయితే అనేకవిధములగు నీచకృత్యములలో నిది శ్రేష్ఠము. ఏలన, ప్రజ్ఞావిశేషముచేత మఱియొక విధముగా నీచకృత్యము చేయక మహారాజులుగూడ అనేక జనులమధ్య చేయునదగుటచే దీనిని విష్ణుస్వరూపముగా వర్ణింబడమైనది. అన్నిటిలోను గల మంచి చెడుగులలో శ్రేష్ఠత్వము నిరూపించు విషయమగుటచే అనేకవిధ దుష్టకృత్యములలో దీనిని శ్రేష్ఠమైనదానినిగా గ్రహిం చడ మైనది. కావుననే నల యుధిష్ఠిరాది మహారాజులుగూడ జూదములో ప్రవేశించుటకు కారణమైనది. కాని, ఇది సప్తవ్యసనములలో నొకటి యగుటచేత త్యాజ్యమే. విషసర్పములలో వాసుకి, జంతువులలో సింహము ఎట్లు నిరూపింప బడినవో, అలాగున దుష్టకృత్యములలో నిది ముఖ్యమైనదని పేర్కొనబడినది. వస్తుప్రదర్శనశాలలో దుష్ట జంతువులను, క్రూరములగు పాములను ఇతర విషజంతువులనుకూడ ఏలాగున ప్రేక్షకులకొఱకు ప్రదర్శింతురో, అలాగున నీ జూదముగూడ నిరూపించడమైనది.

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥ 37

పద॥ వృష్ణీనాం – వాసుదేవః - అస్మి - పాండవానాం - ధనంజయః,
మునీనాం - అపి - అహం - వ్యాసః - కవీనాం – ఉశనాకవిః.

ప్రతి॥ అహం=నేను, వృష్ణీనాం=వృష్ణివంశస్థులగు యాదవులలో, వాసుదేవః = వసుదేవపుత్రుడను, పాండవానాం = పాండవులలో, ధనంజయః=ధనం జయుడను, మునీనాం = మననశీలురలో, వ్యాసః అపి= వ్యాసమహాముని యును, కవీనాం = కవులలో, ఉశనాకవిః = శుక్రాచార్యుడను, అస్మి = అగుచున్నాను.

తా॥ యాదవులలోపల వసుదేవపుత్రుడగు కృష్ణుడను, పాండవులలోపల ధనంజయుడవగు నీవును, మనన (చింతన) శీలముగల మహర్షులలో వేదవ్యాసమునివరుడను, సూక్ష్మార్థ జ్ఞానముగలవారి లోపల శుక్రాచార్యుడను నేనే యగుచున్నాను.

వి॥ వ్యాసభగవానులు శ్రీకృష్ణభగవానునియపరావతారమని లోకప్రసిద్ధము 'వ్యాసోనారాయణో హరిః' అని చెప్పబడుచున్నది. భూలోకభారము నశింపజేయుటకు శ్రీ కృష్ణుడుగాను, ఆత్మలోగల యజ్ఞానభారమును రహితమొనరించుటకు శ్రీవ్యాస భగవంతుడుగాను, భూలోకము నుద్ధరించుటకు శ్రీకృష్ణుడుగాను. ఆత్మలోకము నుద్ధరించుటకు శ్రీ వ్యాసులుగాను, ఏకకాలమందు సాక్షాత్ నారాయణమూర్తియే శ్రీకృష్ణ శ్రీవ్యాసరూపములతో నవతరించెను. భూలోకశుద్ధిని శ్రీకృష్ణుడును, ఆత్మలోకశుద్ధిని శ్రీ వ్యాసుడును ఏక కాలమున జేసిరి.

శ్లో॥ దండో దమయతా మస్మి నీతిరస్మి జిగిషతామ్।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్॥ 38

పద॥ దండః–దమయతాం – అస్మి – నీతిః – అస్మి – జిగీషతాం.
మౌనం - చ - ఏవ - అస్మి - గుహ్యానాం - జ్ఞానం - జ్ఞానవతాం-అహమ్.

ప్రతి॥ అహం = నేను, దమయతాం = దండించువారిలో, దండః=దండనీతిని అస్మి=అగుచున్నాను. జిగీషతాం = జయింపనిచ్ఛగలవారలలో, నీతిః= జయోపాయమును, అస్మి = అగుచున్నాను, గుహ్యానాం=రహస్యములలో మౌనం చ ఏవ =మౌనమునున్ను, జ్ఞానవతాం=జ్ఞానవంతులలో, జ్ఞానం= ఆత్మజ్ఞానమున్ను, అస్మి =(నేనే) యగుచున్నాను.

తా॥ దండించువారలలో దండనీతిని, జయింప నిచ్ఛగల వారిలో ధర్మజయోపాయమును, రహస్యములలో మౌనమును జ్ఞాన వంతులలో యాత్మజ్ఞానమునున్ను నేనే యగుచున్నాను.

వి॥ సామ దాన భేదములు మూడును ప్రయోగింపబడిన తరువాత ధర్మమునకు లొంగనిచో అట్టివారి విషయమై నీతిబద్ధమగు దండనమును, ధర్మ విరుద్ధులైయుండువారిని జయించుటకు తగిన నీతితో గూడిన జయశీలత్వమును విష్ణుస్వరూపమే. అనగా భగవద్రూపమే యగును.

శ్లో॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున! ।
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్ ॥ 39

పద॥ యత్ - చ - అపి - సర్వభూతానాం - బీజం - తత్ - అహం - అర్జున,
న - తత్ - అస్తి - వినా - యత్ - స్యాత్ - మయా-భూతం-చరాచరమ్

ప్రతి॥ అపి చ = మఱియును, హే అర్జున ! = ఓ అర్జునా!, సర్వభూతానాం = సమస్తభూతములకు, బీజం=ఉత్పత్తికారణము, యత్=ఏదియో, తత్= అది అంతయు,అహం = నేను, మయావినా=నన్నువినా(నాకంటెవేరైన) చరాచరం భూతం = చరాచరాత్మకమైన వస్తువు, యత్స్యాత్ = ఏది కలదో,తత్ = అట్టి వస్తువు, న అస్తి = లేనేలేదు.

తా॥ ఓ యర్జునా! సమస్తభూతముల కుత్పత్తికారణ మేదియో యదియంతయును నేనే. నేను వినా (నాకంటే వేరైన)చరాచరాత్మకమైన వస్తువేది కలదో యట్టి వస్తువు లేనేలేదు.

వి॥ సమస్త చరాచర ప్రాణికోట్లకు బీజరూపము భగవంతుడేయని స్వయముగా తెలిపినాడు జీవులను గుఱించి బీజాంకురన్యాయము నుదాహరించువారు దీనిని చూచిన బాగుండును.

శ్లో॥ నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప! ।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥ 40

పద॥ న - అంతః - అస్తి - మమ - దివ్యానాం - విభూతీనాం - పరంతప,
ఏషః -తు -ఉద్దేశతః - ప్రోక్తః - విభూతేః - విస్తరః - మయా.

ప్రతి॥ హే పరంతప! = ఓ యర్జునా !, మమ=నాయొక్క, దివ్యానాం=దివ్యములైన, విభూతీనాం=లీలావిభూతులకు, అంతః=అంతము, న అస్తి=లేదు

విభూతేః= అట్టి లీలావిభూతియొక్క, ఏషః = ఇదివఱకు చెప్పబడినయీ విస్తరః తు=వివరణమన్ననో, ఉద్దేశతః=నీకు గురుతుగాను, మయా= నాచేత, ప్రోక్తః = చెప్పబడినది.

తా॥ శత్రుసంతాపకుడవగు ఓ అర్జునా ! అద్భుతములైన నాయొక్క విభూతులకు మాహాత్మ్యముల కంతములేదు. అయినను ఇప్పుడు చెప్పబడిన విస్తారము నీకు గురుతుగాను సంగ్రహముగా చెప్పబడినది.

వి॥ భగవంతు డనంతుడగుటచే భగవద్విభూతియు ననంతముగానే యుండును. అనగా దానినింతయని సామాన్యులు తెలిసికొనజాలరు.

శ్లో॥ యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ ॥ 41

పద॥ యత్ - యత్ - విభూతిమత్ - సత్త్వం - శ్రీమత్- ఊర్జితం - ఏవ-వా, తత్ - తత్ - ఏవ - అవగచ్ఛ - త్వం - మమ - తేజోఽంశసంభవమ్.

ప్రతి॥ యత్ యత్ సత్త్వం= ఏ యే వస్తువు, విభూతిమత్ = ఐశ్వర్యవంతమైన దిగాగాని, శ్రీమత్=కాంతియుక్తమైనదిగాగాని,ఊర్జితంఏవవా=దృఢమైన ఉత్సాహముతోగూడినదిగా గాని యుంటున్నదో,తత్ తత్=ఆయా వస్తువు, మమ = నాయొక్క, తేజోఽంశసంభవం=తేజస్సువలన గలిగినదానినిగా త్వం అవగచ్ఛ = నీవు తెలిసికొనుము.

తా॥ లోకములో నేది ఈశ్వర సంబంధమైనదిగాను, ఐశ్వర్య వంతముగాను, కాంతియుక్తమైనదిగాను, దృఢమైన ఉత్సాహముతో గూడినదిగాను ఉన్నదో, ఆ వస్తువును ఈశ్వరశక్తియొక్క అంశము వలన పుట్టినదానినిగా నీవు తెలిసికొనుము.

వి॥ ఈశ్వరసంబంధగుణము గలిగినదియు, స్వచ్ఛమైనదియు, నుత్సాహ యుక్తమైనదియు నగు గుణము ఈశ్వరాంశముచే గలిగినదిగా గ్రహించదగును. ఇట్టి గుణము ఎవరియందుండునో, వారియందలి ఆగుణము ఈశ్వరచైతన్యము వలననే కలిగెనని తలంచి ఈశ్వరునివలె వారినిగూడ శరణుబొందుము. వా రేజాతివారైనను ఈశ్వరస్వరూపులని నమ్ముము. వెయ్యిరూపాయలు విలువగల

కరెన్సీనోటుయొక్క కాగిత మెంతో స్వల్పమయినది. కాని దానిలోగల చక్రవర్తి యొక్క ముద్రకంత విలువ గలిగెను గదా! ఆకారమున శరీరమును చూడకుము. ఎచ్చట ఆత్మశక్తి ప్రకాశించుచున్నదో, అచ్చట దైవచైతన్యము వెలుగుచున్నదని గ్రహింపుము.

శ్లో॥ అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ! ।
విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥ 42

పద॥ అథవా - బహునా - ఏతేన - కిం -జ్ఞాతేన - తవ - అర్జున!, విష్టభ్య - అహం - ఇదం - కృత్స్నం - ఏకాంశేన - స్థితః - జగత్.

ప్రతి॥ అథవా = లేక, బహునా = విస్తారమైన, ఏతేన జ్ఞాతేన = ఈ జ్ఞానము చేత, తవ కిం = నీకేమి ప్రయోజనము?. హే అర్జున! = ఓ యర్జునా!, ఇదం కృత్స్నం జగత్= ఈ ప్రపంచమునంతయు, ఏకాంశేన=నాయొక్క ఒక్క యంశము చేతనే, అహం = నేను, విష్టభ్య స్థితః = అవలంబించి యున్నవాడను.

తా॥ ఓ అర్జునా! వేయేల! విస్తారమైన యీ జ్ఞానముచేత నీకేమి ప్రయోజనము? ఈ కనబడుచున్న సర్వప్రపంచమును నాయొక్క ఏకాంశముచేతనే నే నవలంబించి ధరించి యున్నాను. సర్వమును వ్యాపించియున్నాను.

వి॥ ఇదివరలో ననేకవస్తువులలో గల శ్రేష్ఠత్వము భగవత్స్వరూపముగా వర్ణించబడినది. మఱిల నన్నిటిలోగల దైవాంశ మీశ్వరస్వరూపముగా వర్ణించబడినది. ఇప్పుడో వేయేల? చరాచర జగత్తంతయు నొక్కదైవాంశముచేతనే వ్యాపింపబడియున్నదనియు, ధరింపబడియున్నదనియు చెప్పడమైనది.మొదటిది జిజ్ఞాసువులకు రెండవది యభ్యాసకులకు, మూడవది యారూఢులకు చెప్పబడినదని గ్రహించవలెను. 'అంతయు నీశ్వరమయము, అది తప్ప రెండవ వస్తువు అణువంతయు లేదని' కట్టకడకు చెప్పబడిన జ్ఞానమే పూర్ణజ్ఞాన మనబడును. అధ్యాయాంతమున నీ పూర్ణ జ్ఞానమును తెలుపడమైనది.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే విభూతియోగో నామ
దశమోఽధ్యాయః.

పద॥ ఇతి - శ్రీమత్భగవద్గీతాసు - ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే-శ్రీ కృష్ణార్జునసంవాదే -విభూతియోగః నామ - దశమః-అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇది. ఉపనిషత్సు = ఉపనిషదర్థ ప్రతిపాదకమును,బ్రహ్మవిద్యాయాం= బ్రహ్మవిద్యారూపమును,యోగశాస్త్రే=యోగశాస్త్రమును,శ్రీకృష్ణార్జున సంవాదే = శ్రీ కృష్ణార్జున సంవాద రూపమునగు, శ్రీమద్భగవద్గీతాసు = శ్రీ భగవద్గీతలయందు, విభూతియోగః నామ = విభూతియోగమని ప్రసిద్ధిగల, దశమః=పదవ, అధ్యాయః=అధ్యాయము సంపూర్ణము.

తా॥ ఇట్లు ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదరూపమునగు శ్రీ మద్భగవద్గీతయందు విభూతి యోగమను ప్రసిద్ధి (పేరు) గల పదవ అధ్యాయము సంపూర్ణము. ఈ యీశ్వర విభూతిని తెలిసికొనుటవలన పరమాత్మ యందైక్యము సిద్ధించును. కనుకనే దీనికి విభూతియోగమని పేరు వచ్చినది.

ఓమ్ తత్ సత్.



ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## ఏకాదశోఽధ్యాయః - ఏకాదశాధ్యాయము

## విశ్వరూపసందర్శన యోగః - విశ్వరూపసందర్శన యోగము



విశ్వరూపదర్శనమువలనను పరమాత్మైక్యజ్ఞానము గలుగును. కాన ఈ యధ్యాయమునకు 'విశ్వరూపసందర్శనయోగ'మని పేరు. ఈ విశ్వమంతయు భగవన్మయమని తెలిసికొనుటకును, యోగమని అర్థము గలదు. లేక భగవంతుని యొక్క అనంతశక్తిని ప్రకాశింపజేసిన యోగమనిగూడ భావముగలదు. ఎట్లయి నను భగవద్దర్శనము, సాక్షాత్కారము కలిగినవారందఱును భవబంధమునుండి విముక్తి కలిగి భగవానుని చేరగలరని దీనియొక్క భావము.

అర్జున ఉవాచ:— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ॥ 1

పద॥ మదనుగ్రహాయ - పరమం - గుహ్యం - అధ్యాత్మసంజ్ఞితం,
యత్ - త్వయా-ఉక్తం - వచః - తేన -మోహః-అయం-విగతః- మమ

ప్రతి॥ మదనుగ్రహాయ =నన్ననుగ్రహించుటకొఱకు, అధ్యాత్మసంజ్ఞితం =అధ్యాత్మజ్ఞానమను పేరుగల, పరమం గుహ్యం=పరమరహస్యమైన, యత్ వచః=ఏ వాక్యము, త్వయా ఉక్తం= నీచే చెప్పబడినదో, తేన = ఆ వాక్యము చేత, మమ=నాయొక్క, అయం మోహః=ఈ యజ్ఞానము విగతః=విడిచిపోయినది.

తా॥ నన్ననుగ్రహించుటకొఱకు కరుణగలిగి పరమపురుషార్థ మగు మోక్షమునకు సాధనమును, పరమ రహస్యమైనదియును, ఆత్మజ్ఞానవిషయక మైనదియు నయిన యే వాక్యమును నీవు చెప్పితివో ఆ వాక్యముచేత నా యవివేకము తొలగిపోయెను.

శ్లో॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష! మాహాత్మ్యమపి చావ్యయమ్॥ 2

పద॥ భవాప్యయౌ - హి -భూతానాం - శ్రుతౌ-విస్తరశః - మయా,
త్వత్తః - కమలపత్రాక్ష! - మాహాత్మ్యం - అపి- చ- అవ్యయమ్,

ప్రతి॥ హే కమలపత్రాక్ష ! = ఓ రాజీవనేత్రా !. భూతానాం=భూతములయొక్క భవాప్యయౌ=ఉత్పత్తిలయములు(నీయొక్క), అవ్యయం = నాశరహితమైన, మాహాత్మ్యం అపి చ=మహిమయును, మయా=నాచేత,త్వత్తః = నీవలన, విస్తరశః=సవిస్తారముగా, శ్రుతౌ హి=వినబడినవిగదా?

తా॥ పుండరీకాక్షా! ఓ శ్రీకృష్ణమూర్తీ! నీవలన భూతములయొక్క ఉత్పత్తివినాశములను మఱియును నీ మాహాత్మ్యమునుగూడ విస్తారముగా నేను వింటిని.

శ్లో॥ ఏవమేతద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర! ।
ద్రష్టు మిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ! ॥ 3

పద॥ ఏవం - ఏతత్ - యథా - అత్థ - త్వం - ఆత్మానం - పరమేశ్వర!
ద్రష్టుం - ఇచ్ఛామి - తే - రూపం - ఐశ్వరం - పురుషోత్తమ !.

ప్రతి॥ హే పరమేశ్వర ! = పరమేశ్వరుడవగు ఓ శ్రీకృష్ణమూర్తీ!, ఆత్మానం= నిన్నుగూర్చి, త్వం యథా అత్థ=నీవెట్లు చెప్పితివో, ఏవం ఏతత్=అది యట్లే యుండును. హే పురుషోత్తమ ! =పురుషోత్తముడవగు ఓ కృష్ణమూర్తీ!, తే ఐశ్వరం రూపం = నీయొక్క ఐశ్వర్యయుక్తస్వరూపమును ద్రష్టుం ఇచ్ఛామి=దర్శింపగోరుచున్నాను.

తా॥ ఓ పరమేశ్వరా! నీవు నీ ఆత్మస్వరూపమునుగుఱించి, యేవిధముగా చెప్పితివో అదియంతయు సత్యమైనదే.ఓపురుషోత్తమా! జ్ఞాన, ఐశ్వర్య, శక్తి, బల, వీర్య, తేజస్సులతో కూడినదియును విష్ణుసంబంధమైనదియు నయిన నీయొక్క రూపమును చూడదలంచుచున్నాను.

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో !
యోగేశ్వర! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్॥ 4

పద॥ మన్యసే - యది - తత్ - శక్యం - మయా - ద్రష్టుం - ఇతి - ప్రభో!.
యోగేశ్వర - తతః - మే - త్వం - దర్శయ - ఆత్మానం -అవ్యయమ్,

ప్రతి॥ హే యోగేశ్వర! ప్రభో! = యోగీశ్వరుడవగు ఓ ప్రభూ!. తతః = నేనట్లు చూడగోరుచున్నాను గనుక, తత్ = అట్టి విశ్వస్వరూపము, మయా = నాచేత, ద్రష్టుం=చూడబడుటకు, శక్య ఇతి=శక్యమని, త్వం మన్యసే యది= నీవు తలంచెదవేని, అవ్యయం ఆత్మానం=నాశరహితమగు నీరూపమును, మే = నాకు, దర్శయ = చూపుము.

తా॥ యోగీశ్వరుడవగు ఓ శ్రీకృష్ణా! నీయొక్క ఐశ్వర్య యుక్తమగు రూపమును నేను జూడ కుతూహలపడుచున్నాను. కావున నాచే చూడదగినదని తలచితివేని నాశరహితమైన నీయొక్క విశ్వ రూపమును నాకు చూపుము.

వి॥ మహాత్ములగు గురువులపై నత్యంతభక్తి గలవారి లక్షణము ఇచ్చట నిరూపింపబడినది. 'నాకు చెప్పుము, నాకు చూపుమని, తిరస్కారభావముతో చెప్పక నేను వినుటకు, చూచుటకు. అనుష్ఠించుటకు అర్హతగలవాడనని తమకు తోచినచో యుపదేశింపుడు. తెలుపుడు అని చెప్పవలయునని భావము.

శ్రీ భగవానువాచ:—శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః !
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥ 5

పద॥ పశ్య - మే - పార్థ! - రూపాణి - శతశః - అథ - సహస్రశః,
నానావిధాని - దివ్యాని - నానావర్ణాకృతీని - చ.

ప్రతి॥ హే పార్థ! = ఓయర్జునా!, శతశః అథ సహస్రశః = అసంఖ్యాకములును, నానావిధాని=అనేకవిధములైనవియు, నానావర్ణాకృతీని=అనేకవర్ణములు ఆకృతులుగలవియు, దివ్యాని చ = అప్రాకృతములునగు, మే రూపాణి = నా రూపములను, పశ్య = చూడుము.

తా। ఓ యర్జునా! అసంఖ్యాకములును, అనేక ప్రకారములయినవియును, అనేకవర్ణములు ఆకృతులు గలవియును, అమానుషేయములును నగు నాయొక్క రూపములను చూడుము.

శ్లో॥ పశ్యాదిత్యాన్వసూన్రుద్రానశ్వినౌ మరుతస్తథా।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత! ॥ 6

పద॥ పశ్య—ఆదిత్యాన్—వసూన్—రుద్రాన్—అశ్వినౌ—మరుతః—తథా,
బహూని—అదృష్టపూర్వాణి—పశ్య—ఆశ్చర్యాణి—భారత.

ప్రతి॥ హే భారత = ఓ అర్జునా! ఆదిత్యాన్ = ద్వాదశాదిత్యులను, వసూన్ = అష్టవసువులను, రుద్రాన్=ఏకాదశరుద్రులను,అశ్వినౌ=అశ్వినీదేవతలను మరుతః = సప్తమరుత్తులను, పశ్య = చూడుము, తథా = అలాగుననే, అదృష్టపూర్వాణి = పూర్వమెప్పుడును చూడబడనివియునగు, బహూని ఆశ్చర్యాణి = అనేకాద్భుతములను, పశ్య = చూడుము.

తా॥ ఓ యర్జునా! పంద్రెండుగురు సూర్యులను, అష్టవసువులను, ఏకాదశరుద్రులను, ఇద్దరగు అశ్వినీదేవతలను, సప్తమరుత్తులను చూడుము. ఆ ప్రకారముగానే యీ లోకమునందు నీచేతగాని, మఱియెవనిచేతగాని యిదివరకెన్నడును చూడబడని యనేకములగు నద్భుత దృశ్యములను చూడుము.

శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ ! యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి ॥ 7

పద॥ ఇహ—ఏకస్థం—జగత్ - కృత్స్నం - పశ్య—అద్య—సచరాచరం,
మమ—దేహే—గుడాకేశ!-యత్—చ—అన్యత్—ద్రష్టుం - ఇచ్ఛసి.

ప్రతి॥ హే గుడాకేశ! =ఓయర్జునా! సచరాచరం=చరాచరాత్మకమైన.కృత్స్నం= ప్రపంచమునంతయు. కించ = మఱియు, అన్యత్ యత్ = దేనిని, ద్రష్టుం ఇచ్ఛసి = చూడగోరుచున్నావో, దానినికూడ, మమ = నాయొక్క. ఇహ= ఈ. దేహే = విశ్వరూపాత్మకమగు దేహమునందు, అద్య = ఇప్పుడు. ఏకస్థం=ఒక్కచోనున్నదానినిగా, పశ్య = చూడుము.

తా॥ ఓ యర్జునా! స్థావరజంగమములతో కూడినదియగు సమస్తమైన జగత్తును నాయొక్క యీ దేహమునందు ఒక్కప్రదేశమునందే ఉన్నదానినిగా చూడుము. మఱియు ఇతరమైన దేనిని చూడదలంచు చున్నావో దానిని గూడ చూడుము.

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥ 8

పద॥ న–తు–మాం–శక్యసే–ద్రష్టుం–అనేన–ఏవ - స్వచక్షుషా,
దివ్యం–దదామి–తే–చక్షుః - పశ్య–మే–యోగం–ఐశ్వరమ్,

ప్రతి॥ అనేన స్వచక్షుషా ఏవ=ఈ నీ మాంసమయ చక్షువులతోనే,మాం ద్రష్టుం=నన్ను చూచుటకు. న శక్యసే=శక్తుఁడవు కానేరవు, తు=మఱియేమన్ననో, దివ్యం చక్షుః=దివ్యదృష్టిని, తే దదామి=నీ కిచ్చుచున్నాను. మే ఐశ్వరం యోగం = నాయొక్క యోగమహిమను, ఈశ్వరతత్త్వమును, పశ్య = చూడుము.

తా॥ ప్రాకృతములైన యీ నేత్రములచేత విశ్వరూపధరుడ నగు నన్ను చూచుటకు నీవు శక్తుఁడవుగావు. కావున అప్రాకృతమైన (దివ్య) నేత్రము నిచ్చుచున్నాను, ఈ దివ్యనేత్రముచేత నాయొక్క యోగమహిమను లేక ఈశ్వరశక్తిని చూడుము.

వి॥ ఈశ్వరుడుండిన ఏల కనబడుటలేదని శంకించువారి కీ శ్లోకమువలన సమాధానము గలుగును, పంచభూతాత్మకమగు నేత్రము పంచభూతసంబంధమైన వస్తువును మాత్రమే చూడగలుగును. ఏలన, అప్రకాశ వస్తువులు సువర్ణ రత్నములైనను అవి దీపమును ప్రకాశింపచేయజాలవు. దీపము స్వప్రకాశమై తనను ఇతర వస్తువులను ప్రకాశింపచేయు శక్తి గలిగియుండును. ఇదియు నటువంటిదే. భగవంతుడు అప్రాకృతుడును, జ్ఞానస్వరూపుడును అగుటవలన జ్ఞానదృష్టివలననే చూడబడును. అట్టి జ్ఞానదృష్టి స్వయముగా గలుగుటకు సాధ్యము గాదు. అది ఈశ్వరుని కరుణవలనను లేక మహాత్ముల అనుగ్రహము వలన గలుగ వలసియుండును కాన ఈశ్వరోపాసనయు, గురుసేవయు నవసరములేదని చెప్పువారికి అంధత్వమే సిద్ధించును. మఱియు తన నేత్రముచే తన దేహముచూడ శక్తిలేనివానికి ఇతరులనుగాని, యితర వస్తువులనుగాని చూచుటకెట్లు సమర్థత ఉండదో, అలాగున తనయొక్క దివ్యాత్మను తెలియనివాడు, ఇతరులకు వారి యాత్మస్వరూపమును వారికి తెలుపుటకు శక్తిమంతుడు కాడు. కావున తనకు దివ్యత్వమును, గలుగచేసికొనుటకు ముందుగ తాను ప్రయత్నము చేయవలయును, కనుకనే గురుధ్యాన శ్లోకములలో

"అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా,।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః॥

అని చెప్పుటకు కారణము.

సంజయ ఉవాచ - సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఏవముక్త్వా తతో రాజన్మహాయోగేశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ! పరమం రూపమైశ్వరమ్॥ 9

పద॥ ఏవం - ఉక్త్వా - తతః - రాజన్ - మహాయోగేశ్వరః - హరిః
దర్శయామాస - పార్థాయ - పరమం - రూపం - ఐశ్వరమ్.

ప్రతి॥ హే రాజన్! = ఓ ధృతరాష్ట్రమహారాజా!, మహాయోగేశ్వరః= యోగుల కందఱికిని మహాయోగీశ్వరుడగు, హరిః=శ్రీకృష్ణమూర్తి, ఏవం ఉక్త్వా= ఇట్లు చెప్పి, తతః = పిమ్మట. పరమం ఐశ్వరం రూపం=శ్రేష్ఠమగు విశ్వ రూపమును, పార్థాయ = అర్జునునికి, దర్శయామాస = చూపెను.

తా॥ ఓ ధృతరాష్ట్రమహారాజా ! సర్వోత్తముడును, యోగుల కీశ్వరుడును, భక్తుల పాపములను హరించువాడునగు శ్రీ కృష్ణభగ వానుడు ఈ విధముగా చెప్పి పిమ్మట సర్వోత్తమమును, ఈశ్వర సంబంధమునైన విశ్వరూపమును అర్జునునికి చూపెను.

శ్లో॥ అనేకవక్త్రనయన మనేకాద్భుత దర్శనమ్।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ । 10
" దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్॥ 11

పద॥ అనేకవక్త్రనయనం — అనేకాద్భుతదర్శనం,
అనేక దివ్యాభరణం — దివ్యానేకోద్యతాయుధమ్.
" దివ్యమాల్యాంబరధరం — దివ్యగంధానులేపనం,
సర్వాశ్చర్యమయం — దేవం — అనన్తం — విశ్వతోముఖమ్.

ప్రతి॥ అనేకవక్త్రనయనం = అనేక ముఖములును, అనేక నేత్రములును గలది యును, అనేకాద్భుతదర్శనం = అనేకవిధములగు వింతల చూపునది యును, అనేక దివ్యాభరణం = అనేక దివ్యాభరణములచే నలంకరింప బడినదియును, దివ్యానేకోద్యతాయుధం = అనేక దివ్యాయుధములను ధరించినదియును, దివ్యమాల్యాంబరధరం = దివ్యములగు పుష్పమాలి కలను, వస్త్రములును ధరించినదియును, దివ్యగంధానులేపనం =సుగంధ యుక్తమగు శ్రీచందన పూతగలదియును, సర్వాశ్చర్యమయం =

మిక్కిలి యాశ్చర్యకరమైనదియును, దేవం = కాంతియుక్తమైనదియును, అనంతం = అంతములేనిదియును, విశ్వతోముఖం=అంతట ముఖములు గలదియునైన (సర్వవ్యాపకమైన) విశ్వరూపమును చూపించెను.

తా॥ అనేకములైన వక్త్రములు నేత్రములు గలదియును, అనేకములగు ఆశ్చర్యకరములైన దృశ్యములు కలదియును, అనగా వికృతములును సౌమ్యములును సాధారణములును భయంకరములును చిత్రవిచిత్రములునైన దృశ్యములుగలదియును, అనేకములును శ్రేష్ఠములునైన హారకేయూరాద్యాభరణములు గలదియును, అనేకములును శ్రేష్ఠములునైన యాయుధములను ధరించినదియును, శ్రేష్ఠమైన పుష్పమాలికలను లేక రత్నహారాదులను ధరించినట్టిదియును, శ్రేష్ఠమైన వాసనద్రవ్యములు పైపూతగలదియును, సకలాశ్చర్యకరమైనదియును, ప్రకాశించునట్టిదియును, సర్వవ్యాపకమైనదియునై ఈశ్వర సంబంధమైన విశ్వరూపమును అర్జునునికి చూపించెను.

శ్లో॥ దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।
యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః ॥ 12

పద॥ దివి - సూర్యసహస్రస్య - భవేత్ - యుగపత్ - ఉత్థితా,
యది - భాః - సదృశీ - సా - స్యాత్ - భాసః - తస్య - మహాత్మనః.

ప్రతి॥ దివి=ఆకాశమునందు, యుగపత్=ఒకేమాటుగా, సూర్యసహస్రస్యభాః= వెయ్యి సూర్యులకాంతి, ఉత్థితా భవేత్ యది=బయలుదేరినయెడల, సా= ఆ కాంతి, తస్య మహాత్మనః భాసః = ఆ మహాత్ముని కాంతికి, సదృశీ స్యాత్=సమానమగును.

తా॥ అంతరిక్షమునందు ఒక్కమాటుగా నుదయించిన వెయ్యి సూర్యులయొక్క కాంతి ప్రకాశించెనేని యాకాంతి మహానుభావుడైన యా విశ్వరూపునియొక్క కాంతికి సమానమైన దగును.

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా ॥ 13

పద॥ తత్ర - ఏకస్థం - జగత్ - కృత్స్నం - ప్రవిభక్తం - అనేకధా,
అపశ్యత్ - దేవదేవస్య - శరీరే - పాండవః - తదా.

ప్రతి॥ తదా=అప్పుడు, పాండవః=అర్జునుడు, దేవదేవస్య=దేవదేవుడగుశ్రీకృష్ణ మూ_ర్తియొక్క, తత్రశరీరే=విశ్వరూపమునందు, అనేకధా = నానావిధ ములుగా, ప్రవిభ_క్తం=విభజింపబడియుండెడు, కృత్స్నం జగత్=సమ_స్త ప్రపంచమును,ఏకస్థం=ఒక్కచోట నున్నదానినిగా, అపశ్యత్=చూచెను.

తా॥ అవుడు దేవ పితృ మనుష్యాది భేదములచేత బహువిధ ములుగా విభజింపబడినదగు సమ_స్త జగత్తును దేవతలకు దేవుడైన శ్రీకృష్ణుని దేహమునందు అర్జునుడు ఒక్కచోటనే యున్నదానినిగా జూచెను.

శ్లో॥ తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత ॥ 14

పద॥ తతః - సః - విస్మయావిష్టః - హృష్టరోమా - ధనంజయః,
ప్రణమ్య శిరసా - దేవం - కృతాంజలిః - అభాషత.

ప్రతి॥ తతః=పిమ్మట, సః ధనంజయః=ఆ యర్జునుడు,విస్మయావిష్టః=విస్మయ ముతో గూడినవాడును, హృష్టరోమా=పులకాంకితదేహుడునై, దేవం= దేవుడగు శ్రీకృష్ణమూ_ర్తిని, శిరసా ప్రణమ్య=శిరస్సుచే నమస్కరించి, కృతాంజలిః =అంజలిబద్ధుడై, అభాషత=ఇట్లు పలికెను.

తా॥ అట్టి విశ్వరూపమును జూచిన పిమ్మట ఆ యర్జునుడు మిగుల నాశ్చర్యము గలవాడును, రోమాంచము గలవాడును నై విశ్వరూపమును ధరించి వెలుగుచున్న శ్రీకృష్ణునకు శిరస్సునువంచి నమస్కరించి దోసిలి యొగ్గి యిట్లు చెప్పదొడగెను.

వి॥ ఆత్మదర్శనము గలుగునపుడు లేక భగవద్దర్శనము సిద్ధించినపుడు లేక ప్రకృతి అవరణము తొలగునపుడు ఇట్టి అతిహర్షము ఆనందావిర్భావము, భ_క్తి పరవశత్వము గలుగుచుండును.

అర్జున ఉవాచ:— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ పశ్యామి దేవాం_స్తవ దేవ! దేహే
సర్వాం_స్తథా భూతవిశేషసంఘాన్ ॥
బ్రహ్మాణమీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ 15

పద॥ పశ్యామి - దేవాన్ - తవ - దేవ ! - దేహే - సర్వాన్ - తథా - భూత విశేషసంఘాన్ - బ్రహ్మాణం - ఈశం - కమలాసనస్థం - ఋషీన్ - చ - సర్వాన్ - ఉరగాన్ - చ - దివ్యాన్.

ప్రతి॥ హే దేవ ! = ఓ స్వామీ !, తవ దేహే = నీ దేహమునందు, సర్వాన్ దేవాన్=సమస్తదేవతలను, కమలాసనస్థం=కమలాసనస్థుడును, ఈశం= సృష్టికర్తయునగు, బ్రహ్మాణం=చతుర్ముఖబ్రహ్మను, సర్వాన్ ఋషీన్= సమస్త ఋషులను, దివ్యాన్ ఉరగాన్ చ=దివ్యములగు సర్పములను, తథా=అలాగుననే, భూతవిశేషసంఘాన్ చ = అనేకవిధములగు ప్రాణి కోట్లను, పశ్యామి=చూచుచున్నాను.

తా॥ ఓ కృష్ణమూర్తీ! విశ్వరూపధరుడవైన నీ దేహము నందు స్వర్గస్థులగు సకలదేవతలను, కమలాసనస్థుడగు చతుర్ముఖ బ్రహ్మను, వసిష్ఠాది సమస్త ఋషులను, నానావిధములైన స్థావర జంగమాది భూతసమూహములను, శ్రేష్ఠములగు వాసుకి మొదలగు సర్పములను చూచుచున్నాను.

శ్లో॥ అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్ ।
నాన్తం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప !॥ 16

పద॥ అనేకబాహూదరవక్త్రనేత్రం-పశ్యామి-త్వాం-సర్వతః - అనంతరూపం - న-అన్తం - న - మధ్యం - న - పునః - తవ - ఆదిం - పశ్యామి - విశ్వేశ్వర! - విశ్వరూప!

ప్రతి॥ హే విశ్వరూపా!=విశ్వస్వరూపుడవగు ఓ శ్రీకృష్ణమూర్తీ!, త్వాం=నిన్ను, అనేకబాహూదరవక్త్రనేత్రం = అనేక భుజములు, ఉదరములు, ముఖ ములు, నేత్రములు గలవానినిగను. అనంతరూపం = అనేకరూపములు గలవానినిగను, సర్వతః = అంతట, పశ్యామి = చూచుచున్నాను. హే విశ్వేశ్వర! =విశ్వమునకు ప్రభువగు నో స్వామీ!, తవ=నీయొక్క, ఆదిం = మొదలును, న పశ్యామి = చూడజాలకున్నాను, మధ్యం = మధ్య మును, న = చూడ జాలకున్నాను, పునః = మఱియు, అంతం=అంతము నున్ను, న = చూడ జాలకున్నాను,

తా॥ విశ్వరూపుడవగు నో శ్రీకృష్ణమూర్తీ! నిన్ను అనేకములైన బాహువులు కడుపులు వక్త్రములు నేత్రములు గలవానినిగాను, అనేకములైన రూపములు గలవానినిగాను అంతట చూచుచున్నాను. మఱియు జగత్ప్రభువగు ఓ శ్రీకృష్ణమూర్తీ! ఇట్లు జూచుచుండియును నీయొక్క ఆది మధ్య అంతములను చూడజాలకున్నాను.

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా-
ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్ ॥ 17

పద॥ కిరీటినం - గదినం - చక్రిణం - చ - తేజోరాశిం - సర్వతః-దీప్తిమన్తం- పశ్యామి - త్వాం - దుర్నిరీక్ష్యం-సమన్తాత్ - దీప్తా నలార్కద్యుతిం - అప్రమేయమ్.

ప్రతి॥ త్వాం=నిన్ను, సమన్తాత్ = అంతట, కిరీటినం=కిరీటముగలవానినిగను, గదినం=గదాయుధము గలవానినిగను చక్రిణం చ=చక్రాయుధము గలవానినిగను, తేజోరాశిం—తేజోరాశిగను, సర్వతః దీప్తిమన్తం = అంతట నిండిన దీప్తులు గలవానినిగను, దీప్తానలార్కద్యుతిం=జ్వలించుచుండెడు సూర్యాగ్నుల కాంతివంటి కాంతిగలవానినిగను. దుర్నిరీక్ష్యం = చూడ శక్యము కానివానినిగను,అప్రమేయం=పరిమితి లేనివానినిగను. పశ్యామి= చూచుచున్నాను.

తా॥ నిన్ను కిరీటము గలవానినిగను, గదాయుధము చక్రాయుధము గలవానినిగను, తేజః పుంజముగను, అంతట ప్రకాశము గలవానినిగను, చూచుటకు అసాధ్యమైనవానినిగను, అంతట ప్రజ్వలించుచున్న అగ్నిసూర్యులయొక్క కాంతివంటి కాంతిగలవానినిగను, పరిమితి లేనివానినిగను అంతటను చూచుచున్నాను. ("దుర్నిరీక్షం" అని పాఠాంతరము.)

శ్లో॥ త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే ॥ 18

పద॥ త్వం - అక్షరం - పరమం - వేదితవ్యం - త్వం - అస్య - విశ్వస్య- పరం - నిధానం - త్వం - అవ్యయః - శాశ్వతధర్మగోప్తా -సనాతనః - త్వం - పురుషః - మతః - మే.

ప్రతి॥ త్వం = నీవు, వేదితవ్యం అక్షరం పరమం = తెలియదగిన అక్షరమైన పరబ్రహ్మవు, త్వం=నీవు, అస్య విశ్వస్య = ఈ ప్రపంచమునకు, పరం నిధానం = పరమ ఆధారభూతుడవు, త్వం=నీవు, అవ్యయః=నాశములేని వాడవు, శాశ్వతధర్మగోప్తా=శాశ్వత ధర్మసంరక్షణ కర్తవు, త్వం=నీవు, సనాతనః పురుషః = సనాతనపురుషుడవు (అని). మే మతః = నా అభిప్రాయము.

తా॥ నీవు ముముక్షువులచేత తెలియదగిన పరబ్రహ్మమనియును, ఈ సకల ప్రపంచమునకును సర్వోత్తమమైన యాధారమనియును, నాశము లేనివాడవనియును, శాశ్వతధర్మమును పాలించువాడవని యును, సనాతన పురుషుండవనియును నేను తలంచుచున్నాను.

వి॥ సనాతనధర్మమును, వర్ణాశ్రమములను గుఱించి జెప్పువారు శ్రీభగ వంతుడుపదేశించిన యీ సనాతనధర్మమేదియో తెలిసికొనిన బాగుండును.

శ్లో॥ అనాదిమధ్యాన్తమనన్తవీర్య-
మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్ ।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥ 19

పద॥ అనాదిమధ్యాన్తం - అనన్తవీర్యం - అనన్తబాహుం - శశిసూర్యనేత్రం - పశ్యామి-త్వాం - దీప్తహుతాశవక్త్రం - స్వతేజసా - విశ్వం - ఇదం - తపన్తమ్.

ప్రతి॥ త్వాం=నిన్ను, అనాదిమధ్యాన్తం = ఆదిమధ్యాంతరహితునిగను, అనన్త వీర్యం=అమితవీర్యము గలవానినిగను, అనన్తబాహుం=అనేకభుజములు గలవానినిగను, శశిసూర్యనేత్రం=చంద్రసూర్యులే నేత్రములుగా గల వానినిగను, దీప్తహుతాశవక్త్రం=అగ్నివలె జ్వలించెడు ముఖముగల వానినిగను, స్వతేజసా=ఆత్మతేజస్సుచేత, ఇదం విశ్వం = ఈ ప్రపంచ మును, తపన్తం=తపింపజేయుచున్న వానినిగను, పశ్యామి = చూచు చున్నాను.

తా॥ నిన్ను ఉత్పత్తిస్థితి నాశనములు లేనివానినిగను, అపరిమితమైన సామర్థ్యము గలవానినిగను, అపరిమితములైన భుజములు గలవానినిగను, చంద్రుడు సూర్యుడు నేత్రములుగా గలవానినిగను, ప్రజ్వలించుచున్న యగ్నిహోత్రునివంటి ముఖము గలవానినిగను, స్వకీయమగు తేజస్సుచేత నీసమస్తప్రపంచమును తపింపజేయుచున్న వానినిగను జూచుచున్నాను.

శ్లో॥ ద్యావాపృథివ్యోరిదమంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాఽద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ 20

పద॥ ద్యావాపృథివ్యోః - ఇదం - అంతరం-హి - వ్యాప్తం - త్వయా- ఏకేన- దిశః - చ - సర్వాః - దృష్ట్వా-అద్భుతం - రూపం - ఉగ్రం – తవ - ఇదం - లోకత్రయం – ప్రవ్యథితం – మహాత్మన్.

ప్రతి॥ హే మహాత్మన్!=మహాత్ముడవగు నో స్వామీ!, ఇదం ద్యావాపృథివ్యోః అంతరం=ఈ భూమ్యాకాశముల మధ్యప్రదేశమంతయు,ఏకేన త్వయా= నీ ఒక్కనిచేతనే, వ్యాప్తం హి=వ్యాపింపబడియున్నదిగదా!,సర్వాః దిశః చ=సమస్తదిక్కులును, (వ్యాప్తాః హి=నీచే వ్యాపింపబడియున్నవిగదా) తవ=నీయొక్క, ఉగ్రం = భయంకరమైనదియు, అద్భుతం = ఆశ్చర్యకరమైనదియునగు, ఇదం రూపం = ఈ రూపమును, దృష్ట్వా=చూచి, లోకత్రయం=ముల్లోకములును,ప్రవ్యథితం=మిక్కిలి భీతిని పొందినవి.

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! భూమ్యాకాశములయొక్క మధ్యప్రదేశమైన ఈ యంతరిక్షము నీ ఒక్కనిచేతనే వ్యాపింపబడినది. మఱియును నీ చేతనే సకల దిక్కులును వ్యాపింపబడినవి. మహాత్మా! భయంకరమైనదియును, ఆశ్చర్యకరమైనదియునైన నీయొక్క యీ విశ్వరూపమును చూచి ముల్లోకములును భయమును పొందినవి.

శ్లో॥ అమీ హి త్వాం సురసంఘా విశన్తి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణన్తి ।

స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ 21

పద॥ అమీ-హి-త్వాం-సురసంఘాః-విశన్తి - కేచిత్-భీతాః-ప్రాంజలయః-గృణన్తి - స్వస్తి - ఇతి - ఉక్త్వా - మహర్షిసిద్ధసంఘాః-స్తువన్తి-త్వాం-స్తుతిభిః - పుష్కలాభిః.

ప్రతి॥ అమీ సురసంఘాః=ఈదేవతల సమూహములు,త్వాం విశన్తి హి=నిన్ను ప్రవేశించుచున్నవిగదా, కేచిత్ భీతాః =కొందఱు భీతిగలవారై, ప్రాంజలయః గృణన్తి=అంజలిబద్ధులై ప్రార్థించుచున్నారు. మహర్షిసిద్ధసంఘాః = మహర్షులు, సిద్ధసమూహములు, స్వస్తి ఇతి ఉక్త్వా = స్వస్తి యని చెప్పుచు, త్వాం = నిన్ను, పుష్కలాభిః స్తుతిభిః = సంపూర్ణార్థముగల స్తవములచేత, స్తువన్తి = స్తోత్రము చేయుచున్నారు.

తా॥ ఈదేవతాసమూహములు నిన్ను ప్రవేశించుచున్నవిగదా? కొందఱు భీతిగలవారై అంజలిబద్ధులై ప్రార్థించుచున్నారు.మహర్షులును సిద్ధసమూహములును స్వస్తివాచకములు అనగా"యుద్ధము శాంతించి లోకమునకు క్షేమము గలుగుగాక!" యని వేదవాక్యములను పఠించుచు అర్థవంతములగు ననేక స్తోత్రములచేతనిన్నుస్తుతించుచున్నారు.

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।
గంధర్వయక్షాసురసిద్ధ సంఘా
వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ 22

పద॥ రుద్రాదిత్యాః - వసవః - యే - చ - సాధ్యాః - విశ్వే - అశ్వినౌ - మరుతః - చ - ఊష్మపాః - చ - గంధర్వయక్షాసురసిద్ధసంఘాః - వీక్షన్తే - త్వాం - విస్మితాః - చ - ఏవ - సర్వే.

ప్రతి॥ రుద్రాదిత్యాః = రుద్రులు ఆదిత్యులు, వసవః = వసువులును, సాధ్యాః= సాధ్యులును, యే = ఎవరో వారును, విశ్వే = విశ్వదేవతలును, అశ్వినౌ= అశ్వినీదేవతలును, మరుతః చ =మరుత్తులును, ఊష్మపాః చ=పితృదేవతలును, గంధర్వయక్షాసురసిద్ధసంఘాః= గంధర్వులయొక్కయు, యక్షులయొక్కయు, అసురులయొక్కయు, సిద్ధులయొక్కయు సమూహములును,

సర్వే ఏవ = వీరందరును, విస్మితాః = విస్మితులగుచు, త్వాం వీక్షన్తే= నిన్ను చూచుచున్నారు.

తా॥ ఏకాదశరుద్రులును,ద్వాదశాదిత్యులును,అష్టవసువులును, సాధ్యులు అనియెడు దేవతలును, విశ్వేదేవతలును,అశ్వినీదేవతలును, ఏడుగురుమరుత్తులును, పితృదేవతలును, గంధర్వులును,యక్షులును, రాక్షసులును, సిద్ధుల సముదాయములును అనునట్టి వారందఱును ఆశ్చర్యముగలవారై నిన్నే చూచుచున్నారు.

వి॥ అన్నము మొదలైన ఆహారవస్తువులు వేడిగానున్నపుడు భుజించువారు 'ఊష్మపుల'నబడెదరు. అట్లువేడివేడి పదార్థములను భుజించువారు పితృదేవతలు కాన పితృదేవతలకు 'ఊష్మపుల'ని పేరు.

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదమ్ ।
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్ ॥ 23

పద॥ రూపం - మహత్ - తే - బహువక్త్రనేత్రం - మహాబాహో ! బహుబాహూరుపాదం - బహూదరం - బహుదంష్ట్రాకరాళం - దృష్ట్వా - లోకాః - ప్రవ్యథితాః - తథా - అహమ్,

ప్రతి॥ హే మహాబాహో! = ఓ స్వామీ!, తే = నీయొక్క, బహువక్త్రనేత్రం = అనేకముఖములు నేత్రములు గలదియు, బహుబాహూరుపాదం=అనేకములైన చేతులు తొడలు పాదములు గలదియు, బహూదరం=అనేకములైన కడుపులు గలదియు, బహుదంష్ట్రాకరాళం =భయంకరములగు అనేకములైన కోరలు గలదియునగు, మహత్ రూపం=గొప్పరూపమును,దృష్ట్వా= చూచి, లోకాః =లోకులు, ప్రవ్యథితాః = మిగుల భయపడుచున్నారు, తథా = అలాగుననే, అహం = నేనుగూడ భయపడుచున్నాను.

తా॥ మహాబాహువులుగల ఓ ప్రభూ! అనేకములైన ముఖములు నేత్రములును గలదియు, అనేకములైన బాహువులు తొడలు పాదములును గలదియు, అనేకములైన కడుపులు గలదియు, అనేకములగు కోరపండ్లచేత భయంకరమైనదియు, పరిమితి లేనిదియు

నయిన నీయొక్కరూపమునుచూచి లోకములయందలి సకలప్రాణులు భయము జెందుచున్నారు. అటులనే నేనుగూడ భయపడుచున్నాను.

శ్లో॥ నభస్స్పృశం దీప్తమనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో! ॥ 24

పద॥ నభస్స్పృశం – దీప్తం–అనేకవర్ణం – వ్యాత్తాననం –దీప్తవిశాలనేత్రం – దృష్ట్వా–హి–త్వాం– ప్రవ్యథితాన్తరాత్మా – ధృతిం – న – విన్దామి – శమం – చ- విష్ణో !

ప్రతి॥ హే విష్ణో ! = ఓ విష్ణుమూర్తీ! నభస్స్పృశం=ఆకాశమండలమును దాకుచున్నవాడవును, దీప్తం = ప్రకాశించుచున్నవాడవును, అనేకవర్ణం=అనేక రంగులు గలవాడవును, వ్యాత్తాననం = తెరువబడిన నోరుగలవాడవును, దీప్త విశాలనేత్రం = జ్వలించుచున్న గొప్పనేత్రములు గలవాడవునగు, త్వాం దృష్ట్వా = నిన్నుచూచి, ప్రవ్యథితాన్తరాత్మా = దిగులు చెందిన మనస్సుగలవాడనై, ధృతిం = ధైర్యమును, శమం చ = శాంతిని, న విన్దామి హి = పొందకున్నానుగదా !

తా॥ సర్వవ్యాపకుడవగు ఓ కృష్ణా! ఆకాశమునంటియున్న వాడవును, జ్వలించుచున్నవాడవును, అనేకరంగులు గలవాడవును, బ్రహ్మాది నానావిధ విచిత్రరూపములతోగూడుకొన్నవాడవును, తెరువబడిన నోరుగలవాడవును, ప్రజ్వలించుచున్నవియు, విశాలములునైన నేత్రములు గలవాడవు నగు నిన్నుచూచి మిగుల భయమునొందిన మనస్సుగలవాడనగుచు ధైర్యమును, మనఃప్రసాదమును పొందకున్నానుగదా !

శ్లో॥ దంష్ట్రాకరాళాని చ తే ముఖాని, దృష్ట్వైవ కాలానలసన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ, ప్రసీద దేవేశ! జగన్నివాస!॥ 25

పద॥ దంష్ట్రాకరాళాని–చ–తే–ముఖాని–దృష్ట్వా - ఏవ - కాలానలసన్నిభాని - దిశః - న - జానె - న – లభే - చ - శర్మ - ప్రసీద – దేవేశ ! -జగన్నివాస !

ప్రతి॥ (కిం)చ=మఱియు, తే = నీయొక్క, దంష్ట్రాకరాళాని=కోరలచే భయంకరమైనవియు, కాలానలసన్నిభాని=ప్రళయాగ్నినిపోలియున్నవియునైన, ముఖాని=ముఖములను, దృష్ట్వా ఏవ=చూచినతోడనే, దిశః న జానే=దిగ్భ్రమ చెందియున్నాను, శర్మ చ న లభే=సుఖమునున్ను జెందకున్నాను. కాబట్టి, హే దేవేశ ! =ఓ దేవాదిదేవా!, హే జగన్నివాస! = ఓ జగన్నాయకా !, ప్రసీద=ప్రసన్నుడవగుము.

తా॥ కోరపండ్లచేత భయంకరములైనవియు, ప్రళయకాలమునందు లోకములను దహించుచున్నట్టి యగ్నితో సమానమైనవియునగు నీయొక్క ముఖములనుజూచి తూర్పు మొదలుగాగల దిక్కులనెఱుగకున్నాను, సుఖమునుగూడ పొందలేక యున్నాను, ఓ దేవేశా ! జగన్నివాసా ! అనుగ్రహింపుము. అనగా ప్రసన్నుడవగుము.

శ్లో॥ అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః ।
భీష్మో ద్రోణస్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥ 26

శ్లో॥ వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాళాని భయానకాని ।
కేచిద్విలగ్నా దశనాన్తరేషు
సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాంగైః ॥ 27

పద॥ అమీ–చ - త్వాం - ధృతరాష్ట్రస్య - పుత్రాః - సర్వే - సహ - ఏవ - అవనిపాలసంఘైః - భీష్మః - ద్రోణః - సూతపుత్రః - తథా - అసౌ-సహ-అస్మదీయైః - అపి - యోధముఖ్యైః- వక్త్రాణి - తే- త్వరమాణాః-విశన్తి - దంష్ట్రాకరాళాని - భయానకాని–కేచిత్ - విలగ్నాః - దశనాంతరేషు-సందృశ్యన్తే - చూర్ణితైః - ఉత్తమాంగైః.

ప్రతి॥ అమీ ధృతరాష్ట్రస్యపుత్రాః సర్వే = ఈ ధృతరాష్ట్రపుత్రులందఱును, అవనిపాలసంఘైః సహ ఏవ=ఇతర రాజసమూహములతోగూడ, తథా=అలాగుననే, అసౌ భీష్మః=ఈ భీష్ముడు, ద్రోణః=ద్రోణుడు, సూతపుత్రః చ=కర్ణుడును, అస్మదీయైః యోధముఖ్యైః అపి సహ=మనసైన్యములోని

యుద్ధ వీరులతోగూడను, త్వాం త్వరమాణాః=నిన్నుగూర్చి త్వరపడు చున్నవారై, దంష్ట్రాకరాళాని భయానకాని=కోరలచే క్రూరములును మిగుల భయంకరములుగాను నుండెడు,తే=నీయొక్క, వక్త్రాణి=నోళ్లను, విశన్తి=ప్రవేశించుచున్నారు. కేచిత్=కొందఱు, దశనాన్తరేషు = పండ్ల సందులందు, లగ్నాః=తగులుకొన్నవారై, చూర్ణితై ఉత్తమాంగైః = నలిగిపోయిన శిరస్సులతో, సందృశ్యన్తే=కనబడుచున్నారు.

తా॥ ధృతరాష్ట్రతనయులగు ఈ దుర్యోధనాదులందఱును, తమ సైన్యములోని సకల రాజసమూహములతోడను, ఆలాగుననే భీష్మద్రోణ కర్ణులును, యుద్ధవీరులగు మాసైనికులతోగూడ మిగుల త్వరగలవారలై కోరపండ్లచేత వికారరూపములైనవియు, భయంకర ములైనవియు నైన నీయొక్క ముఖములను ప్రవేశించుచున్నారు. అట్లు ప్రవేశించుచున్నవారిలో కొందఱు నీ పండ్ల సందులయందు దగులుకొనినవారై పొడిగాచేయబడిన శిరస్సులతో కనబడుచున్నారు.

శ్లో॥ యథా నదీనాం బహవోఽమ్బువేగా-
స్సముద్రమేవాభిముఖా ద్రవన్తి ।
తథా తవామీ నరలోకవీరా
విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి ॥ 28

పద॥ యథా - నదీనాం - బహవః - అమ్బువేగాః - సముద్రం - ఏవ - అభిముఖాః - ద్రవన్తి - తథా - తవ - అమీ - నరలోకవీరాః - విశన్తి - వక్త్రాణి - అభివిజ్వలన్తి.

ప్రతి॥ నదీనాం బహవః అమ్బువేగాః=అనేకనదుల ప్రవాహములు,యథా=ఏప్రకారముగా, సముద్రం ఏవ అభిముఖాః=సముద్రాభిముఖములయ్యే, ద్రవన్తి= పారుచున్నవో, తథా=ఆ ప్రకారముగానే, అమీ నరలోకవీరాః =ఈరాజు లందఱు, తవ = నీయొక్క, అభివిజ్వలన్తి వక్త్రాణి = మిక్కిలి ప్రజ్వలించు చున్న వదనములను, విశన్తి = ప్రవేశించుచున్నారు.

తా॥ నదులయొక్క యనేకములైన జలప్రవాహములు సము ద్రాభిముఖములైనవై యెటుల ప్రవహించుచున్నవో, అదేవిధముగా

ఈ మానవలోకవీరులందఱును మిక్కిలి ప్రజ్వలించుచున్న నీ వదన ములయందు ప్రవేశించుచున్నారు.

శ్లో॥ యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః ।
తథైవ నాశాయ విశన్తి లోకా-
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ 29

పద॥ యథా–ప్రదీప్తం – జ్వలనం – పతంగాః – విశన్తి – నాశాయ – సమృద్ధ వేగాః - తథా – ఏవ – నాశాయ – విశన్తి – లోకాః – తవ – అపి – వక్త్రాణి–సమృద్ధవేగాః.

ప్రతి॥ పతంగాః = మిడుతలు, నాశాయ=నశించుటకొఱకు, సమృద్ధవేగాః = అతి వేగముగలవై, ప్రదీప్తం జ్వలనం=మండుచున్న అగ్నిని. యథా విశన్తి = ఎట్లు ప్రవేశించుచున్నవో, తథా ఏవ = ఆ విధముగానే, లోకాః అపి = ఈ జనులుగూడ, నాశాయ=నశించుటకొఱకు, సమృద్ధవేగాః =అతివేగముగల వారై, తవ వక్త్రాణి=నీ వదనములను, విశన్తి = ప్రవేశించుచున్నారు.

తా॥ మిడుతలు తమ నాశముకొఱకు అతివేగము గలవై మండుచున్న అగ్నియందు ఎటుల ప్రవేశించుచున్నవో అట్లే దుర్యోధనుడు మొదలుగాగల యీ జనులుగూడ తమ నాశముకొఱకు నీ ముఖములయందు మిగుల వేగముగలవారై ప్రవేశించుచున్నారు.

శ్లో॥ లేలిహ్యసే గ్రసమానస్సమన్తా-
ల్లోకాన్సమగ్రాన్వదనైర్జ్వలద్భిః ।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో! ॥ 30

పద॥ లేలిహ్యసే - గ్రసమానః - సమన్తాత్ - లోకాన్ - సమగ్రాన్ - వదనైః - జ్వలద్భిః - తేజోభిః - ఆపూర్య - జగత్ - సమగ్రం - భాసః - తవ - ఉగ్రాః - ప్రతపన్తి - విష్ణో !

ప్రతి॥ హే విష్ణో!=సర్వవ్యాపివియైన ఓ శ్రీకృష్ణమూర్తీ!, జ్వలద్భిః = ప్రజ్వలించు చున్న, వదనైః= వదనములచేత, సమగ్రాన్ లోకాన్=సమస్త జనములను, గ్రసమానః=మ్రింగుచున్నవాడవై. సమన్తాత్ = అంతటను, లేలిహ్యసే=

ఆస్వాదించుచున్నావు, తవ=నీయొక్క, ఉగ్రాః = తీక్ష్ణములైన, భాసః = కిరణములు, తేజోభిః=కాంతులచేత, సమగ్రం జగత్ = సమస్త ప్రపంచమును, ఆపూర్య =వ్యాపించి, ప్రతపన్తి = మిక్కిలి తపింపజేయుచున్నవి.

తా॥ సర్వవ్యాపకుడవగు ఓ శ్రీకృష్ణమూర్తీ! మండుచున్న ముఖములచేత సమస్తజనులను మ్రింగుచున్నవాడవై యందఱిని అంతట నాస్వాదించుచున్నావు. నీయొక్క భయంకరములైన కాంతులు తేజస్సులు సమస్తమైన జగత్తును వ్యాపించి తపింపజేయుచున్నవి.

శ్లో॥ ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర! ప్రసీద ।
విజ్ఞాతు మిచ్ఛామి భవన్తమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥ 31

పద॥ ఆఖ్యాహి - మే - కః - భవాన్ - ఉగ్రరూపః - నమః - అస్తు - తే - దేవవర! - ప్రసీద - విజ్ఞాతుం - ఇచ్ఛామి - భవన్తం - ఆద్యం-న-హి-ప్రజానామి - తవ - ప్రవృత్తిమ్.

ప్రతి॥ హే దేవవర! = ఓ దేవదేవా!, ఉగ్రరూపః భవాన్ = ఉగ్రరూపుడవగు నీవు, కః = ఎవడవో, మే ఆఖ్యాహి = నాకు చెప్పుము, హి = ఏలయనగా తవ ప్రవృత్తిం=నీ ప్రవృత్తిని, న ప్రజానామి = ఎఱుంగకున్నాను గనుక, ఆద్యం భవన్తం = ఆదిపురుషుడవగు నిన్ను, విజ్ఞాతుం ఇచ్ఛామి=తెలియగోరుచున్నాను. తే = నీకు, నమః అస్తు = వందనమగుగాక!, ప్రసీద = అనుగ్రహింపుము (శాంతింపుము.)

తా॥ ఓ దేవదేవా ! ఉగ్ర రూపుడవగు నీవెవ్వడవో నాకు చెప్పుము. ఏలయనగా, నీ ప్రవర్తనమెఱుంగకున్నాను, కనుక ఆదిపురుషుడవగు నిన్ను తెలియగోరుచున్నాను. నీకు వందనమగు గాక! అనుగ్రహింపుము.

శ్రీ భగవానువాచ:—శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః ।

ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ 32

పద॥ కాలః – అస్మి - లోకక్షయకృత్ - ప్రవృద్ధః - లోకాన్ - సమాహర్తుం- ఇహ - ప్రవృత్తః - ఋతే - అపి - త్వాం - న - భవిష్యన్తి - సర్వే - యే- అవస్థితాః - ప్రత్యనీకేషు - యోధాః.

ప్రతి॥ అహం – నేను, లోకక్షయకృత్ = జననాశము చేయువాడనై, ప్రవృద్ధః = ప్రబలినట్టి, కాలః అస్మి = కాలుడనైయున్నాను, ఇహ = ఇచ్చట (ఈ యుద్ధభూమియందు చేరియున్న), లోకాన్=జనులను, సమాహర్తుం = సంహరించుటకొఱకు, ప్రవృత్తః=ప్రవర్తించినవాడను, ప్రత్యనీకేషు=ఎదుటి సైన్యములందు, యే యోధాః =ఏ యోధులు, అవస్థితాః= ఉన్నారో, సర్వే = వారందఱు, త్వాం ఋతే అపి = నిన్ను విడిచియును, (నీచే విడువబడియు), న భవిష్యన్తి = జీవింపబోరు.

తా॥ నేను జననాశనము చేయుటకై, ప్రబలిన (వృద్ధినొందిన) కాలుడనైయున్నాను. ఈ యుద్ధభూమియందు చేరియున్న జనులను సంహరించుట కొరకు ప్రవృత్తుడనైయున్నాను.ఎదుటి సైన్యములందు ఏ యోధులున్నారో వారు నీచే విడువబడినను జీవింపజాలరు. అనగా కాలముచే నశింపజేయబడెదరు.

వి॥ 31-వ శ్లోకములో నీవెవడవు? అనిఅడిగిన ప్రశ్నకు సమాధానముగా 'నేను సంహారమూర్తి' నని యిచట తెలుపడమైనది. మీ ప్రవృత్తి యేమి యని తెలియుట లేదనుదానికి జవాబు 'భూభారమణచుటయే నా ప్రవృత్తి' యని తెలుపడమైనది.

శ్లో॥ తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్! ॥ 33

పద॥ తస్మాత్ - త్వం - ఉత్తిష్ఠ - యశః-లభస్వ-జిత్వా-శత్రూన్-భుంక్ష్వ - రాజ్యం - సమృద్ధం - మయా - ఏవ - ఏతే - నిహతాః - పూర్వం - ఏవ - నిమిత్తమాత్రం - భవ - సవ్యసాచిన్!

ప్రతి॥ ఏతే = వీరలు, పూర్వం ఏవ = ఇదివఱకే, మయా ఏవ = నాచేతనే, విహతాః = చంపబడిరి, తస్మాత్=కాబట్టి, హే సవ్యసాచిన్=ఓ యర్జునా! త్వం = నీవు, నిమిత్తమాత్రం = నిమిత్తమాత్రముగా, భవ = అగుము, శత్రూన్ జిత్వా = శత్రువులను జయించి, యశః లభస్వ = యశస్సు నొందుము. సమృద్ధం రాజ్యం= నిష్కంటకమైన రాజ్యమును, భుంక్ష్వ= అనుభవింపుము. ఉత్తిష్ఠ = యుద్ధమునకు లెమ్ము.

తా॥ వీరలిదివరకే నాచేత హననము గావింపబడిరి. కాబట్టి ఓ యర్జునా! నీవు నిమిత్తమాత్రుడవుకమ్ము. శత్రువులను జయించి యశస్సును బడయుము.నిష్కంటకమైన రాజ్యమును అనుభవింపుము. యుద్ధమునకు లెమ్ము.

వి॥ భక్తులపై భగవంతునికి గల కరుణా విశేష మిచ్చట చూపడమైనది. అర్జునుడెక్కడ? భీష్మ ద్రోణ కర్ణాదు లెక్కడ? వీరందఱు భగవంతునిచేతనే చంపబడిన వారైనను, ఇట్టి మహావీరుల నీవు వధించినట్లు మహాయశస్సును పొందుమనిరి. ఈలాగున కొందఱు భక్తులు ఎట్టి గొప్పధనవంతులుగాని అధికారులుగాని చేయలేని మహాకార్యమును చేయుదురు. అట్టి శక్తి భగవంతునిదై యున్నది. అయినను భక్తులకు యశస్సు కావలెనని తలంచి భగవంతుడాలాగున చేయుచుండును. అందువలన అట్టి మహనీయులపై జనులకు విశ్వాసము గలిగిన, తరించుట కవకాశమేర్పడును. కావున నిట్టి విషయములలో భక్తులు నిమిత్తమాత్రులేయని తెలిసికొనిన భగవంతునికి దూరులుగారు. అట్లుగాక తమ తపోబలమో, జ్ఞానబలమో, యోగబలమో యనితలంచిరేని పతితులగుదురు.

శ్లో॥ ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్ ।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ 34

పద॥ ద్రోణం - చ - భీష్మం - చ - జయద్రథం - చ - కర్ణం - తథా -అన్యాన్- అపి - యోధవీరాన్ - మయా – హతాన్ – త్వం – జహి – మా వ్యథిష్ఠాః – యుధ్యస్వ – జేతాసి – రణే – సపత్నాన్.

ప్రతి॥ మయాహతాన్ = నాచే హతులైన, ద్రోణం చ = ద్రోణుని, భీష్మం చ = భీష్ముని, జయద్రథం చ = జయద్రథుని, కర్ణం = కర్ణుని, తథా=అలాగు

ననే, అన్యాన్ యోధవీరాన్ అపి= తక్కిన యోధ వీరులనుగూడ, త్వం జహి = నీవు చంపుము, మా వ్యథిష్ఠాః = భయపడకుము, యుధ్యస్వ = యుద్ధము చేయుము, రణే=యుద్ధమునందు, సపత్నాన్= నీ శత్రువులను, జేతాసి = జయింప గలవు.

తా॥ నాచే ఇదివఱకే చంపబడిన ద్రోణాచార్యుని, భీష్ముని, సైంధవుని, కర్ణుని అలాగుననే మిగిలిన యుద్ధవీరులను సయితము నీవు నిమిత్తమాత్రుడవై చంపుము, ఆ శత్రువుల వలన భయము నొందకుము. యుద్ధము జేయుము. యుద్ధమునందు శత్రువులను తప్పక జయింప గలవు.

సంజయ ఉవాచ - సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలిర్వేపమానః కిరీటీ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ 35

పద॥ ఏతత్–శ్రుత్వా–వచనం–కేశవస్య–కృతాంజలిః – వేపమానః – కిరీటీ–నమస్కృత్వా–భూయః– ఏవ–ఆహ – కృష్ణం – సగద్గదం – భీతభీతః–ప్రణమ్య.

ప్రతి॥ కేశవస్య = శ్రీకృష్ణమూర్తియొక్క, ఏతత్ వచనం = ఈ వాక్యమును, శ్రుత్వా = విని, కిరీటీ = అర్జునుడు, వేపమానః = వణకుచున్నవాడును, కృతాంజలిః = ముకుళిత కరములు గలవాడునునై, కృష్ణం = శ్రీకృష్ణునికి, నమస్కృత్వా = నమస్కరించి, భీతభీతః = మిక్కిలి భయ పడినవాడై, ప్రణమ్య = (నమ్రుడై) నమస్కరించి, సగద్గదం = గద్గద కంఠముతో, భూయః ఏవ=మఱల, ఆహ = (ఇట్లు) పలికెను.

తా॥ శ్రీకృష్ణమూర్తి యొక్క యీ వాక్యమునువిని యర్జునుడు వణకుచున్నవాడును,ముకుళితహస్తుడునునై శ్రీకృష్ణునికి నమస్కరించి మిక్కిలి భయపడిన వాడగుచు నమ్రుడై గద్గదకంఠముతో మఱల నిట్లు పలికెను.

శ్లో॥ స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।

రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః ॥ 36

పద॥ స్థానే – హృషీకేశ! – తవ – ప్రకీర్త్యా – జగత్ – ప్రహృష్యతి – అను రజ్యతే–చ – రక్షాంసి – భీతాని – దిశః – ద్రవన్తి – సర్వే–నమస్యన్తి– చ – సిద్ధసంఘాః.

ప్రతి॥ హే హృషీకేశ! = ఓ శ్రీకృష్ణమూర్తీ! తవ=నీ యొక్క, ప్రకీర్త్యా=మాహాత్మ్యమును కొనియాడుటచేత, జగత్ = జగత్తు, ప్రహృష్యతి= సంతోషించుచున్నది, అనురజ్యతే చ = అనురాగమును పొందుచున్నది, రక్షాంసి = రాక్షసులు, భీతాని = భయభ్రాంతులై, దిశః = నాల్గుదిక్కులను గూర్చి, ద్రవన్తి = పరుగిడుచున్నారు, సర్వే = సమస్తములైన, సిద్ధసంఘాః = సిద్ధసమూహములు, నమస్యన్తి చ=నమస్కరించుచున్నవి, ఇవియన్నియు, స్థానే = నీకు తగియున్నవి.

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! నీయొక్క మాహాత్మ్యమును కొనియాడుటచేత ప్రపంచము అధికముగా సంతోషించుచున్నది.మఱియు అనురాగమును పొందుచున్నది. రాక్షసులు భయమును పొందినవారై దిగంతములకు పరుగిడుచున్నారు.సకల సిద్ధసముదాయములు నీ మాహాత్మ్యమును వినుటచేత, నమస్కరించుచున్నారు. ఇవి యన్నియు తగియే యున్నవి.

శ్లో॥ కస్మాచ్చ తే న న మేరన్మహాత్మన్!
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే।
అనన్త! దేవేశ! జగన్నివాస!
త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥ 37

పద॥ కస్మాత్ – చ – తే – న – నమేరన్ – మహాత్మన్ – గరీయసే – బ్రాహ్మణః–అపి–ఆదికర్త్రే– అనన్త! – దేవేశ! – జగన్నివాస! – త్వం – అక్షరం – సత్ – అసత్ – తత్ – పరం – యత్.

ప్రతి॥ మహాత్మన్ ! = ఓమహాత్మా!, బ్రహ్మణః అపి = సృష్టికర్తయగు చతుర్ముఖ బ్రహ్మకుకూడ, ఆదికర్త్రే = ఆదికారణుడవైనట్టియు, గరీయసే = గొప్పవాడవునైన, తే=నీకు కస్మాత్=ఏల, న నమేరన్= నమస్కరింపకుందురు?

హే అనన్త=ఓ నాశరహితుడా! హేదేవేశ=ఓదేవాధిదేవా!, హేజగన్నివాస! =ఓ జగదంతర్యామీ!, సత్=సత్పదార్థమును, అసత్=అసత్పదార్థమును పరం చ=ఆ రెండింటికిని పరమైనదియును, యత్=ఏదిగలదో, తత్= అట్టి, అక్షరం=నాశరహితమైన పరబ్రహ్మవు, త్వం=నీవేయై యున్నావు.

తా॥ ఓ మహాత్మా! సృష్టికర్తయగు చతుర్ముఖ బ్రహ్మకుకూడ ఆది కారణుడవును గొప్పవాడవునైన నీకు సిద్ధపురుషులు మొదలైన వారు ఏల నమస్కరింపరు? ఏలన అనంతమూర్తీ! దేవదేవా!, జగదంతర్యామీ! సత్ పదార్థమును, అసత్ పదార్థమును ఆరెంటికిని, పరమైనదేదిగలదో, అట్టి నాశరహితమగు పరబ్రహ్మవు నీవే అయి యున్నావు.

వి॥ సత్ = అనగా కార్యరూపముగా గనిపించెడు లోకము,అసత్=అనగా నీ కనిపించెడు లోకమునకు కారణమగు అవ్యక్తతత్త్వము అనగా మూలప్రకృతి ఈ రెండింటికి పరమైనవాడు పరమాత్మ లేక 'సత్'అనగా జీవుడు 'అసత్'అనగా దేహము. జీవదేహములకు పరమైనవాడు పరమేశ్వరుడు. కావుననే చిద్రూపు డగు జీవునికిని, అచిద్రూపమగు జగత్తునకును విశిష్టః = విలక్షణుడు,సర్వేశ్వ రుడు చిద చిద్విశిష్టుడని అంగీకరించుటచేతనే విశిష్టాద్వైతులని పేరు వచ్చినది

శ్లో॥ త్వమాదిదేవః పురుషః పురాణ-
స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనన్తరూప ! ॥ 38

పద॥ త్వం—అదిదేవః - పురుషః - పురాణః - త్వం —అస్య - విశ్వస్య - పరం- నిధానం - వేత్తా - అసి-వేద్యం - చ - పరం - చ - ధామ—త్వయా - తతం - విశ్వం — అనన్తరూప !.

ప్రతి॥ హే అనన్తరూప !=అనన్తరూపుడవగు ఓ శ్రీకృష్ణమూర్తీ!, త్వం = నీవు, ఆదిదేవః=దేవతలలో మొదటివాడవు, పురాణః పురుషః=పురాణపురుషు డవు. అస్య విశ్వస్య=ఈప్రపంచమునకు, త్వం=నీవు, పరం నిధానం= పరమావధివి, వేత్తా=సమస్తము నెఱింగినవాడవును, వేద్యం చ=జ్ఞానులచే నెఱుగదగినవాడవును, పరం ధామ చ = పరమపదమును, త్వం(ఏవ)

అసి=నీవేయైయున్నావు, విశ్వం = ఈప్రపంచమంతయు, త్వయా = నీచేత, తతం=వ్యాపింపబడియున్నది.

తా॥ అనంతరూపుడవగు ఓ శ్రీకృష్ణమూర్తీ! సకల లోకము లను సృజించువాడవగుటచేత నీవే యాదిదేవుడవై యున్నావు. నీవే పురాణపురుషుడవు. నీవే యీ ప్రపంచమునకు సర్వమునకును నివసింపదగిన స్థానమైనవాడవు. నీవే సర్వమును తెలిసికొన్నవాడవు. నీవే జ్ఞానులచే తెలియదగినవాడవుగను, నీవే సర్వోత్తమమును పొందతగినదియు నయిన స్థానమున నున్నావు. నీ చేతనే యీ ప్రపంచమంతయును వ్యాపింపబడియున్నది.

శ్లో॥ వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే॥ 39

పద॥ వాయుః – యమః–అగ్నిః – వరుణః–శశాంకః – ప్రజాపతిః - త్వం - ప్రపితామహః–చ - నమః - నమః - తే - అస్తు – సహస్రకృత్వః-పునః–చ–భూయః – అపి – నమః – నమః - తే.

ప్రతి॥ త్వం=నీవు, వాయుః=వాయువును, యమః = యముడవును, అగ్నిః = అగ్నివియును, వరుణః=వరుణుడవును, శశాంకః=చంద్రుడవును, ప్రజాపతిః చ=చతుర్ముఖ బ్రహ్మయును, ప్రపితామహః = ఆ బ్రహ్మకు తండ్రివియును అయియున్నావు, తే= నీకు సహస్రకృత్వః=వెయ్యిమార్లు, నమః నమః అస్తు = నమస్కారములగుగాక, పునః చ భూయః అపి=మఱల మఱల, తే = నీకు, నమః నమః = నమస్కారము, నమస్కారము.

తా॥ నీవు వాయువును, యముడవును, అగ్నిదేవుడవును, వరుణదేవుడవును, హిరణ్యగర్భుడవును, చతుర్ముఖ బ్రహ్మయొక్క తండ్రియును నగుచున్నావు. నీకు వేయి పర్యాయములు నమస్కారములు. మఱియు మాటిమాటికిని నమస్కారములను జేయుచున్నాము,

శ్లో॥ నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ!
అనన్తవీర్యామితవిక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః॥ 40

పద॥ నమః - పురస్తాత్ - అథ - పృష్ఠతః - తే - నమః - అస్తు - తే-సర్వతః - ఏవ - సర్వ! - అనంతవీర్యామితవిక్రమః - త్వం - సర్వం - సమాప్నోషి - తతః - అసి - సర్వః.

ప్రతి॥ తే=నీకు, పురస్తాత్ = ఎదుటను, అథ = మఱియును, పృష్ఠతః = వెనుకను, నమః = నమస్కారమగుగాక!· హే సర్వ! = సర్వస్వరూపుడవగునో స్వామీ!, తే=నీకు, సర్వతః ఏవ= అన్నిదిక్కులగూడ, నమః అస్తు= నమస్కారమగుగాక!, అనంతవీర్యామితవిక్రమః=అమితశౌర్య పరాక్రమములుగల, త్వం = నీవు, సర్వం సమాప్నోషి = సర్వమును వ్యాపించియున్నావు, తతః = ఆ కారణమువలన, సర్వః అసి = సర్వస్వరూపుడవైయున్నావు,

తా॥ సర్వస్వరూపుడవగు ఓ శ్రీకృష్ణమూర్తీ ! ముందట, వెనుకను, సర్వదిక్కులయందును వ్యాపించి యున్న నీకు నమస్కారము చేయుచున్నాను. అపరిమితమైన వీర్యమును పరాక్రమమును గల నీవు సర్వమును లెస్సగా వ్యాపించియున్నావు. కావున నీవు సర్వస్వరూపుడవు,

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ! హే యాదవ !హే సఖేతి ।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాఽపి ॥ 41

శ్లో॥ యచ్చావహాసార్థమసత్కృతోఽసి
విహారశయ్యాసనభోజనేషు ।
ఏకోఽథవాఽప్యచ్యుత ! తత్సమక్షం
తత్క్షామయే త్వామహమప్రమేయమ్ ॥ 42

పద॥ సఖా - ఇతి - మత్వా - ప్రసభం - యత్ - ఉక్తం - హే కృష్ణ! - హే యాదవ! - హే సఖా! - ఇతి - అజానతా - మహిమానం - తవ - ఇదం - మయా - ప్రమాదాత్ - ప్రణయేన - వా - అపి - యత్ చ - అపహాసార్థం - అసత్కృతః - అసి - విహారశయ్యాసనభోజనేషు -ఏకః- అథవా - అపి - అచ్యుతః - తత్ - సమక్షం - తత్ - క్షామయే - త్వాం - అహం - అప్రమేయమ్.

ప్రతి॥ **తవ** = నీయొక్క, ఇదం = ఈ విశ్వరూపమును, మహిమానం=మాహాత్మ్యమును, అజానతా = తెలియని, మయా=నాచేత, ప్రమాదాత్=ప్రమాదము వలనగాని (అలక్ష్యముచే), ప్రణయేన వా అపి =చిరపరిచయముచేతగాని, సఖా ఇతి = సమాన వయస్కుడవని, మత్వా = తలంచి, హే కృష్ణ! = ఓ కృష్ణా !, హే యాదవ! =ఓ యదునందనా!, హే సఖా! = ఓ స్నేహితుడా!. ఇతి = ఇట్లని, ప్రసభం = అలక్ష్యముగా ఆలోచింపక, యత్ = ఏ వాక్యము, ఉక్తం=చెప్పబడెనో. (కిం) చ =మఱియు, హే అచ్యుత! = ఓ శ్రీకృష్ణమూర్తీ!, విహారశయ్యాసన భోజనేషు = నడక పడక ఆసనము భోజనము వీటియందును, ఏకః = ఒక్కడవుగానున్నప్పుడుగాని, అథవా= అట్లుగాక (లేక), సమక్షం = ప్రత్యక్షముగాగాని, తత్ = అట్లు అవమానము గలుగునట్లుగా, అపహాసార్థం=పరిహాసమునకై,అసత్ కృతః అసి ఇతి యత్ = అవమానింపబడితి వనునది యేదిగలదో, తత్ = అట్టి యపరాధమును, అప్రమేయం=ప్రమాణాతీతుడవగు, త్వాం=నిన్ను, అహం = నేను, క్షామయే = క్షమింప వేడుచున్నాను.

తా॥ నీయొక్క విశ్వరూపమును, మాహాత్మ్యమును తెలిసికొనలేని నేను పొరబాటునగాని, చిరకాల పరిచయముచేగాని, లేక ప్రీతిచేగాని సమాన వయస్కుడవని తలచి ఓ నల్లవాడా! కృష్ణా! గొల్లవాడా! యదునందనా! స్నేహితుడా! అని నిర్లక్ష్యముగా నాలోచింపక ధుడుకుదనముతో నేది బలికితినో,మఱియు విహారశయ్యాసన భోజనములందు సఖులు మొదలగువారు లేకుండగజూచి ఏకాంతమునందుగాని, లేక అందఱియెదుటగాని, పరిహాసము చేయుటకొఱకై నిన్నెపు డెపు డవమానించియుంటినో ఆ తప్పిదముల నన్నిటిని మన్నింపుమని వేదముల కతీతుడవగు నిన్ను ప్రార్థించుచున్నాను.

శ్లో॥ పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్య ప్రతిమప్రభావ! ॥ 43

పద॥ పితా – అసి – లోకస్య – చరాచరస్య – త్వం – అస్య – పూజ్యః – చ – గురుః – గరీయాన్ – న – త్వత్సమః – అస్తి – అభ్యధికః – కుతః – అన్యః – లోకత్రయే – అపి – అప్రతిమప్రభావ!.

ప్రతి॥ హే అప్రతిమప్రభావ! = ఓ అసమాన ప్రభావముగలవాడా! త్వం = నీవు, అస్య = ఈ, చరాచరస్య = చరాచరాత్మకమగు, లోకస్య = ప్రపంచమునకు, పితా = తండ్రియును, పూజ్యః = పూజ్యుడవును, గురుః = గురువును, గరీయాన్ చ = శ్రేష్ఠుడవును, అసి = అయియున్నావు, లోకత్రయే అపి = త్రిభువనముల యందును, త్వత్సమః = నీతో సమానుడు, న అస్తి = లేడు, అభ్యధికః = నీకంటె యధికుడైనవాడు, అన్యః = మఱియొకడు, కుతః = మఱియేడి !

తా॥ ఓ కృష్ణమూర్తీ! నీవు చరాచరాత్మకమగు ఈ జగత్తునకు తండ్రియును, పూజ్యుడవును, గురువును, శ్రేష్ఠుడవును అయియున్నావు. త్రిభువనముల యందును నీతో సమానుడు లేడు. ఇక నీకంటే నధికుడైనవాడు మఱియొక డెట్లుండును !

శ్లో॥ తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్ ॥ 44

పద॥ తస్మాత్ - ప్రణమ్య - ప్రణిధాయ - కాయం - ప్రసాదయే త్వాం - అహం - ఈశం - ఈడ్యం - పితా - ఇవ - పుత్రస్య - సఖా -ఇవ - సఖ్యుః - ప్రియః - ప్రియాయాః - అర్హసి - దేవ! - సోఢుమ్.

ప్రతి॥ తస్మాత్ = కాబట్టి, అహం = నేను, కాయం = శరీరమును. ప్రణిధాయ= క్రిందవైచి (సాష్టాంగముగా), ప్రణమ్య=నమస్కరించి, ఈశం= ప్రభుడవైనట్టియు, ఈడ్యం = స్తోత్రార్హుడవైనట్టియు, త్వాం= నిన్ను, ప్రసాదయే= క్షమింప ప్రార్థించుచున్నాను, హే దేవ! = ఓ స్వామీ! పుత్రస్య=పుత్రుని యొక్క తప్పును, పితా ఇవ = తండ్రివలెను, సఖ్యుః = చెలికానియొక్క తప్పును, సఖా ఇవ = చెలికానివలెను, ప్రియాయాః= ప్రియురాలియొక్క తప్పును, ప్రియః = ప్రియునివలెను, (నాయొక్క తప్పును) సోఢుం = క్షమించుటకు నీవే, అర్హసి = తగుచున్నావు.

---

*ఇచట సంధి వ్యాకరణ విరుద్ధముగానున్నను ఋషిప్రయుక్తముగాన సాధువే, "ప్రియాయ అర్హసి" అని రామానుజుల వ్యాఖ్యలోగలదు, వివరణ అందే చూచునది.

తా॥ కావున ఓ శ్రీకృష్ణమూర్తీ! పుత్రుని యపరాధమును తండ్రివలెను,చెలికాని యపరాధమును మిత్రునివలెను, భార్యయొక్క యపరాధమును భర్తవలెను నా యపరాధమును క్షమింప నీవేతగిన వాడవు. నిరతిశయమహిమ గలవాడవగుటవలన ఈశ్వరుడవును, స్తోత్రము చేయుటకు తగినవాడవు నయిన నీకు సాష్టాంగ నమస్కారములుచేసి క్షమింపుమని ప్రార్థించుచున్నాను.

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే !
తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస ! ॥ 45

పద॥ అదృష్టపూర్వం - హృషితః - అస్మి - దృష్ట్వా - భయేన - చ - ప్రవ్యథితం - మనః - మే - తత్ - ఏవ - మే - దర్శయ - దేవ ! - రూపం - ప్రసీద - దేవేశ! - జగన్నివాస!.

ప్రతి॥ అదృష్టపూర్వం=మును పెప్పుడు చూడని ఈ విశ్వరూపమును,దృష్ట్వా= చూచి=, హృషితః అస్మి = ఆనందించిన వాడనగుచున్నాను, (కిం) చ = మఱియు, మే మనః = నామనస్సు. భయేన ప్రవ్యథితం = భయముచే మిగుల వ్యథనుకూడ చెందుచున్నది, హేదేవ! = ఓ స్వామీ!, మే= నాకు, తత్ రూపం ఏవ = మునుపటి రూపమునే, దర్శయ = చూపుము, హే దేవేశ! = ఓ దేవాధిదేవా!, హే జగన్నివాస! = ఓ జగదంతర్యామీ!, ప్రసీద = అనుగ్రహింపుము.

తా॥ ఓ శ్రీ కృష్ణమూర్తీ! ఇదివరకెన్నడును చూడని నీ విశ్వరూపమును చూచి సంతోషించుచున్నాను. కాని నాయొక్క మనస్సు భయముచే వణకుచున్నది. కాన ఓ దేవాధిదేవా! జగదంతర్యామీ, ప్రసన్నమగు ఆ మునుపటి రూపమునే చూపుము. అనుగ్రహింపుము.

శ్లో॥ కిరీటినం గదినం చక్రహస్త-
మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే! ॥ 46

పద॥ కిరీటినం–గదినం – చక్రహస్తం – ఇచ్ఛామి – త్వాం – ద్రష్టుం –అహం– తథా–ఏవ–తేన – ఏవ – రూపేణ – చతుర్భుజేన – సహస్రబాహో ! – భవ–విశ్వమూర్తే!

ప్రతి॥ కిరీటినం =కిరీటమును ధరించినట్టియు,గదినం = గదను ధరించినట్టియు, చక్రహస్తం = చక్రమును హస్తమున ధరించి నట్టియు, త్వాం = నిన్ను, తథా ఏవ = మునుపటివలెనే, ద్రష్టుం = చూచుటకు, అహం ఇచ్ఛామి = నేను కోరుచున్నాను. (కాబట్టి) సహస్రబాహో= వేయి భుజములు గలవాడా!, హే విశ్వమూర్తే! = ఓ విశ్వరూపుడా !, చతుర్భుజేన = నాల్గుభుజములుగల, తేన రూపేణ ఏవ = ఆ మునుపటి రూపముతోనే, భవ = ఉండుము, (అగుము.)

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! కిరీటముగలవాడవును,గదాయుధము గలవాడవును, చక్రాయుధము గలవాడవునగు నిన్ను మునుపటివలెనే చూడగోరుచున్నాను. కావున అనన్తబాహువులుగల ఓ విశ్వస్వరూపా! నాలుగు భుజములుగల ఆ మునుపటిరూపము గలవాడవగుము.

వి॥ చతుర్భుజములతోను, శంఖచక్రగదాపద్మములతోను,కిరీటముతోను అర్జునుడు ఇదివరలో శ్రీకృష్ణుని ఎప్పుడు చూచినాడు?అని సంశయముకొందఱికి గలుగును. వసుదేవునిపుత్రుడై దేవకీదేవి గర్భమున జన్మించినపుడు పై చెప్పిన విష్ణుచిహ్నములుండెను. ఆదర్శనము బాల ప్రసన్నమైనదిగాను దేవకీవసుదేవు లకు మిక్కలి యానందకరమ్ముగా నుండెను. దానిని అర్జునుడు వినియుండ వచ్చును. లేక మునుపటి రూపమని చెప్పుటచే శ్రీ వైకుంఠమందెట్లు శంఖచక్ర గదా పద్మకిరీటములతో నుండి నారదాది మహర్షులకు ప్రసన్న రూపమునుదర్శిం పచేసి యుండెనో, దానినిన్ని అర్జునుడు వినియుండుటచే అట్టిరూపమును జూపు మనియైనను అనియుండవచ్చును. లేక యిది వరలో మనుష్యరూపముగా,స్నేహి తుడుగా తలంపబడియుండిన శ్రీకృష్ణుడు ఇప్పుడు విశ్వరూపమును ధరించి నందుచేత యథార్థముగా నితడు మనుజుడు గాడు. సాక్షాత్ శ్రీమన్నారాయణ మూర్తియే. యను విశ్వాసము గలిగినందుచే ఆవిష్ణువు సత్త్వగుణముతోగూడి ప్రసన్నాకారముతో కూడియుండునని వినియుండుటచే అట్టి రూపమును చూప మనియైనను అర్జునుడు ప్రార్థించి యుండవచ్చును.

శ్రీ భగవానువాచ:— శ్రీ భగవంతుడు చెప్పెను,

శ్లో॥ మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్ !
తేజోమయం విశ్వమనన్తమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥ 47

పద॥ మయా - ప్రసన్నేన – తవ – అర్జున! - ఇదం – రూపం - పరం - దర్శితం - ఆత్మయోగాత్ - తేజోమయం - విశ్వం – అనన్తం - ఆద్యం- యత్ – మే - త్వదన్యేన - న - దృష్టపూర్వమ్.

ప్రతి॥ హేఅర్జున ! =ఓ అర్జునా !, ప్రసన్నేన మయా=ప్రసన్నుడనగు నాచేత, ఇదం పరం రూపం=ఈ సర్వోత్తమమైన రూపము, ఆత్మయోగాత్ = నా యోగబలమువలన, తవ=నీకు, దర్శితం=చూపబడినది, తేజోమయం= తేజోమయమైనదియు, విశ్వం=ప్రపంచస్వరూపమైనదియు. అనన్తం= అంతము లేనిదియు, ఆద్యం = మొదటనున్నదియు. మే = నాయొక్క, యత్=ఏ రూపముగలదో, తత్=ఆ రూపము, త్వదన్యేన=నీకంటె నితరునిచే, న దృష్టపూర్వం = మునుపెప్పుడును చూడబడలేదు.

తా॥ ఓ అర్జునా! ప్రసన్నుడనగు అనగా నిన్ననుగ్రహింప తలంపుగల నేను నా యోగమహిమవలన నీకు నా లోకోత్తరస్వరూపమును చూపితిని. తేజోమయమైనదియు, ప్రపంచస్వరూపమైనదియు, అంతము లేనిదియు, మొదట నున్నదియు నగు నా యీ రూపమును నీకంటె నితరులు మును పెప్పుడును చూచియుండలేదు.

శ్లో॥ న వేదయజ్ఞా ధ్యయనైర్నదానై -
ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।
ఏవం రూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ! ॥ 48

పద॥ న - వేదయజ్ఞాధ్యయనైః - దానైః - న – చ క్రియాభిః - న - తపోభిః - ఉగ్రైః - ఏవం-రూపః - శక్యః - అహం - నృలోకే -ద్రష్టుం- త్వదన్యేన-కురుప్రవీర !.

ప్రతి॥ హే కురుప్రవీర ! =ఓ యర్జునా!, ఏవంరూపః=ఇట్టిరూపముగల,అహం=నేను, నృలోకే = మర్త్యలోకమునందు, త్వదన్యేన=నీకంటె నితరునిచేత, వేదయజ్ఞాధ్యయనైః=వేదపాఠము యజ్ఞము అధ్యయనము వీని నాచరించుట వ ౹న, ద్రష్టుం=చూచుటకు, న శక్యః=సాధ్యపడువాడనుగాను, దానైః=దానములు చేయుటచేత, న=చూచుటకు సాధ్యపడువాడనుగాను, క్రియాభిః=శ్రౌతస్మార్తనిత్య నైమిత్తికాది కర్మల నాచరించుట వలన, న=చూడ సాధ్య పడువాడను కాను, ఉగ్రైః తపోభిః చ=ఉగ్రములగు తపస్సులను చేయుటవలనను, న=చూచుటకు సాధ్యపడువాడను కాను.

తా॥ కౌరవశ్రేష్ఠుడవగు ఓ అర్జునా ! ఇటువంటి విశ్వరూపము గల నన్ను నీకంటె నితరు లెవ్వరును జూచియుండలేదు. మఱియును ఋగాదివేదములను అధ్యయనము చేయుటచేతగాని, యజ్ఞాది కర్మల నాచరించుటచేతగాని, యజ్ఞాదికర్మల విధించెడు కల్పసూత్రముల పఠించుట చేతగాని, దానములు చేయుటచేతగాని, శ్రౌతస్మార్తాగ్ని హెూత్రాదికర్మలచేతగాని, భయంకరములైన కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులు చేయుటచేగాని నన్ను చూచుటకు శక్యముగాదు.

వి॥ ఇక దేనివలన భగవత్స్వరూపము చూడదగుననిన నిర్మలమైన భక్తి ఒక్కదానివల్లనే చూచుటకు సాధ్యమగును. భక్తిలేని కర్మకలాపములన్నియు వర్షము లేని కృషివలె ఫలమును గలుగజేయజాలవు.

శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మ మేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ 49

పద॥ మా - తే - వ్యథా - మా - చ - విమూఢభావః - దృష్ట్వా - రూపం - ఘోరం - ఈదృక్ - మమ - ఇదం - వ్యపేతభీః - ప్రీతమనాః - పునః - త్వం - తత్ - ఏవ - మే - రూపం - ఇదం - ప్రపశ్య.

ప్రతి॥ ఈదృక్ ఘోరం = ఇట్టి భయంకరమైన, మమ ఇదం రూపం=నా యీ, రూపమును, దృష్ట్వా = చూచి, తే వ్యథా మా = నీకు భయమువలదు

విమూఢభావః చ మా = మూఢత్వమును వలదు, త్వం=నీవు,వ్యపేతభీః= నిర్భయుడవును. ప్రీతమనాః = ప్రీతినొందిన మనస్సుగలవాడవునై, మే=నాయొక్క, తత్ ఇదం రూపం ఏవ=ఇప్పుడు నేను ధరించబోయెడు పూర్వరూపమునే, పునః ప్రపశ్య=మఱల చూడుము.

తా॥ అట్టి భయంకరమైనదగు నాయొక్కయీ విశ్వరూపమును చూచి నీవు భయమును పొందకుము. చిత్తవ్యాకులము కలవాడవు గాకుము. నీవు భయరహితుడవును, సంతోషాన్విత మనస్సుగలవాడవునై పూర్వము నేను ధరించియుండిన రూపమునే లెస్సగా చూడుము.

సంజయ ఉవాచ.—సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః ।
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా ॥ 50

పద॥ ఇతి - అర్జునం - వాసుదేవః — తథా - ఉక్త్వా - స్వకం - రూపం — దర్శయామాస — భూయః - ఆశ్వాసయామాస - చ - భీతం - ఏనం - భూత్వా - పునః - సౌమ్యవపుః - మహాత్మా.

ప్రతి॥ వాసుదేవః =శ్రీకృష్ణమూర్తి, అర్జునం = అర్జునునిగూర్చి, ఇతి ఉక్త్వా= ఇట్లు చెప్పి, తథా = అలాగుననే, భూయః = మఱల, స్వకం రూపం=తన మునుపటి రూపమును, దర్శయామాస=చూపెను, మహాత్మా = మహానుభావుడగు శ్రీకృష్ణమూర్తి, పునః = మఱల, సౌమ్యవపుః భూత్వా=సౌమ్యరూపమును దాల్చినవాడై, భీతం ఏనం = భయము గలిగియుండిన అర్జునుని, ఆశ్వాసయామాస చ = ఓదార్చెను.

తా॥ శ్రీకృష్ణమూర్తి అర్జునుని గూర్చి యిట్లు చెప్పి అలాగుననే మఱల తన మునుపటి రూపమును చూపెను. మహాత్ముడగు నా శ్రీకృష్ణమూర్తి సౌమ్యరూపమును దాల్చినవాడై భయభీతుడగు అర్జునుని ఓదార్చెను.

వి॥ "వాసుదేవః" అని చెప్పుటచే వసుదేవగృహములో నుండినపుడెట్టి ప్రశాంత ప్రసన్నరూపము గలిగియుండెనో, అట్టిరూపమును చూపెనని సూచింపబడెను.

అర్జున ఉవాచ:— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన!।
ఇదానీమస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః॥ 51

పద॥ దృష్ట్వా - ఇదం మానుషం — రూపం - తవ - సౌమ్యం-జనార్దన! - ఇదానీం - అస్మి - సంవృత్తః - సచేతాః - ప్రకృతిం - గతః.

ప్రతి॥ హే జనార్దన ! = ఓ శ్రీకృష్ణమూర్తీ!, తవ = నీయొక్క. సౌమ్యం=సౌమ్యమయిన, ఇదం=ఇప్పుడు చూపిన,మానుషం రూపం=మనుష్యరూపమును, దృష్ట్వా = చూచి, సచేతాః = ప్రసన్నమనసుతో కూడినవాడనై.ప్రకృతిం గతః = కుదుటబడితిని, ఇదానీం=ఇప్పుడు, సంవృత్తః అస్మి = స్వస్థత నొందిన వాడనైతిని.

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! ప్రసన్నమైనదియును, మానవ సంబంధమైనదియు నైన నీయొక్క మునుపటి రూపమును చూచి యిపుడు ప్రసన్నచిత్తుడను, పూర్వస్వభావము గలవాడను నై స్వస్థత నొందితిని.

శ్రీ భగవానువాచ:— శ్రీభగవంతుడు చెప్పెను.

శ్లో॥ సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః॥ 52

పద॥ సుదుర్దర్శం — ఇదం — రూపం — దృష్టవాన్—అసి - యత్ — మమ, దేవాః — అపి — అస్య — రూపస్య — నిత్యం — దర్శనకాంక్షిణః,

ప్రతి॥ మమ = నాయొక్క, యత్ = ఏ రూపమును, దృష్టవాన్ అసి=చూచితినో ఇదం రూపం = అట్టి యీ రూపము, సుదుర్దర్శం = ప్రయాసముచే చూడ దగినది, దేవాః అపి = దేవతలు సహితము, నిత్యం = ఎల్లప్పుడును, అస్యరూపస్య = ఈ రూపమును, దర్శన కాంక్షిణః = దర్శింప కోరిన వారగుచున్నారు.

తా॥ మహాతపస్సుచే చూడతగిన నాయొక్క యే రూపమును నీవిపుడు చూచితివో, అట్టి యీ రూపమును దేవతలుగూడ సర్వకాలములయందును చూడవలెననియెడు కోర్కెగలవారై యున్నారు.

శ్లో॥ నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥ 53

పద॥ న - అహం - వేదైః - న -తపసా - న - దానేన - న - చ - ఇజ్యయా, శక్యః — ఏవంవిధః — ద్రష్టుం — దృష్టవాన్ — అసి — మాం — యథా,

ప్రతి॥ (నీవు) మాం=నన్ను, యథా దృష్టవాన్ అసి=ఏ రూపముతో చూచితివో, ఏవంవిధః అహం = ఇట్టిరూపముగల నేను, వేదైః ద్రష్టుం శక్యః న = వేదాధ్యయనపరులచే చూచుటకు శక్యుడనుగాను, తపసా న = కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సులచేతను జూడశక్యుడనుగాను. దానేన న = దానపరుల చేతను చూచుటకు శక్యుడనుకాను. ఇజ్యయా చ న = యజ్ఞములు చేసిన వారిచేతను చూచుటను శక్యుడనుగాను.

తా॥ నన్ను ఏ విధముగా నీవు చూచితివో, ఇటువంటిరూపముగల నేను వేదాధ్యయనములచేతను, తపస్సుచేతను, దానముచేతను, యాగముచేతను గూడ చూచుటకు శక్యుడనుగాను.

వి॥ పై చెప్పిన కార్యములు చేయువార లనేకు లుండినను. నిర్మలమైన దైవభక్తి లేనందుచే వారి ఆత్మ నిర్మలత్వము నొందదు. కావున అట్టి వేదాధ్యయన, తపోధ్యానాది పుణ్యకర్మల జేయువారుగూడ భక్తిలేని వారైనచో భగవంతుని చూడజాలరు. పై జెప్పబడిన పుణ్యకర్మలను చేయని వారైనప్పటికిని నిర్మలమైన భక్తిగలిగియుండినచో వా రెట్టివారైనను భగవంతుని జూడగలరు.

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున!।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!॥ 54

పద॥ భక్త్యా — తు - అనన్యయా - శక్యః - అహం — ఏవంవిధః - అర్జున!, జ్ఞాతుం - ద్రష్టుం - చ - తత్త్వేన - ప్రవేష్టుం - చ - పరంతప!

ప్రతి॥ హే పరంతప! అర్జున! = శత్రుసంతాపకుడవగు ఓ యర్జునా!, ఏవంవిధః అహం = ఇట్టి విశ్వరూపమును ధరించిన నేను, అనన్యయా భక్త్యా తు = అనన్యమైన భక్తిచేతనే, తత్త్వేన = యథార్థముగా, జ్ఞాతుం = ఎఱుంగుటకును, ద్రష్టుం చ = చూచుటకును, ప్రవేష్టుం చ = నాలో ప్రవేశించుటకును, శక్యః = శక్యుడనగుచున్నాను,

తా॥ ఇట్టి విశ్వరూపమును ధరించిన నేను మదేకనిష్ఠమైన భక్తి చేతనే యథార్థముగా తెలిసికొనుటకును, దర్శించుటకును మోక్షమును పొందుటకును సాధ్యమైనవాడ నగుచున్నాను.

వి॥ అనన్య భక్తియనగా - భగవచ్చింతన తప్ప మఱి యే చింతనయును గలుగనిది లేక చూచినదంతయు భగవత్స్వరూపముగా తప్ప వేరేరూపమును చూడనిది, ఇట్టి పరమైకాంత భక్తివలననే నిజముగా భగవత్తత్త్వమును దెలిసికొనుటకును, దర్శించుటకును దానిలో నైక్యమొందుటకును, సాయుజ్యముక్తిని పొందుటకును సాధ్యమగును. ఇట్టి తన్మయభక్తికి జాతితోగాని, విద్యతోగాని, ధనముతోగాని సంబంధములేదు. వేదాధ్యయనముచే మోక్షమని చెప్పినచో, అది యందరికిని సాధ్యముగాదు. తీవ్రమగు తపస్సుచే మోక్షమని చెప్పినచో, అట్టి తపస్సును అందఱును చేయజాలరు. దానముచే మోక్షమని చెప్పినచో ధనములేని వారలెందఱోగలరు.వారికి మోక్షము సిద్ధించదు.యజ్ఞముచే మోక్షమని చెప్పినచో యజ్ఞాచరణమునకు బహుధనము గావలసియుండుటచే యజ్ఞము నందఱు జేయజాలరు. తదేకభక్తి గలుగుటకు పై చెప్పిన కర్మలెవ్వియు నవసరములేదు. కావున సర్వజనులును తరించుటకొఱకు కరుణతో విశ్వహితైకదృష్టితో నిట్లుచెప్పబడినది. పీదభక్తులపై కరుణ గలిగి భగవానునిచే నిట్లుపదేశింపబడినది. అంతేగాక పైన పేర్కొనబడిన వారలు గర్వితులై చెడిపోకుండుటకొఱకును ఇట్లుతెలుపడమైనది.

శ్లో॥ మత్కర్మకృన్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః ।
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ! ॥ 55

పద॥ మత్కర్మకృత్ - మత్పరమః - మద్భక్తః - సంగవర్జితః,
నిర్వైరః - సర్వభూతేషు - యః - సః - మాం - ఏతి - పాండవ !

ప్రతి॥ హే పాండవ! = ఓ యర్జునా!, మత్కర్మకృత్ = నాకు ప్రీతికరములగుకర్మల చేయువాడును, మత్పరమః = నన్నే పరమప్రాప్యముగా నెంచియుండువాడును, సంగవర్జితః = సమస్త సంగములను విడిచినవాడును, సర్వభూతేషు = సమస్త ప్రాణులయందును, నిర్వైరః = వైరములేనివాడును, యః = ఎవడుగలడో, సః మద్భక్తః = అట్టి నాయందు అనన్యమైన భక్తిగలవాడు, మాం ఏతి = నన్నే పొందుచున్నాడు.

తా॥ పాండుతనయుడవగు ఓ యర్జునా! భగవత్ప్రీతికరములగు కర్మలజేయువాడును; నన్నే పరమగతిగా నమ్మియుండువాడును,

సమస్తవస్తువులలోను మమత్వము విడిచినవాడును, సమస్తప్రాణుల యందు విరోధము లేనివాడెవడో అట్టి నా అనన్యభక్తుడు నన్ను పొందుచున్నాడు.

వి॥ ఈ శ్లోకము ఏకాదశాధ్యాయముయొక్క ముఖ్యసారముగాను ప్రాణముగా నున్నది. భగవత్ప్రాప్తివిషయమై దీనియందు చెప్పిన విషయము సామాన్యముగా నిర్మలహృదయము గలవారందఱికి ననుష్ఠించుటకు సాధ్యమైనది. దీని యందు అయిదు లక్షణములు తెలుపబడినవి. ఇట్టి గుణములు గలవాడెవడైనను పరమాత్మను పొందగలడు. ఆ అయిదు గుణములేవియన (1) మత్కర్మకృత్, (2)మత్పరమః, (3)మద్భక్తః, (4) సంగవర్జితః, (5) నిర్వైరః = ఎవరి యందును విరోధ ముండకూడదు, ఈ యైదింటిని ఆలోచించిన నివి యెవరికైనను సాధ్యమే యగునని తెలియుచున్నది,

'సంగవర్జితః' అనుటచే గృహస్థాశ్రమములో నుండువారైనను సంగరహితులైయున్నచో చాలును. వారు భగవత్సాక్షాత్కారమును పొందగలరని చెప్పినట్లైనది.

ఉపనిషత్తులు, యోగశాస్త్రములు సర్వసంగపరిత్యాగమును, ఏకాంతవాసమును, కఠినమైన యాహార నియమమును విధించుచున్నవి. వాటికిని, ఈ గీతాశాస్త్రమునకును ఇంత వ్యత్యాసముగలదు. వాటిలో చెప్పిన సాధనముల నందఱును జేయజాలరు గీతాచార్యుడగు శ్రీకృష్ణభగవాను డుపదేశించిన యీ యైదు సాధనలు నిర్మల బుద్ధిగలవారెవరైనను అనుష్ఠించుటకు సాధ్యములే యగును. కావుననే పైచెప్పిన యుపనిషత్తుల యోగశాస్త్రముల పేర్లనైనను ఎఱింగిన వారరుదుగానుంటున్నారు. ఈ గీతాశాస్త్రము ఇంతవిశాలమైనభావము గలిగినదగుటచేతనే యింత వ్యాపకమైనది. గోపాలురును, భూపాలురును, పండితులును, పామరులును, స్త్రీలును, పురుషులును, గృహస్థులును సన్న్యాసులును, అగ్రజాతి వారును, అంత్యజాతివారును దీనిని పఠించి కృతార్థులగుటకు కారణమైనది. ఈ గీతాప్రబోధము గొప్ప వెల్లువవంటిది. జలము నిలుచుటకుతగిన నూతులుగాని, గుంటలుగాని, చెఱువులుగాని, సరోవరములుగాని, కాలువలుగాని, మహానదులుగాని యుండినను వాటిలో నెంత నీరుపట్టునో యంతమాత్రమే నిలిచి, తక్కిన దంతయు మహాసముద్రములోనికి పోవునట్లు, సాధకులు ఎంతెంత మనోవైశాల్యము గలిగినవారుగా నుంటున్నారో, అంతంతజ్ఞానామృతము భగవత్కరుణా

రసము గీతాభావార్థము వారిలో నిలిచి, తక్కినదంతయు ననంతము లోనికి చేరు చుండును. శ్రీ ఆదిశంకరాచార్యులు మొదలుకొని నిమ్నజాతిలోబుట్టిన సామాన్య జనుని వఱకును ప్రతివారుగూడ గీతను పఠించుచున్నారు. వారివారి బుద్ధి శక్తి ననుసరించి గీతార్థమును గ్రహించుచున్నారు. కనుక గీతయొక్క మహిమ యెటు వంటిదో జూడుడు.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే విశ్వరూపసందర్శనయోగో నామ
ఏ కా ద శో ఽ ధ్యా య ః .

పద॥ ఇతి - శ్రీమత్ భగవద్గీతాసు - ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగ శాస్త్రే - శ్రీ కృష్ణార్జునసంవాదే - విశ్వరూప సందర్శనయోగః - నామ - ఏకాదశః – అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇది, ఉపనిషత్సు = ఉపనిషదర్ధ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యాయాం= బ్రహ్మవిద్యారూపమును, యోగశాస్త్రే=యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదే = శ్రీ కృష్ణార్జున సంవాద రూపమునగు, శ్రీమద్భగవద్గీతాసు = శ్రీ భగవద్గీతయందు, విశ్వరూప సందర్శనయోగః నామ = విశ్వరూప సందర్శనయోగమని ప్రసిద్ధిజెందిన, ఏకాదశః అధ్యాయః= పదకొండవ అధ్యాయము సంపూర్ణము.

తా॥ ఇట్లు ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యా స్వరూపమును, యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదరూపమునగు శ్రీమద్భగవద్గీతయందు విశ్వరూపసందర్శనయోగమని ప్రసిద్ధిజెందిన పదకొండవ అధ్యాయము సంపూర్ణము.

వి॥ భగవంతుని సాక్షాద్దర్శనము గూడ యొక యోగమే యగును. దాని వలనను మోక్షము గలుగును. కావుననే దీనికి 'విశ్వరూప సందర్శనయోగ మ'ని పేరు గలిగినది.

ఓమ్ తత్ సత్.



ఓమ్

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## ద్వాదశోఽధ్యాయః - ద్వాదశాధ్యాయము

## భక్తియోగః - భక్తియోగము



ఈ యధ్యాయమునకు 'భక్తియోగమ'ని పేరు. భక్తివలనను భగవదైక్యము గలుగుటచే ఇట్టిపేరు వచ్చినది. ఈ యధ్యాయము భక్తులందఱిచేతను పఠించ దగినది. ఇది చాల చిన్న యధ్యాయము. శ్లోకములుకూడ చాల సులభములు. భక్తియొక్క సులభసాధ్యతను తెలుపుటకొరకే యీలాగున చేయడమైనది. గీతలో 4 యోగములు ముఖ్యములుగా నుపదేశింపబడినవి. నిష్కామకర్మయోగమందాసక్తిగలవారికి 3-వ అధ్యాయము, ధ్యానయోగమందాసక్తిగలవారికి 6-వ అధ్యాయము, భక్తియోగమందాసక్తిగలవారికి ఈ 12-వ అధ్యాయము, జ్ఞానయోగమందాసక్తిగలవారికి 14-వ అధ్యాయమును ముఖ్యములు. అయితే యీ అధ్యాయమునందు "అద్వేష్టా" అను 13-వ శ్లోకమునుండి ప్రారంభించి 19-వ శ్లోకమువఱకు గల 7 శ్లోకములచే పరమభక్తులయొక్క గుణములు లేక లక్షణము లుపదేశింపబడినవి. భక్తులు మాత్రమేగాదు భగవత్ప్రాప్తియగు మోక్షమును కోరువారెవరైనను ఈ గుణములను గలిగి యుండవలయును. ఈ గుణములు గలవారికి మాత్రమే భగవత్ప్రాప్తి గలుగును.

అర్జున ఉవాచ:—అర్జునుడు చెప్పెను.

శ్లో॥ ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే ।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥ 1

పద॥ ఏవం - సతతయుక్తాః - యే - భక్తాః - త్వాం - పర్యుపాసతే,
యే - చ - అపి - అక్షరం - అవ్యక్తం - తేషాం - కే - యోగవిత్తమాః.

ప్రతి॥ ఏవం = పదునొకొండవ అధ్యాయమున చెప్పినప్రకారము, యే భక్తాః= ఏ భక్తులు, త్వాం=నిన్ను, సతతయుక్తాః=ఎల్లప్పుడును నీయందే మనస్సు చేర్చినవారై, పర్యుపాసతే=ధ్యానము చేయుచున్నారో, యే చ అపి=ఎవరైతే, అవ్యక్తం=ఇంద్రియములకు గోచరింపని, అక్షరం = పరబ్రహ్మమును, పర్యుపాసతే=ఆత్మోపాసనగా జేయుచున్నారో, తేషాం=ఈరెండు

తెగల వారలలో, కే=ఎవరు, యోగవిత్తమాః=లెస్సగా యోగము నెఱింగినవారు?

తా॥ పదునొకొండవ యధ్యాయమునందలి కడపటి శ్లోకమునందు చెప్పబడిన విధముగా భగవంతుడవగు నీయొక్క భక్తులలో ఎల్లప్పుడును నీయందే నిలుపబడిన చిత్తముగలవారును, నీకంటే నితరమగు రక్షకుడు లేనివారు నగుచు సాకారస్వరూపుడవగు నిన్ను సేవించుచున్నవారిలోను, సర్వాశలను వదలి ఇంద్రియనిగ్రహముగలవారై, ఇంద్రియాతీతుడవును, నిర్విశేషపరబ్రహ్మస్వరూపుడవు నగు నిన్ను ధ్యానించుచున్నవారిలోను అనగా నిర్గుణోపాసకులలోను, ఎవరు యోగమును లెస్సగా తెలిసినవారు?

వి॥ ఇచట సాకారభక్తిని, నిరాకారభక్తిని గుఱించి యడుగడమైనది. సాకార నిరాకారోపాసకులలో నెవరు భగవద్దర్శనమగు జ్ఞానముగలవారని యర్జునుడు ప్రశ్నించుచున్నాడు. సాకారోపాసనలో విగ్రహారాధన యొకటి. భగవత్స్వరూపమును మానస పూజ చేయుట రెండవది. నిరాకారభక్తిలో చరాచరవస్తువులన్నిటిలో వెలుగుచుండు సర్వేశ్వరుని జ్ఞానరూపముగ నుపాసించుట యొకటి.అన్నిటిలోను నుండువాడగుటచే తనలో నుండువాడుగూడ ఆ సర్వేశ్వరుడే యగుటచేత ఆత్మనుగూడ పరమాత్మస్వరూపముగా ననుసంధానముచేయుట రెండవది. భగవంతున కన్యముగా నొక తృణమైనను లేదను ప్రతివాక్యమును భావించి అంతయు నొక్క దైవమయముగా భావనచేయుట మూడవది యగును. వీటిలో నొకదానికన్న మఱొకటి వెయ్యిరెట్లు అధికమైనది.

శ్రీ భగవానువాచ:— శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః॥ 2

పద॥ మయి – ఆవేశ్య - మనః - యే - మాం - నిత్యయుక్తాః - ఉపాసతే, శ్రద్ధయా - పరయా - ఉపేతాః - తే - మే - యుక్తతమాః - మతాః.

ప్రతి॥ యే = ఎవరు, మయి = నాయందు, మనః ఆవేశ్య=మనస్సు నిలిపి, నిత్యయుక్తాః = నిరంతరసమాహితచిత్తులును, పరయా శ్రద్ధయా ఉపేతాః= మిక్కిలి శ్రద్ధతోకూడినవారునై,మాం ఉపాసతే=నన్నుపాసించుచున్నారో తే=అట్టివారు,యుక్తతమాః=యోగశ్రేష్ఠులని,మే మతాః=నాకు సమ్మతులు.

తా॥ ఎవరు నాయందు మనస్సు నిలిపి, నిరంతరసమాహిత చిత్తులును, మిక్కిలి శ్రద్ధతో గూడిన వారునై నన్నుపాసించుచున్నారో అట్టివారు యోగులలో శ్రేష్ఠులు. వారు నాకు సమ్మతులు.

వి॥ మొదటి శ్లోకములో 'సాకారోపాసకులలో' నిరాకారోపాసకులలో నెవరు శ్రేష్ఠులని అర్జును డడిగిన ప్రశ్నకు సమాధానముగా, 'సాకారోపాసకులైనను, నిరాకారోపాసకులైనను, ఎవరు భగవదాయత్తచిత్తులై పవిత్రమైన శ్రద్ధ గలిగి భగవదుపాసన జేయుదురో వారే శ్రేష్ఠుల'ని భగవంతుడు తన విశాల భావమును తెలిపెను. వారు సంన్యాసులైనను గృహస్థులైనను విరోధములేదు. మనస్సును భగవంతునియం దైక్యపఱచి సత్యమునుండి చలింపక యుండువారెవరో వారే శ్రేష్ఠులు, ఇదే భగవన్మత మని తెలుపబడినది.

శ్లో॥ యే త్వక్షరమనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే ।
సర్వత్రగ మచిన్త్యం చ కూటస్థ మచలం ధ్రువమ్॥ 3

,, సన్నియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః ॥ 4

పద॥ యే - తు - అక్షరం - అనిర్దేశ్యం - అవ్యక్తం - పర్యుపాసతే,
సర్వత్రగం — అచిన్త్యం - చ - కూటస్థం - అచలం - ధ్రువమ్.
,, సన్నియమ్య - ఇన్ద్రియగ్రామం - సర్వత్ర - సమబుద్ధయః,
తే - ప్రాప్నువన్తి - మాం - ఏవ - సర్వభూతహితే - రతాః.

ప్రతి॥ యే తు = ఎవరైతే, అక్షరం = నాశరహితమును, అనిర్దేశ్యం=నిర్దేశింప నలవికానిదియును, అవ్యక్తం=రూపాదిరహితమును, సర్వత్రగం=అంతట వ్యాపించినదియును, అచిన్త్యం=చింతింప నలవిగానిదియును, కూటస్థం=నిర్వికారమును, అచలం=చలనములేనట్టిదియును, ధ్రువం = నిత్యమైనదియునగు బ్రహ్మమును, ఇంద్రియగ్రామం =ఇంద్రియసముదాయమును సన్నియమ్య = నియమించి, సర్వత్ర = అన్నికాలములయందును, సమబుద్ధయః=సమమైన బుద్ధిగలవారును, సర్వభూతహితే=సర్వభూతముల యొక్క హితమునందు, రతాః = ప్రీతిగలవారునై, ఉపాసతే = ఉపాసన చేయుచున్నారో, తే=అట్టివారు, మాం ఏవ=నన్నే, ప్రాప్నువన్తి=పొందుచున్నారు.

తా॥ నాశరహితమైనదియును, నిర్దేశింపనలవికానిదియును, రూపాదిరహితమును, అంతట వ్యాపించినదియును, చింతింప నలవి కానిదియును, నిర్వికారమైనదియును, చలింపనట్టిదియునగు నిత్యమైన బ్రహ్మమును, ఇంద్రియములను విషయములమీదికి పోనీయక నిగ్రహించి అన్నికాలములయందును సమమైనబుద్ధిగలవారును,సకల భూతములయొక్క హితమునందు ఆసక్తిగలవారునై ఉపాసించుచున్నారో, వారెవరైనను పొందగలరు.

శ్లో॥ క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తా సక్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే॥ 5

పద॥ క్లేశః - అధికతరః - తేషాం - అవ్యక్తాసక్తచేతసాం,
అవ్యక్తా - హి - గతిః – దుఃఖం - దేహవద్భిః - అవాప్యతే.

ప్రతి॥ అవ్యక్తాసక్తచేతసాం = నిర్గుణోపాసనయందాసక్తచిత్తులగు, తేషాం= వారికి, అధికతరః క్లేశః = మిక్కిలికష్టము, హి=ఏలయనగా,దేహవద్భిః= దేహాభిమానులచే, అవ్యక్తా గతిః = నిర్గుణోపాసనామార్గము, దుఃఖం అవాప్యతే = కష్టముగా పొందబడుచున్నది

తా॥ అక్షరపరబ్రహ్మమందాసక్తమైన చిత్తము గలవారికి కష్టము మిగుల అధికమైనది, అనగా కష్టములు ఎక్కువగా సంభవించును. ఏలన, నిర్గుణవిషయమైన మార్గము దేహాభిమానము గలవారిచేత నతికష్టముగా పొందబడుచున్నది.

వి॥ ఈశ్వరోపాసనచేతను, నిష్కామకర్మానుష్ఠానముచేతను అంతఃకరణశుద్ధి గలుగనివారికి ఇంద్రియాతీతమగు బ్రహ్మోపాసన చేయుట ప్రయాసము. అయితే యింద్రియములకు గోచరించెడు సగుణబ్రహ్మోపాసన సులభమని తలంచి చేసినచో తత్ఫలమునకు వినాశము గలుగును. (అనిత్యము) కనుకనే 4-వ శ్లోకములో "సన్నియమ్యేన్ద్రియగ్రామం" ఇంద్రియసంయమము గలవారికి నిర్గుణబ్రహ్మోపాసన ప్రయాసములేదని చెప్పుటకు కారణము. మఱియు,దేహాభిమానముగలవారికి నిర్గుణబ్రహ్మమును పొందుట ప్రయాసమని తెలుపబడినదే కాని, దేహాభిమానములేనివారికి కష్టముగాదు. కనుకనే శ్రుతియందు "దేహాభి ... [illegible] ... సగసాత,ని" దేహాభిమానము వదలిపోయి, పరమాత్మ

యొక్క విజ్ఞానముగలవారంతట నెల్లప్పుడును, ఆ పరమాత్మలోనే యుందురని చెప్పుటకు కారణము. ఆత్మపరిపక్వము గలుగునప్పుడు మాత్రమే అవిద్యారూప మగు దేహభావము వదలిపోవును. అపుడు ఆత్మవిముక్తిని పొందును. బాగుగా పండిన టెంకాయలోగల జలము నశించునప్పుడు చిప్పనుండి కొబ్బరి స్వయముగా వదలిపోవునట్లు భక్తి ధ్యాన తపస్సులచే అంతఃకరణములోగల విషయవాసన నశించినప్పుడే ప్రకృతినుండి ఆత్మ ముక్తిని పొందును. కురుడీకాయ మరల పీచుతోను, చిప్పతోను చేరనట్లును, మొలక యెత్తనట్లును, ఎంతకాలమున కైనను చెడకుండునట్లును, జీవన్ముక్తుడు మఱల ప్రకృతిలో చేరుటగాని, మఱల జన్మ మెత్తుటగాని మోక్షస్థితినుండి చలించుటగాని ఉండదు.

శ్లో॥ యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్యమత్పరాః।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥ 6

,, తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి నచిరాత్పార్థ! మయ్యావేశిత చేతసామ్ ॥ 7

పద॥ యే - తు - సర్వాణి - కర్మాణి - మయి - సన్న్యస్య - మత్పరాః.
అనన్యేన - ఏవ - యోగేన - మాం - ధ్యాయన్తః - ఉపాసతే.
" తేషాం - అహం - సముద్ధర్తా - మృత్యుసంసారసాగరాత్,
భవామి - న - చిరాత్ - పార్థ! - మయి - అవేశితచేతసామ్.

ప్రతి॥ హే పార్థ! = ఓ యర్జునా!, యే తు = ఎవరైతే, సర్వాణి కర్మాణి = సమస్తకర్మలను, మయి సన్న్యస్య = నాయందర్పించి, మత్ పరాః = నాయందు చేర్చిన చిత్తముగలవారగుచు, అనన్యేన యోగేన = అనన్య యోగముచేత, (ఇతర చింతలెవ్వియు లేక), మాం ఏవ ధ్యాయన్తః = నన్నే ధ్యానించు చున్నవారై, ఉపాసతే = ఉపాసించుచున్నారో, మయి ఆవేశితచేతసాం = అట్లు నాయందు చేర్చబడిన చిత్తముగల, తేషాం = వారిని, అహం = నేను, నచిరాత్ = శీఘ్రముగా, మృత్యుసంసారసాగరాత్ = మరణ కారణమగు సంసారసాగరమునుండి, సముద్ధర్తా = సముద్ధరించువాడను, భవామి = అగుచున్నాను.

తా॥ ఏ సగుణోపాసకులు, సమస్తములగు వైదిక లౌకిక కర్మఫలములను, కర్మములను నాయందు సమర్పించి, నేనే పరమగతిగా గలవారై, నాకంటె నితరముగా నాలంబనములేని యుపాసనచేత

నన్నే ధ్యానము చేయుచున్నవారై నన్ను సేవించుచున్నారో, నాయం దుంచబడిన చిత్తము గల యా సగుణోపాసకులను నేను మృత్యు రూపమైన సంసారమనెడి సముద్రమునుండి శీఘ్రముగా లేవదీయు వాడ నగుచున్నాను.

శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వమయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ 8

పద॥ మయి - ఏవ - మనః - ఆధత్స్వ - మయి - బుద్ధిం - నివేశయ.
నివసిష్యసి - మయి - ఏవ - అతః - ఊర్ధ్వం - న - సంశయః.

ప్రతి॥ మయి ఏవ = నాయందే, మనః ఆధత్స్వ = మనస్సునుంచుము, మయి బుద్ధింనివేశయ = నాయందే బుద్ధిని నిలుపుము. అతః ఊర్ధ్వం = అటు పిమ్మట, మయి ఏవ = నాయందే, నివసిష్య = నివసింపగలవు. న సంశయః = సందేహములేదు.

తా॥ ఈశ్వరుడనైన నాయందు సంకల్పవికల్పాత్మకమైన మనస్సును చేర్చుము. నాయందే నిశ్చయాత్మకమైన బుద్ధినిగూఢ లయపఱచుము. ఇట్లు చేసితివేని నిశ్చయముగా పిమ్మట నాయందే నివసింపగలవు. ఈ విషయమునందు సందేహములేదు.

వి॥ మనోబుద్ధ్యాదీంద్రియములను పరమాత్మధ్యానముచే లయపఱచుట యుత్తమపక్షము. ఇది ప్రకృతి నశించిన జీవులకే సాధ్యపడును. కావుననే మొదట చెప్పుటకు కారణమైనది. ఇట్టి స్థితి యెప్పుడు గలుగునో, అప్పటినుండి మనస్సు పరమాత్మ భావనయందే సదా నిలుకడ గలిగియుండును,

శ్లో॥ అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ ॥ 9

పద॥ అథ - చిత్తం - సమాధాతుం - న - శక్నోషి - మయి - స్థిరం,
అభ్యాసయోగేన - తతః - మాం - ఇచ్ఛ - ఆప్తుం - ధనంజయ!

ప్రతి॥ హే ధనంజయ! = ఓ యర్జునా ! అథ = పిమ్మట (ఒకవేళ), మయి = నాయందు. చిత్తం = మనస్సు, స్థిరం సమాధాతుం = స్థిరముగా నిలుపు టకు, న శక్నోషి = అశక్తుడవైతివేని, తతః =అటుపిమ్మట (అపుడు)-

ఓం



అభ్యాసయోగేన=అభ్యాసయోగముచేత, మాం అప్తుం=నన్ను పొందుటకు, ఇచ్ఛ = ఇచ్ఛగింపుము.

తా॥ ఓ అర్జునా! నేనుచెప్పిన విధముగా నొకవేళ చిత్తమును నాయందు స్థిరమైనదానినిగా నిలుపుటకు సమర్థుడవు గాకపోతివేని, అపుడు అభ్యాసయోగముచేత నన్ను పొందుటకు ప్రయత్నము చేయుము.

వి॥ పై శ్లోకమున చెప్పినప్రకారము మనోబుద్ధీంద్రియాదులను ఆత్మలో లయ పరచుటకుశక్తిలేనిచో 6-వ అధ్యాయమున 35-వ శ్లోకమున చెప్పినట్లు అభ్యాస వైరాగ్యములచేత మనస్సు ఆత్మయందు లయపరచులాగున ప్రయత్నము చేయ వలెను. అభ్యాసమనగా ప్రతిరోజును దైవభావములోనుండి మనస్సును చలింప నీయక కొంచెము కొంచెముగా నిలిపి శీలించుట. వైరాగ్యమనగా దృశ్యవిషయ ములచే గలిగెడు దోషముల గురించి బాగుగా యోచించుకొని వాటిని విడచుట. ఇట్లు చేసిన శుక్లపక్ష చంద్రునివలె విజ్ఞానమధికరించి, అజ్ఞానరూపమగు చీకటి నశించుచుండును. పై శ్లోకములో మనస్సు శుద్ధమైన వానిని గురించి చెప్పబడి నది. ఇప్పుడు మనస్సు శుద్ధములేనివాడై సంపూర్ణ శుద్ధముగా జేసికొన వలెనని తలంపుగలవాని విషయమై చెప్పబడినది. వీడు రెండువ తరగతికి చెందినవాడు.

శ్లో॥ అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।
మదర్థ మపి కర్మాణి కుర్వన్సిద్ధి మవాప్స్యసి ॥ 10

పద॥ అభ్యాసే - అపి - అసమర్థః - అసి - మత్కర్మపరమః - భవ, మదర్థం - అపి - కర్మాణి - కుర్వన్ - సిద్ధిం - అవాప్స్యసి.

ప్రతి॥ అభ్యాసే అపి=అభ్యాసము చేయుటయందును, అసమర్థః అసి = సమర్థత లేనివాడవైతివేని, మత్కర్మపరమః = నాకు ప్రీతికరములైన కర్మల చేయుట యందాసక్తిగలవాడవు, భవ = అగుము, మదర్థం = నాకొఱకు, కర్మాణి = కర్మములను, కుర్వన్ అపి = చేయుచునైనను, సిద్ధిం అవాప్స్యసి = జ్ఞానసిద్ధిని పొందగలవు.

తా॥ అభ్యాసము చేయుటయందును సమర్థత లేనివాడవైతి వేని, నాకు ప్రీతికరములగు కర్మల చేయుటలో నాసక్తి గలవాడ వగుము. నాకు ప్రీతికరములైన కర్మలను చేయుచునైనను మోక్ష సిద్ధిని బొందగలవు.

వి॥ అభ్యాసయోగము కారణాంతరములచే చేయ శక్తిలేనివారుపరప్రాణు-లకు మేలొనరించుట, ప్రార్థన కీర్తన భజన పూజాదులు సలుపుట, వ్రతముల-నాచరించుట మొదలగు భగవత్ప్రీతికరములగు కార్యముల జేసినను పాపము నశించి అంతఃకరణ శుద్ధి కలిగి జ్ఞానోదయము గలుగును.వీడు మూడవతరగతికి చెందినవాడు.

శ్లో॥ అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ 11

పద॥ అథ - ఏతత్ - అపి - అశక్తః - అసి - కర్తుం - మద్యోగం - ఆశ్రితః, సర్వకర్మఫలత్యాగం - తతః - కురు - యతాత్మవాన్.

ప్రతి॥ అథ = ఒకవేళ, ఏతత్ అపి = దీనినిన్ని, కర్తుం = చేయుటకు, అశక్తః అసి = అశక్తుడవైతివేని, తతః = పిమ్మట, మద్యోగం ఆశ్రితః = నన్ను గూర్చిన యోగమును అవలంబించినవాడవై, యతాత్మవాన్ = నియత మనస్కుడవై, సర్వకర్మఫలత్యాగం = సకల కర్మఫలత్యాగమును(సమస్త కర్మల ఫలమును విడిచిపెట్టుటను), కురు = చేయుము.

తా॥ ఒకవేళ యిదియును చేయుటకు శక్తుడవు కావైతివేని అటుపిమ్మట నన్ను గూర్చిన యోగము నవలంబించిన వాడవై నియతమనస్కుడవై సమస్త కర్మల ఫలమును విడిచి పెట్టుటయను-నది చేయుము.

వి॥ పై చెప్పిన ప్రకారము ఈశ్వరార్పణబుద్ధితో కర్మలుచేయుటకుశక్తి లేనిచో మనోనియమము గలవాడవై సర్వకర్మల ఫలమును విడిచిపెట్టుము.సర్వ కర్మ ఫలత్యాగియైన వీడు నాల్గవ తరగతికి చెందినవాడు సర్వకర్మఫలత్యాగము చేయుట కెట్లు సాధ్యపడునని సందేహము కలుగవచ్చును. "యతాత్మవాన్"అని చెప్పుటచే మంచి మనోనియమము కలిగియున్నచో నది సుసాధ్యమగునని తెలియ-వలయును. కాన ఏకర్మల ఫలమందును ఆసక్తినుంచరాదు అయితే అసత్కర్మను పవిత్రాత్ములు చేయరుగదా? వారు విధ్యుక్త సత్కర్మల చేయుదురు. ఎప్పుడు సత్కర్మల చేయుటయందే అధికారము కలదుగాని, ఫలమందపేక్ష కూడదని శ్రీకృష్ణభగవానుడు శాస్త్రమున చెప్పిన వాక్యములలో నమ్మకము గలిగి యున్నచో అట్టి సత్కర్మాచరణమున్ను,భగవదాజ్ఞాపాలనమే యగును. ఒక్కొక్క తరగతియందు విద్యార్థులుశ్రద్ధతో చదివి యుత్తీర్ణులగుచు వచ్చుటచే కడకు

ఉన్నతస్థానము నెట్లు పొందగలరో, అట్లే సత్కర్మాచరణముచే పుణ్యమును, నిష్కామకర్మ యోగానుష్ఠానముచే నంతఃకరణ శుద్ధియు, దానివే ఆత్మజ్ఞానమును, ఆత్మజ్ఞానముచే మోక్షమును సిద్ధించును.

శ్లో॥ శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే! ।
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాన్తి రన న్తరమ్ ॥ 12

పద॥ శ్రేయః - హి - జ్ఞానం - అభ్యాసాత్ - జ్ఞానాత్ - ధ్యానం - విశిష్యతే, ధ్యానాత్ - కర్మ ఫలత్యాగః - త్యాగాత్ - శాన్తిః - అనన్తరమ్.

ప్రతి॥ హి = ఏలయనగా, అభ్యాసాత్ = అభ్యాసముకంటె, జ్ఞానం శ్రేయః = జ్ఞానము శ్రేష్ఠమైనది, జ్ఞానాత్ = జ్ఞానముకంటె, ధ్యానం = ధ్యానము, విశిష్యతే = శ్రేష్ఠమైన దగుచున్నది. ధ్యానాత్ = ధ్యానముకంటె, కర్మఫలత్యాగః = కర్మఫలత్యాగము శ్రేష్ఠమైనది. త్యాగాత్ అనన్తరం = అట్టి కర్మఫలత్యాగ మును చేసినవెనుక, శాన్తిః = చిత్తశాన్తి గలుగుచున్నది.

తా॥ అవివేకముతోగూడిన యభ్యాసముకంటె పవిత్రశాస్త్ర శ్రవణజనిత జ్ఞానము శ్రేష్ఠమైనది. అట్టి శాస్త్రజనిత జ్ఞానముకంటె తత్త్వజ్ఞానసహితమగు ధ్యానము, అట్టి తత్త్వజ్ఞానసహితధ్యానము కంటె కర్మఫలమును విడుచుటయు శ్రేష్ఠమైన దగుచున్నది; కర్మ ఫలత్యాగమువలన శీఘ్రముగా బంధనివృత్తి గలుగుచున్నది; చిత్త శాంతి గలుగుచున్నది.

వి॥ ఈ శ్లోకమున నిష్కామకర్మ యోగమునందు ప్రవృత్తి గలుగుటకు నదియే అన్నిటికన్న శ్రేష్ఠమని చెప్పబడినది. ఎందుకనగా నిష్కామకర్మ యోగముచేతనే అంతఃకరణశుద్ధి గలుగుచున్నది. అంతఃకరణశుద్ధి గలుగనిచో ధ్యానముగాని జ్ఞానముగాని కలుగదు. కావున ఆత్మ విద్యయందు ప్రవృత్తి గలు గుట కొఱకు మొదట సత్యముతో గూడిన కర్మఫల త్యాగమే అవశ్యకము. ఆత్మజ్ఞానమునకదియే కారణము. బ్రహ్మచర్యాదులగు నాలుగాశ్రమములలో సన్న్యాసాశ్రమము నాల్గవదై సర్వదుఃఖరహిత ఆనంద ప్రాప్తిరూప ఫలముగలది అయినను మొదటిదగు బ్రహ్మచర్యాశ్రమమే ముఖ్యమనియు దానినే చక్కగా పాలింపవలయు ననియు శాస్త్రమెటుల విధించుచున్నదో. మఱియు బ్రహ్మచర్యా శ్రమమును జక్కగా ననుష్ఠించిన తక్కిన మూడాశ్రమములు చెడక సురక్షిత

ములై యుండునని యెటుల ప్రతిపాదించుచున్నదో అలాగున కర్మ, భక్తి యోగ, జ్ఞానములను నాల్గింటిలో మొట్టమొదట చక్కగ ననుష్ఠింపబడిన నిష్కామ కర్మయోగము తక్కిన మూడు యోగములకును ఆధారభూతమని చెప్పబడినది. నాలుగు అంతస్థులు కట్టదలచిన సౌధమునకు మొదటిదగు పునాది యెట్లు అతి ముఖ్యమో, అది సుస్థిరముగా నుండిననే తక్కిన మూడు అంతస్థులెట్లు కదలక దృఢముగా నుండునో ఆ లాగున మొదటియోగమగు కర్మఫలత్యాగము తక్కినయోగములకు ఆధారమై అతి ముఖ్యమగుచున్నది. కరణములచే చేయబడునది కర్మమగును. ప్రార్థన ధ్యానములుగూడి కర్మములలో చేరినవే. కాన వీటినిగూడ ఫలాపేక్షలేక శ్రద్ధాభక్తులతో ననుష్ఠించవలెను. వేదాంతశాస్త్రములో శాస్త్రానుభవము జ్ఞానమనియు, అనుభవజ్ఞానము విజ్ఞానమనియు చెప్పబడును. కానఈశ్లోకమున నిరూపింపబడినది శాస్త్రజ్ఞానమని గ్రహించవలయును.

ఈ పదమూడవ శ్లోకమునుండి 19-వ శ్లోకమువఱకు పరమభక్తుని యొక్కయు, జ్ఞానియొక్కయు లక్షణములు చెప్పబడుచున్నవి.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥ 13

" సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పితమనోబుద్ధి ర్యోమద్భక్తస్స మే ప్రియః ॥ 14

పద॥ అద్వేష్టా - సర్వభూతానాం - మైత్రః - కరుణః - ఏవ - చ.
నిర్మమః - నిరహంకారః - సమదుఃఖసుఖః - క్షమీ,
" సంతుష్టః - సతతం - యోగీ - యతాత్మా - దృఢనిశ్చయః,
మయి - అర్పితమనోబుద్ధిః - యః - మద్భక్తః - సః - మే - ప్రియః.

ప్రతి॥ సర్వభూతానాం = సకలభూతములకును, అద్వేష్టా = ద్వేషికానివాడును మైత్రః = మిత్రధర్మముగలవాడును, కరుణః ఏవ చ = దయగలవాడును, నిర్మమః = మమత్వములేనివాడును, నిరహంకారః = అహంకారములేనివాడును, సమదుఃఖసుఖః=సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాడును, క్షమీ=ఓర్పుగలవాడును, సతతం సంతుష్టః=నిత్యసంతోషియు,యోగీ= నిష్కామకర్మయోగియు లేక ధ్యానయోగానుష్ఠానతత్పరుడును,యతాత్మా= మనోనిగ్రహము గలవాడును, దృఢనిశ్చయః = నిశ్చయజ్ఞానము గలవాడును, మయి అర్పితమనోబుద్ధిః=నాయందర్పించిన మనస్సు బుద్ధియు

గలవాడును, మద్భక్తః = నాభక్తుడును, యః = ఎవడో, సః = వాడు (అట్టి నిష్కామ కర్మానుష్ఠానపరుడగు యోగి లేక ధ్యానయోగము చేయువాడు), మే = నాకు, ప్రియః = ప్రియుడు.

తా॥ 1. సకల భూతములను ద్వేషింపనివాడును, 2. మిత్రధర్మము గలవాడును, 3. కారుణ్యము గలవాడును, 4. మమత్వము లేనివాడును, 5. అహంకారము లేనివాడును, 6. సుఖదుఃఖముల యందు సమబుద్ధిగలవాడును, 7. ఓర్పుగలవాడును, 8. నిత్యసంతోషియు, 9. ధ్యానానుష్ఠానపరుడగు యోగియు, 10. మనోనిగ్రహము గలవాడును, 11. దృఢమైన జ్ఞానము గలవాడును, 12. భగవంతునియం దర్పించినమనస్సు బుద్ధియును గలవాడును, 13, నాభక్తుడును అయిన వాడెవడో వాడు నాకు ప్రియుడగుచున్నాడు.

శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః ॥ 15

పద॥ యస్మాత్ - న - ఉద్విజతే - లోకః - లోకాత్ - న - ఉద్విజతే - చ - యః, హర్షామర్షభయోద్వేగైః - ముక్తః - యః - సః - చ - మే - ప్రియః.

ప్రతి॥ యస్మాత్ = ఎవనివలన, లోకః = లోకము (జనులు), న ఉద్విజతే = భయము నొందదో, యః = ఎవడు, లోకాత్ = లోకమువలన, న ఉద్విజతే చ = భయమునొందడో, యః = ఎవడు, హర్షామర్షభయోద్వేగైః ముక్తః = సంతోష రోష భయములచే గలతనొందని మనస్సు గలవాడో. సః చ = అట్టి వాడును, మే ప్రియః = నాకు ప్రియుడు.

తా॥ 14. ఎవనివలన జనము భయమునొందదో, 15. ఎవడు లోకమువలన భయమునొందడో, 16. ఎవడుసంతోష భయద్వేషములచేత గలతనొందని మనస్సు గలవాడో, అట్టివాడును నాకు ప్రియుడు.

శ్లో॥ అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః ॥ 16

పద॥ అనపేక్షః - శుచిః - దక్షః - ఉదాసీనః - గతవ్యథః, సర్వారంభపరిత్యాగీ - యః - మద్భక్తః - సః - మే - ప్రియః,

ప్రతి॥ యః మద్భక్తః = ఏ నా భక్తుడు, అనపేక్షః = దేనియందు నపేక్ష లేని వాడును, శుచిః = బాహ్యాభ్యంతర శుద్ధిగల వాడును, దక్షః = కార్యదీక్ష గలవాడును, ఉదాసీనః = ఎందును తగులుకొననివాడును. గతవ్యథః = మనో వ్యాకులతలేని వాడును, సర్వారంభపరిత్యాగీ = సమస్తాడంబర కర్మలను వదలిన వాడును అగుచున్నాడో, సః = వాడు, మే ప్రియః = నాకు ప్రియుడు.

తా॥ 17. ఏ భక్తుడు దేనియందు అపేక్షలేనివాడును, 18. బాహ్యాభ్యంతరశుద్ధిగలవాడును, 19. కార్యసమర్థుడును, 20. దేనియందును తగులుకొనని మనస్సుగలవాడును, 21. మనోవ్యాకులత లేనివాడును, 22. లోకాడంబరములగు సమస్త కర్మములను వదలినవాడు నగుచున్నాడో వాడు నాకు ప్రియుడు.

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః ॥ 17

పద॥ యః - న - హృష్యతి - న - ద్వేష్టి - న - శోచతి - న - కాంక్షతి, శుభాశుభపరిత్యాగీ - భక్తిమాన్ - యః - సః - మే - ప్రియః

ప్రతి॥ యః = ఎవడు, న హృష్యతి = సంతోషింపడో, న ద్వేష్టిః = ద్వేషింపడో, న శోచతి = దుఃఖింపడో. న కాంక్షతి = కోరడో, యః =ఎవడు శుభాశుభ పరిత్యాగీ = శుభాశుభములను వదలినవాడో, సః భక్తిమాన్ = అట్టి భక్తుడు, మే ప్రియః = నాకు ప్రియుడు.

తా॥ 23. ఎవడు ఇష్టవస్తువులు లభించునపుడు సంతోషింపని వాడును, 24. అనిష్టవస్తువులు సంభవించినపుడు ద్వేషింపనివాడును, 25. ప్రియవస్తువుల వినియోగమునందు పరితాపమునొందనివాడును, 26. ప్రాప్తముగాని వస్తువులను కోరనివాడును, 27. శుభాశుభ కర్మలచే విడువబడినవాడును, 28. భగవంతునియందు సదా భక్తిగల వాడు నగుచున్నాడో, అట్టివాడు నాకు ప్రియుడు.

శ్లో॥ సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః ॥ 18

శ్లో॥ తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః ॥ 19

పద॥ సమః - శత్రౌ - చ - మిత్రే - చ - తథా - మానావమానయోః.
శీతోష్ణసుఖదుఃఖేషు - సమః - సంగవివర్జితః.
తుల్యనిందాస్తుతిః - మౌనీ - సంతుష్టః - యేన - కేనచిత్,
అనికేతః - స్థిరమతిః - భక్తిమాన్-మే - ప్రియః - నరః.

ప్రతి॥ శత్రౌ చ = శత్రువునందును, మిత్రే చ =స్నేహితునియందును, సమః = సమానుడును. తథా=అటులనే, మానావమానయోః =పూజాపరాభవముల యందును, సమః = సమానుడును, శీతోష్ణసుఖదుఃఖేషు=శీతము ఉష్ణము సుఖము దుఃఖము అనువానియందు,సమః=సమానుడును,సంగవివర్జితః= సర్వసంగవివర్జితుడును, తుల్యనిందాస్తుతిః = నిందయందు స్తుతియందు సమానుడును, మౌనీ = మననశీలుడును (మౌనముగలవాడును), యేన కేనచిత్ = శరీరము నిలుచుటకు తగిన ఏ యాహారపదార్థముచేతనైనను, సంతుష్టః=సంతోషమునొందువాడును, అనికేతః = నియతమైన నివాసము లేనివాడును, స్థిరమతిః=నిశ్చయబుద్ధిగల వాడును, భక్తిమాన్=నాయందు భక్తిగలవాడునైన, నరః=నరుడు, మే=నాకు, ప్రియః = ప్రియుడు.

తా॥ 29. శత్రువునందును, మిత్రునియందును, అటులనే మానావమానములయందు సమానుడును, శీతము ఉష్ణము సుఖము దుఃఖమనువానియందు సముడును, సమస్త సంగములనుండి మిక్కిలి విడుదల పొందినవాడును. 30. నిందయందు స్తుతియందు సమానుడును, 31. మననశీలుడును (మౌనముగలవాడును) అనగా దేనినైన సహించు స్వభావము గలవాడును, 32. శరీరము నిలుచుటకు తగిన యే యాహారపదార్థము లభించినను సంతోషించువాడును,33. నియతమైన నివాసము లేనివాడును, అనగా నే సమయమున నే స్థలము దొరకునో దానివలన సంతోషపడువాడు, (ఇది యొకేస్థలములోనుండి ధ్యాననిష్ఠ చేయువానినిగుఱించి చెప్పినదిగాదు. సర్వసంగపరిత్యాగియై విహరించువానిని గుఱించి చెప్పడమైనది),34.పరమార్థజ్ఞానవిషయమై సుస్థిరమైన మనస్సు కలవాడును, 35. భగవంతునియందు [illegible] మైన భక్తిగలవాడును నాకు ప్రియుడు.

వి॥ దీనియందు పరమభక్తుని లక్షణములు (గుణములు) 35 చెప్పబడినవి. సమానార్థకములగుటచే కొన్నిగుణములను ఒకటిగ చేర్చి లెక్కసంఖ్యగ పేర్కొనమ

టయు గూడగలదు. 18-వ శ్లోకమున అటులే చేయబడినది. ఈ 35 గుణము లలో గూడ కొన్నింటిని ఒకటిగ చేర్చవచ్చును, అట్లయిన 35 సంఖ్యలో కొన్ని తగ్గిపోవును, సంఖ్యలు తగ్గినను చెప్పిన గుణములు మాత్రము తప్పక గలిగి యుండవలయును. మఱియు కొన్ని లక్షణముల వేరువేరుపఱచిన కొన్నిసంఖ్య లింకను అధికము కాగలవు. ఈ శ్లోకములన్నిటియొక్క యంత్యమున "భక్తిమాన్మే ప్రియోనరః" "భక్తిమాన్ యస్స మే ప్రియః" అని ప్రయోగింపబడుట గమనింపదగినది. ఇచ్చట భగవంతునియందు ప్రీతిగల భక్తుడని చెప్పక భగవంతునకు ప్రియుడైన భక్తుడని చెప్పబడెను. కాన దీనినిగురించి భక్తులు బాగుగా యోచించుకొనవలయును, ఏలనన-సామాన్యముగా భక్తులందఱును తాము భగవంతునిపై ప్రీతిగలవారమని తలంచుచుందురేగాని, భగవంతుడు తమపై ప్రీతి గలిగియున్నాడా? లేడా?యని యోచించువారరుదుగా నున్నారు ఇదే దీనిలోగల కీలకము. ఈ రహస్యమును తెలిసికొని యెల్లప్పుడును తామాచరించెడు కార్యములు భగవంతునికి ప్రీతికరములా? కావా? యని విచారణ చేయుచుండవలెను. భగవదాజ్ఞాపూర్వకమగు ధర్మమునకు వ్యతిరేకముగా నడువక భగవద్భక్తి గలిగి యుండినమాత్రమే భగవంతునకు భక్తులపై ప్రీతిగలుగునని సదా జ్ఞాపకముంచుకొనవలెను. అట్లుగాక తాము భగవద్భక్తులమని తలంచి భగవదాజ్ఞారూపమగు ధర్మమునకు వ్యతిరేకముగా ప్రవర్తించిన భగవంతునికి ప్రీతిగలుగదు. కనుకనే పైరీతిగా ప్రయోగించుటకు కారణమైనది. కావున ఈ కీలకమును తెలిసికొనవలెను, లేనిచో మోసపోయెదరు.

శ్లో॥ యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్దధానా మత్పరమా భక్తా స్తేఽతీవ మే ప్రియాః ॥ 20

పద॥ యే - తు - ధర్మ్యామృతం - ఇదం - యథా - ఉక్తం - పర్యుపాసతే. శ్రద్దధానాః - మత్పరమాః - భక్తాః - తే - అతీవ - మే - ప్రియాః.

ప్రతి॥ యే తు = ఎవరైతే. శ్రద్దధానాః = శ్రద్ధావంతులును, మత్పరమాః= పరమాత్మయే పరమగతియని నమ్మకము గలవారలును నై, ఇదం = ఇప్పుడు నేను చెప్పిన, ధర్మ్యామృతం=అమృతస్వరూపమగు మోక్షసాధనమైన ధర్మమును యథోక్తం = యథావిధిగా, పర్యుపాసతే = అచరించుచున్నారో, తే భక్తాః=అట్టి భక్తులు, మే=నాకు, అతీవ ప్రియాః= మిక్కిలి ప్రియులు.

తా॥ ఎవరైతే యీ యధ్యాయమందలి 13-వ శ్లోకము మొదలు 19-వ శ్లోకము వఱకు చెప్పబడినదియును, ధర్మమునుండి తొలగనిదియును, అమృతసమానమైన మోక్షసాధనమైన అద్వేష్టృత్వాది ధర్మ సముదాయమునందు శ్రద్ధగలిగి, పరమాత్మయే పరమ గతిగా తలంచుచు, యథోక్తప్రకారము ఆచరించుచున్నారో, అట్టి భక్తులు నాకత్యంత ప్రియులగుదురు.

వి॥ ఈ అధ్యాయాంతమున "ధర్మ్యామృతం" అని ప్రయోగించుటచే అమృత సమానమైన యీ ధర్మమునుండి తొలగనివారు నాకు మిక్కిలి ప్రియులని శ్రీకృష్ణభగవానులు స్వయముగా వచించిరి. ఇచ్చటనే పైచెప్పిన విశేషార్థము యొక్క కీలకము గలదు. ఇచట ధర్మ్యామృతము ఎన్నంచబడినది. వేదముయొక్క రెండవ భాగమగు ఉపాసనాకాండ యీ భక్తియోగముతో సమాప్తి యగుచున్నది.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే భక్తియోగో నామ
ద్వాదశో௨ధ్యాయః.

పద॥ ఇతి - శ్రీమద్భగవద్గీతాసు-ఉపనిషత్సు- బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే – భక్తి యోగః - నామ - ద్వాదశః – అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇది, ఉపనిషత్సు = ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యాయాం = బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రే = యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదే = శ్రీకృష్ణార్జునసంవాదరూపము నగు, శ్రీమద్భగవద్గీతాసు = శ్రీ భగవద్గీతయందు, భక్తియోగః నామ = భక్తియోగమను ప్రసిద్ధిగల, ద్వాదశః అధ్యాయః=పండ్రెండవ అధ్యాయము సంపూర్ణము,

తా॥ ఇట్లు ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యాస్వరూపము, యోగశాస్త్రము,కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీమద్భగవద్గీతయందు భక్తియోగమను ప్రసిద్ధిగల పండ్రెండవ యధ్యాయము ముగిసెను.

ఓమ్ తత్ సత్.



ఓమ్

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత

## త్రయోదశోఽధ్యాయః — త్రయోదశాధ్యాయము

## క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగః — క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

-:(౦):-

కాండత్రయాత్మకమగు భగవద్గీతలో మొదటి ఆరధ్యాయములలో విశేషించి మూడవఅధ్యాయమున నిష్కామకర్మయోగము ప్రతిపాదింపబడుటచేత నిష్కామ కర్మయోగము ప్రథమకాండ మనబడును. 7నుండి12-వ అధ్యాయమువఱకు ననే కోపాసనలును, కట్టకడదగు 12-వ అధ్యాయమున భక్తియోగము లేక భగవదు పాసన నిరూపింపబడినది. కనుక నిది ద్వితీయకాండ యనబడును. ఇక నీ పద మూడవ యధ్యాయమునుండి తృతీయమగు జ్ఞానముపదేశింపబడుట వలన దీనిని జ్ఞానకాండమని మహనీయులు చెప్పుదురు. ఇటుల వేదములో వలె గీతాశాస్త్ర ములోగూడ కాండత్రయము ఉపదేశింపబడినది. కనుకనే 13-వ అధ్యాయమును 'క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగ'మని చెప్పుటకు కారణమైనది. మతత్రయాచార్యులగు శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీమధ్వాచార్యులు ఒక్కొక్క యోగమును లోకములో తెలుపుటకొఱకవతరించిన వారలు. జ్ఞానకాండమును శ్రీశంకరులును, ఉపాసనా కాండమును శ్రీరామానుజులును, నిష్కామకర్మయోగ కాండమును శ్రీమధ్వా చార్యులు నుపదేశించిరి. ఈ మూడు నొకదానికొకటి సమన్వయపడియే యుంటు న్నవి. ఈ యాచార్యత్రయమున మొదట శ్రీశంకరాచార్యులు, తరువాత శ్రీరామా నుజాచార్యులు, పిమ్మట శ్రీ మధ్వాచార్యులు జన్మించి యుండిరి. శ్రీ మధ్వా చార్యులు నిష్కామకర్మయోగానుష్ఠానముచే దేహేంద్రియముల శుద్ధియు, శ్రీ రామానుజాచార్యులు ఉపాసనా యోగముచే జీవుని దోషనివృత్తియు, శ్రీ శంకరాచార్యులు జ్ఞానోపదేశముచే అవిద్యా నివృత్తియగు బ్రహ్మప్రాప్తియు గల్గునని వచించిరి. నిష్కామకర్మయోగముచే జ్ఞానేంద్రియములైదును, కర్మేం ద్రియములైదును చేరి స్థూలదేహము శుద్ధమగును. భగవదుపాసనచే జీవుని యొక్క యుపాధిభూతమగు మనోబుద్ధి చిత్తాహంకారరూప సూక్ష్మదేహము నిర్మలమగును. జ్ఞానానుష్ఠానమువలన, జీవునియొక్క మాయోపాధియగు కారణ దేహము లేక మూలాజ్ఞానము నశించి బ్రహ్మాత్మైక్య జ్ఞానబోధము గలుగును.

కావున ముగ్గురు ఆచార్యులును ఒకదానికొకటి సంబంధించి యుపదేశించిరేగాని, భిన్నభిన్నముగా చెప్పియుండలేదు. కావున నీ మూడుపద్ధతులును ముముక్షువులకు ముఖ్యముగా ననుష్ఠేయములు. ఇచట ఒక్కొక్క ఆచార్యు లొక్కొక్క దేహశుద్ధిని గూర్చి చెప్పినట్లు మనము గ్రహించినను, ఆ యా ఆచార్యులు బోధించిన యోగములచేతనే మూడు దేహములు క్రమముగా శుద్ధములై చివరికి మోక్షము గలుగునని యభిప్రాయపడిరి. అట్లుగానిచో వారి మతము సిద్ధాంతము గాక పోవును. మోక్షము గలుగని మతము నెవరును నమ్మజాలరు. ఈ యధ్యాయమునకు 'క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమని' పేరు. పంచభూతాత్మక మగు శరీరమెటువంటిదో, దీనియం దధివసించెడు క్షేత్రజ్ఞుడగు ఆత్మ యెటువంటిదో, వీటిని వేరుపఱచి తెలిసికొనుట వలనను యోగము అనగా ఆత్మతో నైక్యము గలుగును కావున నిదియు నొక యోగ మనంబడును.

అర్జున ఉవాచ:- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ ।
ఏతద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ! ॥ 1

పద॥ ప్రకృతిం - పురుషం - చ - ఏవ - క్షేత్రం - క్షేత్రజ్ఞం - ఏవ - చ,
ఏతత్ - వేదితుం - ఇచ్ఛామి - జ్ఞానం - జ్ఞేయం - చ - కేశవ!.

ప్రతి॥ హే కేశవ! = ఓ శ్రీకృష్ణమూర్తీ! ప్రకృతిం = ప్రకృతియను దానిని, పురుషం ఏవ చ = పురుషుడను వానిని, క్షేత్రం = క్షేత్రమను దానిని, క్షేత్రజ్ఞం ఏవ చ = క్షేత్రజ్ఞుడనువానిని, జ్ఞానం = జ్ఞానమను దానిని, జ్ఞేయం చ = తెలిసికొన వలసిన దానిని, ఏతత్ = దీనినంతయు, వేదితుం = తెలిసికొనుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా॥ ఓ కృష్ణమూర్తీ! ప్రకృతి యొక్క స్వరూపమెట్టిది? పురుషుడెవ్వడు? క్షేత్రమనగానేమి? క్షేత్రజ్ఞు డనబడు వాడెవ్వడు? జ్ఞానమనగా నెట్టిది? జ్ఞేయమనగా నెట్టిది? వీటియొక్క స్వరూపములన్నింటిని చక్కగా దెలియగోరుచున్నాను. కాన దెలుపుము.

వి॥ ఈ శ్లోకములో 1. ప్రకృతియనగా నెట్టిది. 2. పురుషుడనగా నెటువంటి వాడు? 3. క్షేత్రమనగానెట్టిది? 4. క్షేత్రజ్ఞుడనగా నెవ్వడు? 5. జ్ఞానమనగా నేమి? 6. జ్ఞేయమనగా నెట్టిది? అను ఆరుప్రశ్నలుగలవు. ఈ ఆరుప్రశ్నలనుజ్ఞాపకముంచు

కొనినమాత్రమే యికమీద శ్రీభగవానుడుపదేశింపబోయెడు సమాధానము గోచరము గాగలదు. ఈ యారుప్రశ్నలలో మొదటివి సామాన్యములు. కనుకనే వాటికి ఒక్కొక్కవాక్యముచే సమాధానము చెప్పడమైనది. జ్ఞానమును, జ్ఞేయమును గూర్చిన రెండు ప్రశ్నలు ముఖ్యములు. ఇవి ముముక్షువుల కత్యావశ్యములు. జ్ఞానమునకు కొన్ని స్థలములలో ఆత్మసాక్షాత్కారజ్ఞానమని పేరు గలదు. కొన్నిస్థలములలో జ్ఞానికి ఉండవలసిన గుణములే జ్ఞానమని చెప్పబడును. ఇచ్చట జ్ఞానశబ్దమునకు అర్థము జ్ఞానికుండవలసిన గుణములనియే గ్రహించవలెను. వాటిని గుఱించియే ఇచట చెప్పడమైనది. ఈ సత్యమును తెలిసికొనకపోయినచో కొందఱు జ్ఞానికుండ వలసిన కొన్ని గుణము లుండుటచేతనే తాము బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గలవారమైతిమని తలంచగలరు. అట్లు మోసపోకూడదు.

శ్రీభగవానువాచ:— శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 2

పద॥ ఇదం - శరీరం - కౌన్తేయ! - క్షేత్రం - ఇతి - అభిధీయతే,
ఏతత్ - యః - వేత్తి - తం - ప్రాహుః - క్షేత్రజ్ఞః-ఇతి - తద్విదః.

ప్రతి॥ హే కౌన్తేయ! = కుంతీపుత్రుడవగు ఓయర్జునా! ఇదం శరీరం = ఈ దేహము, క్షేత్రం ఇతి = క్షేత్రమని, అభిధీయతే = చెప్పబడుచున్నది, ఏతత్ = దీనిని, యః వేత్తి=ఎవడెరుగుచున్నాడో, తం= వానిని, క్షేత్రజ్ఞః ఇతి=క్షేత్రజ్ఞుడని, తద్విదః=ఆ విషయము నెఱింగినవారు(తత్త్వవేత్తలు), ప్రాహుః = చెప్పుదురు.

తా॥ కుంతీపుత్రుడవగు ఓ యర్జునా! ఈ దేహము క్షేత్రమని చెప్పబడుచున్నది. దీనిని (అనగా క్షేత్రధర్మమును) ఎవడెఱుంగుచున్నాడో, వానిని క్షేత్రజ్ఞుడని, క్షేత్ర క్షేత్రజ్ఞుల తత్త్వము నెఱింగిన వారు చెప్పుదురు.

వి॥ క్షేత్రమనగా భూమికిగూడ పేరుగలదు. బీజము పూర్ణవృక్షమై వికాసము నొందుటకు భూమి యెటువంటిదో, బ్రహ్మ విచారాద్యనుష్ఠానములచే పూర్ణత్వమగు బ్రహ్మత్వము నొందుటకు ఈ దేహము అట్టిదే. అనగా బ్రహ్మప్రాప్తికి దేహము ముఖ్యసాధనము. బీజము వృక్షమై ప్రబలుట కెరువు మొదలగు పోషణద్రవ్యము లెటువంటివో, సత్య శమదమాదు లాత్మాభివృద్ధికి

సాధనములు. ఇప్పుడు మనుష్యులచే నిర్మింపబడిన చైతన్యరహితమగు దేవాలయములను, వాటిలో గల దేవతలను జనులు భక్తిగలిగి ఆరాధింతురేగాని, దైవముచే నిర్మింపబడిన చైతన్యవంతములగు దేహములనెడు దేవాలయములను, వాటిలో సాక్షాదీశ్వర స్వరూపులుగానున్న ఆత్మాభిన్నులగు జీవులను ప్రేమించువారు, నాదరించువారెంతమంది గలరు? దీనినిబట్టి జనులయొక్క జ్ఞానము ఎట్టిదో వారిబుద్ధి యెంత సూక్ష్మమైనదియో, తెలిసికొనవచ్చును. ఉత్తరప్రదేశమునకును, దక్షిణదేశమునకును ఇచ్చటనే చాల తారతమ్యము గలదు. దక్షిణదేశీయులు జడములగు దేవాలయములకే ధనమంతయు వినియోగింతురు. ఉత్తరదేశీయులు దేవళములు చిన్నవిగా నేర్పరచినను ధర్మబోధకులను, సాధువులను, విద్యాభ్యాసముచేయు బ్రహ్మచారులను విశేషముగా ఆదరింతురు. వారాత్మపూజనే ముఖ్యముగా తలంతురు. శ్రీకాశీ, ద్వారక, బదరీనాథ క్షేత్రములను; కంచి, శ్రీరంగ, రామేశ్వరాది క్షేత్రములను చూచిన యీ సత్యము బోధపడగలదు. ఈ దాక్షిణాత్యులు కల్పితములగు దైవములనారాధించువారు. ఔత్తరేయులో అకల్పితులగు జీవులను (చైతన్యములను) ఆరాధించుటలో శ్రద్ధగలవారు. కనుకనే ఉత్తరదేశము జ్ఞానభూమియనియు, దక్షిణదేశము కర్మభూమియనియు చెప్పుటకు కారణము. జ్ఞానభూమియగు నుత్తరదేశములో నెన్నియో ధర్మసత్రములు, ధర్మపాఠశాలలు గలవు, అటువంటి దొక్కటియైన నీ దక్షిణదేశమందు గలదా?

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత! ।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ ॥ 3

పద ॥ క్షేత్రజ్ఞం - చ - అపి - మాం - విద్ధి - సర్వక్షేత్రేషు - భారత!, క్షేత్రక్షేత్రజ్ఞయోః - జ్ఞానం - యత్ - తత్ - జ్ఞానం - మతం - మమ.

ప్రతి॥ అపి చ = మఱియును, హే భారత!=భరతవంశీయుడవగు ఓ యర్జునా!, సర్వక్షేత్రేషు = సమస్త దేహములయందుండెడు, క్షేత్రజ్ఞం = క్షేత్రజ్ఞుని (జీవుని), మాం=నన్నుగా, విద్ధి=ఎఱుంగుము, క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞానం= దేహాత్మలయొక్క స్వరూపము నెఱుంగునది, యత్ = ఏదిగలదో, తత్ జ్ఞానం = అదియే జ్ఞానమని, మమ మతం = నాకు సమ్మతమగును.

తా॥ బ్రహ్మాది స్తంభపర్యంతము గల సకలోపాధులయందు నుపాధి భేదముచే వేరుగానున్నను, పరమార్థజ్ఞానముచేత నొక్కటేయగు

ఆత్మయే నేనని తెలిసికొనుము. ఇట్టి క్షేత్రక్షేత్రజ్ఞులను తెలిసికొనెడి జ్ఞాన మేదిగలదో, అదియే నిజమైన జ్ఞానమని నామతము.

వి॥ దీనియందు క్షేత్రజ్ఞుని పరమాత్మస్వరూపముగా దెలిసికొనెడు జ్ఞాన మేది గలదో, అదే నిజమైన భగవత్సమ్మతమగు జ్ఞానమని స్వయముగా భగవంతుడే యుప దేశించెను, కనుకనే "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని చెప్పుటకు కారణ మైనది మఱియు క్షేత్రముయొక్క యుత్పత్తి స్వభావాదులనుగూడ తెలిసికొన వలెను.

శ్లో॥ తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।
న చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥ 4

పద॥ **తత్** - క్షేత్రం-యత్ - చ-యాదృక్- చ- యత్- వికారి-యతః-చ-యత్, సః - చ - యః -యత్-ప్రభావః - చ - తత్- సమాసేన — మే - శృణు.

ప్రతి॥ **తత్ క్షేత్రం** = **అక్షేత్రము** (శరీరము), యత్ చ = ఎట్టిరూపముగలదియో, యాదృక్ చ = ఎట్టి స్వభావముగలదియో, యత్ వికారి=ఏలాటివికారము గలదియో, యతః చ యత్ = దేనివలన నేది బుట్టినదో,సః చ= అక్షేత్ర జ్ఞుడును(జీవుడును),యః = ఎవ్వడో, యత్ప్రభావః చ = ఎట్టి ప్రభావము గలవాడో, **తత్** = దానిని, మే = నావలన, సమాసేన = సంక్షిప్తముగా, శృణు = వినుము.

తా॥ ఆ క్షేత్రమేదియో, ఎట్టిరూపముగలదియో, ఎట్టి స్వభావము గలదియో, ఏలాటి వికారముకలదియో, దేనివలన నేది పుట్టినదో, ఆ క్షేత్రజ్ఞుడెవడో, అతడెట్టి ప్రభావము గలవాడో ఆ విషయమును నావలన సంగ్రహముగా వినుము.

శ్లో॥ ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥ 5

పద॥ **ఋషిభిః - బహుధా - గీతం - ఛన్దోభిః - వివిధైః - పృథక్, బ్రహ్మసూత్రపదైః - చ - ఏవ — హేతుమద్భిః - వినిశ్చితైః.**

ప్రతి॥ (క్షేత్రక్షేత్రజ్ఞులస్వరూపము) ఋషిభిః=ఋషులచేత, బహుధా=పలువిధ ములుగను, వివిధైః ఛన్దోభిః - నానావిధములగు వేదములచేత,పృథక్= ప్రత్యేకముగాను, హేతుమద్భిః=సయుక్తికములును, వినిశ్చితైః=నిశ్చితార్థ

ములు గలవియునగు. బ్రహ్మసూత్రపదైః చ ఏవ = బ్రహ్మసూత్రపద ములచేత, గీతం = చెప్పబడియున్నది.

తా॥ వసిష్ఠుడు మొదలగు ఋషులచేత అనేక విధములుగాను, ఋగ్వేదము మొదలుగాగల నాల్గువేదములచేత నానావిధములుగాను, విశదములుగాను యుక్తియుక్తములును, సంశయ రహితములుగ నిశ్చయింపబడినవియు నగు శ్రీవేదవ్యాస ప్రణీతములైన బ్రహ్మసూత్ర పదములచేతను ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపము చెప్పబడియున్నది.

వి॥ శ్రీకృష్ణభగవానునకు ఋషులపై, వేదములపై శ్రీవేదవ్యాసప్రణీత బ్రహ్మ సూత్రములపై నెంతభక్తియు, విశ్వాసమును ఉన్నదో, దీనివలన దెలియదగును. సర్వజ్ఞుడగు భగవంతుడే అంత వినమ్రభావము గలిగియుండగా ప్రస్తుతము సామాన్య జనులయొక్క స్థితిని గుఱించి యేమని చెప్పవచ్చును? మఱియు నీ క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపమును తెలిసికొనుటయే యుత్తమజ్ఞానమని ఋషు లును, వేదములును, బ్రహ్మసూత్రములును తెలుపుచున్నవని నిరూపించుట కొఱకిట్లు చెప్పడమైనది.

శ్లో॥ మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ ।
ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః ॥ 6

,, ఇచ్ఛాద్వేషస్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥ 7

పద॥ మహాభూతాని - అహంకారః - బుద్ధిః - అవ్యక్తం - ఏవ - చ,
ఇన్ద్రియాణి - దశ - ఏకం - చ - పఞ్చ - చ - ఇంద్రియగోచరాః.

,, ఇచ్ఛా - ద్వేషః - సుఖం - దుఃఖం - సంఘాతః - చేతనా - ధృతిః,
ఏతత్ - క్షేత్రం - సమాసేన - సవికారం - ఉదాహృతమ్.

ప్రతి॥ మహాభూతాని = పంచమహాభూతములు, అహంకారః = అహంకారము, బుద్ధిః = బుద్ధి, అవ్యక్తం ఏవ చ = మూలప్రకృతియు, దశ ఇంద్రియాణి= కర్మేంద్రియములు ఐదు,జ్ఞానేంద్రియములు ఐదు,కూడి దశేంద్రియములు, ఏకం చ = ఒకటియగు మనస్సు, ఇంద్రియగోచరాః పంచ చ = ఇంద్రియ విషయములైదును, ఇచ్ఛా = కోరిక, ద్వేషః = ద్వేషము, సుఖం = సుఖము, దుఃఖం = దుఃఖము,సంఘాతః = ఈ పై చెప్పబడిన యన్నిటి

యొక్క (ఇంద్రియాది సమూహము)కూడిక, చేతనా = జ్ఞానాత్మక అంతః కరణవృత్తి, ధృతిః = ధైర్యము, అను, సవికారం = వికారసహితమైనది, ఏతత్ = ఈ, క్షేత్రం = క్షేత్ర(శరీర) మని, సమాసేన=సంగ్రహముగా, ఉదాహృతమ్ = చెప్పబడినది.

తా॥ పంచమహాభూతములు, అహంకారము, బుద్ధియు, మూల ప్రకృతియు, త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వా ఘ్రాణములను జ్ఞానేంద్రియములైదును, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము లనియెడు కర్మేంద్రియములైదును, మనస్సు, జ్ఞానేంద్రియములకు గోచరములగు శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధమను నవి యైదు,ఇచ్ఛయు, ద్వేషము, సుఖము, దుఃఖము, ఇంద్రియాది సమూహము, జ్ఞాన స్వరూపమగు మనోవృత్తి, (తెలివి) ధైర్య మును,అను ఇంద్రియవికారములతో గూడినది యీ క్షేత్రము.(అనగా శరీరము అని సంక్షేపముగా జెప్పబడెను.)

వి॥ దీనియందు బుద్ధివృత్తిగూడ క్షేత్రమునకు సంబంధించినదిగాజెప్పబడి నది. కావున ఆత్మ బుద్ధికిన్ని యతీతమైనదని తెలియవలెను. మఱియు 'సవికార ముదాహృతం' అనుటచే నివి యన్నియు వికారలక్షణముతో గూడినవి. ఆత్మ నిర్వికార స్వరూపమని తేలినది. అట్టియాత్మస్థితి గలవానికి వికారముండరాదు.

ఇచ్చటినుండి జ్ఞానియొక్క లక్షణములు 'అమానిత్వం' ఇత్యాదిగా ఐదుశ్లోక ములచే వివరింపబడుచున్నవి. అనగా 8-వ శ్లోకము మొదలు 12-వ శ్లోకము వఱకు జ్ఞాని లక్షణములని తెలియవలెను.

శ్లో॥ అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః ॥ 8

,, ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥ 9

,, అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ॥ 10

,, మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ।
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది ॥ 11

అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।
ఏతత్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా ॥ 12

పద॥ అమానిత్వం - అదంభిత్వం - అహింసా - క్షాంతిః - ఆర్జవం,
ఆచార్యోపాసనం - శౌచం - స్థైర్యం - ఆత్మవినిగ్రహః.

,, ఇంద్రియార్థేషు - వైరాగ్యం - అనహంకారః - ఏవ - చ,
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్,

,, అసక్తిః - అనభిష్వంగః - పుత్రదారగృహాదిషు,
నిత్యం - చ - సమచిత్తత్వం - ఇష్టానిష్టోపపత్తిషు

,, మయి - చ - అనన్యయోగేన - భక్తిః- అవ్యభిచారిణీ,
వివిక్తదేశసేవిత్వం - అరతిః - జనసంసది.

,, అధ్యాత్మజ్ఞాననిత్యత్వం - తత్త్వజ్ఞానార్థదర్శనం,
ఏతత్ - జ్ఞానం - ఇతి - ప్రోక్తం - అజ్ఞానం - యత్ - అతః -అన్యథా.

ప్రతి॥ అమానిత్వం =ఆత్మస్తుతి లేకుండుట, అదంభిత్వం=డంబాచారము లేకుండుట, అహింసా=పరప్రాణులను బాధింపకుండుట, క్షాంతిః = సహనము గలిగియుండుట, ఆర్జవం = ఋజుస్వభావము గలిగియుండుట, ఆచార్యోపాసనం = గురుసేవాపరుడై యుండుట, శౌచం = బాహ్యాభ్యంతరశుద్ధి గలిగియుండుట, స్థైర్యం = చిత్తచాంచల్యము లేకుండుట, ఆత్మవినిగ్రహః = మనో నిగ్రహము గలిగియుండుట. ఇంద్రియార్థేషు వైరాగ్యం = ఇంద్రియవిషయములయందు విరక్తి, అనహంకారః ఏవ చ = అహంకారము లేకుండుటయు, జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనం = జననము, మరణము, జరావ్యాధులచే గలిగెడు దుఃఖమును దోషముగ నెఱుంగుటయు (లేక జన్మమృత్యు జరా వ్యాధి దుఃఖముల లోని దోషమును విమర్శించుట), అసక్తిః = ఏ వస్తువులయందు నాసక్తి లేకుండుట, పుత్రదారగృహాదిషు = ఆలుబిడ్డలు ఇండ్లు మొదలగువాని యందు, అనభిష్వంగః = సంగము (వ్యామోహము) లేనివాడై యుండుట, నిత్యం = ఎల్లప్పుడును, ఇష్టానిష్టోపపత్తిషు = ఇష్టానిష్టముల సంప్రాప్తియందు, సమచిత్తత్వం చ = సమబుద్ధి గలిగి యుండుటయు, మయి = నాయందు, అనన్యయోగేన = నాకంటె నితరమగు దేని యందును మనస్సును చేర్చకుండుట యను యోగముచే, అవ్యభిచారిణీ=

ఎట్టి విపత్తులలోగూడ చలించని, భక్తిః చ = భక్తిగలిగి యుండుటయు, వివిక్తదేశసేవిత్వం = విజనస్థలములయందుండగోరుట (ప్రతిబంధము లేని స్థలమందుండుట), జనసంసది = జనసమూహమునందు, అరతిః= ప్రీతిలేకుండుట, అధ్యాత్మజ్ఞాననిత్యత్వం = సదా ఆత్మధ్యానమందు మనస్సును నిలుపుటయు, తత్త్వజ్ఞానార్థ దర్శనం=తత్త్వజ్ఞానము వలన గలిగెడు మహాప్రయోజనము ఇట్టిదని యెఱుంగుటయు, ఏతత్ = ఇది, జ్ఞానం ఇతి = జ్ఞానమని, ప్రోక్తం =చెప్పబడినది, అతః అన్యథా యత్= దీనికి వేరైన దేదిగలదో అది, అజ్ఞానం = అజ్ఞాన మనబడుచున్నది.

తా॥ 1. అమానిత్వము, 2. అదంభిత్వము, 3. అహింస, 4. క్షాంతి, 5. ఆర్జవము (కపటము లేకుండుట), 6. ఆచార్యోపాసనము, 7. శౌచము, 8. స్థైర్యము, 9. ఆత్మవినిగ్రహము, 10. ఇంద్రియార్థములయందు వైరాగ్యము, 11. అనహంకారము, 12. జన్మ మృత్యు జరావ్యాధులచే గలిగెడు దుఃఖమును దోషముగా భావించుట, లేక జన్మ మృత్యుజరా వ్యాధి దుఃఖములలోని దోషమును విమర్శించుట, 13. అనక్తిలేకుండుట, 14. పుత్ర దార గృహాదులయందభిమానము లేక వ్యామోహము లేకుండుట, 15. ఇష్టానిష్టములు సంప్రాప్తములగునపుడు నిత్యము సమచిత్తత్వముతో నుండుట, 16. పరమేశ్వరునికంటె అన్యమేదియు లేదని నిశ్చయించి అచంచలమైన భక్తి గలిగియుండుటయు, 17. వివిక్తదేశసేవనమును, 18. పామర జనసంఘ మందరతియు అనగా ప్రీతిలేకుండుట, 19. అధ్యాత్మజ్ఞాన నిత్యత్వము, 20. తత్త్వజ్ఞానార్థదర్శనము ఇవి జ్ఞానమని చెప్పబడినవి. దీనికి వేరైన ప్రకృతిగుణములు గలిగి యుండిన, అది యజ్ఞానమని తెలియవలయును.

వి॥ ఇచ్చట చెప్పబడిన యీ 20 గుణములు ఆత్మజ్ఞానులకు, బ్రహ్మనిష్ఠులకు. సాధువులకు, పరమభక్తులకు తప్పక ఉండదగినవి. వీటికన్యమైన యే ప్రకృతిగుణమును గలిగియుండినను అది యజ్ఞానజనితమని గ్రహించి దానిని తొలగించుకొనవలెను. కర్షకులు వ్యవసాయము చేసియుండు పైరులో తాము పెట్టిన విత్తనములకన్న వేరు కలుపుండినచో నెట్లు తీసివేయుదురో, అలాగున

హృదయక్షేత్రములో, ఈ భగవద్గుణముల కన్యములగు ప్రకృతిగుణము లేవైన యుండినచో వెంటనే వాటిని తీసివేయవలయును. లేనిచో కలుపు తీయని పైరు ఏలాగున మంచిఫలము నివ్వజాలదో, అలాగువ ప్రకృతిగుణముండిన ఆత్మా నంద మనుభవింపజాలరు. మరియు కారణాంతరముచేగాని, సోమరితనముచేగాని ఈ సంవత్సరము కలుపుతీయనిచో, ఆ తృణబీజములన్నియు భూమిలోపడి మరు సంవత్సరము మఱింత కలుపు పెరిగిపోవును. అట్లే సోమరితనముచేతగాని, కారణాంతరముచేతగాని ఈ జన్మలో హృదయమును శుద్ధపఱచనిచో, మరు జన్మలో మఱింత ప్రకృతిగుణములతోగూడి, జ్ఞానమావరింపబడి బద్ధుడై పోవును. ఈ సత్యమునే శ్రీ కృష్ణభగవానుడు భక్తులపై కరుణకలిగి యుపదేశించెను. మఱియు నున్నతపాఠములను చదువుచుండువారు. పరీక్షాకాలము సమీపించిన పుడు చదువదలచిన పాఠములను శ్రద్ధతో రేయింబవలు చదివి యేలాగున హృదయస్థ మొనర్చుకొందురో, ఆలాగున నధ్యాత్మజ్ఞాన శాస్త్రములో ఈ 20 గుణములను బ్రహ్మనిష్ఠుడు సదా ఆచరణలో నుంచేలాగున చూడవలయును. అయితే యీ ప్రపంచ పరీక్షాకాలము కొన్నినెలలకు ముందుగానే గవర్నమెంటు వారు తెలుపుదురు. మనయొక్క దేహము వీడిపోయెడు సమయము తెలుపు వారులేరు. అట్టి పరీక్ష యీ క్షణమో, ఉత్తరక్షణమో, రేపో, మాపో, లేక కొద్దిరోజులకైన తప్పక వచ్చును. కావున ముముక్షువులందఱును ఈ క్షణము లోనే పరీక్షకు సిద్ధముగా నుండవలెను. సంవత్సరము పొడుగున చదివియు, పరీక్షరోజున ప్రశ్నకు తగిన యుత్తరము చెప్పక పోయిన మరుసంవత్సర మాతరగతిలోనే, అచ్చటయినను మఱి యెచ్చోటనైనను చదువవలసియుండును. ఆలాగున ఈ జన్మలోనే దైవగుణములు గలిగి ముక్తినొందక పోయిన, యింకొక జన్మమెత్తి తప్పక నీదైవగుణముల ననుష్ఠానములోనికి తీసికొని రావలసి యుండును. లేనిచో ప్రకృతినుండి విముక్తి గలుగదు. అయితే యీ సంవత్సరములో పరీక్షయందు కొన్నిటి యందు తీర్ణుడై కొన్నిటియందు తప్పి పోయినచో మరుసంవత్సరము తప్పిపోయిన భాగమును మాత్రము చదివి పరీక్ష యిచ్చిన చాలునుగదా అట్లే యీ జన్మలో దైవగుణముల కొన్నింటిని గలిగి యున్నను మరుజన్మమున బాల్యకాలమందుగాని, కొంతకాలము వెళ్ళినతరువాత గాని సంపూర్ణ విరక్తుడై దైవగుణములతో గూడి పూర్ణమైన దైవజ్ఞానమును పొందును. ఇదే దీనికి గుఱుతు.

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్ఞాత్వాఽమృత మశ్నుతే ।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥ 13

పద॥ జ్ఞేయం - యత్ - తత్ - ప్రవక్ష్యామి - యత్ - జ్ఞాత్వా - అమృతం - అశ్నుతే - అనాదిమత్ - పరం - బ్రహ్మ - న - సత్ - తత్ - న - అసత్ - ఉచ్యతే.

ప్రతి॥ యత్ = ఏది, జ్ఞేయం = ఎఱుంగదగినదో, యత్ = దేనిని, జ్ఞాత్వా = ఎఱింగి, అమృతం అశ్నుతే = అమృతమగు మోక్షమును పొందు చున్నాడో, తత్=దానిని. ప్రవక్ష్యామి = చెప్పెదను, తత్= అది, అనాదిమత్ పరం బ్రహ్మ = ఆదిలేనిదియు, నిరతిశయమయినదియు నగు బ్రహ్మము.(మఱియు నది), న సత్ = సత్పదార్థము కాదనియు. న అసత్ = అసత్పదార్థము కాదనియు, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ ఏది తెలియదగినదో, దేనిని తెలిసికొని మోక్షమును పొందుదురో, అట్టి దానిని స్పష్టముగా చెప్పెదను వినుము. దేనిని చెప్పబోవుచున్నానో అది యాదిలేనిదియు, నిరతిశయము నగు బ్రహ్మము. అది సత్పదార్థము కాదనియు, అసత్పదార్థము కాదనియు చెప్పబడుచున్నది.

వి॥ ఇదివఱలో చెప్పబడిన అమానిత్వాది ఇరువది గుణములు జ్ఞానమనియు, దీనివలన తృప్తి పొందగూడదనియు, జ్ఞేయమగు బ్రహ్మము నెఱింగి మాత్రమే జనన మరణ బంధముల నుండి విముక్తిగలిగి యమృతత్త్వము పొందగలరనియు నుపదేశించడమైనది.

ఈ జ్ఞానముగా చెప్పబడిన 20 గుణములలో ఏకాంతవాసమో, వైరాగ్యమో, భక్తియో యేవియో కొన్నిగుణములు ఉన్నంతమాత్రముచే కొందఱు తమను మహా గొప్పవారినిగా తలంచుచున్నారు. ఈ జ్ఞానము జ్ఞేయమును పొందుటకు సాధనమేగాని మఱియొకటిగాదు. ఇది యెట్టిదనగా, ఒక జిల్లాకలెక్టరుపని కావలెననిన ఐ. ఎ. యస్. పరీక్షలో నుత్తీర్ణుడు కావలెను. పరీక్షలో నుత్తీర్ణుడు కానిచో నుద్యోగము దొరకదు. అయితే పరీక్షలో నుత్తీర్ణుడైనను ఉద్యోగము లభింపనిచో దానివలన గలిగెడు గొప్పతనము గౌరవము కలుగదు. అయితే ఉద్యోగము చాలునని తలంచి పరీక్షలో నుత్తీర్ణుడు కానిచో అది లభించదు. కావున పరీక్షలో నుత్తీర్ణుడై ఉద్యోగము లభించిన మాత్రమే ఆస్థానమున ఆ గౌరవము లభించును.

అదేరీతిగా యోగము తపస్సు వైరాగ్యము, వేదాన్తశాస్త్ర పఠనము గలిగియుండిన చాలదు. ఇవి జ్ఞానములో చేరినవే. జ్ఞేయ (బ్రహ్మ)మగు సాక్షాత్ పరబ్రహ్మ జ్ఞానము కలుగవలెను. అప్పుడే జననమరణ రహితమగు ముక్తియనెడు అమృతత్వము గలుగును. అయితే ఆ బ్రహ్మము "సత్" అనిగాని "అసత్" అనిగావి, చెప్పబడలేదని తెలుపడమైనది. ఈ 'సత్' 'అసత్' విషయమై 11 అ. 37వ శ్లోకమున చెప్పినది చూడదగును. లేక యశుద్ధమాయతో గూడిన జీవుడును లేక శుద్ధమాయతోగూడిన ఈశ్వరుడును గాదనియు, జీవేశ్వరుల యశుద్ధ శుద్ధమాయోపాధులు రెండును లేనిదగు విశుద్ధపరబ్రహ్మ సాక్షాత్కారము గలుగుట యని గూడ గ్రహింపుకొనవచ్చును.

"కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః ।
కార్యకారణతాం హిత్వా పూర్ణబోధో విశిష్యతే ॥

తా॥ కార్యోపాధిగల బ్రహ్మచైతన్యము జీవుడనియు, కారణోపాధిగల బ్రహ్మ చైతన్య మీశ్వరుడనియు, ఉపాధిద్వయముల కడగా త్రోయునపుడు పూర్ణబోధమగు యనుభవజ్ఞానమొక్కటి మాత్రమే మిగులుచుండును. అట్టి స్థితి పొందవలెనని యిచ్చట యుపదేశించడమైనది.

శ్లో॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 14

పద॥ సర్వతః - పాణిపాదం - తత్ - సర్వతః - అక్షిశిరోముఖం,
సర్వతః - శ్రుతిమత్ - లోకే - సర్వం - ఆవృత్య - తిష్ఠతి.

ప్రతి॥ తత్ = ఆ బ్రహ్మము, సర్వతః = అంతట. పాణిపాదం=పాణిపాదములు గలదియును, సర్వతః =అంతట, అక్షిశిరోముఖం=నేత్రములు శిరస్సులు ముఖములు గలదియు, సర్వతః=అంతట, శ్రుతిమత్ = కర్ణములు గలది యునై, లోకే = లోకమునందు, సర్వం ఆవృత్య = సమస్త చరాచర ప్రపంచము నావరించి. తిష్ఠతి = ఉంటున్నది.

తా॥ తెలియదగిన యా బ్రహ్మము అంతటను చేతులు, కాళ్లు, కన్నులు, శిరస్సులు, ముఖములు, చెవులు గలదియై, సకల ప్రాణి సముదాయమునందును, అచేతన వర్గమునందును వ్యాపించియున్నది.

వి॥ ప్రతి యణువులోను తన యాత్మలోను జాగ్రత్స్వప్న సుషుప్తులులేని వాడై పరమాత్మ చూచుచునే యున్నాడు. వీమయొక్క సంకల్పమునుకూడ తెలిపి

కొను చున్నాడు. ఇట్టి యనుభవము గలుగుటయే దైవసాక్షాత్కారజ్ఞానమగును. ఇట్టి పర మాత్మకు తెలియక ఏకార్యమునైన నెవరైన నెప్పుడైన చేయగలరా? ఇట్టి యనుభవము గలిగిన భగవద్దృష్టినుండి యెవడు తప్పించుకొన గలుగును? ఇట్టి జ్ఞానము గలుగుటచే ఎల్లప్పుడును జారక జీవించెడు అవస్థ గలుగును, తన సంకల్పములకుగూడ సాక్షియై సదా యుండువాడగుటచే, తాను చేయు కృత్యములు ఇతర మనుష్యుల కెవరికిని దెలియకుండ జేసినను, తనయాత్మకు తెలియకుండ జేయగల్గునా? అట్టి సర్వసాక్షియైన యాత్మయే పరబ్రహ్మము. జీవులయొక్క పుణ్యపాపకర్మల ననుసరించి ఫలము నిచ్చువాడును ఆ సర్వేశ్వరుడే. ఈసత్యము నెఱింగి ప్రవర్తించుటయే నిజమైన సత్య జీవితమగును.

శ్లో॥ సర్వేన్ద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితం ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ 15

పద॥ సర్వేన్ద్రియగుణాభాసం - సర్వేన్ద్రియ వివర్జితం,
అసక్తం - సర్వభృత్ - చ - ఏవ - నిర్గుణం - గుణభోక్తృ - చ.

ప్రతి॥ (ఆ బ్రహ్మము) సర్వేన్ద్రియగుణాభాసం=సర్వేన్ద్రియములయొక్క గుణములను ప్రకాశింపజేయునట్టిదియును, సర్వేన్ద్రియవివర్జితం=సర్వేన్ద్రియములు లేనిదియు, అసక్తం = దేనిని అంటనిదియు, సర్వభృత్ చ ఏవ = సమస్త జగత్తును భరించునట్టిదియును, నిర్గుణం = సత్వరజస్తమోగుణ రహితమైనదియును గుణభోక్తృ చ=గుణముల ననుభవించునదియునై యున్నది.

తా॥ మఱియు నా బ్రహ్మము చక్షురాది సర్వేంద్రియముల యొక్క గుణములను ప్రకాశింప జేయునట్టిదియు, సకలేంద్రియములు లేనిదియు, దేనిని నంటనిదియు, సమస్త జగత్తును భరించునట్టిదియును, సత్త్వరజస్తమోగుణములు లేనిదియు, శబ్దాదులమూలముగా సత్త్వ రజస్తమోగుణములను పొందినదియు నయి యున్నది.

శ్లో॥ బహి రన్తశ్చ భూతానా మచరం చరమేవ చ ।
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥ 16

పద॥ బహిః - అన్తః - చ - భూతానాం - అచరం - చరం—ఏవ - చ
సూక్ష్మత్వాత్ - తత్ - అవిజ్ఞేయం - దూరస్థం - చ -అంతికే - చ - తత్

ప్రతి॥ (ఆ పరబ్రహ్మము) భూతానాం = చరాచరభూతములయొక్క, బహిః = వెలుపల, అంతః చ=లోపలను ఉండునట్టిదియును, అచరం=స్థావరరూప

మైనదియు, చరం ఏవ చ = జంగమరూపమైనదియునై యున్నది, తత్ = ఆ పరమాత్మ, సూక్ష్మత్వాత్ = సూక్ష్మరూపముగలదియగుటచేత, అవిజ్ఞేయం= ఎఱుగబడనిదియు, తత్ = ఆ పరమాత్మ, దూరస్థం చ = దూరమున నుండునట్టిదియు, అంతికే చ = సమీపముగా నుండునదియు నయియున్నది.

తా॥ ఆ బ్రహ్మము చరాచరములగు భూతములయొక్క లోపల బయటనుండునదియును, స్థావర జంగమాత్మకమునై యున్నది. మఱియు ఆ జ్ఞేయబ్రహ్మము సూక్ష్మమగుటవలన ఇటువంటిదని తెలియశక్యము కానిదియును, ఆత్మజ్ఞానసాధనములేని బహిర్దృష్టిగల వారికి బహుదూరముగా నుండునదియును, ఆత్మజ్ఞానసాధనము గలిగి యంతర్దృష్టిగలవారికి మిక్కిలి సమీపమందుండునదియు నగుచున్నది.

శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్ ।
భూతభర్తృ చ తత్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ 17

పద॥ అవిభక్తం – చ భూతేషు - విభక్తం - ఇవ - చ - స్థితం.
భూతభర్తృ - చ - తత్ - జ్ఞేయం - గ్రసిష్ణు - ప్రభవిష్ణు - చ.

ప్రతి॥ తత్ జ్ఞేయం = జ్ఞేయమగు ఆ పరమాత్మ, అవిభక్తం చ = విభజింపబడ నిదియు, భూతేషు = భూతములయందు, విభక్తం ఇవ స్థితం చ =విభజింపబడినదానివలె నుండునట్టిదియు, భూతభర్తృ చ = సమస్తభూతములను భరించునట్టిదియు, గ్రసిష్ణు=సమస్తభూతములను లయమొనర్చునట్టిదియు ప్రభవిష్ణు చ = అట్లు లయ మొనర్చిన భూతములను పునః పుట్టించునట్టిదియు నై యున్నది.

తా॥ మఱియును ఆ జ్ఞేయమగు బ్రహ్మము సకల ప్రాణుల యందును తానే యైయున్నను, ఉపాధిభేదము చేత నజ్ఞానులకు వేరు వేరుగా విభజింపబడినదానివలె నుండునదియును, సృష్టి, స్థితి, లయములకు గారణమైనదియు నయి యున్నది.

వి॥ ఘటములును, వాటిలోగల జలమును చూచువారికి వేరు వేరు విధముగా గనుపించినను, అందున్న ఆకాశమేలాగున నన్నిటిలో నేకమైయు... జల ఘటము లనుగాని పాత్రరూపములను గాని యంటక యుంటున్నదో, బ్రహ్మవస్తువు నాలాగున ననేకములలో ఏకమై దేనిని అంటక యుంటున్నది.

53

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥ 18

పద॥ జ్యోతిషాం - అపి - తత్ - జ్యోతిః - తమసః - పరం - ఉచ్యతే,
జ్ఞానం - జ్ఞేయం - జ్ఞానగమ్యం - హృది - సర్వస్య - విష్ఠితమ్.

ప్రతి॥ తత్ = ఆ జ్ఞేయమగు బ్రహ్మము, జ్యోతిషాం అపి = ప్రకాశించెడు వస్తువులగు సూర్య చంద్ర అగ్నులకుగూడ, జ్యోతిః=ప్రకాశము నిచ్చునదియు, తమసః పరం = చీకటికావల నుండునట్టిదియు, జ్ఞానం = అమానిత్వాదులగు నిరువది లక్షణములు గల జ్ఞానము, జ్ఞేయం = ఎఱుంగదగినది, జ్ఞానగమ్యం = అమానిత్వాది లక్షణములచేత మాత్రమే పొందబడదగినది, సర్వస్య = సమస్తజంతువులయొక్క, హృది = హృదయమునందు, విష్ఠితం = ఉంచు నట్టిది యని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ మఱియు తెలియదగిన ఆ బ్రహ్మము ప్రకాశించునట్టి సూర్య చంద్ర అగ్నులకు గూడ ప్రకాశ మిచ్చునదియును, అజ్ఞానమగు తమస్సుకంటె వేరైనదియును, నిర్మలాంతఃకరణము గలిగి ధ్యానము చేయువారికి గోచరమగునదియును, (అనగా జ్ఞానస్వరూపమైనదియు) ముముక్షువు లందఱిచేతను తెలియదగినదియును, వెనుక చెప్పబడిన యమానిత్వాది లక్షణయుక్త జ్ఞానముచే మాత్రమే పొందదగినదియును, సకల ప్రాణిసముదాయము యొక్క హృదయమున నున్నదియు నని చెప్పబడుచున్నది.

వి॥ 'జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి' అను 13-వ శ్లోకము మొదలు 'జ్యోతిషామపి తజ్జ్యోతిః' అను 18 వ శ్లోకమువఱకు గల 6శ్లోకములచే చెప్పబడినదే జ్ఞేయము. అనగా తెలియదగిన బ్రహ్మమని గ్రహించదగినది ముముక్షువులు జ్ఞానలక్షణ ప్రతిపాదకములగు నైదు శ్లోకములను సంపూర్ణముగా కంఠస్థముచేసిన తరువాత జ్ఞేయస్వరూప ప్రతిపాదకములగు ఈ 6 శ్లోకములను పఠనము చేయవలెను. కనుకనే యీ శ్లోకాంతములో 'జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం' అని శ్రీభగవాను డుపదేశించుటకు కారణమైనది, ఇచ్చట చెప్పబడిన యీ జ్ఞానము బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమని గ్రహించవలెను, ఇదే భగవంతు డుపదేశించిన జ్ఞేయము. అయితే యీ జ్ఞేయము

'జ్ఞానగమ్యం' అనగా అమానిత్వాదిజ్ఞానము గలవారికి మాత్రమే పొందదగిన దని స్పష్టముగా తెలుపడమైనది. ఇప్పుడు జ్ఞానులమని చెప్పుకొనువారిలో కొంద రికి నిట్టి యమానిత్వాది (20) లక్షణములు గల జ్ఞానము ఉన్నదా?లేదా? యని ముముక్షువులు పరీక్షించుకొనవలెను. అయితే యింత ప్రయాసముగా పొంద దగిన జ్ఞేయము ఎచ్చట నున్నదనగా 'హృది సర్వస్య విష్ఠితం' సమస్త ప్రాణులయొక్క హృదయమందే యున్నది. అనగా దానికొఱకు కెచ్చటను తిరగ నక్కరలేదు. హృదయము శుద్ధపరచి చూచువారికి కనిపించును. భగవద్గీత యొక్క సారము – నిష్కామ కర్మయోగమని కొందఱు, కాదు భక్తియోగమునే యుపదేశించుచున్నదని మఱికొందఱు, కాదు ధ్యానయోగమునే గీత ఉపదే శించుచున్నదని వేరు కొందఱును చెప్పుచుందురు.అవి యన్నియు శ్రీ గీతాకల్ప తరువు యొక్క భిన్న భిన్న శాఖలు మాత్రమే. ఇప్పుడు శ్రీ భగవాను డుపదే శించిన'జ్ఞేయమే' భగవద్గీతయొక్క నిజస్వరూపమగును. అష్టాదశ యోగము లనెడు శాఖలచే శ్రీ భగవద్గీతా కల్పతరువు విలసిల్లుచున్నది. ఈ పదునెనిమిది యోగములు గలవారే సర్వజ్ఞులు. ఈ చెప్పబడిన నిష్కామకర్మ, భక్తి అభ్యాసాది యోగములు గీతలో నున్నను అవి యొక్కొక్క శాఖ మాత్రమే గాని స్వతం త్రములు గావని గ్రహించుకొనవలెను. ఈ జ్ఞేయమో గీతాకల్పవృక్షముయొక్క మొదట నుండు మొద్దు లేక మొదలు. దీని నుండియే 18 యోగము లనెడు కొమ్మలేర్పడినవి. అయితే ఏ శాఖ యొక్క యగ్రభాగము పట్టుకొని వచ్చినను మ్రానుయొక్క మొదటికి చేరవచ్చును. అలాగున దీనియందు చెప్పబడిన యేదైన ఒక్క యోగమును కడవర కనుష్ఠించిన యాత్మసాక్షాత్కారజ్ఞానము లోనికి ప్రవేశింప వచ్చును. పై చెప్పిన కర్మ, భక్తి, యోగములచేత అంతఃకరణ శుద్ధి గలుగును. అప్పుడు భగవత్సాక్షాత్కారము లభించును.

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే॥ 19

పద॥ ఇతి - క్షేత్రం - తథా - జ్ఞానం - జ్ఞేయం - చ - ఉక్తం - సమాసతః, మద్భక్తః - ఏతత్ - విజ్ఞాయ - మద్భావాయ – ఉపపద్యతే.

ప్రతి॥ ఇతి = ఈ పై చెప్పబడిన ప్రకారము, క్షేత్రం = క్షేత్రము, తథా = అలాగుననే, జ్ఞానం = జ్ఞానము, జ్ఞేయం చ = జ్ఞేయమును, సమాసతః= సంగ్రహముగా, ఉక్తం = చెప్పబడినది, మద్భక్తః = నాయందు భక్తి

గలవాడు, ఏతత్ విజ్ఞాయ = దీని నెఱింగి, మద్భావాయ = నాభావ మును పొందుటకొఱకు, ఉపపద్యతే = అర్హుడగుచున్నాడు.

తా॥ ఈ ప్రకారము క్షేత్రము జ్ఞానము జ్ఞేయమున్ను సంగ్రహముగా జెప్పబడినది. నా భక్తుడు దీని నెఱిగినవాడై నా భావమును (దైవత్వమును) పొందుట కర్హుడగుచున్నాడు.

వి॥ ప్రకృతి, పురుషుడు, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, జ్ఞానము, జ్ఞేయము ఇవి యన్నియు సంక్షిప్తముగా నిచట తెలుపబడినవి. వేదములును,వ్యాసాది మునులును వీనిని విస్తారముగా జెప్పియున్నారు అయితే యిచ్చట ముఖ్యముగా 'మద్భక్త ఏతద్విజ్ఞాయ' అని భగవంతు డుపదేశించుటచే భగవద్భక్తులైన వారు కూడ అమానిత్వాది జ్ఞానమును జ్ఞేయ బ్రహ్మమును తెలిసికొని యుండవలెనని గ్రహించవలెను. కొందఱు మాకు భగవద్భక్తి యొక్కటి చాలును, ఇక నేమియు పనిలేదని చెప్పుదురు. అట్లు గాదు; అమానిత్వజ్ఞానము గలిగి జ్ఞేయ బ్రహ్మమును పొందిన మాత్రమే 'మద్భావాయోపపద్యతే' భగవదైక్యము లేక భగవత్సమానభావము గలుగునని తెలుపడమైనది. ఈ రహస్యమును గుర్తెఱుంగవలెను.

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్ ॥ 20

పద॥ ప్రకృతిం - పురుషం - చ - ఏవ - విద్ధి - అనాది - ఉభౌ - అపి,
వికారాన్ - చ - గుణాన్ - చ - ఏవ - విద్ధి - ప్రకృతి సంభవాన్.

ప్రతి॥ ప్రకృతిం = మూలప్రకృతిని, పురుషం చ ఏవ = పురుషుని, ఉభౌ అపి= ఈ రెంటిని, అనాదీ = ఆదిలేనివి యని, విద్ధి = ఎఱుంగుము. వికారాన్ చ = మనోబుద్ధీంద్రియ వికారములగు సుఖదుఃఖాదులను, గుణాన్ చ ఏవ = సత్త్వరజస్తమో గుణములను, ప్రకృతిసంభవాన్ = ప్రకృతివలన బుట్టినవానినిగా, విద్ధి = ఎఱుంగుము.

తా॥ మూలప్రకృతిని, పురుషుని, ఈ యుభయులను ఆదిలేని వారని యెఱుగుము. మనోబుద్ధీంద్రియ వికారములగు సుఖదుఃఖాదులను, సత్త్వరజస్తమోగుణములను ప్రకృతివలన బుట్టిన వానినిగా నెఱుగుము.

వి॥ ప్రకృతియనాదియని చెప్పుటకు కారణమేమన — జీవునకు మోక్షము గలుగువఱకు ప్రకృతి ఉండును. అందువలన 'అనాది' యని చెప్పబడినది. బహు

కాలమునుండి వచ్చుటచేతనుఅనాదియని గ్రహించదగినది. పురుషుడనగా జీవుడు అతడు శాశ్వతమగు బ్రహ్మము లేక బ్రహ్మాంశమగుటవలన అనాది యని తెలుపడమైనది. వికారములగు సత్త్వరజస్తమోగుణములు మూడును ప్రకృతి వలన పుట్టినవి. కావున జీవుడు వికారములగు ఈ మూడుగుణములు ఉండువఱకు నిర్వికారుడై గుణత్రయాతీతమగు ముక్తిని పొందలేడని గ్రహించుకొనవలెను.

శ్లో॥ కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే ।
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే ॥ 21

పద॥ కార్యకారణకర్తృత్వే - హేతుః - ప్రకృతిః - ఉచ్యతే.
పురుషః - సుఖదుఃఖానాం - భోక్తృత్వే - హేతుః - ఉచ్యతే.

ప్రతి॥ ప్రకృతిః = మాయ, కార్యకారణకర్తృత్వే = కార్యకారణములను గలుగజేయుట యందు, హేతుః = హేతువని, ఉచ్యతే = చెప్పబడుచున్నది. పురుషః=పురుషుడు (జీవుడు), సుఖదుఃఖానాం =సుఖదుఃఖములయొక్క, భోక్తృత్వే = అనుభవించుటయందు, హేతుః = హేతువని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ మాయ కార్యకారణములను గలుగజేయుటయందు హేతువని చెప్పబడుచున్నది. పురుషుడు సుఖదుఃఖముల ననుభవించుట యందు కారణమని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్ ।
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥ 22

పద॥ పురుషః - ప్రకృతిస్థః - హి - భుఙ్క్తే - ప్రకృతిజాన్ -గుణాన్,
కారణం - గుణసంగః - అస్య - సదసద్యోనిజన్మసు.

ప్రతి॥ హి = ఏ కారణముచే, పురుషః = పురుషుడు, ప్రకృతిస్థః = ప్రకృతి యందున్నవాడో (ఆ కారణమువలన), ప్రకృతిజాన్ గుణాన్ = ప్రకృతి సంబంధములగు గుణములను, భుఙ్క్తే = అనుభవించుచున్నాడు, అస్య= ఈ పురుషునికి, గుణసంగః = గుణములయందలి యాసక్తి, సదసద్యోని జన్మసు = ఉత్కృష్ట నికృష్ట జన్మల గలుగజేయుటయందు, కారణం = కారణమగుచున్నది.

తా॥ పురుషుడు ప్రకృతియందున్నవాడుగదా! ఆ కారణము వలన ప్రకృతి సంబంధములగు గుణముల ననుభవించుచున్నాడు.

ఆ జీవునికి ప్రకృతిగుణములయందలి యాసక్తి, ఉత్కృష్ట నికృష్ట జన్మముల కలుగజేయుటయందు కారణమగుచున్నది.

వి॥ ఇది బద్ధజీవుని గుఱించి చెప్పడమైనది. అతని శుద్ధాశుద్ధగుణములే శ్రేష్ఠ నికృష్ట జన్మములకు కారణములు.

శ్లో॥ ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్పురుషః పరః ॥ 23

పద॥ ఉపద్రష్టా - అనుమన్తా - చ - భర్తా - భోక్తా - మహేశ్వరః,
పరమాత్మా - ఇతి - చ - అపి - ఉక్తః-దేహే - అస్మిన్-పురుషః-పరః.

ప్రతి॥ పరః పురుషః = పరమపురుషుడు (పరమాత్మ), అస్మిన్ దేహే = ఈ దేహమునందు, ఉపద్రష్టా = సాక్షిభూతుడుగా చూచుచుండెడు వాడును, అనుమన్తా = అనుమోదించువాడును, భర్తా = భరించువాడును, భోక్తా = అనుభవించువాడును, మహేశ్వరః చ = నియామకుడును, పరమాత్మా అపి చ = పరమాత్ముడును, ఇతి ఉక్తః = అని చెప్పబడుచున్నాడు.

తా॥ పరమపురుషుడు అనగా పరమాత్మ యీ దేహమునందు సాక్షిభూతుడై సమీపమున నుండి చూచుచుండు నుపద్రష్ట యనియు అనుమోదించువాడు, భరించువాడు, అనుభవించువాడు, నియామకుడు పరమాత్మయు నని చెప్పబడుచున్నాడు.

వి॥ ఉపద్రష్ట యనగా - యజ్ఞాది కార్యములు చేయునపుడు ఋత్విక్కులుచేయు కార్యములన్నియు సరిగా నున్నవా లేదా యని ఋత్విక్కులకంటే వేరుగా సాక్షిగా నుండి వాటి వ్యాపారములను లేక కార్యములను గమనించు చుండును. లేక ముక్త జీవుని గుఱించి చెప్పబడినదని గ్రహించవలెను.

శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥ 24

పద॥ యః - ఏవం - వేత్తి - పురుషం - ప్రకృతిం - చ - గుణైః - సహ,
సర్వథా - వర్తమానః - అపి - న - సః - భూయః - అభిజాయతే.

ప్రతి॥ యః = ఎవడు, పురుషం = పురుషుని, గుణైః సహ = గుణములతో గూడిన, ప్రకృతిం చ = ప్రకృతిని, ఏవం =ఇట్లు పైె చెప్పిన ప్రకారము వేత్తి = ఎఱుగుచున్నాడో, సః = వాడు, సర్వథా వర్తమానః అపి =

ఏయే ఆశ్రమములో అనగా బ్రహ్మచర్యము మొదలగు నాల్గు ఆశ్రమము లలోగాని లేక గృహ వనాది ప్రదేశములలో గాని, లేక సర్వకర్మపరిత్యాగి యైగాని, లేక ఫలాపేక్షలేక సర్వకర్మలు చేయువాడుగా గాని యుండి నను, భూయః = మఱల, న అభిజాయతే = జన్మింపడు.

తా॥ పరమాత్మజ్ఞానముచేత జీవాత్మ పరమాత్మ, భేదమును పాటింపక తానే పరమాత్మయనియు, పరమాత్మయే తాననియును, ప్రకృతి వికారములైన సుఖదుఃఖ మోహాదులతో కూడినది మాయ యనియు నెవడు తెలిసికొనుచున్నాడో, వాడు ఎట్లుండినను అనగా బ్రహ్మచర్యము మొదలగు నాల్గాశ్రమములలో దేనియందుండినను, లేక గృహ వనాది ప్రదేశములలో నుండినను, లేక సర్వకర్మపరిత్యాగి యై యుండినను, లేక ఫలాపేక్షారహితుడై విధ్యుక్తసర్వకర్మలు చేయువాడుగా నుండినను, లేక యీ దేహముతో కూడియుండినను, దేహము పోయినపిమ్మటనుగూడ ముక్తుడే యగుచున్నాడు. "సర్వథా వర్తమానోఽపి" అని యుండుటచే నిరంతరము, ధ్యాననిష్ఠలో నుండువాడైనను, లేక పరప్రాణుల కుపకార కార్యములు చేయు వాడైనను అని గ్రహించుకొనవలెను. లేక గృహస్థాశ్రమమందుండి నను, సన్న్యాసాశ్రమమందుండినను సరియని భావము. అంతియే గాని 'స్వేచ్ఛాచారియైనను' అని తలంపరాదు.

శ్లో॥ ధ్యానే నాత్మని పశ్యన్తి కేచిదాత్మాన మాత్మనా।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥ 25

పద॥ ధ్యానేన - ఆత్మని - పశ్యన్తి - కేచిత్ - ఆత్మానం - ఆత్మనా.
అన్యే - సాంఖ్యేన - యోగేన - కర్మయోగేన - చ - అపరే.

ప్రతి॥ కేచిత్ = కొందఱు, ధ్యానేన = ధ్యానయోగముచేతను, ఆత్మని = తన యంతః కరణమునందు. ఆత్మనా = మనస్సు (లేక బుద్ధి)చేత ఆత్మానం= పరమాత్మను, పశ్యన్తి=చూచుచున్నారు, అన్యే = మరికొందఱు,సాంఖ్యేన యోగేన = సాంఖ్యయోగముచేతను, అపరే=మఱికొందఱు, కర్మయోగేన చ = కర్మయోగముచేతను, (పశ్యన్తి = చూచుచున్నారు.)

తా॥ శుద్ధ మనస్సుతో కూడిన ధ్యానయోగముచేత కొందఱును, మఱికొందఱు సాంఖ్యయోగముచేతను, ఇక కొందఱు కర్మయోగము చేతను పరమాత్మను తమయందున్న వానినిగా జూచుచున్నారు.

వి॥ దీనియందు మూడువిధములగు యోగములు చెప్పబడినవి. (1) ధ్యానయోగము. (2)సాంఖ్యయోగము, (3)నిష్కామకర్మయోగము.ఇందు ధ్యానయోగముచే కొందఱు, కొందఱు ఆత్మానాత్మ విచారపరమగు సాంఖ్యయోగముచేతను, నిష్కామకర్మయోగముచేత మఱికొందఱును పరమాత్మను పొందుచున్నారు. ధ్యానమనగా -శ్రోత్రాదీంద్రియములను శబ్దాదివిషయములనుండి మరల్చి, మనస్సును అంతర్ముఖముజేసి జ్ఞానస్వరూపమగు ఆత్మను అవిచ్ఛిన్నమైన తైలధారవలె యెడతెగక చింతించుట యగును.లేక శ్రవణ మనన నిధిధ్యాసములతోగూడిన జ్ఞానము. దీనికే ధ్యానయోగమనిగూడ పేరు గలదు. ఇది శ్రేష్ఠమైనదగుటచే ఉత్తమాధికారులచే పొందదగినదగుటచే మొదట చెప్పఁబడినది అట్టి ధ్యానయోగమునకు శక్తిలేని వారు తత్త్వములను విచారించి తత్త్వాతీతమగు ఆత్మను తెలిసికొనేవారు సాంఖ్యులు. వీరు రెండవ తరగతిలో చేరినవారు. మధ్యమాధికారులు, దీనికిని శక్తిలేనివారు నిష్కామ కర్మయోగముచే నంతఃకరణశుద్ధిగలవారై పరమాత్మను దర్శించి ముక్తులగుదురు. వీరు మూడవశ్రేణికి జెందినవారు. మందాధికారులు. దీనియందు భక్తి యోగము చెప్పబడలేదని తలంచవలదు, అదియు ధ్యానయోగములో నంతర్భూత మగుటచే వేరుగా చెప్పబడలేదు.

శ్లో॥ అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ 26

పద॥ అన్యే - తు - ఏవం - అజానన్తః - శ్రుత్వా - అన్యేభ్యః - ఉపాసతే,
తే - అపి - చ - అతితరన్తి - ఏవ - మృత్యుం - శ్రుతిపరాయణాః.

ప్రతి॥ ఏవం = ఇట్లు చెప్పబడిన ధ్యాన సాంఖ్య కర్మయోగములను, అజానన్తః = తెలిసికొనజాలనివారలైన,అన్యే తు=ఇతరులన్ననో, అన్యేభ్యః=ఇతరులగు ఆత్మజ్ఞానులవలన, శ్రుత్వా = ఉపదేశమునుపొంది లేక శ్రవణముచేసి. ఉపాసతే = ఉపాసన చేయుదురు, శ్రుతిపరాయణాః = అట్లు వినుటయందాసక్తిగల, తే అపి చ= వారలుగూడ, మృత్యుం=మృత్యురూపమగు సంసారసాగరమును, అతితరన్తి ఏవ = తప్పక దాటుదురు.

తా॥ మఱికొందఱు పైన చెప్పబడిన ధ్యానయోగము, సాంఖ్య యోగము, కర్మయోగమను వాటిలో దేనినైన నాచరించి పరమాత్మను ఎఱుంగలేనివారైనచో, పరమదయాళురగు గురువులవలన "పరమాత్మ నిట్లుపాసనజేయుడు" అని యుపదేశింపబడినవారై స్వయముగా వేదాంతశాస్త్ర విచారమునం దసమర్థులై సద్గురూపదేశమున విన్నదానియం దాసక్తిగలవారై యుండినచో, మరణరూపమగు సంసారసాగరమును తప్పక తరింతురు.

వి॥ పైచెప్పబడిన 25-వ శ్లోకమున కొందఱు, శ్రవణమననాదులచే గలిగిన, ఆత్మయందు పరమాత్మ భావనయను జ్ఞానయోగముచేతను, లేక అట్లు బ్రహ్మాత్మైక్యాను సంధానము చేయుటకు ఇంద్రియములు వశముగాని వారు క్రమముగా నింద్రియములను అంతర్ముఖముజేసి సతతము పరమాత్మను చింతించుట యనెడి ధ్యాన యోగము చేతను, దానికి శక్తిలేనివారు 24 తత్త్వములను శోధించి తత్త్వాతీత మగు ఆత్మస్వరూపమును తెలిసికొనుట చేతను. దానికిని శక్తిలేనివారు పుణ్యకర్మల నీశ్వరార్పణ బుద్ధితో జేయుట చేతను మోక్షమును పొందగలరని చెప్పబడినది. కావున వారు ఉత్తమ మధ్యమ మందాధి కారులని మూడువిధములుగా చెప్పబడిరి. ఈ మూడు యోగములందును శక్తిలేనివారు మహాత్ములగు గురువులు చెప్పిన ప్రకారమనుష్ఠించుట వలన నిస్సంశయముగా ముక్తిని పొందగలరని యిచట ఉపదేశించబడమైనది. ఓహో! భగవంతుని కరుణ యేమని చెప్పవచ్చును! రోగియైనవాడు స్వయముగ వైద్యశాస్త్రమును చదివి తెలిసికొని ఔషధసేవ చేయుటకు సాధ్యముగానిచో, శ్రేష్ఠమైన వైద్యుడిచ్చిన మందును సేవించి పథ్యముండిన ఆరోగ్యమెట్లు కలుగుచుండునో, వైద్యశాస్త్రములో గొప్పపాండిత్యము సంపాదించినను తనకు వ్యాధి వచ్చినచో వైద్యశాస్త్రము చదువనివాని రోగమునకు ఏ యౌషధమిచ్చి, యే పథ్యము చెప్పబడెనో, అట్టి యౌషధమునే తానును తీసికొని అట్టి పత్యముండిననే రోగమెట్లు కుదురునో, అట్లే భవరోగము పిపీలి కాది బ్రహ్మ పర్యంతముగల సర్వులకును ఒకటియే. ఆ విషయములో పండితుడని గాని, పామరుడనిగాని, భూపాలుడనిగాని గోపాలుడనిగాని, బ్రాహ్మణుడని గాని, బ్రాహ్మణేతరుడని గాని, గృహస్థుడని గాని, సన్న్యాసియని గాని, పురుషుడని గాని, స్త్రీ యనిగాని, భేదములేదు. భవరోగనివృత్తి కొఱకు అందఱును సమానముగా బ్రహ్మనిష్ఠ శమదమాది గుణములు తప్పక గలిగి యుండవలెను.

శ్లో॥ యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజఙ్గమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధి భరతర్షభ ! ॥ 27

పద॥ యావత్ - సంజాయతే - కించిత్ - సత్త్వం - స్థావరజఙ్గమం,
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ - తత్ - విద్ధి - భరతర్షభ.

ప్రతి॥ హేభరతర్షభ! = ఓ యర్జునా! స్థావరజఙ్గమం = స్థావరజంగమాత్మకమగు, యావత్ కించిత్ సత్త్వం = ఏ కించిద్వస్తువైనను, సంజాయతే = పుట్టుచున్నదో, తత్ = అట్టి వస్తువు, క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ = క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగమువలన కలిగినదిగా, విద్ధి = ఎఱుంగుము.

తా॥ భరతశ్రేష్ఠా ! ఓ యర్జునా ! చరములును, అచరములును సకల వస్తుసముదాయమును క్షేత్రక్షేత్రజ్ఞుల చేరికవలన పుట్టుచున్న దని తెలిసికొనుము, ప్రకృతిపురుషుల సంబంధములేక యే వస్తువును కొంచెమైనను పుట్టుటలేదు.

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వ వినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ 28

పద॥ సమం - సర్వేషు - భూతేషు - తిష్ఠన్తం - పరమేశ్వరం,
వినశ్యత్సు - అవినశ్యన్తం - యః - పశ్యతి - సః - పశ్యతి.

ప్రతి॥ సర్వేషు భూతేషు = సమస్త భూతములయందు, సమం = సమానముగా, తిష్ఠన్తం = ఉండునట్టియు, వినశ్యత్సు = ఆ భూతములు నశించినను, అవినశ్యన్తం = నశింపకుండునట్టియు, పరమేశ్వరం = పరమాత్మను. యః పశ్యతి = ఎవడు చూచుచున్నాడో, సః పశ్యతి = వాడుచూచుచున్నాడు, అనగా నట్టివాడే నిజస్వరూపము నెఱింగినవాడు.

తా॥ బ్రహ్మాది స్తంభపర్యంతముగల సమస్త వస్తువులయందు సమముగా నుండునట్టియు సర్వభూతములు నశించినను న్వయముగా నశింపనట్టి పరమేశ్వరుని యెవడు చూచుచున్నాడో వాడే నిజముగా చూచువాడు. అనగా తత్త్వము నెఱిగినవాడని భావము.

వి॥ సమస్త చరాచరప్రాణికోట్లలో నంతర్యామియై సమానముగా వెలుగు చుండు పరమాత్మ నెవడు చూచుచున్నాడో వాడే నేత్రముగలవాడు. అట్టి పరమాత్మను జూడనివాడు నేత్రము గలవాడైనను అంధుడే. ఈ సత్యము

నెఱింగినజ్ఞానదృష్టి గలవారెందఱుందురో తెలిసికొనవచ్చును ఈ పాంచభౌతికములగు కన్నులు నశించిపోయెడు పంచభూతాత్మకవస్తువునే చూడగలవు. కాని పరమాత్మను చూడలేవు. దీనిచే తమకు జ్ఞానదృష్టి గలిగినదా? లేదా? యని యెవరికి వారే తెలిసికొనవచ్చును.

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిమ్॥29

పద॥ సమం - పశ్యన్ - హి - సర్వత్ర - సమవస్థితం - ఈశ్వరం,
న - హినస్తి - ఆత్మనా - ఆత్మానం - తతః - యాతి - పరాం - గతిమ్.

ప్రతి॥ హి =ఏలయనగా, సర్వత్ర సమవస్థితం = అన్నిప్రాణులయందుండునట్టి, ఈశ్వరం=ఈశ్వరుని,సమంపశ్యన్ = సమభావముతో జూచుచున్నవాడై, ఆత్మానం = తనను, ఆత్మనా = తనచేత, న హినస్తి = హింసించుకొనడు, తతః = అందువలన, పరాంగతిం = సర్వోత్కృష్టమగు గతిని అనగా మోక్షమును, యాతి = పొందుచున్నాడు.

తా॥ సకలప్రాణులయందును సమముగానుండునట్టి పరమేశ్వరుని సర్వసమునిగా తెలిసికొని తనచేత తనను చంపుకొనని వాడగుచున్నాడు. అట్లు పరమాత్మను సమముగా సర్వములో తెలిసికొనని వాడు తన యాత్మను తాను చంపుకొనినవానితో సమానుడు. ఆత్మహంతయగును. అట్టిదైవమును సాక్షాత్కరించుకొన్నవాడు మోక్షమును పొందుచున్నాడు.

వి॥ సర్వములో సమానముగా వెలుగుచుండు పరమాత్మను చూచువాడు, తన్ను తానుద్ధరించుకొన్న వాడగుచున్నాడు. అట్లుగానివాడు ఆత్మహత్య చేసికొనిన వానితో సమానుడు. ఈ శ్లోకమును దీని పైశ్లోకమును చదివి తదర్థమును తెలిసికొన్నచో బ్రహ్మజ్ఞానముయొక్క సత్యమును బాగుగా గ్రహించుకొనవచ్చును.

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి ॥ 30

పద॥ ప్రకృత్యా - ఏవ - చ - కర్మాణి - క్రియమాణాని - సర్వశః,
యః - పశ్యతి - తథా - ఆత్మానం - అకర్తారం - సః - పశ్యతి.

ప్రతి॥ యః = ఎవడు, కర్మాణి = కర్మలు, సర్వశః = అన్నివిధముల, ప్రకృత్యా ఏవ చ = ప్రకృతిచేతనే, క్రియమాణాని = చేయబడుచున్నవిగను, తథా = అలాగున, ఆత్మానం = ఆత్మను, అకర్తారం = కర్తకాని వానినిగాను, పశ్యతి=చూచుచున్నాడో, సః = వాడు, పశ్యతి = చూచుచున్నాడు.

తా॥ ఎవడు ఈ లోకమునందు అంతట నన్నివిధములైన కర్మలు ప్రకృతిచేతనే చేయబడుచున్నవనియు అలాగుననే యాత్మ స్వతః కర్తగాదనియు చూచుచున్నాడో, అనగా తెలిసికొనుచున్నాడో, వాడే నిజముగా చూచువాడు. వాడే తత్త్వజ్ఞుడు.

వి॥ యథార్థముగా ఆత్మఅకర్త అభోక్త, సాక్షియు నయి యుండినను, ఎంతవఱకు సత్త్వరజస్తమోగుణములతో గూడియుండునో, అంతవరకు ఆగుణముల యొక్క స్వభావము ననుసరించి ప్రవర్తించుచున్నదని తెలిసి బ్రహ్మవిచారపరుడు అట్టి గుణములను లేకుండులాగున చేసికొనవలెను. త్రిగుణములయొక్క సముదాయమునకు మాయయనియు, అవిద్యయనియు, ప్రకృతియనియు పేర్లుగలవు. అట్టి నిజస్థితిని గనుగొనువాడు నిర్వికారుడై సాక్షియై, సచ్చిదానందమయుడై వెలుగ గలుగును. గుణములతో గూడియుండువరకు బద్ధుడనియు, గుణములు వదలిపోవునపుడు ముక్తుడనియు తెలియవలెను.

శ్లో॥ యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా॥ 31

పద॥ యదా - భూతపృథగ్భావం - ఏకస్థం - అనుపశ్యతి,
తతః - ఏవ - చ - విస్తారం - బ్రహ్మ - సంపద్యతే - తదా.

ప్రతి॥ (ఎవడు) యదా = ఎప్పుడు, భూతపృథగ్భావం=నానావిధభూతప్రపంచమును, ఏకస్థం = ఒక్కదానియందున్న దానినిగాను, తతః ఏవ = ఆ ఒక్క ఆత్మవలననే,విస్తారం చ=విస్తరించుచున్న దానిగను,అనుపశ్యతి = చూచుచున్నాడో (వాడు) తదా = అప్పుడు, బ్రహ్మ = బ్రహ్మమును, సంపద్యతే = పొందుచున్నాడు.

తా॥ ఎవడు ఎప్పుడు నానావిధ భూతప్రపంచము నొక్కదానియందున్నదానినిగను, ఒక్కయాత్మవలననే కల్పింపబడిన దానినిగను చూచుచున్నాడో, అనగా తెలిసికొనుచున్నాడో, వాడప్పుడు బ్రహ్మమును (అనగా పరబ్రహ్మస్వరూపమును) పొందుచున్నాడు.

వి॥ ఎవడు నానావిధ ప్రపంచము పరమాత్మయందున్నదానినిగను, అట్టి పరమాత్మచేతనే విస్తరింపబడినదానినిగను పరమాత్మశక్తిని తెలిసికొను చున్నాడో, వాడు ముక్తుడగును. పరమాత్మయందు అనగా పరమాత్మశక్తియగు అవ్యక్తము లేక మూలప్రకృతియందు అని గ్రహించదగినది, సృష్టి, స్థితి, లయ ములు మాయలోనే యుంటున్నవి, మాయచేతనే గలుగుచున్నవి.

శ్లో॥ అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాఽయమవ్యయః ।
శరీరస్థోఽపి కౌంతేయ ! న కరోతి న లిప్యతే ॥ 32

పద॥ అనాదిత్వాత్ - నిర్గుణత్వాత్ - పరమాత్మా - అయం - అవ్యయః.
శరీరస్థః - అపి - కౌంతేయ ! - న - కరోతి - న - లిప్యతే.

ప్రతి॥ హే కౌంతేయ! = కుంతీపుత్రుడవగు ఓ యర్జునా!, అనాదిత్వాత్ = ఆది లేనివాడగుటచేతను, నిర్గుణత్వాత్ = గుణరహితుడగుటచేతను, అయం పరమాత్మా = ఈపరమాత్మ, అవ్యయః = నాశరహితుడు, శరీరస్థః అపి = దేహమందున్నవాడైనను, న కరోతి = కర్మల చేయువాడుకాడు న లిప్యతే = కర్మఫలములచే అంటబడడు.

తా॥ కుంతీపుత్రుడవగు ఓ యర్జునా! ఆది లేనివాడగుట చేతను, సత్త్వరజస్తమోగుణరహితుడగుట చేతను ఈ పరమాత్మ నాశరహితుడు. దేహమందున్నవాడైనను దేనిని చేయువాడుకాడు, అందువల్ల దేనితో (కర్మఫలముచే) నంటబడడు.

వి॥ ఈశ్లోకమున ప్రకృతి నశించిన యాత్మయొక్క నిజస్వరూపమును గురించి చెప్పడమైనది. దీనిని తెలిసికొనకపోయినచో 'ప్రకృత్యైవ చ కర్మాణి అని 30-వ శ్లోకమున చెప్పబడిన సత్యము బోధపడదు.

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే ॥ 33

పద॥ యథా - సర్వగతం - సౌక్ష్మ్యాత్ - ఆకాశం - న - ఉపలిప్యతే.
సర్వత్ర - అవస్థితః - దేహే - తథా - ఆత్మా - న - ఉపలిప్యతే.

ప్రతి॥ ఆకాశం = ఆకాశము, సర్వగతం=సమస్తవస్తువులయందును, వ్యాపించి యుండియు, సౌక్ష్మ్యాత్= సూక్ష్మమైనదగుటవలన. యథా=ఏప్రకారము, న ఉపలిప్యతే = అంటబడదో, తథా = అలాగుననే, ఆత్మా= పరమాత్మ,

సర్వత్రదేహే = సమస్త శరీరములయందు, అవస్థితః = ఉండినదయ్యు. న ఉపలిప్యతే = అంటబడదు.

తా॥ బురద మొదలగు సకల వస్తువులయందును వ్యాపించి యున్న యాకాశము సూక్ష్మమయిన దగుటవలన పంకాదులచే అంట బడనట్లు సకల దేహములయందును గల పరమాత్మ దేహేంద్రి యములతో నంటబడదు.

శ్లో॥ యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోక మిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత! ॥ 34

పద॥ యథా - ప్రకాశయతి - ఏకః - కృత్స్నం - లోకం - ఇమం - రవిః.
క్షేత్రం - క్షేత్రీ - తథా - కృత్స్నం - ప్రకాశయతి - భారత!,

ప్రతి॥ హే భారత! = ఓయర్జునా!, యథా = ఎట్లు, ఏకః రవిః = ఒక్కడైన సూర్యుడు, ఇమం కృత్స్నం లోకం = ఈ సమస్తప్రపంచమును, ప్రకాశ యతి = ప్రకాశింపజేయుచున్నాడో, తథా = అట్లు, క్షేత్రీ = క్షేత్రజ్ఞు డగు పరమాత్మ, కృత్స్నం క్షేత్రం = సమస్త శరీరములను, ప్రకాశ యతి = ప్రకాశింపజేయుచున్నాడు.

తా॥ ఓ యర్జునా! సూర్యుడొక్కడే యీ సమస్తమైన ప్రపం చము నెట్లు ప్రకాశింపజేయుచున్నాడో, అట్లే క్షేత్రజ్ఞుడగు పరమాత్మ యొక్కడే సమస్త శరీరములను ప్రకాశింపజేయుచున్నాడు. అనగా సమస్త బ్రహ్మాండమును ప్రకాశింపజేయుచు దానిచే అంటబడక యున్నాడు.

వి॥ వ్యష్టి జీవుడైనచో నఖాగ్రమునుండి శిఖాగ్రము వఱకును చైతన్య వంతముగా జేసికొని దేహేంద్రియాదులకు విలక్షణుడుగా నుండును, పరమాత్మ యయినచో, పై చెప్పబడిన విధముగా అన్నిటియందు వ్యాపించియుండియు నిర్లిప్తుడై అసంగుడైయుండునని గ్రహించవలయును.

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతి మోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్ ॥ 35

పద॥ క్షేత్రక్షేత్రజ్ఞయోః - ఏవం - అన్తరం - జ్ఞానచక్షుషా.
భూతప్రకృతిమోక్షం - చ - యే - విదుః - యాన్తి - తే - పరమ్.

ప్రతి॥ ఏవం = ఇట్లు, యే = ఎవరు, క్షేత్రక్షేత్రజ్ఞయోః = క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క అన్తరం=భేదమును, భూతప్రకృతిమోక్షం చ = భూతములకు సంబంధించి యుండు ప్రకృతినుండి విముక్తి నొందతగిన యుపాయ మును, జ్ఞానచక్షుషా = జ్ఞానదృష్టిచేత, విదుః = ఎఱుంగుచున్నారో, తే = వారు, పరం = పరమ పదమును అనగా మోక్షమును, యాన్తి = పొందుచున్నారు.

తా॥ ఇట్లెవరు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క భేదమును, భూతము లకు సంబంధించియుండు ప్రకృతినుండి విముక్తినొందదగిన ధ్యానో పాయమును జ్ఞానదృష్టిచేత నెఱుంగుచున్నారో, వారు సర్వోత్తమ మైన మోక్షమును పొందుచున్నారు,

వి॥ ప్రకృతితో సంబంధపడియుండునప్పుడు గల బంధమును, ప్రకృతి నుండి విడుదల పొందినప్పుడు గల ముక్తిని లేక మోక్షమును అధ్యాత్మ జ్ఞానదృష్టివలన నెవడు తెలిసికొనుచున్నాడో, వాడు ప్రకృతి గుణములతో సంబంధపడనందువే పునరావృత్తి రహితమగు మోక్షమును పొందుచున్నాడు. ఈ క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగసారమంతయు నీ విట్టివివరి శ్లోకమున శ్రీ భగవాను విచే తెలుపడమైనది. క్షేత్రము యొక్కయు, క్షేత్రజ్ఞుని యొక్కయు, స్వరూప మును, క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క సంబంధముచే గలిగెడు బంధముయొక్క పరిణామమును, తత్బంధనివృత్తిచే గలిగెడి సత్యఫలమును తెలిసికొనుట వలన యోగమనగా పరమాత్మైక్యము గలుగును. అందువలననే దీనికి క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమని పేరువచ్చినది.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగోనామ
త్రయోదశోఽధ్యాయః.

పద॥ ఇతి-శ్రీమత్ భగవద్గీతాసు-ఉపనిషత్సు -బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే- శ్రీకృష్ణార్జున సంవాదే - క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగః - నామ త్రయో దశః - అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇట్లు, ఉపనిషత్సు = ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యాయాం = బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రే = యోగశాస్త్రమున్ను, శ్రీకృష్ణార్జున సంవాదే = శ్రీ కృష్ణార్జున సంవాదరూపమునగు, శ్రీమద్భగవద్గీతాసు = శ్రీభగవద్గీతయందు, క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగః నామ = క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగమని ప్రసిద్ధి గలిగిన, త్రయోదశః అధ్యాయః=పదమూడవ అధ్యాయము సంపూర్ణము.

తా॥ ఇట్లు ఉపనిషదర్థప్రతిపాదకము, బ్రహ్మవిద్యాస్వరూపము, యోగశాస్త్రము, శ్రీ కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీమద్భగవద్గీతయందు, క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగ మను ప్రసిద్ధిగల పదమూడవ అధ్యాయము ముగిసెను.

ఓమ్ తత్ సత్.





ఓమ్
శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## చతుర్దశోఽధ్యాయః - చతుర్దశాధ్యాయము

## గుణత్రయవిభాగ యోగః — గుణత్రయవిభాగ యోగము



సత్త్వరజస్తమోగుణములయొక్క స్వభావములను, గుణత్రయరహితమగు ఆత్మయొక్క శుద్ధజ్ఞానస్వభావమును తెలుపునదగుటచే ఈ యధ్యాయమునకు 'గుణత్రయ విభాగయోగమ'ని పేరు, మూడు గుణములనుండి విముక్తినొందుట వలన పరమాత్మలో నైక్యము గలుగుటచే యోగమని చెప్పడమైనది. కనుక నిదియు నొక యోగమేయగును. నిష్కామకర్మయోగపరులు మూడవ అధ్యాయమును, ధ్యానయోగపరులు ఆరవ అధ్యాయమును, భక్తియోగపరులు 12-వ అధ్యాయమును, జ్ఞానయోగపరులు ఈ పదునాల్గవ యధ్యాయమును తప్పక చదువవలయును. ఈ యధ్యాయమును చదివినచో సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము గలిగియుండునపుడు జీవుడెట్లుండును? ఆయా గుణములు గలిగి యుండిన కాలమున దేహము వీడిపోయినచో, ఏయే లోకములను పొందును? మఱల జన్మమెత్తునప్పుడు ఏయే రూపముతో పుట్టగలడు? అనుతత్త్వము తెలియ బడును. అదేప్రకారము మూడుగుణములులేని ముక్తాత్ము డెట్లుండును? వాడు దేహము పోయినతర్వాత నెట్టి బ్రహ్మమును పొందును? ఇదిన్ని దీనిలో తెలుపడ మైనది. కావున ఈ విషయములన్నియు ముఖ్యముగా తెలిసికొనదగినవగుటచే ముముక్షువులు ఈ అధ్యాయమును ముఖ్యముగ పఠించి తదర్థమును గ్రహించవలయును.

శ్రీ భగవానువాచ:— శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।
యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥ 1

పద॥ పరం - భూయః - ప్రవక్ష్యామి - జ్ఞానానాం - జ్ఞానం - ఉత్తమం, యత్ - జ్ఞాత్వా - మునయః - సర్వే - పరాం - సిద్ధిం - ఇతః - గతాః.

ప్రతి॥ **మునయః** సర్వే=మునులందఱును, **యత్ జ్ఞాత్వా** = దేని నెఱింగి, **ఇతః** = ఇట్లొయుంగుటవలన, పరాం సిద్ధిం =సర్వోత్కృష్టమైన జ్ఞానసిద్ధిని, **గతాః**=

పొందిరో(అట్టి) పరం=శ్రేష్ఠమైనదియు, జ్ఞానానాం = జ్ఞానములన్నిటిలో, ఉత్తమం=ఉత్తమమయినదియునగు, జ్ఞానం = జ్ఞానమును, భూయః = ఇంకను (మఱల), ప్రవక్ష్యామి=చెప్పెదను.

తా॥ దేనిని తెలిసికొని వసిష్ఠ వామదేవాది సమస్తఋషులు ఉత్తమమైన మోక్షమును బొందిరో, అట్టి పరమాత్మ విషయకమగుటచే శ్రేష్ఠమైనదియు, జ్ఞానములన్నిటిలో నుత్తమమైనదియు నగు జ్ఞానమును మఱల చెప్పెదను.

వి॥ ఈ శ్లోక మీ యధ్యాయముయొక్క మహిమను తెలుపున దగుటచేత, ఎన్ని విధములగు జ్ఞానములు కలవో వాటి యన్నిటిలో నిది యుత్తమజ్ఞానమని తెలుపడమైనది. మహర్షులందఱు నిట్టిజ్ఞానము నెఱింగియే సర్వోత్కృష్టమగు మోక్షమును పొందిరనియు చెప్పుటచే భక్తులు, యోగులు, నిష్కామకర్మపరులు మొదలగు వారందఱికిని ఈ జ్ఞానము పొందదగినదని తెలియవలెను. కావుననే మునయః సర్వే, మునులందఱు అని చెప్పబడినది. ఈ మూడుగుణములలోనే ఒక గుణముండినను వాడు బద్ధుడగును. కావుననే ఆ గుణములనుండి విడుదల పొందవలెనని చెప్పబడినది.

శ్లో॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ ॥ 2

పద॥ ఇదం - జ్ఞానం - ఉపాశ్రిత్య - మమ - సాధర్మ్యం - ఆగతాః
సర్గే - అపి - న - ఉపజాయన్తే - ప్రళయే - న - వ్యథన్తి - చ.

ప్రతి॥ ఇదం జ్ఞానం = ఈ జ్ఞానమును, ఉపాశ్రిత్య = ఆశ్రయించి, మమ సాధర్మ్యం = నా సమానధర్మమును (భగవత్సమానస్థితిని) ఆగతాః = పొందినవారై, సర్గే అపి = జగత్ సృష్టికాలమందును, న ఉపజాయన్తే జన్మించరు. ప్రళయే చ = ప్రళయకాలమందును, న వ్యథన్తి = దుఃఖించరు.

తా॥ ఈ జ్ఞానము నాశ్రయించి (పొంది), నా సాయుజ్యమును పొందినవారు జగత్సృష్టికాలమునందు జన్మించరు. ప్రళయకాలమునందును వ్యథ నొందరు. అనగా చావరు.

వి॥ ఈజ్ఞానమును పొందినవారు భగవత్స్వరూపులగుదురు. అయితే యీ యాత్మ జ్ఞానముచే గల ప్రయోజనమేమన, మరణకాలములో దుఃఖమును

పొందరు. నిరతిశయానందమును పొందగలరు. మఱల సృష్టికాలములో జన్మ మెత్తరు. అదే దీనియొక్క ప్రయోజనము. అట్లు ఇట్టి బ్రహ్మమును పొందనివారు మరణ దుఃఖమును, జనన దుఃఖము ననుభవింతురు. ముక్తి పొందనిచో గలిగెడు ఆపద యిటువంటిది. కొందఱు ధనముచేతను, విద్యచేతను, కులముచేతను అధికులై మేము మోక్షముకొఱకు ప్రయత్నింపకపోయిన మాకు గలుగునష్టమేమి యని వచింతురు. వారికి కలిగెడు నష్టము జననమరణదుఃఖమే యగును. అధికార ముండువఱకును, ధనముండువఱకును వారిని ప్రకృతి అట్లాడించును. ఇవి రెండు నశించునపుడు దీని సత్యమును వారెఱుంగగలరు.

శ్లో॥ మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్ ।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత! ॥ 3

పద॥ మమ - యోనిః - మహత్ – బ్రహ్మ - తస్మిన్ - గర్భం-దధామి -అహం పంభవః - సర్వభూతానాం —తతః - భవతి - భారత !

ప్రతి॥ హే భారత=ఓ యర్జునా!, మహత్ బ్రహ్మ = మూలప్రకృతి, మమ = నాయొక్క, యోనిః = గర్భాదానస్థానము, అహం=నేను, తస్మిన్ = ఆ ప్రకృతి యనెడు స్థానమునందు, గర్భం = చైతన్యమనెడు బీజమును దధామి=ఉంచుచున్నాను. తతః=అందువలన, సర్వభూతానాం=సమస్త భూతముల యొక్క, సంభవః = ఉత్పత్తి, భవతి=గలుగుచున్నది.

తా॥ సకలకార్యములకంటె నధికమయినదగుటవలన మహత్తనియును, సకలమును వృద్ధిని బొందించుటవలనను, ధరించుటవలనను బ్రహ్మమనియును చెప్పబడు మూలప్రకృతిగర్భాదాన స్థానమగు యోని యనంబడును. నేనిట్టి ప్రకృతి యనెడు యోనియందు చైతన్యమనెడు బీజమును (జీవుని) ఉంచుచున్నాను. అందువలన సమస్తభూతములయొక్క యుత్పత్తి కలుగుచున్నది.

వి॥ మనుజుల భేదములను గుఱించి బీజాంకుర న్యాయమును చెప్పువారు అన్నిటిలోను బీజరూపముగా నుండు జీవుడు ఈశ్వరస్వరూపుడని తెలిసికొనిన నీ వాదప్రతివాదముల కవకాశము గలుగదు.

శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ ! మూర్తయస్సంభవన్తి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా ॥ 4

పద॥ సర్వయోనిషు – కౌంతేయ ! - మూ ర్తయః – సంభవన్తి - యాః, తాసాం - బ్రహ్మ - మహత్ – యోనిః - అహం - బీజప్రదః – పితా.

ప్రతి॥ హే కౌంతేయ! = ఓ యర్జునా!, సర్వయోనిషు=సమస్తయోనులయందును, యాః మూర్తయః = ఏ శరీరములు, సంభవన్తి=పుట్టుచున్నవో, తాసాం= ఆ మూర్తులకు, మహత్ బ్రహ్మ = మూలప్రకృతి, యోనిః = పుట్టుటకు ఆధారమైన తల్లి, అహం = నేను, బీజప్రదః = గర్భాదానము చేయునట్టి, పితా = తండ్రిని.

తా॥ ఓ యర్జునా! దేవ, పితృ, మనుష్య, పశు, మృగాది సకలయోనులయందు పుట్టు పలువిధములైన శరీరములకు మాయ (ప్రకృతి) తల్లి యనియును, పరమేశ్వరుడనగు నేను గర్భాదాన కర్తయగు తండ్రిననియును తెలిసికొనుము.

వి॥ ముందుశ్లోకములో జెప్పబడిన ఈశ్వరాంశమే జీవబీజమని దృఢ పరచుట కొఱకు ఈ శ్లోకము ప్రవర్తించుచున్నది. ఇట్టి ధర్మమును భగవంతుడు బోధించినను జీవకోట్లలో భేదబుద్ధిని గలుగజేయుట భగవద్ధర్మమున కెంత విరుద్ధమో చూడుడు. మాయా మోహముచే సత్యమును తెలిసికొనక పోవు చున్నారు. ఒకవేళ దుష్టగుణము లుండిన అట్టివారిని వేరుపరచవచ్చును. శ్రేష్ఠ గుణములు గలవారిని గూడ వర్ణాశ్రమ ధర్మమను నెపముచే వేరుపరచుట యెంత అధర్మమో దీనివల్ల తెలిసికొనవచ్చును.

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః! ।
నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్ ॥ 5

పద॥ సత్త్వం – రజః - తమః - ఇతి - గుణాః – ప్రకృతిసంభవాః, నిబధ్నన్తి - మహాబాహో! - దేహే - దేహినం - అవ్యయమ్.

ప్రతి॥ హేమహాబాహో!=మహాబాహువులుగల ఓ యర్జునా!, ప్రకృతిసంభవాః= ప్రకృతివలన బుట్టిన, సత్త్వం రజః తమః ఇతి గుణాః = సత్త్వరజస్తమోగుణములు, అవ్యయం = నాశరహితమైన, దేహినం = దేహమునందున్న ఆత్మను, దేహే = దేహమునందు, నిబధ్నన్తి = బంధించుచున్నవి.

తా॥ భగవన్మాయవలన గలిగిన సత్త్వము, రజస్సు, తమస్సు అనునట్టి మూడు గుణములు. ఈ గుణములకంటె వేరైన నాశరహిత మైన యాత్మను దేహమునందు బంధించుచున్నవి.

వి॥ సత్త్వరజస్తమస్సులనెడు మూడు గుణములు ప్రకృతి సంభవములే. ఈ గుణములలో ఏ ఒక గుణముండినను అదే ప్రకృతి జన్మదేహముతో బంధించును. ఈగుణములలో నేదైన యొకటి యుండినను ముక్తి గలుగదు. ఒక పశువును వెనుక రెండుకాళ్ళను, ముందు రెండు కాళ్ళను, పైన కొమ్ములను మూడు త్రాళ్ళచే మూడు దిక్కులకు కట్టివేసియుండిన ఆ జంతువెట్లు స్వేచ్ఛగా తిరిగి యానంద మనుభవింప జాలదో, గుణములచే బద్ధుడైన జీవియు నాలాగున నుండును. దీనియందు సత్త్వగుణముగూడ ప్రకృతిజన్యమే యని తెలుపడమైనది.

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ! 6

పద॥ తత్ర - సత్త్వం - నిర్మలత్వాత్ - ప్రకాశకం - అనామయం,
సుఖసంగేన - బధ్నాతి - జ్ఞానసంగేన - చ - అనఘ!

ప్రతి॥ హే అనఘ! = పాపరహితుడవగు నో యర్జునా!, తత్ర = ఆ సత్త్వరజస్తమస్సులనెడి మూడు గుణములలో, సత్త్వం = మొదటిదియగు సత్త్వగుణము, నిర్మలత్వాత్ = నిర్మలమైనదగుటవలన, ప్రకాశకం = ప్రకాశింప జేయునదియును, అనామయం = ఆరోగ్యకరమైనదియునై, సుఖసంగేన = ఇంద్రియ సుఖములతో గూడుటచేతను, జ్ఞానసంగేన చ = ప్రపంచజ్ఞానముతో జేర్చుట చేతను లేక అమానిత్వాది జ్ఞానముతో మాత్రము గూర్చుటచేతను, బధ్నాతి = బంధించుచున్నది.

తా॥ ఓ అర్జునా! ఆ సత్త్వరజస్తమస్సులనెడు మూడు గుణములలో మొదటిది యగు సత్త్వగుణ మేలాగున జీవుని బంధించుచున్నదో తెలియదగినది. నిర్మలమైన దగుటవలన ప్రకాశింపజేయునదియును, ఆరోగ్యకరమైనదియునై దృశ్యసుఖముతో గూర్చుటచేతను, ప్రపంచవిషయక జ్ఞానముతో జేర్చుటచేతను లేక అమానిత్వాది జ్ఞానములచేత తృప్తి పొందుటచేతను లేక శాస్త్రజ్ఞానముచేత తృప్తి పొందుటచేతను బంధించుచున్నది.

వి॥ సంసారములోగల దారాపుత్రారామ ధనాదులలోగల ప్రీతివలన ముక్తి గలుగదు. సత్త్వగుణము దేహసుఖమునకు సంబంధించిన మంచి

మంచి సాత్త్వికాహారానురాగముచేతను, శుభ్రమైన ప్రదేశమునందలి ప్రీతి చేతను, స్వచ్ఛమైన వస్త్ర పాత్రాదులయందలి ఆకాంక్షచేతను, అనాత్మభూత ములగు ఇతర దేహాదులలోగల ప్రేమచేతను, బద్ధుని చేయుచున్నది. ఇట్టి సుఖ ములలో మగ్నుడగుటవలన వాటినన్నిటిని త్యజించి యేకాంతమునగాని, ఇతర నిర్జన ప్రదేశమునందుగాని ఉండి తపమొనర్చుటకు, లేక ధ్యానసమాధులు శీలించుటకుగాని శక్తుడు గాజాలడు అట్టి సుకుమారులు మంచి ఏకాంత ప్రదేశ మందుగాని, హిమాలయ ప్రాంతమందుగాని లేక ధర్మప్రబోధార్థము సంచరించునపుడుగాని, సుకుమారభోజన పాన శయనాదులు దొరకక వ్యాధి గ్రస్తులై మరల స్వగృహమునకు తిరిగి రావలసియుందురు. కావున సుకు మారత్వమును శీలించవలదు. సుఖాసక్తిని కలుగజేయు సత్త్వగుణము గూడ బంధకమే యగునని తెలియవలయును.

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌంతేయ! కర్మసంగేన దేహినమ్ ॥ 7

పద॥ రజః - రాగాత్మకం - విద్ధి - తృష్ణాసంగసముద్భవం,
తత్ - నిబధ్నాతి - కౌంతేయ ! - కర్మసంగేన - దేహినమ్.

ప్రతి॥ హే కౌంతేయ! = కుంతీతనయుడవగు ఓ యర్జునా !, రజః = రజో గుణము, రాగాత్మకం = రాగస్వరూపమైనదనియు, అనగా దృశ్యవిష యములందు ప్రీతిని గలుగజేయునదనియు, తృష్ణాసంగసముద్భవం = ఆసక్తిని గలుగజేయునదనియు. విద్ధి = ఎఱుంగుము, తత్ = ఆ రజో గుణము, దేహినం = దేహస్థితుడగు జీవుని, కర్మసంగేన = ఐహికా ముష్మిక సుఖములయందాసక్తి యనెడి కర్మసంగముచేత, నిబధ్నాతి = బాగుగా బంధించుచున్నది.

తా॥ కుంతీపుత్రుడవగు ఓ యర్జునా ! రజోగుణము రాగ స్వరూప మనియు అనగా దృశ్యవిషయములందు ప్రీతిని ఆశను ఆసక్తిని గలుగ జేయునదనియు నెఱుగుము కావున ఆ రజోగుణమ దేహమునందుండు ఆత్మను (జీవుని) ఐహికాముష్మిక సుఖము యందాసక్తి యనెడి కర్మసంగముచేత లెస్సగా బంధించుచున్నది.

వి॥ రజోగుణమెట్లాత్మను బంధించునో, యా విషయము నిరూపింపబడు చున్నది. బాహ్యాడంబర కర్మలచేతను, దృశ్యవస్తువులలోగల యనురాగము చేతను, ప్రపంచములో విఖ్యాతిగావలెనను ప్రయత్నముచేతను, విషయసుఖా సక్తి చేతను రజోగుణము ఆత్మను బంధించుచున్నది.

శ్లో॥ తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత! ॥ 8

పద॥ తమః - తు - అజ్ఞానజం – విద్ధి - మోహనం - సర్వదేహినాం.
ప్రమాదాలస్యనిద్రాభిః - తత్ - నిబధ్నాతి - భారత!.

ప్రతి॥ హే భారత! = ఓ యర్జునా !, తమః తు = తమోగుణమన్ననో. అజ్ఞానజం=అజ్ఞానమువలన బుట్టినదానినిగాను, సర్వదేహినాం = సమస్తప్రాణులకు, మోహనం = మోహమును గలుగ జేయునదిగాను, విద్ధి = ఎఱుంగుము, తత్= ఆ తమోగుణము. ప్రమాదాలస్యనిద్రాభిః = భ్రమ,సోమరితనము అతినిద్ర మొదలగు వానిచే, నిబధ్నన్తి = మిక్కుటముగా బంధించుచున్నది.

తా॥ ఓ భారతా ! 'ఇది మంచి ఇది చెడుయ'ని తెలిసికొనజాలని యజ్ఞానమువలన గలిగినదియును, సకలప్రాణులకును మోహమును గలుగ జేయునదియునగు తమోగుణము, భ్రమ సోమరితనము అతి నిద్రయను వానిచే నాత్మను బంధించుచున్నదని తెలియుము.

వి॥ తమోగుణమెట్లాత్మను బంధించుచున్నదనగా అజాగ్రత్త బద్ధకము అతినిద్ర మొదలగువాని వలన జీవుని బంధించును. ఈ తమోగుణము నిజమైన జ్ఞానము లేక పోవుటచే నొక వస్తువును మఱియొక వస్తువునుగా దలంచెడు జ్ఞాన శూన్యత్వముచేత గలుగును. కనుకనే జీవుల నందఱిని విపరీతజ్ఞానముచే మోహింపజేయును.

శ్లో॥ సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత! ।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత ॥ 9

పద॥ సత్త్వం - సుఖే - సంజయతి - రజః - కర్మణి – భారత!,
జ్ఞానం – అవృత్య - తు – తమః - ప్రమాదే - సంజయతి - ఉత.

ప్రతి॥ హే భారత! = ఓ యర్జునా !, సత్త్వం = సాత్త్వికగుణము, సుఖే = ఇంద్రియ సుఖమునందును, రజః = రజోగుణము, కర్మణి=బాహ్యకర్మ

డంబరము అందును, సంజయతి = సంబద్ధుని లేక ఆసక్తుని జేయు చున్నది. తమః తు = తమోగుణమన్ననో, జ్ఞానం ఆవృత్య = జ్ఞానమును కప్పిపుచ్చి, ప్రమాదే సంజయతి = ప్రమాదమునందు ఆసక్తిని గలుగజేయుచున్నది. అనగా చేయవలసినదానిని చేయక దానికి భిన్నమగు మఱియొకదానిని చేసేలాగున ప్రమాదమును గలుగ జేయుచున్నది ఉత = ఓహో! యేమి ఆశ్చర్యము?

తా॥ త్రిగుణముల స్వభావము సంక్షేపముగా మఱల జెప్పబడుచున్నది. ఓ అర్జునా! దుఃఖ శోకాది కారణముల నణచి సత్త్వగుణము బలవత్తరమై సుఖ సాధనములైన విషయముల యందాత్మను ప్రవర్తింప జేయును. సుఖకారణముల నణచి రజోగుణము బలవత్తరమై భోగముల ననుభవించుటకు సాధనములైన కర్మలయందాత్మను ప్రవర్తింపజేయును. తమోగుణము ఆత్మ చేయదగిన కార్యములకు విఘ్నములైన ప్రమాదాదులయందు ప్రవేశమును గలిగించును, అనగా ప్రమాదమును చేకూర్చును.

వి॥ త్రిగుణముల స్వభావమును తెలిసికొని, వాటికి లోనుగాక ప్రవర్తించుట ప్రయాసమగుటచే నిదివరలో జెప్పినవానినే మఱల చెప్పుటకు కారణమైనది. ఈ మూడు గుణములలో నేగుణములో నుండువారైనను, తాముచేయునది సరిగా నున్నది; ఇది ధర్మమనిగూడ కలుగజేసెడు ఒక మహాశక్తి గలదు. నేత్రములకు ఎఱుపు, నలుపు రంగులుగల యద్దముల(కళ్ళజోడు) పెట్టుకొని చూచు వారికి దృశ్యవస్తువులన్నియు తమయొక్క సులోచనపు అద్దములయొక్కరంగులు గలవిగా గనుపించును. మూడు గుణములను దాటిన ముక్తాత్మునకు మాత్రమే సత్యము గోచరించును. కనుకనే యీ శ్లోకాన్తమున "ఉత" అని ప్రయోగించబడినది. అనగా అకటా! ఆశ్చర్యము అని, ఇక నీలాగున చెప్పిన విషయములే. మఱల త్రిప్పి త్రిప్పి చెప్పబడును. అది త్రిగుణముల స్వభావము, అగ్రాహ్యవిషయమగుటవలనను. అనుష్ఠించుట గుణాతీతస్థితిని పొందుటయు ప్రయాసమగుట చేతను యిట్లు చెప్పుటకు కారణము. దీనివలన ద్విరుక్తి, చర్వితచర్వణము, పిష్టపేషణము అను నీలాటి దోషములు సంభవింపవు.

శ్లో॥ రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత!।
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా ॥ 10

పద॥ రజః - తమః - చ - అభిభూయ - సత్త్వం - భవతి - భారత!
రజః - సత్త్వం - తమః - చ - ఏవ - తమః - సత్త్వం - రజః - తథా.

ప్రతి॥ హే భారత! = ఓ యర్జునా! సత్త్వం = సాత్త్వికగుణము, రజఃతమః చ = రజస్తమోగుణములను, రజః = రాజసగుణము, సత్త్వం తమఃచ = సత్త్వ తమో గుణములను, తథా = అలాగున, తమః = తామసగుణము, సత్త్వం రజః చ ఏవ = సత్త్వరజోగుణములను, అభిభూయ = అణచి, భవతి = తానువృద్ధియగుచున్నది.

తా॥ ఓ యర్జునా! సత్త్వగుణము, రజోగుణ తమోగుణముల కంటె బలము గలిగియుండునపుడు వాటి నణచి తాను(సత్త్వగుణము) వృద్ధినొంది జ్ఞానసుఖాదికములను గలిగించును. అట్లే రజోగుణము సత్త్వతమస్సులకంటె బలవత్తరమై యుండినపుడు వాటిననణచి తాను పైచేయి అయి తన (రజస్సు) యొక్క కృష్యాది కార్యప్రవృత్తిని గలిగించును. అట్లే తమోగుణము, సత్త్వరజోగుణములకంటె విజృంభించియుండునపుడు అది సత్త్వరజముల నణచి స్వకార్యములగు జ్ఞానావరణ ప్రమాదాదులను కలిగించును.

శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత ॥ 11

పద॥ సర్వద్వారేషు - దేహే - అస్మిన్ - ప్రకాశః - ఉపజాయతే,
జ్ఞానం - యదా - తదా - విద్యాత్ - వివృద్ధం - సత్త్వం - ఇతి - ఉత.

ప్రతి॥ అస్మిన్ దేహే = ఈ దేహమునందు, సర్వద్వారేషు = సమస్త శ్రోత్రాదీన్ద్రియ ద్వారముల యందు, జ్ఞానం ప్రకాశః = జ్ఞాన స్వరూపమగు ప్రకాశము, యదా = ఎప్పుడు, ఉపజాయతే = పుట్టుచున్నదో తదా = అప్పుడు, సత్త్వం = సాత్త్వికగుణము, వివృద్ధం = వృద్ధినొందియున్నదని, విద్యాత్ = ఎఱుంగ వలెను, ఉత = సుమీ.

తా॥ ఈ దేహమునందలి శ్రోత్రాది సకల ద్వారములయందు చిత్తవృత్తిస్వరూపమైన జ్ఞానమనెడి ప్రకాశమెపుడు గలుగునో, అప్పుడు సత్త్వగుణము మిక్కిలి యభివృద్ధి జెందియున్నదని తెలిసి కొనవలయును సుమా !

వి॥ ఒకడు సత్త్వగుణములగలవాడైనచో వాడుచేయు సమస్తవిషయము లును సత్త్వగుణలక్షణములు గలిగియే యుండును. అతనికి కొన్ని రజోగుణ ములు కొన్ని తమోగుణములు ఈలాటి కొన్నిగుణములు మార్పుగలిగియుండవు. తినే యాహారము చెప్పేవాక్యము సంకల్పము, చేసే కార్యములు ఇవియన్నియు సత్త్వగుణముతో గూడినవిగానే యుండును. విశుద్ధసత్త్వమగు తురీయములో నుండువానికి మూడు గుణములు ఉండవు. అయితే కొన్ని దేహగుణములు మాత్రము సాత్త్వికములై యుండును. ఆత్మమాత్రము విశుద్ధమై దైవభావముగా ననుభూత మగుచుండును. దేహము మాత్రము సత్త్వగుణోపేతమై యుండుటకు కారణమేమన, మూడు గుణములు వినా చతుర్దశ భువనములలో మఱియేయొక వస్తువున్ను ఉండదు. ఒకడు తమోగుణము గలిగియున్నపుడు అట్టి యాహారము అట్టి జనులతో బంధుత్వము మొదలగునవి గలిగియుండును. కట్టకడకు చదివెడు పుస్తకములుగాని, వార్తాపత్రికలుగాని తమోగుణసంబంధములై యుండును. అతడు రజోగుణములో ప్రవేశించునపుడు, పూర్వపు తమోగుణాహార వస్త్రధార ణాదులు, స్నేహితులు చదివే పుస్తకములు, పత్రికలన్నియు మారిపోయి రాజసి కాహార, వస్త్ర, మిత్ర, పుస్తక, పత్రికాదులు ఇష్టములై యుండును. అప్పుడు తన ధనమంతయు నధికారము కొఱకును, పేరు ప్రతిష్టల కొఱకును వినియోగపఱచును. అట్టి స్థితిలో పూర్వముండిన తమోగుణము గలిగిన తన సొంత జనులకుగాని తామసికాహారాదులను గాని ప్రేమిం పడు. మఱల పుణ్యవిశేషముచే సత్త్వగుణము గలుగునపుడు పైజెప్పిన రెండు గుణముల సంబంధములన్నిటిని విడిచి సాత్త్వికాహారము, నిరా డంబర జీవితము, సత్త్వగుణములగల వారితో మిత్రత్వము, దైవజ్ఞానమును దెలిపెడు గ్రంథములనుగాని, వార్తాపత్రికలనుగాని చదివెడు స్వభావము గలిగి యుండును. అప్పుడు ఇదివరలో రజస్తమో గుణములు గలిగియుండు బంధువు లను గాని కట్టకడకు తల్లిదండ్రులనుగాని, భార్యయైన భర్తనుగాని, భర్తయైన భార్యనుగాని ప్రేమించెడు స్వభావము వదలిపోవును. అప్పుడు ఇదివరలో దేహబలమును గలుగజేసెడు ఆహారాదులను మాని ఆత్మశక్తిని గలుగజేసెడు అంతఃకరణశుద్ధిని గలుగజేసెడు ఆహారాదులను మాత్రమే భుజించెడు స్వభా వము గలిగియుండును. జీవన్ముక్తి గలుగునపుడు, పండినకాయ చెట్టునుండి వ్యయముగా రాలిపోవునట్లు, సమస్త విషయములనుండి విముక్తి గలిగి యే సమయమున కేది మిగులునో దానితో తృప్తినొంది సదా బ్రహ్మభావన గలిగి

యుండును. రావణాదులకును విభీషణునకును హిరణ్యకశిపునకును ప్రహ్లాదునకును, దుర్యోధనాదులకును పాండవులకును ఎట్టి మార్పు గలిగెనో అట్టి మార్పు తప్పక గలుగును. ఒక మామిడికాయలో పిందెగా నున్నపుడు చేదు, వగరున్ను, మధ్యకాలములో పులుపు, పండుకాలములో తీపియు గలిగి యెట్లు క్రమముగా మార్పువచ్చినదో సుఱియు అట్లే పచ్చికాయగా నున్నప్పటి ఆకు పచ్చని వర్ణము, పండునపుడు పసుపు పచ్చని వర్ణముగా మారి చివరికి ఏలాగున చెట్టునుండి స్వయముగా వదలిపోవునో, గుణపరిణామమున్ను జీవన్ముక్తియు నాలాగుననే యుండునని అనగా గుణములు క్రమముగా వదలిపోయి కడకు గుణాతీతస్థితి సంభవించునని గ్రహించవలయును.

శ్లో॥ లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమస్స్పృహా ।
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ! ॥ 12

పద॥ లోభః - ప్రవృత్తిః - ఆరంభః - కర్మణాం - అశమః - స్పృహా, రజసి - ఏతాని - జాయన్తే - వివృద్ధే - భరతర్షభ.

ప్రతి॥ హే భరతర్షభ! = ఓ యర్జునా!, రజసి = రజోగుణము, వివృద్ధే = వృద్ధి నొందినదగుచుండగా, లోభః = లుబ్ధత్వము, కర్మణాం = కామ్యకర్మల యొక్క, ఆరంభః = ప్రారంభించుటయు, ప్రవృత్తిః = ఆ పనులయందు ప్రవర్తించుటయు, అశమః = మనశ్శాంతి లేకుండుటయు, స్పృహా = ఆశయు, ఏతాని = ఇవి, జాయన్తే = కలుగుచున్నవి.

తా॥ భరతకుల శ్రేష్ఠుడవగు ఓ యర్జునా! రజోగుణము వృద్ధి నొందినదగుచుండగా లుబ్ధత్వము, కామ్యకర్మలయొక్క ప్రారంభించుటయు, ఆ పనులయందు ప్రవర్తించుటయు, ఇంద్రియనిగ్రహము, మనశ్శాంతి లేకుండుటయు, ఆశయు నివి గలుగుచున్నవి.

శ్లో॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన! ॥ 13

పద॥ అప్రకాశః - అప్రవృత్తిః - చ - ప్రమాదః - మోహః - ఏవ - చ, తమసి - - ఏతాని - జాయన్తే - వివృద్ధే - కురునన్దన !.

ప్రతి॥ హే కురునందన! = ఓ యర్జునా!, తమసి = తమోగుణము, వివృద్ధే = వృద్ధినొందినదగుచుండగా, అప్రకాశః = బుద్ధిమాన్ద్యము, అప్రవృత్తిః చ =

బద్ధకము, ప్రమాదః = పొరబాటు(అజాగ్రత్త), మోహః ఏవ చ = అజ్ఞానమును, ఏతాని = ఇవి, జాయన్తే = కలుగుచున్నవి.

తా॥ కురుకుమారా! ఓ యర్జునా! తమోగుణము వృద్ధికాగా బుద్ధిమాంద్యము, పనిచేయ నిచ్ఛగించకుండుటయు, బద్ధకము పొరబాటు (అజాగ్రత్త) అజ్ఞానమును అనునవి కలుగుచున్నవి.

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్ ।
తదో త్తమవిదాం లోకా నమలా న్ప్రతిపద్యతే ॥ 14

పద॥ యదా - సత్త్వే - ప్రవృద్ధే - తు - ప్రళయం - యాతి - దేహభృత్, తదా - ఉత్తమ విదాం - లోకాన్ - అమలాన్ - ప్రతిపద్యతే,

ప్రతి॥ యదా = ఎప్పుడు,సత్త్వేప్రవృద్ధేతు = సత్త్వగుణమభివృద్ధిజెందియుండగా దేహభృత్ = దేహధారియగు జీవుడు, ప్రళయం యాతి = మరణమును పొందుచున్నాడో, తదా = అప్పుడు, ఉత్తమవిదాం = ఉత్తమజ్ఞానము గల వారియొక్క, అమలాన్ లోకాన్ = నిర్మలములైన స్వర్గాది లోకములను, ప్రతిపద్యతే = పొందుచున్నాడు.

తా॥ దేహధారియగు జీవుడు, ఎప్పుడు సత్త్వగుణ మభివృద్ధి జెందియుండగా మరణము నొందుచున్నాడో, అపుడతడు ఉత్తమ జ్ఞానముగలవారియొక్క అనగా ఉత్తమజ్ఞానులుపొందెడు నిర్మలములైన స్వర్గాది లోకములను బొందుచున్నాడు.

వి॥ ఇహలోకములో నుండునపుడు త్రిగుణముల స్వభావము గలవారెట్లుందురో, అది ఇదివఱలో తెలుపడమైనది. అట్టి మూడు గుణములతో గూడినవాడు పరలోకమందెట్లుండునో, ఆ విషయమిపుడు తెలుపబడుచున్నది. నవ ధాన్యముల నుండి యొక్క పిడికెడు తీసికొని పొలములో చల్లివేసిన, అందు ఎన్నిరకముల విత్తనములు గలవో అవన్నియు మొలచునట్లు, అంత్యకాలమున జీవుని హృదయములో నే యే గుణములు గలిగియుండునో, వాటి కనుగుణములగు లోకములను మరుజన్మములను పొందుచుండును. కావున నిపుడు జాగ్రత్తపడనిచో పరలోకమును, మఱల వచ్చెడు జన్మమును చెరచుకొన్నవారగుదురు. ఏగుణమును లేనివాడు జీవన్ముక్తిని పొందును.

శ్లో॥ రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే ॥ 15

పద॥ రజసి - ప్రళయం - గత్వా - కర్మసంగిషు - జాయతే,
తదా - ప్రలీనః - తమసి - మూఢయోనిషు - జాయతే.

ప్రతి॥ రజసి = రజోగుణమభివృద్ధి జెందియుండగా, ప్రళయం గత్వా = మరణము నొంది, కర్మసంగిషు = కామ్యకర్మాసక్తులగు మనుష్యులలో, జాయతే = జన్మించుచున్నాడు, తథా = అలాగుననే, తమసి = తమోగుణమభివృద్ధిజెందియుండగా, ప్రలీనః = మృతి నొందినవాడు మూఢయోనిషు = జ్ఞానహీన యోనులయందు, జాయతే = జన్మించుచున్నాడు.

తా॥ రజోగుణ మభివృద్ధిజెందియున్నపుడు జీవుడు శరీరము విడిచినయెడల కర్మఫలాభిలాషులగు మనుష్యులలో బుట్టుచున్నాడు. తమోగుణమభివృద్ధి జెందియున్నపుడు మృతినొందినవాడు, జ్ఞాన,ధన విద్యావిహీనులగు హీనజాతులయందుగాని, లేక పశుపక్ష్యాది తిర్యగ్ జంతువులలోగాని పుట్టుచున్నాడు.

శ్లో॥ కర్మణ స్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజసస్తు ఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్ ॥ 16

పద॥ కర్మణః - సుకృతస్య - ఆహుః - సాత్త్వికం - నిర్మలం - ఫలం,
రజసః - తు - ఫలం - దుఃఖం - అజ్ఞానం - తమసః - ఫలమ్,

ప్రతి॥ సుకృతస్య = సుకృతమైన, కర్మణః = కర్మమునకు, సాత్త్వికం = సత్త్వగుణ సంబంధమైన, నిర్మలం = శుద్ధమైన సుఖము, ఫలం = ఫలమనియు, రజసః తు = రజోగుణము కన్ననో, దుఃఖం = సుఖదుఃఖమిశ్రమమగు, ఫలం = ఫలమనియు, తమసః = తమోగుణమునకు, అజ్ఞానం = జ్ఞానహీనత్వమే. ఫలం = ఫలమని, ఆహుః = సూక్ష్మదర్శకులు చెప్పిరి.

తా॥ సాత్త్వికములైన కర్మలకు పుణ్యస్వరూపమైన సుఖము ఫలమనియు, రాజసములైన కర్మలకు సాంసారిక దుఃఖము ఫలమనియు, తామసిక కర్మలకు అజ్ఞానము తజ్జన్యమైన దుఃఖము ఫలమనియు, తత్త్వవేత్తలగు కపిలాది మహర్షులు చెప్పుచున్నారు.

వి॥ ఆత్మ స్వప్రకాశజ్ఞానస్వరూపమైనదైనను కర్మలననుసరించిహృదయా వరణములు గలుగుచుండును. దీపమన్నిటిని ప్రకాశింపజేయగల కాంతివంతమైన దైనను, తెలుపు, ఎరుపు. నలుపు మొదలగు గ్లాసులచే మూయబడినచో ఎట్లు ఆ చిమ్నీలయొక్క స్వభావము ననుసరించి ప్రకాశించునో మట్టికుండతోమూసి వేసినచో నెట్లు ప్రకాశశూన్యమైపోవునో వీటితో నొక్కొక్క గ్లాసును మార్చి మార్చి పెట్టిన దీపపు కాంతులును మారి పోవునో, అలాగున జీవునియొక్కహృద యము పుణ్యపాప మిశ్రకర్మముల ననుసరించి మార్పు చెందుచుండును. అపుడు ఆ మార్పుకు తగిన జ్ఞానమే యాజీవికి గలుగును, ఇపుడు తెల్లని చిమ్నీతో వెలుగుచుండెడు దీపము యొక్క తెలుపు చిమ్నీని తీసివైచి నీలపురంగుగల చిమ్నీని పెట్టినచో నెట్లుండునో, లేక నలుపురంగుగల చిమ్నీతో వెలుగుచుండు దీపముయొక్క నీలపురంగు చిమ్నీని తీసివైచి తెల్లని చిమ్నీని పెట్టిన ఎట్లుం డునో, అలాగున ఇప్పుడు పుణ్యముచే గలిగియుండు సుఖము జ్ఞానము గలవారు పాపకార్యమును జేసిన మఱలవారికి దుఃఖము అజ్ఞానమునుగల జన్మమే వచ్చును. అలాగున పాపజీవియైనను పుణ్యకర్మలు మరుపురానిచో నల్లని చిమ్నీని తీసి వైచి తెల్లని చిమ్నీని పెట్టినట్లు హృదయము పరిణామమును పొంది వారికి జ్ఞాన మును సుఖమును గల జన్మము వచ్చును. ఈ విషయమై పతంజలి మహర్షి తమ యోగదర్శనమందు బాగుగా దెలిపియున్నారు. కావున అజాగ్రత్త పడకుడు. ఉండేకాలము చాల స్వల్పము. దానిలోపలనే మనస్సును మార్చుకొనుడు. అట్లైన శుభము గలుగును.

శ్లో॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ ॥ 17

పద॥ సత్త్వాత్ - సంజాయతే - జ్ఞానం - రజసః - లోభః - ఏవ - చ.
ప్రమాదమోహౌ - తమసః - భవతః - అజ్ఞానం - ఏవ - చ.

ప్రతి॥ సత్త్వాత్ = సాత్త్వికగుణమువలన, జ్ఞానం = అమానిత్వాది జ్ఞానము లేక లోకజ్ఞానము లేక శాస్త్రజ్ఞానము, రజసః = రాజసగుణమువలన, లోభః ఏవ చ = లోభమును, సంజాయతే = కలుగుచున్నది. తమసః = తామస గుణము వలన, ప్రమాదమోహౌ = ప్రమాదము, విపరీతజ్ఞానమును, భవ తః = కలుగు చున్నవి, అజ్ఞానం ఏవ చ = అజ్ఞానమున్ను గలుగుచున్నది.

తా॥ సత్త్వగుణమువలన నిత్యానిత్యవస్తువివేకజ్ఞానము, రజో

గుణమువలన తరుగని యాశయు, (లోభము) తమోగుణమువలన నజాగ్రత, విరుద్ధజ్ఞానము, అజ్ఞానమను నవియును గలుగుచున్నవి.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః ॥ 18

పద॥ ఊర్ధ్వం - గచ్ఛన్తి - సత్త్వస్థాః - మధ్యే - తిష్ఠన్తి - రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థాః - అధః - గచ్ఛన్తి - తామసాః.

ప్రతి॥ సత్త్వస్థాః=సత్త్వగుణమందున్నవారు, ఊర్ధ్వం=స్వర్గాద్యూర్ధ్వలోకములను గచ్ఛన్తి=పొందుచున్నారు, రాజసాః = రజోగుణములుగలవారు, మధ్యే = మధ్యమమగు మనుష్యలోకమునందు, తిష్ఠన్తి = నిలుచుచున్నారు. (పుట్టు చున్నాడు), జఘన్యగుణవృత్తిస్థాః = నికృష్టగుణవృత్తులుగల, తామసాః = తమోగుణముగలవారు, అధః = అధోగతిని లేక అధమమనుష్యజన్మమును లేక పశ్వాది జన్మమును లేక అధోలోకమును, గచ్ఛన్తి = పొందుచున్నారు

తా॥ సత్త్వగుణ ప్రధానులు స్వర్గాద్యుత్తమ లోకములను పొందుచున్నారు. రజోగుణ ప్రధానులు మనుష్యలోకమును పొందు చున్నారు. నీచగుణమగు తమోగుణము గలవారు మనుష్యులలో హీనులుగా నుండుటనుగాని లేక పశ్వాది జన్మములనుగాని లేక అధో లోకములనుగాని పొందుచున్నారు.

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ 19

పద॥ న - అన్యం - గుణేభ్యః - కర్తారం - యదా - ద్రష్టా - అనుపశ్యతి,
గుణేభ్యః - చ - పరం - వేత్తి - మద్భావం - సః - అధిగచ్ఛతి.

ప్రతి॥ (ఎవడు), యదా=ఎప్పుడు, ద్రష్టా = వివేకియై, గుణేభ్యః = త్రిగుణముల కంటె, అన్యం కర్తారం = వేరైన కర్తను, న అనుపశ్యతి = చూడడో (తనను) గుణేభ్యః = త్రిగుణములకంటె, పరం=అన్యునిగా, వేత్తి చ = ఎఱుంగు చున్నాడో, సః = అట్టివాడు అప్పుడు, మద్భావం = నా స్వరూ పమును, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా॥ ఎవడు వివేకియై యెప్పుడు త్రిగుణములకంటె వేరైన కర్తను దర్శింపడో, అనగా గుణములే కర్తయని యెరుంగుచున్నాడో, మఱియు ఆత్మను గుణముల కంటె భిన్నముగా దెలియుచున్నాడో,

అట్టి జీవుడు నా స్వరూపమును పొందుచున్నాడు.

వి॥ ఈ శ్లోకముయొక్క నిజార్థమును బ్రహ్మవేత్తలముఖమునుండిగ్రహింపకపోయిన శుష్కవేదాంతులవలె అపాయములో పడిపోయెదరు. సత్త్వరజస్తమో గుణాత్మకములుగా పరిణమించియుండు నీ కార్యరూపములకు జన్మాంతర సంస్కారమే కారణముగా నెఱింగి, అట్టి సంస్కారముండుటచేతనే యిట్టి గుణములు గలుగుచున్నవని శుద్ధబుద్ధిగల యే వివేకి యెఱింగి అట్టి సంస్కారమును రహితమొనర్చ ప్రయత్నము చేయుచున్నాడో, అట్టి ప్రయత్నము సిద్ధమగునప్పుడు మూడు గుణములులేని భగవత్స్వరూపమును అనగా భగవత్పదృశజ్ఞానమును పొందుచున్నాడు. భగవదాకారము గలవాడగుచున్నాడు.

శ్లో॥ గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే ॥ 20

పద॥ గుణాన్ - ఏతాన్ - అతీత్య - త్రీన్ - దేహీ - దేహసముద్భవాన్.
జన్మమృత్యుజరాదుఃఖైః - విముక్తః - అమృతం - అశ్నుతే.

ప్రతి॥ దేహీ = జీవుడు, దేహసముద్భవాన్ = దేహోత్పత్తికి బీజభూతములగు ఏతాన్ = ఈ, త్రీన్ గుణాన్ = మూడైన సత్త్వరజస్తమోగుణములను, అతీత్య = అతిక్రమించి, జన్మమృత్యుజరాదుఃఖైః = జననము మరణము వార్ధక్యము దుఃఖము అను వీటిచేత, విముక్తః = విడువఁబడినవాడై అమృతం = మోక్షమును, అశ్నుతే = పొందుచున్నాడు (లేక అనుభవించుచున్నాడు.)

తా॥ జీవుడు దేహోత్పత్తికి కారణభూతములైన పైన చెప్పబడిన సత్త్వరజస్తమోగుణముల మూడింటిని అతిక్రమించి (అనగా దేహమును విడనాడక మునుపే, బ్రహ్మజ్ఞానముచేత త్రిగుణముల నణచి) పుట్టుక, చావు, ముసలితనము, దుఃఖములు మొదలగువానిని చెందక అనగా జీవన్ముక్తుడై నాలో నైక్యమును పొందుచున్నాడు.

వి॥ కొందఱు ఈపై 19 వ శ్లోకమునకు ఎవడు త్రిగుణములకంటె త్రిగుణకార్యములకు వేరైన కర్తనుచూడడో, వాడు భగవద్భావమును పొందుచున్నాడని యర్థము చేసుకొని, గుణములే గుణములలో ప్రవర్తించుచున్నవి గాని, ఆత్మయగుభగవంతుడు ప్రవర్తించుటలేదని తెలుపుదురు. మఱియు గుణములకధీనులై

యింద్రియ లోలురగుదురు. ఇట్టి ప్రమాదానర్థములో పడిపోకూడదని తలంచియే భగభంతునిచే ఈ శ్లోకమున "గుణా౯ ఏతా౯ అతీత్య" జీవించియున్నప్పుడే మూడు గుణములను అతిక్రమించినవాడు బ్రహ్మపదమును పొందగలడని స్పష్టముగ తెలుపడమైనది.

అర్జున ఉవాచ:— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ కై ర్లింగై స్త్రీన్గుణా నేతా నతీతో భవతి ప్రభో ! ॥
కిమాచారః కథం చైతాం స్త్రీన్గుణా నతివర్తతే ॥ 21

పద॥ కైః – లింగైః – త్రీ౯ – గుణా౯ – ఏతా౯ – అతీతః – భవతి – ప్రభో! కిమాచారః – కథం – చ – ఏతా౯ – త్రీ౯ – గుణా౯ – అతివర్తతే.

ప్రతి॥ హే ప్రభో !=ఓ శ్రీకృష్ణమూర్తీ!, కైః లింగైః = ఏ లక్షణములచేత, ఏతా౯ త్రీ౯ గుణా౯ = ఈ మూడు గుణములను, అతీతఃభవతి = అతిక్రమించిన వాడగుచున్నాడు?, కిమాచారః = అట్టివాని యాచారమేమి? ఏతా౯ త్రీ౯ గుణా౯ = ఈ మూడు గుణములను, కథం అతివర్తతే చ = ఎట్లతిక్రమించుచున్నాడు.

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ ! సత్త్వరజస్తమస్సులను త్రిగుణముల నతిక్రమించినవాడు ఎట్టి లక్షణములు గలిగియుండును? అట్టివాని యాచారమేమి? ఈ మూడు గుణములను ఎట్లతిక్రమించుచున్నాడు?

వి॥ మూడు గుణములకు కారణములగు జన్మాంతరసంస్కారములే కర్త గాని, ద్రష్టయగు ఆత్మ కర్తగాదని 19-వ శ్లోకమున కర్థమైనచో ఈ శ్లోకమునందుగూడ 'గుణా౯ ఏతా౯ త్రీ౯ అతీతః' అని యర్జునుడు ప్రశ్నచేసియుండడు. ఈ మూడు గుణముల నెట్లతిక్రమింపగలడు? అని యర్జును డడుగుటచే నీ మూడు గుణములు రహితములు గావలయునని యర్థము స్పష్టమగుచున్నది. గుణములు రహితమైనపుడే బ్రహ్మపదము లేక మోక్షము సిద్ధించును.

శ్రీ భగవానువాచ:— శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ! ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ 22

శ్లో॥ ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే ॥ 23

" సమదుఃఖసుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మ కాంచనః ।
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మ సంస్తుతిః ॥ 24

" మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే ॥ 25

పద॥ ప్రకాశం - చ - ప్రవృత్తిం చ - మోహం - ఏవ - చ - పాండవ !
న - ద్వేష్టి - సంప్రవృత్తాని - న - నివృత్తాని - కాంక్షతి,
ఉదాసీనవత్ - ఆసీనః - గుణైః - యః - న - విచాల్యతే,
గుణాః - వర్తన్తే - ఇతి - ఏవ - యః - అవతిష్ఠతి - న - ఇంగతే,
సమదుఃఖ సుఖః - స్వస్థః - సమలోష్టాశ్మకాంచనః,
తుల్యప్రియాప్రియః - ధీరః - తుల్యనిన్దాత్మసంస్తుతిః,
మానావమానయోః - తుల్యః - తుల్యః - మిత్రారిపక్షయోః,
సర్వారంభపరిత్యాగీ - గుణాతీతః - సః - ఉచ్యతే,

ప్రతి॥ హే పాండవ ! = ఓ యర్జునా ! ఎవడు, సంప్రవృత్తాని = సంప్రాప్తములైన, ప్రకాశం చ = సత్త్వగుణ సంబంధమగు ప్రకాశమును, ప్రవృత్తిం చ=రజోగుణసంబంధమగు ప్రవృత్తిని, మోహం ఏవ చ = తమోగుణసంబంధమైన మోహమును, న ద్వేష్టి = ద్వేషింపడో, నివృత్తాని = విడిచిపోయిన యా గుణములనుగాని వాటి కార్యములనుగాని, న కాంక్షతి=కోరడో యః = ఎవడు, ఉదాసీనవత్ = సాక్షిభూతునివలె. ఆసీనః = ఉన్నవాడై గుణైః = గుణములచేత, న విచాల్యతే = చలింపబడడో, గుణాః ఏవ = గుణములే, వర్తన్తే ఇతి = ఆ యా కార్యములందు ప్రవర్తించుచున్నవి. యని, యః = ఎవడు. అవతిష్ఠతి=దృఢముగా నుంటున్నాడో, న ఇంగతే= నిష్ఠనుండి కదలకఉన్నాడో, (ఎవడు), స్వస్థః = స్వరూపమునందు నిలుకడగలవాడై, సమదుఃఖసుఖః = సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాడును, సమలోష్టాశ్మ కాంచనః = మట్టిగడ్డ రాయి బంగారు వీటిని సమముగా చూచువాడును, ధీరః = ధీరుడై, తుల్య ప్రియా ప్రియః = ఇష్టానిష్టములయందు సమభావము గలవాడు నగుచున్నాడో, మానావమానయోః తుల్యః = మానావమానముల యందు సముడును, మిత్రారి

పక్షయోః = శత్రుమిత్రులయందు, తుల్యః = సముడును, సర్వారంభ పరిత్యాగీ = సమస్త కామ్యకర్మములను విడిచినవాడును లేక సమస్తకర్మములను త్యజించి సదా బ్రహ్మనిష్ఠలో నుండునో, సః = వాడు, గుణాతీతః ఇతి = గుణాతీతుడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ ఓ యర్జునా! ఎవడు సంప్రాప్తములైన సత్త్వగుణసంబంధమగు ప్రకాశమును, రజోగుణ సంబంధమగు ప్రవృత్తిని, తమోగుణ సంబంధమగు మోహమునైనను ద్వేషింపడో, విడిపోయిన యాగుణములనుగాని, వాటి కార్యములనుగాని కోరడో, ఎవడు సాక్షిభూతుని వలె నున్నవాడై గుణములచే చలింపడో. గుణములే అయా కార్యములయందు ప్రవర్తించుచున్నవని యెవడు దృఢముగా నున్నవాడై స్వరూపస్థితినుండి కదలడో. మఱియు సుఖము గలిగినను, దుఃఖము గలిగినను సంతోషవ్యసనములను జెందక వికారములులేక, బంగారు రత్నములు మట్టిగడ్డ అను భేదములేక, ఇష్టానిష్ట వస్తుప్రాప్తియందు సమచిత్తత గలిగి ధీరుడై స్తుతినిందలయందు సముడైనవాడగు చున్నాడో, మానావమానములయందును, శత్రు మిత్రులయందును సముడై సకలకామ్యకర్మములను విడిచినవాడును లేక సమస్తకర్మములను పరిత్యజించి సదా బ్రహ్మనిష్ఠయందుండువాడును లేక సొంత కార్యముల నన్నిటిని విడిచి పరజీవుల మేలు కొఱకు ప్రవర్తించు వాడును ఎవడోవాడు 'గుణాతీతుడ'ని చెప్పబడుచున్నాడు.

వి॥ బ్రహ్మకారస్థితిలో నుండువాడు,సత్త్వగుణసంబంధసుఖప్రాప్తిగాని, రజోగుణసంబంధ కర్మప్రాప్తిగాని తమోగుణ సంబంధ మోహప్రాప్తిగాని, ఇతరులచేత గలిగినను లేక పైమూడు గుణములు, తత్కార్యములు తొలగి పోయినను తన బ్రహ్మ సాక్షాత్కార స్థితినుండి చలించడు.(22)

వి॥ ఈ శ్లోకమందు గూడ పైచెప్పినభావమే స్థిరము చేయబడుచున్నది. 'గుణైఃన విచాల్యతే' మూడుగుణములు ఏ బ్రహ్మనిష్ఠుని చలింప చేయజాలవో, 'నేంగతే' దేనివల్లను తన బ్రహ్మభావమునుండి కదలడో, అని యీ రెండువిశేషణములచే ప్రకృతిగుణములనుండి విముక్తుడైన బ్రహ్మనిష్ఠుడు ప్రకృతిగుణములచే చలింపబడడని చెప్పబడినది. ఇదే నిజమైన యారూఢ స్థితియనబడును.

మూడు గుణములనుండి విముక్తిని పొందిన వాడిట్లుండునని తెలియవలయును. బ్రహ్మ విచారము చేయు సాధకులు తమకు ఇట్టి స్థితి గలిగినదా అని విచారించి తెలిసికొనవలెను. మంచి చేవగల చందనపుచెట్టు ఏలాగున నెంతగాలి తోలినను విరిగిపడదో, చేవలేని మామిడి, జువ్వి మొదలైన చెట్లు తుఫాను వచ్చినప్పుడు ఏలాగున విరిగి పడిపోవుచుండునో ఆలాగున ఆత్మనిష్ఠలోనిలుకడ గలవాడు ప్రకృతిగుణములచే చలింపడు. నిలుకడలేనివాడు ప్రకృతిగుణములకు, తద్వికారములకు లోబడిపోవును. బ్రహ్మనిష్ఠుడగు గుణాతీతునికి నిదియే గుఱుతు. (23)

వి॥ పరుల సొమ్మును మట్టిగడ్డగా చూచుటయు, తన సొమ్ము నందభిమానము లేకుండుటయు, లేక ఆత్మజ్ఞానమునకు మట్టిగడ్డ యెంత యుపయోగమో, ఈ ధనము గూడ అంతే యుపయోగపడునని తలంచి నిస్సంగుడై యుండుటయు గుణాతీతుని లక్షణము. (24).

వి॥ మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష యను నీ నాల్గు గుణములను బ్రహ్మవేత్తలు గలిగియుందురు. ఇచ్చట 'ఉపేక్ష' యనగా శత్రువునందు ఉదాసీన భావము గలిగియుండుటయే యని గ్రహించదగును. బహు మానమువలె అవమానమును సమముగా చూచుటయనగా, అవమానమునకు కారణమైన దోషము తన యందు లేకుండ జేసికొని ఆ పైన లోకముతో తనకు గలిగెడు యమర్యాదను లేక అవమానమును ఓపికతో సహించుట యని గ్రహించు కొనవలెను. ఇది గుణత్రయాతీతుని లేక సత్త్వగుణము గలవాని సహనమగును. అట్లుగాక అమర్యాదకర కార్యమును స్వయముగాచేసి దానిచే గలిగెడు యవమానమును సహించుట తమోగుణ సహనమే యగును. ఇట్లుండక పై చెప్పబడిన గుణాతీతుని లేక సత్త్వగుణము గలవాని సహనమును గలిగియుండవలెను. (25)

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ 26

పద॥ మాం - చ - యః - అవ్యభిచారేణ - భక్తియోగేన - సేవతే,
సః - గుణాన్ - సమతీత్య - ఏతాన్ - బ్రహ్మభూయాయ - కల్పతే.

ప్రతి॥ యః = ఎవడు, అవ్యభిచారేణ = అచంచలమైన, భక్తియోగేన = భక్తియోగముచేత, మాం చ = నన్నే, సేవతే = సేవించుచున్నాడో, సః = వాడు, ఏతాన్ గుణాన్ = ఈ త్రిగుణములను, సమతీత్య = ప్రయాసము

లేకయే అతిక్రమించి, బ్రహ్మభూయాయ = బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమును పొందుటకు. కల్పతే = సమర్థుడగుచున్నాడు.

తా॥ ఎవడు అచంచలమైన భక్తి యను యోగముచేత నన్నే సేవించుచున్నాడో, వాడీ త్రిగుణములను ప్రయాసములేకయే అతిక్రమించి బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమును పొందుటకు అర్హుడగుచున్నాడు.

వి॥ ఈ యధ్యాయములో చెప్పబడిన మూడుగుణములను దాటుటయు, మూడు గుణముల కతీతమగు గుణత్రయాతీత స్థితి నొందుటయు నెంతయో ప్రయాసమైన కార్యము. అట్టి అతిదుస్తరమగు సంసార సాగరమును భగవద్భక్తి యను బ్రహ్మాను సంధాన రూపయోగము గలవారు సులభముగా దాటగలుగుదురు. భక్తియోగము సర్వజనులకు ప్రయాసములేని మార్గము. ప్రతి అధ్యాయాంతమున నిర్మలమగు భగవద్భక్తి వలననే ముక్తి సులభమని చెప్పబడుచునే వచ్చుచున్నది. ఈ యధ్యాయాంతమునగూడ ఈ శ్లోకమున 'అనన్యభక్తి చేతనే త్రిగుణములను దాటి గుణాతీతుడై బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానమును పొందుట కర్హుడగుచున్నాడ'ని భక్తియోగము స్తుతింప బడినది. ఎంతఘోరమైన కాలకూటవిషముచే మూర్ఛితుడైనను, అమృత బిందువుచే నెట్లు విషదోషము నశించినవాడై, జీవితుడై, స్వబోధము నొందుచున్నాడో, అలాగున మాయా మోహితుడైనవాడు భగవద్భక్తియను అమృతమును పానము జేసినచో మాయా దోషము నశించి ఆత్మజ్ఞానమును బడసినవాడై బ్రహ్మసాక్షాత్కారమును బొంద నర్హుడగును.

శ్లో॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృతస్యా వ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ ॥ 27

పద॥ బ్రహ్మణః - హి - ప్రతిష్ఠా – అహం - అమృతస్య - అవ్యయస్య - చ, శాశ్వతస్య - చ - ధర్మస్య - సుఖస్య - ఏకాన్తికస్య - చ.

ప్రతి॥ అహం = నేను, అవ్యయస్య అమృతస్యచ=నాశములేని మోక్షస్థానమును, శాశ్వతస్య ధర్మస్య చ = సనాతనమగు ధర్మస్వరూపమును, ఏకాంతికస్య సుఖస్య చ = ముఖ్యమైన నిత్యానందస్వరూపము నగు, బ్రహ్మణః = పరబ్రహ్మమునకు, ప్రతిష్ఠా హి = ఉనికి పట్టునుగదా!

తా॥ నేను నాశములేని మోక్షస్థానమును, సనాతనమగు

ధర్మస్వరూపమును, ముఖ్యమైన నిత్యానంద స్వరూపమునగు బ్రహ్మ మున కాశ్రయభూతుడను. అనగా పైె చెప్పిన యన్నిటికి నాధార భూతుడనని భావము.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయవిభాగయోగో నామ
చ తు ర్ద శో౽ ధ్యా య ః

పద॥ ఇతి-శ్రీమద్భగవద్గీతాసు- ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే - గుణత్రయవిభాగయోగః - నామ - చతుర్దశః- అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇట్లు, ఉపనిషత్సు = ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యాయాం = బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రే = యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదే = శ్రీ కృష్ణార్జునసంవాద రూపమునగు, శ్రీ మద్భగవద్గీతాసు = శ్రీభగవద్గీతయందు, గుణత్రయ విభాగయోగః నామ = గుణత్రయ విభాగయోగమని ప్రసిద్ధిగలిగిన, చతుర్దశ అధ్యాయః = పదునాల్గవ అధ్యాయము సంపూర్ణము.

తా॥ ఇట్లు ఉపనిషత్స్వరూపమును, బ్రహ్మవిద్యయు, యోగ శాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీమద్భగవద్గీత యందు, గుణత్రయవిభాగయోగమను ప్రసిద్ధిగల పదునాల్గవయధ్యా యము ముగిసెను.

వి॥ దీనియందు జెప్పబడిన మూడుగుణములను, మూడు గుణములకు విలక్షణమగు ఆత్మ స్వరూపమును తెలిసికొనుట వలన బ్రహ్మాత్మైక్య జ్ఞానము గలుగుటచే దీనినొక యోగమని చెప్పడమైనది.

ఓమ్ తత్ సత్.



ఓమ్
శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## పంచదశోఽధ్యాయః – పంచదశాధ్యాయము

## పురుషోత్తమ ప్రాప్తియోగః– పురుషోత్తమప్రాప్తియోగము

ఈ యధ్యాయము పురుషోత్తమ ప్రాప్తిని అనగా పరబ్రహ్మప్రాప్తిని గలుగ జేయునదగుటచే 'పురుషోత్తమ ప్రాప్తియోగమ'ని దీనికి పేరుగలిగినది. దీని వలన శివ జీవైక్య జ్ఞానము గలుగును. దీనిని భోజనకాలమున విశిష్ట పురుషులు పారాయణము చేయుచుందురు. గీతలో 18 అధ్యాయములుండగా నీ యధ్యాయమును మాత్రమేల పారాయణము చేయవలయునని సందేహము కలుగవచ్చును. దీనియందు 14-వ శ్లోకమున వైశ్వానరోపాసన చెప్పబడి యుండుటచే అట్లు పారాయణము చేయుటకు కారణమైనది. భోజనకాలములో దేహమును క్షేత్రముగాను, ఆత్మను క్షేత్రమందుగల సర్వేశ్వరునిగాను భావన చేయవలయును. 13 వ అధ్యాయము 3-వ శ్లోకమున "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అని శ్రీభగవంతుడు తెలిపెను. కనుకనే పై యర్థమును భావన చేయవలయును. అట్టి భావనతో భుజించినచో, ఈదేహమందుండువాడు సాక్షాత్ విష్ణుమూర్తియను జ్ఞానము కొంత కాలమునకు గలుగును. అట్టిభావముతో భుజించువారికి పెట్టిన అన్నపానాదులు సాక్షాత్ భగవంతునకే పెట్టినట్లగును, అట్లు పెట్టబడిన అన్నాదులు శ్రీమన్నారాయణమూర్తియే భుజించినచో పెట్టినవారి కెంత పుణ్యము గలుగునో, అలాటి పుణ్యము భగవద్భావముతో భుజించువారికి నిక్కముగ గలుగును. కనుకనే పూర్వకాలమున బ్రహ్మనిష్ఠులగు బ్రాహ్మణులకును, బ్రహ్మజ్ఞానులగు సన్యాసులకును, అనేకాన్నసత్రము లేర్పరచుటకును, అగ్రహారములు మాన్యములు ఏర్పాటు చేయుటకును కారణమైనది. ఆ కాలములో నుండిన రాజులును శ్రీమంతులును తెలివి తక్కువ వారగుటచే చేసిన పనిగాదది. ఇప్పుడుగూడ అట్టి బ్రాహ్మణులు సన్యాసులుండినచో విమర్శన శీలురుగూడ అట్టివారి పాదములపై పడి తమ కున్నదానిలో నట్టి మహాత్ములకు గూడ ఇచ్చుటకు సంశయింపరు. ఇప్పుడుండు సామాన్య బ్రాహ్మణులను సామాన్య సంన్యాసులను చూచి పూర్వముండిన వారుగూడ నీలాటి వారుగా నుండియుందురని తలంచుటచే ప్రమాదము సంభవించుచున్నది.

మనుజులు భుజించెడు ఆహారాదులు మూడు విధములుగా జఠరాగ్నిచే జీర్ణము చేయబడును. (1) ఈశ్వరభావముతో భుజించునది ఈశ్వర జ్ఞానమగు జఠరాగ్నిచే జీర్ణమగుటచే నది ఈశ్వరుడు భుజించినట్లే యగును. కనుకనే అట్టివారు భుజించునప్పుడు నిశ్శబ్దముగానుండి భోజనము చేసెడు రహస్యము. (2) ప్రపంచ వ్యవహారములు మాటలాడుచు ప్రపంచజ్ఞానము గలిగి సామాన్యులు భుజించు నన్నము ప్రాకృతాగ్నిచే జీర్ణమగుటచే నది వ్యర్థముగా నిప్పులో వేసి కాల్చివేసినట్లుండును. దానివలన దాతల కేలాటి ప్రయోజనము గలుగదు. (3) ద్వేషముతో కలహముచేసికొని భుజించు నన్నము విషాగ్నిచే జీర్ణము చేయబడుటచే దాతకు మేలు గలుగక పోవుటయే గాక కీడు గలుగును. కావున నీ మూడు తత్త్వములనన్నదాతలు జ్ఞాపకముచేసికొనవలెను. లేక (1)సత్త్వగుణము గలవారికి పెట్టెడు అన్నము మంచి సుక్షేత్రములో పెట్టిన బీజమువలె గొప్ప పుణ్యము కలుగచేయును. ఇదికొంతవఱకు భగవత్కీర్తనలు, నామస్మరణలు చేసి భోజనము చేయువారి స్వభావముగానుండును. (2) మధ్యస్థితిలో నుండువారికి పెట్టెడు అన్నము సామాన్య భూమిలో చేసెడు వ్యవసాయమువలె నుండును. ఇది సామాన్య ఫలమునే యిచ్చును. వీరికి బ్రహ్మచర్యము, తీవ్ర బ్రహ్మవిచారము రెండు నుండవు. అయినను భోజనకాలములో వ్యర్థముగా మాట్లాడక భోజనము చేయుదురు. (3) ప్రపంచ విషయాసక్తి గలిగి యనవసర విషయములు మాట్లాడుచు భోజనము చేయువారికి పెట్టెడు అన్నము చవిటి భూమిలో చేసిన కృషివంటిది యగును. ఏమియు ఫలము గలుగక పోవుటయే గాక, వ్యయప్రయాసములు మిగులునట్లుండును. దాతలుయిచ్చుట నొకరహస్యమును గ్రహించుకొనవలెను. కేవలము శరీరము ననుసరించి బ్రాహ్మణులనిగాని, సంన్యాసులనిగాని తలంచక హృదయమునుగూడ చూడవలెను. కొన్ని స్థలములలో మఠాధిపతులగు సంన్యాసులయొక్కయు, అగ్రహారీకులగు బ్రాహ్మణులయొక్కయు భూములుగలవు. అచ్చటగూడ ఊసరక్షేత్రములో వ్యవసాయము చేసిన ఫలము గలుగదు. ఆత్మనైర్మల్యము కరుణయులేనిచో, వారు బ్రాహ్మణులైనను, సంన్యాసులైనను ప్రయోజనముండదు. కొన్ని స్థలములలో గృహస్థుల భూమిగలదు. అదిసారవంతమైనదైనచో దానిలో చేసిన వ్యవసాయము గొప్ప ఫలమును గలుగజేయును. అలాగున ఏ జాతిలో నుండువారుగాని యే యాశ్రమములో నుండువారుగాని వారు హృదయ నైర్మల్యము గలిగి కరుణార్ద్ర హృదయులైనచో వారికి పెట్టిన యన్నము విశేషఫలితమును గలుగ జేయును. ఇదే పాత్రను జూచి దానము చేయవలెనని చెప్పెడు రహస్యము.

శ్రీ భగవానువాచ:- శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్॥
ఛన్దాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్॥ 1

పద॥ ఊర్ధ్వమూలం - అధః - శాఖం - అశ్వత్థం - ప్రాహుః - అవ్యయం
ఛన్దాంసి - యస్య - పర్ణాని - యః - తం - వేద - సః - వేదవిత్.

ప్రతి॥ యస్య=దేనికి, ఛన్దాంసి = వేదములు, పర్ణాని =ఆకులుగా నున్నవో, అట్టి అశ్వత్థం= అశ్వత్థమనెడు పేరుగల సంసారవృక్షమును, ఊర్ధ్వమూలం= పై భాగమునందు వేరుకలదిగను, అధః శాఖం= క్రిందిభాగమునకొమ్మలు గలదిగను, అవ్యయం= నాశరహితమైనదిగను, ప్రాహుః = మహర్షులు చెప్పుదురు, లేక వేదములు చెప్పుచున్నవి. తం = అట్టియశ్వత్థవృక్ష మును, యః = ఎవడు, వేద = ఎఱుంగుచున్నాడో, సః = వాడే, వేద విత్ = వేదముల సారమెఱింగినవాడగుచున్నాడు.

తా॥ దేనికి వేదములు ఆకులుగా నున్నవో అట్టి యశ్వత్థ మనెడి సంసారవృక్షమును పైభాగమునందు వేర్లుగలదిగను, క్రింది భాగమున కొమ్మలు గలదిగను, నాశరహితమయినదిగను చెప్పుదురు. అట్టి యశ్వత్థవృక్షము నెవడెఱుంగుచున్నాడో వాడే వేదము నెఱిం గినవాడు.

వి॥ ఈ సంసారవృక్షము విచిత్రముగా నున్నది. వృక్షములన్నిటికిని మొదలు క్రిందగాను, శాఖలు పై భాగముననుండును ఇది యట్లుగాదు. దీనికి మొదలు పైభాగమున కొమ్మలు క్రిందిభాగమున నుంటున్నవి. ఈసత్యము నెఱింగినవాడే వేదసారము నెఱింగినవాడని ఋషులును, వేదములును చెప్పు చున్నవి. ఇదే మాయ యొక్క మహిమ. ఒక జలాశయముయొక్క తూర్పు భాగ మందుండి పశ్చిమభాగమునకు బోవుచుండు మనుష్యులను చూచినచో లేకవృక్షా దులను చూచినచో తల క్రిందికిగాను కాళ్ళుపైకిగాను గనుపించును. అలాగున మాయచే అనిత్యమైన యీ లోకము సత్యమైనదిగా నజ్ఞానదశలో తోచును. మాయయొక్క మహిమను నాలుగు విధములుగా పతంజలి మహర్షి యోగశాస్త్ర ములో వివరించెను.

మూ॥ అనిత్య అశుచి దుఃఖ అనాత్మసు నిత్య శుచి సుఖ ఆత్మ ఖ్యాతిర విద్యా-అనిత్యవస్తువులలో నిత్యబుద్ధియు, దేహాద్యశుచివస్తువులలోశుచిత్వబుద్ధియు

ఇంద్రియాది విషయములు దుఃఖజనకములైనను వాటియందు సుఖత్వబుద్ధియు అనాత్మయగు దేహమందు ఆత్మత్వబుద్ధియు దేనివలన గలుగుచుండునో దానికి అవిద్య లేక మాయ యని పేరు. రోగాదులచే నరుచిపొందిన నాలుకగలవాని కెంత మంచివస్తువైనను రుచిలేకనే యుండును. అనగా చేదుగా గనుపించును. త్రాచుపాముయొక్క విషమెక్కినవానికి చేదైన వేపాకు తీపిగానుండును. ఇది యెట్లు విపరీతముగా గలిగెనో మాయామోహముగల జీవునికిని ఇట్టి భ్రాంతియే గలుగును. మఱియు క్రొత్తప్రదేశములో వెళ్ళినవారికేలాగున తూర్పు పడమర గాను, పడమరతూర్పుగాను దిగ్భ్రమచే గోచరించునో. మాయాభ్రాంతుడగు జీవునికిని ఆలాగుననే యీ ప్రపంచము గోచరించును.

ఇచ్చట "ఊర్ధ్వమూలమధశ్శాఖం" అని సంసారవృక్షమును గుఱించి భగవంతుడు చెప్పినదే నిజము ఏలన, ఈ పంచభూతములయొక్క సృష్టి "ఆత్మనః అవ్యక్తః" అనగా పరమాత్మనుండి యవ్యక్తము లేక ప్రధానము లేక ప్రకృతియను మూలతత్త్వము, దానినుండి యాకాశము. దానినుండి వాయువు. వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము. జలమునుండి పృధివి, పృథివినుండి ఓషధులు, ఓషధుల నుండి అన్నము, అన్నమువలన శుక్లశోణితములు, వాటి వలన జీవులశరీరము లేర్పడినట్లు సాంఖ్యశాస్త్రము తెలుపుచున్నది. లేక యధో లోకము లేడింటికి, నూర్ధ్వలోకములలో నేడింటిలో నంతమున నుండు సత్య లోకమున చతుర్ముఖబ్రహ్మయుండి చతుర్దశభువనములను సృష్టించినట్లు చెప్ప బడుటచే "ఊర్ధ్వమూలమధశ్శాఖం" అని చెప్పినది, సరిగానున్నది. లేక యేడు లోకముల కతీతమగు పరమాత్మయే యీసృష్టికి కారణభూతమనిగూడ గ్రహించు కొనవచ్చును. మాయనశించినవారికి దీనియొక్క సత్యముగోచరించును. అట్టివారి కనిత్యవస్తు వనిత్యముగాను, అశుచివస్తువశుచిగాను, దుఃఖవస్తువు దుఃఖముగాను అనాత్మవస్తు వనాత్మగాను గోచరించును. అట్టి జ్ఞానము గలవారే యీ ప్రపంచ మునందు మిథ్యాత్మబుద్ధిగలిగి ప్రాపంచిక విషయములను విషతుల్యముగ నెంచి త్యాగులై శాశ్వతమైన బ్రహ్మజ్ఞానమును బొందుటకు ప్రయత్నింతురు.

శ్లో॥ అవ్యక్తమూలప్రభవ స్తస్యైవానుగ్రహోత్థితః ।
బుద్ధిస్కన్ధమయశ్చైవ ఇన్ద్రియా న్తరకోటరః ॥
మహాభూతప్రశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా ।
ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః ॥

ఆజీవ్యస్సర్వభూతానాం బ్రహ్మవృక్షస్సనాతనః ।
ఏతద్బ్రహ్మవనం చైవ బ్రహ్మా చరతి నిత్యశః ॥
ఏతచ్ఛిత్వా చ భిత్వాచ జ్ఞానేన పరమాసినా ।
తతశ్చాత్మరతిం ప్రాప్య యస్మాన్నావర్తతే పునః॥

తా॥ వ్యాకృతము, మూలప్రకృతి.మాయ యనెడు వేరునుండి పుట్టినాయి యొక్క వేరు గట్టిదగుటంజేసి క్రమముగా విస్తరించి పెరుగుచున్నదియును,బుద్ధి యనెడు బోదెగలదియును(లోకములో చెట్లకు మ్రానునుండి కొమ్మలు పెరుగు చున్నట్లు బుద్ధినుండి సమస్త వికారములును బుట్టునుగాన బుద్ధి బోదెగా చెప్పబడె నది.) శ్రోత్రేంద్రియాది రంధ్రములే తొర్రలుగా గలదియును పృథివ్యాదిపంచ భూతములే పెద్దకొమ్మలుగా గలదియును, శబ్దాదివిషయములే ఆకులుగాగల దియును ధర్మాధర్మము లనెడు పుష్పములు గలదియును సుఖదుఃఖములనెడు పండ్లుగలదియును, వృక్షము పక్షులకువలె సమస్తప్రాణులకు జీవనాధారమైనది యును, చిరకాలమునకు బ్రహ్మజ్ఞానము గలిగిన పిమ్మట బోవునది యగుటంబట్టి బహు పురాతనమైనదియునగు బ్రహ్మమేయధిష్ఠానముగా గనబడుసంసారమనెడు వృక్షమే పరమాత్మకు విహారస్థానమగు ఉపవనమైనది. అనగా బ్రహ్మమె యవిద్యవలన సంసారిత్వమును బొందినట్లుండుననుట, లేక బ్రహ్మవన మనగా సంసారవృక్షమునకు బ్రహ్మమే వనము వంటిది. వృక్షమునకు వనమువలె, సంసారమునకు పరబ్రహ్మమే యధిష్ఠానము. అనగా సంసారము పరబ్రహ్మ మందధ్యస్తమనుట, ఇట్టిసంసార వృక్షము నాత్మజ్ఞానరూపమగు కత్తిచేత ఛేదిం చినవాడుప్రతిబంధకములన్నియుతొలంగుటంజేసి కేవలాత్మనిష్ఠుడైమఱలసంసార బంధము కలుగుటకు వీలులేని కైవల్యపదమును బొందును. వృక్షముయొక్క ఆకులను దూసివేసినను మఱల కొంత కాలమునకు యథాప్రకారము చిగిరించును. చిన్న చిన్న కొమ్మలు నరికివేసినచో అది కొంతకాలమునకు చిగిర్చి మామూలు వృక్షమగును. పెద్దకొమ్మలను నరికివేసిన అది కొంతకాలమునకు చిగిర్చివృక్ష మగును. చెట్టుమొదలును నరికివేసిన యదిన్ని చిగిర్చి బహుకాలమునకు యథా ప్రకారము వృక్షమగును. కూకటివేరుతో తీసివేసిన అది మఱల నెప్పటికిని పుట్టదు. అలాగున సామాన్యమైన ధర్మకార్యములు చేయుచుండిన కొంతకాలను నకు స్వర్గలోకము కలుగును. మఱింత దృఢమైన హుతాదులు గలిగియుండిన (యజ్ఞాదులు సలిపిన) స్వర్గలోకముకన్న, సర్వశ్రేష్ఠలోకములను పొంది మఱల జన్మమునకు వచ్చును.మంచిభక్తి, నిష్ఠకలిగియుండినచో బహుకాలము ఉపాసనా

మూర్తుల లోకములలో ఉండి మఱల జన్మమునకు వచ్చును. యోగసమాధులచే నింద్రియ నిగ్రహపరుడై నిష్ఠ సలిపి, హిరణ్యగర్భుని స్థితి గలిగి మఱల బహుకాలమునకు జన్మమునకు వచ్చును. బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముచే మూలావిద్యయొక్క యున్మూల నాశము చేసిన వారికి ప్రకృతి (సంసారబీజము) నశించినందుచే మఱల జన్మము గలుగదు. ముముక్షువులందరును సామాన్యపుణ్యకర్మలచేతగాని, భక్తి చేతగాని వైరాగ్య ధ్యానములచేతగాని, యోగసమాధినిష్ఠలచేతగాని, తృప్తినొందక మూలప్రకృతి నశించువఱకు ప్రయత్నపరులై యుండవలెను. అట్టి యవిద్యానాశము, బ్రహ్మసాక్షాత్కారజ్ఞాన మొక్కదానిచే మాత్రమే గలుగును.

శ్లో॥ అధశ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః ।
అధశ్చ మూలాన్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే ॥ 2

పద॥ అధః - చ - ఊర్ధ్వం - ప్రసృతాః - తస్య - శాఖాః - గుణప్రవృద్ధాః - విషయప్రవాళాః - అధః - చ - మూలాని - అనుసంతతాని - కర్మానుబంధీని - మనుష్యలోకే.

ప్రతి॥ తస్య = ఆ సంసారవృక్షముయొక్క, శాఖాః = ఉపశాఖలు, గుణప్రవృద్ధాః = గుణములనెడు రసములచే వృద్ధినొందినవియు, విషయప్రవాళాః = విషయ వాంఛలనెడు చిగుళ్ళుగలవియునై, అధః = అధోముఖముగను, ఊర్ధ్వం చ = ఊర్ధ్వముఖముగను, ప్రసృతాః = వ్యాపించియున్నవి, మనుష్యలోకే = మనుష్యులయొక్క లోకమునందు,మూలాని= మూలములు, కర్మాను బంధీని = కర్మబద్ధములై, అధః చ = క్రిందికి, అనుసంతతాని = నాటుకొనియున్నవి.

తా॥ ఆ సంసార వృక్షముయొక్క, తమ తమ కర్మఫలానుగుణముగ జన్మించిన జీవకోట్లకు కొమ్మలు,త్రిగుణములనెడు రసములచే వృద్ధినొందినవియు, విషయవాంఛలనెడు చిగుళ్ళు గలవియునై యధోముఖముగను నూర్ధ్వముఖముగను వ్యాపించియున్నవి.మనుష్యలోకమునందాసంసారవృక్షముయొక్కమూలము,సన్నవేరులగు జీవాత్మలు,కర్మబద్ధములై క్రిందనే భూలోకమునందే నాటుకొనుచున్నవి.

వి॥ ఇచట సంసారవృక్షముయొక్క శాఖలు లేక కొమ్మలు అనగా సకల జీవకోట్లని గ్రహించవలెను. కొమ్మలు క్రిందికి పైకి వ్యాపించియున్నవని చెప్పబడి నది. అనగా జీవకోట్లలో కొందఱు పాపముచేసినవారలు క్రింద (భూలోకమున) పశుపక్ష్యాది జన్మలను బొందుచున్నారు. మఱి పుణ్యమును జేసినవారే పైలోక ములో దేవతాది జన్మల బొందుచున్నారు. ఈ విధముగా నీ సంసారవృక్షము యొక్క కొమ్మలు (జీవకోట్లు) ఊర్ధ్వాధోలోకములయందు క్రిందికి పైకి వ్యాపించి యున్నవని భావము. ఈ కొమ్మలు సత్త్వాదిగుణములచే వృద్ధిజెందుచున్నవి. చెట్లు కొమ్మలు నీటిచే వృద్ధిజెందినటుల ఈ సంసారవృక్షముయొక్క కొమ్మలైన జీవులు గుణములచే వృద్ధి పొందుచున్నారు. ఈ కొమ్మలకు చిగుళ్ళు శబ్దాది విష యములు.

మఱియు నీ సంసారవృక్షమునకు క్రుంగటివేరు ఈశ్వరుడు. ప్రక్కవేర్లు జీవులు లేక వారు జేయు కర్మలు. ఈ వేళ్ల క్రింద అనగా భూలోకములో లోతుగా పాతుకొనిపోయి యున్నవి. ఈ జీవులకు బంధమును గలుగజేయునవి యీ కర్మలే. ఊర్ధ్వాధోలోకములందు అనుభవింపగా మిగిలినది కర్మవాసన. ఇట్టి కర్మవాసనల చేతనే జీవులు భూలోకమున జన్మించి తద్వాసనా రూప ముగా కర్మలను జేయుచున్నారు. కాన మనుష్యలోకమున ఈ కర్మలను వేళ్లు లోతుగా పాతుకుపోయినవని చెప్పబడినది. 'అనుసంతతాని' అనగా ఒకదాని వెనుక మఱియొకటి వరుసగా వ్యాపించి యున్నవని భావము 'కర్మానుబన్ధీని' అనగా కర్మల ననుసరించి ఫలము నిచ్చునవని తాత్పర్యము. పుణ్యాపాప కర్మా నుష్ఠానముచే ఊర్ధ్వాధోలోకములకు బోయి అక్కడ కర్మఫలము ననుభవించి తిరిగి కర్మవాసనలచే కర్మానుష్ఠానమునకు భూలోకముననే సర్వజీవులు జన్మించు చుందురని దెలియునది. కాన ఈ సంసార వృక్షము యొక్క వేళ్లు భూలోకములో బాగా దృఢముగా నాటుకొని యున్నవనియు, కొమ్మలు క్రిందికి పైకి వ్యాపించి యున్నవనియు తెలుప బడినది. (వి. స్వా.)

శ్లో॥ న రూపమస్యేహ తథోపలభ్యతే
నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।
అశ్వత్థమేనం సువిరూఢమూల -
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥ 3

పద॥ న - రూపం - అస్య - ఇహ - తథా - ఉపలభ్యతే - న - అన్తః

న - చ - ఆదిః - న- చ - సంప్రతిష్ఠా - అశ్వత్థం-ఏనం - సువి-
రూఢమూలం - అసంగశస్త్రేణ - దృఢేన - ఛిత్వా,

ప్రతి॥ ఇహ=ఈ లోకమునందు, అస్య=ఈ సంసారవృక్షముయొక్క, రూపం = రూపము, న ఉపలభ్యతే = తెలియబడదు, తథా = ఆలాగున, అన్తః= అంతము, న=తెలియబడదు, ఆదిః చ =మొదలును, న=తెలియబడదు, సంప్రతిష్ఠా చ = స్థితియును, న = తెలియబడదు, సువిరూఢమూలం = లెస్సగా బారిన వేర్లుగల, ఏనం అశ్వత్థం = ఈ సంసారమనెడి అశ్వత్థ వృక్షమును, దృఢేన=దృఢమైన, అసంగశస్త్రేణ = వైరాగ్యమనెడి కత్తిచేత. ఛిత్వా = ఛేదించి (బ్రహ్మపదము నన్వేషింపవలెను.)

తా॥ ఈ లోకమునందు నీ సంసార వృక్షముయొక్కరూపము తెలియబడదు. ఆలాగున పైన వివరింపబడిన విధముగా నంతము తెలియబడదు, మొదలును తెలియబడదు. స్థితియును తెలియబడదు· లెస్సగా బారిన వేరులుగల యీ సంసారమనెడు అశ్వత్థవృక్షమును దృఢమైన (అనగా చలింపని) అసంగము లేక వైరాగ్యమనెడు కత్తి చేత ఛేదించి పునరావృత్తి రహితమగు బ్రహ్మపదము నన్వేషింప వలయును.

వి॥ పైన బ్రహ్మలోకము వఱకు (ఊర్ధ్వలోకము వఱకును) క్రింది మనుష్య స్థావరముల వఱకును వ్యాపించియుండు అజ్ఞాన వృక్షము చిరకాలముగా నుండినదగుటచే లెస్సగా వేరులు బారినదగు వృక్షము మంచిఉక్కుతో చేయబడి సాన బెట్టబడిన గొడ్డలిచేత మాత్రమే నరికిన తెగునుగాని సామాన్యమగు కత్తులచే ఛేదించిన నెట్లు తెగునదికాదో, అట్లే దృఢమైన వైరాగ్యమను గొడ్డలిచేత నరికిన మాత్రమే తెగును, స్వల్పమైన వైరాగ్యముచే నరుకజూచిన, మంచిచేవగల యేపి, చందనచెట్టును తగరపు కత్తితో నరుకచూచినట్లుండును అవి తెగునా? తెగనేతెగవు. కనుకనే ఖడ్గముయొక్క లక్షణము 'అసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా' అని తెలుపడమైనది, మొదట అసంగమనగా దేహసంబంధములనుండి విడుదల పొందుట యగును, దీనితో తృప్తినొందక దేహేంద్రియ బుద్ధు లన్నిటికిని సాక్షియగు అనగా విలక్షణమగు ఆత్మస్థితిలో నిలుకడ గలిగి యుండుట రెండవది. ఇదే సరియైన నిస్సంగత్వము. బాహ్యత్యాగము, అంతర త్యాగము అను రెండు త్యాగములుండవలెను. అంతర త్యాగమునకు బాహ్య

త్యాగము చేయబడిన దానిలో మరల సంకల్పమే కలుగకుండుట అని యొక యర్థముకూడ గలదు. బాహ్యత్యాగముచేసి యంతస్త్యాగము, సంకల్పత్యాగము గలుగనిచో, అరటిచెట్టు, చామచెట్టు, పెండలము మొదలగువానిని మొదలుతో నరికివేసినట్లుండును. ప్రస్తుతమేమియు లేనట్లు తోచినను వాటియొక్క గడ్డలు అనగా మూలములు భూమియందుండుటచేత రెండు మూడు రోజులు పోయిన మఱల అంకురించును. అవి కొద్దిరోజులకు మామూలుగా వృక్షములగును. ఆలాగున నుండుటచేతనే కొందరు ముందుగా వైరాగ్యము గలిగి సర్వము త్యాగము చేసినను హృదయములో సంకల్ప త్యాగము చేయనందుచే కొంత కాలమునకు సంసారములో చేరుటకుగాని, సంసార కార్యముల జేయుటకుగాని కారణము. కావున సంకల్పమనెడి దుంపను తీసివేసిన మఱల ఏ కాలమందును సంసారవృక్షము పుట్టదు, కావున బాహ్యత్యాగముచే తృప్తిపొందక యంతరంగ త్యాగము గలుగువరకు తన పని పూర్తియైనదని తలంచి సంతసింపకూడదు.

శ్లో॥ తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తంతి భూయః ।
తమేవ చాఽద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥ 4

పద॥ తతః - పదం - తత్ - పరిమార్గితవ్యం - యస్మిన్ - గతాః - న - నివర్తంతి - భూయః - తం - ఏవ - చ - ఆద్యం - పురుషం - ప్రపద్యే- యతః - ప్రవృత్తిః - ప్రసృతా - పురాణీ

ప్రతి॥ తతః = అట్లు ఛేదించినపిమ్మట. యస్మిన్ = ఏ స్థానమందు, గతాః = చేరిన వారు, భూయః = మఱల. న నివర్తంతి = తిరిగిరారో, తత్ పదం = ఆస్థానమును, పరిమార్గితవ్యం= వెదుకవలెను, చ = మఱియు, యతః = ఎవనివలన, పురాణీ = అనాదియైన, ప్రవృత్తిః = సంసార ప్రవృత్తి, ప్రసృతా = విస్తరిల్లెనో, తం = అట్టి, ఆద్యం పురుషం ఏవ = ఆదిపురుషునే, ప్రపద్యే = ప్రపత్తిని చేసెదను. అనగా శరణు బొందెదనను భావముతో వెదకవలెను.

తా॥ అట్లు అసంగ శస్త్రముతో సంసారవృక్షమును ఛేదించిన పిమ్మట ఏ స్థానమును చేరినవారు మఱల తిరిగిరారో, ఆ స్థానము వెదుక దగినది. మఱియు నెవనివలన అనాదియైన సంసార

ప్రవృత్తి విస్తరిల్లెనో, అట్టి యాదిపురుషునే శరణు బొందెదనను ప్రపత్తి భావముతో పునరావృత్తి రహితమగు పరమపదమును అన్వేషింపవలయును.

వి॥ సంసార సంబంధ త్యాగమొనర్చిన తరువాత పరమాత్మను గురించి చింతన చేయవలయునని జెప్పుటచే సంసారవిషయనివృత్తి గలుగనిచో ఆత్మ శుద్ధియు, మనోనిశ్చలత్వమును గలుగదు. ఇవి రెండును గలుగనిచో ఆత్మ సాక్షాత్కార జ్ఞానముకాని, భగవత్ ప్రవృత్తి లేక ప్రాప్తిగాని, కలుగదని చెప్పినట్లైనది.

శ్లో॥ నిర్మానమోహా జితసఙ్గ దోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వన్ద్వైర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్ ॥ 5

పద॥ నిర్మానమోహాః - జితసఙ్గదోషాః - అధ్యాత్మనిత్యాః - వినివృత్తకామాః, ద్వన్ద్వైః - విముక్తాః - సుఖదుఃఖసంజ్ఞైః - గచ్ఛన్తి - అమూఢాః - పదం - అవ్యయం - తత్.

ప్రతి॥ నిర్మానమోహాః = అభిమానము లేనివారును, జితసఙ్గదోషాః =ప్రపంచ సంబంధములగు సమస్త ఆసక్తిదోషములను విడివినవారును, అధ్యాత్మ నిత్యాః = సదా ఆత్మను చింతన చేయువారును (భగవద్ధ్యానము చేయు వారును), వినివృత్త కామాః = కోరికలన్నిటినుండి నివృత్తిగలవారును, సుఖదుఃఖసంజ్ఞైః = సుఖదుఃఖకారణములగు. ద్వన్ద్వైః = శీతోష్ణాదిద్వం ద్వములచేత, విముక్తాః = లెస్సగా విడువబడినవారునైన, అమూఢాః= అజ్ఞానరహితులగు జ్ఞానులు, అవ్యయం = నాశములేని, తత్పదం = ఆ బ్రహ్మపదమును లేక భగవత్ స్థానమును, గచ్ఛన్తి=పొందుచున్నారు.

తా॥ అభిమానము లేనివారును, దారా పుత్ర, బంధు, మిత్ర, ధనధాన్యాదుల యందలి యాసక్తిని విడిచినవారును, సదా ఆత్మానుసంధానమును లేక భగవద్ధ్యానమును చేయువారును, కోరి కలనన్నిటినీ విడిచినవారును, సుఖదుఃఖ కారణములగు శీతోష్ణాది ద్వంద్వములచేత విడువబడినవారునైన అజ్ఞానరహితులు (జ్ఞానులు) నాశములేని యా మోక్షపదవిని పొందుచున్నారు,

శ్లో॥ న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః ।
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ॥ 6

పద॥ న - తత్ - భాసయతే - సూర్యః - న - శశాంకః - న - పావకః.
యత్ - గత్వా - న - నివర్తంతే - తత్, - ధామ - పరమం - మమ.

ప్రతి॥ తత్ = అబ్రహ్మపదమును, సూర్యః = సూర్యుడు, న భాసయతే = ప్రకాశింప చేయజాలడు, శశాంకః = చంద్రుడు, న = ప్రకాశింపచేయజాలడు పావకః = అగ్ని, న = ప్రకాశింపజేయజాలదు, యత్ = ఏ పరమాత్మ స్థానమును (మోక్షమును) గత్వా = పొంది, న నివర్తంతే = జన్మమునకు రారో, తత్ = అది, మమ = నాయొక్క. పరమం ధామ = పరమపదము.

తా॥ అ బ్రహ్మపదమును సూర్యుడు ప్రకాశింపజేయజాలడు. చంద్రుడు ప్రకాశింపజేయజాలడు. అగ్నియు ప్రకాశింపజేయజాలడు. ఏ (మోక్ష)స్థానమును పొంది తిరిగి జన్మకురారో అదియే నాయొక్క పరమపదము.

వి॥ సూర్యచంద్రాగ్నుల ప్రకాశమువలనపరమాత్మ ప్రకాశించువాడుకాడు. సూర్య చంద్రాగ్నులు పరమాత్మయొక్క ప్రకాశముచేతనే ప్రకాశించుచున్నవి. ఈ విషయమై కఠోపనిషత్తు ముండకోపనిషత్తులలో చెప్పబడినది చూడుడు.

శ్లో॥ న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం నేమావిద్యుతో భాంతి
కుతోఽయమగ్నిః ।
తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి ॥

తా॥ పరమాత్మను సూర్యుడుగాని, చంద్రుడుగాని, నక్షత్రములుగాని, ప్రకాశింపజేయజాలవు. మెరుపులును ప్రకాశింపజేయజాలవు. అట్లుండగా నీయగ్ని యెట్లు ప్రకాశింపజేయును? పరబ్రహ్మ స్వయముగా ప్రకాశించును. పైజెప్పిన సూర్యాగ్నులను సయితము ప్రకాశింప జేయుచుండునని తాత్పర్యము.

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః ।
మనష్షష్ఠాణీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ 7

పద॥ మమ - ఏవ - అంశః - జీవలోకే - జీవభూతః - సనాతనః,
మనష్షష్ఠాణి - ఇంద్రియాణి - ప్రకృతిస్థాని - కర్షతి.

ప్రతి॥ సనాతనః = అనాదియైన, మమ అంశః ఏవ = నాయంశమే, జీవలోకే =

జీవజాలమందు,జీవభూతః = జీవాత్మయై, ప్రకృతిస్థాని = ప్రకృతిసంబంధములగు, మనష్షష్ఠాణి = మనస్సు ఆరవదిగాగల, ఇంద్రియాణి= ఇంద్రియములను, కర్షతి = ఆకర్షించుచున్నది.

తా॥ అనాదియైన జంతుజాలమునందు నా యంశమే జీవాత్మయై ప్రకృతిసంబంధములగు జ్ఞానేంద్రియములైదును, మనస్సునుగూడిన ఆఱింద్రియముల నాకర్షించుచున్నది.

వి॥ వర్ణాశ్రమములే సనాతనధర్మమని ప్రచారముచేయువారు శ్రీ భగవంతుడుపదేశించిన 'సనాతనుడనగు నా యంశస్వరూపుడగు జీవుడ'ని చెప్పిన వాక్యము నాలోచింపక పోవుటచేతనే భారతదేశమున కింతటి పతనావస్థ దురదృష్టము గలిగినది.

శ్లో॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్ ॥ 8

పద॥ శరీరం - యత్ - అవాప్నోతి - యత్ - చ - అపి - ఉత్క్రామతి - ఈశ్వరః - గృహీత్వా - ఏతాని - సంయాతి - వాయుః - గన్ధాన్ - ఇవ - ఆశయాత్,

ప్రతి॥ ఈశ్వరః = ఇంద్రియముల కధిపతియగు జీవుడు, శరీరం = ఏదేని యొక దేహమును, యత్ అవాప్నోతి = ఎప్పుడు పొందుచున్నాడో అప్పుడును, అపి చ = మఱియు, యత్ ఉత్క్రామతి = ఆ దేహమునుండి యెప్పుడు బయలు వెడలుచున్నాడో అప్పుడును, ఆశయాత్ = పుష్పాదులనుండి, వాయుః = వాయువు, గంధాన్ ఇవ = పరిమళమును వలె, ఏతాని = ఈ షడింద్రియములను, గృహీత్వా = గ్రహించుకొని. సంయాతి = పోవుచున్నాడు.

తా॥ వాయువు, పుష్పములు మొదలగు వాసనగల వస్తువులనుండి బయలు వెడలునపుడు పుష్పాదుల నచ్చటనే విడిచి,యందలి పరిమళములుగల పరమాణువుల నెట్లు తీసికొని పోవుచున్నదో, అట్లే దేహేంద్రియాది సముదాయములకు ప్రభువగు జీవుడు కొంతకాలము ఒక దేహమునందుండి కర్మవశమున నా దేహమును వదలి మఱియొక శరీరమును పొందునపుడు శరీరమునచ్చటనే విడిచినను దాని

యందుండు మనస్సు మొదలగు ఆరింద్రియములను తీసికొనిపోవు చున్నాడు.

వి॥ అంతరింద్రియములు నాలుగున్నప్పటికిని సంగ్రహముగా చెప్పునప్పు డొక్క మనస్సునుమాత్రము చెప్పుటగలదు. పుష్పములు, అగరువత్తిమొదలైన వాటిలోగల సుగంధపరమాణువులు మననేత్రమునకు గోచరము గాకపోయినను వాయువులో కలిసి నాసికారంధ్రమునకు వచ్చునప్పుడే యా సుగంధవాసన (పరిమళము) గోచరించుచున్నది. ఈ సుగంధపరమాణువులే మనకు కనబడనప్పుడు ఇక జీవుని సూక్ష్మసంస్కారములు వాసనలు మనదృష్టికెట్లుగోచరించును? అంత్యకాలమున నేసంస్కారమనోవాసనలు గలిగియుండునో, దానికి అనుగుణమగు లోకమును పొంది తరువాత కర్మశేషము ననుభవించుటకు భూలోకములోజీవుడు జన్మమెత్తును. నవధాన్యములనుండియొక్క పిడికెడు తీసికొని భూమిలోచల్లినచో వానియందేయేరకము విత్తనములుండునో, అవిమొలకెత్తి ఫలమిచ్చునట్లుదేహాంతమునగల స్వభావము ననుసరించిమరుజన్మము వచ్చును కావున ప్రకృతిగుణముల రహిత మొనర్చుకొని త్వరలో దైవగుణముల నాశ్రయించుడు. ఏ నిముషములో దేహము వదలిపోవునో తెలియునదికాదు. గుణములు నశించినవాడు జీవన్ముక్తిని పొందగలడు.

శ్లో॥ శ్రోత్రం చక్షుస్స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥ 9

పద॥ శ్రోత్రం - చక్షుః - స్పర్శనం - చ - రసనం - ఘ్రాణం - ఏవ - చ, అధిష్ఠాయ - మనః - చ - అయం - విషయాన్ - ఉపసేవతే,

ప్రతి॥ అయం = ఈ జీవుడు, శ్రోత్రం = చెవిని, చక్షుః = నేత్రమును, స్పర్శనం చ = చర్మమును, రసనం = నాలుకను, ఘ్రాణం ఏవ చ = ముక్కును, మనః చ = మనస్సును, అధిష్ఠాయ = ఆశ్రయించి, విషయాన్ = ఇంద్రియ విషయములను, ఉపసేవతే = అనుభవించుచున్నాడు.

తా॥ జీవుడు, చెవి, కన్ను, చర్మము, నాలుక, నాసిక, మనస్సునునట్టి యారింద్రియములను పొంది శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులైన విషయముల ననుభవించుచున్నాడు.

శ్లో॥ ఉత్క్రామన్తం స్థితం వాఽపి భుంజానం వా గుణాన్వితమ్ ।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥ 10

పద॥ ఉత్క్రామన్తం - స్థితం - వా - అపి - భుంజానం - వా - గుణాన్వితం,
విమూఢాః - న - అనుపశ్యన్తి - పశ్యన్తి-జ్ఞానచక్షుషః.

ప్రతి॥ ఉత్క్రామన్తం = దేహమునుండి బయలుదేరువాడును, స్థితం వా అపి = దేహమునందుండు వాడును, భుంజానం వా = విషయములననుభవించు వాడును, గుణాన్వితం = గుణములతో గూడుకొనినవాడునైన జీవుని, విమూఢాః = ఆత్మజ్ఞానము లేనివారు, న అనుపశ్యంతి = చూచుటలేదు, జ్ఞానచక్షుషః = జ్ఞానదృష్టిగలవారు, పశ్యన్తి = చూచుచున్నారు.

తా॥ దేహమునుండి బయలు వెడలు నపుడును, దేహమునం దుండునపుడును జీవుని ఆత్మజ్ఞానము లేనివారు చూచుట లేదు. జ్ఞానదృష్టిగలవారు చూచుచున్నారు. జ్ఞానులకు దప్ప జీవుడు ఏ అవస్థలోను ఇతరులకు కనబడడని భావము.

వి॥ బహిర్దృష్టిగలవారాత్మను చూడజాలరు. అంతర్దృష్టి గలవారుజూడ గలరు అద్దమును దృశ్యము వైపు త్రిప్పిన తమను జూడజాలరు. తమవైపు నకు త్రిప్పినచో తమను స్పష్టముగా జూడగలుగుదురు. ప్రపంచవాసనాభారము గలిగియుండు వఱకు మనస్సు బహిర్దృష్టి గలిగియుండును. విషయవాసనా క్షయము గలుగునప్పుడు మనస్సు అంతర్ముఖముగా తిరుగును. ఈ స్థితినే ఊర్ధ్వ కుండలిని యనియు. అధఃకుండలిని యనియు, కుండలిని ఉద్బోధమనియు, ఆవరణ రహితమనియు తెలియవలెను.

శ్లో॥ యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః॥ 11

పద॥ యతన్తః - యోగినః - చ - ఏనం - పశ్యన్తి - ఆత్మని - అవస్థితం,
యతన్తః - అపి - అకృతాత్మానః - న - ఏనం - పశ్యన్తి - అచేతసః,

ప్రతి॥ యతన్తః = జ్ఞానసిద్ధికొఱకు యత్నించుచున్న, యోగినశ్చ = ధ్యానయోగానుష్ఠాన పరులును, ఆత్మని = తనయందు, అవస్థితం = ఉన్నట్టి, ఏనం = ఈ యాత్మను, పశ్యన్తి = చూచుచున్నారు. అకృతాత్మానః = ఆత్మసంస్కారములేని, అచేతసః = అంతఃకరణశుద్ధిలేనివారు, యతన్తః అపి = మోక్షాపేక్షతో ప్రయత్నము చేయువారైనను, ఏవం = ఈ ఆత్మను, న పశ్యన్తి = చూడజాలరు.

తా॥ జ్ఞానసిద్ధికొఱకు యత్నించుచున్న ధ్యానయోగానుష్ఠాన పరులును, తనయందున్నట్టి యాత్మను చూచుచున్నారు. ఆత్మసంస్కారములేని మలినబుద్ధిగలవారు యత్నింపుచున్నవారయ్యు నీ యాత్మను జూడజాలరు.

వి॥ ఆత్మశుద్ధిగలవారి కాత్మదర్శనము గలుగును. అట్లాత్మశుద్ధి కొఱకు ప్రయత్నము చేయక శాస్త్ర విచారణ మాత్రము చేసికొని, నిర్విషయత్వమును పొందినవారు యత్నించినప్పటికిని, ఆత్మసాక్షాత్కారజ్ఞానము గలుగదు, లేక వేషములు, పేర్లు మార్చుకొని సంచరించువారును వేదాంతము మాత్రము చదివి ఇంద్రియ నిగ్రహము లేనివారును బ్రహ్మమును దెలిసికొన జాలరు.

శ్లో॥ హంసశ్శుక్లో బకశ్శుక్లః కోభేదో బకహంసయోః ।
నీరక్షీరవిభాగే తు హంసో హంసో బకో బకః ॥

తా॥ రాజహంసయును, తెల్లకొంగయును చూచునపుడొకే విధముగా నుండును. కాని పాలును, నీరును కలిపిన హంసనీటిని విడిచి పాలను త్రాగును, కొంగయో పాలును నీరును కలిసినదానినే త్రాగును. అలాగున నిజమైన యాత్మ జ్ఞానియైనచో విషయముల మధ్యమందుండినను నిర్విషయస్థితిలోనే యుండును. అట్లు కానివాడు సాధువేషము ధరించినను విషయమునుండి ముక్తి బొంద జాలడు. లేక మంచి భూమిలో కృషిచేయువానికి అదే విత్తనమును చవిటి భూమిలో చల్లి వ్యవసాయము చేయువానికిని ప్రయత్నము సమానముగానుండినను, ఫలితములో నెట్లు మార్పు గలదో ఇదియు నటువంటిదే.

శ్లో॥ యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకమ్ ॥ 12

పద॥ యత్ - ఆదిత్యగతం - తేజః - జగత్ - భాసయతే - అఖిలం,
యత్ - చన్ద్రమసి - యత్ - చ - అగ్నౌ - తత్- తేజః- విద్ధి - మామకమ్.

ప్రతి॥ ఆదిత్యగతం = సూర్యునియందుండునట్టి,యత్ తేజః = ఏతేజస్సు,అఖిలం జగత్ = సమస్తప్రపంచమును, భాసయతే = ప్రకాశింపజేయుచున్నదో, యత్ (తేజః) = ఏతేజస్సు. చన్ద్రమసి = చంద్రునియందును, యత్ = ఏతేజస్సు, అగ్నౌ చ - అగ్నియందున్నదో, తత్ = దానిని, మామకం = నాదిగా, విద్ధి = ఎఱుంగుము.

తా॥ సూర్యునియందుండునట్టి యే వెలుగు, సమస్త ప్రపంచ మును ప్రకాశింప జేయుచున్నదో, ఏ తేజస్సు, చంద్రుని యందును, అగ్నియందు నుంటున్నదో, దానిని నాదిగా నెఱుంగుము.

శ్లో॥ గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।
పుష్ణామి చౌషధీస్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః ॥ 13

పద॥ గాం - ఆవిశ్య - చ - భూతాని - ధారయామి - అహం - ఓజసా,
పుష్ణామి - చ - ఓషధీః - సర్వాః - సోమః - భూత్వా - రసాత్మకః,

ప్రతి॥ అహం = నేను, గాం ఆవిశ్య = భూమిని ప్రవేశించి, ఓజసా = బలముచేత, భూతాని = సమస్తభూతములను, ధారయామి చ = ధరించుచున్నాను, రసాత్మకః = రసస్వరూపుడగు, సోమః భూత్వా - చంద్రుడనై, సర్వాః ఓషధీః = సమస్త సస్యములను, పుష్ణామి చ = వృద్ధిపొందించుచున్నాను.

తా॥ నేను భూమిని ప్రవేశించి బలముచేత సమస్త భూతములను ధరించుచున్నాను. రసస్వరూపుడగు చంద్రుడనై సమస్తసస్యములను వృద్ధినొందించుచున్నాను.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥ 14

పద॥ అహం — వైశ్వానరః - భూత్వా - ప్రాణినాం - దేహం - ఆశ్రితః
ప్రాణాపానసమాయుక్తః - పచామి - అన్నం — చతుర్విధమ్.

ప్రతి॥ అహం = నేను, వైశ్వానరః భూత్వా = జఠరాగ్నినై, ప్రాణినాం = ప్రాణుల యొక్క, దేహం ఆశ్రితః = శరీరమును ఆశ్రయించినవాడనై, ప్రాణాపాన సమాయుక్తః = ప్రాణాపానవాయువులతోగూడి, చతుర్విధం = నాల్గు విధములైన, అన్నం = ఆహారమును, పచామి = జీర్ణము చేయుచున్నాను.

తా॥ నేను వైశ్వానరుడను పేరుగల జఠరాగ్నినై సకల ప్రాణుల శరీరములయందును ప్రవేశించి, జఠరాగ్నిని ప్రజ్వలింప జేయు ప్రాణాపానములను వాయువులతోజేరి, భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యమను పేర్లుగల నాల్గు విధములైన యాహారమును పచనము చేయుచున్నాను

వి॥ ఈ వైశ్వానరోపాసనమును గుఱించి యీ యధ్యాయారంభముననే చెప్పబడియున్నది. చతుర్విధాన్నము, (1) భక్ష్యమనగా దంతములచే కొరికి తినెడు గారెలు మొదలగునవి. (2) భోజ్యమనగా దంతములతో నమలక నాలుకతో మాత్రము భుజించెడు క్షీరాన్నాదులు (3) లేహ్యమనగా నాలుకచే చప్పరించి తినెడు పచ్చడి మొదలగునవి. (4) చోష్యమనగా నాలుకచే చప్పరించకనే భుజించెడు క్షీరము మొదలైనవి. దీనికి పానమని గూడ పేరుగలదు. ఏదేని భుజించునపుడు, శరీరమును క్షేత్రమునుగాను, ఆత్మను ఈశ్వరునిగాను భావన చేసి పరమేశ్వరునకు నైవేద్యము చేయునట్లు భావనచేయవలయును. అట్లయిన కొంత కాలమునకు జఠరాగ్నిస్వరూపుడై భుజించువాడు సర్వేశ్వరుడనుభావము గలుగును అట్టిభావముతో భుజించువానికి పెట్టిన యన్నముచే సర్వేశ్వరునికి పెట్టినంత పుణ్యము గలుగును.

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనం చ ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ॥ 15

పద॥ సర్వస్య - చ - అహం-హృది - సన్నివిష్టః - మత్తః - స్మృతిః - జ్ఞానం-అపోహనం - చ - వేదైః - చ - సర్వైః - అహం - ఏవ - వేద్యః - వేదాన్తకృత్ - వేదవిత్ - ఏవ - చ - అహమ్.

ప్రతి॥ అహం = నేను, సర్వస్య చ = సమస్త ప్రాణుల, హృది సన్నివిష్టః = హృదయమందున్నవాడను, స్మృతిః = స్మృతియును, జ్ఞానం = జ్ఞానమును అపోహనం చ = మరుపును, మత్తః ఏవ = నావలననేగలుగుచున్నవి, సర్వైః వేదైః = సమస్తవేదములచేత, వేద్యః చ = ఎఱుగబడదగిన వాడను. అహం ఏవ = నేనే, వేదాన్తకృత్ = వేదాంతమును (జ్ఞానమార్గ పరం పరను) చేసినవాడను, వేదవిత్ చ = వేదముల నెఱింగినవాడను, అహం ఏవ = నేనే.

తా॥ నేను సకలప్రాణుల హృదయమందున్న వాడను, స్మృతియును, జ్ఞానమును, మరుపును నావలననే కలుగుచున్నవి. సమస్త వేదములచేత నెఱుగబడదగినవాడను నేనే. వేదాంతమును చేసిన వాడను, వేదముల నెఱిగినవాడను నేనే.

వి॥ సత్త్వగుణముగలవారి కాత్మస్వరూపస్మృతియు రజోగుణముగల వారికి ప్రాపంచికజ్ఞానము, తమోగుణముగలిగినవారికిమరుపును గలుగుచుండును, బ్రహ్మ విద్యయగు వేదాంతము పరమాత్మయగు శ్రీమన్నారాయణునివలననే, బ్రహ్మదేవ వసిష్ఠ శక్తి ప్రభృతి ఋషులద్వారా పారంపర్యముగా నేర్పడినది. కావుననే "ఓం నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తిం చ తత్పుత్రపరాశరం చ, వ్యాసం శుకం గౌడపదం మహాన్తం గోవింద యోగీంద్ర మథాస్య శిష్యం శ్రీశంకరాచార్య మథాస్య" ... ... ... అని చెప్పుటకు కారణమైనది.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ 16

పద॥ ద్వౌ - ఇమౌ - పురుషౌ - లోకే - క్షరః - చ - అక్షరః - ఏవ - చ, క్షరః - సర్వాణి - భూతాని - కూటస్థః - అక్షరః -ఉచ్యతే.

ప్రతి॥ లోకే = ప్రపంచమునందు, క్షరః చ = క్షరుడనియు, అక్షరః ఏవ చ = అక్షరుడనియు, ఇమౌ = ఈ పేర్లుగల, ద్వౌ పురుషౌ = ఇద్దరుపురుషులు గలరు. సర్వాణి భూతాని = సమస్తభూతములు, క్షరః = క్షరుడనియు, కూటస్థః = కూటస్థుడగుజీవుడు, లేక భగవన్మాయాశక్తి, అక్షరః = అక్షరు డనియు, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ ప్రపంచమునందు క్షరుడనియు, అక్షరుడనియు పేర్లుగల యిద్దరు పురుషులు గలరు. బ్రహ్మాదిస్థావరాంతములగు శరీరముల సముదాయము "క్షరము" అనియు (నశించునదనియు,) కూటస్థుడు చతుర్వింశతి తత్త్వముల కతీతుడగు జీవుడు లేక భగవన్మాయాశక్తి అక్షరుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ 17

పద॥ ఉత్తమః - పురుషః - తు - అన్యః - పరమాత్మా - ఇతి - ఉదాహృతః, యః - లోకత్రయం—ఆవిశ్య - బిభర్తి - అవ్యయః - ఈశ్వరః.

ప్రతి॥ అవ్యయః = నాశరహితుడైన, యః ఈశ్వరః = ఏయీశ్వరుడు, లోకత్రయం=ముల్లోకములను, ఆవిశ్య = ప్రవేశించి, బిభర్తి = భరించుచున్నాడో అట్టి, అన్యః =అ ఉభయులకంటె వేరగు, పురుషః తు= పురుషుడన్ననో,

ఉత్తమః = ఆ యుభయులకంటె శ్రేష్ఠుడు, వాడే, పరమాత్మా ఇతి = పర మాత్మయని, ఉదాహృతః = చెప్పబడుచున్నాడు.

తా॥ నాశరహితుడైన యే యీశ్వరుడు ముల్లోకములను ప్రవే శించి భరించుచున్నాడో, అట్టి, క్షరాక్షరులకంటె వేరైన పురుషు డన్ననో, ఆ యుభయులకంటె శ్రేష్ఠుడు. వాడే పరమాత్మయని చెప్పబడుచున్నాడు.

వి॥ దీని యందు జీవజడముల కన్యుడు శ్రేష్ఠుడైన యీశ్వరుడు గలడని చెప్పుటచే ఇదివరలో జీవుడే యీశ్వరమయుడుగా నుంటున్నాడని చెప్పినదానికి విరుద్ధముగా తలంచనక్కరలేదు. జడములైన దేహాదులకన్నను,బద్ధుడైన జీవుని కన్నను ముక్తుడగు ఆత్మను గుఱించి శ్రేష్ఠుడని తెలుపడమైనది. త్రిగుణములతో గూడియుండినపుడు జీవుడనియు,మూడుగుణములు లేనప్పుడు 'ఈశ్వరత్వమును' పొందుననియు, చెప్పిన శాస్త్రమునకు సరిపోయినది.లేక ఉపాసనాభావము ననుస రించి జడమునకును, జీవునకును, అంతర్యామియై యుండు పరమేశ్వరుడు ఈ రెంటి కన్న శ్రేష్ఠుడని చెప్పబడినదనిగూడ గ్రహించుకొనవచ్చును, కావున బ్రహ్మభావమున కేమియు విరోధములేదు.

శ్లో॥ యస్మాత్క్షరమతీతోఽహమక్షరాదపిచోత్తమః।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥ 18

పద॥ యస్మాత్ - క్షరం - అతీతః - అహం - అక్షరాత్ - అపి - చ - ఉత్తమః, అతః - అస్మి - లోకే - వేదే - చ - ప్రథితః - పురుషోత్తమః.

ప్రతి॥ యస్మాత్ = ఎందువలన. క్షరం = క్షరుడను పేరుగల చతుర్వింశతి తత్త్వములను, అతీతః = అతిక్రమించినవాడను, అక్షరాత్ అపి = అక్ష రుడను పేరుగల జీవునికంటెను, ఉత్తమః చ = శ్రేష్ఠుడ నయితినో. అతః = ఈ కారణమువలన, అహం = నేను, లోకే = లోకమునం దును, వేదే చ = వేదమునందును, పురుషోత్తమః = పురుషోత్తముడ నని. ప్రథితః అస్మి = ప్రసిద్ధుడనైనాడను.

తా॥ ఎందువలన క్షరుడను పేరుగలచతుర్వింశతితత్త్వముల నతిక్రమించినవాడను, అక్షరుడగు జీవునికంటె శ్రేష్ఠుడనైతినో, అందువలన నేను లోకమందును, వేదమందును, "పురుషోత్తముడ" నని ప్రసిద్ధుడనైనాను.

శ్లో॥ యోమా మేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
న సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత! ॥ 19

పద॥ యః - మాం - ఏవం - అసమ్మూఢః - జానాతి - పురుషోత్తమం,
సః - సర్వవిత్ - భజతి - మాం - సర్వభావేన - భారత!

ప్రతి॥ హే భారత! = భరతకులోద్భవుడవగు ఓ యర్జునా!, యః = ఎవడు, అసమ్మూఢః = అజ్ఞానములేనివాడై, మాం = నన్ను, ఏవం = ఇట్లు పై చెప్పబడిన ప్రకారము, పురుషోత్తమునిగా, జానాతి = ఎఱుగుచున్నాడో, సః = వాడు, సర్వవిత్ = సమస్తము నెఱింగినవాడై, మాం = నన్ను, సర్వభావేన = అన్ని విధములచేతను, భజతి = భజించుచున్నాడు.

తా॥ ఎవడు మోహరహితుడై పై చెప్పిన ప్రకారము నన్ను పురుషోత్తమునిగా తెలిసికొనుచున్నవాడై, సర్వము పరమాత్మయను నభిప్రాయముతో నన్ను ధ్యానించుచున్నాడో, వాడన్ని విధములచేత నన్ను భజించుచున్నాడు.

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయాఽనఘ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్ కృతకృత్యశ్చభారత! ॥ 20

పద॥ ఇతి - గుహ్యతమం - శాస్త్రం - ఇదం - ఉక్తం - మయా - అనఘ!,
ఏతత్ - బుద్ధ్వా - బుద్ధిమాన్ - స్యాత్ - కృతకృత్యః - చ - భారత!,

ప్రతి॥ హేఅనఘ!= పాపరహితుడవగు ఓ యర్జునా! ఇతి = ఇట్లని, గుహ్యతమం= అతిరహస్యమైన, ఇదం శాస్త్రం = ఈ శాస్త్రము, మయా ఉక్తం = నాచే చెప్పబడినది, హే భారత! = భరతపుత్రా! ఓ యర్జునా!, ఏతత్ = దీనిని బుద్ధ్వా = తెలిసికొని. బుద్ధిమాన్ = జ్ఞానవంతుడుగాను, కృతకృత్యః చ = కృతార్థుడుగాను, స్యాత్ = అగును.

తా॥ ఓ యర్జునా! ఇట్లతిరహస్యమైన యీ శాస్త్రమును నీకు చెప్పితిని. భరతపుత్రా! ఓ యర్జునా! దీనిని బాగుగా గుర్తెఱింగిన వాడు జ్ఞానవంతుడును, కృతార్థుడునగును.

వి॥ ఈ గీతాశాస్త్రమున చెప్పినట్లాచరించువాడు కృతకృత్యుడగునని శ్రీ భగవంతుడే తెలిపినాడు. కృతకృత్యుడనగా, — కృతం కృత్యం యేన సః = చేయదగిన కృత్యమును ఎవడు విధి పూర్వకముగా నిర్వర్తించెనో వాడు కృత

కృత్యు డనబడును. తాను చేయవలసిన సకల కృత్యములను కొంచమైనను విడువక చేసినవాడని భావము. ఇట్టి కృతకృత్యుడైన వాడు మాత్రమే కృతార్థుడగును. అనగా జీవన్ముక్తుడగును. కృతకృత్యుడు కానివాడు కృతార్థుడు గాజాలడని ప్రతిముముక్షువు జ్ఞాపకముంచుకొనవలెను.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ కృష్ణార్జునసంవాదే పురుషోత్తమ ప్రాప్తియోగో నామ
పంచదశోఽధ్యాయః.

పద॥ ఇతి - శ్రీమత్‌భగవద్గీతాసు - ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే - శ్రీ కృష్ణార్జునసంవాదే - పురుషోత్తమప్రాప్తి యోగః - నామ - పంచదశః – అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇది, ఉపనిషత్సు= ఉపనిషత్స్వరూపమును, బ్రహ్మవిద్యాయాం= బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రే = యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదే = శ్రీ కృష్ణార్జున సంవాద రూపమునగు, శ్రీమద్భగవద్గీతాసు = శ్రీ భగవద్గీతయందు, పురుషోత్తమ ప్రాప్తియోగః నామ = పర బ్రహ్మ ప్రాప్తియోగమనెడు ప్రసిద్ధిగలిగిన, పంచదశః అధ్యాయః = పదునైదవ అధ్యాయము సంపూర్ణము.

తా॥ ఇట్లు ఉపనిషత్స్వరూపమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాద రూపము నగు శ్రీమద్భగవద్గీతయందు పురుషోత్తమ ప్రాప్తియోగమను ప్రసిద్ధిగల పదునైదవ అధ్యాయము సంపూర్ణము.

వి॥ పురుషోత్తమ ప్రాప్తియు నొకయోగమగుటచే నిచ్చట గూడ యోగశబ్దము ప్రయోగించడమైనది.

ఓమ్ తత్ సత్.





ఓమ్
శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## షోడశోఽధ్యాయః - షోడశాధ్యాయము

## దైవాసురసమ్పద్విభాగయోగః- దైవాసురసంపద్విభాగయోగము



ఈ యధ్యాయమునకు 'దైవాసురసంపద్విభాగయోగ'మని పేరు. దైవ సంపత్తును అనగా దైవధనమును అసురసంపత్తును అనగా అసుర ధనమును నీ రెండింటిని వేరు పరచినదగుటచే దీనికిట్టి పేరు గలిగినది. దైవధనము గల వాడు దైవమును పొందును. అసురధనము గలవాడు రాక్షసాదులలో చేరును. ఇచ్చట దైవధన మనగా దైవగుణమనియు, అసురధనమనగా అసురగుణ మనియు గ్రహించుకొనవలెను. బియ్యము మొదలగువానినుండి రాళ్ళు మొద లైనవి వేరుపరచి శుద్ధము చేయునట్లు తనయందీ యధ్యాయములో చెప్పబడిన అసురగుణమేదైన నుండినచో తీసివేయవలయును. లేక తాను పెట్టిన పైరులో దానికన్న నన్యములగు కలుపుమొక్కలుండిన వాటి నెట్లు తీసివేయవలయునో అలాగున నీ యధ్యాయములో ప్రథమమున చెప్పబడిన మూడు శ్లోకములలో గల దైవగుణములకన్న నన్యగుణములగు అసుర గుణము లుండినచో వాటిని వెతికి రహితమొనర్చి హృదయక్షేత్రమును శుద్ధపరచవలెను. లేక తాను నాటిన ఫలవృక్షములకు పురుగుబట్టినచో దానినితీసివేసి చెట్టును ఏలాగునసంరక్షించునో అలాగున హృదయములోగల దైవగుణముల కన్యములగు అసుర, రాక్షసగుణ ములుండిన వాటిని తొలగించి తన హృదయములో పెట్టబడిన యనుష్ఠానరూప ములగు సత్యము, జ్ఞానము, కరుణ, విముక్తి మొదలగు ఉత్తమ గుణములనే దైవ వృక్షములను సంరక్షించుకొనవలెను. పురుగుపడి చెట్లయొక్క చిగుళ్ళను, పుష్పముల నెట్లు నశింపజేయునో, అలాగున అసురగుణము తన దైవసంబంధ మగు అనుష్ఠానముల నన్నిటిని నశింపజేయును. శ్రద్ధతో నుండు తోటమాలి లేక తోటనుపెట్టిన వారు ప్రతిరోజును ఏలాగున చెట్లను చూచుచు పురుగులుండిన తీసిపారవేయుచుందురో జిజ్ఞాసువులు పరమభక్తులు నీలాగున అసురగుణముల ప్రవేశింపనీయక తమ హృదయ క్షేత్రమును సంరక్షణ చేయుచుండవలెను.

శ్రీ భగవానువాచ:— శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥ 1

శ్లో॥ అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాన్తి రపైశునమ్ ।
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥ 2

శ్లో॥ తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా।
భవన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత ॥ 3

పద॥ అభయం - సత్త్వసంశుద్ధిః - జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం - దమః - చ - యజ్ఞః - చ - స్వాధ్యాయః - తపః -ఆర్జవమ్.
అహింసా - సత్యం - అక్రోధః - త్యాగః - శాన్తిః - అపైశునం.
దయా - భూతేషు - అలోలత్వం - మార్దవం - హ్రీః - అచాపలమ్,
తేజః - క్షమా - ధృతిః - శౌచం - అద్రోహః - న - అతిమానితా,
భవన్తి - సంపదం -దైవీం - అభిజాతస్య - భారత!.

ప్రతి॥(1)అభయం = భయము లేకుండుట,(2)సత్త్వసంశుద్ధిః = చిత్తశుద్ధియు, (3) జ్ఞానయోగవ్యవస్థితిః జ్ఞానయోగమందుండుటయు (4)దానం = దానమిచ్చుటయు, (5) దమః చ = బాహ్యేంద్రియ నిగ్రహమును,(6)యజ్ఞః చ = జ్ఞానయజ్ఞమును, (7)స్వాధ్యాయః = అధ్యయనము,(ప్రణవధ్యానము ఉపనిషద్గీతాదుల పారాయణము,) (8) తపః = తపస్సు, (9) ఆర్జవం = కపటము లేకుండుట, (10) అహింసా = పరులను హింసింపకుండుట, (11) సత్యం = సత్యప్రవర్తనము, (12) అక్రోధః = కోపములేకుండుట (13)త్యాగః = కర్మఫలత్యాగము లేక సర్వసంగపరిత్యాగము లేక త్యాగబుద్ధి గలిగియుండుట, (14) శాన్తిః = శాంతస్వభావము లేక చిత్తోపరతి (15) అపైశునం = కొండెములు చెప్పకుండుట, భూతేషు = సమస్త ప్రాణులయెడల(16) దయా = కరుణగలిగియుండుట,(17) అలోలత్వం విషయములందు మనస్సు వ్యాపింపకుండుట, (18) మార్దవం = వాఙ్మాధుర్యము లేక మృదుస్వభావము, (19)హ్రీః = ధర్మవిరుద్ధకార్యములలో లజ్జ గలిగియుండుట, (20) అచాపలం = చంచల స్వభావములేకుండుట, (21) తేజః = బ్రహ్మ తేజస్సు,(22) క్షమా=ద్వంద్వములను సహించుట

(23)ధృతిః = ఆపత్కాలములోగూడధైర్యమును విడవకుండుట,(24) శౌచం = బాహ్యాభ్యంతర శుచి, (25) అద్రోహః = పరులకు ద్రోహము చేయకుండుట, (26) న అతిమానితా = అభిమానము లేకుండుటయు నను ఈ దైవగుణములు, హే భారత! = ఓయర్జునా !, దైవీం సంపదం అభిజాతస్య = దైవాంశమందు పుట్టిన వానికి, భవన్తి = కలుగుచున్నవి.

తా॥ ఓ యర్జునా ! దైవాంశమందు పుట్టిన వారికి అభయము, సత్త్వసంశుద్ధి, జ్ఞానయోగవ్యవస్థితి, దానము, దమము, యజ్ఞము స్వాధ్యాయము, తపస్సు, ఆర్జవము, అహింస, సత్యము అక్రోధము, త్యాగము, శాంతి, అపైశునము, (కొండెములు చెప్పకుండుట) సమస్త ప్రాణులయెడ కరుణ, అలోలత్వము, మార్దవము, హ్రీ, (లజ్జ) అచాపలము, తేజస్సు, క్షమము, ధృతి, శౌచము, అద్రోహము, అనతిమానిత్వము అనగా గర్వరాహిత్యము అనుదైవ ధనము గలుగుచున్నది. ఇట్టి దైవగుణము లుండునని భావము.

వి॥ ఇచట నిరువదిఆరు (26) దైవగుగుణములు చెప్పబడినవి 26 గుణములు చెప్పుటకు కారణమేమనగా - ప్రకృతి తత్త్వములు 25, సాక్షి చైతన్యుడగు జీవుడు కలిసి మొత్తము 26 తత్త్వములగును. సామాన్యముగా కొందఱు 24 తత్త్వములనే చెప్పుదురు. కాని అంతఃకరణములతోజేరి 25 తత్త్వములగును. అనగా జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, శబ్దాదివిషయములు 5· ప్రాణాదులు5. మనోబుద్ధి చిత్తాహంకారములు 4. వాటిధర్మి యగు అంతఃకరణము ఒకటి మొత్తము 5, కలసి 25 తత్త్వములగును.

మనోబుద్ధి చిత్తాహంకారములని చెప్పుటచేతనే అంతఃకరణమున్ను చెప్పబడినది కదా! అట్లైనచో మఱల అంతఃకరణమును వేరుగా నేల బేర్కొనవలయునని సందేహింప బనిలేదు. మనోబుద్ధి చిత్తాహంకారములు అంతఃకరణధర్మములు; ధర్మియగు నంతః కరణము ధర్మములగు మనో బుద్ధ్యాదులకంటె వేరుగా పరిగణింప బడును. మనోబుద్ధ్యాదులకంటె అంతఃకరణము వేరుగా కనిపించుట లేదు కదాయని శంకింపరాదు. కనిపించినంత మాత్రముచే లేదని యంగీకరించుట తగదు. ఆకాశము కనిపించక పోయినను పృథివ్యాది చతుర్భూతముల కంటె వేరుగా నున్నదికదా! అట్లే అంతఃకరణముగూడ మనోబుద్ధ్యాదులకంటె వేరుగా కనిపించక పోయినను అంగీకరింప వలసి యుండును. కాన అంతఃకరణ

ముతో కలసి 25 తత్త్వములు అయినవి. ఈ తత్త్వములలో మనోబుద్ధ్యాది ధర్మవిశిష్టమగు నంతఃకరణము ముఖ్యమైనది. అయ్యది మలవిక్షేపావరణ దోషములతో గూడియున్నది. అజ్ఞానముచే జీవుడు అంతఃకరణ ధర్మములను తనయందారోపించుకొని తానుగూడా పూర్వోక్త దోషదూషితుని వలె నుంటున్నాడు. కాన అంతఃకరణము, జీవుడును శుద్ధులు గావలయును. ఇట్లు శుద్ధులైనపుడే కైవల్యము సిద్ధించును. కనుకనే శ్రీ పతంజలి మహర్షి 'పాతంజలి యోగదర్శనమునందు' – 'సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమ్' వివేక ఖ్యాతిచే అంతఃకరణములోగల రజస్తమో రూపములగు దోషములు (మలినములు) తొలగి నందున జీవుడును దోషరహితుడై కైవల్యమును పొందును అని చెప్పెను. అనగా – నిష్కామ కర్మోపాసనా జ్ఞానముల వలన అంతఃకరణమున గల మల విక్షేపావరణ దోషములు తొలగుటచే జీవుడును పరిశుద్ధుడై స్వస్వరూప జ్ఞానముచే కైవల్యమును బొందునని భావము.

అజ్ఞానదశలో జీవుడు సుషుప్త్యవస్థను బొందియుండును. జ్ఞానము గలుగునపుడు జాగ్రదవస్థకు వచ్చిన వాడగును, సుషుప్తిలో నుండువాడెంత గొప్పవాడైనను – తానెవడు? – తానెచ్చటనున్నాడు? దేనికొఱకు వచ్చినాడు? అను నీ మూడు సంగతులనెట్లు దెలియక యుండునో, ఆలాగున అజ్ఞానదశలో తానెవడు? ఎచటనుండి వచ్చినాడు? దేనికొఱకు వచ్చినాడు? అను నీ సంగతులు దెలియవు. నిద్రనుండి మేల్కొనిన వాడు తానెవడో? ఎచటినుండి వచ్చినవాడో? దేనికొఱకు వచ్చియున్నాడో?–అను విషయము నెట్లు తెలిసికొనుచున్నాడో, అట్లే జ్ఞానావస్థలోనికి వచ్చినపుడు తనయొక్క దైవత్వస్థితిని, దైవస్థితిలోనేయుండుటను దైవత్వపూర్ణప్రాప్తికొఱకుమాత్రమేజన్మవచ్చిన సంగతినిన్ని దెలిసికొనగలుగును.

మఱియు జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, అంతరింద్రియములు, వీటిలోనేదేని ఒక యింద్రియము లేనిచో(లోపించినచో)ఆయాయింద్రియములచేత పొందదగిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులెట్లు తెలియబడజాలవో అనగా కర్ణేంద్రియము నష్టమైనచో శబ్దజ్ఞానమెట్లు గలుగదో, త్వగింద్రియము లోపించినచో స్పర్శజ్ఞానమెట్లు గలుగదో, నేత్రేంద్రియము నష్టమైనచో రూపమెట్లు గోచరముగాదో, రసనేంద్రియము లోపించినచో రుచి యేలాగున తెలియబడదో, ఘ్రాణేంద్రియము నష్టమగుచో గంధమేలాగున దెలియబడదో, అట్లే మనస్సు చెడిపోయినచో యథార్థజ్ఞాన మేలాగున గలుగదో,అట్లే యీ 25 తత్త్వ

ములును జీవుడును శుద్ధములు గానిచో పూర్ణప్రబోధమగు దైవసాక్షాత్కార జ్ఞానము గలుగదు. అట్లే యీ అభయాది దైవగుణములలో 26 టిలో నేదైన నొకటి లేనిచో మనకొక యింద్రియము లేనట్లే యని గ్రహించవలయును. కాన ఈ 26 దైవగుణములు బాగుగా నుండేలాగున యత్నించవలెను. ఈ దైవ గుణము లన్నియు నెంతవరకు సంపూర్ణముగా గలుగలేదో, అంతవఱకు మనకు అన్ని యింద్రియములు పూర్ణములుగా లేనట్లే యని తెలిసికొనవలెను, ఇదియే దీనిలో గల రహస్యము.

శ్లో॥ దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ॥
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపదమాసురీమ్ ॥ 4

పద॥ దంభః - దర్పః - అభిమానః - చ - క్రోధః - పారుష్యం - ఏవ - చ, అజ్ఞానం - చ - అభిజాతస్య - పార్థ! - సంపదం - ఆసురీమ్.

ప్రతి॥ హే పార్థ! = ఓ యర్జునా!, ఆసురీం సంపదం అభిజాతస్య = అసురసంపదలో పుట్టినవానికి, దంభః = డంబము, దర్పః = గర్వము, అభిమానః చ = దురభిమానమును, క్రోధః = కోపము, పారుష్యం ఏవ చ = వాక్కాఠిన్యమును, అజ్ఞానం చ = అవివేకమును లక్షణములు, ఇవియే రాక్షసగుణములు, దీనికేయసురధనమనిగూడ పేరు. ఇకను విస్తారముగా నీ యసుర గుణములు తెలుపబడుచున్నవి.

తా॥ అసురగుణములందు (సంపదయందు) పుట్టినవానికి డంబము, గర్వము, దురభిమానము, కోపము, వాక్పారుష్యము, అనగా పరుల పీడించేలాగున వచించెడు స్వభావము, వివేకజ్ఞాన హీనతయు గలుగుచున్నది. ఇవి అసుర సంపదగలవారి లక్షణము లని భావము.

శ్లో॥ దైవీ సంపద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా ।
మాశుచస్సంపదం దైవీమభిజాతోఽసి పాండవ! ॥ 5

పద॥ దైవీ - సంపత్ - విమోక్షాయ - నిబన్ధాయ - ఆసురీ - మతా, మాశుచః- సంపదం - దైవీం - అభిజాతః - అసి - పాండవ!

ప్రతి॥ దైవీ సంపత్ = దైవగుణమందుబుట్టుట, (దైవీసంపద) విమోక్షాయ = సంసార బంధముక్తికొఱకును, ఆసురీ (సంపత్) = అసురీసంఫధ,

నిబన్ధాయి = బంధము కొఱకును అగునని, మతా = నా అభిప్రాయము. హేపాండవ! = పాండునందనుడవగు ఓ యర్జునా! (నీవు) దైవీం సంపదం అభిజాతః = దైవసంపదయందు పుట్టినవాడవు, అసి = అగుచున్నావు. మాశుచః = దుఃఖింపకుము.

తా॥ దేవతల కుండదగినదియును, సత్త్వగుణ ప్రధానమును అగు జ్ఞాన (దైవ) సంపదగలవాడు సంసారబంధమునుండివిముక్తుడై మోక్షమును బొందుచున్నాడు. అసుర (రాక్షస) గుణము (సంపద) గలవాడు సంసారబంధమునుపొంది దుఃఖముల బడవలసియుండును. ఓ యర్జునా! విచారపడకుము. నీవు దైవసంపద గలిగియే పుట్టి యున్నావు.

వి॥ గురువులు శిష్యుల నీ లాగున ప్రబోధము చేయవలయును. ఒకవేళ శిష్యునియందు సుగుణములు కొన్నిలేక పోయినను 'నే వీశ్వరాంశములో పుట్టిన వాడవు మోక్షముకొఱకే జన్మించినావు. నీకు దైవకృప గలదు. భయపడకుము! సంశయములు విడువుము ముక్తుడవు గాగలవు' అని ఈ లాగున ప్రబోధము చేయ వలయును. సీతాన్వేషణము కొఱకు దక్షిణ సముద్ర తీరమున చేరిన యాంజనేయాంగదజాంబవదాదులు సముద్రతరణమును గుఱించి యొక్కొక్కరిని విచారించగా, నంగదుడు మొదలైన వారిలో కొందఱు పదియోజనములు, కొందఱు ఇరవై యోజనములు, కొందఱు నలభైయోజనములు నీలాగున దాటగలమని చెప్పగా సముద్రమును పూర్తిగా దాటుశక్తి యెవరికిని లేనందున జాంబవంతుడు లేచి హనుమంతుని గుఱించి యిట్లు పొగడెను:—నీవు మహాబలు డవు వాయుపుత్రుడవు. పుట్టినప్పుడే సూర్యుని మ్రింగుటకు సూర్యమండలమున కెగిరినవాడవు. ఇంద్రుని వరముచే వజ్రాయుధమునకైనను తెగనివాడవు. మహా తపస్సంపన్నుడవు రుద్రబీజమునందు పుట్టినవాడవు అని ఈ లాగున చెప్పగా హనుమంతు డుప్పొంగి మహాబలపరాక్రమవంతుడై, యాకాశమున కెగిరి యతి వేగముగా సముద్రమును దాటి లంకలో ప్రవేశించెను. కావున నెప్పుడు నెవరిని నిరుత్సాహపరచకూడదు. సైన్యములకు, సేనాధిపతి యుద్ధమునకు వెళ్ళునప్పుడే లాగున బలపరాక్రమ వంశోన్నతివీర్యశౌర్యముల నుద్బోధించి పంపుచుండునో, అలాగున చేయవలయునేగాని దీన భావము గలిగించ గూడదు.

61

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు ॥ 6

పద॥ ద్వౌ - భూతసర్గౌ - లోకే - అస్మిన్ - దైవః - ఆసురః - ఏవ - చ,
దైవః - విస్తరశః - ప్రోక్తః - ఆసురం - పార్థ! - మే- శృణు.

ప్రతి॥ హే పార్థ = ఓ యర్జునా!, అస్మిన్లోకే = ఈ లోకమునందు, దైవః= దైవసంబంధములైన గుణములు గలిగినట్టియు, ఆసురః ఏవ చ= అసుర సంబంధగుణములు గలిగినట్టియు, ద్వౌ=రెండువిధములగు, భూతసర్గౌ= భూతములసృష్టులు కలవు(అందు) దైవః = దైవగుణము, (దైవసంపద) విస్తరశః = విస్తారముగా, ప్రోక్తః = ఇదివరలో చెప్పబడినది, ఆసురం= ఇక అసురగుణములగూర్చి, మే = నా వలన, శృణు = వినుము.

తా॥ ఓ అర్జునా! భూలోకమునందు భూతసృష్టి దైవము, అసురమని రెండువిధములుగా నున్నది, అందు దైవభూతసృష్టిని ఈ యధ్యాయమునందలి మొదటి మూడు శ్లోకములచేత విస్తారముగా చెప్పియున్నాను. ఇప్పుడాసురభూతసృష్టిని విస్తరించియు చెప్పెదను వినుము.

వి॥ భూలోకములో దైవాసురలను గుఱించి వర్ణింపబడిన వన్నియునీదైవాసురగుణములుగల మనుష్యులనుగుఱించియేయని తెలియవలెను. మనుష్య సృష్టిలోగూడ మొదల ఆర్యజాతి ఒకటియే యుండినది. తరువాత కొంతకాలము నకు వారిలో ఆర్యులనియు, అనార్యులనియు, ననగా దస్యులనియు రెండు విభాగము లేర్పడినవి. మఱికొంతకాలము జరిగినపిమ్మట వారిలో నాల్గు వర్ణ విభాగము లేర్పడెను. తరువాత బహుకాలము జరిగినపిమ్మట నాల్గుజాతులలో గల స్త్రీ పురుషుల సంకరముచే ననేకజాతులు ఏర్పడినవి. "ద్వయాహప్రాజాపత్యా దేవాశ్చాసురాశ్చ" ప్రజల యుత్పత్తికాలములో దైవాంశులనియు, నసురాంశుల నియు రెండురకములవారే యుండిరని యుద్గీథబ్రాహ్మణము.

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ జనా న విదురాసురాః ।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ 7

పద॥ ప్రవృత్తిం - చ - నివృత్తిం - చ - జనాః - న - విదుః - అసురాః,
న - శౌచం - న- అపి - చ - ఆచారః - న - సత్యం - తేషు - విద్యతే.

ప్రతి॥ అసురాః జనాః = అసురవంశములో పుట్టిన జనులు, ప్రవృత్తిం చ = ప్రవృత్తిమార్గమునుగాని, నివృత్తిం చ = నివృత్తిమార్గమునుగాని, న విదుః = ఎఱుంగరు. తేషు = వారియందు, శౌచం = శుచిత్వము, ఆచారః చ = మంచి నడతయును, సత్యం అపి = సత్యమును, న విద్యతే = ఉండదు.

తా॥ అసురస్వభావముగలవారు ఇవి పురుషార్థసాధనములగు ధర్మములు గనుక వీనిని మనమాచరింపవలయుననియు, (ఇవిసంసార బంధవిముక్తిమార్గములనియు)ఇవి పురుషార్థసాధక ధర్మములు గావు, కాన వీటిని మనము త్యజించవలెననియు నెఱుంగరు. అనగా సంసార బంధకారణములని తెలిసికొనరు. ఇట్టివారు బాహ్యాశుద్ధియు, చిత్తశుద్ధియు, ధర్మాచరణయు సత్యవాక్యతయు గలవారుకారు.

వి॥ (1) దైవాంశములో అనగా సత్త్వగుణములో పుట్టినవారు స్వయముగానే బంధవిముక్తిమార్గమును తెలిసికొనగలరు. జన్మాంతర పుణ్యసంస్కారముచే వారి యాత్మశుద్ధమై యుండును (2) సామాన్యమైనమనుజుడైనచో, తనకుధర్మాధర్మములు తెలియకపోయినను గొప్పవారు చెప్పగావిని. లేక శాస్త్రములచూచినగాని వెంటనే తన చెడుపనులను నివృత్తిచేసికొనును. వీడు కొంత సత్త్వగుణము, రజోగుణము గలవాడు. (3) తమోగుణమధికమును, కొంత రజోగుణముగల వాడు ఆత్మశుద్ధి లేనివాడగుటచే స్వయముగా సంసారబంధమును (విముక్తిని) తెలిసికొనక పోవుటయేగాక యెవరు చెప్పినను వినడు, శాస్త్రములనుచూచి తెలిసికొనడు. మొదటివాడీ జన్మములో ముక్తుడగును. రెండవవాడు ముక్తికొఱకై ప్రయత్నముచేయు చుండును. మూడవవాడు బద్ధుడైపోవును.

శ్లో॥ అసత్య మప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్ ॥ 8

పద॥ అసత్యం – అప్రతిష్ఠం - తే - జగత్ - ఆహుః - అనీశ్వరం, అపరస్పరసంభూతం - కిం - అన్యత్ - కామహైతుకమ్.

ప్రతి॥ తే = ఆ యసురగుణములుగలవారు, జగత్ = ఈ ప్రపంచము, అసత్యం = వేదాది ప్రమాణములుగలదికాదనియు లేక నిజముకాదనియు, అప్రతిష్ఠం = ఒకనిచే సృజింపబడినది గాదనియు, అనీశ్వరం = దీనికి కర్తగా ఈశ్వరుడు లేడనియు, మఱియును, అపరస్పరసంభూతం = స్త్రీపురుషులయొక్క పరస్పర

సంబంధమువలన పుట్టినది, అన్యత్ కిం = మఱియొక్కటియేమిగలదు? కాబట్టి కామహైతుకం = కామమే హేతువుగాగలదియనియు, అహుః = చెప్పు చున్నారు,

తా॥ అసురస్వభావముగలవారు ప్రపంచము సర్వప్రాణుల జంటవలన గలుగుచున్నదనియు, జగదుత్పత్తికి స్త్రీపురుషులకామమే కారణమనియు, దీనికి కర్త మరియొక ఈశ్వరుడు లేడనియు, దైవ నిర్మిత వేదశాస్త్రములతో మాకు పనిలేదనియు చెప్పుదురు. వీరే నాస్తికులు.

వి॥ ఇట్టి స్వభావముగలవారే యీ ప్రపంచమున కనబడునదంతయు స్వభావ మనియు లేక ప్రకృతిస్వభావమని చెప్పుదురు. దేనినే నేచర్( Nature ) అని స్వభావమనగ నొకగుణము, గుణిని అనుసరించియే గుణముండును. నాస్వభావము నీ స్వభావము, దానిస్వభావమని చెప్పునప్పుడే స్వభావమున కాధారము వేరే ఒకటి యుండే తీరవలయును. అట్టియాధారము ఆత్మలేక ఈశ్వరు డనబడును. అస్తియు నాస్తియు రెండును ఆస్తిక్యమే. నాస్తిక్యముకాదు. ఏలన కలదు, లేదు అని యీ రెండింటిని తెలిసికొనువాడు మఱియొకడుండియే తీరవలయును. కావున ఆస్తి క్యమే యగును.

శ్లో॥ ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ 9

పద॥ ఏతాం - దృష్టిం - అవష్టభ్య - నష్టాత్మానః - అల్పబుద్ధయః,
ప్రభవన్తి - ఉగ్రకర్మాణః - క్షయాయ - జగతః - అహితాః.

ప్రతి॥ ఏతాం దృష్టిం = ఇటువంటి దృష్టిని, అవష్టభ్య = అవలంబించి. నష్టాత్మానః = చెడినమనస్సుగలవారును, అల్పబుద్ధయః = స్వల్పబుద్ధిగల వారునై, జగతః = ప్రపంచమునకు, క్షయాయ = నాశముగలుగజేయుట కొఱకు, అహితాః=శత్రువులుగను, ఉగ్రకర్మాణః = క్రూరకర్మల చేయు వారుగను, ప్రభవన్తి = పుట్టుచున్నారు.

తా॥ పైచెప్పిన నాస్తిక దృష్టి నవలంబించి చెడినమనస్సుగల వారును లేక ఆత్మజ్ఞానము లేనివారును, దీర్ఘ విచారము చేయ శక్తి లేని స్వల్ప బుద్ధిగలవారును, ప్రపంచమునకు హాని కలుగ జేయుట

కొఱకు జ్ఞానవిరోధులుగను, క్రూరకర్మలు జేయువారుగను పుట్టు చున్నారు.

శ్లో॥ కామ మాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః ।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః॥ 10

పద॥ కామం - ఆశ్రిత్య - దుష్పూరం - దంభమానమదాన్వితాః,
మోహాత్ - గృహీత్వా - అసద్గ్రాహాన్ - ప్రవర్తంతే - అశుచివ్రతాః.

ప్రతి॥ వారలు, దంభమానమదాన్వితాః = డంబము, దురభిమానము, గర్వ మను నీ దుర్గుణములతో గూడుకొనినవారలై. దుష్పూరం = మితిలేని, కామం = కోరికను. ఆశ్రిత్య = అవలంబించి, మోహాత్ = అవివేకము వలన, అసద్గ్రాహాన్ = సత్పురుషులు గానివారలచే నవలంబింపబడ దగిన విషయములను, గృహీత్వా = అవలంబించి, అశుచివ్రతాః = నీచవృత్తులుగలవారై ప్రవర్తంతే = ప్రవర్తించుచున్నారు.

తా॥ వారలు (పూర్వోక్తనాస్తికులు)డంబము, దురభిమానము. గర్వమను నీ దుర్గుణములతో గూడుకొన్నవారై నిండింపగూడని మితిలేని కోరికల నవలంభించి యవివేకమువలన నీచులచే ఆచరింప దగిన నీచాహారము నీచదేవతోపాసనము మొదలగు హీనవృత్తులు గలవారై ప్రవర్తించుదురు.

శ్లో॥ చింతామపరిమేయాం చ ప్రళయాన్తాముపాశ్రితాః ।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ॥ 11

పద॥ చింతాం – అపరిమేయాం - చ - ప్రళయాన్తాం - ఉపాశ్రితాః,
కామోపభోగపరమాః - ఏతావత్ – ఇతి – నిశ్చితాః,

ప్రతి॥ వారు, కామోపభోగపరమాః = కామభోగముల ననుభవించుటయందే యాసక్తి గలవారును, ఏతావత్ ఇతి నిశ్చితాః = అట్లనుభవించుటకంటె మేలైన పురుషార్థము వేరొండు లేదని నిశ్చయించినవారలై, అపరి మేయాం = పరిమితిలేనిదియు. ప్రళయాన్తాం చ= ప్రళయకాలమువఱకు విడువనిదియు నగు, చింతాం = ప్రపంచచింతను, ఉపాశ్రితాః = ఆశ్ర యించినవారగుదురు.

తా॥ కామభోగముల ననుభవించుటయందే యాసక్తి గల వారును, అట్లనుభవించుటకంటె మేలైన పురుషార్థము వేరొండులేదని నిశ్చయించినవారునునై పరిమితి లేనిదియు, మరణకాలమువరకు విడువనిదియు నగు చింత నాశ్రయించిన వారగుదురు.

వి॥ మితిమీరిన చింత గలిగియుండరాదు. అది మంచి కార్యమైనను సరి చింత యుండువఱకు చిత్తము నశింపదు. చిత్తశాంతి లేనిచో శాశ్వతసుఖము లభింపదు.

శ్లో॥ ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।
ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థ సంచయాన్ ॥ 12

పద॥ ఆశాపాశశతైః - బద్ధాః - కామక్రోధపరాయణాః,
ఈహన్తే - కామభోగార్థం - అన్యాయేన - అర్థసంచయాన్,

ప్రతి॥ ఆశాపాశశతైః = అనేక విధములగు నాశాపాశములచేత, బద్ధాః = కట్టుబడిన వారలును, కామక్రోధపరాయణాః = కామము క్రోధము ప్రధాన గుణములుగా గలవారలునై, కామభోగార్థం = విషయభోగముల ననుభవించుటకొఱకు, అర్థసంచయాన్ = (ధర్మాధర్మములను నెఱుంగక) ద్రవ్యములను, అన్యాయేన = అక్రమమార్గముచేతనైనను, ఈహన్తే = సంపాదింపకోరుదురు.

తా॥ అనేక విధములగు నాశాపాశములచే కట్టుబడినవారలై, కామక్రోధములే ప్రధానగుణములుగా గలవారలై, విషయభోగముల ననుభవించుటకు కావలసిన ద్రవ్యముల నక్రమమైన మార్గముచేతనైనను సంపాదింపకోరుదురు.

వి॥ వృక్షమునకు వేరులెటువంటివో జీవుని కాశాపాశము లటువంటివి. వేర్లను ఏంతెంత నరికిన అంతంత చెట్టుయొక్క యభివృద్ధి తగ్గిపోవును. ఒక్క వేరుండినను చెట్టుచావదు. దానినిగూడ నరికివేసిన చెట్టు క్రిందపడి యెండిపోవును. అలాగున జీవునియొక్క ఆశలెంత కెంతకు తగ్గునో అంతకంతకు మాయ శమించును. అయితే దృశ్య విషయవాసనయను వేరొకటుండినను ప్రకృతినుండి విముక్తిగలుగదు కనుకనే కొంచెము కొన్ని యాశాపాశములను తగ్గించి ధ్యానము చేయునప్పుడు కొంతవఱకు మనశ్శాంతి గలుగునుగాని,

సంపూర్ణ మనోనాశము గలుగనందుచే ముక్తాత్ములై సదా ఉపరతియగు పరమ శాంతిని పొందకపోవుచున్నారు.

శ్లో॥ ఇదమద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్ ।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥ 13

,, అసౌ మయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరానపి ।
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ ॥ 14

,, ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా ।
యక్ష్యేదాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥ 15

,, అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ ॥ 16

పద॥ ఇదం - అద్య - మయా - లబ్ధం - ఇమం - ప్రాప్స్యే - మనోరథం
ఇదం - అస్తి - ఇదం - అపి - మే - భవిష్యతి - పునః - ధనమ్
అసౌ - మయా - హతః - శత్రుః - హనిష్యే - చ - అపరాన్ - అపి
ఈశ్వరః - అహం - భోగీ - సిద్ధః - అహం - బలవాన్ - సుఖీ - ఆఢ్యః -
అభిజనవాన్ - అస్మి - కః - అన్యః - అస్తి - సదృశః - మయా -
యక్ష్యే - దాస్యామి - మోదిష్య - ఇతి - అజ్ఞాన విమోహితాః
అనేకచిత్తవిభ్రాన్తాః - మోహజాలసమావృతాః
ప్రసక్తాః - కామభోగేషు - పతన్తి - నరకే - అశుచౌ.

ప్రతి॥ అద్య = ఇప్పుడు, ఇదం = ఈ ద్రవ్యము, మయా లబ్ధం = నాచే లభింపబడినది, ఇమం మనోరథం = ఈ కోరికను, ప్రాప్స్యే = పొంద బోవుచున్నాను, ఇదం అస్తి = నాకిప్పుడీ ద్రవ్యమున్నది, ఇదం ధనం అపి = ఈ ధనము గూడ, పునః = మఱల (ఇకను) మే = నాకు, భవిష్యతి = రాబోవుచున్నది, అసౌ శత్రుః = ఈ శత్రువు, మయా హతః = నాచే హతము చేయబడినవాడు, అపరాన్ అపి = తక్కినవారినిగూడ, హనిష్యేచ = హతము చేసెదను, అహం ఈశ్వరః = నేను ప్రభువును, అహం భోగీ = నేను సర్వసుఖముల ననుభవించువాడను, అహం = నేను, సిద్ధః = తలంచిన కార్యమును సిద్ధి పొందింపగలవాడను, బలవాన్ = బలవంతుడను, సుఖీ = భోగములచే సుఖిని నేను, ఆఢ్యః =

ధనాఢ్యుడను, అభిజనవాన్ = గొప్పవంశమున బుట్టిన వాడను, అస్మి = అయియున్నాను, మయా సదృశః = నాతో సమానుడు, అన్యః కః అస్తి = అన్యుడెవడుగలడు?, యక్ష్యే = యజ్ఞము చేసెదను, దాస్యామి = దానమిచ్చెదను, మోదిష్యే = సంతోషించెదను, ఇతి = అని అజ్ఞానమోహితాః = అజ్ఞానముచే మోహితులైనవారును, అనేక చిత్తవిభ్రాన్తాః = అనేకవిధములగు మనోవికారములు గలవారును, మోహజాలసమావృతాః = మోహమనెడి వలలో జిక్కినవారును, కామభోగేషు = విషయభోగముల ననుభవించుటయందు, ప్రసక్తాః = మిక్కిలి యాసక్తిగలవారునునై, అశుచౌ నరకే = అసహ్యామగు నరకమందు. పతన్తి = పడుచున్నారు,

తా॥ ఇప్పుడు నాకీద్రవ్యము లభించినది. యీ కోరిక సిద్ధించినది. ఇక నీ కోరికను పొందగలను. నాకిప్పు డీవస్తువులున్నవి. ఇక నీ ధనముగూడ నాకు రాబోవుచున్నది. ఈ శత్రువు నాచే హతము చేయబడినాడు. తక్కినవారినిగూడ హతముచేసెదను. నేను ప్రభువును, నేను సర్వసుఖముల ననుభవించువాడను. నేను తలంచిన కార్యమును సిద్ధిబొందింపగలవాడను. బలవంతుడను. సుఖిని. నేను ధనాఢ్యుడను, ఉత్తమకులములో బుట్టినవాడను. నాతో సమానుడైనవాడు మరెవ్వడు! నేను యజ్ఞాదుల చేయగలను. దానము చేయగలను. ఆనందింపగలనని యిట్లు అజ్ఞానముచే భ్రాంతచిత్తు లయ్యెదరు. మఱియు అనేకవిధములగు మనోవికారములు గలవారును, మోహమనెడి వలలో జిక్కినవారును, విషయభోగముల ననుభవించుటయందు మిక్కిలి యాసక్తిగలవారునునై అసహ్యామగు నరకమునందు పడుచున్నారు.

శ్లో॥ ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః ।
యజన్తే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్ ॥ 17

పద॥ ఆత్మసంభావితాః - స్తబ్ధాః - ధనమానమదాన్వితాః,
యజన్తే - నామయజ్ఞైః - తే - దంభేన - అవిధిపూర్వకమ్,

ప్రతి॥ తే = వారలు, ఆత్మసంభావితాః = తమ్ముతామే పొగడుకొనెడివారును, స్తబ్ధాః = వినయవిహీనులును అనగా నమ్రతలేక స్తంభమువలె నుండు వారును, ధనమానమదాన్వితాః = ధనమువలన గలిగిన దురభిమానము గర్వములతోగూడిన వారలై, దంభేన = డంబముతో, అవిధిపూర్వకం= శాస్త్రోక్తవిధుల ననుసరింపక, నామయజ్ఞైః యజన్తే = నామకార్థములగు యజ్ఞములను జేయుదురు.

తా॥ ఆ యసుర గుణముగలవారు తమ్ము తామే సర్వగుణ విశిష్టులనుగా పొగడుకొనుచున్నవారును, పెద్దలయందు వినయ విధేయతలు లేనివారును, దురభిమానగర్వములను చెందినవారునునై పేరుకొఱకు మాత్రము యజ్ఞ దాన సంతర్పణ చేయుదురు.

వి॥ ఎవరు బ్రహ్మనిష్ఠుల పాదములపై శిరస్సును వంచరో వారికి ప్రకృతి లొంగదు.

శ్లో॥ అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥ 18

పద॥ అహఙ్కారం - బలం - దర్పం - కామం - క్రోధం - చ - సంశ్రితాః, మాం – ఆత్మపరదేహేషు - ప్రద్విషన్తః – అభ్యసూయకాః.

ప్రతి॥ అహఙ్కారం = దురహంకారమును, బలం = బలమును, దర్పం =గర్వమును, కామం = దురాశను, క్రోధం = కోపమును, సంశ్రితాః = అవలంబించినవారై. ఆత్మపరదేహేషు = తనకంటె నితరములగు దేహములందుండెడు, మాం = నన్ను. అభ్యసూయకాః = అసూయాపరులై, ప్రద్విషన్తః = ద్వేషింతురు.

తా॥ దురహంకారమును, బలమును. గర్వమును, దురాశను, కోపమును అవలంబించినవారై తమకంటె నితరములగు దేహముల యందుండెడు నన్ను అసూయాపరులై ద్వేషింతురు.

శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు ॥ 19

పద॥ తాన్ - అహం - ద్విషతః - క్రూరాన్ - సంసారేషు - నరాధమాన్. క్షిపామి - అజస్రం - అశుభాన్ - అసురీషు - ఏవ - యోనిషు.

ద్విషతః = సమ స్తప్రాణులలో నంతరాత్మస్వరూపుడనై యున్న సర్వేశ్వరుడనగు నన్ను ద్వేషించుచున్న, క్రూరాన్ = క్రూరులును, అశుభాన్ = అనాచార పరులునగు, తాన్ నరాధమాన్ = అట్టి నరాధములను, అహం = నేను, అజస్రం = ఎల్లప్పుడును, సంసారేషు = జనన మరణ ప్రవాహరూపమగు సంసారమునందు, ఆసురీషు యోనిషు ఏవ = అసుర యోనులయందే, క్షిపామి = త్రోసివేయుచున్నాను. (పుట్టునట్లు చేయుచున్నాను.)

తా॥ సమస్త ప్రాణులలో నంతరాత్మస్వరూపుడనై యున్న సర్వేశ్వరుడనగు నన్ను ద్వేషించుచున్న క్రూరులను, అనాచార పరులునగు ఆ నరాధములను నేనెల్లప్పుడును జననమరణ ప్రవాహరూపమగు సంసారమునందు (అనగా నసురయోనులయందు) పడద్రోయుచున్నాను.

శ్లో॥ అసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌన్తేయ ! తతో యాన్త్యధమాం గతిమ్॥ 20

పద॥ అసురీం - యోనిం - ఆపన్నాః - మూఢాః - జన్మని - జన్మని - మాం - అప్రాప్య - ఏవ - కౌన్తేయ! - తతః - యాన్తి - అధమాం - గతిమ్.

ప్రతి॥ హే కౌంతేయ! = కుంతీపుత్రుడవగు ఓ యర్జునా!, ఆసురీం యోనిం ఆపన్నాః = అసురయోనియందు జన్మించిన, మూఢాః = మూఢులు, మాం అప్రాప్య ఏవ = నన్ను బొందకయే. జన్మని జన్మని = ప్రతిజన్మమునందును. తతః = అంత కంటె (మొదటిజన్మకంటె) అధమాం గతిం = నీచమైన జన్మమును, యాన్తి = పొందుచున్నారు.

తా॥ కుంతీపుత్రుడవగు ఓ యర్జునా! అసురయోనియందు జన్మించిన ఆ మూఢులు నన్ను బొందకయే ప్రతిజన్మయందును అంత కంటె అనగా ముందటి జన్మముకంటె నీచతరమగు జన్మమును పొందుచున్నారు

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః ।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్॥ 21

పద॥ త్రివిధం – నరకస్య – ఇదం – ద్వారం – నాశనం – ఆత్మనః.
కామః – క్రోధః – తథా – లోభః – తస్మాత్ – ఏతత్ – త్రయం– త్యజేత్.

ప్రతి॥ ఆత్మనః నాశనం = ఆత్మవినాశకమగు, ఇదం – ఈ, నరకస్య ద్వారం= నరకహేతువు లేక నరకద్వారము, కామః క్రోధః తథా లోభః=కామము, క్రోధము, లోభము. అని, త్రివిధం=మూడు విధములుగలది, తస్మాత్= కాబట్టి, ఏతత్ త్రయం = ఈ మూడింటిని, త్యజేత్ = వర్జింపవలెను.

తా॥ పైన చెప్పబడిన యాసురదోషములలో సకలదోషము లకు మూలములు కామ, క్రోధ, లోభములు. కనుక నీ మూడును నరకమును పొందుటకును, తాను నీచయోనులయందు జన్మించుట కును కారణములు. అందువలన జననమరణరూప నరకమునుండి తొలగగోరువారీ మూడింటిని వదలవలెను.

వి॥ ఇదివరలో చెప్పబడిన యసురగుణములుగలవారు ప్రతిజన్మములోను, పూర్వజన్మముకన్న నికృష్టజన్మమునే పొందెదరని తెలుపబడమైనది. అయితే వారి గతి యంతేనా? ఇక నేదైన తరుణోపాయము గలదా! అనుసందేహాము పడ నక్కరలేదు. పై నుదహరించిన యసురగుణములన్నిటికిని కామ, క్రోధ, లోభము లనెడు ఈ మూడును హేతువులు అనగా కారణములు.ఈమూడును నరకమునకు నాత్మ వినాశమునకును కారణములు. కావున నీ మూడింటిని విడిచిపెట్టి యెప్పుడు దైవ గుణముల నవలంబించునో, అప్పటినుండి యూర్ధ్వగతిగలిగి పరమేశ్వర కృపకుపాత్రుడై, మోక్షమును బొందగలడు. ప్రాధాన్యముగా చాలమంది భక్తుల యందును ముముక్షువులయందునుకూడ ఈకామము క్రోధము లోభము పూర్తిగా లేనప్పటికిని కొంతవఱకైన నుంటూయున్నది. కావున నీ మూడును నరకమున కునుఆత్మవినాశమునకును కారణములు.కనుక నీమూటిని త్యజింపవలెననియీశ్వ రుడు చెప్పిన దానిని మరువకూడదు భగవంతుడు కరుణాసముద్రుడు. కనుక ఈ మూడుగుణములను విడిచిన, చాలునని యుపదేశించడమైనది. అప్పటినుండి యూర్ధ్వగతి గలుగును. మంచిది చేయకపోయినను, చెడ్డది చేయకుండిన చాలును.

శ్లో॥ ఏతైర్విముక్తః కౌన్తేయ! తమోద్వారైస్త్రిభిర్నరః ।
అచరత్యాత్మనశ్శ్రేయస్తతో యాతి పరాం గతిమ్ ॥ 22

పద॥ ఏతైః – విముక్తః – కౌన్తేయ! – తమోద్వారైః – త్రిభిః – నరః,
ఆచరతి – ఆత్మనః – శ్రేయః – తతః – యాతి – పరాం – గతిమ్,

ప్రతి॥ హే కౌన్తేయ! = ఓ యర్జునా!, తమోద్వారైః = నరకద్వార భూతములైన, ఏతైః త్రిభిః = ఈ మూడు దుష్టగుణములచేత, విముక్తః నరః = విడువబడిన నరుడు, ఆత్మనః=తనకు, శ్రేయః =శ్రేయస్సునొనగూర్చెడుకర్మను ఆచరతి = చేసుకొనుచున్నాడు, తతః = అందువలన, పరాంగతిం = సర్వోత్కృష్టమైన గతిని (మోక్షమును), యాతి = పొందుచున్నాడు.

తా॥ ఓ యర్జునా ! నరకద్వారములైన యీ మూడు దుష్టగుణములచేత విడువబడిన యే నరుడు, తనకు శ్రేయస్సును గలుగజేసెడు దైవభక్తి, జీవకారుణ్యా, ధ్యానాదులను చేసికొనుచున్నాడో, వాడు అందువలన సర్వోత్కృష్టమైన మోక్షగతిని పొందుచున్నాడు.

వి॥ మకరిచే పట్టుబడిన గజేంద్రునివలె నీ దుష్టగుణములచే పట్టుబడిన వాడు సదా దుఃఖమును పొందవలసి యుండును. సర్వేశ్వర కృపచే మకరినుండి విడుదల పొందిన గజేంద్రుడు మోక్షమును పొందినట్లు దుష్టగుణములనుండి విమోచనము పొందినవాడు శ్రేష్ఠగతిని అనగా మోక్షమును పొందగలుగును.

శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ 23

పద॥ యః - శాస్త్రవిధిం - ఉత్సృజ్య - వర్తతే - కామకారతః,
న - సః - సిద్ధిం - అవాప్నోతి - న - సుఖం - న - పరాం - గతిమ్.

ప్రతి॥ యః = ఎవడు, శాస్త్రవిధిం = శాస్త్రోక్తవిధిని, అనగా నెవరేయే యనుష్ఠానములో నుంటున్నారో దానినసుసరించిన నియమమును, ఉత్సృజ్య = విడిచిపెట్టి, కామకారతః = ఇచ్ఛవచ్చినట్లు, వర్తతే = ప్రవర్తించుచున్నాడో, సః = వాడు, సిద్ధిం = అనుష్ఠానముచే పొందవలసిన సిద్ధిని, న అవాప్నోతి = పొందడు, సుఖం = జ్ఞానసుఖమును, న = పొందడు, పరాం గతిం = సర్వోత్తమమగు ముక్తిని, న = పొందడు.

తా॥ 'నీవు దీనిని చేయుము'ని చెప్పునట్టి విధివాక్యమును, 'నీవు దీనిని చేయకుము' అని చెప్పునట్టి ప్రతిషేధవాక్యమును అనగా వేదోక్తములగు విధిప్రతిషేధవాక్యములను అనాదరణచేసి విడిచిపెట్టి స్వేచ్ఛాప్రకార మెవడు నడుచుకొనుచున్నాడో, వానికి పురుషార్థ ప్రాప్తియోగ్యమగు తత్త్వజ్ఞానముగాని, ఇహలోక సౌఖ్యముగాని, స్వర్గముగాని, మోక్షముగాని యేదియును లభింపదు.

వి॥ శాస్త్రవిధియనగా నెవరెవరేయే యనుష్ఠానమునుగలిగియున్నారో, దానికి సంబంధించిన యాచరణయే కాని జాతిని, కులమును గుఱించినదని కొందఱు చెప్పెడు అర్థముగాదు, ఏ యౌషధమున కేయే పథ్యము అయుర్వేదములోవిధింప బడినదో, అట్టిపథ్యము ననుష్ఠింపవలెను, లేనిచో రోగము కుదరనట్లు, ఏదో యొక జపధ్యానమో లేక దేహసన్యాసము మాత్రమో చేసికొని దానికి తగిన యాచరణ లేనిచో, భవరోగవిముక్తిగలుగదు, ఔషధసేవనము పథ్యములతో గూడియున్న ప్పుడు కొంచము ప్రయాసముగనుండినను, తరువాత నారోగ్యసుఖమునెల్లప్పు డనుభవించవచ్చును. అట్లు నిగ్రహముచేయ నొల్లనివారు ఎల్లప్పుడు వ్యాధిచే బాధితులై, యావజ్జీవితమును దుఃఖముతో గడుపవలసి యుందురు. (1) ఇహ సుఖమనియు (2) పరలోకమందు స్వర్గసుఖమనియు, (3) ఉపాసనామూర్తుల బ్రహ్మాది లోకసుఖమనియు, (4) ఆత్మ సాక్షాత్కార జ్ఞానసుఖమనియును సుఖ ములు నాల్గు గలవు. అనుష్ఠానము లేనివాడు ఈ నాల్గింటిలో నొకదానినైనను పొంద జాలకపోవుటయే గాక, దుఃఖమునుగూడ పొందవలసియుండును. ఈ నాల్గవదే బ్రహ్మసుఖము.

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥ 24

పద॥ తస్మాత్ - శాస్త్రం - ప్రమాణం - తే - కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా - శాస్త్రవిధానోక్తం - కర్మ - కర్తుం - ఇహ - అర్హసి,

ప్రతి॥ తస్మాత్ = కాబట్టి. కార్యాకార్యవ్యవస్థితౌ = కార్యాకార్యముల నిర్ధారణ చేయుటయందు, తే = నీకు, శాస్త్రం = శాస్త్రము, ప్రమాణం = ప్రమాణ మగును, శాస్త్రవిధానోక్తం = శాస్త్రమునందు చెప్పబడినదానిని, జ్ఞాత్వా = ఎఱింగి ఇహ = ఈప్రపంచమునందు, కర్మ = కర్మను, కర్తుం = చేయు టకు, అర్హసి = తగుదువు,

తా॥ కార్యాకార్యముల నిర్ధారణ చేయుటయందు నీకుశాస్త్రము ప్రమాణము, శాస్త్రమునందు జెప్పబడిన దాని నెఱింగి యీ ప్రపంచ మునందు కర్మచేయుటకు అర్హుడవై యున్నావు.

వి॥ ఇది చేయుము, ఇది చేయకుమని శాసించున దగుటచేతనే దీనికిశాస్త్ర మని పేరువచ్చినది. రాజశాసనమందు ఇట్టి పరీక్షలో నుత్తీర్ణులైనవారికి ఉన్నతో ద్యోగమును, ప్రజల కిట్టిబాధలు కలుగజేయువారికి కారాగారదండనయు నెట్లు

విధింపబడి యున్నదో, ఆలాగు న నిట్టిపుణ్యకార్యముచే స్వర్గ ప్రాప్తియు, నిట్టి పాప కార్యముచే నరకప్రాప్తియు, నిట్టి విరక్తిమార్గముచే మోక్షమును, నిట్టి విషయ ప్రవృత్తిచే సంసార బంధమును శాస్త్రము విధించుచున్నది. ఆలాగున శాస్త్రవిధి ననుసరించి ప్రవర్తించు వారికట్టి యుత్తమలోక ప్రాప్తి గలుగును.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే దైవాసురసంపద్విభాగ యోగో నామ షోడశోఽధ్యాయః.

పద॥ ఇతి - శ్రీమద్భగవద్గీతాసు-ఉపనిషత్సు- బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే – దైవాసురసంపద్విభాగయోగః-నామ - షోడశః- అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇట్లు, ఉపనిషత్సు = ఉపనిషత్స్వరూపమును. బ్రహ్మవిద్యాయాం = బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రే = యోగశాస్త్రమున్ను, శ్రీకృష్ణార్జున సంవాదే = శ్రీకృష్ణార్జునసంవాదరూపము నగు, శ్రీమద్భగవద్గీతాసు = శ్రీ భగవద్గీతయందు, దైవాసురసంపద్విభాగయోగః నామ = దైవాసుర సంపద్విభాగయోగమని, ప్రసిద్ధిగలిగిన, షోడశః అధ్యాయః = పదు నారవ అధ్యాయము సంపూర్ణము,

తా॥ ఇట్లు ఉపనిషత్స్వరూపమును, బ్రహ్మవిద్యయు, యోగ శాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదరూపమును నగు శ్రీమద్భగవద్గీత యందు, దైవాసురసంపద్విభాగ యోగమను ప్రసిద్ధిగల పదునారవ అధ్యాయము సంపూర్ణము.

వి॥ దైవగుణములను, అసురగుణములను, విభజించి తెలిసికొని మఱియు దైవగుణములచే దైవసుఖము గలుగుననియు, అసురగుణములచే దుఃఖము గలుగు ననియు గుర్తెఱింగి దైవగుణముల నవలంబించుటవలన జ్ఞానము గలు గును, దానివలన పరమాత్మతో నైక్యము సంభవించును. దీనివలన నిదియును ఒక యోగమని చెప్పబడినది.

ఓమ్ తత్ సత్



ఓమ్

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## సప్తదశోఽధ్యాయః — సప్తదశాధ్యాయము

## శ్రద్ధాత్రయవిభాగయోగః — శ్రద్ధాత్రయవిభాగయోగము



ఈ యధ్యాయమునకు 'శ్రద్ధాత్రయవిభాగయోగమ'ని పేరు. ఇదియు సత్త్వరజస్తమస్సులనెడు మూడుగుణములనే బోధించుచున్నది. అయితే పదునాల్గవ అధ్యాయమున గుణత్రయమును గుఱించి యిదివరలో చెప్పబడియుండుటచే నిచ్చట ఆసత్త్వాది గుణములు కారణముగాగల శ్రద్ధ విశేషించి నిరూపింపబడినది. అందుచే ఈ అధ్యాయము శ్రద్ధాత్రయ విభాగయోగమని పేరుగ చెప్పబడినది. ఇచ్చట సాత్త్వికశ్రద్ధ. రాజసశ్రద్ధ తామసశ్రద్ధ యని శ్రద్ధ మూడువిధములుగా విభజింపబడినదని గ్రహించవలెను. రాజస తామస స్వభావములను విడిచి సత్త్వగుణస్వభావము నవలంభించువాడు, అంతఃకరణశుద్ధిగలవాడై తద్ద్వారా గుణత్రయాతీతమగు ఆత్మను పొందుటవలన ఆత్మపరమాత్మల కైక్యము సిద్ధించును. అందువలననే యోగమని చెప్పడమైనది. అట్లే యీ శ్రద్ధాత్రయమును తెలిసికొని సాత్త్విక శ్రద్ధగలవాడగుచో 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' అన్న రీతి అట్టి సాత్త్విక శ్రద్ధచే జ్ఞానముగలిగి, ఆజ్ఞానముచే జీవబ్రహ్మైక్యరూపమగు యోగము సిద్ధించును. అందుచే దీనికిగూడా యోగమని నామకరణము చేయబడినది.

**అర్జున ఉవాచ:—** అర్జునుడు చెప్పెను.

శ్లో॥ యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వమాహో రజస్తమః ॥ 1

పద॥ యే - శాస్త్రవిధిం - ఉత్సృజ్య - యజన్తే - శ్రద్ధయా - అన్వితాః, .
తేషాం - నిష్ఠా - తు - కా - కృష్ణ! - సత్త్వం - ఆహో—రజః - తమః

ప్రతి॥ హే కృష్ణ! = ఓ కృష్ణమూర్తీ!, యే = ఎవడు, శాస్త్రవిధిం = శాస్త్రోక్త విధానమును, ఉత్సృజ్య = విడిచిపెట్టి, శ్రద్ధయా అన్వితాః = భక్తిశ్రద్ధలతో గూడుకొన్నవారై, యజన్తే = దైవారాధన ధ్యానాదులు చేయుచుందురో, తేషాం= అట్టివారలయొక్క, నిష్ఠా తు = ప్రవృత్తియన్ననో,

కా = ఎట్టిది?, సత్త్వం = సాత్త్వికమా? ఆహో రజః = లేక రాజసమా?, తమః = లేక తామసమా?.

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ! ఎవరు శాస్త్రోక్తవిధానము నవలంభింపకపోయినను (విడిచిపెట్టి) భక్తి శ్రద్ధలతో కూడుకొన్నవారై దేవతారాధనాది కృత్యంబుల జేయుదురో, అట్టివారలయొక్క ప్రవృత్తి యెటువంటిది? సాత్త్వికమా? లేక రాజసమా? లేక తామసమా?

వి॥ ఇచ్చట శాస్త్రవిధి తెలియని యుత్తమజీవుల స్వభావమగు శ్రద్ధగలిగి చేయు అనుష్ఠానములను గుఱించి యడగడమైనది. శాస్త్రవిధి నెఱింగినవాడయ్యు శ్రద్ధలేనిచో వానిగతి యేమి? శాస్త్రము తెలియక భక్తిశ్రద్ధలతో దైవారాధనానుష్ఠానములు చేయువాని గతియేమి? వీరుభయులలో నెవరు శ్రేష్ఠులు? ఈ విషయమై యీ ప్రశ్న ప్రారంభించడమైనది.

శ్రీ భగవానువాచ:— శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥ 2

పద॥ త్రివిధా - భవతి - శ్రద్ధా - దేహినాం - సా - స్వభావజా,
సాత్త్వికీ - రాజసీ - చ - ఏవ - తామసీ - చ - ఇతి - తాం - శృణు.

ప్రతి॥ శ్రద్ధా = శ్రద్ధయనునది, దేహినాం = దేహధారులయొక్క, స్వభావజా = జన్మాంతర స్వభావమువలన పుట్టినది గనుక, సా = ఆశ్రద్ధ, సాత్త్వికీ = సాత్త్విక శ్రద్ధయనియు, రాజసీ చ ఏవ = రాజస శ్రద్ధయనియు, తామసీ చ ఇతి = తామస శ్రద్ధయనియు, త్రివిధా = మూడు విధములుగలదిగా, భవతి = అగుచున్నది, తాం = దానిని, శృణు = వినుము.

తా॥ ప్రాణులకు పూర్వజన్మసంస్కారజనితమగు శ్రద్ధ సాత్త్వికము, రాజసము, తామసము, అని మూడు విధములుగా నున్నది. దానిని వివరించి చెప్పెదను వినుము.

వి॥ అర్జునుడడిగిన మొదటిప్రశ్నకు సమాధానము చెప్పకయే భగవంతుడు శ్రద్ధను మూడు విధములుగా విభజించి చెప్పుచున్నాడు. శాస్త్రవిధిని తెలియకపోయినను ఉత్తమ శ్రద్ధాభక్తిగలిగి యనుష్ఠించువాడే శ్రేష్ఠుడని భగవన్మతము, ఉత్తమశ్రద్ధాభక్తులిప్పుడు శాస్త్రములు చదువుటచే వచ్చునవిగావు, అవి జన్మాంతర పుణ్యసంస్కారముచే గలుగవలసియుండును. అట్టి శుద్ధసంస్కారము

గలవాడగుటచేతనే అట్టి భక్తిశ్రద్ధలు గలవాడగుచున్నాడు. అయితే జన్మాంతరములో శాస్త్రవిధి నెఱింగి అనుష్ఠించి వచ్చినందుచేతనే, ఇప్పుడు శాస్త్రమును చదువకపోయినను, ఆ సంస్కారము వానిని మంచి స్థితిలోనికి తెచ్చినది. భగవంతుడు శ్రద్ధ మూడు విధములుగా గలదని చెప్పబూనినాడు. దీనివల్ల ప్రతి ఒకరు తాను సాత్త్వికుడా? రాజసుడా? తామసుడా? అని తెలిసికొనవలెను. ఈ సత్యమును తెలిసికొనకయే కొందఱు శాస్త్రము చదువుకొననివారికి మోక్షము గలుగదా? అని ప్రశ్నింతురు. శాస్త్రము చదువపనిలేదుగాని. శాస్త్రములోని ఆచరణమాత్రము గలిగియుండినచాలును. అది జన్మాంతర పుణ్యవిశేషముచేతనే గలుగును. అట్లు శుద్ధసంస్కారము గలిగి శుద్ధాచరణము లేనివారు శాస్త్రములో చెప్పినట్లు శాస్త్రమును చూచిగాని ఎవరిచేతనైన శ్రవణముచేసిగాని యాచరించవలసి యుందురు. ఆచరణను ఎక్కువగా శ్లాఘించడమైనది.

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత!
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః ॥ 3

పద॥ సత్త్వానురూపా - సర్వస్య - శ్రద్ధా - భవతి - భారత!
శ్రద్ధామయః - అయం - పురుషః - యః - యచ్ఛ్రద్ధః - సః - ఏవ - సః.

ప్రతి॥ హేభారత = ఓ యర్జునా! సర్వస్య = సమస్త ప్రాణులకు, శ్రద్ధా=శ్రద్ధ యనునది, సత్త్వానురూపా = వారి వారి పూర్వజన్మాంతఃకరణ సంస్కారము ననుసరించి, భవతి = కలుగుచున్నది. (కాబట్టి) శ్రద్ధామయః = శ్రద్ధతో గూడిన, అయం = ఈ, పురుషః = పురుషుడు, యః = ఎవడు, యచ్ఛ్రద్ధః = ఎట్టి శ్రద్ధగలవాడో, సః = వాడు సః ఏవ = అట్టి సత్త్వము గలవాడే యగుచున్నాడు.

తా॥ సకలప్రాణులకు నంతఃకరణానురూపమగు శ్రద్ధగలుగుచున్నది. జీవుడు శ్రద్ధాస్వరూపుడగుచు, నెవ్వడేయేగుణోత్కర్షముతో నున్నాడో, ఆ యా గుణానుగుణమగు శ్రద్ధ గల వాడగుచున్నాడు.

వి॥ ఒకడు తినెడు ఆహారము, చెప్పెడు మాటను, చేయుపనిని చూచినచో వీడు సాత్త్వికుడా? రాజసుడా? తామసుడా? యని తెలిసికొనవచ్చును. వాని యొక్క యంతఃకరణ మేయేగుణముల గలిగియుండునో వాడాలాగున ప్రవర్తింపగలుగును. ఈ మూడు గుణములలో నేగుణముతో గూడియుండినవాడైనను. ఆ గుణము ననుసరించి ప్రవర్తింపుట సత్యమనియు, ధర్మమనియు నతనికితోచేలాగునచేయు మూల ప్రకృతి యను మాయ యొకటిగలదు. దానిమహిమను

సామాన్యులు తెలిసికొనజాలరు. కావుననే అట్టివారు బహ్మనిష్ఠుల దగ్గరనుండిన మాత్రమే బాగుపడగలరు. తన కన్నులచేత సమస్త ప్రపంచమును జూడ గలుగునుగాని యీ యన్నిటిని చూచుకన్ను, తన్ను తాజూడజాలదు.ఇదియే ప్రకృతి యొక్క వైచిత్ర్యము.

శ్లో॥ యజన్తే సాత్త్వికా దేవా న్యక్షరక్షాంసి రాజసాః ।
ప్రేతాన్భూత గణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః ॥ 4

పద॥ యజన్తే - సాత్త్వికాః - దేవాన్ - యక్షరక్షాంసి - రాజసాః,
ప్రేతాన్ - భూతగణాన్ - చ - అన్యే - యజన్తే - తామసాః - జనాః.

ప్రతి॥ సాత్త్వికాః = సత్త్వగుణప్రధానులు, దేవాన్ = దేవతలను, యజన్తే = ఆరాధింపుదురు, రాజసాః = రజోగుణప్రధానులు, యక్షరక్షాంసి = యక్ష రాక్షసుల నారాధించుదురు. అన్యే = తక్కినవారలగు, తామసాః జనాః = తమోగుణప్రధానులగు జనులు, ప్రేతాన్ = ప్రేతములను, భూత గణాన్ చ = భూతగణములను యజన్తే = ఆరాధింతురు.

తా॥ సత్త్వగుణ స్వభావము గలవారు దేవతల నారాధించుదురు. రజోగుణస్వభావము గలవారు యక్షరాక్షసుల నారాధింతురు. తక్కినవారగు తమోగుణస్వభావముగల జనులు ప్రేతములను భూత గణములను ఆరాధింతురు.

శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః ।
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః ॥ 5

శ్లో॥ కర్శయన్తశ్శరీరస్థం భూతగ్రామమచేతసః ।
మాం చైవాంతశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్ ॥ 6

పద॥ అశాస్త్రవిహితం - ఘోరం - తప్యన్తే - యే - తపః - జనాః,
దంభాహంకారసంయుక్తాః - కామరాగబలాన్వితాః,
కర్శయంతః - శరీరస్థం - భూతగ్రామం - అచేతసః
మాం - చ - ఏవ - అంతశ్శరీరస్థం - తాన్ - విద్ధి - అసురనిశ్చయాన్

ప్రతి॥ యే జనాః = ఏజనులు, దంభాహంకారసంయుక్తాః = దంభాహంకారములతో గూడినవారును, కామరాగబలాన్వితాః = కామరాగములతో గూడినవారునునై, అశాస్త్రవిహితం = శాస్త్రసమ్మతము కానిదియు, ఘోరం =

తమకు నితరులకును బాధాకరమైనట్టిదియునగు, తపః = తపస్సును, తప్యంతే = చేయుచున్నారో, అచేతసః = అట్టి యాత్మ శుద్ధి లేని వారు, శరీరస్థం = తమ శరీరములయందుండు నట్టి, భూతగ్రామం = ఇంద్రియ సమూహములను, అంతశ్శరీరస్థం = తమసూక్ష్మ శరీరములయందుండునట్టి,జీవచైతన్యమైయుండునట్టి,మాం చ = నన్నును, కర్శయంతః = కృశింపచేయువారగుచున్నారు. తాన్ = అట్టి వారలను, ఆసురనిశ్చయాన్ = అసురగుణముగలవారినిగా, విద్ధి = ఎఱుంగుము.

తా॥ ఏ జనులు దంభాహంకారములతో గూడినవారును, కామ రాగ బలముతో గూడినవారునై, శాస్త్రసమ్మతము గానిదియు, తనకు నితరులకును బాధాకరమైనట్టిదియు నగు తపస్సును చేయుచున్నారో, అట్టి యవివేకులు తమ శరీరములయం దుండునట్టి యింద్రియ సమూహమును, తమ సూక్ష్మశరీరములయందుండునట్టి నన్నును కృశింపచేయువారగుచున్నారు. అట్టివారల నసురగుణము గలవారినిగా నెఱుంగుము. 'కర్షయంతః' అని పాఠాంతరము.

వి॥ శరీరేంద్రియములను పాడుచేసికొని యాత్మను దుఃఖపెట్టెడు తపస్సు మంచిదిగాదు. అది రాక్షసు లిష్టసిద్ధికొఱకు చేసెడు క్రూరతపస్సు వంటిది. దేహేంద్రియములకు బాధలేనిదియు, ఆకలి దప్పికలచే బాధ యాత్మకు గలుగ నిదియు నగు జ్ఞానపరమగు తపస్సే సాత్త్వికతపస్సనబడును. దీనివలననే యీశ్వరానుగ్రహము జ్ఞానమును గలుగును. రావణాదిరాక్షసులు లోకవినాశకరమగు సిద్ధికొఱకే యట్టి ఘోరమగు తపస్సు జేసిరి. అలాటిది జేయకూడదు. అయితేసుకుమారులై యుండవలెనని యర్థముకాదు.ఆత్మపీడగలుగని యేయాహారమైన భుజించి పరమాత్మధ్యానమొనర్చ వచ్చును. తపశ్శబ్దమునకు "అంతఃకరణములోగల దోషములను భస్మమొనర్చుటయే" అర్థమగును. ఇది జ్ఞానవిచారణము చేతను, ధ్యానబలముచేతను గలుగవలెను. శరీరమానసేంద్రియాదులకు చక్కని బలములేనిచో తీవ్రధ్యానముచే నింద్రియాతీత జ్ఞానమును పొందజాలరు, దేహేంద్రియములకును, మనస్సునకును దౌర్బల్యము గలిగి ధ్యానాదులు చేయుటకు శక్తిలేనివారి తపస్సు తమస్సే యగును. వీరు నొక విధమగు రోగులవలె నుండేవారగుదురు. లోకమును భ్రమింపచేయు తలంపుతో చేయు తపస్సు ఆత్మ వంచకమగును. ఇట్టి వారి జీవితము వ్యర్థమై పోవునని మరువకూడదు.

శ్లో॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు॥ 7

పద॥ ఆహారః — తు — అపి - సర్వస్య — త్రివిధః — భవతి — ప్రియః,
యజ్ఞః — తపః- తథా — దానం — తేషాం — భేదం — ఇమం — శృణు.

ప్రతి॥ సర్వస్య = సమస్త ప్రాణులకును, ఆహారః తు = ఆహారమును, త్రివిధః= మూడు విధములు, ప్రియః = ఇష్టమైనది, భవతి = అగుచున్నది, తథా= ఆలాగుననే, యజ్ఞః = యజ్ఞము, తపః = తపస్సు, దానం అపి = దానమును మూడు విధములుగలది యగుచున్నది, తేషాం = ఆ యాహారాదుల యొక్క, ఇమం = ఈ, భేదం = భేదమును, శృణు = వినుము.

తా॥ జనులందఱికి శ్రద్ధ యెట్లు మూడు విధములుగా నున్నదని చెప్పితినో, యట్లే ఆహారము, యజ్ఞము, తపస్సు, దానమను నవియును సాత్త్వికము, రాజసము, తామసము అను భేదములు గలిగియున్నవి. వానియొక్క భేదములను చెప్పెదను వినుము.

వి॥ సాత్త్వికాహారము సత్త్వగుణమును వృద్ధినొందించుటకు ముఖ్యకారణ మగును. సత్త్వశుద్ధిచేతనే చిత్తశుద్ధి కలుగును. చిత్త శుద్ధిచేత నాత్మజ్ఞాన ప్రాప్తి లభించును.

శ్లో॥ ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః।
రస్యాస్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః॥ 8

పద॥ ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యాః - స్నిగ్ధాః - స్థిరాః - హృద్యాః - ఆహారాః - సాత్త్వికప్రియాః.

ప్రతి॥ ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః = ఆయుస్సును మనోబలమును, దేహబలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రీతిని వృద్ధి పొందించునవియు, రస్యాః = రసవంతములైనవియు, స్నిగ్ధాః = చమురు గలవియు, స్థిరాః = అధిక కాలము శరీరములో స్థిరముగా నిలుచునవియు,హృద్యాః = మనోహరము లైనవియునగు, ఆహారాః = ఆహారపదార్థములు, సాత్త్వికప్రియాః = సత్త్వగుణ ప్రధానులకు ప్రియములై యుండును.

తా॥ ఆయుర్వృద్ధి నిచ్చునవియు, మనస్సునకును, దేహమునకును బలము గలుగజేయునవియు, దేహమున కారోగ్యమును గలుగ

జేయునవియు, నట్టి యారోగ్యము దేహమునకు, మనస్సునకు గలు గుటవలన నా దేహమునకు, సుఖమును, మనస్సునకు ప్రియమును వృద్ధి నొందింప జేయునవియును, రసవంతములైనవియు, చమురు గలిగి కమ్మగా నుండునవియు, భుజించెడువారి దేహములయందు చిరకాలమువఱకుండి సత్తువ నిచ్చునవియు, మనోహరములై యుండునట్టివియు నగు పదార్థములు సాత్త్వికులకు ప్రీతి గలిగించు నవిగా నుండును.

శ్లో॥ కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః ।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకాఽమయప్రదాః । 9

పద॥ కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారాః - రాజసస్య - ఇష్టాః - దుఃఖశోకాఽమయప్రదాః.

ప్రతి॥ కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః = చేదు పులుపు ఉప్పు కారము గలిగి యత్యుష్ణముగను సారములేకను విదాహకముగ నుండునట్టియు, దుఃఖశోఽకామయప్రదాః = దేహకష్టమును మనోదుఃఖమును జాడ్యమును గలుగజేయునవియునైన, ఆహారాః=ఆహారపదార్థములు, రాజసస్య =రజోగుణముగలవారికి, ఇష్టాః = ప్రియములై యుండును.

తా॥ చేదుగను, పుల్లగను, ఉప్పగను. కారముగ నుండు నట్టియు, నుష్ణముగ నుండునట్టియు, సారము లేనివియు, దాహ మును గలుగజేయునవియు, దేహమునకు కష్టమును, మనస్సునకు క్లేశమును గలుగ జేయునవియు, ననారోగ్యకరములు నగు పదార్థ ములు రజోగుణము గలవారికి ప్రీతి పాత్రములగును.

వి॥ దీనియందు 'అత్యుష్ణ' అని అతిశబ్దము ప్రయోగించి యుండుటచే అతిశబ్దము నన్నిటిలోను చేర్చుకొనవలెను. అప్పుడధికమైన చేదు, అధికమైన పులుపు, అధికమైన ఉప్పు, అధికమైన వేడిమి, అధికమైనకారము, అధికమైన సారము లేనిది. అధికమైనదాహమును గలిగించునవియు నగు ఆహారములు పనికిరావని గ్రహించవలెను. అయితే కొంచెము కొంచెముగా నుప్పు పులుపు కారముండవచ్చును. ఉష్ణప్రదేశమగు నీ దక్షిణదేశములో కొంచెము పులుపు కొంచముప్పుండుట మంచిది. ఈ స్వల్పదోషము నీ దేశపు వేడిలో లీనమై పోవును. అప్పుడు సమశీతోష్ణస్థితిలో శరీరముండును.

శ్లో॥ యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ 10

పద॥ యాతయామం - గతరసం - పూతి - పర్యుషితం - చ - యత్,
ఉచ్ఛిష్టం - అపి - చ - అమేధ్యం - భోజనం - తామసప్రియమ్.

ప్రతి॥ యత్ = ఏది, యాతయామం = చల్లారిపోయినదియు, గతరసం - రస హీనమైనదియు అనగా సారము తీసిన పిప్పి మొదలైనవియు, పూతి = దుర్వాసన పుట్టినదియు, పర్యుషితం చ = చలిదియు, ఉచ్ఛిష్టం అపి = ఒకరు భుజించిపారవేసినదియు, అమేధ్యం చ = పూజార్హము కానిదియు నగు; భోజనం = ఆహారపదార్థము, తామసప్రియం = తమోగుణ స్వభావముకలవారి కిష్టమైనది.

తా॥ చల్లారిపోయినదియు, రసము తీసినదియు, దుర్గంధము గలదియు, ఒకరోజు క్రిందట వండబడినదియు, ఒకరు తినగా మిగిలి పారవేసినదియు, పూజార్హము కానిదియు నయిన యాహారము తమో గుణ స్వభావము గలవారి కిష్టమైయుండును. ఎక్కువ వేడిగలది రజో గుణస్థులకును, ఎక్కువ చల్లబడినది తమోగుణము గలవారికిని ప్రియమై యుండును.

వి॥ వండిన తరువాత నొక్కయామము గడచినదియు, ముందు దినము వండినదియు కూడదని చెప్పుటలో నీటిలోనుడకబెట్టిన యన్నము పరమాన్నము మొదలగు వానికిది చెందునేగాని నూనెలో వేయించిన చెడని పదార్థములకు సంబంధించదు. అదియు గబ్బు(దుర్గంధము) తో గూడినది కాగూడదు. ఉచ్ఛిష్ట శబ్దము ఒకరు తిని పార వేసినదానికి సంబంధించినదేగాని, భగవత్ప్రసాదము నకు వర్తించదు. భగవదుచ్ఛిష్టప్రసాదము భక్తుల కెటువంటిదో (యెంతపవిత్ర మైనదో), అలాగున బ్రహ్మనిష్ఠులగు గురువుల యుచ్ఛిష్టము శిష్యులకు, భర్తృచ్ఛిష్టము పతివ్రతలకు నంతపవిత్రమైనది. అదివారికి భగవత్ప్రసాదము వంటిదగును. భర్తృచ్ఛిష్టము భార్యకును దోషకరముగాదు, సాధారణముగా తిని మిగిలినదాని నెచ్చటనో పారవేసియుండిన దానిని తీసి తినే వారికే యీ యుచ్ఛిష్టశబ్దము వర్తించును. ప్రకృతిలో సూదంటురాయి యినుము మొదలగు లోహముల నాకర్షించునే కాని కఱ్ఱ అద్దము మొదలగువాటి నాకర్షింపదు. అదే రీతిగా నొక్కొక్కసారి శారీరక మానసికతత్త్వమే గుణముతో గూడియుండునో

తదను గుణమైన దానియందపేక్ష గలుగును. శుద్ధాత్ముడైన వానికి అశుద్ధాహారము తినిన నేలాగున వికర్షణ (అనగా వమనము) గలుగుచుండునో, ఆలాగున సత్త్వగుణము గలవారికి రజోగుణ తమోగుణాహారములు వికర్షణములై (అనగా అప్రీతిగలవై) యుండును. ఇది యాహారము ఒక్కదానికి మాత్రమే గాదు. సంసర్గము, వస్త్రధారణ, నివాసస్థలము మొదలగువాటి కన్నిటికిని వర్తించును. ఆహారవిషయము సామాన్యమని తలంచరాదు. మనము భుజించెడు ఆహారములోగల సారము రసమై, రక్తమై, మాంసమై, మేధస్సు మొదలగు సప్తధాతువులుగా బరిణమించును. దానియొక్క సూక్ష్మాంశము మనస్సు, బుద్ధి చిత్తము, అహంకారముగా మారును. కావున మనశ్శాంతి, మనోనిర్మలత కారుణ్యహృదయము, వైరాగ్యాంతఃకరణము గలుగవలసి యుండిన ఆహార మందు జాగ్రత్తపడవలెను. "ఆత్మనియమనము కావలయునా? ఆహార నియమము నవలంబించవలెను." అని చెప్పుటకు కారణమిదియే.

శ్లో॥ అన్నం పుంసాఽశితం త్రేధా జాయతే జఠరాగ్నినా ॥
మలం స్థవిష్ఠో భాగస్స్యాత్ మధ్యమోమాంసతాం వ్రజేత్॥
మనః కనిష్ఠో భాగస్స్యాత్తస్మాదన్నమయం మనః ॥

అని సుశ్రుతము. దీని యర్థము పైనుదహరించినదే

"అన్నదోషేణ చిత్తస్య కాలుష్యం సర్వదా భవేత్,
కలుషీకృత చిత్తానాం ధర్మస్సమ్యక్ న భాసతే॥"

అన్నదోషముచేత మనస్సు కల్మషము నొందును కలుషీకృతమైన చిత్తమునందు ధర్మరహస్యము ప్రకాశింపదు. మలినపునీళ్ళుగలపాత్రలో సూర్యబింబము ప్రతి ఫలింపనట్లు మాలిన్య హృదయములో దైవసాక్షాత్కారజ్ఞాన ముదయించదు. మఱియు

"దేవానామమృత న్నాణామృషీణాం చాన్న మోషధీః ।
దైత్యరక్షః పిశాచాదేర్రక్త, మద్యామిషాది చ॥"

బ్రహ్మదేవుడు సృష్టిలోదేవతల కమృతమును, మానవులకును ఋషులకును అన్నము సస్యములు అనగా ఫలమూలములును, దైత్య రాక్షస పిశాచాదులకు మద్యము, మాంసము, రక్తము మొదలైనవి యాహారములుగా నిర్మించెను. పశువులకు తృణపత్రములను సృష్టించెను, మద్యమాంసములను భజించువారేజాతిలో చేరినవారుగా నున్నారో, వారి యాహారమువల్ల తెలిసికొనవచ్చును. మఱియు నాహారవిషయములో (1) వస్తుశుద్ధి. (2) పాత్రశుద్ధి, (3) వాహకశుద్ధి

(అనగా వండువాడు గాని, వడ్డించువాడు గాని, తెచ్చువాడుగాని) శుభ్రత గలిగి యుండవలయును, వస్తువున్ను శుద్ధముగా నుండవలెను, పాత్రము శుద్ధముగా నుండవలెను. వస్తుశుద్ధిలో నిట్టి భేదము గలదు, వస్తువు మాత్రము మంచిదిగా నుండిన చాలదు. అది యెటువంటిడబ్బుచేత లేక యే విధముగవచ్చినదో. యామార్గము శుద్ధముగా నుండవలెను. అనగా పాపపు సొమ్ముచేగాని, పాపపు వృత్తిచేతగాని వచ్చిన వస్తువు మంచిదైనను అదిపాపాహారమే యగును, అలాగున నితరులచే దేహకష్టముచేయించి వారికి సరియైన ప్రతిఫలము నివ్వక భుజించెడు అన్నము పాపాన్నమే యగును. ఇట్టిపాపాన్నమును భుజించు వారి మనస్సు నిర్మలముగా నుండదు. శాంతి, దయ, విరక్తులు వీరికి గలుగవు, మఱియు వంశోద్ధారకులును, ధర్మాత్ములును, దేవ వేద మాతాపితరులయందు విశ్వాసముగల సంతానము గలుగవలసియుండిన, పుత్రోత్పత్తికి హేతువగు శుక్లశోణితము లేయన్నపానీయములచే స్త్రీపురుషులకు నేర్పడునో అట్టి యన్నము శుద్ధముగా నుండవలెను. అన్నము శుద్ధముగా నుండిన మాత్రమే యుత్తమ సంతతి గలుగును. లేనిచో దుష్టగుణముగల బిడ్డలే పుట్టుదురు. దీనిని గూడ జ్ఞాపకము చేసికొనవలెను.

శ్లో॥ అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ ససాత్త్వికః ॥ 11

పద॥ అఫలాకాంక్షిభిః - యజ్ఞః - విధిదృష్టః - యః - ఇజ్యతే
యష్టవ్యం - ఏవ - ఇతి - మనః - సమాధాయ - సః - సాత్త్వికః.

ప్రతి॥ విధిదృష్టః = శాస్త్రోక్తమగు, యః యజ్ఞః = ఏ యజ్ఞము, యష్టవ్యం ఏవ = చేయబడదగినదియే, ఇతి = అని. మనః = మనస్సును, సమాధాయ = ధర్మ బుద్ధియందు సమాధానపఱచి, అఫలాకాంక్షిభిః = ఫలాపేక్షలేని వారిచే, ఇజ్యతే = చేయబడుచున్నదో, సః = ఆ యజ్ఞము, సాత్త్వికః = సాత్త్వికమైనది.

తా॥ శాస్త్రోక్తమగు నే యజ్ఞము చేయదగినదియే యని మనస్సును ధర్మబుద్ధితో సమాధానపఱచి ఫలాపేక్ష లేనివారిచేత చేయబడుచున్నదో, ఆ యజ్ఞము సాత్త్వికమైనది.

వి॥ ఇచట పశుహింసతోకూడిన యజ్ఞమని గ్రహించకూడదు. దైవారాధన, పరప్రాణుల కుపకారము. ఆత్మధ్యానము మొదలగు పంచయజ్ఞములని గ్రహించదగినది,

శ్లో॥ అభిసంధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ 12

పద॥ అభిసంధాయ - తు - ఫలం - దమ్భార్థం - అపి - చ - ఏవ - యత్,
ఇజ్యతే - భరతశ్రేష్ఠ! - తం - యజ్ఞం - విద్ధి - రాజసమ్.

ప్రతి॥ హే భరతశ్రేష్ఠ ! = భరతకులశ్రేష్ఠుడవగు ఓ యర్జునా!, యత్ = ఏ యజ్ఞము, ఫలం అభిసంధాయ తు = ఫలము నుద్దేశించియయినను, దమ్భార్థం అపి చ ఏవ = కేవలడాంబికముకొరకైనను, ఇజ్యతే = చేయ బడుచున్నదో, తం = దానిని, రాజసం యజ్ఞం = రజోగుణాత్మకయజ్ఞము నుగా, విద్ధి = ఎఱుంగుము,

తా॥ భరతకులశ్రేష్ఠా ! ఓ యర్జునా ! ఫలాభిలాషతోడను, తన్నందఱు గొప్పవానినిగా నెంచవలయునను, డంబముతోడను ననుష్ఠింపబడు యజ్ఞము రాజసయజ్ఞ మనబడును,

శ్లో॥ విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్ ।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ 13

పద॥ విధిహీనం - అసృష్టాన్నం - మన్త్రహీనం - అదక్షిణం,
శ్రద్ధావిరహితం - యజ్ఞం - తామసం - పరిచక్షతే

ప్రతి॥ విధిహీనం = విధ్యుక్తము కానిదియు, అసృష్టాన్నం = అన్నప్రదానము లేనిదియు, మన్త్రహీనం = శ్రద్ధాభక్తులతో మన్త్రోచ్చారణ చేయబడని దియు, అదక్షిణం = దక్షిణ నివ్వనిదియు, శ్రద్ధావిరహితం = భక్తిశ్రద్ధ లతో జేయబడనిదియునగు, యజ్ఞం = యజ్ఞము, తామసం = తామస యజ్ఞమని, పరిచక్షతే = చెప్పుదురు.

తా॥ విధ్యుక్తము కానిదియు, అన్నప్రదానము లేనిదియు, శ్రద్ధాభక్తులతో మన్త్రోచ్చారణ చేయబడనిదియు, దక్షిణ నివ్వనిదియు భక్తిశ్రద్ధలతో చేయబడనిదియు నగు యజ్ఞము తామసయజ్ఞమగును.

వి॥ దైవపూజ, అతిథిసత్కారదానాదులతో యజ్ఞములు భక్తిశ్రద్ధలతో జేయనిచో కళాయిలేనిపాత్రలో వండిన పులుసువలెను, చవిటి భూమిలో చేసిన కృషివలె వ్యర్థమైపోవును,

శ్లో॥ దేవద్విజగురు ప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్ ।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ 14

పద॥ దేవద్విజగురుప్రాజ్ఞపూజనం - శౌచం - ఆర్జవం,
బ్రహ్మచర్యం - అహింసా - చ - శారీరం - తపః - ఉచ్యతే.

ప్రతి॥ దేవద్విజగురుప్రాజ్ఞపూజనం = దేవతలు, బ్రహ్మనిష్ఠులు, గురువులు, పెద్దలు వీరిని పూజించుటయు (సత్కరించుటయు), శౌచం = బాహ్యాభ్యంతర శుద్ధియు, ఆర్జవం= మనోవాక్కాయముల నేకరీతిగా ప్రవర్తింపజేయుటయు, బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యవ్రతమును పాలించుటయు, అహింసా చ = హింస చేయకుండుటయు, శారీరం తపః = శరీరమునకు సంబంధించిన తపస్సని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ శివ విష్ణ్వాది దేవతలను, బ్రహ్మనిష్ఠులను, గురువులను, జ్ఞానులను పూజించుటయు, సత్కరించుటయు, మృజ్జలములచేత శరీరశుద్ధియు, సత్యదయాదులచే హృదయశుద్ధియు, సన్మార్గప్రవర్తనయు, బ్రహ్మచర్యవ్రతము, జీవహింస చేయకుండుటయును శరీరముచే చేయతగిన తపస్సని ఋషులు చెప్పుచున్నారు.

వి॥ బ్రహ్మచర్యవ్రతమును గుఱించి అ. 6, శ్లో॥ 14 లో చూడదగినది. మఱియు—

"బహ్మచర్యవ్రతం సారం వ్రతానాముత్తమం వ్రతమ్ ।
బ్రహ్మచర్యం తపస్సారం బ్రహ్మచర్యం మహత్ఫలమ్॥
"క్రియాసు సకలాస్వేవ బ్రహ్మచర్యం వివర్ధయేత్ ।
బ్రహ్మచర్య ప్రభావేన తప ఉగ్రం ప్రవర్తతే ॥"
"బ్రహ్మచర్యాత్పరం నాస్తి ధర్మసాధనముత్తమమ్ ।
మహావ్రతమిదం లోకే తన్నిబోధ సదా ద్విజ ! ॥"

తా॥ సారములన్నిటిలోను బ్రహ్మచర్యవ్రతమే మిక్కిలి సారమైనది. వ్రతము లన్నిటిలో నీ బ్రహ్మచర్యవ్రతముత్తమము. బ్రహ్మచర్యము, తపస్సుయొక్క సారమగును. బ్రహ్మచర్యము మహత్తైన ఫలమును గలుగజేయునది.

తా॥ ప్రతిసాధనలోను. వ్రతములలోను,బ్రహ్మచరవ్రతమును వృద్ధిపరచవలెను. బ్రహ్మచర్యవ్రత ప్రభావముచేతనే ఉగ్రమైన తపస్సు చేయుటకు సాధ్యమగును.

తా॥ బ్రహ్మచర్యమునకన్న నుత్తమమైన ధర్మసాధనము ముల్లోకములందును మఱియొక్కటిలేదు. లోకములో దీనిని మహావ్రతమని తెలియవలెను. ఇది పురుషుల కెట్టిదో, స్త్రీలకు నట్టిదే యని గ్రహించవలయును.

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥ 15

పద॥ అనుద్వేగకరం - వాక్యం - సత్యం - ప్రియహితం - చ -యత్.
స్వాధ్యాయాభ్యసనం - చ - ఏవ - వాఙ్మయం - తపః - ఉచ్యతే.

ప్రతి॥ అనుద్వేగకరం = పరుల మనస్సును నొప్పించనిదియు. సత్యం = నిజమైనదియు, ప్రియహితం చ = ప్రియముగ హితముగ నుండునట్టిదియు, వాక్యం యత్ = వాక్యమేదిగలదో అట్టివాక్యము, స్వాధ్యాయాభ్యసనంచ ఏవ =వేదమును, ఉపనిషత్తులను. భగవద్గీతను పఠించుట ప్రణవాదిమంత్రములను జపించుటయు, వాఙ్మయం తపః = వాచిక తపస్సని ఉచ్యతే = వేదములచే చెప్పబడుచున్నది.

తా॥ ప్రాణులకు దుఃఖమును లేక భయమును గలుగచేయనిదియు, సత్యమును, వినువారికి ప్రియమైనదియు, హితమైనదియు నగు వాక్యము నుచ్ఛరించుట, వేదములను, ఉపనిషత్తులను, భగవద్గీతను పఠించుట, ప్రణవాది మంత్రములను జపించుటయు. వాక్కుచేత చేయదగిన తపస్సని వేదములచే చెప్పబడుచున్నది.

వి॥ "వేదాంత శత రుద్రీయ ప్రణవాది జపం బుధాః।
సత్త్వశుద్ధికరం పుంసాం స్వాధ్యాయం పరిచక్షతే॥"

తా॥ ఉపనిషదాది వేదాన్త గంథములను శతరుద్రీ యాత్మక - వేదములను, భగవద్గీతను పఠించుట ప్రణవాది మంత్రములను జపించుట స్వాధ్యాయమనబడును, ఇట్టి స్వాధ్యాయముచే నంతఃకరణ పారిశుద్ధ్యమేర్పడునని విద్వాంసులు జెప్పుచున్నారు.

శ్లో॥ మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే ॥ 16

పద॥ మనఃప్రసాదః - సౌమ్యత్వం — మౌనం - ఆత్మవినిగ్రహః,
భావసంశుద్ధిః - ఇతి - ఏతత్ - తపః - మానసం - ఉచ్యతే,

ప్రతి॥ మనఃప్రసాదః = కలత నొందక నిర్మలముగా నుండెడు మనస్సు గలిగి యుండుట, సౌమ్యత్వం = ముఖవికాసము గలిగియుండుట, మౌనం = సత్యముగాను మితముగాను భాషించుటయు, మనస్సును పరమాత్మ ధ్యానమందు నిలుపుటయు, బ్రహ్మమును గురించి మననము చేయుటయు, లేక వాఙ్మౌనము గలిగియుండుటయు, ఆత్మవినిగ్రహః = లెస్సగ మనో నిగ్రహము గలిగియుండుటయు, భావసంశుద్ధిః = శుద్ధమైన హృదయ భావము గలిగియుండుటయు, ఇతి ఏతత్ = ఈ అనునది, మానసం = మానసికమైన. తపః = తపస్సని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ మనస్సునం దెటువంటి విచారములను పెట్టుకొనక యుండుటయును, సకలప్రాణులకు నెల్లప్పుడును మేలు కోరుటయు, ఎప్పుడును పరమాత్మను మననము చేయుటయును, చిత్తము నితర విషయములనుండి మరల్చి స్వాధీనములోనుంచుటయు, మనస్సులో పవిత్రభావన గలిగియుండుటయు మనస్సుచేత చేయదగిన తపస్సని అనగా మానసిక తపస్సని చెప్పబడుచున్నది.

వి॥ బ్రహ్మనిష్ఠకు బ్రతిబంధకమగు జనులబాధ యుండినమాత్రమే మౌన ముండినచాలును. తక్కినవారి కాత్మమననమే మౌనమగును. వాఙ్మౌనము మాత్రము గలిగి నిరంతరము బ్రహ్మచింతన లేనిచో, యది మోసమే యగును. వాడు మూగవానికన్న నేమియు విశేషముగలవాడుగాడు. ఈ మూడు శ్లోకము లలో దేహతపస్సు. వాక్తపస్సు, మానసిక తపస్సులని మూడువిధములుగా జెప్పడమైనది. ఈ మూడువిధముల తపస్సులు తప్పక ప్రతివారికుండవలెను. వీధులలో వెలుగుచుండు మునిసిపాలిటీ దీపములకు బయట అద్దములును,లోపల చిమ్నీయును యుండును. ఈలాగున రెండు చిమ్నీయు ఒక అద్దములు, గలిగి యుండినచో ఈ మూడును శుద్ధమైయుండినమాత్రమే ప్రకాశము శుద్ధముగా గను పించును. ఈ మూడింటిలో నొకటిగాని, రెండుగాని లేక మూడునుగాని మలినమై యుండినచో. ప్రకాశమెట్లు కనుపించదో యాలాగున నీ తపస్సులలో నొకటిగాని రెండుగాని లేక మూడుగాని లేకపోయినచో ఆత్మజ్ఞానప్రకాశము అవరణము గలిగి నదై ప్రకాశింపదు. దేహ తపస్సుచే కాయశుద్ధియు, లేక కాయసిద్ధియు, వాచక తపస్సుచే వాక్శుద్ధియు లేక వాక్సిద్ధియు, మానసికతపస్సుచే మనశ్శుద్ధియు లేక మనస్సిద్ధియు గలుగును. ఇదే ఋషులకు గల వాక్సిద్ధియు, సంకల్పసిద్ధియు నని గ్రహించవలెను. వాక్సిద్ధి గలిగినచో చెప్పిన వాక్యము తప్పక ఫలించును. మనస్సిద్ధి గలిగినచో సంకల్పమొకటియైనను ఫలింపక పోదు.

కొందఱు సత్కర్మానుష్ఠానములు మొదలగు దేహతపస్సు మాత్రమే చేయుదురు. మఱికొందరు భజనకీర్తన స్మరణపారాయణాది వాక్ తపస్సుగలిగి యుందురు. కొందఱు నిరంతరము బ్రహ్మధ్యానముగాని, బ్రహ్మచింతన మనెడు మానసిక తపస్సుగాని చేయుదురు, వీరుముగ్గురును తాముచేయవలసిన తపస్సులలో నొక్కొక్కటి మాత్రమే చేసినవారగుదురు. కావున వీరు పూర్ణబ్రహ్మసాక్షాత్కారజ్ఞానమును పొందజాలరు. ఈ మూడును చేసినవారే తాము చేయవలసిన త్రివిధతపస్సులను చేసినవారగుదురు. అట్లుగాక నొకడు దీపముకొఱకు ప్రమిదను సంపాధించినాడు ఇంకొకడు చమురును సంపాదించినాడు. ఇంకొకడు వత్తిని సంపాదించినాడను కొనుడు. ఇట్లు ఒక్కొక్కదానిని సంపాదించిన వారికి దీపము వెలుగునా? మూడును సంపాదించినవారికే దీపము వెలుగును, అప్పుడు చీకటిపోవును. అన్నివస్తువులును కనిపించును. కావున ధ్యానములో నెంతవరకు మనస్సు నిలుచునో యంతవఱకు ధ్యానమునుచేసి, తరువాత యుపనిషద్గీతాది శాస్త్రపఠనమునుగాని సంకీర్తనముగాని చేయుటయు, మఱల పరప్రాణులయుపకారార్థముగాని యాశ్రమకార్యముగాని లేక తనసొంత గృహసంబంధమైనపనినిగాని చేయవలయును. కనుకనే మూడు విధములగు తపస్సులను శ్రీభగవానుడు తెలిపెను. అంతఃకరణములోగల సంస్కారములు నశించువఱకు నిరంతరధ్యానములో మనస్సు నిలువదు.

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః ।
అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥ 17

పద॥ శ్రద్ధయా - పరయా - తప్తం - తపః – తత్ - త్రివిధం - నరైః,
అఫలాకాంక్షిభిః - యుక్తైః - సాత్త్వికం - పరిచక్షతే.

ప్రతి॥ అఫలాకాంక్షిభిః = నిష్కామకర్మానుష్ఠానపరులును,యుక్తైః = ధ్యానయోగులునైన, నరైః = మనుష్యులచేత, పరయాశ్రద్ధయా = పరమశ్రద్ధతో, తప్తం = చేయబడిన, తత్ = ఆపై చెప్పబడిన, త్రివిధం = మూడు విధములగు, తపః = తపస్సు, సాత్త్వికం = సాత్త్వికతపస్సని, పరిచక్షతే = చెప్పుచున్నారు.

తా॥ నిష్కామ కర్మానుష్ఠానపరులును, ధ్యానయోగులునైన నరులచేత పరమశ్రద్ధతో జేయబడిన పై చెప్పబడిన మూడు విధములగు తపస్సులు సాత్త్వికతపస్సులని చెప్పబడుచున్నవి.

శ్లో॥ సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ॥ 18

పద॥ సత్కారమానపూజార్థం - తపః - దంభేన - చ - ఏవ - యత్,
క్రియతే - తత్ - ఇహ - ప్రోక్తం – రాజసం – చలం - అధ్రువమ్.

ప్రతి॥ ఇహ = ఈ లోకమునందు, యత్ తపః = ఏ తపస్సు, సత్కారమాన పూజార్థం = ఇతరులచే సత్కరింపబడుటకును గౌరవింపబడుటకును, పూజింపబడుటకొఱకును, దంభేన చ ఏవ = దంభము చేతనైనను, క్రియతే = చేయబడుచున్నదో, తత్ = అట్టి తపస్సు, రాజసం = రజోగుణతపస్సని, ప్రోక్తం =చెప్పబడుచున్నది, అట్టి తపస్సు, చలం = స్థిరము కానట్టిదియు, అధ్రువం=స్వల్పకాలము మాత్రముండునదియునై యుండును.

తా॥ లోకమునందేయే తపస్సు ఇతరులచే సత్కరింపబడుటకు గాని, బహుమానింపబడుటకు గాని, పూజింపబడుటకొఱకు గాని, డంబముచేతనైనను గాని చేయబడుచున్నదో, అట్టి తపస్సు రాజస తపస్సని చెప్పబడుచున్నది. ఆ తపస్సు నిలకడలేనట్టిదియు, నెల్లప్పుడు నొకే స్థితిలోనుండనిదియునై యుండును.

శ్లో॥ మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ॥ 19

పద॥ మూఢగ్రాహేణ - ఆత్మనః - యత్ - పీడయా - క్రియతే - తపః,
పరస్య - ఉత్సాదనార్థం - వా - తత్ - తామసం - ఉదాహృతం.

ప్రతి॥ మూఢగ్రాహేణ = మూర్ఖపు పట్టుదలతో, ఆత్మనః పీడయా = తన శరీరమును కష్టపెట్టుకొనుటచేతనుగాని, యత్ తపః = ఏ తపస్సు, క్రియతే= చేయబడుచున్నదో, పరస్య = ఇతరుల యొక్క, ఉత్సాదనార్థం వా = నాశము కొఱకుగాని చేయబడునో, తత్ = అట్టి తపస్సు, తామసం = తామస తపస్సని, ఉదాహృతం = చెప్పబడుచున్నది.

తా॥ మూర్ఖపు పట్టుదలతో తన శరీరమును కష్టపెట్టుకొనుట చేతనుగాని, ఇతరుల వినాశము నుద్దేశించిగాని యే తపస్సు చేయబడుచున్నదో, అట్టి తపస్సు తామసమని చెప్పబడుచున్నది.

శ్లో॥ దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ 20

పద॥ దాతవ్యం - ఇతి - యత్ - దానం - దీయతే - అనుపకారిణే,
దేశే - కాలే - చ - పాత్రే - తత్ - చ - దానం - సాత్త్వికం - స్మృతమ్.

ప్రతి॥ దేశే = ఏ దేశమునందు, కాలే చ = ఏ కాలమందు, పాత్రే చ = ఏ పాత్రమునందు, యత్ దానం = ఏలాటి దానము, దాతవ్యం ఇతి= ఇవ్వదగినది యని యెఱింగి, అనుపకారిణే = ప్రత్యుపకారము చేయలేని వానికి, దీయతే = ఇవ్వ బడుచున్నదో, తత్ దానం = అట్టిదానము, సాత్త్వికం=సాత్త్విక దానమని. స్మృతం=మహర్షులచే చెప్పబడుచున్నది.

తా॥ ఏ ప్రదేశమునందే యే కాలమునందేయే పాత్రమునందేలాటి దానము ఇవ్వదగినదో తెలిసికొని, ప్రత్యుపకారము చేయలేని వారికివ్వబడునట్టి దానము సాత్త్వికదానమని మహర్షులచే నెంచబడుచున్నది.

వి॥ దీనియందు భగవంతునికి పక్షపాతదోషము గలుగనీయక దేశము పాత్రము వీటిని దాతలే తెలిసికొని చేసేలాగున నుపదేశించడమైనది. అదే మనగా, ఏ ప్రదేశమున జనులకు విద్య ఆరోగ్యము, దైవభక్తి లేదో అట్టి ప్రదేశము జూచియు, అతివృష్టి, అనావృష్టి,రోగము మొదలగు కాలమును చూచియు, బ్రహ్మనిష్ఠ ధర్మప్రబోధము పరోపకారమై విద్యాభ్యాసము మొదలగు పాత్రోచితధర్మములను జూచియు నీయబడు దానము సాత్త్వికదాన మనబడును. దీనికి ప్రతిఫలమును. గ్రహీతలివ్వక పోయినను సర్వేశ్వరుడు ఆ దాతపై సదా అనుగ్రహము గలిగి యుండును. దానివలన ఆ దాతయొక్క సమస్తపాపములు నశించి దైవానుగ్రహమునకు పాత్రుడై యతడు మోక్షమును గూడ పొందును.

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥ 21

పద॥ యత్ - తు - ప్రత్యుపకారార్థం - ఫలం - ఉద్దిశ్య - వా - పునః,
దీయతే - చ - పరిక్లిష్టం - తత్ - దానం - రాజసం - స్మృతమ్.

ప్రతి॥ యత్ తు = ఏదానమైతే, ప్రత్యుపకారార్థం = ప్రత్యుపకారముకొఱకుగాని పునః = మఱల, ఫలం = ఫలమును, ఉద్దిశ్య వా = ఉద్దేశించిగాని, పరి

**క్లిష్టం చ** = మనఃక్లేశముతోగాని, దీయతే – ఇవ్వబడుచున్నదో. **తత్ దానం** = అట్టి దానము. రాజసం = రజోగుణదానమని, స్మృతమ్=స్మరింపబడు చున్నది,

తా॥ ఏ దానమైతే ప్రత్యుపకారముకొఱకుగాని, మఱలఫలమునుద్దేశించిగాని, యీయవలసివచ్చెనే యను మనఃక్లేశముతోగాని నీయ బడుచున్నదో, యట్టి దానము రాజసదానమని యెంచబడును.

శ్లో॥ అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే ।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ॥ 22

పద॥ అదేశకాలే - యత్ - దానం - అపాత్రేభ్యః - చ - దీయతే
**అసత్కృతం - అవజ్ఞాతం - తత్ - తామసం - ఉదాహృతమ్.**

ప్రతి॥ **అసత్కృతం** = అర్ఘ్యపాద్యాదిసత్కారపూర్వకముకానిదియు, **అవజ్ఞాతం**= తిరస్కారభావముతో గూడినదియునై, అదేశకాలే = దానమునకు తగని ప్రదేశమునందును, కాలమునందును, అపాత్రేభ్యఃచ = దానపాత్రులు గానివారికిని. యత్ దానం = ఏ దానము, దీయతే = ఇవ్వబడుచున్నదో, తత్ = ఆ దానము, తామసం = తామసదానమని, ఉదాహృతం = చెప్పబడుచున్నది.

తా॥ అర్ఘ్యపాద్యాదిసత్కారపూర్వకము కానిదియు, తిరస్కారభావముతో గూడినదియునై, దానమునకు తగని స్థలమందును, పర్వముకాని సమయమున దానపాత్రులు కానివారికి నే యే దానమివ్వబడుచున్నదో, యా దానము తామసదానమని చెప్పబడుచున్నది.

వి॥ ఈమూడు శ్లోకములలో సాత్త్విక, రాజస. తామస దానములను గురించి చెప్పడమైనది. ధర్మబోధకులగు బ్రహ్మనిష్ఠులకు పరోపకారార్థము అధ్యయనము చేయు బ్రహ్మచారులకు, దైవభక్తిగలుగుటకు తగిన స్థాపనలకు జనుల జీవనోపాయములకు ఏర్పడిన తగిన సంస్థలకు, జలాశయములకు వైద్యాలయములు మొదలగువాటికిచ్చెడు దానము సాత్త్వికదాన మనబడును. పేరుప్రతిష్ఠల కొఱకు. గౌరవము కొఱకు. అధికారముకొరకు వినియోగపఱచుటకు నటులు గాయకులు మొదలగువారికి వినియోగపరచుటకు చేయుదానము రాజస మన బడును. దీనివలన ఆ జీవికి ఏమియు మేలు గలుగదు, ఇక దుష్టస్త్రీలకు, పశుహింసాపరమగు యజ్ఞములకు క్షుద్రదేవతలకు ప్రాణి బలి నిచ్చెడు కార్యముల

కిచ్చెడు ధనము తామస దానమనబడును, ఇవి దాతనుగూర్చి నరక గామిగా చేయును,

శ్లో॥ ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివధః స్మృతః ।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ 23

పద॥ ఓం - తత్ - సత్ - ఇతి - నిర్దేశః - బ్రహ్మణః – త్రివిధః – స్మృతః,
బ్రాహ్మణాః - తేన – వేదాః – చ - యజ్ఞాః - చ - విహితాః - పురా.

ప్రతి॥ బ్రహ్మణః = పరబ్రహ్మముయొక్క, నిర్దేశః = నామమును గుఱించినఆజ్ఞ, ఓం తత్ సత్ ఇతి = ఓం తత్ సత్ అని, త్రివిధః = మూడు విధములు గలదిగా, స్మృతః = చెప్పబడినది, తేన = ఆ నామోచ్చారణముచేత బ్రాహ్మణాః = బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానులు, వేదాః చ = వేదములును యజ్ఞాః చ = యజ్ఞములును. పురా = పూర్వము. విహితాః = విధింపబడినవి.

తా॥ పరబ్రహ్మమునకు 'ఓం' అనియు, 'తత్' అనియు, 'సత్' అనియు బ్రహ్మదేవుడు (వేదము) నామమును నిర్దేశించెను. ఆ నామత్రయము వలన బ్రాహ్మణులు (బ్రహ్మజ్ఞానులు), వేదములు, యజ్ఞములును నిర్మింపబడినవి.

వి॥ సామాన్యముగానుపనిషత్తులు మొదలగువాటిలో ఓంకారమొక్కటే పరమ పవిత్రముగాను పరబ్రహ్మవాచకముగాను వర్ణింపబడినది. శ్రీకృష్ణభగవానుడు 'ఓం' 'తత' 'సత్' అను నీ మూడును పరబ్రహ్మమును గుఱించిచెప్పనవి యనియు, నీ మూడింటిలో నొక్కొక్కదాని నొక్కొక్కకర్మలో బ్రహ్మవేత్తలు, వినియోగపరచెదరనియు క్రింది శ్లోకముచే తెలిపియున్నాడు. తాను చేసెడు అధ్యయనమందుగాని, కర్మానుష్ఠానమందుగాని యేదైన స్వర, వర్ణ క్రియాలోపములు గలిగియుండినచో, నీ మూడింటియొక్క యుచ్చారణవలన నా దోషములన్నియుపోయి శుద్ధములగును, ఏలాటి కొరతయున్నుగలుగక,ఆకర్మలు పూర్ణములై ఫలమును గలుగజేయును, అమృతసేవనముచే నెట్లు కాల కూట విషదోషమైనను నశించునో అలాగున నీమూడు నామములలో దేనిని యుచ్చరించినను, లేక మూటిని కలిపి యుచ్చరించినను తన ధ్యానపూజాక్రియాదులలో దోషములు గలిగినచో, నవి నిశ్శేషముగా నశించును. మఱియు అమృతత్వమునుగూడ గలుగజేయును. కనుకనే వేదములలో నీ మూడు మంత్రములనింత శ్లాఘించుటకు కారణము.అందువలనబ్రహ్మనిష్ఠ లేకార్యములు చేయునప్పుడును

'ఓమ్ తత్ సత్' అని యుచ్చరింతురు. అయితే నట్టి నామోచ్ఛారణచే తృప్తిపొందక బ్రహ్మభావముతోనుచ్చరించవలెను. అప్పుడది ప్రాణయుక్తమై పవిత్రతను గలుగజేయును.

మఱియొక అర్థముగూడ గలదు. 'ఓం'అనునది పరబ్రహ్మము 'తత్' అనునది యా పరబ్రహ్మము, 'సత్' అనునది యాపరబ్రహ్మము. అది ఒక్కటియే సత్యము ఆ బ్రహ్మ మొక్కటియే సత్యమైనచో తక్కినవన్నియు నశించునవి, లేక ఆ బ్రహ్మమొక్కటియే త్రికాలాబాధ్యమగు వస్తువనియు. దాని కన్యముగా కనిపించెడి యీ జగత్తు మిథ్య యనియు నర్థము గలదు. ఎండమావులలో నీరు గనుపించినను విచారణ చేసి చూచిన ఎట్లు జలముండదో అలాగున నీ కనిపించెడు జగత్తు బ్రహ్మమందు మాయచే కల్పితమని తెలియదగినది,దేహము మాత్రముండి దేహియగు నాత్మలేనిచో అదియేలాగున శవమగునో, అలాగున ప్రణవము మొదలగు నే మంత్రముల నుచ్చరించినను గూడ దైవభావము గలిగి యుండవలెను. అప్పుడు శవములో నాత్మ ప్రవేశించిన ఎట్లు చైతన్యరూపమగు జీవుడగునో యాధ్యానము నటువంటిదే యగును. లేనిచో లోపల గింజలేని వట్టి టెంకెవంటిదేయగును. ఊక లేక పొట్టుమాత్రము భూమిలో పెట్టిన ఎట్లంకురింప జాలదో, అలాగున భగవద్భావము లేని మంత్ర జపము లన్నియు ఫలములను గలుగజేయవు, దీనిని సాధకులందఱు తప్పక గ్రహించుకొనవలసియుండును. కనుకనే శ్రీపతంజలి మహర్షి యోగశాస్త్రమందు "తస్య వాచకః ప్రణవః" ఆ పరమాత్మ యొక్క నామము ఓంకారమనియు, "తజ్జప స్తదర్థభావనం" ఆ ప్రణవముయొక్క జపమర్థభావముతోకూడ చేయవలయుననియు విధించెను. మఱియు తైత్తిరీయాద్యుపనిషత్తులలో "ఓం తద్బ్రహ్మ"అని యనేకమంత్రములు గలవు "ఓం తత్ బ్రహ్మ'' ఇచట ప్రణవమును, 'తత్' అనునదియు బ్రహ్మమని తెలుపడమైనది. ఈ శ్లోకముయొక్క ఉత్తరార్ధమునకు మఱియొక విధముగా నర్థము చెప్పబడియున్నది. బ్రాహ్మణాః = బ్రాహ్మణులు (బ్రహ్మజ్ఞానులు) తేన= ఆ నామోచ్ఛారణముచేత, వేదాః చ = వేదము లుచ్చరించుటకున్ను, యజ్ఞాః చ = యజ్ఞములుచేయుటకును. పురా = సృష్ట్యాది కాలములందు, విహితాః = విధింపబడిరి, అని ఇదివరలో చెప్పిన దానికన్న నిది బాగున్నది.

శ్లో॥ తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।
ప్రవర్తన్తే విధానోక్తాస్సతతం బ్రహ్మవాదినామ్ ॥ 24

పద॥ తస్మాత్ - ఓం - ఇతి - ఉదాహృత్య - యజ్ఞదానతపఃక్రియాః
ప్రవర్తన్తే - విధానోక్తాః - సతతం - బ్రహ్మవాదినామ్.

ప్రతి॥ తస్మాత్ = ఆ కారణమువలన, బ్రహ్మవాదినాం = వేదములను లెస్సగా నెఱింగినవారియొక్క, విధానోక్తాః = వేదమునందు విధింపబడిన యజ్ఞ దాన తపఃక్రియాః = యజ్ఞము దానము తపస్సులనెడి కర్మలు, సతతం= ఎల్లప్పుడును, ఓంతత్ సత్ అని గల బ్రహ్మవాక్యములలో, ఓం ఇతి ఉదాహృత్య = 'ఓం' అని చెప్పి, ప్రవర్తన్తే = ప్రారంభించబడుచున్నవి.

తా॥ పరబ్రహ్మముయొక్క నామముగా నిర్దేశింపబడినదగుట చేతను, ప్రశస్తమైనదగుటవలనను పావనము చేయునదగుటవలనను వేదాధ్యయన సంపన్నులు శాస్త్రచోదితములైన యజ్ఞము, దానము, తపస్సు ఈ స్వరూపములైన కర్మల చేయుటకు ముందుగా ఓం కారము నుచ్చరించి చేయుచున్నారు. అంత్యమునగూడ ఓంకారము నుచ్చరించి చేయుదురు. ఇట్లు ప్రణవము నుచ్చరించి చేయుటవలన ఆ క్రియలలోగల మంత్ర, స్వర, వర్ణక్రియలలో నేవైన లోపములు అనగా దోషములు గలిగియుండినచో అట్టి దోషములు నశించి యా కర్మలు సంపూర్ణఫలము నిచ్చును.

శ్లో॥ తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః ॥ 25

పద॥ తత్ - ఇతి - అనభిసంధాయ - ఫలం - యజ్ఞతపఃక్రియాః,
దానక్రియాః - చ - వివిధాః - క్రియన్తే - మోక్షకాంక్షిభిః.

ప్రతి॥ మోక్షకాంక్షభిః = మోక్షాపేక్షగలవారిచేత, వివిధాః=నానావిధములైన. యజ్ఞతపఃక్రియాః= యజ్ఞములు తపస్సులును, దానక్రియాః చ =దానము లును, ఫలం అనభిసంధాయ = ఫలమును కోరకయే, తత్ ఇతి = తత్ అను నామోచ్చారణపురస్సరముగా, క్రియన్తే = చేయబడుచున్నవి.

తా॥ మోక్షాపేక్షగల వారిచేత నానావిధములైన యజ్ఞము లును, తపస్సులును, దానములును, ఫలమును గోరకయే ఓం, తత్, సత్ అను మూడింటిలో, "తత్" అను నామోచ్చారణపురస్స రముగా చేయబడుచున్నవి.

శ్లో॥ సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే॥ 26

పద॥ సద్భావే - సాధుభావే - చ - సత్ - ఇతి - ఏతత్ - ప్రయుజ్యతే,
ప్రశస్తే - కర్మణి - తథా - సత్ - శబ్దః - పార్థ ! - యుజ్యతే.

ప్రతి॥ హేపార్థ!, = ఓయర్జునా! సత్ ఇతి = సత్ అనెడి, ఏతత్=ఈ శబ్దమును లేక నామమును, సద్భావే = ఆ బ్రహ్మము శాశ్వతమగు సద్వస్తువని తెలుపుట యందును, సాధుభావేచ = ఆ బ్రహ్మము శ్రేష్ఠమైన వస్తువని తెలుపుట యందును, ప్రయుజ్యతే = ప్రయోగింపబడుచున్నది, తథా = అలాగుననే, ప్రశస్తే = ఉత్కృష్టమైన, కర్మణి = కర్మయందుగూడ, సత్ శబ్దః = సత్ అనెడు శబ్దము, ప్రయుజ్యతే=ప్రయోగింపబడుచున్నది.

తా॥ ఓ యర్జునా ! 'సత్' అనెడి యీ నామము ఆ బ్రహ్మము శాశ్వతమైన సద్వస్తువని తెలుపుటయందును, ఆ బ్రహ్మము శ్రేష్ఠమైన వస్తువని తెలుపుటయందును ప్రయోగింపబడుచున్నది. అలాగుననే ప్రశస్తమైన అనగా నుత్కృష్టమైన కర్మయందుగూడ 'సత్' అనెడి శబ్దము ప్రయోగింపబడుచున్నది.

శ్లో॥ యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే ।
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥ 27

పద॥ యజ్ఞే - తపసి - దానే - చ - స్థితిః - సత్ - ఇతి - చ - ఉచ్యతే,
కర్మ - చ - ఏవ - తదర్థీయం - సత్ - ఇతి - ఏవ - అభిధీయతే.

ప్రతి॥ యజ్ఞే = యజ్ఞమునందును, తపసి = తపస్సునందును, దానే చ = దానము నందుగల, స్థితిః = నిష్ఠ, సత్ ఇతి = సత్ అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, తదర్థీయం = భగవత్ప్రీత్యర్థముగా చేయబడు, కర్మ ఏవ = సకలకర్మయును, సత్ ఇతి ఏవ = సత్ అనియే, అభిధీయతే = చెప్పబడుచున్నది.

తా॥ యజ్ఞదానతపస్సులు చేయవలయునను ఆశయును, వాని యందలి భక్తియును, వాటికొఱకు సాధనములైన కర్మలును అనగా పనులును సచ్ఛబ్దవాచ్యములేయని పెద్దలచే చెప్పబడుచున్నవి.

వి॥ పై చెప్పిన యన్నికార్యములలోను 'ఓం తత్ సత్' అని మూడుమంత్రముల నుచ్చరించుకొనవచ్చును. అట్టి దైవభావముతోకూడిన యుచ్చారణవలన నేదైన తెలిసిగాని. తెలియకగాని కలిగెడు దోషముండిన నిర్దోషమగును. (నిర్మూలనమగును.)అయితే నిర్దుష్టముగా చేసియుండినవారుగూడ నీ మంత్రము నుచ్చరించవలెనా? అని సంశయపడనక్కరలేదు, మానవబుద్ధిలో నెంతగొప్ప వారికైన నేదైన పొరబాటు గలుగ వచ్చును దానివలన నిట్లు చెప్పడమైనది. అట్లామంత్రముల నుచ్చరించుటవలన పవిత్రమైన కర్మయైనచో, అతిపవిత్రమగును. దోషముండిన నిర్దోషమగును. కావుననే అట్లు విధించుటకు కారణమైనది.

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్యనో ఇహ ॥ 28

పద॥ అశ్రద్ధయా - హుతం - దత్తం - తపః - తప్తం - కృతం - చ - యత్, అసత్ - ఇతి - ఉచ్యతే - పార్థ! - న - చ - తత్ - ప్రేత్య - నో - ఇహ

ప్రతి॥ హేపార్థ! = ఓయర్జునా !, అశ్రద్ధయా = శ్రద్ధలేక హుతం = వేల్చబడిన యజ్ఞము, దత్తం = చేయబడిన దానము,తప్తం తపః = చేయబడినతపస్సు, కృతం చ = చేయబడిన యితర కర్మములన్నియును, యత్ = ఏదిగలదో తత్ = అది, అసత్ ఇతి = అసత్తు అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, అట్టి కర్మము, న ప్రేత్య = పరలోకసుఖము నిచ్చునది కాదు, నో ఇహ చ = ఇహలోక సుఖమునైన నిచ్చునదికాదు,

తా॥ అశ్రద్ధతో చేసిన హోమ, దాన, తపములు, నితరములగు సమస్త సత్కర్మములును 'అసత్' అని చెప్పబడుచున్నవి. అట్టి శ్రద్ధలేని యసద్వాచ్యములగు కర్మలకు శరీరత్యాగానంతరము ప్రయోజనము లేదు. ఈ లోకమునందును ప్రయోజనము లేదు.

వి॥ కనుక యే కార్యములైనను శ్రద్ధతో చేయవలయునే గాని యశ్రద్ధతో చేయ రాదు. అట్లు శ్రద్ధతో చేయనిచో తనకు గలిగెడు ధనవ్యయము శరీర ప్రయాసము మిగులునేగాని. కించిత్తైన ఫలము గలుగదు. క్షీరాన్నముకొఱకు పాలు, చక్కెర రవ్వ మొదలైనవి శుద్ధములుగా సమకూర్చినను, వండునపుడు శ్రద్ధతో చేయనిచో మాడి పోవుటయో, పొంగిపోవుటయో యెట్లు జరుగుచున్నదో, శ్రద్ధలేని యజ్ఞము దానము తపస్సు మొదలైనవన్నియు నాలాగుననే యుండును. కావున సదా భక్తిశ్రద్ధలు గలిగి యుండేలాగున భగవంతుడీ యధ్యాయాంతమున నెంతోకరుణగలిగి యుపదేశించెను.

శ్లో॥ అశ్రద్ధా పరమం పాపం శ్రద్ధా పాపప్రమోచనీ
జహాతి పాపం శ్రద్ధావాన్ సర్పో జీర్ణామివ త్వచమ్ ॥

తా॥ అశ్రద్ధ మిక్కిలి పాపకరమైనది. శ్రద్ధ సమస్త పాపవిమోచనకారి యగును. శ్రద్ధగలవాడు పాము జీర్ణించిన చర్మమును విడుచునట్లు పాపమును విడుచును,

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయవిభాగ యోగో నామ
స ప్త ద శో ఽ ధ్యా య ః

పద॥ ఇతి - శ్రీమద్భగవద్గీతాసు - ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం - యోగ శాస్త్రే - శ్రీ కృష్ణార్జునసంవాదే దైవాసురసంపద్విభాగ యోగః - నామ - సప్తదశః – అధ్యాయః.

ప్రతి॥ ఇతి = ఇట్లు, ఉపనిషత్సు= ఉపనిషత్స్వరూపమును, బ్రహ్మవిద్యాయాం= బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రే = యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదే = శ్రీ కృష్ణార్జున సంవాద రూపమునగు, శ్రీమద్భగవద్గీతాసు = శ్రీ భగవద్గీతయందు, దైవాసురసంపద్విభాగయోగః నామ = దైవాసుర సంపద్విభాగ యోగమనెడు ప్రసిద్ధిగలిగిన, సప్తదశః అధ్యాయః = పదు నేడవ అధ్యాయము సంపూర్ణము.

తా॥ ఇట్లు ఉపనిషత్స్వరూపమును, బ్రహ్మవిద్యయు, యోగ శాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాద రూపము నగు శ్రీమద్భగవద్గీత యందు శ్రద్ధాత్రయవి భాగయోగమను ప్రసిద్ధిగల పదునేడవ అధ్యాయము సంపూర్ణము.

వి॥ ఈ మూడు విధములగు శ్రద్ధలను తెలిసికొనుటగూడ యోగ మగును. అనగా నిట్లు తెలిసికొనుటచే పరమాత్మతో నైక్యము గలుగును. కావున నిదియు నొకయోగమని చెప్పబడినది. దీనిని తెలిసికొనుటవలన ఎట్లు యోగము గలుగుననిన రాజస తామస స్వభావములను విడిచి సత్త్వగుణ ప్రవృత్తి గలుగునప్పుడు అంతఃకరణ శుద్ధి గలుగును. అప్పుడు సాక్షియగు సర్వేశ్వరజ్ఞాన మూదయించును. అట్టి జ్ఞానము వలన మోక్షము గలుగును.

ఓమ్ తత్ సత్.



ఓమ్

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా

## అష్టాదశోఽధ్యాయః - అష్టాదశాధ్యాయము

## మోక్షసన్న్యాసయోగః - మోక్షసన్న్యాసయోగము



ఈ యధ్యాయమునకు 'మోక్షసన్న్యాసయోగ' మని పేరు, మోక్షముకొఱకు సన్న్యసించవలెనని సామాన్యార్థము. మోక్షమునుగూడ సన్న్యసించవలెనని మఱియొకయర్థము గలదు. విశేషార్థము॥ సన్న్యసించుట యనగా సమస్తమును త్యాగమును చేయుట యని అర్థము దీనికి కర్మత్యాగము కాదనియు, కర్మఫల త్యాగమనియుకొందరర్థముచెప్పుదురు. సర్వసంగమును త్యజించిత్యాగియైయుండు టయే నిజమైన యర్థమగును. కర్మఫలత్యాగమే అర్థమైనచో శ్రీకృష్ణముఖార విందమునుండి నేరులో అనగా సాక్షాత్తుగా గీతశ్రవణము చేసిన అర్జునుడును ధర్మరాజాదులును జీవితాంతమువఱకు గృహస్థాశ్రమమందుండి కర్మల చేయుచు ఫలత్యాగమును జేయవలసియుందురు. శ్రీ మహాభారతమున మహాప్రస్థాన పర్వమునందు పాండవులైదుగురును, ద్రౌపదియు సమస్తమును త్యజించి సాధు వేషములను ధరించి,యింద్రప్రస్థమును వదలిపోయినట్లు గనబడుచున్నది. ఇందువలన సర్వసంగపరిత్యాగమే యథార్థమైన యర్థమగును. ఆత్మశుద్ధి గలుగు వఱకు సత్కర్మల నాచరించి ఫలత్యాగము జేసి ఫలము నీశ్వరార్పణముగా జేయవలయుననియే శాస్త్రసిద్ధాంతము, అందువలన అంతఃకరణశుద్ధి గలుగును. అపుడు ప్రకృతి రహితమగు జీవన్ముక్తి గలుగుటకు సర్వకర్మత్యాగమును సర్వ సంగత్యాగమును జేసి యేకాంతమున తపమొనరించుచు బ్రహ్మచింతనము చేయుచు జీవన్ముక్తిపదమును పొందవలసి యుండును.

రెండవ విశేషార్థమేమనగా మోక్షసన్న్యాసమనగా మోక్షమునుగూడ సన్న్యసించుట ఇదివరలో 17-వ అధ్యాయమువఱకు 'నేను చెప్పినట్లు చేసినచో మోక్షము నిచ్చెదన'ని చెప్పుచు వచ్చి యిక్కడ "ఏ మోక్షము నిచ్చెదనని చెప్పితినో, దానినికూడ విడిచిపెట్టుము" అనెనని యొక యర్థము గలదు. అనగా 17-వ అధ్యాయమువఱకుచెప్పిన విధులన్నియు ననుష్ఠించుచు వచ్చిన ముక్తుఁడగును. అందువలన మఱల మోక్షము కావలెనను భావముండదు, లేక పరఘ

భక్తితోగూడిన యుపాసనా పద్ధతి ననుసరించి చూచిన, ఒకనికి గొప్ప యధి కారముగల యొక పరమ అప్తుడుండెను. పై జెప్పిన వానికొక యాపత్తుగలిగెను. దానియొక్క నివృత్తికొఱకున్నతోద్యోగి యగు తన పరమ ఆప్తుని దగ్గఱకు వెళ్లి చెప్పగా ఆ కార్యము నేను చక్కబరచెదను. నీకిక ఆ తలంపే యక్కర లేదని చెప్పినట్లు 17 అధ్యాయములవఱకు చెప్పిన అనుష్ఠానములు చేయుచు వచ్చినచో, భగవంతుడు తప్పక మోక్షమును గలుగజేయును. అందువలన మోక్షమునుగూడ త్యజింపుమని మిక్కిలి వాత్సల్యముతో జెప్పెనని గ్రహించ దగును.

ఇక ప్రత్యధ్యాయాంతమున శ్రీ మద్భగవద్గీతాసు ఉపనిషత్సు అని యుండుట వలన ఉపనిషచ్ఛబ్దమునకు వేదాంతముయొక్క యంత్యమే యర్థమగును. ఆ యుపనిషత్తులు బ్రహ్మమును గుఱించియే చెప్పుచున్నవి వాటిలో – గీతయందు రెండవ యధ్యాయమున చెప్పినట్లు ఆత్మ ఏ కాలమునందైనను జన్మమెత్తుట గాని, కర్మ చేయుటగాని, కర్మఫలము ననుభవించుటగాని లేదనియు, నా యాత్మ యెల్లప్పుడును బ్రహ్మమయముగా నుంటున్నదనియు, నీ జననాది కార్యము లన్నియు మాయ వలన తోచుచున్నవేగాని వాస్తవముగా లేవనియు నీవు సదా ముక్తుడవై యున్నావు కావున మోక్షమును పొందవలయునని కోరుట భ్రాంతియే. కావున అట్టి సంకల్పమును గూడ విడిచి పెట్టమనియు గలదు. ఇదే ఉపనిషత్తు యొక్క నిజార్థమగును. రోగముతో గూడిన వారికి రోగవిమోచనకార్యము చేయ వలసియుండును. ఋణస్థుడైనవానికి ఋణవిమోచనకార్యము చేయవలసియుం డును. బంధింపబడినవానికి బంధవిమోచన కార్యముచేయవలసియుండును. కారా గృహనిబద్ధుడైన వానికి దానినుండి విమోచనమగు మార్గము చేయవలసి యుండును. అట్లే పై చెప్పిన రోగము, ఋణము, బంధము, కారాగృహవాసము లేనివానికి మఱల వాటినుండి విమోచనకాంక్ష ఏల గలుగవలయును? అయితే పై చెప్పిన యీ నాల్గు వాక్యములను బహుజనులచే వినిగాని లేక పత్రికలలో పుస్తకములలో చదివిగాని యుండినందుచే పై చెప్పిన నాల్గు దోషములు లేని వాడై యుండియు కలలో నీ నాల్గు గుణములు తనకు గల్గినట్లు ఒకనికి తోచె ననుకొనుడు. జాగ్రదవస్థలోనికి వచ్చిన పిమ్మట ఆ స్వప్నదోషము ఎట్లు మిథ్య యను దృఢభావము గలుగునో, ఆత్మయొక్క నిజావస్థయు అటువంటిదే. కావున మోక్షమును కోరుట యను నదికూడ పరమార్థదశయందు లేదు. కావున మోక్ష మునుగూడ సన్న్యసింపుమని యభయరూపమునగాని లేక నిజతత్త్వార్థబోధ మునగాని శ్రీ కృష్ణభగవాను డుపదేశించినట్లు గ్రహించవలెను.

శ్లో॥ న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః।
న ముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా॥

పరమార్థదశలో నిరోధముగాని, యుత్పత్తిగాని, బద్ధుఁడుగాని, సాధకుడుగాని ముముక్షువనిగాని లేవు. ఆత్మ నిత్యముక్తస్వరూపమని యుపనిషత్తు. మఱియు ఈ18-వఅధ్యాయమిదివరలో చెప్పినవాటియన్నిటియొక్క సంగ్రహసారమగును. ఇంతేగాక యిదివరలో 17-వ అధ్యాయముపర కుపదేశించినవాటిలో నెచటెచట నేదేది కొరతపడియుండునో, అది యీ యధ్యాయమందు పూర్తిచేయబడుచున్నది. కావున నీ అధ్యాయము గీతయొక్క సంగ్రహమగును. ఇది చాల అగాధార్థములతో గూడినది. ఈ అధ్యాయమున66-వ శ్లోకమునందు"సర్వధర్మాన్ పరిత్యజ్య"అని చరమశ్లోకమున్నది.ఈశ్లోకమున ఋష్యాదిన్యాసములో చెప్పబడిన"సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజేతిశక్తిః" అని శక్తియు,అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతి కీలకం" అని కీలకమును నిర్దేశింపబడియున్నవి. అనగా గీతయొక్క సర్వశక్తియు, గీతాశాస్త్రముయొక్క కీలకము అనగా రహస్యమును, ఈ శ్లోకమునందు కలదు. కీలకమనగా ఒక యంత్రము నడుపుటకు గల మరకుపేరు. గీతారథముయొక్క యంత్రమునకు నీ శ్లోకమునందు చెప్పినదే కీలకమగును. యంత్రము నడుపుట కేమర త్రిప్పవలెనో తెలియని వానికి మోటారుకారు. విమానము దొరికిన నెట్లుపయోగములేదో, అట్లే యీ శ్లోకములో చెప్పబడినకీలకము తెలియక పోయినచో ప్రయోజనములేదు. అట్టివాడు జీవన్ముక్తిని లేక భగవత్ప్రాప్తిని లేక మోక్షమును పొందజాలడు. కావున కీలకమంతయు దీనియందే గలదు. ఈ కీలకము గొప్పయనుభవజ్ఞానులు, బ్రహ్మనిష్ఠులు మహనీయులు నగు వారివలననే తెలిసికొనవలసి యుండును. రెండవ అధ్యాయము 11-వ శ్లోకము గీతారత్న హారమునకు మొదటిదనియు, 9-వ అధ్యాయము 22-వ శ్లోక మీ హారమునకు మధ్యనుండు నాయకమణి యనియు, ఈ 18-వ అధ్యాయమున 66-వ శ్లోకము ఈ గీతాభరణమునకు అంత్యమున నుండు మణి యనియు గ్రహించుకొనవలెను. 18 అధ్యాయములలో 9-వ అధ్యాయము మధ్య నుండుటవలన 22-వ శ్లోకము మధ్యనుండు నాయకమణిగా వర్ణించబడ మైనది. 2-వ అధ్యాయము 11-వ శ్లోకము ఋష్యాదిన్యాసములో బీజముగా నిరూపించబడమైనది. 9-వ అధ్యాయము 22-వ శ్లోకము వచ్చునప్పటికి గీతాకల్పవృక్షము బాగుగా వృద్ధినొంది, ఫలపల్లవ పుష్ప లతాదులచే శోభాయమానమై వృద్ధినొందెను. ఇప్పుడీయధ్యాయమున 66-వ శ్లోకము వచ్చు

నప్పటికి గీతాకల్పవృక్షములోని ఫలములు పరిపక్వములైనవి అనగా పండి నవి. ఈ ఫలములనే ముక్తులు బ్రహ్మానంద రసముతో ననుభవించుచున్నారు.

ఇక సర్వసంగ పరిత్యాగమే గీతయొక్క యంత్యోపదేశమని చెప్పినదానికి, మహాభారతము మహాప్రస్థానిక పర్వమందు చెప్పినదిచూడుడు:-

"శిష్యం పరీక్షితం తస్మై దదౌ భరతసత్తమ! ।
తతస్తు ప్రకృతీస్సర్వాః సమానాయ్య యుధిష్ఠిరః ॥
సర్వమాచష్ట రాజర్షిః చికీర్షిత మథాత్మనః ।
తే శ్రుత్వైవ వచస్తస్య పౌరజానపదా జనాః ॥
భృశముద్విగ్నమనసో నాభ్యనన్దన్త తద్వచః ।
నైవ కర్తవ్యమితి తే తదోచుస్తం నరాధిపమ్ ॥
న చ రాజా తథాఽకార్షీత్ కాలపర్యాయధర్మవిత్ ।
తతోఽనుమాన్యధర్మాత్మా పౌరజానపదం జనమ్ ॥
గమనాయ మతిం చక్రే . . . . . . . . . ।
తత స్స రాజా కౌరవ్యో ధర్మపుత్రో యుధిష్ఠిరః ॥
ఉత్సృజ్యాభరణాన్యంగాజ్జగృహే వల్కలాన్యుత ।
భీమార్జునయమాశ్చైవ ద్రౌపదీ చ యశస్వినీ ॥
తథైవ జగృహుః సర్వే వల్కలాని నరాధిప! ।
విధివత్కారయిత్వేష్టిం నైష్ఠికీం భరతర్షభ! ॥
సముత్సృజ్యాప్సు సర్వేఽగ్నీన్ ప్రతస్థుర్నరపుంగవాః ।
భ్రాతరః పంచ కృష్ణా చ షష్ఠీ శ్వా చైవ సప్తమః ॥

వ॥ శేషించిన కాంచనరత్నాదులాక్షితిపతి పరీక్షితునకు బరమాదరం బున సమర్పించి యతనిం గృపాచార్యునకు శిష్యుంగా నప్పగించి పౌరజానపద ప్రవరజనంబుల రావించి.

సీ॥ ఆ పార్థపౌత్రునిజూపి మాయేవుర - మాఱుగా మీరిక్కుమారవరుని
గైగొని తగ నెల్ల కార్యజాతంబు - నడపుచు ననురక్తి నాడునాటి
కెక్కుడగుచునుండ నీతనియుల్లంబు - రంజిల్ల సమ్యగారాధనంబు
నందుసంప్రవణుల రగుడయ్య యని పల్కి-తమనిశ్చయంబునుదాత్తభంగి

తే॥ జెప్పుటయు వారు మొగములు చిన్నబోవ
మము నుపేక్షించి యిటు సేత సముచితంబె

నీదు చిత్తంబు కారుణ్యనిలయ! మేము
దరతరంబ యాశ్రితులము ధర్మశీల!

వ॥ అని గద్గదకంఠులగుచు నాడినమాటలకు సమ్మనుజేంద్రుండు దగు తెలుంగున మఱుమాటలాడి తమ గమనంబునకు నజ్జనంబుల నియ్యకొల్పె నప్పు డందు లోనం గొందఱునివేశనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కార ణంబుగా వివాదంబు పుట్టిన సహదేవుండు, గలియుగంబు ప్రవేశించుటంజేసికా దే యిట్టివి పుట్టెడునని తలంచి నవ్వి, నరనాథునకుం జెప్పిన నప్పాండవోత్తముండు నవ్వుచు మన మనువులు హేలునని పలికి సర్వాభరణంబులునూడ్చి వల్కలాజి నంబులు ధరియించినందమ్ములు, ద్రౌపదియు నట్లచేసిరందఱుం దత్కాలోచితం బులగు నిష్ఠావిధానంబులాచరించి యగ్నులనంబుగతంబులు చేసి, మొగంబులం తెలివగ్గలింప గృహంబు వెలువడిరప్పుడు ద్రౌపది షష్ఠత్వనిష్ఠంబోవ సప్తమంబై యొక్క సారమేయంబు వారల వెనుకజనియె నప్పుడు "దీనిచే సర్వసంగ పరిత్యాగరూపమైన సన్న్యాసమే గీతా తాత్పర్యమని తేలుచున్నది.

**అర్జున ఉవాచ:—** అర్జునుడు చెప్పెను.

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో! తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।
త్యాగస్య చ హృషీకేశ! పృథక్కేశినిషూదన! ॥ 1

పద॥ సన్న్యాసస్య - మహాబాహో! - తత్త్వం - ఇచ్ఛామి - వేదితుం,
త్యాగస్య — చ - హృషీకేశ! — పృథక్ - కేశినిషూదన!

ప్రతి॥ మహాబాహో! = ఆజానుబాహువవును, హృషీకేశ! = ఇంద్రియ నియా మకుడవును, కేశినిషూదన = కేశి యను రాక్షసుని సంహరించినవాడవు నైన శ్రీకృష్ణమూర్తీ!, సన్న్యాసస్య = సన్న్యాసముయొక్కయు, త్యాగస్య చ = త్యాగము యొక్కయు, తత్త్వం = నిజస్థితిని, పృథక్ = వేర్వేరుగా, వేదితుం = తెలిసికొనుటకు, ఇచ్ఛామి = ఇచ్ఛగించుచున్నాను.

తా॥ ఆజానుబాహువవును, ఇంద్రియ నియామకుడవును, కేశి యను రక్కసుని సంహరించినవాడవు నగు ఓ శ్రీకృష్ణమూర్తీ! సన్న్యాసముయొక్కయు, త్యాగముయొక్కయు, యథార్థమును వేరు వేరుగా తెలియగోరుచున్నాను.

వి॥ గీతలో ననేకస్థలములందు స్వరూపత్యాగమే సన్న్యాసమనియు సర్వ కర్మఫలత్యాగమే సన్న్యాసమనియుచెప్పబడియున్నది. కావునసర్వకర్మత్యాగమగు

సన్న్యసము, సర్వకర్మ ఫలత్యాగమగు సన్న్యసమును ఒకటియా లేక వేరువేరుగా నున్నవా? అని సామాన్యులకు సంశయము గలుగుట సహజమే యని యర్జును డును అట్లే ప్రశ్నించెను.

శ్రీ భగవానువాచ:— శ్రీ భగవంతుడు చెప్పెను.

శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యసం కవయో విదుః ।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥ 2

పద॥ కామ్యానాం - కర్మణాం - న్యాసం - సన్న్యసం - కవయః - విదుః.
సర్వకర్మఫలత్యాగం - ప్రాహుః - త్యాగం - విచక్షణాః.

పతి॥ కవయః = పండితులు, కామ్యానాం = ఫలము నుద్దేశించి చేయబడునట్టి, కర్మణాం = కర్మములయొక్క, న్యాసం = వదలుటను, సన్న్యసం = సన్న్యసమని, విదుః - ఎఱుంగుచున్నారు, విచక్షణాః = వివేకశీలురగు మఱి కొందఱుపండితులు, సర్వకర్మ ఫలత్యాగం = సర్వకర్మ ఫలములను త్యజించుట. త్యాగం = త్యాగము (సన్న్యసము) అని, ప్రాహుః = చెప్పుదురు.

తా॥ పండితులు స్వర్గాదిఫలము నుద్దేశించి చేయబడునట్టి కర్మల వదలుటను సన్న్యసమని తలంచుచున్నారు. వివేకశీలురగు మఱికొందఱు పండితులు సమస్త కర్మములయొక్క ఫలమును త్యజించుట త్యాగమని చెప్పుచున్నారు.

వి॥ కర్మలలో నిట్టి భేదముగలదు, ఇహసుఖముకోఱకును, స్వర్గసుఖము కొఱకును చేయుకర్మ కామ్యకర్మ యనబడును. దైవకార్యములగు కర్మలు చేయుచు ఫలమును ఈశ్వరార్పణముగా చేయుట కర్మఫలత్యాగమని కొందఱి మతము. ఈశ్వరార్పణముగా చేయుదానికన్న, విధియుక్తములైన కార్యములు జేయుట ధర్మ మనియు, ఫలమును కోరకూడదనియు తలంచి చేయు ఫలాసక్తి రహితకర్మ పైచెప్పబడిన రెండింటికన్న నధికశ్రేష్ఠమైనది. దీనిని జీవన్ముక్తులు మాత్రమే చేయగలరు. రెండవ దానిని పరమభక్తులు, ముముక్షువులు చేయు చుందురు. మొదటిదానిని సామాన్యజనులు చేయుదురు. అంతఃకరణశుద్ధి గలుగు వరకు నీశ్వరార్పణబుద్ధితో సర్వకర్మల నొనర్చవలయుననియే శాస్త్రసిద్ధాంతము. తరువాత అట్టి సత్కర్మలు చేసినను, విడిచినను, విరోధములేదు. "యస్త్వాత్మ రతిః" అని అ. 3 శ్లో॥ 17 లో చెప్పబడినది చూడదగును. రోగియైనవానికే

ఆయుర్వేదము వైద్యుడును ఏర్పడెను. రోగి పథ్యౌషధములతో నుండవలెననియే వైద్యుడు శాసించును. అలాగుననసంసార కూపములోనుండి విముక్తిగలుగుట కిచ్ఛగలవారికే వేదాంతశాస్త్రము, బోధకులు, అవతార పురుషులునేర్పడిరి. కావున భవబంధవిముక్తి విషయమై శాస్త్రమెక్కువ చెప్పుచుండును, అర్జునుడు చేసిన ప్రశ్నకు ఇదియే సరియైన యర్థము. దీనికి భగవంతునిచే సమాధానము చెప్పబడినది. మనస్సు చేసెడు మననము బుద్ధితో జేసెడు నిదిధ్యాసముకూడ నంతఃకరణముచే చేయబడినదగుటచే, జ్ఞానకర్మేంద్రియములచే జేసెడు బాహ్యా కర్మల ఫలత్యాగమువలె యోగియు, సన్న్యాసియుమానసికములైన వీటిని గూడ ఫలమును గోరకచేయవలయును. ఇదే కర్మత్యాగముయొక్కయు, కర్మఫలత్యాగము యొక్కయు, నిజార్థమగును. సన్న్యాసి కామ్యకర్మలగు యజ్ఞాది క్రియలను మానినను, ఆత్మయజ్ఞసంబంధమగు ధ్యానానుష్ఠానాదుల విడువకూడదు. తక్కిన వారు ఫలాపేక్షలేకయే యీశ్వరార్పణబుద్ధితో యజ్ఞాదిక్రియలను చేయుచుండ వలయును. ఎందుకనిన, ఈ యధ్యాయమున ఐదవశ్లోకమున ''యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ । యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ అని యజ్ఞదాన తపఃకర్మలను విడువరాదని చెప్పబడెను. వీటినిచేయుచో చేయువారి పాపముల న్నియు నశించి వారు పావనులగుదురు. "మనీషిణాం" అని చెప్పుటచే ఫలాపేక్షలేక చేయు ప్రజ్ఞావంతులని గ్రహింపవలయును. ఈ రెండవ శ్లోకమున 'త్యాగ'మనియు, 'సన్న్యాస' మనియు రెండు విధములుగా చెప్పబడినది. త్యాగమునకు సన్న్యాసమునకును ధాత్వర్థమొక్కటియే కాని "యశఃకీర్తులు" వలె రెండును ఒకేయర్థమునే నిరూపించినను, స్థలభేదముచే అర్థము మారిపోవును. మొదట ఫలత్యాగపూర్వకముగా యజ్ఞదానతపస్సుల నాచరించుచువచ్చి మనస్సు శుద్ధమైన పిమ్మట అట్టిసంకల్పమును గూడ త్యజింప వలయును. సంకల్పత్యాగము కలుగనిచో ముక్తికలుగదు. శుద్ధసంకల్పముచే మలిన సంకల్పములను రహితమొనర్చి విశుద్ధసంకల్పముచే శుద్ధసంకల్పమును సహా రహితముచేసి నిస్సంకల్పుడై జ్ఞేయైకస్థితిలోనే సంయమియు, జ్ఞానియు నిలిచి ముక్తుడగును.

శ్లో॥ త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః ।
యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యమితి చాపరే ॥ 3

పద॥ త్యాజ్యం - దోషవత్ - ఇతి - ఏకే - కర్మ - ప్రాహుః - మనీషిణః,
యజ్ఞదానతపఃకర్మ - న - త్యాజ్యం - ఇతి - చ - అపరే.

ప్రతి॥ కర్మ = కర్మను, దోషవత్ = ఏదేని యొక్కదోషము గలదిగానెంచి, త్యాజ్యం ఇతి = త్యజింపదగినదియని, ఏకే మనీషిణః = కొందఱు బుద్ధిమంతులును, యజ్ఞదానతపః కర్మ = యజ్ఞము దానము తపస్సనెడు కర్మమాత్రము, న త్యాజ్యం ఇతి = విడువదగినదికాదని. అపరే చ = మఱికొందఱును, ప్రాహుః = చెప్పుచున్నారు.

తా॥ సమస్త కర్మలు దోషముగలవి గాన అవి విడువదగినవని కొందఱు బుద్ధిమంతులును (సాంఖ్యులు), యజ్ఞము దానము తపస్సనెడి కర్మలు మాత్రము విడువగూడదని మఱికొందఱును (మీమాంసకులు) జెప్పుచున్నారు.

వి॥ దైవకార్యములు చేయుటయు, పరప్రాణులకు మేలు కలుగజేయుటయు మాత్రమే కర్మయోగమని కొందఱు తలంచుచున్నారు. తపస్సుగూడ కర్మయోగములో చేరినదనియే శ్రీకృష్ణభగవానుని యాశయము. ఎందుకనగా "తపసాకల్మషం హన్తి" అని చెప్పబడుటచే తపస్సు అగ్నివంటిదనియు, అది పాపమనే కట్టెలను త్వరలో భస్మ మొనర్చుననియు తెలియవలెను. ఇంద్రియములచే చేయబడిన కర్మఫలత్యాగము వలన సామాన్యముగా నింద్రియములయొక్కయు, దేహము యొక్కయు. మనస్సు యొక్కయు శుద్ధి గలుగును. తపస్సువలననే మూలాజ్ఞానమగు కల్మషము అనగా అవిద్య నశించును, కావున బాహ్యకర్మలచేసి ఫలత్యాగ మొనర్చుటవలన కర్మయోగము పూర్తియైనదని తలంచరాదు. తపస్సు చేత మూలాజ్ఞానమునుగూడ నశింపచేయవలయును. కనుకనే తైత్తిరీయాద్యుపనిషత్తులో "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" తపస్సు చేతనే బ్రహ్మమును తెలిసికొనవలయుననియు, "తపో బ్రహ్మ" తపస్సు బ్రహ్మ స్వరూపమనియు నుపదేశింపబడినది.

శ్లో॥ నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర ! త్రివిధస్సంప్రకీర్తితః ॥ 4

పద॥ నిశ్చయం - శృణు - మే - తత్ర - త్యాగే - భరతసత్తమ !,
త్యాగః - హి - పురుషవ్యాఘ్ర ! - త్రివిధః - సంప్రకీర్తితః.

ప్రతి॥ హేభరతసత్తమ ! = భరతకులశ్రేష్ఠుడవగు ఓ యర్జునా!, తత్ర = ఆ, త్యాగే = త్యాగవిషయమై, మే = నాయొక్క, నిశ్చయం = నిశ్చయమును, శృణు = వినుము, హే పురుషవ్యాఘ్ర! = పురుషశ్రేష్ఠుడవగు ఓయర్జునా!

త్యాగః = త్యాగము. త్రివిధః = సత్త్వరజస్తమోగుణభేదములచే మూడు విధములుగా, సంప్రకీర్తితః హి = శాస్త్రములయందు చక్కగా చెప్పబడి యున్నదిగదా?

తా॥ భరతవంశమున బుట్టిన పురుషశ్రేష్ఠా ! ఓ యర్జునా ! ఆ త్యాగవిషయమై నాయొక్క నిర్ణయమును వినుము. త్యాగము సత్త్వరజస్తమోగుణ భేదములచే మూడు విధములుగా శాస్త్రములందు చక్కగా చెప్పబడియున్నది గదా?

వి॥ శాస్త్రములో చెప్పబడినదిమాత్రమేగాక నానిశ్చితాభిప్రాయముగూడ నీలాగుననే యుంటున్నదని భగవదాశయము.

శ్లో॥ యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ 5

పద॥ యజ్ఞదానతపఃకర్మ - న - త్యాజ్యం - కార్యం - ఏవ - తత్,
యజ్ఞః - దానం - తపః - చ - ఏవ - పావనాని - మనీషిణామ్.

ప్రతి॥ మనీషిణాం = ప్రజ్ఞాశాలురకు, యజ్ఞః = యజ్ఞము, దానం = దానము, తపః చ ఏవ = తపస్సును, పావనాని = పవిత్రములైనవి (చిత్తశుద్ధికి కారణములైనవి) గాన, యజ్ఞదానతపః కర్మ = యజ్ఞదానతపోరూపమగు కర్మ, న త్యాజ్యం = విడువదగినదిగాదు, తత్ = ఆ యజ్ఞదానతపోరూపమైన కర్మ కార్యం ఏవ = తప్పక చేయవలసినదే.

తా॥ యజ్ఞదానతపములు ఫలాభిలాషలేని ప్రజ్ఞాశాలురకు చిత్తశుద్ధిని గలుగజేయును గాన పావనములైన ఆ యజ్ఞదాన తపోరూప కర్మలను విడువక తప్పక చేయవలయును.

వి॥ "యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్" యజ్ఞదానములచే తృప్తినొందక తపస్సు కూడ తప్పకచేయవలయును. అది చేయవలసిన కార్యములలో ముఖ్యమైనదనికూడ శ్రీ భగవంతు డుపదేశించినాడు. ప్రస్తుతము లోకములో యజ్ఞదానములు చేయువారు కొందఱుండినను తప మొనర్చువారుచాలా తగ్గిపోయిరి. కనుకనే విజ్ఞానవంతులు గాకపోవుటకు కారణమైనది. అజ్ఞానము నశింపకపోవుటకును కారణమైనది.

శ్లో॥ ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ ! నిశ్చితం మతముత్తమమ్ ॥ 6

**పద॥** ఏతాని - అపి - తు - కర్మాణి - సంగం - త్యక్త్వా - ఫలాని - చ,
కర్తవ్యాని - ఇతి - మే - పార్థ! - నిశ్చితం - మతం - ఉత్తమమ్.

**ప్రతి॥** (కిం) తు = అయితే, హే పార్థ ! = ఓ యర్జునా !, ఏతాని = ఈపైశ్లోకము నందు చెప్పబడిన, కర్మాణి అపి = యజ్ఞాదికర్మలుగూడ, సంగం =కర్తృత్వాభిమానమును, ఫలాని చ = ఫలములను, త్యక్త్వా = విడిచి, కర్తవ్యాని ఇతి = జేయదగినవియని, మే = నాయొక్క ఉత్తమం=శ్రేష్ఠమైన దియును, నిశ్చితం = నిశ్చయింపబడినదియును అగు, మతం = అభిమతము.

తా॥ ఓ అర్జునా ! అయితే ఈ పై శ్లోకమునందు చెప్పబడిన యజ్ఞాది కర్మములుగూడ కర్తృత్వాభిమానమును, ఫలములను విడిచి చేయదగినవేయని నాయొక్క ఉత్తమమైన నిశ్చితాభిప్రాయము.

వి॥ 'నిశ్చితం మత ముత్తమం' అనిచెప్పబడుటచే నిది భగవానుని నిశ్చితాభిప్రాయమనియు ఇదియే భగవన్మతమనియు. నుత్తమమనియు. తెల్పినట్లైనది యజ్ఞదానతపస్సులకు కొన్నిభేదములు గలవు. ఆత్మజ్ఞానియొక్క యజ్ఞము ఆత్మయజ్ఞమే యగును. వారియొక్క దానము ఆత్మజ్ఞానము, ధర్మోపదేశమును అగును. వారియొక్క తపస్సు సత్యవ్రతము. బ్రహ్మచర్యవ్రతము. బహ్మభావమునుండి తొలగని దృష్టి మొదలగునవి యగును. దీనియొక్క ముఖ్యసారమేమన. ఎంత వరకు తనయొక్క దేహసుఖమును చూచుచుండునో, అంతవఱకు పరప్రాణుల కుపకారము చేయుచుండవలెను. అది నిస్సంగముగా ఫలాపేక్ష లేనిదిగా నుండవలెను.

శ్లో॥ నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః ॥ 7

**పద॥** నియతస్య - తు - సన్న్యాసః - కర్మణః - న - ఉపపద్యతే,
మోహాత్ - తస్య - పరిత్యాగః - తామసః - పరికీర్తితః.

**ప్రతి॥** నియతస్య = వేదముల వలనను శాస్త్రముల వలనను నియమింపబడియుండునట్టి, కర్మణః = కర్మలయొక్క, సన్న్యాసః తు = పరిత్యాగమన్ననో. న ఉపపద్యతే = చేయదగినదికాదు, మోహాత్ = అవివేకము వలన, తస్య = అట్టి కర్మలయొక్క, పరిత్యాగః = పరిత్యాగము, తామసః = తమోగుణ పరిత్యాగమని, పరికీర్తితః = చెప్పబడుచున్నది.

తా॥ శాస్త్రమువలన నియమింపబడినట్టి కర్మముయొక్క పరిత్యాగమన్ననో చేయతగినది కాదు. అనగా నియతకర్మ త్యజింప తగినదికాదు. అవివేకమువలన చేయబడిన అట్టి కర్మముయొక్క పరిత్యాగము తామసపరిత్యాగమని చెప్పబడుచున్నది.

వి॥ వేదముచేత, మహాత్ములచేత, ననుష్ఠింపతగినదని విధింపబడిన కర్మమును జేయక విడిచిపెట్టుట తామసగుణమే యగును, అంతఃకరణ శుద్ధికి హేతువగు అనుష్ఠానమును విడుచుట తమోగుణస్వభావమనియు, ప్రమాదము వలన గలిగిన యవివేక మనియు తెలియదగును. సోమరితనముగలవారు కష్టములనోర్చుకొనలేక చేయదగిన అనుష్ఠానమును విడిచెదరు. వారికి అంతఃకరణ శుద్ధి గలుగదు,

శ్లో॥ దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥ 8

పద॥ దుఃఖం - ఇతి - ఏవ - యత్ - కర్మ - కాయక్లేశభయాత్ - త్యజేత్, సః - కృత్వా - రాజసం - త్యాగం - న - ఏవ - త్యాగఫలం - లభేత్

ప్రతి॥ యత్ కర్మ = ఏకర్మమును. - దుఃఖం ఏవ = కష్టమును గలుగజేయునదియే. ఇతి = అని తలంచి, కాయక్లేశభయాత్ = దేహప్రయాసము గలుగుననెడి భయముచేత, త్యజేత్ = విడిచిపెట్టుచున్నాడో, సః=వాడు, రాజసం = రజోగుణసంబంధమైన, త్యాగం = త్యాగమును, కృత్వా = చేసియు, త్యాగఫలం=త్యాగఫలమును, న ఏవ లభేత్=పొందనేపొందడు.

తా॥ నిత్యకర్మానుష్ఠానమువలన కాయక్లేశము గలుగునను భయముతో జేయబడు త్యాగము రాజసత్యాగము. అట్టి రాజస త్యాగముగలవాడు త్యాగఫలమును పొందనే పొందడు.

వి॥ నిష్కామకర్మముచే నంతఃకరణశుద్ధి గలిగి పొందవలసిన నైష్కర్మ్య సిద్ధి నిష్కామకర్మ చేయనివానికి గలుగదు. వీనికి దేహాభిమానమే గొప్పదిగాని దైవాభిమానము గొప్పదని తలంపు గలుగదు, వీడు దేహసుఖమును చూచు చున్నాడేగాని, ఆత్మసుఖమును, దైవకృపను గురువర్యుని యనుగ్రహమును గొప్పదిగా తలంచుటలేదు.

శ్లో॥ కార్యమిత్యేవ యత్కర్మనియతం క్రియతేఽర్జున ! ।
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగస్సాత్త్వికో మతః ॥ 9

పద॥ కార్యం - ఇతి - ఏవ - యత్ - కర్మ - నియతం - క్రియతే - అర్జున!, సంగం - త్యక్త్వా - ఫలం - చ - ఏవ - సః-త్యాగః-సాత్త్వికః -మతః.

ప్రతి॥ హే అర్జునా! = ఓ యర్జునా!, నియతం = శాస్త్రాదులచే నియమింపబడిన యత్ కర్మ = ఏ కార్యము, కార్యం ఏవ = చేయదగినదియే, ఇతి= అని సంగం = ఆసక్తిని, ఫలం చ = ఫలమున్ను, త్యక్త్వా = విడిచి, క్రియతే = చేయబడుచున్నదో. సః త్యాగః ఏవ = అట్టిత్యాగమే, సాత్త్వికః = సాత్త్విక త్యాగమని, మతః = నా యభిప్రాయము,

తా॥ ఓ యర్జునా! శాస్త్రములచే నియమింపబడిన యే కర్మలేక యే యనుష్ఠానము "ఇది చేయదగినదియే" యని యెఱింగి యాసక్తిని ఫలమును విడిచి చేయబడుచున్నదో, అట్టి త్యాగమే సాత్త్వికత్యాగము.

వి॥ విధిని తెలియక చేయవలసినదానిని చేయకపోవుట తామసము. విధి నెఱింగియు యభిమానముజేతగాని, సహనములేక గాని చేయుదానిని విడుచుట రాజసము. విధిని యెఱింగి సహనము గలిగి యభిమానమును ఫలమును త్యజించి చేయ వలసిన కార్యము కొంచమైనను విడువక చేయుటసాత్త్వికమనబడును, ఇదే తామస రాజస, సాత్త్వికకర్మలయొక్కరహస్యము. సాత్త్వికస్వభావముగల వాడు మాత్రమే ముక్తుడగును, రాజసుడు మోక్షాపేక్షగలవాడగును, తామసునికి ముక్తియనునదియే తెలియదు.

శ్లో॥ న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥ 10

పద॥ న - ద్వేష్టి - అకుశలం - కర్మ - కుశలే - న - అనుషజ్జతే. త్యాగీ - సత్త్వసమావిష్టః - మేధావీ - ఛిన్నసంశయః.

ప్రతి॥ సత్త్వమావిష్టః = సత్త్వగుణ ప్రధానుడగు, త్యాగీ = కర్మఫలత్యాగి, ఛిన్నసంశయః = సంశయరహితుడును, మేధావీ = ప్రజ్ఞావంతుడునునై, అకుశలం కర్మ = సంసారబంధకారణమైనట్టికర్మను(ప్రయాసమైన కర్మను) న ద్వేష్టి = ద్వేషింపడు, కుశలే = చేయుటకు సులభమైనట్టిగాని లేక సుఖకరమైనట్టిగాని కర్మయందు, న అనుషజ్జతే = ఆసక్తుడుగాడు.

తా॥ సత్త్వగుణప్రధానుడగు కర్మఫలత్యాగి సంశయరహితుడును, ప్రజ్ఞావంతుడునునై సంసారబంధకారణమైనట్టియును, ప్రయాస

కరమైనట్టియునగు కర్మను ద్వేషింపడు. చేయుటకు సులభమైనట్టిదియు లేక సుఖకరమైనట్టిదియునగు కర్మయందు నాసక్తుడు గాడు.

వి॥ ప్రజ్ఞావంతుడు తాను చేయవలసిన కార్యము భారమైనదైనను చేయక మానడు. సుఖకరమైనదైనను చేసియు దానివలన బద్ధుడును కాడు.

శ్లో॥ న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥ 11

పద॥ న - హి - దేహభృతా - శక్యం - త్యక్తుం - కర్మాణి - అశేషతః,
యః - తు - కర్మఫలత్యాగీ - సః - త్యాగీ - ఇతి - అభిధీయతే

ప్రతి॥ హి = ఏకారణమువలన, కర్మాణి - కర్మలను, అశేషతః = నిశ్శేషముగా, త్యక్తుం = త్యజించుటకు, దేహభృతా = దేహధారి యగువానికి, న శక్యం = సాధ్యము కాదో ఆ కారణమువలన, యః తు = ఎవడైతే, కర్మఫలత్యాగీ = కర్మఫలమును త్యజించుచున్నాడో, సః = వాడు, త్యాగీ ఇతి = త్యాగి యని (సంన్యాసి యని), అభిధీయతే = చెప్పబడుచున్నాడు.

తా॥ ఏలయనగా కర్మలను నిశ్శేషముగా త్యజించుటకు దేహధారియగువానికి శక్యముగాదు. అందువలన నెవడైతే కర్మఫలములను త్యజించుచున్నాడో, వాడే సన్న్యాసియనియు, త్యాగియనియు చెప్పబడుచున్నాడు.

వి॥ దేహ సంరక్షణయందెంతవఱకు సంకల్పముగలదో, అంతవఱకు నెవరును సర్వకర్మఫలత్యాగము చేసినవారు కారు. కావున దేహసంరక్షణబుద్ధిగలిగియుండు వఱకు తాను చేయవలసిన విధిని నిర్వహించి ఫలాసక్తిని విడుచుటయే నిజమైన త్యాగమును, సన్న్యాసమును అగును. అట్లు చేయక దేహసంరక్షణయందాసక్తి గలిగి తాను నిర్వహించవలసిన ధర్మమును విడిచియుండుట త్యాగముగాని సన్న్యాసముగాని కాదు, అది సోమరితనమేగాని సోఽహంపరత్వముగాదు.

శ్లో॥ అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ 12

పద॥ అనిష్టం - ఇష్టం - మిశ్రం - చ - త్రివిధం - కర్మణః - ఫలం,
భవతి - అత్యాగినాం - ప్రేత్య - న - తు - సన్న్యాసినాం - క్వచిత్,

ప్రతి॥ అత్యాగినాం = కర్మఫలత్యాగము చేయనివారలకు. ప్రేత్య = మరణానంతరము, కర్మణః ఫలం = వారు చేసిన కర్మలయొక్క ఫలము, అనిష్టం =

అనిష్టమైనదిగానైనను (పాపకర్మమైనను), ఇష్టం = ఇష్టమైనదిగానైనను పుణ్యమైనదియును, మిశ్రం చ=ఇష్టానిష్టములు మిశ్రమములుగా గలదిగా నైనను, త్రివిధం=ఇట్లు మూడువిధములు గలదిగా, భవతి = అగుచున్నది, సన్న్యాసినాం తు = కర్మఫలత్యాగము చేసినవారికన్ననో, క్వచిత్ = ఇహ పరలోకములలో నొకప్పుడును, న = కలుగదు.

తా॥ కర్మఫల మిష్టమనియు, అనిష్టమనియు, మిశ్రమమనియు అనగా పాపము, పుణ్యము, మిశ్రమని మూడువిధములుగా నున్నది. పైనచెప్పిన త్రివిధములైన కర్మఫలములు పరమార్థజ్ఞానముగల కర్మ ఫలత్యాగులకు గలుగవు. ఫలత్యాగముచేయని కర్మరులకు గలుగును.

వి॥ కొందరు వేదాంతులుగూడ కర్మములెవ్వియు చేయగూడదు; చేసినచో దాని ఫలముకొఱకై మఱల జన్మమెత్తవలసివచ్చునని చెప్పుదురు. అట్టివారి యొక్క ప్రజ్ఞ దీనివలన తెలిసికొనవచ్చును. శాస్త్రసారమెఱింగిన బ్రహ్మనిష్ఠులగు గురువులవద్ద వేదాంతార్థము శ్రవణము చేయనందుచే నిట్టి ప్రమాదము గలుగు చున్నది. కనుకనే "శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" అని ముండకోపనిషత్తు గురువుల యొక్క లక్షణమును చెప్పుచున్నది. శాస్త్రసారమెఱింగినవాడును బ్రహ్మనిష్ఠుడు నగు ఆచార్యుడు నుండవలెను. వట్టి శాస్త్రముమాత్రముండిన చాలదు; బ్రహ్మనిష్ఠ గలిగియుండవలెను. నట్టి బ్రహ్మనిష్ఠమాత్రముండిన చాలదు; శాస్త్రధర్మముగూడ నెఱింగియుండవలెను. వట్టి నీళ్ళచేతగాని, వట్టి నిప్పుచేతగాని రైలు ఇంజను పరుగెత్తజాలదు. ఏలాగున నీళ్ళు నిప్పు ఉండిన మాత్రమే స్టీమేర్పడి ఇంజను పరుగెత్తుచు రైలులోగల వేలకొలది జనులను గమ్యస్థానము చేర్చుచున్నదో, అలా గున శాస్త్రానుభవము గలవాడే తనను తన్నాశ్రయించిన భక్తులను మోక్షస్థానము నకు చేర్చగల శక్తి గలిగియుండును. కనుకనే "శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" అని చెప్పడమైనది.

శ్లో॥ పంచైతాని మహాబాహో ! కారణాని నిబోధ మే।
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥ 13

పద॥ పంచ - ఏతాని - మహాబాహో - కారణాని - నిబోధ - మే,
సాంఖ్యే - కృతాన్తే - ప్రోక్తాని - సిద్ధయే - సర్వకర్మణామ్.

ప్రతి॥ హే మహబాహో ! = ఓ [illegible] కర్మణాం=సమస్తకర్మలయొక్క సిద్ధయే = సిద్ధికొఱకు, కృతాన్తే సాంఖ్యే ప్రోక్తాని = కర్మరాహిత్యమును

గుఱించి తెలుపు వేదాంతశాస్త్రమున లేక సాంఖ్యశాస్త్రమునందు చెప్ప బడిన, ఏతాని = ఇక చెప్పబోయెడు, పంచకారణాని = ఐదుకారణములను, మే = నావలన, నిబోధ = తెలిసికొనుము,

తా॥ సకలకర్మలయొక్క సిద్ధికొఱకు కర్మరాహిత్యమే అంతముగా గలిగి తత్త్వజ్ఞానమును కలుగజేయు వేదాంతశాస్త్రమునందు లేక సాంఖ్యశాస్త్రమున చెప్పబడిన యిక చెప్పబోయెడు నైదుకారణ ములను నేను చెప్పెదను వినుము.

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥ 14

పద॥ అధిష్ఠానం - తథా - కర్తా - కరణం - చ - పథృగ్విధం,
వివిధాః - చ - పృధక్ - చేష్టాః - దైవం - చ - ఏవ - అత్ర - పంచమమ్

ప్రతి॥ అత్ర = ఈ కర్మాచరణ విషయమునందు, అధిష్ఠానం = కార్యస్థానము (శరీరము), తథా = అలాగుననే, కర్తా = చేయువాడును, పృథగ్విధం= అనేక విధములైన, కరణం చ = సాధన సంచయమును, వివిధాః = నానా విధములుగను, పృథక్ = వేరువేరుగాను నున్న, చేష్టాః చ = వ్యాపార ములును, పంచమం = ఐదవదియగును, దైవం చ ఏవ = దైవమును అనునవియే కారణములుగా నున్నవి.

తా॥ ఈ కర్మాచరణ విషయమునందు కార్యస్థానమగు దేహము, అలాగుననే చేయువాడును, అనేక విధములైన సాధన సంచయమును, నానావిధములుగాను వేరువేరుగా నుండునట్టి వ్యాపారములును, ఐదవది యగు దైవమనునదియు కారణములుగా నున్నవి.

వి॥ (1) అధిష్ఠానము అనగా శరీరము, (2) కర్తయనగా ఉపాధితో కూడిన జీవుడు. (3) కరణమనగా జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, మనస్సు, బుద్ధియు,(4) చేష్ట యనగా నీ పండ్రెండింద్రియములయొక్క వ్యాపార ములు (5) దైవమనగా అదృష్ట పుణ్యాపాపములు లేక ఇంద్రియాధిష్ఠానదేవతలు

శ్లో॥ శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః ।
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ॥ 15

పద॥ శరీరవాఙ్మనోభిః - యత్ - కర్మ - ప్రారభతే - నరః,
న్యాయ్యం - వా - విపరీతం - వా - పంచ - ఏతే - తస్య - హేతవః,

ప్రతి॥ నరః = మనుజుడు, శరీరవాఙ్మనోభిః = శరీరము, వాక్కు, మనస్సు వీనిచేత, న్యాయ్యం వా = న్యాయమైనట్టిగాని విపరీతం వా = అన్యాయమైనట్టిగాని, యత్ కర్మ = ఏ కర్మము, ప్రారభతే = ప్రారంభించుచున్నాడో, తస్య = ఆ కర్మమునకు, ఏతే = ఈపైచెప్పబడిన, పంచ = ఐదును, హేతవః = కారణములు (అగుచున్నవి).

తా॥ మనుష్యుడు శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను, జేయునట్టి మంచికర్మకును, చెడుకర్మకును పైన చెప్పబడిన యధిష్ఠానాదులైదును కారణములు.

శ్లో॥ తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః ।
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః ॥ 16

పద॥ తత్ర - ఏవం - సతి - కర్తారం - ఆత్మానం - కేవలం - తు - యః,
పశ్యతి = అకృతబుద్ధి త్వాత్ - న - సః - పశ్యతి - దుర్మతిః

ప్రతి॥ తత్ర = ఆ కర్మవిషయమునందు, ఏవం సతి=ఇట్లు ఐదుకారణములుండగా యః తు=ఎవడైతే, అకృతబుద్ధిత్వాత్ =గురుశాస్త్రోక్తవాక్యములచే సంస్కరింపబడని బుద్ధిగలవాడగుటవలన. కేవలం ఆత్మానః = నిరుపాధికమైన ఆత్మను, కర్తారం = కర్తనుగా, పశ్యతి =చూచుచున్నాడో, సః దుర్మతిః= శాస్త్రాచార్యులవాక్యములచే సంస్కరింపబడని అట్టి మలినమనస్సుగలవాడు, న పశ్యతి = కర్మములయొక్క నిజస్వరూపమును ఎఱుగడు.

తా॥ ఇట్లు సకల కర్మలకు నధిష్ఠానాదికములైదును కారణము లగుచుండగా, నిరుపాధికమును సంగరహితము నగు నాత్మను కర్తగా తలచువాడు సద్గురూపదేశముచేతను, సచ్ఛాస్త్రముచేతను సంస్కరింపబడని చిత్తము గలవాడగుటవలన, మలినమనస్సు గలవాడగుటవలన ఆత్మయొక్కగాని, కర్మయొక్కగాని సత్యమును తెలిసికొనజాలడు.

వి॥ ఆత్మశుద్ధిలేనివాడు జన్మాంతరకర్మవాసన లుండుటవలననే మనస్సు ఇంద్రియములు పుణ్యపాపకర్మలలో ప్రవర్తించుచున్నవని తెలిసికొన జాలడు

ఆత్మ శుద్ధి గలవాడీ సంస్కారముండుటవలన కర్మయందు ప్రవృత్తి గలుగు చున్నదని తలంచి అట్టి కర్మను రహిత మొనర్చుటకు యత్నించును.

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే।
హత్వాऽపి స ఇమాఀ లోకాన్న హన్తి న నిబధ్యతే॥ 17

పద॥ యస్య - న - అహంకృతః - భావః - బుద్ధిః - యస్య - న - లిప్యతే,
హత్వా - అపి - సః - ఇమాఀ - లోకాఀ - న - హన్తి - న - నిబధ్యతే,

ప్రతి॥ యస్య = ఎవనికి, అహంకృతః = అహంకారయుక్తమైన, భావః=భావము, న = లేదో, యస్య = ఎవనియొక్క, బుద్ధిః = బుద్ధి, న లిప్యతే = తాను చేయుకర్మమునందు ఆసక్తినొందదో, సః = అట్టివాడు, ఇమాఀ లోకాఀ = (మనయెదుటనుండు) ఈ జనులనందఱిని, హత్వా అపి = చంపినను, న హన్తి = చంపినవాడు కాడు, న నిబధ్యతే = కర్మమువలన బద్ధుడును గానేరడు.

తా॥ ఎవనికి నేనీ కర్మను జేయుచున్నాననెడి యహంకార యుక్తమైన భావములేదో, ఎవనియొక్క బుద్ధి తాను చేయు కర్మము నందాసక్తినొందదో, అట్టివాడీజనులందఱిని అనగా మనయెదుట నుండువారిని చంపినను చంపినవాడు కాడు. కర్మమువలన బద్ధుడును గానేరడు.

వి॥ అర్జునుని గురించి చెప్పిన యీ విషయ మితరులకు సంబంధించినదిగాదు. ఏలన అన్యాయముగాయుద్ధమునకువచ్చియుండుశత్రువులను నిగ్రహించిప్రజలను పాలించెడు హింసలో దోషములేదు. అర్జునుడు క్షత్రియుడగుటచేతను అన్యాయ ముగా అధర్మయుద్ధమునకు వచ్చియుండు నీ కర్మతులను ధర్మశాస్త్రము నను సరించి వధించుటలో నీకర్తృత్వమేమియులేదు. ధర్మశాస్త్రమాలాగున విధించుట వలన నీవు నిస్సంగుడవై యుద్ధుమని భగవంతు డుపదేశించడమైనది. కర్తృ త్వము వహించి, అన్యాయముగా నితరులను యుద్ధములో పురికొల్పి జనులను నశింపజేసి యీ రాజ్యభోగము ననుభవించవలెనను కర్మఫలాసక్తియు నీ యందు లేదు. కావున దుర్యోధనాదులను వధించుటలో నీకు దోషములేదు. కావుననే "ఇమాఀలోకాఀ" ఈ ముందట కనిపించెడు జనులను అని ప్రత్యేకముగ చెప్పడమైనది. ఇది యొకటిగాదు, సత్యధర్మనిష్ఠగల న్యాయాధిపతులుగూడ ఖూనీచేసెడు నేరస్థులకు మరణదండన విధించుచున్నారు. అందువలన వారి కేవిధమైన పాపము గలుగుటలేదు. అదేప్రకారము మహాసత్వాత్ముడు, ధర్మ

శీలుడు, బ్రహ్మజ్ఞానసంపన్నుడు అయిన యమధర్మరాజు పాపులను ఘోరనరకములో పడత్రోయుచును, పుణ్యాత్ములను స్వర్గలోకమునకు బంపుచును, ధర్మశాస్త్రము ననుసరించి వివిధధర్మముల విధించుచుగూడ, తాను కర్మచేతగాని, కర్మఫలముచేత గాని బద్ధుడగుటలేదుగదా! అట్లే నీవును కర్తృత్వరహితుడవై కర్మలజేసియు కర్మబద్ధుడువుగావు/అని అర్జునునికి భగవాను డుపదేశించెను. భగవద్వచనముయొక్క సారము ఇదియే. అంతేగాని యీ శ్లోకముయొక్క పరమార్థరహస్యము తెలిసికొనక కొందఱు వేదాంతులు ఎవనికి నేనుచేయుచున్నానను అహంకారముగాని కర్మమునందు ఆసక్తికాని లేదో వాడు ఎన్ని పాపకర్మములు చేసినను దోషములేదని విపరీతార్థమును చెప్పుదురు. ఆత్మజ్ఞానము గలుగునప్పుడు తన యాత్మవలెనే సమస్తప్రాణికోట్ల ఆత్మలని జ్ఞానము గలుగును. అప్పుడు తన దేహమునుగాని, మనస్సునుగాని తానెట్లు పీడింపజాలడో, అలాగున ఒక్కప్రాణినైన బాధపెట్టనొల్లడు. ఇదేనిజమైన ఆత్మజ్ఞానము గలిగినవానికి గుర్తు.యమధర్మరాజు మహాబ్రహ్మజ్ఞానియని కఠోపనిషత్తునందు నచికేతునికొఱకు బోధించిన ఆత్మజ్ఞానమును చూచినచో, అందఱికిని తెలియగలదు. మఱియు నర్జునుడు గృహస్థుడు. అంతేగాక క్షత్రియుడు, అదియునుగాక ప్రజలను పాలించువాడు, ఈధర్మమును యోచింపక తాము బ్రహ్మజ్ఞానులమనియు, వేదాంతులమనియు సాధువులమనియు, సన్న్యాసులమనియు చెప్పువారలలోకొందఱు 'అభిమానమును ఫలాసక్తియును గలవారికే కర్మచే బంధముగాని, అవిలేనివారికి బంధములేద'ని చెప్పుటలో పరమాశ్చర్యము గలుగుచున్నది. బ్రహ్మనిష్ఠులగు మహనీయుల దగ్గర శాస్త్రశ్రవణము చేయని దోషమే యిట్టి విపరీతార్థము గలుగుటకు కారణము. మఱియు క్షత్రియులమని చెప్పుకొనుచు కొందఱు అర్జునుని కుపదేశించిన యీ వాక్యము నాధారము చేసుకొని ప్రాణిహింసలు చేయుచుందురు, క్షత్రియులు క్షత్రియవంశములో పుట్టిన మాత్రముచే నట్లు చేయకూడదు. ప్రజలను పాలించు ప్రభువులకు మాత్రమే దుష్టనిగ్రహ శిష్టపాలనము తగును. మఱియు నాత్మజ్ఞానవిషయములో అంతయు దైవమయముగా నతనికి కనిపించవలసియుండును, అంతేగాక సుఖదుఃఖ; శీతోష్ణ, రుచి అరుచి, స్తుతి నింద. లాభ నష్టములనెడు ద్వంద్వములకతడతీతుడు గావలసియుండును. ఇట్టి ద్వంద్వములలో తగులుకొనక నిస్సంగత్వముగల ఆత్మస్థితిని పొందినవారిప్పుడు లోకములో నెంతమంది యున్నారని యోచించుకొనవలెను. కావుననే "ద్వంద్వాతీతో విమత్సరః" అని జ్ఞానినిగుఱించి చెప్పడమైనది.

మఱియు నింకొొక యర్థము గూడగలదు. శ్రీ కృష్ణభగవానుడు అర్జునునికి విశ్వ రూపమును జూపి యంతయు తన వలననే జరుగుచున్నదనియు, నీవు నిమిత్త మాత్రుడవే యనియు యేలాగున ఉపదేశించెనో, అదే రీతిగా సమస్తమును భగవదాజ్ఞ వలననే జరుగుచున్నదని సాక్షాదనుభవము గలవాడు తన్ను అకర్తగా తలంచి సర్వాంతర్యామియగు సర్వేశ్వరుని కర్తగా భావించుట వలనను బద్ధుడుగాడు. ఇది యుపాసనా మార్గభక్తితో సంబంధించినది. అయితే కొందఱు సామాన్యభక్తులు తమకేదైన యొక్క సంకల్పము గలిగినచో అది భగవత్‌సంకల్పమనియు, భగవత్ ప్రేరణయనియు,భగవదాజ్ఞ యనియు సులభముగా చెప్పుదురుగాని,అది తన సంకల్పమా?లేక భగవత్ సంకల్పమా? దానిని ఎట్లు తెలిసికొనగలిగిరి!అదిమాత్రము సామాన్య విషయముకాదు.తమ జన్మాంతర సంస్కారము ననుసరించిగాని లేక యీ జన్మలో గలిగిన సంకల్పముగాని యుండినచో, అది అభివ్యక్తమగుచుండును. కొంత భగవద్భక్తిచేత కొంత చిత్తైకాగ్రత గలుగునప్పు డీసంకల్పములన్నియు, వాన కురియునప్పుడు అంతవఱకు కనబడక భూమిలోనుండు బీజము అంకురించునట్లు ఆవిర్భవించును. దానిని చూచి దైవ సంకల్పమని సామాన్యముగా జనులు చెప్ప ప్రారంభింతురు. ఇదియు నొక ప్రమాదకార్యము. ఇట్టి కార్యము సామాన్యముగా కొంత పుణ్యమును, కొంత దైవశక్తియును, ఆత్మశుద్ధియు గలిగిన వారికి మాత్రమే గలుగును. ఈ పవిత్రభావములు తప్ప తక్కినవారికి గల సంకల్పము లన్నియు వారి వారి జన్మాంతర కర్మల సంస్కారములని నిశ్చయించుకొనవలయును. ఈ సత్యమును తెలిసికొనక భగవంతునిపై మోపుటగూడ యొక విధమైన దోషమని సాధారణ జనులెఱుంగరు. ప్రకాశము లేనికొన్ని నక్షత్రములు కొన్ని గ్రహములు ఆకాశమండలములో గలవు. గ్రహసంచారము ననుసరించి సూర్యుని దగ్గఱగా వచ్చునప్పుడు అవి మనకు గోచరము లగుచుండును. కారణ మేమన సూర్య ప్రకాశము వాటియందు పడుటచేతనే అవి గోచరించును. అలాగున హృదయమందు ధ్యాన ప్రకాశము గలుగునప్పుడు తన సంస్కారరూప సంకల్పములు గోచరమగుచుండును. దీనిని చూచి దైవసంకల్పమని సాధారణ జనులుగూడ చెప్పనారంభింతురు. సత్యబుద్ధి గలవారు దైవభక్తి గలవారట్లు చెప్పక తనకు ఈ పుణ్యకార్యములు చేయుటకు సంకల్పము గలిగినదని చెప్పిన చాలును. దైవ సంకల్పమైనచో అది నిర్విఘ్నముగా జరుగవలయును. ఇదే తన సంకల్పమునకును, దైవసంకల్పమునకు గల భేదము. దైవ సంకల్పము నెఱుగుట

సామాన్యమైన కార్యముగాదు. గొప్ప ఋషులకు మాత్రమే సాధ్యమగును. తక్కిన వారందరికిని తాను నడచునప్పుడు తన నీడ తన్ను విడువక యెట్లు వెంబడించునో, అలాగున వానియొక్క కర్మము వానిని విడువకనే యుండును. తాను ఏ విత్తనము భూమియందు పెట్టెనో అదే వానికి ఫలము నిచ్చునట్లు ఏ కర్మమునుచేయునో ఆ కర్మఫలమును తాను తప్పక అనుభవించవలెను. పరమ భక్తులకుదైవ మందెంత విశ్వాసము గలదో, శుద్ధాత్ములకు తాను చేయు కర్మ యందంత విశ్వాసము గలిగి యుండవలెను. సర్వేశ్వరుడు సత్యస్వరూపుడు. ఎప్పుడును పక్షపాతము గలవాడుగాడు. కావున తాము చేయు పుణ్యపాప కర్మల ననుసరించియే వారికి మేలుగాని, కీడుగాని కలుగజేయునని కర్మయందు విశ్వాసము గలిగియుండవలెను.

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥ 18

పద॥ జ్ఞానం - జ్ఞేయం - పరిజ్ఞాతా - త్రివిధా - కర్మచోదనా,
కరణం - కర్మ - కర్తా - ఇతి - త్రివిధః - కర్మసంగ్రహః.

ప్రతి॥ కర్మచోదనా = కర్మప్రేరకము (కర్మను ప్రేరేపించునది), జ్ఞానం = తెలియుట యనియు, జ్ఞేయం = తెలియదగిన విషయమనియు, పరిజ్ఞాతా = తెలియు వాడనియు, త్రివిధా = మూడు విధములు గలదిగా నున్నది. కర్మసంగ్రహః = కర్మకు ఆధారము, కరణం = ఉపకరణము, కర్మ = చేయుట, కర్తా = చేయువాడు, ఇతి = అని, త్రివిధః = మూడువిధములు గలదిగా నున్నది.

తా॥ కర్మ ప్రేరకము అనగా కర్మను ప్రేరేపించునది తెలియుట యనియు, తెలియదగిన విషయమనియు, తెలియువాడనియు మూడు విధములుగా నున్నది. కర్మకు ఆధారము ఉపకరణము, చేయుట, చేయువాడు అని మూడు విధములుగా నున్నది.

శ్లో॥ జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥ 19

పద॥ జ్ఞానం - కర్మ - చ - కర్తా - చ - త్రిధా - ఏవ - గుణభేదతః,
ప్రోచ్యతే - గుణసంఖ్యానే - యథావత్ - శృణు - తాని - అపి.

ప్రతి॥ జ్ఞానం = జ్ఞానము, కర్మ చ = కర్మయు, కర్తా చ = కర్తయును, గుణసంఖ్యానే = గుణములను గుఱించి బోధించు సాంఖ్యశాస్త్రమునందు, గుణభేదతః = సత్త్వరజస్తమో గుణభేదమువలన, త్రిధా ఏవ = మూడు విధములుగానే, ప్రోచ్యతే = చెప్పబడుచున్నది. తాని అపి = సత్త్వాది గుణములచేత వేరైన జ్ఞానమును, కర్మను కర్తనుగూడ, యథావత్ = శాస్త్రోక్త ప్రకారముగా, శృణు = వినుము.

తా॥ కార్యాదిభేదముల చేత గుణములను చక్కగా ప్రతిపాదించునదియగు సాంఖ్యశాస్త్రము సత్త్వాది భేదములచేత జ్ఞానము మూడు విధములనియు, కర్మ మూడు విధములనియు, కర్త మూడు విధములనియు చెప్పుచున్నది. కనుక సత్త్వాదిగుణములచేత మూడు మూడు భేదములుగానున్న జ్ఞానము, కర్మయు, కర్తయును మూటిని శాస్త్రోక్తప్రకారము చెప్పెదను వినుము.

శ్లో॥ సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ 20

పద॥ సర్వభూతేషు - యేన - ఏకం - భావం - అవ్యయం - ఈక్షతే,
అవిభక్తం - విభక్తేషు - తత్ - జ్ఞానం - విద్ధి - సాత్త్వికమ్.

ప్రతి॥ యేన = ఏ జ్ఞానముచేత, భావం = ఆత్మవస్తువు, సర్వభూతేషు = సకల భూతములయందు. ఏకం = ఒకటిగాను, అవ్యయం = నాశరహితముగను, విభక్తేషు = వేరువేరుగా విభజింపబడియుండు సర్వవస్తువులలో, అవిభక్తం = విభజింపబడనిదిగను, ఈక్షతే = చూచుచున్నాడో, తత్ జ్ఞానం = ఆ జ్ఞానమును, సాత్త్వికం = సాత్త్విక జ్ఞానమని, విద్ధి = ఎరుంగుము.

తా॥ ఏ జ్ఞానముచేత ఆత్మవస్తువును సకల భూతములయందు ఒకటిగను, నాశరహితముగను, వేరువేరుగా విభజింపబడియుండు సర్వవస్తువులలో విభజింపబడనిదిగను చూచుచున్నాడో, ఆ జ్ఞానమును సాత్త్విక జ్ఞానమని ఎఱుంగుము.

శ్లో॥ పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్॥ 21

పద॥ పృథక్త్వేన - తు - యత్ - జ్ఞానం - నానాభావాన్ - పృథగ్విధాన్,
వేత్తి - సర్వేషు - భూతేషు - తత్ - జ్ఞానం - విద్ధి - రాజసమ్.

ప్రతి॥ యత్ జ్ఞానం తు = ఏజ్ఞానమైతే, సర్వేషు భూతేషు = సమస్తభూతములయందు, పృథగ్విధాన్ = వేరువేరు రూపములతో నుండెడు,నానాభావాన్ = అనేకములగు జీవాత్మలను, పృథక్త్వేన = వేరువేరు జీవాత్మలనుగా, వేత్తి = ఎఱుంగుచున్నదో, తత్ జ్ఞానం = ఆ జ్ఞానమును, రాజసం = రాజసజ్ఞానమని, విద్ధి = ఎఱుంగుము.

తా॥ ఏ జ్ఞానముచేతనైతే సమస్త భూతములయందును వేరు వేరు రూపములతో నుండెడు అనేకములగు జీవాత్మలను వేరువేరుగా నెఱుంగుచున్నాడో, ఆ జ్ఞానమును రాజసజ్ఞానమని యెఱుంగుము.

శ్లో॥ యత్తు కృత్స్నవదేకస్మిన్కార్యే సక్తమహైతుకమ్ ।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ ॥ 22

పద॥ యత్ - తు - కృత్స్నవత్ - ఏకస్మిన్ - కార్యే - సక్తం - అహైతుకం,
అతత్త్వార్థవత్ - అల్పం - చ - తత్ - తామసం - ఉదాహృతమ్.

ప్రతి॥ యత్ తు = ఏజ్ఞానమైతే, ఏకస్మిన్ కార్యే = ఏదేనియొక్క కార్యమునందే, కృత్స్నవత్ = సమస్తమునువలె, సక్తం = దానియందే తగిలిన మనస్సు గలదియు, అహైతుకం = అ కారణమైనదియు అనగా యుక్తి లేనిదియు, అతత్త్వార్థవత్ = తత్త్వమును తెలియనిదియు, అల్పంచ = స్వల్పమైనదియు నగుచున్నదో, తత్ = అట్టి జ్ఞానము, తామసం = తామసజ్ఞానమని, ఉదాహృతమ్ = చెప్పబడిన ది.

తా॥ ఏ జ్ఞానమైతే నేదేని యొక్కదానియందే సమస్తమున్నట్లెంచి, దానియందే ఆసక్తమైన మనస్సుగలదియగుచున్నదో, అట్టి యకారణమైనట్టియు, తత్త్వమును దెలియనిదియు, స్వల్పమైనదియు నగు జ్ఞానము తామసజ్ఞానమని చెప్పబడినది.

వి॥ 20, 21, 22, శ్లోకములలో సాత్త్విక, రాజస, తామసజ్ఞానములను గురించి చెప్పబడినది. బ్రహ్మాదిపిపీలికాపర్యంతముకల ప్రాణికోట్లలోనన్నిటిలోను దేహము అంతఃకరణము ప్రస్థానము వీనికి విలక్షణమై వ్యాపించి వెలుగు చుండెడు ఆత్మవస్తువు ఒకటేయని కలిగెడు జ్ఞానము సాత్త్వికమనబడును. ప్రతి

జీవకోట్ల దేహములను చూడక వారిహృదయములోగల గుణములు మంచివా? చెడ్డవా? యని చూచి దేహములతో తన జాతికి అన్యుడైన మనుష్యుడైనను. గుణమును గూర్చి సమానముగా భావించెడు జ్ఞానము రాజసజ్ఞానము, తనజాతిలో పుట్టిన దేహమును మాత్రము జూచి సమానముగా తలంచెడు జ్ఞానముతామస జ్ఞాన మనబడును. ఈ మూడుజ్ఞానములలో నొక్కొక్కరికిని ఇతరమనుజులలో నెట్టిభావములున్నవో తెలిసికొనిన తనకు గలిగిన జ్ఞానమురాజసమా? తామసమా? యని గ్రహించుకొనవచ్చును. ఇతర ప్రాణిసముదాయమును విడిచి పెట్టి మానవులను మాత్రము గ్రహించి వారివారివర్గము లేక వారివారి ఆశ్రమము లేక వారివారి మతమునుగూర్చి గలిగెడుప్రేమ తామసమనియు. ఏ వర్ణము గాని, యే ఆశ్రమముగాని, మతముగాని,చూడక గుణములే ప్రధానముగా నెంచి ప్రేమించెడు జ్ఞానము రాజసమనియు, వర్ణమునుగాని, మతమునుగాని, గుణమునుగాని చూడక అందఱిలో నొకే సర్వేశ్వరుడే యున్నాడని, లేక ఒకే యాత్మస్వరూపమే వెలుగుచున్నదని తెలిసికొనెడు జ్ఞానము సాత్త్విక మనబడును. ఇప్పుడు మనకు గలిగియుండు జ్ఞానము దేహమును గురించియా? లేక గుణమును గురించియా? లేక ఆత్మను గురించియా? అని యొక్కొక్కరును విచారణ చేసికొనవలెను. సాత్త్వికజ్ఞాన ముత్తమమనియు రాజసజ్ఞానము మధ్యమమనియు, తామసజ్ఞాన మధమమనియు చెప్పబడు చున్నది. కావున ఉత్తమమగు దైవజ్ఞానము గలుగకపోయినను, మధ్యమమైన జ్ఞానము సంపాదించుకొనవలసినదిగదా? అధమజ్ఞానములోనుండుట తగునా యని ఒక్కొక్కరు నాలోచించుకొనవలెను. గుణమును గుఱించిన జ్ఞానము గలిగిన యందఱిలోను సోదరభావము గలుగును. అట్లు గలుగక ఉపన్యాస వేదికలపై నిలిచి 'సోదరీసోదరులారా! యని గంభీరధ్వనితో పలికెడుమాటకు వేదికనుండి క్రిందికి దిగువరకు మాత్రమే యాయుస్సు యుండును. తాను మాటలాడుమాటలకు అట్టు అల్పాయుస్సుగాక చిరాయుస్సు గలిగియుండేలాగున చూడవలెను.అప్పుడు మాత్రమే యావాక్యము అర్థవంతమైనది యగును. అట్లుగానిది నిరర్థకమని గ్రహింతురుగాక! మొదటిది దైవజ్ఞానమనియు. రెండవది మనుష్యజ్ఞానమనియు, మూడవది మృగజ్ఞానమనియు తెలియదగినది.

శ్లో॥ నియతం సంగరహితమరాగద్వేషతః కృతమ్ ।
అఫల ప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే ॥ 23

పద॥ నియతం - సంగరహితం - అరాగద్వేషతః - కృతం,
అఫల ప్రేప్సునా - కర్మ - యత్ - తత్ - సాత్త్వికం - ఉచ్యతే.

ప్రతి॥ నియతం = శాస్త్రముచే నియమింపబడినదై, అఫలప్రేప్సునా = ఫలాపేక్షలేని వానిచే, సంగరహితం = ఆసక్తిలేనిదిగను, అరాగద్వేషతః = రాగద్వేషములులేకయును, కృతం = చేయబడినట్టి. యత్ =ఏ, కర్మ= కర్మగలదో, తత్ =అది, సాత్త్వికం = సాత్త్వికకర్మయని. ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ శాస్త్రములచే నియమింపబడినదై ఫలాపేక్షలేని వానిచే నాసక్తిరహితముగను, రాగద్వేషములు లేకయును, జేయబడునట్టి యేకర్మగలదో, అతి సాత్త్వికకర్మయని చెప్పబడుచున్నది.

వి॥ శాస్త్రముచే నేయే యనుష్ఠానము గలవారికి నే యే ధర్మము విధింబబడియున్నదో దానిని విడువకయు, శత్రుపక్షముపై ద్వేషములేకయు, మిత్రపక్షముపై ప్రీతిలేకయు లోకము స్తోత్రము చేయవలెనను తలంపుతో జేయక, సత్యబుద్ధితో తన కర్మను నిర్వర్తించుట సాత్త్వికకర్మ యనబడును.

శ్లో॥ యత్తుకామేప్సునా కర్మ సాహఙ్కారేణ వా పునః ।
క్రియతే బహుళాయాసం తద్రాజసముదాహృతమ్ ॥ 24

పద॥ యత్ - తు - కామేప్సునా - కర్మ - సాహంకారేణ - వా - పునః,
క్రియతే - బహుళాయాసం - తత్ - రాజసం - ఉదాహృతమ్.

ప్రతి॥ యత్ కర్మ తు = ఏ కర్మయైతే. కామేప్సునా = ఫలము నపేక్షించు వానిచేతగాని, పునః = లేక, సాహంకారేణ వా =నేను కర్తనని యహంకరించెడు వానిచేతగాని, బహుళాయాసం = బహుప్రయాసయగునట్లుగా, అనగా, దానియందు ప్రీతిలేక చేయకవిధిలేదని ఆయాసపడి, క్రియతే = చేయబడుచున్నదో, తత్ = ఆకర్మ, రాజసం = రాజస కర్మయని, ఉదాహృతమ్ = చెప్పబడినది.

తా॥ ఫలాభిలాష గలిగినవానిచేతగాని లేక నేనుకర్తను అనునట్టి యహంకారముతో గూడుకొనినవానిచేతగాని చేయబడునట్టియు మనస్సులో ప్రీతిలేక విసుగుకొని బహుప్రయాసతో చేయబడునట్టిదియునగు కర్మ యేదిగలదో, యది రాజసకర్మయని చెప్పబడుచున్నది

వి॥ ప్రీతితో నెంతకష్టమైనను సహించి చేసెడు కర్మ సాత్త్వికము. ఇది గొప్ప ఫలమును గలుగజేయును. మనస్సులోవిసుగుకొని విధిలేక చేయవలసి వచ్చినదిగదా! యని చేయు కర్మ రాజసకర్మయగును. దీనిచే కష్టనష్టములు మిగులునేగాని ఫలము కొంచమైనను యుండదు.

శ్లో॥ అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్ ।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామస ముచ్యతే ॥ 25

పద॥ అనుబంధం - క్షయం - హింసాం - అనపేక్ష్య - చ - పౌరుషం, మోహాత్ - ఆరభ్యతే - కర్మ - యత్ - తత్ - తామసం - ఉచ్యతే.

ప్రతి॥ అనుబంధం = తాను చేయబోయెడు కర్మననుసరించి గలుగబోవు క్షయం = నష్టమును, హింసాం = బాధను, పౌరుషం చ=తన శక్తిని, అనపేక్ష్య = ఆలోచించకయే, మోహాత్ = వివేక జ్ఞానములేనందువలన యత్ కర్మ = ఏ కర్మము, ఆరభ్యతే=ప్రారంభింపబడుచున్నదో, తత్= అది, తామసం =తామసకర్మయని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ తాను జేయు కర్మవలన మేలుగలుగునా? కీడుగలుగునా? యనుట, దేహశక్తియొక్కయు, ధనముయొక్కయు నాశనమును ఆ కర్మవలన పరులకుగాని తనకుగాని కలుగుబాధను, తన సామర్థ్యమును యోచింపక అజ్ఞానమువలన చేయబడుకర్మ తామసకర్మయని జెప్పబడుచున్నది.

వి॥ మేలు కీడులను చూడక పూర్తియగువఱకు నిర్వహింప గలుగుదునా లేదా యని యోచించక చేసెడు కర్మ తనకు మంచిదిగా దోచినను, అదియు తామస కర్మమే యగును. ఏలన మలిన బుద్ధియగుటచే దూరాలోచన లేకపోయినది. కనుక నిట్టి సందర్భములో విజ్ఞానము గలవారి సలహాను తెలిసికొనవలెను. నేత్రమందు కామెర్లవ్యాధి గలవానికి అన్నియు పచ్చగానే కనిపించును. జ్వరాదిరోగముచే నాలుక చెడిన వానికి మంచివస్తువు గూడచేదు గానే యుండును, ఇచట తన యనుభవము సరిపోయినను, అది రోగముచే విపరీతము నొందినట్లుండును. అది విధిగాను, ధర్మముగాను, న్యాయముగాను తనకు తోచినను, మనస్సు అట్లు పరిణామమును పొందియుండుట వలన అట్లు కలుగుటకు కారణమైనదని గ్రహింపవలయును.

శ్లో॥ ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26

పద॥ ముక్తసంగః - అనహంవాదీ - ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్య - సిద్ధ్యో - నిర్వికారః - కర్తా - సాత్త్వికః - ఉచ్యతే.

ప్రతి॥ ముక్తసంగః = విడువబడిన సంగముఁగలవాడును, అనహంవాదీ = నేను కర్తననెడు యహంకారమును విడిచినవాడును, ధృత్యుత్సాహసమన్వితః = ధైర్యోత్సాహములతో గూడినవాడును, సిద్ధ్యసిద్ధ్యోః = సిద్ధియందును అసిద్ధియందును, నిర్వికారః = వికారము నొందనివాడు నగు, కర్తా = కర్త, సాత్త్వికః = సాత్త్విక కర్తయని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ ఫలాసక్తి లేనివాడును, నేను కర్తననెడి యహంకారము లేనివాడును, ధైర్యోత్సాహములతో గూడి పనిచేయువాడును, కార్యసిద్ధి గలుగనీ కలుగకపోనీ వికారము నొందనివాడును నగు కర్త సాత్త్విక కర్తయని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ 27

పద॥ రాగీ - కర్మఫలప్రేప్సుః - లుబ్ధః - హింసాత్మకః - అశుచిః,
హర్షశోకాన్వితః - కర్తా - రాజసః - పరికీర్తితః.

ప్రతి॥ రాగీ = బంధువులలో ననురాగము గలవాడును, కర్మఫలప్రేప్సుః = కర్మఫలముఁను గోరువాడును, లుబ్ధః = లుబ్ధుడును (పరధనమందాశ గలవాడును, తన ధనమును ఖర్చు పెట్టనివాడును), హింసాత్మకః = పరులను ఓడించెడు స్వభావము గలవాడును, అశుచిః = దేహశుద్ధియు చిత్తశుద్ధియు లేనివాడును, హర్షశోకాన్వితః= లాభమందు సంతోషమును నష్టమందుదుఃఖమును గలవాడునగు, కర్తా = కర్త, రాజసః = రాజస కర్తయని,పరికీర్తితః =చెప్పబడు చున్నాడు.

తా॥ మిత్రులయందనురాగము గలవాడును. కర్మఫలాభిలాష గలవాడును, లుబ్ధుడును ఇతరుల బాధించు స్వభావముగలవాడును, ఒకవేళ బాహ్యశుద్ధి గలిగినను ఆత్మశుద్ధిలేనివాడును (త్రికరణశుద్ధి

లేనివాడు), తనకనుకూలమగు కార్యము సిద్ధించిన యెడల సంతోషము, ప్రతికూలించినయెడల వ్యసనము గలవాడును అయిన కర్త రాజసకర్తయని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ అయుక్తః ప్రాకృతః స్తబ్ధశ్శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ 28

పద॥ అయుక్తః - ప్రాకృతః - స్తబ్ధః - శఠః - నైష్కృతికః = అలసః,
విషాదీ - దీర్ఘసూత్రీ - చ - కర్తా - తామసః - ఉచ్యతే.

ప్రతి॥ అయుక్తః = మనోనియమము లేనివాడును, ప్రాకృతః = ప్రకృతి గుణములు గలవాడును. స్తబ్ధః = నమ్రతలేనివాడును, శఠః = మోసగాడును, నైష్కృతికః = ఇతరుల జీవనమును జెరచుటయందాసక్తి గలవాడును. అలసః = సోమరితనము గలవాడును, విషాదీ = ఎల్లప్పుడును, వ్యసనము గలవాడును, దీర్ఘసూత్రీ చ = స్వల్పకాలములో చేయవలసిన దానిని దీర్ఘ కాలమునకైనను పూర్తిచేయనివాడు నగు, కర్తా = కర్త, తామసః = తామసకర్త యని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ చిత్తస్థైర్యము లేనివాడును, మూఢుడును, నమ్రత లేనివాడును, కుత్సితుడును, ఇతరుల జీవనమును చెఱచుటయం దాసక్తి గలవాడును, సోమరియును, ఎల్లప్పుడును వ్యసనశీలుడును, కొద్ది కాలములో చేయవలసినదానిని దీర్ఘకాలమునకైనను పూర్తిచేయనివాడు నయిన కర్త తామసకర్తయని చెప్పబడుచున్నాడు 'నైకృతికః' అని పాఠాంతరము.

వి॥ (1) తాను ఏదైన ఒక సత్కార్యమును ప్రారంభించినచో దానివలన లాభముసంపాదించుకొనవచ్చునను తలంపుతోచేయువాడు తామసస్వభావముగలవాడు. వీడు అట్టి కార్యము చేయకుండుటయే మేలు. వీడు సత్కర్మలను భావముతో చేసినను మోసపు పనులగుటచే పాపమునే పొందును. అది దుష్కర్మయే యగును (2) తానేదైన నొకమంచి కార్యము ప్రారంభించిన తనకే లాటి లాభమవసరములేదుగాని, పేరు ప్రతిష్ఠలు కావలెనని తలంపు గలిగినచో, అది రాజస స్వభావము. వీడు కర్మ ఫలాసక్తుడగుట వలన పుణ్యము

గలుగదుగాని, పాపము మాత్రముండదు. (3) తానేదైన నొక దైవకార్యమును ప్రారంభించిన లాభముగాని, పేరు ప్రతిష్ఠలుగాని తనకవసరములేదు. కాని నిర్విఘ్నముగా చక్కగా జరిగిన బాలును. దానిని చూచి యానందించెదనను నది సాత్త్విక స్వభావము. అయితే సాత్త్వికముగూడ ప్రకృతియందు చేరినదగు టచే నదియును బంధమును గలుగజేయును. ఏలన చక్కగా జరుగక పోయిన బాగుగ జరుగలేదని యొక్క మనఃక్లేశము గలుగును ఐతే యిది సత్త్వగుణ ముతో గూడినదగుటచే దైవప్రీతిని, ఆత్మశుద్ధిని గలుగజేయును. (4) తాను మనుష్యప్రయత్నముచే నెంతవఱకు శుద్ధముగా జేయవలయునో అంతవఱకు జాగ్రత్తతో చేసియు దానివలన నిష్టప్రాప్తిగాని, అనిష్ట ప్రాప్తిగాని, గలిగి నను, నిజస్వరూపమగు ఆత్మభావము నుండి (అనగా నిజానందమునుండి) చలింపక యుండువాడు గుణత్రయాతీతుడగును. కట్టకడకు ప్రతివాడును ఈ స్థితిలోనికి రావలసియుండును. అప్పుడే ముక్తాత్ముడగును.

శ్లో॥ బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ! ॥ 29

పద॥ బుద్ధేః - భేదం - ధృతేః - చ - ఏవ - గుణతః - త్రివిధం - శృణు.
ప్రోచ్యమానం - అశేషేణ - పృథక్త్వేన - ధనంజయ!

ప్రతి॥ హే ధనంజయ! = ఓ యర్జునా!, అశేషేణ = నిశ్శేషముగను, పృథక్త్వేన = వేరువేరుగను, ప్రోచ్యమానం = ఇకచెప్పబడునట్టి, బుద్ధేః = బుద్ధియొక్కయు, ధృతేః చ ఏవ = ధైర్యముయొక్కయు, గుణతః = సత్త్వాది గుణములవలన గలిగిన, త్రివిధం = మూడు విధములగు, భేదం = భేదమును, శృణు = వినుము.

తా॥ ఓ యర్జునా! సంపూర్ణముగాను, వివరముగాను నేను చెప్పబోవునట్టివియును, సత్త్వరజస్తమోగుణ భేదములచేత మూడు విధములయినవియునగు బుద్ధియొక్కయు, ధైర్యముయొక్కయు భేదములను వినుము.

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే
బంధం మోక్షం చ యావేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ ॥ 30

పద॥ ప్రవృత్తిం - చ - నివృత్తిం - చ - కార్యాకార్యే - భయాభయే,
బంధం - మోక్షం - చ - యా - వేత్తి - బుద్ధిః - సా - పార్థ! - సాత్త్వికీ.

ప్రతి॥ హే పార్థ! = కుంతీపుత్రుడవగు ఓ యర్జునా!. యా బుద్ధిః = ఏబుద్ధి ప్రవత్తిం చ = బంధహేతువగు కర్మమార్గమును, నివృత్తిం చ = మోక్షహేతువగు నివృత్తిమార్గమును, కార్యాకార్యే = కర్తవ్యాకర్తవ్యములను, భయాభయే = భయాభయములను, బంధం = సంసారబంధమును, మోక్షం చ = సంసారనివృత్తిని, వేత్తి = ఎఱుగుచున్నదో, సా = ఆ బుద్ధి, సాత్త్వికీ = సత్త్వగుణమువలన గలిగినది.

తా॥ కుంతీపుత్రుడవగు ఓ అర్జునా! ఏ బుద్ధి బంధహేతువగు కర్మమార్గమును, మోక్షహేతువగు నివృత్తిమార్గమును, కర్తవ్యాకర్తవ్యములను, భయాభయములను, సంసారబంధమును, సంసారనివృత్తిని యున్నదున్నట్లు ఎఱుంగుచున్నదో, ఆ బుద్ధి సాత్త్వికగుణమువలన గలిగినదిగా తెలియుము.

శ్లో॥ యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ॥
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ ! రాజసీ ॥ 31

పద॥ యయా - ధర్మం - అధర్మం - చ - కార్యం - చ - అకార్యం - ఏవ - చ, అయథావత్ - ప్రజానాతి - బుద్ధిః - సా - పార్థ! - రాజసీ.

ప్రతి॥ హే పార్థ! = ఓ యర్జునా!, యయా = ఏబుద్ధిచేత, ధర్మం = ధర్మమును, అధర్మం చ = అధర్మమును, కార్యం చ = చేయదగినదానిని, అకార్యం ఏవ చ = చేయదగని దానిని, అయథావత్ = ఉన్నదున్నట్లు గాక పొరబాటుగా, ప్రజానాతి = ఎఱుగుచున్నదో, సా బుద్ధిః = ఆ బుద్ధి రాజసీ = రజోగుణము వలన గలిగినది.

తా॥ ఓ యర్జునా! ఏబుద్ధిచేత ధర్మమును, అధర్మమును, చేయదగినదానిని, చేయదగనిదానిని ఉన్నదున్నట్లుగాక పొరబాటుగా నెఱుగుచున్నాడో, ఆ బుద్ధి రజోగుణమువలన గలిగినది.

శ్లో॥ అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా ।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ! తామసీ ॥ 32

పద॥ అధర్మం - ధర్మం - ఇతి - యా - మన్యతే - తమసా - ఆవృతా, సర్వార్థాన్ - విపరీతాన్ - చ - బుద్ధిః - సా - పార్థ! - తామసీ.

ప్రతి॥ హే పార్థ = ఓ యర్జునా!, యా బుద్ధిః - ఏ బుద్ధి, తమసా - అజ్ఞానముచేత ఆవృతా = గప్పబడినదై, అధర్మం = అధర్మమును, ధర్మం ఇతి = ధర్మ మనియు,సర్వార్థాన్=తెలియదగినవాటినన్నిటిని,విపరీతాన్ చ=వ్యత్యస్త ములుగాను (ఒకదానిని మఱియొకటిగాను), మన్యతే =తలంచుచున్నదో, సా = ఆ బుద్ధి, తామసీ = తమోగుణ ప్రధానమైనది.

తా॥ ఓ యర్జునా! ఏ బుద్ధి అజ్ఞానముచేత నావరింపబడినదై యధర్మమును ధర్మమనియు, తెలియదగిన వాటినన్నిటిని విరుద్ధ ములుగా అనగా ఒకదానిని మఱియొకటిగాను తెలిసికొను చున్నదో, ఆ బుద్ధి తమోగుణ ప్రధానమైనది.

వి॥ ఈమూడు శ్లోకములలో బుద్ధియొక్క సాత్త్విక, రాజస, తామసగుణము లను గుఱించి తెలుపడమైనది. (1) జన్మాంతర సుకృతవిశేషముచే నంతఃకరణ శుద్ధి గలవానికి ఒకరు చెప్పకయు, శాస్త్రము చూడకయు నీ కార్యము చేసిన ముక్తియు నీ కార్యముచేసిన బంధమును గలుగునని స్వయముగా జ్ఞానము గలిగియుండును. ఇది సత్త్వగుణముయొక్క స్వభావము. (2) 'ఈ కార్యము చేసిన దుఃఖము ఈ కార్యము చేసిన సుఖముగలుగునని యథార్థముగా తెలియక పోయినను, గొప్పవారి వాక్యముచేతగాని లేక శాస్త్రములో చూచిగాని పూర్వము తనకు గలిగియుండు స్వభావమును వెంటనే మార్చుకొని ప్రవర్తించెడు స్వభావము రాజసమగును, (3) స్వయముగా తెలిసికొనకయు, గొప్పవారు చెప్పినను, శాస్త్రముల వినినను తన స్వభావమును మార్పుచేసికొనక అన్నియు విపరీతముగా చేసెడు స్వభావము తామసమనబడును. సత్త్వగుణ స్వభావము గలవానికి ఈ జన్మములోనే విశుద్ధతత్త్వముగలిగి ముక్తిసిద్ధించును. వీనియందు చెప్పబడిన రాజస స్వభావము గలవానికి మరణానంతరమున మంచి జన్మము గలిగి మోక్షమందు ప్రవృత్తి కలుగును. తామస స్వభావము గలవానికి కాలాంతరమున సత్కర్మయందు బుద్ధి గలిగి అంతఃకరణశుద్ధికలిగి అనేక జన్మ ములకు అవల మోక్షాసక్తి గలిగి ముక్తుడు కావలసియుండును. సత్త్వగుణము గలవాని హృదయము శుద్ధచిమ్నీయందు వెలిగెడు దీపమువలెను, రజోగుణము గలవానిహృదయము ఎరుపురంగుగల చిమ్నీలోని దీపమువలెను, తమోగుణము గలవాని హృదయము మట్టికుండలో వెలిగెడు దీపమువలె నుండును లేక నీలి రంగు గల చిమ్నీ లోపల వెలిగెడు దీపమువలె నుండును.

శ్లో॥ ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః ।
యోగేనా వ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ! సాత్త్వికీ॥ 33

పద॥ ధృత్యా - యయా - ధారయతే - మనః ప్రాణేంద్రియ క్రియాః,
యోగేన - అవ్యభిచారిణ్యా - ధృతిః - సా - పార్థ! - సా త్త్వికీ.

ప్రతి॥ హే పార్థ! = ఓయర్జునా!. యయా = ఏ, అవ్యభిచారిణ్యా ధృత్యా = చలింపని ధైర్యముతో, మనః ప్రాణేంద్రియ క్రియాః = మనస్సు, ప్రాణములు ఇంద్రియములు వీని వ్యాపారములను, యోగేన = యోగసాధనచేత, ధారయతే = తప్పుమార్గములలో ప్రవర్తించకుండ నియమించుచున్నాడో, సాధృతిః = అధైర్యము, సాత్త్వికీ=సాత్త్విక ధైర్యము.

తా॥ ఓ యర్జునా! ఏ చలింపని ధైర్యముతో మనస్సును, ప్రాణములను ఇంద్రియములను, వీని వ్యాపారములను యోగసాధనచేత తప్పుమార్గములలో ప్రవర్తింపకుండ నియమములో నుంచుచున్నాడో, ఆ ధైర్యము సాత్త్వికధైర్యము.

శ్లో॥ యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున! ।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ! రాజసీ ॥ 34

ప్రద॥ యయా - తు - ధర్మకామార్థాన్ - ధృత్యా - ధారయతే - అర్జున!.
ప్రసంగేన - ఫలాకాంక్షీ - ధృతిః - సా - పార్థ! - రాజసీ.

ప్రతి॥ హే అర్జున! = ఓ యర్జునా!, యయా ధృత్యా తు = ఏ ధైర్యముచేతనైతే, ఫలా కాంక్షీ = ఫలాపేక్ష గలవాడు, ప్రసంగేన = మిక్కిలి యాసక్తితో, ధర్మ కామార్థాన్ = ధర్మమును, కామమును, అర్థమును, ధారయతే = ధరించుచున్నాడో, సా ధృతిః = అట్టిధైర్యము, హేపార్థ! = ఓయర్జునా! రాజసీ = రజోగుణసంబంధమైనది.

తా॥ ఓ యర్జునా! నిత్యము చేయవలసినవియే యనుతలంపుతో నేధైర్యముచేత ధర్మ అర్థ,కామములను,ఆయా ఫలములను కోరుచు మిక్కిలి యాసక్తితో ననుష్ఠించుచున్నాడో, యా ధైర్యము రజోగుణ ప్రధానమైనది.

శ్లో॥ యయాస్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।
న విముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ! తామసీ॥ 35

పద॥ యయా - స్వప్నం - భయం - శోకం - విషాదం - మదం - ఏవ - చ, న - విముంచతి - దుర్మేధాః - ధృతిః - సా - పార్థ! - తామసీ.

ప్రతి॥ హేపార్థ! = పృథా (కుంతీ) తనయుడవగు ఓ యర్జునా! దుర్మేధాః = దుర్బుద్ధి గలవాడు, యయా = ఏధైర్యముచేత; స్వప్నం = (అతి) నిద్రను, భయం = భయమును, శోకం = దుఃఖమును, విషాదం = దిగులును, మదం ఏవ చ = మదమునున్ను, న విముంచతి = ప్రయత్న పూర్వకముగా విడువడో, సా ధృతిః = ఆ ధైర్యము, తామసీ = తామస ధైర్యమనబడును.

తా॥ పృథాపుత్రుడవగు ఓ యర్జునా! దుష్టబుద్ధిగల యే మనుజుడు అతినిద్రను, భయమును, దుఃఖమును, దిగులును, మదమును ఏ ధైర్యముచేత ప్రయత్న పూర్వకముగ విడువడో, యట్టి ధైర్యము తామసధైర్య మనబడును.

వి॥ ధృతి యనగా ధైర్యముయొక్క పరివర్తనమగును. (1) సత్త్వగుణము గలవాడు ధర్మ, అర్థ, కామ, మోక్షములనెడు పురుషార్థ చతుష్టయములో ధర్మ, అర్థ కామములనుగూడ విడిచి మోక్షమొక్కదానినే పొందుటకు ప్రయత్నించును. వీడు ధ్యానయోగాది సాధనాబలముచే నింద్రియములను పై చెప్పిన ధర్మార్థ కామములలోనికి పోనీయక స్వాధీనపరచి నిరంతరమాత్మధ్యానములోనే నిలుపును. (2) రజోగుణము గలవాడు మోక్షమునందు లక్ష్యమునుంచక ధర్మ, అర్థ, కామములలో మాత్రము మనస్సును, ప్రవేశపెట్టి ఫలమునందాసక్తి గలిగి యుండును. (3) తమోగుణము గలవాడు ధర్మ, అర్థ, కామములలోనైనను ప్రవేశింపక అధిక భోజనము, అధిక నిద్ర గలిగి మదోన్మత్తుడై మనోవ్యాకులము చేతను, మనోదుఃఖముచేతను జీవితమంతయు వ్యర్థముగా గడుపును. "న విముంచతి దుర్మేధాః" ఇట్టివాడు దుర్బుద్ధిగలవాడు గాన నిశ్చయముగా నీ దోషమును నివృత్తిచేయుటకు ప్రయత్నింపడు. సత్త్వగుణము గలవాడు దేవమనుజుడనియు, రజోగుణముగలవాడుత్తమ మనుజుడనియు, తమోగుణము గలవాడు మృగ మనుజుడనియు శాస్త్రసిద్ధాంతము. పైచెప్పిన యీమూడు గుణములలో నెవరెవరేయే ప్రవృత్తి గలిగియున్నారో, దానినిబట్టి వారిని గనుగొనవచ్చును.

శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి ॥ 36

పద॥ సుఖం - తు – ఇదానీం - త్రివిధం - శృణు - మే - భరతర్షభ!,
అభ్యాసాత్ - రమతే - యత్ర - దుఃఖాన్తం - చ - నిగచ్ఛతి.

ప్రతి॥ హేభరతర్షభ! = భరతకుల శ్రేష్ఠుడవగు ఓ యర్జునా!, యత్ర = దేని యందు, అభ్యాసాత్ = ధ్యానాభ్యాసము వలన (మనుజుడు), రమతే = రమించుచున్నాడో (సంతోషమును బొందుచున్నాడో), దుఃఖాన్తం చ= దుఃఖనాశనమును గూడ, నిగచ్ఛతి = నిశ్చితముగా పొందుచున్నాడో, **తత్** = అది, సుఖం = సుఖము, ఇదానీం = ఇప్పుడు, త్రివిధం=మూడు విధములగు **అట్టి** సుఖమును, మే = నావలన, శృణు = వినుము.

**తా॥** ఓ అర్జునా! దేనియందు ధ్యానాభ్యాసము వలన (మనుజుడు) రమించుచున్నాడో, (సంతోషమును బొందునో) దుఃఖనాశనమును గూడ నిశ్చితముగా పొందుచున్నాడో అదియే సుఖము. ఇప్పడు మూడు విధములగు అట్టి సుఖమును జెప్పెద వినుము.

శ్లో॥ యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।
**తత్సుఖం** సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్ ॥ 37

పద॥ యత్ - **తత్** - అగ్రే - విషం - ఇవ - పరిణామే - అమృతోపమం,
**తత్** - సుఖం - సాత్త్వికం - ప్రోక్తం - ఆత్మబుద్ధి ప్రసాదజమ్,

ప్రతి॥ యత్ = ఏ సుఖము. అగ్రే = ఆరంభమునందు. విషం ఇవ = విషము వలెనుండునో, పరిణామే = పర్యవసానమునందు. అమృతోపమం = **అమృతమువలె** నుండునో, **తత్**=అట్టి, సుఖం = సుఖము, సాత్త్వికం= సాత్త్వికసుఖమని, ప్రోక్తం = చెప్పబడుచున్నది, **తత్** = ఆ ఆత్మబుద్ధి, ప్రసాదజం = పరమాత్మ విషయకమైన బుద్ధియొక్క నైర్మల్యమువలన **గలిగినది.**

**తా॥** ఏ సుఖము ఆరంభమునందు విషమువలె నుండునో, పర్యవసానమునందు అమృతము వలె మారుచుండునో, అట్టి పరమాత్మ విషయకమైన బుద్ధియొక్క నైర్మల్యము వలన గలిగిన సుఖము సాత్త్విక సుఖమని యోగులచే చెప్పబడుచున్నది.

వి॥ తపస్సు, బ్రహ్మనిష్ఠ, ధ్యానాదులు వైరాగ్యముతో నేకాంతమున **అభ్యాసము చేయు కాలములో విషమువలె** కష్టముగా **తోచినను, అభ్యాసము**

పూర్తియగునప్పుడు అవి యమృతమువలె జ్ఞానసుఖమును గలుగజేయును, సాత్త్వికగుణముగలవాడు ఎంతకష్టము సహించియైనను తన నిష్ఠను తన ధర్మమును నిర్వహించును. అందువలన యాత్మశుద్ధి గల్గి నిరతిశయ బ్రహ్మసుఖమును పొందగలుగును. ఇప్పుడు గొప్ప యుద్యోగము గలిగియుండువారు ఎంతకాలమో రేయింబవళ్ళు కష్టపడి చదివి, ఇంగ్లాండుదేశము వెళ్ళి యెంతయో ధనము వ్యయపరచినందుచే నిప్పుడు వారికి ఆ యున్నతోద్యోగము లభించినది. దానివలన ధనము, అధికారమును గలిగెను. మొదటనే యట్లు శ్రమనొందనిచో నిపుడట్టి విశ్రాంతియు, సౌఖ్యము నెట్లు గలుగును? అయితే అది బాహ్యసౌఖ్యమేగాని ఆత్మ సౌఖ్యముగాదు, దానికొఱకే యింత పరిశ్రమ చేయగానిక నిరతిశయమైన బ్రహ్మ సుఖము కొఱకెంత పరిశ్రమ చేయవలయునో, ముముక్షువు లూహించు కొనవలెను. శ్రమను ఓర్వని వానికి విశ్రాంతి కట్టకడకు గలుగదు. ఒక్కొక్క మహనీయుల చరిత్రము చూచినవారు తపోధ్యానానుష్ఠానములు చేయుకాలమున నిస్సహాయులై సరియైన యాహారము దొరకక యెంత శ్రమపడియుందురో తెలియ గలరు. దాని ఫలమే యిప్పుడు నిరతిశయసుఖము గలుగుట. వారెంత వాన, గాలి, ఎండలచే శ్రమపడి సమయమున కాహారము దొరకక కష్టపడినది తలంచిన హృదయము నీరై కరిగిపోవును. వారొక్కరోజు చేసిన ధ్యానానుష్ఠాన సాధనలు మనమొక్క జన్మమునకైనను జేయజాలము.

శ్లో॥ విషయేన్ద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38

పద॥ విషయేన్ద్రియ సంయోగాత్ - యత్ - తత్ - అగ్రే - అమృతోపమం, పరిణామే - విషం - ఇవ - తత్ - సుఖం - రాజసం - స్మృతమ్.

ప్రతి॥ తత్ యత్ = ప్రసిద్ధమైన ఏ సుఖము, విషయేన్ద్రియ సంయోగాత్ = ఇంద్రియములకు విషయములకు సంయోగము గలుగుటవలన, అగ్రే= మొదట, అమృతోపమం = అమృతతుల్యమైనదియు, పరిణామే = పర్యవసానమందు, విషం ఇవ = విషము వంటిదియునై యుండునో, తత్ సుఖం = అట్టి సుఖము, రాజసం = రాజససుఖమని, స్మృతమ్ = బ్రహ్మవేత్తలచే తలంచబడినది.

తా॥ ప్రసిద్ధమైనదియును, స్రక్చందన వనితాది విషయముల యందింద్రియములు చేరుటవలన మొదట యమృతతుల్యమైనది

యును, అనగా నతి ప్రేమాస్పదమైనదియును. పిమ్మట బలము, వీర్యము, రూపము, ప్రజ్ఞ, జ్ఞాపకశక్తి, ఉత్సాహము అను వీని యొక్క హానికి కారణమగుటవలన విషమువంటిదియు నగు సుఖ మేదిగలదో, యది రాజస సుఖమని చెప్పబడినది.

వి॥ రజోగుణము గలవాడు ఇంద్రియముల నిగ్రహింప శక్తి లేనివాడగు టచే విషయములలో ప్రవర్తించుటచే బలము, పరాక్రమము, రూపము, జ్ఞానము, జ్ఞాపకశక్తి, ధనము, ఉత్సాహము మొదలైన వానిని నశింపజేయుచున్నాడు. అందు వలన రోగగ్రస్తుడై అనేక విషమావస్థల లోనికి బోవుచున్నాడు,

శ్లో॥ యదగ్రేచానుబంధే చ సుఖం మోహనమాత్మనః ।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥ 39

పద॥ యత్ - అగ్రే - చ - అనుబంధే - చ - సుఖం - మోహనం - ఆత్మనః,
నిద్రాలస్య ప్రమాదోత్థం - తత్ - తామసం - ఉదాహృతమ్.

ప్రతి॥ యత్ = ఏది, అగ్రే చ = ఆదియందును, అనుబంధే చ = అంత్యము నందును, ఆత్మనః = తనకు, సుఖం=సుఖముగా నున్నట్లు, మోహనం= భ్రమింప జేయుచున్నదో, నిద్రాలస్య ప్రమాదోత్థం = నిద్ర ఆలస్యము ప్రమాదము వీనివలన బుట్టిన, తత్ = అట్టి సుఖము, తామసం = తామస సుఖమని, ఉదాహృతమ్ = చెప్పబడినది.

తా॥ ఏది యాదియందును, అంతమునందును తనకు సుఖముగా నున్నట్లు భ్రమింపజేయుచున్నదో, నిద్ర. ఆలస్యము, ప్రమాదము వీనివలన బుట్టిన అట్టిసుఖము తామస సుఖమని చెప్పబడుచున్నది.

వి॥ అతి నిద్రచేతను, సోమరితనముచేతను ఉన్నదానిని మఱియొక్క విధముగా తెలిసికొనుటచేతను, చేయవలసిన దానిని సకాలములో చక్కగా చేయకపోవుటచేతను, తత్కాలమున సుఖముగా తోచినను, జీవితాంతము వఱ కును దానివలన దుఃఖము, బంధమును గలుగుచున్నది. తమోగుణ జీవులిట్లుం దురు. మఱియు నేలాటి ప్రయత్నము చేయక, మోసపువృత్తిచేగాని, చోర వృత్తిచేగాని ఖూనీ చేయుటచేగాని, వర్తమానమున సుఖముగా నుండినను రాజభటులచే పట్టుబడి కారాగృహములో జీవితాంతము వఱకు కఠినశిక్ష,

ననుభవించుటచేతగాని, మరణదండన చేతగాని యెంత సంకట పడవలసి యుండును? ఇది తామససుఖమే యగును. లేక సకాలములో చేయవలసిన కృష్యాదులను శీతోష్ణముల సహించి చేయక సుఖముగా కూర్చున్నచో తరువాత గలిగెడు దుఃఖమును తమో గుణముతో గూడినదే. విద్యాభ్యాసాదులు సకాల మున చేయక యుండుటయు తామస స్వభావమే యగును.

శ్లో॥ న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః ॥ 40

పద॥ న - తత్ - అస్తి - పృథివ్యాం - వా - దివి - దేవేషు - వా - పునః,
సత్త్వం - ప్రకృతిజైః - ముక్తం - యత్ - ఏభిః - స్యాత్ - త్రిభిః-గుణైః,

ప్రతి॥ యత్=ఏది, ప్రకృతిజైః = ప్రకృతివలన బుట్టిన, ఏభిః త్రిభిః గుణైః = ఈ మూడు గుణములచేత, ముక్తం స్యాత్ = విడువబడినదగుతున్నదో, తత్ సత్త్వం = అట్టి వస్తువు, పృథివ్యాం వా = ఈ భూలోకమందుగాని, పునః = లేక, దివిదేవేషు వా = స్వర్గలోకమందలి దేవతలలోగాని, న అస్తి = లేదు.

తా॥ ఏది ప్రకృతివలన బుట్టిన యీ మూడు గుణములచేత విడువబడినదగుచున్నదో, ఇట్టి వస్తువు భూలోకమునందుగాని యీ భూలోకవాసులగు మనుష్యులయందుగాని, మరియు, స్వర్గలోకము నందుగాని, దేవతలయందుగాని లేదు.

వి॥ సత్త్వగుణముచే స్వర్గలోకము, స్వర్గలోకనివాసులును, రజోగుణ ముచే భూలోకము, భూలోకనివాసులను. తమోగుణముచే నధోలోకము, ఆ లోకనివాసులగు రాక్షసులును గూడియుందురు. కావున నీ మూడు లోకము లలో దేనియందును బద్ధుడు కాకూడదు. అట్టివాడు మాత్రమే త్రిగుణముల నుండి ముక్తుడగును.

శ్లో॥ బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరన్తప! ।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః ॥ 41

పద॥ బ్రాహ్మణ క్షత్రియ విశాం - శూద్రాణాం - చ - పరన్తప!,
కర్మాణి - ప్రవిభక్తాని - స్వభావ ప్రభవైః - గుణైః.

ప్రతి॥ హే పరన్తప ! = శత్రుసంతాపకుడ వైన ఓ యర్జునా!, బ్రాహ్మణ క్షత్రియ విశాం = బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు, శూద్రాణాం చ =

శూద్రులకును, స్వభావప్రభవైః = వారి వారి జన్మాంతర సంస్కారము ననుసరించిన స్వభావము వలన గలిగిన, గుణైః = గుణములచేత, కర్మాణి = వారు వారాచరించ వలసిన కర్మలు, ప్రవిభక్తాని = విభజింపబడినవి.

తా॥ శత్రువులకు పరితాపమును గలుగజేయు ఓ యర్జునా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకును, శూద్రులకును, వారి వారి జన్మాంతర సంస్కారము ననుసరించిన స్వభావమువలన గలిగిన గుణముల చేత వారు వారాచరించవలసిన కర్మములు విభజింపబడినవి.

వి॥ దీనియందు క్రిందజెప్పబోయెడు నాలుగు రకముల వర్ణస్థులు వారి వారి జన్మాంతర సంస్కారముచే కలిగెడు త్రిగుణముల ననుసరించియే విభజింపబడినారని గుణము చేతనే జాతియని స్పష్టముగా నిరూపించడమైనది ఇందు వలన తమోగుణములో నుండువాడు ప్రయత్న పరుడై రజోగుణమునకును, సత్త్వగుణమునకును వచ్చెడి యవకాశము గలుగును. అలాగున రజోగుణము గలవాడు సత్త్వగుణమునకును వచ్చుటకు మార్గమేర్పడును. అట్లవకాశము లేక పోయిన దానివలననే నిమ్నస్థితిలో నున్నవారున్నత స్థితిలోనికి వచ్చుట కవకాశము లేక పోయెను. ఇంగ్లీషు విద్యను నేర్చుకొన్నవారికి ఉద్యోగ మిచ్చుట వలన ఆ విద్య అంత వ్యాపకమగుటకును, అందఱును చదువుటకు ఆసక్తి యును గలిగినది. అలాగున ఉన్నతగుణము గలవానికి ఉన్నతస్థాన మిచ్చేలాగున నుండినచో, నిమ్నస్థితిలో నుండువారికి ఉన్నతస్థితిలోనికి వచ్చుటకు ఆసక్తి గలుగును. అట్టి పరిస్థితి భరతదేశమున లేకపోవుటచేతనే యీ దేశ మడుగంటుటకు కారణమైనది. మఱియు నిట్టి అవకాశము ఇతర దేశములలో నుండుటవలన ఆ దేశములున్నత స్థితిలోనికి వచ్చుటకు వీలేర్పడినది.

శ్లో॥ శమో దమస్తపశ్శౌచం క్షాన్తిరార్జవమేవ చ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్॥ 42

పద॥ శమః - దమః - తపః - శౌచం - క్షాన్తిః - ఆర్జవం - ఏవ - చ,
జ్ఞానం - విజ్ఞానం - ఆస్తిక్యం - బ్రాహ్మం - కర్మ - స్వభావజమ్.

ప్రతి॥ శమః = అంతరింద్రియ నిగ్రహము, దమః = బహిరింద్రియ నిగ్రహము తపః = తపస్సు, శౌచం = బాహ్యాభ్యంతరశుచియు, క్షాంతిః = ఓర్పు, ఆర్జవం = ఋజు స్వభావము (త్రికరణముల యేకత్వము)జ్ఞానం = శాస్త్ర

జ్ఞానము, విజ్ఞానం = అనుభవజ్ఞానము, ఆస్తిక్యం = గురు వేద దైవముల యందు నమ్మకమును, స్వభావజం = స్వభావముగా గలిగినది, బ్రాహ్మం కర్మ = బ్రాహ్మణ కర్మయైయున్నది.

తా॥ అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము, కాయికము వాచికము మానసికమను మూడువిధములయిన తపస్సులు, అభ్యంతరము బాహ్యమను రెండువిధములైన శుద్ధియు ఓర్పు, మనోవాక్కాయ కర్మల యేకత్వమైన ప్రవర్తనము, శాస్త్రీయ జ్ఞానము లేక వస్తుతత్త్వస్వరూపజ్ఞానము, బ్రహ్మాత్మైక్యానుభవ జ్ఞానము, గురు వేద దైవములయందు నమ్మకమును స్వభావముగా గలిగినది బ్రాహ్మణకర్మయై యున్నది.

శ్లో॥ శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ 43

ప.ద॥ శౌర్యం - తేజః - ధృతిః - దాక్ష్యం - యుద్ధే - చ - అపి - అపలాయనం, దానం - ఈశ్వరభావః - చ - క్షాత్రం - కర్మ - స్వభావజమ్.

ప్రతి॥ శౌర్యం = శూరత్వము, తేజః = తేజస్సు, ధృతిః = ధైర్యము, దాక్ష్యం= సామర్థ్యము, యుద్ధే అపలాయనం అపి చ = యుద్ధమున పారిపోకుండుట యును, దానం = దానమిచ్చుటయు, ఈశ్వరభావః చ = ఈశ్వరునిచే ప్రజలను పాలించుటకు పంపబడినవాడగుటచే, పరిపాలన సామర్థ్యము, స్వభావజం = స్వభావముగా గలిగినది, క్షాత్రం కర్మ = క్షత్రియకర్మ యయి యున్నది.

తా॥ శౌర్యము, కీర్తియు (ప్రతాపము), ధైర్యము, సామర్థ్యము (కార్యనిర్వహణశక్తి), యుద్ధమునందు శత్రువులవలన భయము నొంది పరుగెత్తకుండుటయు, అనగా శత్రువులకు భయపడక యెదిరించి యుద్ధము చేయుటయు, సత్పాత్రత్యాగము, ప్రజలను పాలించుటకు సర్వేశ్వరునిచే పంపబడిన వాడనని గల దైవభక్తియు, పరిపాలన సామర్థ్యమును నివి స్వభావముగా గలిగినది క్షత్రియ కర్మయయి యున్నది.

శ్లో॥ కృషిగోరక్షవాణిజ్యం వైశ్యం కర్మస్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥ 44

పద॥ కృషిగోరక్షవాణిజ్యం – వైశ్యం – కర్మ – స్వభావజం.
పరిచర్యాత్మకం – కర్మ – శూద్రస్య – అపి – స్వభావజమ్.

ప్రతి॥ కృషిగోరక్షవాణిజ్యం = వ్యవసాయము గోసంరక్షణము, వ్యాపారము, స్వభావజం = స్వభావముగా గలిగినది, వైశ్యం కర్మ = వైశ్యులకర్మయై యున్నది. పరిచర్యాత్మకం కర్మ=సేవకాత్మకమగు కర్మ, శూద్రస్యఅపి= శూద్రులకును, స్వభావజం = స్వభావముగా గలిగిన కర్మయై యున్నది.

తా॥ వ్యవసాయముచేయుట, పశుసంరక్షణ, వ్యాపారము ఈకర్మలు వైశ్యజాతికి స్వభావముగా గలిగిన కర్మలు. సేవక వృత్తి స్వభావముగా గలిగియుండుట శూద్రజాతి కర్మయైయున్నది.

వి॥ ఈనాలుగు జాతుల గుఱించి చెప్పునప్పుడు అన్నిటిలోను "బ్రాహ్మం కర్మ స్వభావజం – క్షాత్రం కర్మ స్వభావజం - వైశ్యం కర్మ స్వభావజం - శూద్రస్యాపి స్వభావజం" అని యుండుటచే స్వభావముగా పైచెప్పిన గుణములు గలవారు ఆయా జాతులలో పరిగణింపదగినవారలే, స్వభావమెట్లు గలిగెననగా జన్మాంతర సంస్కారమువలననే గలిగెను. ప్రయత్నముచే వాటిని మార్చ వచ్చును. అని తెలియ వలయును.

శ్లో॥ స్వే స్వేకర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ॥ 45

పద॥ స్వే – స్వే – కర్మణి – అభిరతః – సంసిద్ధిం – లభతే – నరః,
స్వకర్మనిరతః – సిద్ధిం – యథా – విన్దతి – తత్ – శృణు,

ప్రతి॥ నరః = మనుజుడు, స్వే స్వే కర్మణి = తన తన కర్మమునందు, అభిరతః = ఆసక్తుడై, సంసిద్ధిం = ఆయా జాతికి సంబంధించిన సిద్ధిని (జ్ఞానయోగ్యతా రూప అంతఃకరణశుద్ధిని), లభతే = పొందుచున్నాడు, స్వకర్మనిరతః = తనకేర్పడిన కర్మమందు ప్రవర్తించువాడు, యథా=ఏ ప్రకారముగా, సిద్ధిం = సిద్ధిని (అంతఃకరణశుద్ధిని), విన్దతి = పొందుచున్నాడో, తత్ = దానిని, శృణు = ఆకర్ణింపుము

తా॥ మనుజుడు తన కర్మమునందాసక్తుడై, ఆయా జాతికి

సంబంధించిన సిద్ధిని (జ్ఞానయోగ్యతారూప అంతఃకరణశుద్ధిని) పొందు చున్నాడు. తన కేర్పడిన కర్మయందు ప్రవర్తించువాడు ఏప్రకార ముగా సిద్ధిని (అంతఃకరణశుద్ధిని) పొందుచున్నాడో, చెప్పెద నాక ర్ణింపుము.

వి॥ ఏ జాతికి, నేగుణములు చెప్పబడినవో వానిని అనుష్ఠించిన, ఆ జాతికి సంబంధించిన కార్యము చేసినవాడగుటచే ఆయా జన్మములనుండి పైజన్మమునకు వెళ్ళుటకు తగిన ఆత్మశుద్ధి యను సిద్ధి గలుగును. లేక ఆయా జాతిగుణములకు తగిన కర్మముల దేహసంరక్షణార్థము చేసికొనియు, మోక్షమనెడు సిద్ధి గలుగు టకు బ్రహ్మజ్ఞానానుష్ఠానమునుగూడ జేసికొనవచ్చును. దానివలన సిద్ధి అనగా మోక్షము గలుగును. ఏలన మొదటి తరగతినుండి ఉన్నతమగు తరగతివఱకు చదువుచున్నవారిలో ప్రతి సంవత్సరమును చక్కగ చదివినవాడేలాగున నుత్తీర్ణు డగుచున్నాడో, ఆలాగున నిచ్చట గూడ ఏ జన్మము గలవానికి ఏ కర్మ విధింప బడెనో దానినాచరించినందువలన ఆ జన్మమునుండి విముక్తిబొంది పై జన్మ లోనికి ప్రవేశము కలుగును. అదే యిచట 'సిద్ధి' యనుదానికి అర్థము.

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥ 46

పద॥ యతః - ప్రవృత్తిః - భూతానాం - యేన సర్వం - ఇదం - తతమ్, స్వకర్మణా - తమ్ - అభ్యర్చ్య - సిద్ధిం - విన్దతి - మానవః,

ప్రతి॥ యతః = ఎవనివలన, భూతానాం = సమస్తభూతములకు, ప్రవృత్తిః = పుట్టుక లేక సంస్కారానుగుణ ప్రవృత్తి గలుగుచున్నదో, యేన =ఎవని చేత, ఇదం సర్వం = ఈ సమస్త ప్రపంచము, తతం = వ్యాపింపబడి యున్నదో, తం = అట్టి యీశ్వరుని, మానవః=మనుజుడు, స్వకర్మణా= తనగుణమున కేర్పడిన కర్మముచేత, అభ్యర్చ్య = ఆరాధించి, సిద్ధిం = జ్ఞానానుష్ఠాన యోగ్యతాసిద్ధిని, విన్దతి = పొందుచున్నాడు (అంతఃకరణ శుద్ధిని పొందును.)

తా॥ ఎవని వలన సమస్తభూతములకు పుట్టుక లేక సంస్కా రానుగుణ్య ప్రవృత్తి గలుగుచున్నదో, యెవనిచేత నీ సమస్తప్రపంచ మును వ్యాపింప బడియున్నదో, అట్టి యీశ్వరుని, మనుజుడు తన

గుణమున కేర్పడిన కర్మముచేత నారాధించి జ్ఞానానుష్ఠానయోగ్యతా సిద్ధిని (అంతఃకరణశుద్ధిని పొందుచున్నాడు.)

వి॥ ఈ నాల్గు జాతుల కేర్పడిన కర్మల చేసికొని భగవదారాధన(అనగా బ్రహ్మనిష్ఠ) చేసికొనవచ్చును. దానివలన మోక్షము గలుగును. ఈ నాల్గు జాతులకు జెప్పిన కర్మలలో పాపకార్యముగాని, హింసాకార్యముగాని, అసత్య కార్యముగాని, అధర్మకార్యముగాని యెవరికిని చెప్పియుండలేదు. లోకయాత్ర కొఱకీ బాహ్యకర్మలచేయుడు, మోక్షయాత్రకొఱకు భగవదారాధన చేసికొన వచ్చును. ఏలన అందఱిలోను వెలుగుచుండు భగవంతుడొక్కడే యగుట వలన వసిష్ఠాదులు పురోహిత కర్మలచేసియు, జనకాదులు క్షత్రియ కర్మల చేసియు తులాధారాదులు వైశ్య కర్మలచేసియు విదురాదులు శూద్రకర్మల చేసియు, బ్రహ్మధ్యాననిష్ఠాపరులై యుండిరి. ఇది దేహమునకు సంబంధించినది కాదు. ఆత్మకు సంబంధించినదే. అలాగున చూడాల, మదాలస మొదలగు నారీ మణులుగూడ గృహకృత్యములను జేసికొని బ్రహ్మనిష్ఠాపరులైగూడ నుండిరి.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 47

పద॥ శ్రేయాన్ - స్వధర్మః - విగుణః - పరధర్మాత్ - స్వనుష్ఠితాత్, స్వభావనియతం - కర్మ - కుర్వన్ - న - ఆప్నోతి - కిల్బిషమ్,

ప్రతి॥ స్వనుష్ఠితాత్ = చక్కగా నాచరింపబడిన, పరధర్మాత్ = ఇతరధర్మము కంటె, విగుణః = గుణహీనమైనను, స్వధర్మః=తన ధర్మము, శ్రేయాన్= శ్రేష్ఠమైనది, స్వభావనియతం = తమ ధర్మమునకు తగిన, కర్మ = కర్మను, కుర్వన్ = చేయుచు, కిల్బిషం = పాపమును, న ఆప్నోతి = పొందడు.

తా॥ చక్కగా నాచరింపబడిన యితర ధర్మముకంటె గుణ హీన మైనను తన ధర్మము శ్రేష్ఠమైనది. తన ధర్మమునకు తగిన కర్మను చేయుచు పాపమును బొందడు. తాను అనగా జీవుడు, తన ధర్మమనగ భగవత్ప్రార్థనాదులు, దీనిని చేసినచో పాపము లేదని భావము.

వి॥ ఎవరెవరేయే యాచరణపరులై యుంటున్నారో, వారి యనుష్ఠానము కఠినముగా నుండినను దానిని ఆచరించుట వారికి శ్రేయస్కరము, అంతేగాని

సుఖ భోగముల నుద్దేశించి యితరులు చేయు కర్మను మంచిదిగా భావించి అనుష్ఠించినను. అది యాత్మశుద్ధిని గలుగజేసి తద్ద్వారా మోక్షమును గలుగ చేయదు. తన ధర్మముమొదట విషముగా గనుపించినను ఆఖరున అమృత మయముగా పరిణమించును. పాతివ్రత్యమును పరిపాలించెడు పతివ్రతాస్త్రీ బీద ఈతైనను తనపతిచేఇవ్వబడినదిగాని లేక స్వగృహములో లభించినదిగాని,అయిన కొంత నీరసముగానుండు ఆహారముచే వస్త్రాభరణములచే సంతుష్టి నొందునే గాని, భోగపుస్త్రీలవలె అధికవస్త్ర ఆభరణ భోజనాదులుండవలెనని తలంచునా? పతివ్రతా ధర్మపాలనముచే గలిగెడు ఇహలోకమునందు గలుగు కీర్తిగాని,ఆత్మ శుద్ధిగాని, దైవప్రీతిగాని భోగపుస్త్రీలకు (వేశ్యలకు) గలుగునా? అదేప్రకారము బ్రహ్మనిష్ఠుడగు గురువుదగ్గరనుండి బ్రహ్మచర్యవ్రతపాలనము, అధ్యయనము, ఇంద్రియ నిగ్రహము, సాత్త్వికాహారము భుజించెడు బ్రహ్మచారికి గలిగెడు ఆత్మ శుద్ధియు, ప్రపంచఖ్యాతియు, దైవజ్ఞానమును హోటలులలోను, సినిమాలలోను తిరుగుచుండువానికి గలుగునా? దీనిని గ్రహించిన స్వధర్మానుష్ఠానముయొక్క యోగ్యత యెట్టిదో తెలిసికొనవచ్చును.

శ్లో॥ సహజం కర్మకౌన్తేయ! సదోషమపి న త్యజేత్ ।
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥ 48

పద॥ సహజం - కర్మ - కౌంతేయ! - సదోషం - అపి - న - త్యజేత్,
సర్వారంభాః - హి - దోషేణ - ధూమేన - అగ్నిః - ఇవ -ఆవృతాః.

ప్రతి॥ హేకౌంతేయ! = ఓ యర్జునా!, సహజం = సహజమైన, కర్మ = కర్మను, సదోషం అపి=దోషముతో కూడినదైనను, న త్యజేత్ = విడువగూడదు, హి = ఏలననగా, సర్వారంభాః = సమస్తకర్మలును, అగ్నిః = నిప్పు, ధూమేన ఇవ = పొగచేత ఆవరింపబడియున్నట్లు, దోషేణ = దోషము చేత. ఆవృతాః = ఆవరింపబడియున్నవి.

తా॥ ఓ యర్జునా! సహజమైన అనగా తన వర్ణాశ్రమాచార ధర్మము ననుసరించి చేయబడెడు కర్మ దోషముతో గూడినదైనను, విడువగూడదు. ఏలననగా సమస్తకర్మలును, నిప్పు పొగచే నావ రింపబడియున్నట్లు, దోషముచేత నావరింపబడియున్నవి.

వి॥ వారి వారి కేర్పడిన కర్మలెంత ప్రయాసముగా నుండినను, వాని ననుష్ఠించియేతీరవలయును. వానిలో కొన్ని దోషములు గనిపించినను అవి యని వార్యము. ఆదోషములేవన (1)ధాన్యోత్పత్తి వేయుట లేక ధాన్యమును దంచుట,

(2)సమ్మార్జనములేక నడచుట, (3) పెట్లు నరకుట కట్టెలచేవండుట (4)జలము కాచుట, (5) శుభ్రపరచుట యీ అయిదు విధములైన కర్మలచే అనేక ప్రాణుల మరణముసంభవించుచున్నది, ఈ యైదుదోషములు అనివార్యములు. ఈ అయిదు దోషముల నివృత్తికై శాస్త్రములో పంచవిధ యజ్ఞములు విధింపబడినవి. అవి దేవ, ఋషి, పితృ, అతిథి భూతయజ్ఞములనబడును (1) ధాన్యాదులచే నేర్పడిన యన్నాదులను బ్రహ్మ నిష్ఠులు, అతిథులు, రోగులు. బ్రహ్మచారులు మొదలైన వారికి పెట్టుటచేతను దేవతా నైవేద్యములచేతను, మొదటిదోషముపోవును, (2)వేదాధ్యయనము, ప్రణవాది దివ్య మంత్రజపము చేయుటచే రెండవ దోషము నశించును. (3) ధర్మశాలలు, దేవాలయములు కట్టించుటచే మూడవ పాపము నశించును. (4) అతిథులకు అన్నపానాదు లొసగుటచే, మాతాపితృలకు సేవ చేయుటచే పితృదేవతలకు నొసంగెడు తర్పణాది క్రియలచేతను నాల్గవ పాపము నశించును. (5) ధాన్యమునుడకబెట్టుటచే స్థలము శుద్ధిచేయుటచే గలిగెడు ఐదవ పాపము, బ్రహ్మవిచారమను ధ్యానయోగముచేతను, కుక్క, పిల్లి, కాకి మొదలగు వానికి అన్నము పెట్టుటచేతను నశించును. ఇట్టి విధులను చేయక యుండిన మాత్రమే దోషమాపాదించును. మనము గవర్నమెంటు వారికి కట్టవలసిన పన్ను కట్టినచో, మన భూమి మనకెల్లప్పుడుండును, అట్లుచేయనిచో జప్తుచేసి ఏలమువేపి గవర్నమెంటు వారమ్మునట్లు మన పుణ్యమును నశించును.కొందఱు త్యాగులు పై చెప్పిన ఈ కర్మలలో దోషముగలదని విడిచి భిక్షాన్నముతో జీవించెడు వారుగూడ గలరు. అయితే తమకు పట్టెడు అన్నము దేనివలన ఉత్పత్తి అయినదో, దీనిని మాత్రము విచారించువారరుదు. ఎందుకొఱకు గృహస్థులు వీరికిపెట్టుచున్నారో, దీనినిన్ని యోచించువారరుదు. ఇది వైరాగ్య మని వారు తలంచెదరే గాని గృహస్థులు పైచెప్పిన ఐదు విధములగు దోషముల నివృత్తికొఱకే వీరిచ్చుచున్నారని యోచింపకపోయినచో వీరికిగల పుణ్యమును క్షయించును.

శ్లో॥ అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥ 49

పద॥ అసక్తబుద్ధిః - సర్వత్ర - జితాత్మా - విగతస్పృహః.
నైష్కర్మ్య సిద్ధిం - పరమాం - సన్న్యాసేన - అధిగచ్ఛతి.

ప్రతి॥ సర్వత్ర = సమస్తకర్మములయందును, అసక్తబుద్ధిః =అనాసక్తచిత్తుడును, జితాత్మా = మనోనిగ్రహము గలవాడును. విగతస్పృహః = ఆశ లేనివాడు

నునై, సన్న్యాసేన = సర్వకర్మఫలత్యాగము చేయుటచేత లేక సర్వసంగ పరిత్యాగము చేయుటచే, పరమాం = సర్వోత్కృష్టమైన, నైష్కర్మ్య సిద్ధిం = నిష్కామ కర్మముచే పొందదగిన యాత్మశుద్ధిని, అధిగచ్ఛతి= పొందుచున్నాడు.

తా॥ సమస్త కర్మములయందును అనాసక్తచిత్తుడును, మనో నిగ్రహము గలవాడును, దేహమునందును భోగమునందు నాశలేని వాడునై సర్వకర్మఫలత్యాగము చేయుటచేత లేక సర్వసంగ పరిత్యాగము చేయుటచేత సర్వోత్కృష్టమైన నిష్కామ కర్మముచే పొందదగిన యాత్మ శుద్ధిని పొందుచున్నాడు.

వి॥ 'నైష్కర్మ్యసిద్ధి' యనగా నిష్కామకర్మయోగము ననుష్ఠించి దానివలన కలిగిన ఆత్మశుద్ధియనెడు సిద్ధిని పొందుటయని యర్థము. అంతేకాని. క్రియాశూన్యత్వము గలిగియుండుటగాదు. అట్టి నైష్కర్మ్యసిద్ధిగలవాడు ముక్తిని పొందును.

శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధమే ।
సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50

పద॥ సిద్ధిం - ప్రాప్తః - యథా - బ్రహ్మ - తథా - ఆప్నోతి -నిబోధ-మే.
సమాసేన - ఏవ - కౌన్తేయ! - నిష్ఠా - జ్ఞానస్య - యా - పరా

ప్రతి॥ హే కౌన్తేయ!=ఓ అర్జునా!, సిద్ధిం = నైష్కర్మ్య సిద్ధిని, ప్రాప్తః =పొందినవాడు, జ్ఞానస్య=జ్ఞానయోగముయొక్క, పరా=శ్రేష్ఠమైన, నిష్ఠా = పర్యవసానము, యా = ఏదియో అట్టి, బ్రహ్మ = పరబ్రహ్మమును, యథా = ఏ విధముగా, ఆప్నోతి=పొందుచున్నాడో, తథా = ఆ విధమును, సమాసేన=సంగ్రహముగా, మే ఏవ = నావలననే, నిబోధ = తెలిసికొనుము.

తా॥ కుంతీపుత్రుడవగు ఓ అర్జునా! నైష్కర్మ్యసిద్ధినిపొందినవాడు బ్రహ్మజ్ఞానమే పర్యవసానమైనదియు, శ్రేష్ఠమైనదియునగు పరబ్రహ్మమును ఏ జ్ఞాననిష్ఠచేత పొందుచున్నాడో, అట్టి పరమాత్మను పొందదగిన జ్ఞాననిష్ఠను సంక్షేపముగా జెప్పెదవినుము.

వి॥ ఈ50-వ శ్లోకము మొదలు 51. 52. 53.వఱకు గల నాల్గుశ్లోకములు భగవద్గీతయొక్క సారభూతములు, కనుకనే జ్ఞానముయొక్క పరాకాష్ఠయగు అంతిమస్థితి యేది గలదో దానిని "సమాసేనైవ" సంక్షేపముగా జెప్పుచున్నానని

శ్రీ భగవానుడు చెప్పడమైనది జ్ఞానముయొక్క పరాకాష్ఠను పొందగోరువారీ నాల్గుశ్లోకములను చదివి యర్థమును గ్రహించి ఆచరణయందుంచిన చాలును. ఇక గీత పూర్తి అనగా అంతము కాబోవుచున్నది. ఈ యధ్యాయము నిట్టి తరుణమున చెప్పినందున చాల జాగ్రత్తతో గ్రహించదగినది.

శ్లో॥ బుద్ధ్యావిశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ।
శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥ 51

,, వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ 52

,, అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే॥ 53

పద॥ బుద్ధ్యా - విశుద్ధయా - యుక్తః - ధృత్యా - ఆత్మానం - నియమ్య - చ - శబ్దాదీన్ - విషయాన్ - త్యక్త్వా - రాగద్వేషౌ - వ్యుదస్య - చ.
వివిక్తసేవీ - లఘ్వాశీ - యతవాక్కాయమానసః,
ధ్యానయోగపరః - నిత్యం - వైరాగ్యం - సముపాశ్రితః.
అహఙ్కారం - బలం - దర్పం - కామం - క్రోధం - పరిగ్రహం,
విముచ్య - నిర్మమః - శాన్తః - బ్రహ్మభూయాయ - కల్పతే.

ప్రతి॥ విశుద్ధయా బుద్ధ్యా యుక్తః = నిర్మలమైన బుద్ధిగలవాడై, ధృత్యా= ధైర్యముతో, ఆత్మానం = మనస్సును, నియమ్య చ = నిగ్రహించి. (దృఢమైన మనోనిగ్రహము గలవాడును) శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా = శబ్దాది పంచేంద్రియ విషయములందాసక్తిని విడిచి, రాగద్వేషౌ వ్యుదస్య చ = ఇష్టానిష్టములగు ద్వంద్వములను వదలినవాడునునై, వివిక్తసేవీ = ఏకాంతస్థలవాసియు (ప్రతిబంధరహిత ప్రదేశమందుండువాడును), లఘ్వాశీ = కొద్దియాహారము గలవాడును (మితాహారుడు), యతవాక్కాయమానసః = స్వాధీనము చేసికొనబడిన వాక్కు, కాయము, మనస్సు గలవాడును, నిత్యం ధ్యానయోగపరః = సదా ధ్యానయోగమందాసక్తి గలవాడును, వైరాగ్యం సముపాశ్రితః=ఇహ పరభోగములయందు లెస్సగా వైరాగ్యము గలవాడునునై, అహఙ్కారం = అహంకారమును, బలం = నేను బలవంతుడనను దురభిమానమును, దర్పం =

గర్వమును, కామం = కామమును (ఏది చూచినను కావలెనను కోరి కను), క్రోధం = కోపమును, పరిగ్రహం = పరవస్తువును గ్రహించు టను, (దానస్వీకారమును), విముచ్య = విడిచి, నిర్మమః =మమకారము లేనివాడును, శాంతః = శాంతచిత్తుడునైనవాడు, బ్రహ్మభూయాయ= బ్రహ్మాత్మైక్యమును పొందుటకు, కల్పతే = అర్హుడగుచున్నాడు.

తా॥ నిర్మలమైన బుద్ధిగలవాడును, ధైర్యముచే దృఢమైన మనోనిగ్రహము గలవాడును, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనెడు యింద్రియ విషయములయందలి యభిలాషను విడిచిన వాడును, రాగము, ద్వేషము.ఇష్టము, అనిష్టము, రుచి, అరుచి, స్తుతి నింద, లాభనష్టములను ద్వంద్వములు లేనివాడును. ఏకాంత నివా సియు (ప్రతిబంధ రహిత ప్రదేశమందుండు వాడును), కొద్ది ఆహా రముగల వాడును (మితాహారుడును), స్వాధీనము చేసికొనబడిన వాక్కు కాయము మనస్సు గలవాడును, సదా ధ్యాన యోగమందా సక్తి గలవాడును, ఇహపర భోగములయందు లెస్సగా వైరాగ్యము గలవాడును, అహంకారమును, నేను బలవంతుడనను దురభిమాన మును, గర్వమును, కామము (ఏది చూచిన కావలెనను కోరిక)ను, కోపమును, పరవస్తువును గ్రహించుట (దానస్వీకారమును) విడిచి, మమకారము లేనివాడును, శాంతచిత్తుడునైనవాడు (విషయముల నుండి యుపరతిని పొందినవాడు), బ్రహ్మాత్మైక్యమును పొందుట కర్హుడగు చున్నాడు. లేక బ్రహ్మలోకమందు పూజ్యుడగుచున్నాడు.

వి॥ 50, 51, 52, 53, ఈ నాల్గు శ్లోకములు భగవద్గీతయొక్క సారభూతములని ముందు చెప్పబడియున్నది. ఇవికేవల బ్రహ్మనిష్ఠులకు సంబం ధించినవి. వీనియందు భవరోగమునకు ఔషధము, పథ్యమును నిరూపించబడ మైనవి. ఆఖరున చెప్పిన అహంకారము మొదలగు ఆరు దుష్టగుణము లుండ రాదని పథ్యమునుగూడ తెలుపడమైనది. దానియందాఖరున "పరిగ్రహం" అనుశబ్దమహంకారము మొదలగు దుష్టగుణములతో చేర్చబడినది. పరిగ్రహ మనగా పరవస్తువును గ్రహించుటయే యగును లేక యే వస్తువు చూచినను అది కావలయునను కోరికయు, లేక దానస్వీకరణమును పరిగ్రహముయొక్క

పర్యాయశబ్దములు. కేవలము బ్రహ్మనిష్ఠ చేయువాడుగాని, ధర్మబోధకుడై యుండువాడుగాని, బ్రహ్మచర్యవ్రతముపూని యధ్యయనము చేయువాడుగాని అగుచో తగిన ధనములేనిచో దేహసంరక్షణకొఱకు మాత్రమన్నమును, దేహాచ్ఛాదనము కొఱకు మాత్రము వస్త్రములను ఇతరులనుండి స్వీకరించ వచ్చును. అంతేగాని భోగవిలాసములకై వస్త్రాలంకారము లేమాత్రమును గ్రహించ కూడదు.

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥ 54

పద॥ బ్రహ్మభూతః - ప్రసన్నాత్మా - న - శోచతి - న - కాంక్షతి,
సమః - సర్వేషు - భూతేషు - మద్భక్తిం - లభతే - పరామ్.

ప్రతి॥ బ్రహ్మభూతః=జీవన్ముక్తుడై (బ్రహ్మాత్మైక్యస్థితిగలవాడై) ప్రసన్నాత్మా = పొందబడిన యధ్యాత్మప్రసాదప్రకాశముగలవాడు, న శోచతి = దుఃఖింపడు, న కాంక్షతి = దేనిని కోరడు, సర్వేషు భూతేషు = సమస్త ప్రాణులయందును, సమః = సమానభావముగలవాడు, పరాం = శ్రేష్ఠమైన, మద్భక్తిం = నాయందలి భక్తిని, లభతే = పొందుచున్నాడు.

తా॥ జీవన్ముక్తుడై (బ్రహ్మాత్మైక్యస్థితి గలవాడై) పొందబడిన యధ్యాత్మప్రసాద ప్రకాశముగలవాడు దేనికిని దుఃఖింపడు, దేనిని కోరడు. సమస్తప్రాణులయందును సమభావము గలవాడై, నాయందలి శ్రేష్ఠమైన భక్తిని లేక అంతయు పరమాత్మమయమను బ్రహ్మవిద్వరిష్ఠత్వమును పొందుచున్నాడు.

వి॥ బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము గలవాడెట్లుండునో యది యీ శ్లోకముచే నిరూపించబడమైనది. దీనియొక్క భావన చేయుచుండినమాత్రమే ప్రకాశము దగ్గఱకు చీకటి రానట్లు తనయొక్క స్వప్రకాశాత్మస్థితిలోనికి ప్రకృతి చేరక యుండును, లేక ఇట్టిభావనవలననే ద్వంద్వముల కతీతస్థితి గలుగును.

శ్లో॥ భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః !
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ॥ 55

పద॥ భక్త్యా - మాం - అభిజానాతి - యావాన్ - యః - చ-అస్మి- తత్త్వతః,
తతః - మాం - తత్త్వతః - జ్ఞాత్వా - విశతే - తదనంతరమ్.

ప్రతి॥ భక్త్యా = అట్టి భక్తిచేత, మాం = నన్ను, యావాన్ = ఎట్టివాడనైన దియు, యః చ = ఎవడైనదియు, తత్త్వతః=యథార్థముగ, అభిజానాతి= ఎఱుంగుచున్నాడు, తతః=అట్లెఱుంగుటవలన, మాం తత్త్వతః జ్ఞాత్వా = నన్ను నిజముగా తెలిసికొనిన వాడై, తదనంతరం = పిమ్మట, విశతే = నాలో ప్రవేశించుచున్నాడు. (ఐక్యమగుచున్నాడు లేక నా స్వరూపమగు చున్నాడు).

తా॥ జీవుడనన్యమైన అట్టి భక్తిచేత నన్నెవడైనదియు, నెట్టి వాడైనదియు యథార్థముగ నెఱుంగుచున్నాడు. అట్లెఱుంగుటవలన నన్ను నిజముగా తెలిసికొనినవాడై పిమ్మట నాలో ప్రవేశించు చున్నాడు. (ఐక్యమగుచున్నాడు లేక నా స్వరూపమగుచున్నాడు).

వి॥ పూర్వశ్లోకమున చెప్పబడిన బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము నిర్మలమైన భగవద్భక్తి వలననే సిద్ధించునని యిచట చెప్పబడినది. ముఖ్యముగా ప్రత్యధ్యా యాంతము నందీ భక్తిమార్గమే యుపదేశింపబడుచువచ్చినది. ఏలనన నిదిసర్వు లకు సులభముగానుండును. ఈ భక్తివలననే భగవత్తత్త్వము సంపూర్ణముగా బోధపడుననియు, దానివలన మోక్షముగూడ లభించుననియు నిట్లుపదేశింపబడ మైనది. పుష్పము ఫలమైమారునట్లును, తైలము జ్యోతియై మారునట్లు నీ భక్తియే పరిపక్వమైనప్పుడు జ్ఞానరూపముగ మారుచుండును.

శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥ 56

పద॥ సర్వకర్మాణి - అపి - సదా - కుర్వాణః - మద్వ్యపాశ్రయః.
మత్ప్రసాదాత్ - అవాప్నోతి - శాశ్వతం - పదం - అవ్యయం.

ప్రతి॥ మద్వ్యపాశ్రయః = నన్నాశ్రయించెడువాడు, సర్వకర్మాణి=సర్వకర్మలను, సదా = ఎల్లప్పుడు, కుర్వాణః అపి =చేయుచున్నవాడైనను. మత్ప్రసా దాత్ =నాయనుగ్రహమువలన, శాశ్వతం = నిత్యమైనదియు, అవ్యయం= నాశనములేనిదియునగు, పదం = స్థానమును (మోక్షమును), అవా ప్నోతి = పొందుచున్నాడు.

తా॥ నన్నాశ్రయించెడివాడు సర్వకర్మలను ఎల్లప్పుడు చేయు చున్నవాడైనను, నాయొక్క అనుగ్రహమువలన శాశ్వతమైనది యును, నాశములేనిదియునగు స్థానమును (అనగా మోక్షమును) పొందుచున్నాడు.

వి॥ దీనియందు "సర్వకర్మాణి" అని చెప్పుటచే విధిబోదితములగు నిష్కామ కర్మయోగమును సర్వేంద్రియములచేత చేయువాడైనను, పరమాత్మ యందు నిలుపబడిన మనస్సుగలవాడగుటచే పరబ్రహ్మమునే పొందుచున్నాడని తాత్పర్యము. ఎట్లన కంపాసు (అనగా ఉత్తరదిక్కును సదా చూపునట్టి గడియారము)నే ప్రక్కకు త్రిప్పినను, దానియందుగలముల్లు ఎల్లప్పుడు నుత్తరదిక్కునే చూపునట్లు, ఆత్మనిష్ఠయందుండువాడు సర్వేంద్రియములచేత ధర్మయుక్తమగు కర్మల నెల్లప్పుడును చేయుచుండినను, అతని యాత్మ నిరంతరము పరమాత్మ యందే నిలుకడగలిగి యుండును. అట్టి స్థితిగలుగవలసి యుండిన సర్వేంద్రియములలో గల ప్రకృతిదోషము సంపూర్ణముగా నశించవలెను. లేనిచో ఏకాంతమందేమియు కర్మముచేయనివాడై ధ్యానమందుండిన వాడైనను, త్రాసుయొక్క ముల్లు ఏవైపున భారముగానుండునో, ఆవైపునే ముల్లు తిరిగి యుండునట్లు, అంతఃకరణమందు దృశ్యవిషయ వాసన యుండినచో దానిపైకే మనస్సు పోవుచుండును.

శ్లో॥ చేతసాసర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ ॥ 57

పద॥ చేతసా - సర్వకర్మాణి - మయి - సన్న్యస్య - మత్పరః,
బుద్ధియోగం - ఉపాశ్రిత్య - మచ్చిత్తః - సతతం - భవ.

ప్రతి॥ సర్వకర్మాణి = సమస్తకర్మలను, చేతసా = మనస్సుచేత, మయి సన్న్యస్య = నా యందర్పించి, మత్పరః = నన్నే పరమప్రాప్యముగా నెంచినవాడవై, బుద్ధియోగం ఉపాశ్రిత్య = ధ్యానయోగము నవలంబించి, సతతం = ఎల్లప్పుడును, మచ్చిత్తః = నా యందు జేర్చిన చిత్తముగల వాడవు, భవ = అగుము.

తా॥ జ్ఞానముతో (మనస్సుచే) సకల కర్మములను పరమేశ్వరుడనగు నా యందు సమర్పించి, నన్ను చేరుటయే మోక్షమును బొందుట యను తలంపు గలవాడవునై, చిత్తైకాగ్రతను పొంది యెల్లప్పుడును నాయందే ధ్యానము గలవాడవగుము.

శ్లో॥ మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి।
అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥ 58

పద॥ మచ్చిత్తః - సర్వదుర్గాణి - మత్ప్రసాదాత్ - తరిష్యసి,
అథ - చేత్ - త్వం - అహంకారాత్ - న - శ్రోష్యసి - వినఙ్క్ష్యసి.

ప్రతి॥ త్వం = నీవు. మచ్చిత్తః = నాయందు చేర్చిన చిత్తముగలవాడవై తివేని, మత్ప్రసాదాత్ = నా యనుగ్రహమువలన, సర్వదుర్గాణి = సంసార సంబంధ సమస్త ప్రతిబంధములను, తరిష్యసి = దాటగలవు, అథ = అట్లుగాక, అహంకారాత్ = అహంకారమువలన, న శ్రోష్యసి చేత్ = నా మాట వినకుంటివేని, వినఙ్క్ష్యసి = చెడిపోదువు.

తా॥ నన్ను ధ్యానించుచున్న నీవు, నా యనుగ్రహము వలన సకలములైన సంసార సంబంధములైన ఆటంకములను (ప్రకృతి యొక్క యడ్డులను) దాటెదవు, అట్లుగాక, అహంకారము గలిగి వినకపోతివేని చెడిపోదువు, అనగా మోక్ష భ్రష్టుడ వగుదువు.

వి॥ సామాన్యులకు వారి వారి జన్మాంతర స్వభావము ననుసరించి ప్రవర్తించెడు గుణమే యుండును. అట్లుగాక బ్రహ్మనిష్ఠులైన మహాత్ము లగు వారి వాక్యముల ననుసరించియే ప్రవర్తించవలెను. అట్లుగానిచో చుక్కానిలేనివాడు పడవ ప్రవాహవేగము ననుసరించిగాని, వాయువేగము ననుస రించిగాని, పోవుచు గమ్యస్థానము చేరకయే, యేలాగున మెరకయందు ఎక్కి (చిక్కి) నిలిచిపోవునో, లేక కొండలకుగాని, చెట్లకుగాని కొట్టుకొని పగిలి పోవునో, ఆలాగున స్వభావము ననుసరించి ప్రవర్తించువాని యొక్క గతియు నుండును. అట్టి పడవ కట్టకడకు సముద్రములోనే మునిగిపోవునట్లు వీడును ప్రకృతియందు మునిగిపోవును.

శ్లో॥ యద్యహఙ్కారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥ 59

పద॥ యది - అహఙ్కారం - ఆశ్రిత్య - న - యోత్స్య - ఇతి - మన్యసే,
మిథ్యా - ఏషః - వ్యవసాయః - తే - ప్రకృతిః - త్వాం - నియోక్ష్యతి.

ప్రతి॥ అహఙ్కారం ఆశ్రిత్య = అహంకారయుక్తుడవై, న యోత్స్య ఇతి = యుద్ధముచేయనని, మన్యసే యది = తలంచెదవేని, తే = నీయొక్క, ఏషః వ్యవసాయః = ఈ నిశ్చయము, మిథ్యా = వ్యర్థమైనదియేయగును. ప్రకృతిః = నీ స్వభావము, త్వాం = నిన్ను, నియోక్ష్యతి = నియ మించును.

తా॥ అహంకారయుక్తుడవై యుద్ధము చేయనని తలంచెదవేని నీయొక్క యీ నిశ్చయము వ్యర్థమైనదియే యగును. నీ స్వభావము నిన్ను నియమించును.

వి॥ తన సంస్కారమెట్టిదో తెలియుట కష్టము. దాని నెఱింగిన మహాత్ములు చెప్పిన దాని నుల్లంఘించకూడదు, ఉల్లంఘించిన జీవితము వ్యర్థమౌను.

శ్లో॥ స్వభావజేన కౌన్తేయ ! నిబద్ధస్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్ ॥ 60

పద॥ స్వభావజేన - కౌన్తేయ ! – నిబద్ధః - స్వేన - కర్మణా,
కర్తుం - న - ఇచ్ఛసి - యత్ - మోహాత్ - కరిష్యసి - అవశః-అపి-తత్,

ప్రతి॥ హే కౌన్తేయ! = ఓ యర్జునా!, స్వభావజేన = స్వభావము వలన గలిగిన, స్వేనకర్మణా = నీ సంస్కార జన్యకర్మ చేత, నిబద్ధః = బద్ధుడవగు నీవు, యత్ = దేనిని, కర్తుం = చేయుటకు, మోహాత్ = అజ్ఞానము వలన (వివేచన చేయుశక్తి లేనందువలన), న ఇచ్ఛసి = ఇచ్ఛగింపక యున్నావో, తత్ = దానిని, అవశః అపి = పరతంత్రుడవై యయినను, కరిష్యసి = చేయుదువు.

తా॥ ఓ యర్జునా ! స్వభావమువలన గలిగిన నీ సంస్కార కర్మ చేత బద్ధుడవగు నీవు అజ్ఞానమువలన (వివేచనచేయ శక్తిలేనందు వలన) దేనిని చేయుటకు నిచ్ఛగింపకయున్నావో, దానిని పరతంత్రుడవై యైనను తప్పక చేయుదువు.

వి॥ జన్మాంతరసంస్కార స్వభావము ననుసరించియే జీవులు కర్మము చేయుదురు. అనిన, ధర్మాత్ములయొక్క యుపదేశము, తనయొక్క పురుష ప్రయత్నమును వ్యర్థము కదా! అని యిచ్చట తలంచ రాదు. ఏలన, జన్మాంతర సంస్కారము సామాన్యులకు తెలియునది కాదు, ఆత్మ దృష్టి గలవారికే యది గోచరించును. కనుక వారు చెప్పినట్లు చేయుట ధర్మము. శ్రీ భగవంతునకు అర్జునుని యొక్క సంస్కారము తెలిసి యుండుట చేతను, దుష్ట సంహారము, శిష్టపరిపాలనము దైవకార్య మగుటచేతను దానికొఱకే శ్రీ కృష్ణు డవతరించినందుచేత నర్జునుని ధర్మ యుద్ధమునందు ప్రవేశింప జేయుటకు కారణమైనది. అదియందరివలె కామ్యముతో గాక, నిష్కామముతో జేయుట కుపదేశించెను. దానివలన ఆత్మశుద్ధి గలుగును.

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి ।
భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥ 61

పద॥ ఈశ్వరః - సర్వభూతానాం - హృద్దేశే - అర్జున! - తిష్ఠతి
భ్రామయన్ - సర్వభూతాని - యన్త్రారూఢాని - మాయయా

ప్రతి॥ హే అర్జున = ఓయర్జునా! ఈశ్వరః = నియామకుడగు పరమాత్మ, యన్త్రారూఢాని =దేహములనెడు యంత్రముల నధిష్ఠించియున్న, సర్వభూతాని= సమస్తప్రాణులను, మాయయా = మాయచేత, భ్రామయన్ = త్రిప్పుచు. సర్వభూతానాం = సమస్తప్రాణులయొక్క, హృద్దేశే = హృదయస్థానము నందు, తిష్ఠతి = ఉన్నాడు.

తా॥ ఓ యర్జునా! మానవులను కీలుబొమ్మలనువలె, సర్వాంతర్యామియగు పరమేశ్వరుడు సకలప్రాణులయొక్క హృదయములందుండి మాయచేత సకలభూతములను వారి వారి జన్మాంతరకర్మ సంస్కారము ననుసరించి త్రిప్పుచు, ఆయాకర్మములందు ప్రవర్తింపజేయుచున్నాడు.

వి॥ ఈశ్వరుడే సర్వభూతముల హృదయస్థుడైయుండి, యంత్రి యంత్రములను నడుపునట్లు, సర్వభూతముల తత్తత్కర్మములలో నడుపుచుండునని చెప్పిన, ఇక జీవులు చేయు పుణ్యపాపకర్మఫలము నెవరనుభవింతురు? దానిని గూడ ఈశ్వరుడే యనుభవించవలసి యుండునుగదా? యని సంశయింపకుము. కావుననే"మాయయా" అని చెప్పుటకు కారణమైనది. మాయవలన జనులు తమ సంస్కారమును తెలిసికొన జాలరు. ఈశ్వరుడు సాక్షిమాత్రుడు, కనుకనే కూటస్థుడై సకల ప్రాణుల సంస్కారములను గుర్తెఱుగును. జీవులలో సకల ప్రాణులు తమ తమ సంస్కారము ననుసరించి కర్మల చేయుచుండినను తత్త్వమును తెలికొనజాలకున్నారు. భూమియందేయే బీజమును పెట్టుదుమో, అన్నిటిని భూమియే పోషించుచున్నప్పటికిని, తీపి, పులుపు చేదుఫలములకు భూమి యెట్లు కర్తగాదో, జీవుల కర్మములకును ఈశ్వరు డాలాగుననే కర్తగాడు.

శ్లో॥ తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ 62

పద॥ తం - ఏవ - శరణం - గచ్ఛ - సర్వభావేన - భారత !
తత్ప్రసాదాత్ - పరాం - శాన్తిం - స్థానం - ప్రాప్స్యసి - శాశ్వతమ్,

ప్రతి॥ హే భారత! = ఓ యర్జునా!, సర్వభావేన = అన్నివిధములచేతను, తం ఏవ = ఆ సర్వేశ్వరునే, శరణం గచ్ఛ = రక్షితునిగ వేడుకొనుము. (శరణుబొందుము), తత్ప్రసాదాత్ = ఆ సర్వేశ్వరుని యనుగ్రహము వలన, పరాం శాన్తిం = సర్వోత్కృష్టమైన పరమశాంతిని(ప్రకృతిరహితమగు నుపరతిని), శాశ్వతం స్థానం = శాశ్వతమగు మోక్షపదవిని, ప్రాప్స్యసి = పొందగలవు.

తా॥ ఓ అర్జునా! అన్నివిధముల నా సర్వేశ్వరునే రక్షకునిగ వేడుకొనుము. (శరణుబొందుము.) ఆ సర్వేశ్వరుని యనుగ్రహము వలన, సర్వోత్కృష్టమైన పరమశాంతిని (ప్రకృతిరహితమగు నుపరతిని) శాశ్వతమగు మోక్షపదవిని పొందగలవు.

వి॥ ఈ రెండు శ్లోకముల నాధారము జేసికొనియే, శ్రీ కంఠశివాచార్యులు భగవద్గీతకు శివపరముగా నర్థము వ్రాసియున్నారు, ఇచట "తమేవ శరణం గచ్ఛ" హృదయాంతర్వర్తి యగు నా సర్వేశ్వరునే శరణుపొందుము. ఆ కృపామూర్తి కరుణ వలన మీకు సర్వోపద్రవ రహితమగు మోక్షము గల్గునని చెప్పుటచే, శ్రీకృష్ణభగవానుడు వేరనియు. వారికన్యుడగు ఈశ్వరుడు మరియొకడు గలడనియు సందేహము గలుగ వచ్చును. అట్టి సంశయనివృత్తికొఱకే 61 వ శ్లోకమున "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి" అని ప్రయోగించుటకు కారణమైనది. ఆ యీశ్వరుడు మరి యొకస్థలములో నుండువాడని చెప్పినచో, శ్రీకృష్ణభగవానునికంటె మఱియొక ఈశ్వరుడు వేరుగ గలడని సంశయింపవచ్చును. కనుకనే యనేక స్థలములలో "సర్వభూతాశయస్థితః" నేను సర్వభూతముల హృదయమందుండువాడనని చెప్పబడెను. కాన సర్వాంతర్యామియగు సర్వేశ్వరుడు ఇచ్చట శ్రీ కృష్ణభగవానుడే యని తెలియవలెను. మఱియు, ఆ సర్వేశ్వరుడెచ్చటోగలడని వెదుక నక్కరలేదనియు హృదయమందే ఉన్నాడనియు తెలుపుటకు 'హృద్దేశే' అని చెప్పబడినది. ఇందువలన తన దేహము కనిపించనివాడు (దేహదృష్టిలేనివాడు) ప్రపంచములో నేస్థలములోనికి పోయినను తనను, లోకమును వేరుగా చూడజాలడు. మఱియు ఆత్మశుద్ధి గలుగ జేసికొని, తన హృదయస్థాత్మను దర్శించువాడు, అనగా తెలిసికొనువాడు సర్వత్ర ఆ భగవత్స్వరూపమును గాంచగలడు కావున ఆత్మశుద్ధిచేసికొనక కాశీ, రామేశ్వరము, బదరి కాశ్రమము, హృషీకేశము మానస

సరస్సు మొదలగు పుణ్యప్రదేశములలో నుండినను, లేక వాటిని సందర్శించి నను, ఆత్మదర్శనము గలుగనేరదు. ఏలన, ఆ ప్రదేశములలోగూడ జనులు నివసించుచున్నారు. వారు నితరప్రదేశములలోనుండు జనులవలెనే యున్నారు. కావున భగవత్సాక్షాత్కారమునకు ఆత్మశుద్ధియే ముఖ్యమని తెలియవలెను.

శ్లో॥ ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥ 63

పద॥ ఇతి - తే - జ్ఞానం - ఆఖ్యాతం - గుహ్యాత్ - గుహ్యతరం - మయా,
విమృశ్య - ఏతత్ - అశేషేణ - యథా - ఇచ్ఛసి - తథా - కురు.

ప్రతి॥ ఇతి = పై జెప్పబడిన ప్రకారము. గుహ్యాత్ గుహ్యతరం = రహస్యము లన్నిటిలో పరమరహస్యమగు, జ్ఞానము, తే = నీకు, మయా = నాచేత, ఆఖ్యాతం = చెప్పబడినది. ఏతత్ = దీనిని, అశేషేణ = నిశ్శేషముగా (చక్కగ), విమృశ్య = విమర్శించి (ఆలోచించి). యథా = ఏ ప్రకారము ఇచ్ఛసి= చేయుట కిచ్ఛగించుచున్నావో, తథా=అలాగున,కురు=చేయుము.

తా॥ రహస్యములన్నిటికంటె నతిరహస్యమైనదియు, ఆత్మజ్ఞాన పరమునగు నీ గీతాశాస్త్రమును నేను నీకు చెప్పితిని. నేను చెప్పియున్న యాత్మజ్ఞానసాధనమగునట్టి దీనియొక్క సకలార్థములను చక్కగా నాలోచించి పిమ్మట నీ కేది యిష్టమో, దానిని చేయుము

వి॥ నిష్కామకర్మయోగము నుపదేశించిన శ్రీకృష్ణభగవానుడు అర్జునునితో నీ కార్యము చేయవలయునని నిష్కర్షించి చెప్పినచో, అదియు కామ్యకర్మముతో గూడినదగును. ఆ సత్యము నీ శ్లోకమున వెల్లడిజేసెను. కావుననే రహస్యము లన్నిటిలోను మిక్కిలి రహస్యమైనజ్ఞానమును అనగా తెలియదగిన దానిని చెప్పితిని. దానిని నీ బుద్ధితో చక్కగా నాలోచించుకొని నీ యిష్ట మెట్లుండునో, అలాగున చేయుమని కర్తృత్వము నిచట ఒకమాటలో విడిచిపెట్టినాడు. ఆహా! "విమృశ్య''అను పదమునకు తొందరపడి చేయకుము.మఱలమఱల నాలోచించుకొనినీయిష్టమెట్లో, అలాగున చేయుము, అని అర్థము. అట్లు చెప్పనిచో నదన్ని సంసార బంధమువంటిదే యగును. తల్లి దండ్రులు చెప్పిన వాక్యమును వినని కుమారులపై వారికి తమమాటలువినలేదని యేలాగున మనస్తాపము గలుగునో, ఆలాగున నెవరికైన నుండును. గురువులును ఈలాగున తమ శిష్యులకు లేక

భక్తులకు ధర్మరహస్యములను బోధించి తరువాత వారి సంస్కారమేలాగున నుండునో, అలాగున ప్రవర్తించినచో మనఃక్లేశమునొందకూడదు. లేనిచో నదియు ఒకవిధమగు సంసారులకువలె బంధమేయగును. అప్పుడు నిస్సంగత్వ స్థితి గలుగదు. ఇదేమాదిరి కొన్నిశ్లోకములు శ్రీరాముని గురించి యోగ వాసిష్ఠములో వసిష్ఠమహర్షి యుపదేశించినట్లు గలవు. అలాగుననే యష్టావక్ర మునీంద్రుడు కూడ యుపదేశించి యున్నాడు. ఇదే యథార్థమైన నిష్కామ కర్మ యోగము నిస్సంగత్వము నగును.

శ్లో॥ సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ ॥ 64

పద॥ సర్వగుహ్యతమం - భూయః - శృణు - మే - పరమం - వచః,
ఇష్టః - అసి - మే - దృఢం - ఇతి - తతః - వక్ష్యామి - తే - హితమ్.

ప్రతి॥ సర్వగుహ్యతమం=రహస్యములన్నిటిలో నతిగోప్యమైనదియు, పరమం= శ్రేష్ఠమైనదియునగు, మే = నాయొక్క, వచః = వాక్యమును, భూయః= మఱల, శృణు = వినుము. (నీవు) మే = నాకు, దృఢఃఇష్టః అసి = మిక్కిలి ప్రియుడవై యున్నావు, ఇతి = అని, తతః = ఆకారణమునుబట్టి, తే = నీకు, హితం = హితమును, వక్ష్యామి = చెప్పుచున్నాను.

తా॥ నీవు నాకు పరమాప్తుడవు మిత్రుడవును. ఆ కారణము వలన నీ యిచ్ఛవచ్చినటుల ప్రవర్తించుటనుచూచి యూరకుండుటకు మనసు రానివాడనై, నేను మఱల సకలరహస్యములలో రహస్యతమమైనదియు, సర్వోత్తమమైనదియునగు మఱొక్క,హితమైన మాటను జెప్పెదను శ్రద్ధతో వినుము.

వి॥ పై శ్లోకమున నీ యిష్టప్రకారము చేయవచ్చునని విడిచిపెట్టి మఱల దానిని గుఱించి చెప్పుటకు కారణమేమన, భగవానుడు అతివాత్సల్యమును జూపుచున్నాడు. ఏలన జీవులు ప్రకృతిగుణబద్ధులు మాయచేమోహితులు. కనుక నిజమును తెలిసి కొనజాలరని శ్రీకృష్ణభగవానుడు హృదయములో భావించి మఱియొకసారి చెప్పెను,

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥ 65

పద॥ మన్మనాః – భవ – మద్భక్తః – మద్యాజీ – మాం – నమస్కురు,
మాం - ఏవ - ఏష్యసి - సత్యం - తే- ప్రతిజానే - ప్రియః - అసి - మే.

ప్రతి॥ మన్మనాః = నాయందుజేర్చినచిత్తముగలవాడవును, మద్భక్తః=నాయెడల భక్తిగలవాడవును, మద్యాజీ = నన్నారాధించువాడవును(ధ్యానించువాడవును) భవ = అగుము, మాం నమస్కురు = నన్ను నమస్కరింపుము, మాం ఏవ = నన్నే, ఏష్యసి = పొందగలవు, సత్యం =ఇది యథార్థము, మే ప్రియః అసి = నీవునాకు ప్రియుడవైయున్నావు కాబట్టి, తే = నీకు, ప్రతిజానే = ప్రతిజ్ఞచేయుచున్నాను.

తా॥ నాయందు చిత్తము గలవాడవును, నాయందు భక్తిగలవాడవును, నన్నేనమస్కరించువాడవునగుము. సకలమును నాయందు సమర్పించితివేని, తప్పక నన్నే పొందెదవు. నాకిష్టుడవైనందున నీకు సత్యముగా ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను.

శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ 66

పద॥ సర్వధర్మాన్ - పరిత్యజ్య - మాం - ఏకం - శరణం - వ్రజ,
అహం - త్వా - సర్వపాపేభ్యః - మోక్షయిష్యామి- మా - శుచః.

ప్రతి॥ సర్వధర్మాన్పరిత్యజ్య=సమస్తధర్మములనువిడిచి,మాంఏకంశరణంవ్రజ= నన్నొక్కనిమాత్రము శరణుబొందుము, అహం = నేను, త్వా = నిన్ను సర్వపాపేభ్యః = సమస్తపాపములనుండి, మోక్షయిష్యామి = విముక్తుని చేసెదను, మా శుచః = దుఃఖింపకుము (సందేహపడకుము).

తా॥ సమస్త కర్మములను విడిచి నన్నొక్కని మాత్రము శరణు బొందుము. నేను నిన్ను సమస్త పాపములనుండి విముక్తుని చేసెదను. దుఃఖింపకుము (సందేహ పడకుము). సర్వధర్మములనగ బుద్ధ్యాదీంద్రియములు, వాటి వ్యాపారములును వాటిని విడిచి తురీయావస్థలో నిలువుము. అచ్చట దుఃఖకారణములు లేవు. కాన శోకింపకుమని యర్థాంతరము.

వి॥ శ్రీకృష్ణభగవాను డుపదేశించిన శ్రీ గీతాశాస్త్ర మీశ్లోకముతో పూర్తి యగుచున్నది. దీనికే ఋష్యాదిన్యాసములలోశక్తియనియు కీలకమనియు (రెండు

మహిమలు గలవని) తెలుపడమైనది. ఆవిషయము ఈ యధ్యాయారంభముననే నిరూపించడమైనది. గీతాకల్పవృక్షముయొక్క బీజము, అనగా ధర్మబోధ నారంభము 2-వ అధ్యాయము 11-వ శ్లోకమనియు, దీనియొక్క మధ్య భాగము 9-వ అధ్యాయము 22-వ శ్లోకమనియు, నీ 66-వ శ్లోకమంత్యమ నియు గ్రహించవలెనది. ఈ శ్లోకమును శ్రీ వైష్ణవసాంప్రదాయికులు చరమ శ్లోకముగా గ్రహింతురు, శ్రీనారాయణాష్టాక్షరీ మంత్రమెటువంటిదో, దీని నాలాగున తలంచి నిత్యానుష్ఠానములో పఠింతురు. శ్రీ వైష్ణవులకు దీనికన్న పరమప్రమాణము మరొకటిలేదు, దీనికి శ్రీరామానుజాచార్యులు గొప్ప భాష్యము వ్రాసియున్నారు. అయితే 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అని సమస్తధర్మములను పరిత్యజించి శ్రీ భగవానునొక్కనినే శరణుపొందినచో సర్వపాపముల నుండి విముక్తిని గలుగచేయుదునని (మోక్షము గలుగునని) చెప్పుటచే పరమైకాంత భక్తులైన, ప్రసన్నులైన తదేకధ్యాననిష్ఠాపరులగు బ్రహ్మనిష్ఠులపై భగవంతునికి గల విశ్వాసము ప్రకటింపబడినది. మఱియు కొందఱు భక్తులు బీదవారగుటచే 'మేముతీర్థయాత్రలు'వేదాధ్యయనములు, తపస్సులు, దానములు మొదలగునవి ఏవియు చేయలేమే? మాకెట్లు మోక్షము గలుగును? మా పాపమెట్లు నశించున'ని సందేహపడనక్కరలేదు. అనన్యభక్తి, తదేకధ్యానమొకటి యుండిన చాలును. యజ్ఞాదిసమస్తకర్మములకన్న,నిత్యనైమిత్తికాది సమస్తకర్మములకన్న దీనియందు కోటిరెట్లధిక ఫలముగలదు. గంగాతీరములో కూర్చొని తపమొనర్చువానికి ప్రపంచములోగల గుంటలు,బావులు, చెరువులు, కాలువలు, ఏరులు వీటిలోగల జలములచే నేమి ప్రయోజనము? సూర్యసన్నిధిలో సదా యుండెడు వాలఖిల్యులు మొదలగుమునులకు దీపములుకావలయునా? వారికి చీకటిచే భయముగలుగునా? కర్మపరములగు ధర్మములన్నియు దీపములవంటివి, తదేకధ్యాననిష్ఠసూర్యుని వంటిది. కల్పవృక్షముక్రిందకూర్చున్నవారి కితరములైన వృక్షఫలములచే నేమి ప్రయోజనము? ఆ వృక్షఫలములు గావలెనని యెప్పుడైన సంకల్పము గలుగునా? నిత్యనైమిత్తికకర్మలు లేక ధర్మములన్నియు ప్రపంచములో గల మామిడి మొదలగు ఫలములవంటివి, కల్పవృక్షమో సంకల్పించిన సమస్తమును కలుగజేయును, శ్రీ భగవద్ధ్యానమటువంటిది. ఈ గీతాశాస్త్రమునందు శ్రీకృష్ణభగ వానుడు భక్తులపైకరుణగలిగి ధర్మస్వరూపమగు ప్రపత్తిని యుపదేశించెను. భగవత్ ప్రపత్తికి ఇంత మహిమగలదని తెలుపడమైనది. అయితే "సర్వధర్మాన్ పరిత్యజ్య" అని చెప్పుటచే నధర్మము చేయవచ్చునని దీనియందు(అనగా నీ శ్లోక

మునందు) చెప్పబడలేదు. మఱియు సర్వధర్మములను విడిచి యూరకుండుమని నీ శ్లోకమందు చెప్పబడలేదు. కావుననే "మామేకం శరణం వ్రజ" అని తెలుపడమైనది. సర్వధర్మములను విడిచి నన్నొకని శరణాగతి పొందుము. ప్రసన్నుడవుగమ్ము తదేక ధ్యానమునందుండి చలింపకుమని యుపదేశించడమైనది.

శ్లో॥ ఇదం తే నాతపస్కాయ నా భక్తాయ కదాచన ।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి॥ 67

పద॥ ఇదం - తే - న - అతపస్కాయ - న - అభక్తాయ - కదాచన,
న - చ - అశుశ్రూషవే - వాచ్యం - న-చ - మాం - యః - అభ్యసూయతి.

ప్రతి॥ తే = నీకొఱకు చెప్పబడిన, ఇదం = ఈ గీతాశాస్త్రము, అతపస్కాయ = తపస్సు లేనివానికి, న వాచ్యం = చెప్పదగినదిగాదు, అభక్తాయ = భక్తిలేని వానికి, కదాచన = ఎప్పుడును. న = చెప్పరాదు, అశుశ్రూషవే చ = గురుసేవ చేయనివానికిని, న = చెప్పదగినదిగాదు, చ = మఱియును, యః = ఎవడు, మాం = నన్ను, అభ్యసూయతి = నిందించుచున్నాడో వానికిని, న = చెప్పదగినదికాదు.

తా॥ నీకు చెప్పబడిన యీ గీతాశాస్త్రమును (ప్రపత్తిరూపమైన భక్తిమార్గమును, జ్ఞానమార్గమును) తపస్సు లేనివానికి, భక్తిలేని వానికి, గురుసేవ చేయనివానికి మరియు" నెవడు నన్ను నిందించుచున్నాడో వానికిని ఎప్పటికిని చెప్పదగినది కాదు.

వి॥ ఈ గీతాశాస్త్రమెవరికి చెప్పవచ్చును? ఎవరికి చెప్పకూడదు? దీని కధికారి యెవడను విషయమై యీ శ్లోక మొకటియే గలదు. ''నాతపస్కాయ" తపస్సు లేనివానికి, భగవద్భక్తి లేని వానికి, గురుసేవ చేయనివానికి, భగవన్నింద జేయువానికి చెప్పకూడదు. ఈ నాల్గు గుణములలో భక్తియును, గురుసేవయు లేనివారును, దైవనింద చేయువాడు నీ గీతను పఠించుటకేరారు. అయితే భక్తియు, శుశ్రూషయు చేయువారై గీతాపారాయణము చేయువారికి భగవన్నింద యుండదుగాని యీ పారాయణముచేయు స్త్రీ పురుషులందఱికి తపస్సుగలదా? వీరికి గీతాపారాయణార్హతయున్నదా? అని కొందఱడుగుదురు. తపస్సుయొక్క నిజార్థమేమన, హృదయములోగల పాపమును దహింపచేయుటయే యగును, అట్టి కర్మమును భస్మ మొనర్చుటకుగదా గీతాపారాయణము చేయుచున్నారు. కావున ఈ గీతయొక్క పఠన, పాఠన, శ్రవణములు మూడును

తపస్సేయగును. కావుననే మాహాత్మ్యమున 6-వ శ్లోకమునందు "పఠనం పాఠనం శ్రుతం" అని చెప్పుటకు కారణమైనది. మఱియు గీతలో 17-వ అధ్యాయమున 14, 15, 16 శ్లోకములలో చెప్పబడిన దేహము, వాక్కు, మనస్సు మొదలగు త్రికరణములయొక్క తపస్సే యిచ్చట తపస్సని గ్రహించ దగినది. ఇది సర్వజనుల కాచరించుటకు సాధ్యమైన తపస్సేయని శ్రీ భగవానుడే యుపదేశించియున్నాడు. అట్టి తపస్సేయని గ్రహించుకొనవలెను. అంతే గాని వనములో నుండి కంద, మూల, ఫల పత్రాదుల భుజించి కఠినమైన తపస్సు చేయువారికేయని దీని యందర్థములేదు. అర్జునుడు గృహస్థాశ్రమమం దుండువాడు, అట్టివానికే శ్రీ కృష్ణభగవానుడీ గీతాశాస్త్రము నుపదేశించెను. కావున సర్వధర్మాచరణమే ఇచ్చట తపస్సని గ్రహించదగును. అట్లు గానిచో 9-వ అధ్యాయము 32-వ శ్లోకమున.

"మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।
స్త్రియోవైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాంగతిమ్॥"

తా॥ పాపయోనులలో జన్మించిన వారెవరుగలరో వారును స్త్రీలును, శూద్రులును, వైశ్యులును ఈ గీతాపారాయణానుష్ఠానము వలన పాపరహితులై, మోక్షమును పొందుచున్నారని శ్రీకృష్ణభగవానుడు స్వయముగా చెప్పి యుండెడు. మఱియు మాహాత్మ్యము 3-వ శ్లోకమున "మహాపాపాదిపాపాని" పంచమహాపాపములు చేసిన మహాపాపియైనను గీతాపఠన అనుష్ఠానముచే సమస్త పాపములనుండి విముక్తుడై, భగవద్ జ్ఞానసంపన్నుడై ముక్తుడగునని చెప్పియుండగా మఱల దీనిని గుఱించి యేల సందేహపడవలెను? మఱియు రోగముగలవాడుగదా ఔషధసేవ చేయవలయును! అలాగున పాపులైనవారు గదా పాపవిమోచనార్థములగు కార్యముల జేయవలయును. ఈ సత్యమును భారతదేశములో గలవారలలో చాలమంది మరచిపోయిరి. దీనివలననే దేశము పతనమైనది. ఇక నీ క్రింది రెండుశ్లోకములచే శ్రీ భగవద్గీతను జనులకు బోధించువారిపై భగవంతునికి గల ప్రీతిని చూడుడు:-

శ్లో॥ య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥ 68

పద॥ యః - ఇమం - పరమం - గుహ్యం - మద్భక్తేషు - అభిధాస్యతి,
భక్తిం - మయి - పరాం - కృత్వా - మాం - ఏవ - ఏష్యతి-అసంశయః.

ప్రతి॥ యః=ఎవడు, ఇమం = ఈ, పరమం గుహ్యం = పరమరహస్యమగు గీతా శాస్త్రమును, మద్భక్తేషు = నా భక్తులకు, అభిధాస్యతి = చెప్పుచున్నాడో వాడు, అసంశయః = సంశయరహితుడై, మయి = నాయందు, పరాం భక్తిం = సర్వోత్కృష్టమైన భక్తిని, కృత్వా = చేసి, మాం ఏవ = నన్నే (మత్సాయుజ్యమునే), ఏష్యతి = పొందగలడు.

తా॥ ఎవడీ పరమరహస్యమగు గీతాశాస్త్రమును నా భక్తులకు చెప్పుచున్నాడో, వాడు సంశయ రహితుడై నాయందు సర్వోత్కృష్ట మైన భక్తినిచేసి నన్నే (మత్సాయుజ్యమునే) పొందగలడు, సంశ యము లేదు.

వి॥ "మద్భక్తేషు" నాయందు భక్తిగలవారెవరు గలరో వారినని ప్రయో గించి యుండుటచే భగవంతుడొక జాతినిగాని, ఒక యాశ్రమమును గాని నిరూపింపక విశాల భావముతో భగవద్భక్తిగల యేజాతివాడైనను, స్త్రీయైనను, పురుషుడైనను సరి యెవడీ గీతాశాస్త్రమును పఠింపచేయుటగాని లేక శ్రవణము చేయించుట గాని చేయుచున్నాడో, వాడునాయందు సర్వోత్కృష్టమైన పరమ భక్తిని చేసిన వాడే యగును. అంతేగాదు వాడు నన్నే పొందగలడు. 'అసంశయః' దీనియందు సంశయమేలేదు. అని సాక్షాత్ భగవంతుడే తెలిపినాడు. మఱియు వినుము.

శ్లో॥ న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥ 69

పద॥ న - చ - తస్మాత్ - మనుష్యేషు - కశ్చిత్ - మే - ప్రియకృత్తమః,
భవితా - న - చ - మే - తస్మాత్ - అన్యః - ప్రియతరః - భువి.

ప్రతి॥ మనుష్యేషు = మనుష్యులలో, తస్మాత్ = నాభక్తులకు గీతను చెప్పు నట్టివారి కంటె, మే = నాకు, ప్రియకృత్తమః = అధిక ప్రియమును చేయువాడు, కశ్చిత్ = ఒక్కడును, న చ = లేనేలేడు, భువి = భూమి యందు, తస్మాత్ = వానికంటె, అన్యః = ఇతరుడు, ప్రియతరః = మిక్కిలి యిష్టుడు, మే = నాకు, న భవితాచ = ఉండబోడుగూడ.

తా॥ మనుష్యులలో నాభక్తులకు గీతను చెప్పువానికంటె నాకు అధిక ప్రియమును చేయువాడెవడును లేనే లేడు. ఈ భూమియందు అట్టి గీతాబోధకునికంటె మిక్కిలి యిష్టుడు మఱెవడును ఉండబోడుగూడ.

వి॥ ఈగీతాశాస్త్రము నెవడు జనులకు నేర్పుటగాని, వినిపించుటగాని, చేయుచున్నాడో, వాడేనాకు మిక్కిలి ప్రీతిని కలుగజేసినవాడు. అట్టి గీతాబోధకునితో సమానుడీ భూలోకమున నింతకు పూర్వముండలేదు, ఇపుడు వుండుటలేదు, ఇక మీదట ఉండబోడు. ఓహో! భగవద్ధర్మమును బోధించువారికి సమానుడైన భగవంతునికి ప్రీతిపాత్రుడు మఱియొకడు భూతభవిష్యద్వర్తమాన కాలములలో గూడ లేడని స్వయముగా శ్రీవాసుదేవు డుపదేశించెను. ఈ గీతాశాస్త్రమొకటిమాత్రముకాదు. భగవ ద్భక్తిని, భగవద్ జ్ఞానమును భగవద్ధర్మమును భగవద్గుణమును బోధించువారుగూడ గీతాశాస్త్రము నుపదేశించువారిలో చేరినవారే యగుదురు. ప్రభువుయొక్క ప్రీతిని అభిలషించువాడు ప్రభువుయొక్క బిడ్డలను బాధించినచో, ప్రభుప్రీతి యెట్లు గలుగును? ప్రభువుయొక్క బిడ్డలు రోగపీడితులై యుండగా వారికౌషధమునిచ్చి బాగుపరచినవారిపై ప్రభువున కెంత ప్రీతిగలిగియుండునో, భగవంతునియొక్క బిడ్డలగు నీమానవులలో నెవ్వరజ్ఞానరోగపీడితులై, నిస్సహాయులై యుందురో వారికి సహాయపడి, వారి యజ్ఞానమును పోగొట్టి, వారిని జ్ఞానవంతులుగా జేయువారిపై సర్వేశ్వరునకు మిక్కిలి ప్రీతి గలిగియుండును.

శ్లో॥ అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః ।
జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టస్స్యామితి మే మతిః॥ 70

పద॥ అధ్యేష్యతే - చ - యః - ఇమం - ధర్మ్యం - సంవాదం - ఆవయోః,
జ్ఞానయజ్ఞేన - తేన - అహం - ఇష్టః - స్యాం - ఇతి - మే - మతిః.

ప్రతి॥ యః చ = ఎవడైతే, ఇమం = ఈ, ధర్మ్యం = ధర్మమునకు మూలమైన (ధర్మచ్యుతముకాని) ఆవయోః = మనయొక్క, సంవాదం = సంభాషణమును, అధ్యేష్యతే = అధ్యయనము చేయుచున్నాడో, (పఠించుచున్నాడో) తేన = అట్టివానిచేత, అహం = నేను, జ్ఞానయజ్ఞేన = జ్ఞానయజ్ఞముచేత, ఇష్టః స్యాం ఇతి = పూజింపబడిన వాడనగుదునని (ఆరాధింపబడినవాడనని), మే మతిః = నా అభిప్రాయము.

తా॥ ధర్మమునుండి తొలగనిదియును, మన యిద్దరియొక్క సంవాదరూపమైనదియునగు నీ గీతాశాస్త్రమును బఠించినవాడు విధియజ్ఞము, జపయజ్ఞము, ఉపాంశుయజ్ఞము, మానసయజ్ఞమను నాల్గింటిలో నుత్తమమైన జ్ఞానయజ్ఞముచేత నన్ను పూజించినవాడగుచున్నాడని నా నిశ్చయము.

వి॥ ఈ గీతాశాస్త్రము నొకవేళ అర్థము తెలియక భగవద్భక్తిగలిగి పారాయణము చేసినను, గొప్పఫలితము గలదు, ఔషధముయొక్క ప్రయోజనము తెలియక పోయినను, ఏలాగున నది రోగమును రహితమొనర్చునో, నిప్పును తెలియక త్రొక్కిన నెట్లు కాల్చునో, అలాగున మంత్రమునకుగాని, భగవత్ సంబంధస్తోత్ర పారాయణములకు గాని అర్థము తెలియక చేసినను, ఫలము మాత్రము లేకపోదు. కనుక భక్తి మాత్రము గలిగి యుండవలెను.

శ్లో॥ శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।
సోఽపి ముక్తశ్శుభాఁల్లోకాఁ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥ 71

పద॥ శ్రద్ధావాఁ-అనసూయః-చ-శృణుయాత్-అపి-యః-నరః
సః – అపి - ముక్తః - శుభాఁ - లోకాఁ-ప్రాప్నుయాత్ -పుణ్యకర్మణామ్

ప్రతి॥ యః నరః = ఏ నరుడు, శ్రద్ధావాఁ=శ్రద్ధాయుక్తుడును, అనసూయః చ= అసూయారహితుడునై, శృణుయాత్ అపి = ఈ గీతాశాస్త్రమును వినుచున్నవాడైనను, సః అపి= అట్టివాడును, ముక్తః = భవబంధవిముక్తుడై, పుణ్యకర్మణాం = పుణ్యకర్మములు చేయువారలయొక్క, పుణ్యాత్ములు పొందదగిన, శుభాన్ లోకాన్ = పుణ్యలోకములను, ప్రాప్నుయాత్ = పొందగలడు.

తా॥ ఏ మనుజుడు శ్రద్ధతో గూడినవాడును, అసూయలేనివాడునునై, ఈ గీతాశాస్త్రమును పఠించ శక్తిలేనప్పటికిని, వినుటయందు ఆసక్తిగలిగియుండునో, అట్టివాడును పాపవిముక్తుడై పుణ్యాత్ములు పొందెడు పుణ్యలోకములను పొందగలడు.

వి॥ శ్రీకృష్ణభగవానునియొక్క కరుణారస మీశ్లోకములో వెలిబుచ్చడమైనది. గీతాశ్లోకములను పఠించశక్తిలేనిస్త్రీలును, పురుషులును, చాలమందిగలరు. అయ్యో! శ్రీభగవద్గీతను పఠించుభాగ్యము మాకులేకపోయినదేయని వారు తపింపనక్కరలేదు. భక్తితో వినుచుండిన చాలును. వారుకూడ తరింపగలరు. ఎట్లనరోగియైనవాడు ఆయుర్వేదమును చదవకపోయినను మంచివైద్యుడిచ్చినమందును తిని పథ్యముండిన రోగశాంతి యెట్లు కలుగునో అలాగుననే గొప్ప వైద్యుడైయుండినను తనకు వ్యాధికల్గిన ఔషధసేవయు, పథ్యములేనిచో రోగమెట్లు కుదరదో అలాగున మేము చదువుకొన్నవారమని గర్వించి యనుష్ఠానము లేనిచో వారల భవరోగము శమింపదు.

శ్లో॥ కచ్చిదేత చ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా ।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ! ॥ 72

పద॥ కచ్చిత్ - ఏతత్ - శ్రుతం - పార్థ! - త్వయా - ఏకాగ్రేణ - చేతసా,
కచ్చిత్ - అజ్ఞానసమ్మోహః - ప్రణష్టః - తే - ధనంజయ!

ప్రతి॥ హేపార్థ = ఓయర్జునా! ఏతత్ = నాచే చెప్ప బడిన యీ గీతాశాస్త్రము, త్వయా=నీచేత, ఏకాగ్రేణ చేతసా = నిశ్చల చిత్తముతో, శ్రుతం కచ్చిత్= వినబడినదికదా, హేధనంజయ! = ఓయర్జునా! తే = నీయొక్క ,అజ్ఞాన సమ్మోహః = అజ్ఞానముచే కలిగిన మోహము, ప్రణష్టః కచ్చిత్ = సంపూర్ణముగా నశించినది కదా?

తా॥ ఓ యర్జునా! నాచే చెప్పబడిన యీ గీతాశాస్త్రము నీచే నిశ్చలచిత్తముతో వినబడినదిగదా? హే ధనంజయ! అజ్ఞానముచే గలిగిన నీయొక్క మోహము సంపూర్ణముగా నశించినది గదా ?

వి॥ వైద్యుడు, ఆరోగ్యస్థితికివచ్చిన రోగిని యారోగ్యముగలిగినదిగదా? రోగము నశించినదిగదా? అని యెట్లడుగునో, అలాగున గురువుగూడ శిష్యులను అజ్ఞానము సంపూర్ణముగా నశించినదిగదా? సంశయములేదుగదా? ప్రతిబంధ రహితముగా బ్రహ్మసాక్షాత్కారము గలిగినదిగదా? అని వాత్సల్యము గలిగి యడుగవలసిన ధర్మముగలదు. ఆధర్మము నిచ్చట లోకగురువైన భగవంతుడు నిరూపించెను,

అర్జున ఉవాచ:—అర్జునుడు చెప్పెను.

శ్లో॥ నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత ।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥ 73

పద॥ నష్టః - మోహః - స్మృతిః - లబ్ధా - త్వత్ప్రసాదాత్ - మయా - అచ్యుత! స్థితః - అస్మి - గతసందేహః - కరిష్యే - వచనం - తవ,

ప్రతి॥ హే అచ్యుత! = ఓ శ్రీ కృష్ణమూర్తీ!, త్వత్ప్రసాదాత్ = నీ అనుగ్రహమువలన, మయా = నాచేత, స్మృతిః లబ్ధా = జ్ఞానము పొందబడినది, మోహః నష్టః = అజ్ఞానము వీడిపోయినది (నశించినది). గత సందేహః స్థితః అస్మి = సంశయరహితుడనై సుస్థిరుడనై యుంటున్నాను, తవ వచనం కరిష్యే = నీయొక్క యాజ్ఞను పాలించెదను.

తా॥ ఓ శ్రీకృష్ణమూర్తీ నీ యనుగ్రహమువలన జ్ఞానము కలిగినది. అజ్ఞానము వీడిపోయినది (నశించినది), సంశయరహితుడనై సుస్థిరుడనైయున్నాను. నీయొక్క యాజ్ఞను పాలించెదను. "స్మృతిర్లబ్ధా" అని చెప్పుటచే ఇచ్చట స్మృతిశబ్దమునకు మరపు జెందినది తిరిగి జ్ఞాపకమునకు వచ్చినదని భావము. అనగా నవిద్యా మోహముచే మరపు గలిగియుండిన యాత్మసాక్షాత్కార స్వరూప జ్ఞానము గలిగినదని భావము,

వి॥ వైద్యుడడుగగా ఆరోగ్యస్థితి గలిగిన రోగి యేలాగున రోగము నిశ్శేషముగా నశించినది. ఆరోగ్యవంతుడనై యుంటున్నానని తెలుపునో, అలాగున భవరోగముతో గూడిన శిష్యుడును, గురువుచే అడుగబడినప్పుడు, ఆత్మజ్ఞానప్రబోధము గలిగినది. అజ్ఞానము పూర్తిగా నశించినదని చెప్పేస్థితికి రావలసియుండును, సందేహము గలిగియుండగూడదు.

అపూర్ణుడై యుండకూడదు. "కరిష్యే వచనం తవ" అని యర్జునుడు చెప్పుటచే అనగా తనకు చేయవలసినదేమియు మిగిలియుండలేదనియు, మీవాక్యమును పాలించెదననియు చెప్పుటచే శిష్యుడు కృతకృత్యుడైనందుచే తనకుచేయవలసిన దేమియు మిగిలియుండ లేదనియు, అట్లైనను గురువుయొక్క యాజ్ఞను పాలించవలెనను ధర్మమొకటి గలదనియు చెప్పినట్లర్థమగుచున్నది. కావుననే కృతకృత్యులైన శిష్యులను ధర్మబోధనార్థమై లోకములోనికి పంపుటకుగాని లేక ధర్మసంరక్షణార్థమై యాశ్రమములలో నియమించుటకు గాని కారణమగుచున్నది. ఋషిపరంపరగా వచ్చుచుండు జ్ఞానమును నిలబెట్టుట యార్షధర్మమైయున్నది. అందువలన బ్రహ్మవిద్యాసంరక్షణ కొరకు శిష్యులను ఏర్పరచుటయు, ఆశ్రమములను నిర్మించుటయు అనాదిగా వచ్చుచుండెడు ధర్మమైయున్నది.

సంజయ ఉవాచ:- సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః।
సంవాదమిమమశ్రౌషమద్భుతం రోమహర్షణమ్ ॥ 74

పద॥ ఇతి - అహం - వాసుదేవస్య - పార్థస్య - చ - మహాత్మనః
సంవాదం - ఇమం - అశ్రౌషం - అద్భుతం - రోమహర్షణమ్.

ప్రతి॥ ఇతి= పై జెప్పబడిన విధముగ. మహాత్మనః వాసుదేవస్య = మహాత్ముడగు వాసుదేవునియొక్కయు. పార్థస్య చ = అర్జునునియొక్కయు అద్భుతం = ఆశ్చర్యకరమైనదియు రోమహర్షణం =పులకాంకురమును గలుగజేయునదియునగు. ఇమం సంవాదం= ఈ శ్రీకృష్ణార్జున సంభాషణమును. అహం అశ్రౌషం = నేను వింటిని,

తా॥ పై చెప్పబడిన విధముగ మహాత్ముడగు వాసుదేవుని యొక్కయు, అర్జునునియొక్కయు, ఆశ్చర్యకరమైనదియు, పులకాంకురమును గలుగజేయునదియునగు ఈ శ్రీకృష్ణార్జున సంభాషణమును నేను వింటిని.

వి॥ శ్రీ కృష్ణార్జునుల సంభాషణ మాహాత్మ్యమును, సత్యమును, ధర్మమును ధృతరాష్ట్రుడు తెలిసికొనుటకు సంజయుడిట్లు చెప్పెను.

శ్లో॥ వ్యాసప్రసాదాచ్ఛ్రుతవానేతద్గుహ్యతమం పరమ్ ।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్॥ 75

పద॥ వ్యాసప్రసాదాత్ - శ్రుతవాన్ - ఏతత్ - గుహ్యతమం - పరం,
యోగం - యోగేశ్వరాత్ - కృష్ణాత్ - సాక్షాత్ - కథయతః - స్వయమ్.

ప్రతి॥ అహం=నేను, వ్యాసప్రసాదాత్= శ్రీవేదవ్యాసమహర్షియొక్క యనుగ్రహమువలన, ఏతత్ గుహ్యతమం = అతిగోప్యమైనదియు, పరం = శ్రేష్ఠమైనదియునగు, యోగం = ఈ యోగశాస్త్రమును, స్వయం =స్వయముగా (శ్రీకృష్ణభగవానుడు తానుగానే), కథయతః = అర్జునుని గుఱించి చెప్పుచున్న, యోగీశ్వరాత్ = యోగీశ్వరుడగు, కృష్ణాత్ = కృష్ణభగవానుని వలన, సాక్షాత్ = ప్రత్యక్షముగా, శ్రుతవాన్ = వింటిని.

తా॥ నేను వ్యాసమహర్షియొక్క యనుగ్రహమువలన నతిగోప్యమైనదియు, శ్రేష్ఠమైనదియునగు ఈ యోగశాస్త్రమును, యోగీశ్వరుడగు శ్రీ కృష్ణభగవానుడు స్వయముగా అర్జునునికి చెప్పుచుండగా ప్రత్యక్షముగా వింటిని.

వి॥ "సాక్షాత్" అనగా మఱియొకరుచెప్పినదిగాదనియు, స్వయముగా తాను విన్నదనియు సంజయుడు చెప్పుటచే ధృతరాష్ట్ర మహారాజునకు సందేహము గలుగ కూడదనిభావము. అందుకొఱకే యిట్లుచెప్పడమైనది, శ్రీవ్యాస మహర్షి యనుగ్రహము వలననే కురుక్షేత్రములో జరుగుచున్న విషయము

చూచుటకును, వినుటకును సంజయునకు శక్తిగలిగినదను విషయ మిదివరలో చెప్పబడియున్నది, భగవదనుగ్రహము మహనీయుల యాశీర్వాదమును గలిగిన, అట్టిదివ్యదృష్టియు, దూర శ్రవణశక్తియు. ఇతరుల సంకల్పమును తెలిసికొనెడు శక్తియు గలుగును, శ్రీ వ్యాసానుగ్రహమున తన కట్టి శక్తి గలిగెనని సంజయుడు చెప్పడమైనది.

శ్లో॥ రాజన్! సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76

పద॥ రాజన్! - సంస్మృత్య - సంస్మృత్య - సంవాదం - ఇమం - అద్భుతం
కేశవార్జునయోః - పుణ్యం - హృష్యామి - చ - ముహుః - ముహుః

ప్రతి॥ చ = మఱియును, హేరాజన్! = ఓ ధృతరాష్ట్ర మహారాజా! కేశవార్జునయోః = శ్రీకృష్ణార్జునులయొక్క, అద్భుతం = ఆశ్చర్యకరమైనదియు, పుణ్యం = పావనమైనదియునగు, ఇమం సంవాదం = ఈసంభాషణమును, సంస్మృత్య సంస్మృత్య = తలంచి తలంచి, ముహుః ముహుః= మాటి మాటికి, హృష్యామి = ఆనందించుచున్నాను.

తా॥ ధృతరాష్ట్ర మహారాజా! శ్రీ కృష్ణార్జునుల యొక్క యాశ్చర్య కరమైనదియు, పవిత్రమైనదియునగు ఈ సంభాషణమును తలంచి తలంచి మాటిమాటికి సంతోషించుచున్నాను.

శ్లో॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః।
విస్మయో మే మహాన్ రాజన్! హృష్యామి చ పునః పునః ॥ 77

పద॥ తత్–చ – సంస్మృత్య – సంస్మృత్య – రూపం – అత్యద్భుతం – హరేః,
విస్మయః – మే – మహాన్ – రాజన్ – హృష్యామి - చ – పునః – పునః

ప్రతి॥ హేరాజన్! = ఓధృతరాష్ట్ర మహారాజా!, హరేః = శ్రీకృష్ణమూర్తి యొక్క, తత్ అత్యద్భుతం రూపం చ = ఆ యద్భుతవిశ్వరూపమును గూడ, సంస్మృత్య సంస్మృత్య = తలంచి తలంచి, మే = నాకు, మహాన్ విస్మయః = అత్యాశ్చర్యము గలుగుచున్నది, పునః పునః = మాటిమాటికి హృష్యామి = సంతోషించు చున్నాను.

తా॥ ఓ ధృతరాష్ట్ర మహారాజా! శ్రీ కృష్ణమూర్తియొక్క య యద్భుత విశ్వరూపమునుగూడ తలంచి తలంచి, నాకాశ్చర్యము గలుగుచున్నది. మాటిమాటికి సంతోషించుచున్నాను,

వి॥ మహాత్ముల బోధ వినినను భగవత్కథాశ్రవణము చేసినను హృదయములో నిట్టి అపరిమితానందము గలుగవలెను.

శ్లో॥ యత్రయోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీ ర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ॥ 78

పద॥ యత్ర – యోగీశ్వరః – కృష్ణః – యత్ర – పార్థః – ధనుర్ధరః,
తత్ర – శ్రీః – విజయః – భూతిః – ధ్రువా – నీతిః – మతిః – మమ.

ప్రతి॥ యోగీశ్వరః = యోగులందరికీనీశ్వరుడగు, కృష్ణః =శ్రీకృష్ణభగవానుడు, యత్ర = ఏపక్షమునందున్నాడో, ధనుర్ధరః = గాండీవమను ధనుస్సును ధరించిన, పార్థః = పార్థుడు, యత్ర= ఏపక్షమందున్నాడో, తత్ర =ఆ పక్షమునందు, శ్రీః= సంపదయు(రాజ్యలక్ష్మియు), విజయః = విజయము, భూతిః = ఐశ్వర్యము, ధ్రువా నీతిః = ధృఢమైననీతియున్ను గలవని, మమ మతిః = నాయొక్క అభిప్రాయము.

తా॥ ఓ ధృతరాష్ట్ర మహారాజా! యోగసిద్ధులకు (ప్రభువు) నీశ్వరుడును, విల్లును ధరించిన యర్జునుడును యేపక్షమందున్నారో యచ్చటనే అనగా (పాండవ పక్షమునందే) రాజ్యలక్ష్మియు, జయలక్ష్మియు, నైశ్వర్యాభివృద్ధియు, న్యాయమును తొలగక నిలుచునని నా అభిప్రాయము.

వి॥ యోగీశ్వరుడని చెప్పుటవలన శ్రీకృష్ణమూర్తి సర్వేశ్వరుడనియు ధనుర్ధరుడని చెప్పుటవలన పరమశివుడిచ్చిన గాండీవము గలవాడర్జును డనియు నిరూపించడమైనది. శ్రీకృష్ణార్జును లేపక్షమునందుందురో యచ్చటనే రాజ్యలక్ష్మియు,జయలక్ష్మియు ,నైశ్వర్యలక్ష్మియు చలింపక నిలుచునని సంజయుడు చెప్పుటచే తప్పక పాండవ పక్షమునకే విజయము గలుగునని నిరూపించడమైనది. ఈవాక్యమును వినియైనను ధృతరాష్ట్రుడు సంధిచేసికొని యుద్ధమును మానుటయే మేలనుకొనునేమో అనుగూఢార్థము స్ఫురించుచున్నది. మఱియు ఏ పక్షమందు సత్యము, ధర్మము గలిగియుండునో యా పక్షమునందు భగవంతుడు రక్షకుడై నిలచియుండు ననియు, వారికి తప్పక జయము గలుగుననియు, నీ శ్లోకమువలన భక్తులు, ధర్మాత్ములు తెలిసికొనవలయును.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం శ్రీమద్భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే
మోక్షసన్న్యాస యోగో నామాష్టాదశోఽధ్యాయః.

పద॥ ఇతి–శ్రీమహాభారతే – శతసాహస్రికాయాం – సంహితాయాం – వైయాసిక్యాం – శ్రీమద్భీష్మపర్వణి – శ్రీమద్భగవద్గీతాసు – ఉపనిషత్సు – బ్రహ్మవిద్యాయాం - యోగశాస్త్రే - శ్రీకృష్ణార్జునసంవాదే - మోక్షసన్న్యాసయోగః – నామ – అష్టాదశః – అధ్యాయః.

ప్రతి॥ వైయాసిక్యాం = శ్రీవ్యాసముని ప్రోక్తమైనదియును, శతసాహస్రికాయాం =నూరువేలశ్లోకములు గలదియును, సంహితాయాం = ఛందోబద్ధమైనదియు నగు, శ్రీమహాభారతే = లక్ష్మీకరమైన మహాభారతమునందు, శ్రీమద్భీష్మపర్వణి = శ్రీమద్భీష్మపర్వమందుగల, ఉపనిషత్సు= ఉపనిషదర్థ ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాయాం = బ్రహ్మవిద్యాస్వరూపమును, యోగశాస్త్రే = యోగశాస్త్రస్వరూపమును, శ్రీకృష్ణార్జున సంవాదే = శ్రీకృష్ణార్జున సంవాదమునగు, శ్రీమద్భగవద్గీతాసు = శ్రీభగవద్గీతలో, మోక్షసన్న్యాస యోగః నామ = మోక్షసన్న్యాస యోగమని ప్రసిద్ధిగల, అష్టాదశః అధ్యాయః = పదునెనిమిదవ యధ్యాయము సంపూర్ణము.

తా॥ ఇది శ్రీ వ్యాసమునీంద్రునిచే రచింపబడినదియు, నూరు వేల శ్లోకములు గలదియు, ఛన్దోబద్ధమైనదియు నగు శ్రీ మహాభారతమునందు శ్రీ భీష్మపర్వమందుగల, ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదరూపము నగు శ్రీ మద్భగవద్గీతయందు మోక్షసన్న్యాసయోగమనెడు పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.

ఇట్లు శ్రీ మలయాళస్వామికృత 'గీతార్థప్రకాశ' మను భగవద్గీత యొక్క ఆంధ్రానువాదము ముగిసినది. ఓమ్.

శ్రీ కృ ష్ణ ప ర బ్ర హ్మా ర్ప ణ మ స్తు.

ఓం శా న్తి శ్శా న్తి శ్శా న్తిః

ఓం తత్ సత్ ఓమ్.



ఓమ్ తత్ సత్

# గీతా పంచప్రాణములు



1. మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణసుఖదుఃఖదాః । అ॥ శ్లో॥
   ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత॥ 2.14.

2. త్రైగుణ్యవిషయా వేదానిస్త్రైగుణ్యోభవార్జున! ।
   నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ 2.45.

3. న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్ ।
   స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః॥ 5.20

4. యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।
   శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః॥ 12.17

5. బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।
   సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥ 18.54.

ఇవి గీతయొక్క పంచ ప్రాణములు. జీవన్ముక్తిపదవిలో తురీయస్థితిలో గుణత్రయాతీతస్థానములో స్వరూపసాక్షాత్కారములో భగవన్నిలయములో ద్వంద్వాతీత స్థానములో నిలుచువారును, నిలువ తలంచువారును గీతా ప్రాణ పంచకములనబడు ఈ అయిదు శ్లోకములను నిరంతరము పఠించుచు నర్థ మును భావించుచుండవలయును. ఎప్పుడేని శ్రీ గీతా పారాయణమున కనుకూల పడక పోయినను ఈ శ్లోక పంచకమునైన పఠించుచుండిన చాలును. ఈ శ్లోక ములయొక్క అర్థము ఆయా యధ్యాయములలో ఆయా శ్లోకములయొద్ద జూచి తెలిసికొనవచ్చును. తురీయ పదమునుండి అనగా దైవభావమునుండి మనస్సె పుడైన దృశ్యములోనికి, దృశ్యవృత్తిలోనికి, దృశ్యగుణములోనికి, దృశ్య విషయములోనికి చిన్నగ జారుచున్నదని తోచినచో ఈ శ్లోకముల యొక్క పఠనముచేత, నర్థచింతనముచేతను, సౌధమునుండి చిన్నగా క్రిందకు పడి పోయినవాడు మఱల నింపాదిగా సోపానములపై నెక్కుచు గమ్యస్థానము జేరు నట్లు తిరిగి సహజమగు తురీయపదము నధిరోహించగలడు. ఈ పంచ ప్రాణములందుల కుపయోగించును.

ఓమ్ తత్ సత్



# గీ తా శ్లో క సూ చీ

శ్రీ భగవద్గీతలో నేయే యధ్యాయమున నెవరెవ రెన్నెన్ని శ్లోకములు చెప్పిరి? మొత్తము శ్లోకము లెన్ని? ఏ శ్లోకము నుండి యే శ్లోకము వఱకను విషయము లీ క్రింద తెలుపబడును,

| అధ్యాయముల నంబరు | శ్లోకముల మొత్తము | ధృతరాష్ట్రుడు | శ్లోకసంఖ్య | సంజయుడు | శ్లోకసంఖ్య | అర్జునుడు | శ్లోకసంఖ్య | శ్రీకృష్ణ పరమాత్మ | శ్లోకసంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | 1 | | 2 | | 3 | | 4 | |
| | | | | నుండి-వరకు | | నుండి-వరకు | | నుండి-వరకు | |
| 1 | 47 | 1 | 1 | 2–20 | 19 | 21-23 | 3 | ... | |
| | | | | 24–27 | 4 | 28–46 | 19 | ... | |
| | | | | 47 | 1 | ... | | ... | |
| 2 | 72 | ... | ... | 1 | 1 | ... | | 2–3 | 2 |
| | | | | | | 4–8 | 5 | ... | |
| | | | | 9–10 | 2 | ... | | 11–53 | 43 |
| | | | | | | 54 | 1 | 55–72 | 18 |
| 3 | 43 | ... | ... | ... | | 1–2 | 2 | 3–35 | 33 |
| | | | | | | 36 | 1 | 37–43 | 7 |
| 4 | 42 | ... | | ... | ... | ... | | 1–3 | 3 |
| | | | | | | 4 | 1 | 5–42 | 38 |
| 5 | 29 | ... | ... | ... | ... | 1 | 1 | 2-29 | 28 |
| 6 | 47 | ... | ... | . | ... | ... | | 1-32 | 32 |
| | | | | | | 33–34 | 2 | 35–36 | 2 |
| | | | | | | 37–39 | 3 | 40–47 | 8 |
| 7 | 30 | . | ... | ... | ... | ... | | 1–30 | 30 |
| 8 | 28 | . | ... | .. | ,.. | 1–2 | 2 | 3–28 | 26 |
| 9 | 34 | ... | ... | ... | ..: | .. | ... | 1–34 | 34 |
| 10 | 42 | ... | . | ... | ... | ... | -.. | 1–11 | 11 |
| | | | | | | 12–18 | 7 | 19–42 | 24 |
| 11 | 55 | ... | ... | ... | ... | 1–4 | 4 | 5–8 | 4 |
| | | | | 9–14 | 6 | 15–31 | 17 | 32–34 | 3 |
| | | | | 35 | 1 | 36–46 | 11 | 47–49 | 3 |
| | | | | 50 | 1 | 51 | 1 | 52–55 | 4 |
| 12 | 20 | ... | ... | | ... | 1 | 1 | 2–20 | 19 |
| 13 | 35 | .. | ... | | ... | 1 | 1 | 2–35 | 34 |
| 14 | 27 | ... | ... | | .. | ... | | 1–20 | 20 |
| | | | | | | 21 | 1 | 22–27 | 6 |
| 15 | 20 | | | ... | .. | ..., | .. | 1–20 | 20 |
| 16 | 24 | ... | ... | ... | ... | ... | .. | 1–24 | 24 |
| 17 | 28 | | | ... | ... | 1 | 1 | 2–28 | 27 |
| 18 | 78 | | .. | ... | ... | 1 | 1 | 2–72 | 71 |
| | | | | 74–78 | 5 | 73 | 1 | ... | |

మొత్తము 701 | ధృత 1 | సంజయుడు 40 | అర్జునుడు 86 | కృష్ణపరమాత్మ 574

శ్రీభగవద్గీత 18 అధ్యాయములలో మొత్తము శ్లోకములు701, వీటిలో ధృతరాష్ట్రుడు చెప్పినది 1. సంజయుడు చెప్పినవి 40. అర్జునుడు చెప్పినవి 86, శ్రీకృష్ణ పరమాత్మ చెప్పినవి 574 శ్లోకములు. భగవద్గీతలో 700.శ్లోకములు మాత్రమే యని ప్రతీతి, నాగరలిపిలో గలకొన్ని పురాతనగ్రంథములలో నాలాగుననేకనబడుచున్నవి. ఈ విషయమై త్రయోదశాధ్యాయమున మొదటి శ్లోకమగు—

"ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవచ
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ !॥"

అనుప్రశ్నశ్లోకము పూర్వముండలేదనియు, అరుప్రశ్నల సమాధానము ఆ యధ్యాయములో నుండుటవలన నీ ప్రశ్నశ్లోక మవసరమని తలంచి పూర్వీకులగు మహనీయులెవరో వ్రాసియుండవచ్చునని విజ్ఞులు తెలుపుచున్నారు. మఱికొందఱి ప్రశ్నశ్లోకము మొదటినుండియే యుండియున్నదనియు, అట్లుకానిచో నీయాఱు ప్రశ్నల సమాధాన మా యధ్యాయమునందుండుట కవకాశము లేదనియు గీత ముద్రించేకాలము వచ్చునప్పటికి ఆశ్లోకమెట్లో జారిపోయియుండవచ్చుననియు లేక కారణాన్తరముచే శిథిలమైపోయి యుండవచ్చుననియు తలంచుచున్నారు, ఏలన ప్రశ్నలేనిదానికి సమాధానము చెప్పుట పొసగదు.

గీతయందాలాగున నెచ్చటను గానుపించుటలేదు. గీతయననేమి? ఏ గ్రంథమైనను ప్రశ్నకు సమాధానము చెప్పినట్లే గనబడుచున్నది. వ్యవహారదశలో గూడ ప్రశ్నయుండిన మాత్రమే సమాధానము జెప్పెడి స్వభావము గలదు, కావున నీశ్లోకమవశ్యముండియే తీరవలయునని పూర్వముండియే యుండవచ్చుననియుకారణాంతరముచే లుప్తమైయుండుననిమాత్రము గ్రహించిన చాలును. ఈ మహాభారతము లక్షశ్లోకములతో గూడినదనియు, శ్రీయోగవాసిష్ఠము 32 వేల శ్లోకములతో గూడిన దనియు ప్రమాణము గలదు. అయినను పైరెండుగ్రంథములను లెక్కపెట్టిన నిపుడు చాలశ్లోకములు కొరతగలిగియున్నవి. ఇట్లేగీతాశ్లోక మొకటి యంతర్ధానమైపోయి పుస్తకరూపముగా ముద్రించునప్పటకి లభ్యముగాకపోవచ్చును. ఎవరైతే ప్రప్రథమమున ముద్రించిరో దానిననుసరించి తక్కినవారు ముద్రించుచువచ్చుటచే నాలాగున జరిగియుండవచ్చునని మనీషులు దలంచుచున్నారు. అయితే భారతముయొక్కయు, యోగవాసిష్ఠముయొక్కయు శ్లోకసంఖ్యలు నిర్ణీతములై యున్నట్లు భగవద్గీతకును శ్లోకసంఖ్యను తెలిపెడు ప్రమాణము దానియందుకనిపించుటలేదు. భారతయోగవాసిష్ఠగ్రంథములలో కొఱతగల శ్లోకములు కొఱతలుగావనియు అచ్చటచ్చట గద్యములుండుటచేత నవి శ్లోకసంఖ్యలుగా పరిగణించుచు వచ్చియుండ వచ్చుననియు మఱియు ఋషుల వాక్యములు వ్యర్థముగాకూడదు, గనుక ప్రశ్నోత్తర వాక్యములు గూడ శ్లోకసంఖ్యలో చేర్చవచ్చుననియు కొందఱు ధీమంతులు వచించియున్నారు.

పరిశిష్టము:- ఓమ్

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీ కృష్ణాశయము

## శ్రీ భగవద్గీతాధ్యాయములు

## 1. అర్జున విషాద యోగము

శ్లో॥ గీకారం త్యాగరూపం స్యాత్ తకారం తత్త్వబోధకమ్ ।
గీతావాక్యమిదం తత్త్వం జ్ఞేయం సర్వముముక్షుభిః ॥

తా॥ "గీత" యను రెండక్షరముల తాత్పర్యమును ఈ శ్లోకము తెలుపుచున్నది. "గీ" అను అక్షరము త్యాగమును బోధించుచున్నది 'త' అను అక్షరము తత్త్వబోధమును అనగా ఆత్మబోధమును తెలుపుచున్నది గీత అను రెండు అక్షరములకు ఇదే అర్థమని ముముక్షువులందఱి చేతను తెలిసికొనదగినది.

శ్రీ భగవద్గీత ప్రతి అధ్యాయమునకును, అనగా అర్జునవిషాదయోగము మొదలు మోక్షసన్న్యాసయోగమువఱకుగల 18 అధ్యాయములకును (1)అర్జున విషాదయోగము (2) సాంఖ్యయోగము (3) కర్మయోగము ఈలాగున అన్నిటికిని వేరు వేరు పేర్లు గలవు. ప్రతిఅధ్యాయమున "ఇతిశ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే" అనియు ఫలాన అధ్యాయమనియు చెప్పబడియున్నది. అనగా ఇది శ్రీకృష్ణభగవాన డుపదేశించినదనియు, ఉపనిషత్సారమనియు బ్రహ్మవిద్యయనియు యోగశాస్త్రమనియు శ్రీకృష్ణార్జున సంవాదమనియు నిట్లు 5 విశేషములు కలిగినట్టి ఫలాని అధ్యాయమని తెలుప బడియున్నది. భక్తులలో కొందఱికి ఒక్కొక్క అధ్యాయమునకు ఫలాని ఫలాని ఒక్కొక్క పేరుగలుగుటకు కారణమేమని సందేహము గలుగుచుండును. ప్రతి అధ్యాయములోను ఇది శ్రీ భగవానుడుపదేశించినదనియు, అంతియేగాక వేదములయొక్క సారమే ఉపనిషత్తుగా నుండగా మరల నీగీతకు ఉపనిషత్తుల సారమనియు అదిన్ని గాక బ్రహ్మవిద్యయనియు, ఇదిన్నిగాక యోగశాస్త్రమనియు మఱల శ్రీ కృష్ణార్జునుల సంవాదమనియు తెలుపబడినది, అనగా అర్జునవిషాదయోగము, సాంఖ్యయోగము కర్మయోగము, జ్ఞానయోగము ఈ లాగున పదునెనిమిది యోగములను జెప్పిరి. అనగా సాంఖ్యముచేతనే

యోగము సిద్ధించుననియు, కర్మచేతను యోగసిద్ధి గలుగుననియు జ్ఞానముచేతనే యోగము లభించుననియు నీలాగున ప్రతి అధ్యాయములోను చెప్పియున్నారు వేదాంతశాస్త్రములలో యోగమనినను, జ్ఞానమనినను ఒకేఅర్థమగును. రెంటికిన్ని మోక్షమనియే తాత్పర్యము, ఇచ్చట భక్తులకొకసంశయము కలుగుచున్నది.అదే మన "మోక్షము కలుగుటకు ఈ అన్ని అధ్యాయములలో చెప్పినట్లు అన్ని యోగములు శీలించవలయునా? లేక వారివారి హితము ననుసరించి ఒక యోగము నభ్యసించిన చాలునా? ఒక్కయోగముచేతనే మోక్షము గలుగుచో ఇన్ని అధ్యాయములు భగవానుడేల చెప్పవలయును? అన్ని అధ్యాయముల లోని యోగములన్నియు ఒక్కరిచేత ఒక్కజన్మలో ననుష్ఠించుటకు కాలము చాలదుగదా?" అని ఇట్టి సందేహములకు సమాధానము గలదు చూడుడు.

తమతమ శక్తిననుసరించి వీనిలో నొక్కయోగము ననుష్ఠించినను చాలును ఏలన, ఆయుర్వేదములో అనేక ఔషధములపేర్లును, వానియొక్క విధానములును చెప్పబడియున్నవి. అయితే రోగియైనవాడు సమస్త ఔషధ ముల నుపయోగపరచవలెనా? లేక తనరోగమునకుదగిన యొక్క ఔషధమును సేవించిన చాలునా? చాలినచో ననేక ఔషధముల నేర్పాటు ఏల చేయవలెను? కారణమేమన, రోగము లనేకములు. అలాగుననే జీవకోట్ల కర్మలనేకము లగుటజేసి అనేకయోగములు చెప్పవలసి వచ్చినది. ఒకే ఔషధమైనచో రోగుల కందఱికిని సౌఖ్యము గలుగుట ప్రయాసము. అలాగున భవరోగశమనము కొఱకు కారుణ్యనిధియైన శ్రీ భగవానులు జీవకోట్ల హితము ననుసరించి యిన్ని యోగములను చెప్పియున్నారు. దీనియందుగల రహస్యమేమన, రోగమునకు దగిన యొక్కమందైనను లేనిచో రోగశాంతి యెట్లు గలుగదో, అలాగున నేదైననొక్కయోగమును అనుష్ఠానములో నుంచనిచో సంసారసంబంధ వ్యాధి నివృత్తిగాజాలదనియే, అయితే మందు యెంతసారవంతమైనదైనను పథ్యము సరిగాలేనిచో వ్యాధి శమించనట్లు ఏ యోగము ననుష్ఠించినను ఆచరణ సరిగా లేనిచో భవరోగము నిశ్శేషముగా శమించదని ముముక్షువులు జ్ఞప్తిలోనుంచు కొనవలెను. వైద్యశాస్త్రములలో ఒకపాలు బలము ఔషధములోను, మఱియు మూడు పాళ్ళుబలము పథ్యములోను గలదని చెప్పియున్నారు, అలాగున వేదాంతశాస్త్రములలో గూడ అనుష్ఠానమునకే యాధిక్యమిచ్చియున్నారు గాని. మంత్రమునకుగాని, యోగమునకుగాని యాధిక్య మివ్వలేదు. అందు చేతనే "భస్మనీవ హుతం యథా" యనుటకు గారణము, ఇచ్చట యోగశబ్దముయొక్క

అర్థము బాగుగా గ్రహించవలసియుండును. "యోగశ్చిత్తవృత్తి నిరోధః" అని శ్రీ పతంజలి మహర్షి తెలిపియుండినను యోగమునకు ఈశ్వరసాక్షాత్కార మనియు, జీవబ్రహ్మల యేకత్వమనియు, ఆత్మసాక్షాత్కార జ్ఞానమనియు నర్థములుకలవు ఆరవ అధ్యాయమునందు—

శ్లో॥ యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః ॥
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥

అని శ్రీ భగవానులు తెలిపియున్నారు. అనగా యోగియైనవాడు తనయాత్మ నిష్ఠకు ప్రతిబంధము గలుగని చోటునందుండి మనో దేహములను జయించి ఆశలను విడిచి పరవస్తువులను పరిగ్రహముఁ జేయక ఆత్మను పరమాత్మ ధ్యానమునందైక్య పరచవలెను.

వి॥ ఇచట నేకాకి యనిచెప్పుటచే నొక ప్రదేశములో నొక్కడుమాత్రము యుండవలెనని కాదు; ఒకరు ధ్యానము చేయు గదిలో రెండవ వారుండరాదని కూడ భావము. పరవస్తువులను నెక్కువగా పరిగ్రహించుటచే తన పుణ్యము క్షయించును. మంచినిష్ఠ తనకు లేనిచో పాపముగూడా అభివృద్ధి నొందును. పాప మధికరించిన ధ్యానమందు సుఖము తగ్గిపోవును, దృశ్యవిషయములలోనికి మనస్సు తిరుగును. ఇదే దానికి గుఱుతు. కఠోపనిషత్తునందు నీలాగున చెప్ప బడినది.

శ్లో॥ యదా పంచావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ।
బుద్ధిశ్చ న విచేష్టేత తామాహుః పరమాం గతిమ్ ॥

"ఓ నచికేతుడా! శ్రోత్రాది జ్ఞానేంద్రియములైదును మనస్సుతో గూడ నెప్పుడు ఆత్మయందు చేరియున్నవో, బుద్ధి యాత్మయందు నిశ్చలమై యుండి ఏ వ్యాపారములందును వ్యాపింపక యుండునో దానినే శ్రేష్ఠమైన మోక్షగతిగా చెప్పిరి" అని యముడు పలికెను, మఱియు

శ్లో॥ తాం యోగమితి మన్యన్తే స్థిరామింద్రియధారణామ్ ।
అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ ॥

బాహ్యాభ్యంతరేంద్రియములను ధరించియున్న యచంచలమైన యా పరమ నిష్ఠను యోగమని చెప్పుచున్నారు. యోగము మిక్కిలి యపాయకర మైనది. కాన యోగానుష్ఠానమందు అప్రమత్తుడై యుండవలయును. మఱియు యోగమందు వియోగమును పొందక చూడవలయును. ఇవి అన్నియు సరి.

ఇప్పుడు భక్తులకు గల ముఖ్య సందేహమేమన, మొదటి యధ్యాయమునకు నర్జునవిషాదయోగమని చెప్పియున్నారే, విషాదమునకు వ్యాకులము, దుఃఖము, మనః క్లేశము అను మొదలగు నర్థములుగలవు. కావున వ్యాకులతగూడ నొక యోగమగునా? విషాదము మోక్షమును కలుగజేయునా? అంతేగాక ప్రారంభములో నానందకరములగు మంగళ వాక్యములనే యోగమని యుపదేశింపక దుఃఖవార్తలను యోగమని చెప్పిరే యిదియేమి ధర్మము అని ఇదియు సందేహమే. యోగమునకు ఐక్యమని యర్థము నందరును ఒప్పుకొనియున్నారు. నాలుగు కోణములుగల యొకచతుష్కోణ చక్రమును లిఖించి మధ్య "యోగము" అని వ్రాసి నాలుగు ప్రక్కల నాలుగు వాక్యములను లిఖించిన నన్నిటికిని ఆ యోగశబ్దము అన్వయించుచుండును ఈ క్రింది చక్రము జూడుడు:-




దీనిని చదివిన కర్మయోగమనియు, భక్తియోగమనియు. ధ్యానయోగమనియు. జ్ఞానయోగమనియు నేర్పడును. ముఖ్యముగ ఈ అధ్యాయమున అర్జున విషాద యోగమును గూర్చి గ్రహించవలసియుండును. అర్జునునకు ఆత్మచేత త్త్వజ్ఞానోప

దేశము చేయవలయునని శ్రీ కృష్ణభగవానులకు తలంపు ఉండెను. కాని తగిన కాలముననే యది యుపయోగముగా నుండునని సమయమును నిరీక్షించు చుండెను. జ్ఞానోపదేశమునకు ప్రథమమున వైరాగ్యము గలుగవలయును. వైరాగ్యము కలుగుటకు దృశ్యవిషయములందు దోషముజనించవలెను. అనగా దృశ్యము నశ్వర మనియు దుఃఖహేతువనియు బోధము గలుగవలయును. అట్టి స్థితి గలుగునపుడు మనస్సులో విషాదము గలుగును. అయితే అయ్యది యీశ్వరప్రాప్తి గలుగలేదే! పరమేశ్వరుని కరుణ యెటుల కలుగును? ఈ ద్వంద్వ ములతోగూడిన దుఃఖసాగరములో పరమేశ్వరుని కృపదప్ప మఱియొకటి అధారము లేదుకదా? అని విలపించెడు దుఃఖమేయగును. భగవద్విషయమైన దుఃఖము, ఆనందబాష్పము, రోమాంచము, గగుర్పాటు, గద్గదస్వరము. స్మృతి లేక పడిపోవుట మొదలైనవన్నియు తీవ్రమైన భక్తియొక్క చిహ్నములు. ఇట్టి గుణములన్నియు నర్జును నకు గలిగియుండెను. పరమ భక్తు లందఱికిని వైరాగ్యము జనించునపుడు నీలాటి గుణములు గలుగుచుండును. శ్రీనారద భక్తి సూత్రములందు ఈగుణములన్నియు వర్ణింపబడియున్నవి. కావున జ్ఞానయోగ ప్రాప్తికి కావలసిన గుణములన్నియు గలిగినందుచే దానివలననే ముక్తి లభింప గలదు. అందుచే విషాదముగూడ నొకయోగమని చెప్పబడినది. మఱియు చిత్తభ్రాంతివలన దిక్కుతెలియక పోవుటయు, అట్టి విపత్తుల నుండి రక్షించు వారు లేకపోవుటయు, కులమువలన గలిగెడు భయభ్రాంతులును, వైరాగ్యము యొక్క చిహ్నములు. కావున నర్జునునకు గలిగిన విధమున నంతఃపరి తాపము, భయము, వ్యాకులత, క్లేశము, వంటి దుఃఖము గలుగునపుడే నిజమైన యాత్మతత్త్వ ముపదేశించుటకు సరియైన కాలము. ఇదియే శ్రీగీతయందు చూపింపబడినది. మఱియు యుద్ధరంగములో మిగుల మనశ్చాంచల్యము గలిగి యుండే తరుణమున పదునెనిమిది యధ్యాయములతోగూడిన యేడువందలశ్లోక ముల నుపదేశించుటకు సమయముండునా యనియు చాలమందికి సందేహము గలుగును. ఇది సామాన్య మానవుల బుద్ధిగణనయందు తోచుట సహజమే, దైవభావములో దివ్యదృష్టిగలవారికిది ప్రయాసముగా నుండదు. ఏలన, ఇప్పుడు పఠించుచుండు వ్యాకరణశాస్త్రమునంతయు శ్రీ చిదంబరమున నటరాజప్రభువగు పరమశివుడు పదునాల్గు చిన్న చిన్న సూత్రవాక్యములతో నుపదేశించెను. కావుననే వీనికి శివసూత్రములని పేరువచ్చినది. ఎట్లన,

శ్లో॥ నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపఞ్చవారమ్।
ఉద్ధర్తుకామ స్సనకాది సిద్ధా నేతద్విమర్శే శివసూత్రజాలమ్ ॥

శ్లో॥ వాక్యకారం వరరుచిం భాష్యకారం పతఞ్జలిమ్ ।
పాణినిం సూత్రకారం చ ప్రణతోఽస్మి మునిత్రయమ్ ॥

దానిని పాణినిమహర్షి గ్రహించి యెనిమిది యధ్యాయములుగల వ్యాకరణ సూత్రములను రచించిరి. దానికి వరరుచి గొప్ప వార్తికమును, శ్రీ పతంజలి మహర్షి మహాభాష్యమును రచించెను. భగవద్వాక్యములాలాగుననే యుండును. అతిసూక్ష్మమగు మఱ్ఱి విత్తనములోపల గొప్పదగు వటవృక్షము ఇమిడి యున్నట్లు సూత్రవాక్యములును గొప్ప యర్థము గలిగియుండును. అట్టి సూత్ర వాక్యములను బట్టియే శ్రీవేదవ్యాస భగవానులు యమునాతీర తపోవనములో నిశ్చలముగ గూర్చుండి దివ్య దృష్టితో శ్రీకృష్ణ భగవానుల యాశయము దెలిసికొని గీతా శాస్త్రమును రచించెను. సూత్రముయొక్క లక్షణమును చూడుడు.

శ్లో॥ అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్ ।
అస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః ॥

తా॥ స్వల్పాక్షరములతోగూడినదైనను సందేహములన్నిటిని రహిత మొనర్చునదియు, అతి సారవంతమైనదియు, అనంతముఖము (అర్థము) లతో గూడినదియు, దోషరహితమైనదియు, నిరంకుశమైనదియు, ప్రతిరోధమేమియు లేనిదియునగు వాక్యమునే సూత్రము నెఱింగిన మహర్షులు సూత్రమని నుడివిరి.

ప్రతి యధ్యాయములోను నా యధ్యాయ విషయమును దెలుపు ఒక్కొక్క ముఖ్య శ్లోకమును మాత్రమిందు నిరూపింప తలంచడమైనది, ఈ మొదటి యధ్యాయమందు నీక్రింది శ్లోకము ముఖ్యము:—

శ్లో॥ ఏవముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ॥
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్న మానసః । (1–47)

తా॥ అర్జునుడిట్లు చెప్పి దుఃఖముచేత చలింపబడిన మనసుగలవాడగుచు ధనుర్బాణములను విడిచి యుద్ధమందు దిగులునొంది రథముపై చతికిలబడెను.

గీతయందు ప్రథమమున ప్రయోగించిన వాక్యము "ధర్మక్షేత్రే" అనునది. ధర్మశబ్దము ధృతరాష్ట్రునిచే తెలిసియో తెలియకయో మొట్టమొదటనే వచించడ మైనది. అందువలన ధర్మమునకే జయముగల్గును గాని యధర్మమునకు

గలుగదని సిద్ధమైనది. ఈవాక్యము ధృతరాష్ట్రుని వాక్కుతో ధర్మదేవత పలికించి నట్లున్నది. మఱియు సాక్షాత్ శ్రీకృష్ణభగవానులు ప్రపంచములో నధర్మముల నణచివేసి ధర్మమును స్థాపించుటకై యవతరించియుండిరి, ఈవాక్యము భగవంతుడే స్వయముగ నాలుగవ యధ్యాయములో చెప్పియున్నాడు. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" ధర్మశబ్దముయొక్క యర్థము మిగుల సారయుతమైనది. దేనివలన ఈజగత్తు ధరింపబడుచున్నదో అదిధర్మమే. 'ధారణాద్ధర్మ ఇత్యాహుః' అనగా నీ ప్రపంచమంతయు ధర్మసూత్రముతో బంధింపబడియున్నది. ముత్యములచే కూర్చబడిన హారము యొక్క సూత్రము దెగినచో నేలాగున నందలి ముత్యములు చిన్నా భిన్నములై పోవునో ధర్మచ్యుతి గల్గిన మనుజుని యొక్క స్థితియు నట్లేయని గ్రహించు కొనవలెను. మహా సూర్య గోళములును, నక్షత్రాదులును, నితర గ్రహములును, భూమియు చంద్రుడు, మొదలగునవన్నియు నొక ధర్మసూత్రములోనే కట్టబడియుండును. ఈ గ్రహముయొక్క సంచారములు, నుదయాస్తమయములు, ఋతువులు, అయనములు. సంవత్సరములు, మహాకల్పములు, పాపపుణ్యముల ఫలములు, జనన మరణములు, అవృత్తిరహితమైన మోక్షము మొదలగునవన్నియు ధర్మసూత్రముపైననే యాధారపడియున్నవి. అట్టి ధర్మమును విడనాడక ఆచరించుటయే యథార్థమగు ఈశ్వరాజ్ఞననుసరించి వర్తించుటయగును. ధర్మమువలననే ఈ జగత్తు నిలుచుచున్నది. ధర్మానుష్ఠానమువలన జీవుడు శుద్ధుడై యూర్ధ్వలోకములను బొందుచుండును, అధర్మ ప్రవృత్తివలన జీవుడు నజ్ఞానముచే గప్పబడి క్రమముగ నంధకారరూపమగు దుఃఖములోనికి పడిపోవును. ధర్మశబ్దమును గుఱించిన ప్రమాణములెన్నియో గలవు. ధర్మము మానవునకు వెన్నెముకవంటిది. అది చెడిన నిక మనుజుడు లేవజాలడు. జీవునియొక్క స్థితియు నాలాగుననే యుండును ఎవనియందైనను జ్ఞానముకాని, తపస్సుకాని, ధనముకాని, అధికారము గాని, పూజ్యతకాని, జయముగాని, బలముకాని, ధర్మానుష్ఠానము గల్గియుండువఱకు మాత్రమే నిల్చియుండును. ధర్మలోపము గలుగునప్పుడు వానిని ధర్మదేవత విడిచిపెట్టిపోవును. ఇది ప్రత్యక్షము, కురుపాండవుల చరిత్రము వలన సర్వజనులకును తెలియనగును. కావున ధర్మమార్గములో నుండువలకే జయము గల్గుననియు, అధర్మమార్గములో నుండువారికి క్షయమే గల్గుననియు గీతయొక్క మొదటి వాక్యము వలననే జనులు గ్రహించుకొనవచ్చును. రెండవ శబ్దము 'కురుక్షేత్ర' అనునది. కౌరవకులమునకు ఆది పురుషులు కురువులు,

వారివలన నేర్పిడిన వంశమగుటచే కౌరవవంశమని, అందుద్భవించినవారు కౌరవులని పేరు వచ్చినది. మొదట కురుమహారాజు మహాధర్మవంతుడు, వారి స్థలమగుటవలననే దానికి కురుక్షేత్రమను నామధేయము గల్గెను. మఱియు కురుమహారాజు అచ్చోట ననేకములగు ధర్మకార్యముల జేసియుండెను. అందుచేతను కురుక్షేత్రమునకు ధర్మక్షేత్రమను విశేషణమును ప్రయోగించుటకు కారణమైనది. దీని వలన కురువంశీయులు ధర్మాత్ములేగాని దుర్యోధనునివంటి యధర్మపరాయణులుగారను అభిప్రాయము లోన గల్గి ధృతరాష్ట్రుడట్లు పల్కియుండవచ్చును. అట్టి ధర్మక్షేత్రమగు పుణ్యభూమిలో నధర్మమును చేయబూనుచున్నావా యని దుర్యోధనుని గూర్చి తలంచియు నుండవచ్చును. లేక పుణ్యభూమిలో ప్రవేశించినపుడు పాపబుద్ధి దొలగి పుణ్యస్వభావము కొందఱికి గలుగును. గాన నా స్థాన మాహాత్మ్యము వలన దుర్యోధనుని చిత్తమునకు నేదైన మార్పు గలుగునని తలంచియైనను ధృతరాష్ట్రుడడిగియుండ వచ్చును.

జనుల హృదయము మూడు విధములుగానుండును. ఉత్తమ గుణము గలవారిహృదయము మృదువుగా నుండును. మధ్యమ స్వభావము గలవారి చిత్తము నిండా కాఠిన్యముగాని నిండామృదుత్వముగాని లేని స్థితిలో నుండును. కర్మజీవుల మనస్సు కఠినముగానే యుండును. ఉత్తముల హృదయము రేగడిమట్టివలెను, మధ్యములది కొయ్యవలెను; కఠినులగు నధములది రాయివలెను నుండును. జలమున తడిసిన మటి వెంటనే కరగునట్లు ధర్మస్థలములోను, పుణ్యప్రదేశములోను, పుణ్యాత్ముల సమీపములోను ఉత్తముల మనస్సు కరిగిపోవును. మధ్యములు కొంతకాలము పై చెప్పిన స్థలములో నుండిన జలములో పడియుండు ద్రూను, కొన్ని రోజులకు తడిసి మునిగిపోవునట్లు క్రమముగా పరిశుద్ధులగుదురు. అధముని హృదయము రాతి వంటిదగుటవలన పుణ్యస్థలములోగాని పుణ్యపురుషుల సమీపమునగాని నెంత కాలముండినను, నీటిలో నుంచబడిన రాతివలె మార్పు గలుగకుండును. ఇవి యన్నియు కురుపాండవుల చరిత్రచే వ్యక్తమగుచున్నవి. ధర్మక్షేత్రమగు కురుక్షేత్రములో ప్రవేశించిన వెంటనే యర్జునుని హృదయము కరిగి నీరై ప్రవహింపజొచ్చెను, పాపకార్యమున ప్రవేశించినందుకు దుఃఖపడి యన్నిటిని త్యజించి రథముపై చతికిలపడి పోయెను. కాని, దుర్యోధనుని చిత్తమున కేలాటి మార్పున్ను గలుగలేదు. ధర్మరాజుగూడా దుఃఖాక్రాంతచిత్తము గలవాడై పాపకార్యమగు యుద్ధము చేయుటకన్న నిశ్చింతగా నరణ్యముననుండి తపస్సుచేసెదనని వచించునంతటి దుఃఖ

వారాశిలో మునిగిపోయెను ఇది యంతయు భారతమున గనదగును. ఈ రహస్య మెఱింగియే తపస్సు, ధ్యానము, యోగము చేయువారు పుణ్యప్రదేశము లలో నుండిన వారియొక్క యనుష్ఠానము నిర్విఘ్నముగసిద్ధించునని చెప్పుటకుఁ గారణము. మఱియు పుణ్యవిశేష స్థలములలోనికి పాపస్వభావముగల భూత ప్రేత పిశాచాదులు ప్రవేశింపజాలవు. దీపము దగ్గరకు గబ్బిలములుగాని, గ్రుడ్ల గూబలుగాని, రాజాలనట్లు పాపములెవ్వియు నచ్చోటకు రాజాలవు. మనో జయము గలుగు వఱకును ఏకాంతవాసమును నాహారనియమమును బ్రహ్మ నిష్ఠలు తప్పక నవలంభింప వలయును. ఆహారములపై కోరిక గలిగినను, దొరకని స్థలములోనే యోగసిద్ధి గలుగువఱకు నుండవలయును. ఆహారము నకు నిండా కష్టముగా నుండు స్థలములలో నుండరాదు. అట్లైన మాత్రమే తపస్సు సిద్ధించును. ఇంద్రియవిషయములలోనికి మనస్సు పోయిన నిగ్రహించు కొనుట చాల కష్టతరము. ఒకవేళ నట్టి శక్తిగలిగియుండినను నట్టి దోషములేని స్థలమైనచో నిగ్రహప్రయత్నముగూడా అవసరముండదుగదా? మఱియుప్రారంభ దశలో నభ్యాసకులకట్టినిగ్రహశక్తియుండదు. కావున అట్టిముముక్షువులక్షేమము నుద్దేశించియైనను నివాసస్థల ఆహారనియమమును నాత్మజ్ఞాను లవలంబించుట యుచితము. ఇట్టి నియమము లేకపోవుటయే పూర్విక ఋషులయొక్కయు, యోగులయొక్కయు, తాపసుల యొక్కయు, జ్ఞానులయొక్కయు స్థితి యిప్పు డుండు వారికి కలుగక పోవుటకు కారణము. ఇక నివాస స్థలమును గూర్చిన ఒక రహస్యము గలదు. అదియేమన బాహ్యప్రదేశములో స్థూలములైన నేత్రేం ద్రియ ఘ్రాణేంద్రియాదులకు గోచరములైన వికారములైన దుర్వాసనగల వస్తువులుండిన ఆ స్థలములో నేలాగున నుండుటకిచ్ఛ గలుగదో, వికారవస్తువు లను జూచినను వికారశబ్దములను వినినను మనశ్శాంతి గలుగదో, యదే రీతిగ సూక్ష్మదుర్వాసనలు గల స్థలము నందుండినను మనశ్శాంతి గలుగదు. అవి మనకు తెలియకనే మనస్సులో ప్రవేశించినప్పుడు మనశ్శాంతికిని, ప్రసన్నత్వము నకును హాని గలుగజేయును. కనుక దుష్టజనులుండు ప్రదేశమునను దుష్ట కార్యములు జరుగు స్థలమునను నుండుట మంచిదిగాదు. అలాగుననే విషయా సక్తులు, కోప స్వభావులు, పాపబుద్ధి గలవారలు నుండు స్థలములును యోగ్య ములు గానేరవు.

ఓం తత్ సత్ ఓమ్



ఓమ్

# 2. సాంఖ్యయోగము

-:(౦):-

శ్లో॥ గీతాశాస్త్రమిదం పుణ్యం యఃపఠేత్ ప్రయతః పుమాన్ ।
విష్ణోః పదమవాప్నోతి భయశోకాదివర్జితః ॥

తా॥ పవిత్రమగు నీ గీతాశాస్త్రము నెవ్వరు నియమముగ పఠింతురో వారు సంసారభీతి విడనాడి విష్ణుపద మొందెదరు.

సంఖ్యలను గుఱించి చెప్పునదగుటచే ఈ యధ్యాయమునకు 'సాంఖ్య యోగమ'ని నామధేయము గల్గెను. 1. 10 ఈలాటివి సంఖ్యలని చెప్పబడును. ఈ సాంఖ్యయోగమునకు కపిలమహర్షి మొదటివారు. వీరు ప్రకృతి తత్త్వము లన్నిటిని లెక్కబెట్టి ప్రకృతికిపరమగు ఆత్మతత్త్వము నుపదేశించినవారు. దీనిని బట్టియే యిప్పుడు సాంఖ్యతత్త్వమును నేర్చుకొనవలయునని - వేదాంతులుగూడ చెప్పుటకు గారణము. ఇది ప్రధానమునుండి యనగా మూలప్రకృతినుండి పృథ్వీతత్త్వమువరకు గల తత్త్వములన్నిటిని నిరూపించి, యివి యన్నియు నశించుననియు, ఆత్మయొక్కటి మాత్రమే నాశము లేని వస్తువనియు బోధిం చును. కావున నట్టి యాత్మతత్త్వమును దెలిసికొనుటయే మోక్షమని చెప్పెను. ఆత్మ నశించునదికాదని యర్జునునకు దెలుపుటకొఱకు నీ యధ్యాయమును శ్రీ భగవాను లుపదేశించిరి. అట్టి యుపదేశము వలననే యర్జునుని యొక్క శోక మోహములు వదలి పోయినవి. ఓహో! ఈ యుపదేశముయొక్క మహిమ నేమని చెప్పవచ్చును! దీనికి నాత్మోపదేశమని పేరు. ఇట్టి యాత్మోపదేశము వినని జీవునియొక్క శోకమోహములు నశింపవనియు, శాశ్వత సౌఖ్యము గలుగ దనియు తెలియదగినది. ఈ అధ్యాయములో నీ క్రింది శ్లోకము ముఖ్యము:-

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్యస్సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః॥ (2-24)

తా॥ ఈ యాత్మ ఛేదింపనలవిగానిది. దహింప నలవిగానిది, తడుప శక్యముగానిది ఎండింప సాధ్యముగానిది. సర్వవ్యాపకమైనది. నిశ్చలము ననా దియునైనది, ఇంద్రియములకు గోచరముగానిది. మనస్సుచే జింతింపనలవి గానిది. సనాతనమైనది. ఇదే నిజమైన సనాతన ధర్మతత్త్వము. ఇట్టి శాశ్వత బ్రహ్మవస్తువును తెలిసికొనక జనులు బాహ్యములైన వర్ణాశ్రమములనే సనాతన మని తలంచి వాదప్రతివాదములకు లోబడి ద్వేషములను పెంచి దేశారిష్టము

లను గలుగజేసిన అందరియొక్క భావిశ్రేయస్సునకు నడ్డు గలుగజేసిన వారగుదురేగాని, వారిక చేసినదేమియు నుండదు. ఈ యధ్యాయమున బ్రహ్మనిష్ఠులకు ప్రాణమువంటి స్థితప్రజ్ఞుని లక్షణమును శ్రీ భగవానులే యుపదేశించియున్నారు. ఇది ముముక్షువు లందఱకును ప్రాణమువంటిది. ఈ యధ్యాయమున 54-వ శ్లోకమునుండి యధ్యాయాంతమువఱకుగల పదునెనిమిది శ్లోకములచే బ్రహ్మనిష్ఠుని లక్షణములన్నియు నుపదేశింపబడెను. ఈ యధ్యాయమునుండియే ధర్మోపదేశము ప్రారంభించినదగుటచే సౌధమునకు గట్టిపునాది వేసేలాగున నిచ్చోటనే ముక్తిసాధనమునకు గావలసిన యనుష్ఠానములన్నియు తెలుపబడినవి. పునాది దుర్బలమైనచో పై మేడలు ఎంత సుందరములైనను క్రుంగునట్లు నీ స్థిత ప్రజ్ఞుని లక్షణములు బాగుగా నాచరణ యందుంచక పోయిన సాధకుని తక్కిన యనుష్ఠానము లన్నియు పతనమునకు గారణములగును. కావున ప్రతివారును నాత్మజ్ఞానముగల వారియొక్క గుఱుతును చెప్పెడు నీ యష్టాదశ శ్లోకములను తప్పక పఠనము జేయవలెను. శాస్త్రములయొక్క సారము ముముక్షువులకు బ్రాణము.

ఓం తత్ సత్



ఓమ్

# 3. కర్మయోగము

శ్లో॥ భారతామృత సర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిస్సృతమ్।
గీతా గంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే॥

తా॥ భారతసారమును, శ్రీ కృష్ణముఖనిర్గతమునగు గీతయనెడు గంగోదకము ద్రావిన జన్మరాహిత్య మొనగూడును.

కర్మయోగ ముపదేశింపబడినందున నీ యధ్యాయమునకు 'కర్మయోగమ'ని పేరు వచ్చినది. ఏ కర్మ యే లాగున చేయవలెనో, యెట్లు చేసినజీవుడు ఇహమందును, పరమందును సౌఖ్యము నొందగల్గునో, అట్టి విషయములన్నియు సంక్షిప్తముగ దీనియందు నిశ్చయింపబడియున్నవి. సామాన్యముగ కామ్యకర్మమనియు, నిష్కామ కర్మమనియు నిషిద్ధకర్మమనియుకర్మ మూడువిధములుగ జెప్పబడును. కామ్యకర్మములచే వానివానికి నిశ్చయింపబడిన ఫలమును ఇహమందును, పరమందును, మరుజన్మ మందును జీవుడనుభవించును. నిష్కామకర్మచే

నంతఃకరణ శుద్ధిగల్గి, లేక యీశ్వరానుగ్రహప్రాప్తినొంది జీవుడు మోక్షమున కర్హుడగును. నిషిద్ధకర్మలవలన నిహమందును, పరమందును, పునర్జన్మమందును జీవుడు దుఃఖమనుభవింపవలసి యుండును. ఈకర్మసంస్కారములు ఇప్పుడు కంటికగపడకపోయినను. సూక్ష్మవాసనారూపముగ జీవుని ఆశ్రయించి యుండును. వాసననేత్రమునకు గోచరముకాకపోయినను పుష్పముల నాశ్రయించి యెట్లుండునో అట్లే కర్మయోగరహస్యమును గూర్చియు నెఱుంగవలెను. ఈతత్త్వమును తెలిసికొనిన జనులయొక్క రాబోవు జన్మలను గనుగొన వచ్చును పరలోకములో నేస్థితిగల్గునో అదియు గనుగొనవచ్చును. జన్మ రాహిత్యమైనదా? లేదా యనియు గ్రహింప సాధ్యమగును. జీవునికి నాలుగు స్థానములు (సౌంఖ్యములు) గలవు. (1) ఇహసుఖము, (2) పరసుఖము (స్వర్గప్రాప్తి), (3) ఉపాసనామహిమవలన గలిగెడు బ్రహ్మలోకాదిస్థానము, (4) ఈశ్వరసాక్షాత్కారము ఇదియే సమాధి,శివజీవైక్యము,బ్రహ్మసాక్షాత్కారము వీనికే క్రమముగా నిహసుఖము. పరసుఖము, పరాత్పరసుఖము, పరమాత్మ సుఖమనియు నామాంతరములుగలవు.నాల్గవది బ్రహ్మజ్ఞానమువలననే గలుగును. తక్కిన మూడవస్థలలోను జీవునకు రాకపోకలు గలవు, విదేహకైవల్యమగు ఆత్మైక్యజ్ఞానమునకు రాకపోకలు లేవు. కారణమేమన పరబ్రహ్మము సర్వవ్యాపకము. అంతేగాక నిజమైన యాత్మకు నన్యముగా మఱియేదియులేదు. ఉపాధుల వలననే వేరుగా గన్పించును. హృదయగ్రంథులు నశించునప్పుడు మఱియు నావరణము తొలగునప్పుడు నేకత్వానుభవము గలుగును. ఇదే పరమ ముక్తి. మనుష్యునియొక్క నివృత్తిమార్గ ప్రాసాదమునకు నిష్కామ కర్మయోగమే పునాదివంటిది. అయితే వేదాంతశాస్త్రమందు మొదట కర్మయోగము, పిదప ఉపాసనాయోగము(భక్తియోగము) ఆ పిదప ధ్యానయోగము(సమాధియోగము) తుదకు జ్ఞానయోగమని చెప్పియుండగా జ్ఞానయోగమగు సాంఖ్యయోగమును రెండవ యధ్యాయములో నుపదేశించిన తరువాత మూడవ యధ్యాయమున కర్మయోగముపదేశించుటకు కారణమేమని సందేహము గలుగవచ్చును. దీనిచే జ్ఞానియైన తరువాత మాత్రమే నిజమైన కర్మయోగము చేయ నర్హత గలుగునని తెలియనగును. మఱియు నాత్మయొక్క నిజావస్థ తెలియనిచో జీవునకు మరణ భయము తప్పదు. అజ్ఞానమువలన శోకాక్రాంతుడైన యర్జునునకు సాంఖ్యయోగ ముపదేశించినప్పుడు ఆత్మకు నాశము లేదనియు నదినిత్యమైనదనియు జ్ఞానికి బోధము గల్గెను, ఇట్టిదానికే యాత్మోపధేశమని పేరు. ఇది మహాత్ములగు

గురువులవలన గలుగవలెనని గీతాశాస్త్రముయొక్క ఆశయము, అది గలుగనిచో ఈత తెలియనివానితో నగాధనదిని దాటుమని చెప్పినట్లును, గరుడమంత్రము తెలియని వానితో బుసకొట్టుచుండు త్రాచుపామును పట్టుమని చెప్పినట్లును నుండును. మాయామయమగు సంసారప్రవాహమును దాటుటకును, ప్రకృతి యైన కాలసర్పమునుబట్టి యాడించుటకును నాత్మజ్ఞానము గలుగవలెను. గీతాతత్త్వము ఈ రహస్యమునే యుపదేశించుచున్నది. కనుకనే శ్రీ కృష్ణభగవానులు అర్జునునకు మొదటనే నాశములేనిస్థితిని యుపదేశించుటకు గారణమైనది. అప్పుడు అర్జునుడు తనకు నాశము లేదనియు, నాత్మకుప్రకృతితో సంబంధము లేదనియు, తాను సనాతనవస్తువగు ఆత్మ యనియు అది యనాదిగ నుండు ననియు బోధమును బొందెను. గురూపదేశ మీలాగున నుండవలెను. పరతత్త్వము మొదట నుపదేశించి మఱల సామాన్యముగ సర్వజనులు ఏలాగున తరించవలెనో, వారి పాపమెట్లు నశించునో, అంతఃకరణ శుద్ధి యేరీతిగల్గునో, ఈలాటి విషయములన్నియు క్రమముగ నుపదేశింప నుద్యమించెను. జ్ఞానియైనను కర్మయోగ మెంతవఱకు చేయుచుండవలెనో, అదిన్ని ఈ యధ్యాయమున నిరూపించడమైనది. తనయొక్క దేహసంరక్షణ విషయమైన స్నానపాన శయనాదులయందు నెంతవరకు నుపయోగబుద్ధి (సుఖత్వబుద్ధి) గలిగియుండునో, అంతవరకు తమ తమ యాశ్రమములకు దగిన యనుష్ఠానము గల్గియుండవలయు ననియే దీనియొక్క ముఖ్యోద్దేశము, దేహమునకును, మనస్సునకును హితములైన వృత్తులన్నియు గల్గియుండగా తాను నిర్వహింపవలసిన ధర్మములను విడిచియుండుట నీతివిరుద్ధమనియే గీతాచార్యుల యభిప్రాయము. ఒకవేళ తాను పరిపక్వస్థితినొందినను లోకానుగ్రహవిషయమై ధర్మాచరణయుక్తములగు కార్యములను చేయవలెనని దీనిలోగల తత్త్వరహస్యము, కర్మశబ్దమునకు సంసార సంబంధక్రియలని మాత్రము అర్థముగాదు; కరణములచే చేయు సమస్తక్రియలును కర్మయందంతర్భూతములే, పాదములతో నడచుట కరములతో పనులుచేయుట, నేత్రములతో చూచుట, కర్ణములతో వినుట, అలాగున ఘ్రాణేంద్రియ రసనేంద్రియాదు లన్నిటికార్యములును కర్మలలో చేరినవే, జాగ్రదవస్థలో జరుగు విషయములన్నియుగాక, స్వప్నములో సూక్ష్మదేహమందు గలుగు వృత్తులుగూడా కర్మమునకు సంబంధించినవే గాన సుషుప్తియందు శ్వాసోచ్ఛ్వాసములు జరుగుచుండుటగూడా కర్మయే. ఇవి యన్నియు చేయుచుండగా తాను జేయవలసిన

ధర్మకార్యములు మాత్రమేలాగున కర్మ కాకపోవునో! కాన ఆత్మసాక్షాత్కారము నొందిన జ్ఞానిగూడా ద్వంద్వములు గలిగి యున్నంతవఱకు తనకు శాస్త్రము విధించిన యనుష్ఠానకర్మముల నాచరించవలెను, కర్మనువిడిచి యే ప్రాణి యైనను నొకక్షణకాలముండుటలేదని గీతాచార్యులు నిరూపించిరి. అయితే దృశ్యవృత్తులన్నియు నశించి నిరంతర దైవాకారస్థితిలోనుండు జ్ఞానికి మాత్రము కర్మచేయవలయునను నిర్బంధము లేదనికూడా తెలిపియున్నారు. దీని నాధార ముగ జేసికొని జ్ఞానియైననానికి నే కర్మయు లేదనిచెప్పుచు నింద్రియసౌఖ్యము లకు లోబడియుండువారుగూడా స్వధర్మానుష్ఠానమును విడిచిపెట్టి సోమరి తనముతో గూడినజీవితమునకు లోబడిపోవుచున్నారు, ఇట్టి దోషముచేతనే నివృత్తిమార్గస్థులలో ననేకులు పతితులగుటకు కారణమైనది. దీనికి సరియైన యొక విధానమేర్పడిన మాత్రమే భారతదేశమూర్ధ్వగతిని బొందగలుగును. ఈ యధ్యాయములో నీ శ్లోకము ముఖ్యము:—

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ (3-19)

తా॥ కావున నో యర్జునా. ఫలమందాసక్తిలేక నిరంతరము నియతమగు కర్మను జేయుము. ఎందుకనగా, ఫలాసక్తిలేక కర్మను చేయుచున్న పురుషుడు ముక్తిని బొందును.

ఓమ్ తత్ సత్.



ఓమ్

# 4. జ్ఞానయోగము

శ్లో॥ మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే ।
సకృద్గీతామ్భసి స్నానం సంసారమలమోచనమ్ ॥

తా॥ మానవులు ప్రతిదినమాచరించు జలస్నానము పైపై మురికిని బోగొట్టునేగాని యొక్కసారి గీతోదకస్నాన మాచరించిన జన్మజరామరణము లతో గూడుకొనిన సంసారమను మురికిని పారద్రోలి జన్మరాహిత్యమొన గూర్చును.

ఈ యధ్యాయమునకు 'జ్ఞానయోగమని' పేరు. ముందు జెప్పబడిన మూడు అధ్యాయములలో చెప్పిన నిష్కామకర్మయోగ మాచరించుటవలన

పాపము నశించి యంతఃకరణ శుద్ధిగల్గి జ్ఞానోదయమగును, కావున కర్మయోగము వలన గలిగెడు ఫలమును జూపుటకొరకు నాల్గవ అధ్యాయమున జ్ఞానయోగము జేర్చడమైనది. ఇదియును చాలవఱకు మూడవ అధ్యాయమున జెప్పినట్లు కర్మ యోగము నుపదేశించుచున్నది. అయితే కర్మయోగముయొక్క ఫలము జ్ఞాన యోగసిద్ధియని తెలిసికొనదగినది. దీనిలో నీ క్రిందిశ్లోకము ముఖ్యము:—

శ్లో॥ వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ (4-10)

తా॥ రాగద్వేషములు భయక్రోధములు వదలినవారై ప్రపంచ మంతయు భగవన్మయముగ జూచుచు నన్నాశ్రయించుటచే ననేకులు పవిత్రులై యుత్తమ జ్ఞానము గలిగి నా భావమును బొందిరి.

గీతాచార్యులు కర్మయోగము స్వతంత్రముగ ముక్తిని గలుగజేయునని యుపదేశించినను వేదాంతశాస్త్రములో నిష్కామకర్మయోగముచే నంతఃకరణ శుద్ధియు, తదుపరి యీశ్వరోపాసనచే చిత్తైకాగ్రతయు, అనంతరము ధ్యాన యోగముచే నాత్మయొక్క యావరణనివృత్తియు, తర్వాత మహావాక్యబోధక మగు జ్ఞానయోగముచే సాక్షాత్ మోక్షమును గలుగుననియే తెలుపబడియున్నది. కర్మయోగాదులు మూడును పరంపరగ మోక్షప్రాప్తిని గలుగజేయుననియు, జ్ఞానమొక్కటియే ఆ మోక్షమునకు సాక్షాత్ హేతువనియు నుపదేశించిరి. కావు ననే ఈ నాల్గవ యధ్యాయమున 'నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే" అనగా జ్ఞానమునకు సమానమైనది మఱియొకటిలేదని శ్రీ భగవానులుగూడ నుపదేశించియున్నారు.

ఓం తత్ సత్



ఓమ్

# 5. కర్మసన్న్యాసయోగము

శ్లో॥ సర్వశాస్త్రమయీ గీతా సర్వవేదమయో హరిః ।
సర్వతీర్థమయీ గంగా సర్వతేజో మయో రవిః ॥

తా॥ సకల శాస్త్రములసారము శ్రీ భగవద్గీతయే. సమస్తవేదముల సారము హరి (విష్ణువు), సర్వతీర్థముల స్వరూపము గంగానది, నిఖిలతేజోరూపుడు సూర్యుడు అని భావము.

కర్మమునకును సన్న్యాసమునకును గల భేదాభేదములను నిర్ణయించుచున దగుటచే దీనికి 'కర్మసన్న్యాసయోగమని'ని పేరు వచ్చినది. కర్మయోగము శ్రేష్ఠమా? లేక జ్ఞానయోగముశ్రేష్ఠమా? అనగా గృహస్థాశ్రమము మంచిదా సర్వసంగపరిత్యాగమైన సన్న్యాసాశ్రమము మంచిదా యను ప్రశ్నలకు సమాధానము దీనియందు నిర్ణయించడమైనది. శ్రీ కృష్ణపరమాత్మయొక్క విశాల భావము ఈ యధ్యాయమున జూపబడినది, రెండు ఆశ్రమములును శ్రేష్ఠములే. బాహ్యమైన వేషములచేగాని, నివాసస్థలముచేగాని శ్రేష్ఠత్వమేమియులేదు. అంతఃకరణశుద్ధి గల్గి నిస్సంగత్వమును సాధించి ఇంద్రియ విషయముల జయము కలిగి యాత్మజ్ఞానప్రాప్తి నొందిన నేయాశ్రమమైనను సరియే. అదియే శ్రేష్ఠమైనది. వీటిలో సన్న్యాసాశ్రమమే శ్రేష్ఠమని, గృహస్థాశ్రమము నికృష్టమని పలికెడువారు పసిపిల్లలవంటి వారనియు, వీరు శాస్త్రజ్ఞానముగాని, యనుభవజ్ఞానముగాని లేనివారనియు శ్రీ భగవానులు నిర్ణయించిరి. రెండాశ్రమములును శ్రేష్ఠములైనచో వానిలో నేది యాచరింపవలెనని విచారణ వచ్చినచో సంపూర్ణ విషయ వాసనా రాహిత్యము గలుగనివారికి నిష్కామకర్మపరమగు గృహస్థాశ్రమమే శ్రేష్ఠము. వాసనా రాహిత్యము గలిగినవారికి సన్న్యాసాశ్రమము శ్రేష్ఠము. సన్న్యాసులలో గూడ ఏ కర్మను జేయనివానికన్న లోకోపకారముగా సత్కర్మల జేయుచు ననుష్ఠానముతో గూడియుండువాడు మేలైనవాడు. జ్ఞాన సౌఖ్యములోను, జీవన్ముక్తిలోను, నిరువురును సమానులైనను శాస్త్రవిధి ననుసరించి యనుష్ఠానము గలవారిని జూచి లోకము ధర్మమును నేర్చుకొని బాగు పడును. కావున అనుష్ఠానము లేనివారికన్న నాచరణ గలిగి యాత్మజ్ఞానులై యుండువారు మిక్కిలిశ్రేష్ఠులు. లోకోద్ధారకులగు మహనీయులందఱును నీలాగుననే యుండిరి. వీరిలో జీవన్ముక్తులై మోక్షమును బొందువారు కొందఱు, కొందఱు తాము ముక్తులైనను ఇతరులనుగూడ మోక్షార్హులుగ జేయవలెనను తలంపు గలవారు. ఒక పడవ సహాయముచే నదిని దాటిపోయినవాడు ఆ పడవను గుఱించిమఱల నేలాటి విచారమును జేయడు. కాని పడవలో జనులను దాటించువాడగు మఱి యొకడు తాను గూడ నదిని దాటినవాడైనను పడవను వెడనీయక సంరక్షించుచుండును. అలాగున నేదో యొక సాధనచే సంసార ప్రవాహమును దాటి మఱల తనయొక్క యనుష్ఠానమందు శ్రద్ధలేనివారలు కొందఱు, ఇంకొందఱు కరుణాస్వరూపులై సంసారములో నుండువారుగూడ తరించేలాగున అనుష్ఠానము గలిగియుందురు. కావుననే యనుష్ఠానము విడిచియుండు వారి

కంటె నాచరణ గల్గియుండువారు శ్రేష్ఠులని జెప్పుటకు కారణమైనది. ఈ యైదవ యధ్యాయమున నీ శ్లోకము ముఖ్యము:-

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయస కరా వుభౌ।
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే ॥(5-2)

తా॥ జ్ఞానయోగమును, కర్మయోగమును రెండును ముక్తిని గలుగజేయునవియే. అయినను కర్మము విడిచియుండుటకంటె నిష్కామకర్మయోగ మవలంబించి ప్రవర్తించుటయే శ్రేష్ఠము.

ఓమ్ తత్ సత్



ఓమ్

# 6. ఆత్మ సంయమ యోగము

శ్లో॥ పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్ ॥
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం
అమ్బ! త్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్ ॥

తా॥ శ్రీమన్నారాయణ భగవానుడగు శ్రీ కృష్ణపరమాత్మచే స్వయముగా నర్జుననికై బాగుగా బోధింపబడినట్టియు, పురాతన మహర్షియగు శ్రీ వ్యాసభగవంతునిచే మహాభారత మధ్యమున గ్రథితమైనట్టియు, అష్టాదశాధ్యాయములతో (పదునెనిమిది యధ్యాయములతో) గూడినట్టియు, అద్వైతామృతమును వర్షించునట్టియు, సంసార దుఃఖమును ద్వేషించునట్టియు, భగవత్స్వరూపిణియైనట్టియు నగు ఓ తల్లీ! భగవద్గీతా! నిన్ను నే ననుసంధానము జేయుచున్నాను. అనగా పారాయణ జేయుచున్నాను.

దీనికి 'ఆత్మ సంయమ యోగమ'ని పేరు. ఇందు నాత్మయనగా మనస్సులేక జీవాత్మయనియు నర్థముగలదు. సంయమ మనగా వశములో నుంచుకొనుటలేక ఆత్మను పరమాత్మలో లయమొనర్చుట, ఆత్మనియమ యోగమని చెప్పక ఆత్మ సంయమయోగమనిచెప్పిరి.సంయమమని చెప్పుటచేలెస్సగ నియమముగల్గియుండవలెనని గ్రహింపదగినది. మనోనిగ్రహమనినను, మనోలయమనినను, మనోజయమనినను, మనోరాహిత్యమనినను నొకే యర్థము. మనోనిగ్రహముగాని,

మనోలయముగాని కలుగవలసియున్న నాత్మలో గల సంస్కారములన్నియు నశింపవలెను. గుణములన్నియు రహితము గావలెను. దీనికి కావలసియుండు ఉపాయములన్నియు నీ యధ్యాయమున శ్రీ భగవాను లుపదేశించి యున్నారు. యోగశాస్త్రము లన్నిటిలో నేయే యనుష్ఠానము లుపదేశింపబడినవో, అవి యన్నియు నీ యధ్యాయమున గలవు. దీనిలో గల యనుష్ఠానమును జేయుటకు ప్రత్యేకముగ నొక జాతివారనిగాని, దేశమువారనిగాని బ్రహ్మచర్యాద్యాశ్రమము లందలి వారనిగాని స్త్రీలనిగాని, పురుషులనిగాని యనుభేదమేమియు గన్పించుటలేదు. మనోనిగ్రహము గల్గినవాలునని యుపదేశింపబడినది. కావుననే యాత్మసంయమయోగమని పేరిడుటకు గారణమైనది, హఠయోగాది గ్రంథములలో జెప్పినట్లు దీనియందు కఠిన సాధనలేవియు దెలిపియుండలేదు. సర్వజనులకు నాచరించుటకు సులభసాధ్యము, నివృత్తిమార్గము లన్నిటిలోను మనోనిగ్రహము సాధించుట చాల ప్రయాసమైనవిషయము. అట్టి నిగ్రహము దీనియందు సులభముగా నిరూపించడమైనది. రెండవది నివాసస్థలము. మూడవది యాహారనియమము. ఇవన్నియు నీ యధ్యాయమున సామాన్య జనులకుగూడ నాచరించుటకు సాధ్యమైనట్లుపదేశింపబడెను. ఆత్మ సంస్కారమందు సాధకుడు సదా మనస్సునుంచి జాగ్రత్తగ పరిశోధించుచుండవలెను. సమస్తమునకదియే మూలస్థానము. ఆత్మసంస్కారమనినను నాత్మపారిశుద్ధ్యమనినను నొకే యర్థమని యిదివఱకే తెలుపబడియున్నది. ఆత్మనిష్ఠలో పూర్తినొందక దేహము వీడినవానియొక్క పరలోకస్థితియు, మరుజన్మలో నుత్కృష్టవంశమున జన్మించి బాల్యకాలమునుండియే యాత్మధ్యానములో గలిగెడు ప్రవృత్తియు దీనియందు విశదముగా తెలుపబడియున్నది. ఈ భాగమును ముముక్షువులు ముఖ్యముగా జూడవలెను. దీనిలో నీ శ్లోకము ముఖ్యము:-

శ్లో॥ యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ!।
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన ॥ (6-2)

ఓ యర్జునా! దేనిని సన్న్యాసమని చెప్పుదురో యద్దానిని నీవు యోగమనియు దెలిసికొనుము. ఎవడు మనస్సుయొక్క సంకల్పములను రహితమొనర్చలేదో, వాడెన్నటికిని యోగి కాజాలడు.

ఓమ్ తత్ సత్.



ఓమ్

# 7. విజ్ఞానయోగము

శ్లో॥ గీతాధ్యయనశీలస్య ప్రాణాయామ పరస్య హి।
నైవ సన్తి హి పాపాని పూర్వజన్మకృతాన్యపి ॥

తా॥ గీతాపఠనశీలునకును. ప్రాణాయామము లొనరించువానికిని పూర్వ జన్మాచరితంబులగు పాపములుగూడ నిలువనేరవు.

విజ్ఞానయోగమనగా ననుభవ జన్యజ్ఞానమనియు, విశేషజ్ఞానమనియు, దైవ సాక్షాత్కారమనియు, జ్ఞేయమును పొందుటయనియు నర్థములు గలవు, వేదాంత శాస్త్రములో జ్ఞానమనియు, విజ్ఞానమనియు, రెండు భాగము లుండును. కనుకనే భగవంతుడు దీనిలో రెండవశ్లోకమున జ్ఞానమును, విజ్ఞానమును చెప్పడమని, యుపదేశించుటకు కారణము. కొన్ని నిఘంటువులలో మోక్షవిషయక జ్ఞాన మును, జ్ఞానమనియు, ఇతర శిల్పశాస్త్రము మొదలగు వాటినన్నిటిని విజ్ఞాన మనియు బేర్కొనియున్నారు. వేదాంతార్థమున విజ్ఞానమునకు ననుభవ జ్ఞాన మనియు శాస్త్రజ్ఞానమునకు జ్ఞానమనియు పేరు. లేక జ్ఞానికుండవలసిన శమ దమాదిసుగుణసముదాయమును గూడ జ్ఞానమనెదరు. పదమూడవ అధ్యాయ మున జ్ఞానమును గుఱించియు, జ్ఞేయమునుగూర్చియు విస్తారముగా చెప్పబడి యున్నది. జ్ఞానశబ్దమునకే కొన్నిస్థలములలో విజ్ఞానమనియు, జ్ఞేయవస్తువనియు, ననుభవసాక్షాత్కారమనియు బేరులు గలవు. మఱల విజ్ఞానమునకు నిగూఢ తత్త్వజ్ఞానమనియు, అతిరహస్యతత్త్వజ్ఞానమని గూడ నామధేయము లున్నవి.

ఈ యధ్యాయమున 8-వ శ్లోకము ముఖ్యము. దీనిలోగల విశేషజ్ఞానమునే విజ్ఞానమని గ్రహించవలయును. అదేమన, భగవంతుడు ఆకాశమున శబ్దరూపము గాను, వాయువున స్పర్శరూపముగాను, అగ్నియందు తేజోరూపముగాను, జల మందు రసరూపముగాను, భూమియందు గంధరూపముగాను, వేదమందు ప్రణవ స్వరూపముగాను,సూర్యచంద్రాదులందు ప్రకాశరూపముగాను నున్నానని తెలిపిరి. ఇదే విజ్ఞానముయొక్క పరమరహస్యము. దీనికి కారణముగూడ నీ యధ్యాయమున తెలిపియున్నారు. సామాన్యజనుల జ్ఞానము అజ్ఞానముచే మూయబడియుండుటచే నీ రహస్యమును తెలిసికొనజాలరు. ఈరహస్యమునందే ద్వైతాద్వైతవిశిష్టాద్వైత ములయొక్క తత్త్వము నిలిచియున్నది. అదేమన, శబ్దము వినా ఆకాశములేదు. ఆకాశమునుండి శబ్దమును వేరుపరచుట సాధ్యముగాదు. శబ్దమును ఆకాశమును నొకటియే. అలాగున స్పర్శము వినా వాయువులేదు. వాయువునుండి స్పర్శమును వేరుపరచుట కవకాశము గన్పింపదు.అలాగున ప్రకాశము వినా యగ్నియుండదు,

తేజస్సును వేరుపరచిన నగ్నియను నొకతత్త్వమే యుండదు. ఈలాగున రసము వినా జలమును గంధము వినా పృథ్వియు నుండవు. ప్రకాశము వినా సూర్యుడు లేడు, ప్రణవములేనిచో వేదమేయుండదు. వేదములయొక్క ప్రాణమే ప్రణవము. కావుననే ప్రణవములేని మంత్రము వేదసంబంధముగాదనియు, ప్రాణశక్తి లేదనియు చెప్పుటకు కారణము. ప్రణవార్థ మెఱింగి ఓంకారము ధ్యానము చేయువారికి ఆత్మయందు నిగూఢమై యుండు దివ్యతత్త్వము ప్రకాశమునకు వచ్చును. ఈలాటి పరమరహస్యము లీ యధ్యాయమున నుండుటచే దీనికి 'విజ్ఞాన యోగమ'ని పేరువచ్చినది. విశేష బుద్ధితో విచారించిన పరమాద్వైతమే సిద్ధించును. సామాన్యదృష్టితో జూచినవిశిష్టాద్వైతమును గన్పించును. ఈ రెండుమతస్థుల యభిప్రాయమేమన భగవంతుడగ్నిలో ప్రకాశరూపుడుగాను, జలమున రసస్వరూపుడుగాను, వాయువున చలన స్వరూపుడుగాను నుండుననియే, ఇది ప్రత్యక్షముగ గన్పించునదేగాని, దీర్ఘచింతనచేసినచో నగ్ని, ప్రకాశము, వాయువు, చలనము, జలము, రసము, అన్నియు నొకటిగానే గోచరించును. దీని నాధారముగ జేసికొనియే ద్వైతాద్వైత విశిష్టాద్వైతభాష్యములేర్పడినవి. కావుననే శివపరముగ శ్రీ కంఠశివాచార్యులును, విష్ణుపరముగ రామానుజ మధ్వాచార్యులును, పరబ్రహ్మపరముగ శ్రీశంకరులును ప్రస్థానత్రయమునకు భాష్యము వ్రాయుటకు కారణమైనది. అందఱికిని ప్రమాణము, యుక్తియు, అనుభవమును గలదు. భగవంతుడు అగ్నియందు ప్రకాశముగనున్నాడని యొకరు చెప్పిరి. మఱియొకరు అగ్నిలోగల ప్రకాశము వేరా? లేక అగ్నియే ప్రకాశమైయున్నదా? యని ప్రశ్నించిరి, దీనిచే నిందలి యర్థమును గ్రహించుకొనవచ్చును. లేక ఈశ్వరుడు పంచదారయందు మాధుర్యరూపమున నున్నాడని చెప్పిన, తీపివేరు చక్కెరవేరుగానట్లు ఇవ్విషయమునుగూడ విజ్ఞుడెఱుంగవలెను. అప్పుడు ద్వైతాద్వైతవిశిష్టాద్వైతములయొక్క రహస్యము, సత్యమును గోచరము గాగలదు. దీనియందీశ్లోకము ముఖ్యము:—

శ్లో॥ రసోఽహమప్సుకౌన్తేయ! ప్రభాఽస్మి శశిసూర్యయోః ।
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ (7-8)

**తా॥** ఓ యర్జునా! జలమందలి రసమును, సూర్యచంద్రులందలి ప్రకాశమును, వేదములయందలి ఓంకారమును, ఆకాశమునందలి శబ్దమును, నరులందు కృతకృత్యరూపమగు పుణ్యస్వభావమును, నేనేయయియున్నాను.

సూక్ష్మదృష్టితో నిట్టి తత్త్వమును గీతాపారాయణచేయువారు తెలిసికొనేలాగున చూడవలెను, పూర్తిగీతను ప్రతిదినమును పారాయణవేయుట యధికపుణ్యమని తలంచి చాలమంది ప్రతిదినమును 18 అధ్యాయములను పారాయణ చేయుచుందురు. అయితే యది మంచిదైనను నాయాశ్లోకములలో నిర్ణయింపబడిన యర్థమునుగూడా తెలిసియుండేలాగున చూడవలెను. అట్లు అర్థము తెలియక పారాయణముమాత్రము చేయుటచే గొప్పలాభము గలుగదు. సమయము ఎక్కువలేనివారు ఒక్కొక్కయధ్యాయము మూలశ్లోకములుమాత్రము పారాయణ చేసి ప్రతిదినము 5 శ్లోకములుగాని లేక 2 శ్లోకములుగాని యర్థము బోధపడేలాగున టీకాతాత్పర్యగ్రంథములందుజదివి వానిసారము గ్రహించుట మంచిది. ఏ శ్లోకమందు నేయర్థము వ్రాయబడెనో దానిని చదివి యర్థము బోధపడునంతవఱకు నొకసారిగాని, రెండుసార్లుగాని, మూడుసార్లుగాని మఱల మఱల చదువుట శ్రేష్ఠము. అర్థము తెలియక చదువుటలో పుణ్యముగలదుగాని గీతాచార్యుల బోధలన్నియు తెలియుటకును నాచరించుటకును నర్థము తెలిసిననే సాధ్యమగును.

ఓమ్ తత్ సత్.



ఓమ్

# 8. అక్షర పరబ్రహ్మయోగము

శ్లో॥ శ్లోకమేకం తదర్ధంవా పాదం పాదార్ధమేవ వా ।
నిత్యం పఠతి యో భక్త్యా స మోక్షమధిగచ్ఛతి ॥

తా॥ శ్రీ భగవద్గీతయందొక శ్లోకముగాని, యర్ధశ్లోకముగాని, నాలుగవ భాగముగాని, యెనిమిదవ భాగముగాని, నిత్యము భక్తితో పఠించినవారు తప్పక మోక్షముబొందెదరు.

నాశరహితమగు పరబ్రహ్మమును పొందింప చేయునదగుటచే దీనికి 'అక్షర పరబ్రహ్మయోగమ'ను నామధేయము గల్గెను, నిత్యమగు బ్రహ్మములో జీవుని యైక్య పఱచునదనిగూడ దీనిని గ్రహింపవలెను. దీనియందెనిమిది ప్రశ్నలు మొదటగలవు. (1) బ్రహ్మమనగా నేమి?, (2) అధ్యాత్మమనగానేమి? (3) కర్మయనగా నేమి?, (4) అధిభూతమెటువంటిది?, (5) అధిదైవమన నేమి?, (6) ఈ దేహమందు అధియజ్ఞుడెవడు?, (7) అతడెట్టి స్వభావము

గలవాడు?, (8) ఆత్మధ్యాననిష్టగలవారు ప్రాణప్రయాణ సమయమున నెట్లు ధ్యానించిన నిన్ను (భగవంతుని)పొందగలరు? అను నీ యెనిమిది ప్రశ్నలను నర్జునుడు చేసియున్నాడు. వీనిలో, నేడింటికి. నొక్కొక్క వాక్యముతో సమాధానము చెప్పి యెనిమిదవ ప్రశ్న యగు అంత్యకాల స్థితిని గూర్చి విస్తారముగా సమాధాన మిచ్చియున్నారు. అదేగదా ముఖ్యమైనది, అందఱును జేయు సమస్త కార్యములును అంత్యకాలమున నుత్తమగతి గ్గలుటకేగదా! కాన నీ విషయమై భక్తులును, జ్ఞానులును, యోగులును, వేయేల అందఱును ముఖ్యముగా తెలిసికొనదగినదే.

ప్రాణ ప్రయాణ సమయమున ప్రణవము నుచ్చరించి పరమాత్మను ధ్యానించి దేహమును విడుచువాడు అక్షరపరబ్రహ్మమును పొందునని శ్రీకృష్ణ భగవాను లుపదేశించిరి. అయితే ప్రణవమును ధ్యానించుటకెవ రర్హులు. ఎవరు అర్హులు కారని దీని యందేమియు చెప్పియుండలేదు. కాని ప్రణవధ్యానమునకు నియమమును మాత్రముపదేశించియున్నారు. అదేమన— అన్ని యింద్రియము లను స్వాధీన మందుంచుకొని మనస్సును భగవంతునియందు నిల్పి ఓంకారము నుచ్చరించి దేహమును విడుచువాడు, గురిని లక్ష్యమందుంచి విడువబడిన బాణమేలాగున లక్ష్యమున జొరబడునో, ఆలాగున బ్రహ్మమును పొందునని భగవదుపదేశము. ఈ ఓంకారధ్యానము జేయుటకు ఫలాని జాతివారు, లేక ఫలానికులమువారు,లేక ఫలానిదేశమువారు,లేక ఫలాని యాశ్రమములో నుండు వారు, లేక స్త్రీలు, పురుషులు అర్హులు అని భేదమేమియు జెప్పక అంత్య కాలమున ముక్తిని గోరువారు పైజెప్పేలాగున నుండిన మోక్షము పొందవచ్చు నని మాత్రమే శ్రీ కృష్ణభగవానులు ఉపదేశించియున్నారు. ప్రణవమును ధ్యానించుట కేదైన వర్ణాశ్రమభేదముండినచో, నిచ్చోట భగవంతుడు చెప్పక పోవునా? కావున మనకు భగవద్వాక్యము ప్రమాణమా? లేక భగవత్ప్రీతికి ఆటంకము గలుగజేయు మానవుల స్వయం కల్పిత వాక్యము ముఖ్యమా? యని విజ్ఞులందఱు నాలోచించుకొన వలెను. ఇంతవఱకు భగవద్గీతను గూడ నందఱును జదువరాదని చెప్పెడి వారుండిరి. దైవకృపవలన నట్టి పాప కాలము కాలగర్భములో కలిసిపోయినందుచే ఆ విషయమై యిప్పుడేమియు చెప్పబనిలేదు. ఇక్కాలపుణ్యముచే భగవద్గీత నందఱును జదువ వచ్చునని లోపల నిష్టము లేకపోయినను, చెప్పవలసిన కాలమాసన్నమైనందుచే నంగీక రించియున్నారు. కాని ప్రణవమును మాత్రముచ్చరింపగూడదట. దీనివలన వీరు

గీత చదువువారే కాని దానియందు చెప్పినట్లు అచరించువారు కారని స్పష్టముగా తెలియందగును. వారాచరించువారైన, ఇతరులతోను నాలాగున నాచరింప వలెనని యేల చెప్పరు? ఎప్పుడు శాస్త్రములను మాత్రము చదివి దానిలో చెప్పేలాగున నాచరణ లేకపోయినదో, అప్పుడు భారతదేశము హీనస్థితికి వచ్చినది, చెప్పేలాగున నాచరించే వారు ఏర్పడిన మాత్రమే దేని యందేఫలము చెప్పబడియున్నదో అయ్యెదిఫలించును. గీత మాత్రము చదువ వచ్చుగాని. దానిలో చెప్పినట్లాచరింపగూడదని చెప్పువాక్యమున కెందైన విలువగలదా? దానికన్న గీత జదువగూడదని చెప్పిననే బాగుండును, దీనికి మించిన అంధ విశ్వాసము లోకములో గలదా? ఇట్టి మూఢస్వభావము ఇక్కాలమున గూడ నెచ్చటనో మూల దాగియున్నదని వినుటచే నాశ్చర్యమొందనివారుందురా? వారి యీ మాటలలో నేదైన సత్తువ గలదా? మీరు గోవును సంరక్షింప వచ్చును, పాలు పెరుగు నుపయోగించవలదు, లేక మీరు మంచిఫలవృక్షము లను పెట్టి పోషింపవచ్చును. కాని ఫలములను మాత్రము భుజింపగూడదు. అను నటువంటి యీవాక్యములందెంత సత్యముగలదో, వారు వచించుదానిలోను నంతే సత్యము గలదని జనులందఱును దృఢముగా నమ్మవలెను. మఱియొక విధముగా గూడ చెప్పువారుగలరు. ఎట్లన నంత్య కాలమున భగవద్ధ్యానము చేసిన చాలు గదా! ఇప్పటి నుండి యేలజేయవలెనని వారి యభిప్రాయము. అంత్యకాలము ఏ సమయమున నెచ్చోట నెప్పుడు గలుగునో యెవరైన జెప్పగలరా! ఏ నిముషమో ఎచ్చోటనో చెప్పువారు అరుదు. కావున తలంచి నపుడే అట్టి దైవకార్యములో ప్రయత్నించవలెను. సాగరములో నలలు శాంతించిన తరువాత స్నానమాచ రింపదలచిన కాలమేలాగున వ్యర్థమైపోవునో, అలాగున సంసార సంబంధ సమస్త కార్యములు శాంతి నొందిన తరువాత నీశ్వరుని ప్రార్థన చేసికొన వచ్చునని తలంచుటయు వ్యర్థమేయగును, సముద్రములోని యలలు ఏ కాలమునకైనను గమనము బొందనట్లు సంసారములోగూడా కార్యములన్నియు పూర్తియయ్యెడు కాలముండదు. ఈ యధ్యాయమున నీ శ్లోకము ముఖ్యము:—

శ్లో॥ ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయాతిత్యజన్ దేహం సయాతిపరమాంగతిమ్॥(8-13)

పరబ్రహ్మావాచకమగు 'ఓం' అనెడి ఏకాక్షరము నుచ్చరించుచు, ఓంకార స్వరూపుడగు పరబ్రహ్మమును (భగవానుని) ధ్యానించుచు నెవడు దేహమును విడుచునో యట్టివాడు సర్వోత్తమమగు ముక్తిపదమును బొందును.

ఓం తత్ సత్ ఓమ్



# 9. రాజవిద్యా రాజగుహ్యాయోగము



శ్లో॥ అకృత్స్నమపి కుర్వాణో భుంజానో వా యత స్తతః।
ఘోరం వై వస్యతస్థానం గీతాధ్యాయీ న పశ్యతి॥

తా॥ అకార్యకరణములు, అభక్ష్యభక్షణములు నాచరించినవారలైనను గీతను నిత్యమభ్యసించువారలు నరకము నెన్నటికిని గాంచరు.

ఈ బ్రహ్మవిద్య అన్నింటిలోను రాజై యుండుటచేతను లేక ఇక్ష్వాకు డాదిగాగల రాజులందఱును నీ విద్య ననుష్ఠించి రాజ్యపరిపాలన మొనర్చి జీవన్ముక్తిపదమును బొందినందుచేతను దీనికి 'రాజవిద్యా రాజగుహ్యాయోగమ'ని పేరు వచ్చినది. మఱియు రహస్యములన్నిటిలోను నిది యతిరహస్యమైనందుచేతను దీనికి రాజవిద్యారాజగుహ్యా యోగమని నామధేయము కల్గెను. మఱియు పూర్వీకులగు రాజులు నీ గీతాశాస్త్రాను సారము నాచరించియే ముక్తిని బొందిరి. కావున నో యర్జునా' నీవును నీ గీతాశాస్త్రానుసారము వర్తించి జీవన్ముక్తి పదమును బొందుమని భగవానులు వచించిరి. ఈ పరమరహస్యమైన బ్రహ్మవిద్య యనాదికాలమునుండి రాజులచే అనుష్ఠింపబడుచువచ్చినదనియు, మధ్య బహుకాలమునుండి నశించిపోయినదనియు, అట్టి క్షయించి పోయిన విద్యనే మఱల నిప్పుడు నేనుద్ధరించుచున్నాననియు శ్రీభగవానులు నాల్గవ యధ్యాయమున తెలిపియున్నారు, దీనియందింత రహస్యమేమన, మోక్షముకొఱకు సర్వసంగ పరిత్యాగము కావలెననియు, ఏకాంత ప్రదేశమున జేరవలయుననియు. జటా కాషాయవస్త్రములు ధరించవలెననియు, తపస్సుచే శరీరమును కృశింపజేయవలెననియు, యోగముచే నిర్వికల్పసమాధివఱకు ధ్యానధారణాదుల నవలంబింపవలయు ననియు చెప్పుదురుకదా! అట్టి దుస్సాధ్యసాధనలు జేయకనే ఈశ్వరార్పణబుద్ధితో నిష్కామకర్మయోగ మనుషించిన జీవన్ముక్తిపదవి బొందుటలో నేలాటి సంశయమున్నులేదని యిందుపదేశించినందుచే దీనిని రహస్యములన్నిటిలో మిక్కిలి రహస్యమైనదని చెప్పుటకు కారణమైనది. పైజెప్పిన కఠిన క్రియల నాచరింపకయే వానియొక్క ఫలముల నొసంగెడు బుద్ధిచాతుర్యము నేమని చెప్పవచ్చును! అంతేకాదు, పైదెల్పిన యేకాంతవాసము, యోగాభ్యాసము, తపశ్చర్య మొదలైనవి యందఱకును సాధ్యమైనవికావు. ఈ నిష్కామ కర్మయోగమో సర్వజనులకును, సర్వకాలములోను, స్త్రీలకును, పురుషులకును వేయేల, అందఱకును నాచరించుటకు సులభసాధ్యమైనదిగదా! కావుననే దీనిని

రహస్యమని చెప్పుటకు గారణము. మను, మాంధాత, జనక, భగీరథ. ఇక్ష్వా క్వాది రాజులందఱును రాజర్షులని పేరుబడసినవారే. రాజులై యుండియు, రాజ్యపరిపాలన మొనర్చుచుండియు వారు ఋషులయొక్క స్థానమును బొందిన వారై యుండిరి. ఋషులనగా నింద్రియాతీతమైన జ్ఞానమును పొందిన వారనియు నింద్రియాతీతమగు బ్రహ్మపదవి గల్గినవారనియు, వేదముల యర్థమగు పరమాత్మను సాక్షాత్కరించుకొనినవారనియు నర్థము. నాల్గవ అధ్యాయమున నిట్టి పరమరహస్యమైన బ్రహ్మవిద్య పూర్వీకరాజులచే అనుష్ఠింపబడుచువచ్చిన దనియు, బహుకాలమునుండి క్షీణించిపోయినదనియు వచించి, యట్టి పరమ రహస్యమునే నీకు జెప్పెదననియు శ్రీకృష్ణభగవానులు ఉపదేశించిరి. అయితే యిట్టి పరమపవిత్రమగు కర్మయోగము నశించుటకు కారణమేమని యనేకులకు సందేహము గలుగవచ్చును. గీతాభాష్యకారులు కొందఱు ఈ విషయ మేమియు దెలుపలేదు. మఱికొందఱు పరంపరగా ననుష్ఠించువారు లేమిచే నశించినదని తెలిపిరి. కాని యిది సరియైనసమాధానము కాజాలదు, దీనియొక్క రహస్యము మహాభారతము ఆదిపర్వములో గలదు. క్షత్రియవంశము పతనమొందుటకును క్షాత్రధర్మమునశించుటకును కారణమచ్చోట దెలుపబడినది. ఈ కారణము తెలుపలేకపోయినను దానియొక్క సంగ్రహార్థమేమన, క్షత్రియధర్మ దివ్యోద్యాన భూరుహములను శ్రీపరశురామదావాగ్ని దహింపజేసినందుచే అప్పటినుండి క్షాత్రవిద్యలన్నియు నశించినవి. శిష్యపరంపరగా నా విద్య నుపదేశించువారు లేకపోయిరి. అందువలననే బహుకాలమునుండి కర్మయోగరహస్యము నశించిన దని శ్రీ భగవానులు సెలవిచ్చుటకుగారణమైనది. మఱియు నీ బ్రహ్మవిద్యను పొందుటకు బ్రాహ్మణాది సర్వవర్ణములవారికిని, స్త్రీలకును అధికారము మాత్రము గలదని చెప్పక పాపజన్మముగలవారెవరుగలరో వారికిగూడ నర్హత గలదని యీ గీతాశాస్త్రము అధికారమును నిరూపించినందుచేతను నిది మిక్కిలి రహస్యముగదా! ఏలన బ్రహ్మవిద్య కందఱును నర్హులుగారనియు, కొన్ని వర్ణములవారికి మాత్రమే యధికారము గలదనియు, కొందఱు ఆశ్రమస్థులకు మాత్ర మవకాశముండుననియు దెలుపు స్వకపోలకల్పితగ్రంథము లుండ వచ్చును. కావున నట్టి పాపము లెవ్వియు దీనియందు లేనందుచే నిది మిక్కిలి పవిత్రమైనది, గూఢమైనదని చెప్పుటకు కారణము. పాపులు పవిత్రులగుట యొకవిశేషముకదా. ఇదే దీనిలోగల రహస్యము, ఈవిషయములన్నియు నీ యధ్యాయమున గలవు. మఱియు నెంతపాపియైనను దీనియందు చెప్పినట్లాచరించిన త్వరలోనే పాపరహితుడై పుణ్యాత్ముడగుననియు. నతడు పవిత్రుడేయని

యందలును తలంచ వలెననియు కరుణానిధియగు భగవానుడీయధ్యాయమున మపదేశించిరి. కావున నీ యధ్యాయమునకు రహస్యమని పేరు వచ్చెను. ఎంత దారుణవ్యాధియైనను దివ్యౌషధముచే నేలాగున నశించునో నాలాగున పాపరోగములన్నియు నీ గీతా శాస్త్రపఠనముచే శమించును. దరిద్రునకు నిక్షేపము దొరికిన నేలాగున దారిద్ర్యబాధారహితుడై శ్రీమంతుడగునో, అలాగున పాపహేతువగు దారిద్ర్యము గలవాడును గీతాపఠన మొనర్చిన పుణ్యవంతుడగును. జ్ఞానధనికుడగును. ఈ యధ్యాయమునందు యీ శ్లోకము ముఖ్యము:—

శ్లో॥ అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః॥ (9-30)

తా॥ ఎడతెగని భక్తితో నన్ను సేవించువాడు మిక్కిలి దురాచారుడైనను, పాపియైనను వానిని శ్రేష్ఠుడనియే తలంచవలెను. ఏలన నెప్పుడును నితర చింతలులేక నాయందే నిశ్చలబుద్ధిగల భక్తుడు పవిత్రుడే యగును. భగవద్భక్తిమహిమ యిటువంటిది! స్పర్శవేది సంయోగముచే ఇనుము ఏలాగున బంగారమగునో, మఱల నా బంగారము ఇనుము కాజాలదో అలాగున నెంత పాపియైనను, భగవద్ధ్యానమహిమచే పవిత్రుడగును. ఇది భగవదాజ్ఞ యని యందఱు మరువకయుండవలెనని భావము, వాల్మీక్యాది ఋషులే యిందుకు దృష్టాంతము.

ఓమ్ తత్ సత్



ఓమ్

# 10. వి భూ తి యో గ ము

శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥

తా॥ సమస్త ఉపనిషత్తులు ఆవులుగను, గోపాలకుడగు శ్రీ కృష్ణభగవంతుడు పాలను పిదుకువాడుగను, అర్జునుడు దూడగనునైరి. అప్పుడు శ్రీభగవద్గీత యను మహామధురమగు అమృతము పిదుకబడినది. అట్టి మహామాధుర్యయుక్త గీతామృతమును శుద్ధాత్ముడు అనుభవించుచున్నాడు.

దీనియందు ఈశ్వరవిభూతిని వర్ణించుటవలన నీ యధ్యాయమునకు 'విభూతియోగమ'ని పేరువచ్చినది. ఈశ్వర మహిమాతిశయమునకు గూడ

విభూతి యని పేరుగలదు. ఈశ్వరశక్తికి గూడ నిట్టి యర్థము గలదు. ఈ యధ్యాయమున సర్వేశ్వరుని యోగశక్తి యనంతమనియు, దీనిని సామాన్య జనులు తెలిసికొన జాలరనియు, మనుష్యులకేకాక దేవతలకు సహితముతెలియ దుస్సాధ్యమనియు శ్రీ భగవాను లుపదేశించియున్నారు. ఇందువలననే సాకార మూర్తి పూజాదు లేర్పడినవి. అనంతుడును, నిరాకారుడు నగు పరమేశ్వరుని ఇంద్రియములకు లోబడియుండు మనుజులేగాక దేవతలు సహితము తెలిసి కొనుట దుస్తరము. ఎంతవఱకు నింద్రియాతీతమగు జ్ఞానము గలుగలేదో అంతవఱకు సర్వేశ్వరుడు, సర్వేశ్వరతత్త్వము పూర్తిగా నెఱుంగ సాధ్యము కాదు. అట్టి యతీతజ్ఞానమును సమాధిస్థితిలో మాత్రమే పొందగలము. అట్టి స్థితిని పొందనివారికి పంచేంద్రియములకు విషయములగు నేదో యొక మూర్తి గాని భావముగాని మనసున నేర్పడిన మాత్రమే అవగాహనము చేయుటకును, ధ్యానించుటకును సాధ్యపడును. సర్వేశ్వరుని కరుణాస్వరూపుడుగాను, ప్రకాశ స్వరూపుడుగాను, జ్ఞానస్వరూపుడుగాను, వ్యాపకస్వరూపుడుగాను భావించుటయు నొకవిధమగు మూర్తిపూజలో చేరినదియే యగును. ఇటి భావమేదైన చేయనిచో మనస్సునకు నిలుకడ కలుగదు. ఇది మానసికపూజ యనబడును. లేక మనో ధ్యానమనియు చెప్పవచ్చును. భగవద్విభూతి యనంతమైనదైనను సామాన్య జనులు తెలిసికొనుటకై కొన్ని ముఖ్యములగు పవిత్రములైన విభూతులు మాత్రమీ యధ్యాయమున తెలుపబడినవి.

మఱియొక విశేషార్థముకూడ నిట తెలియజేయడమైనది. దైవికగుణము లగు సత్యము, జ్ఞానము, శాంతము, కరుణ, విరక్తి, తపస్సు మొదలైనవి యెవరియందైనను ఏ దేశమందైనను, ఏ కులమందైనను, ఏ మతమందైనను కనుపించినచో, నవి యన్నియు భగవత్స్వరూపములుగా నెఱుంగవలెననియు, అట్టివారెవరైనను వారిని భగవద్విభూతిభూషితులుగ జూడవలయుననియు నుపదేశించియున్నారు. మఱియు నీ చరాచర జగత్తంతయు భగవత్స్వరూపము గానే చూడదగినదనియు, నాలాగున చూచుటకు శక్తిలేనివారికి మాత్రమే ప్రత్యేక మొకస్థలముగాని, రూపముగాని, వస్తువుగాని సాధనకొఱకు ఏర్పడినవని వివేకులు జ్ఞాపకముంచుకొనవలెను. స్త్రీలను కొందఱు హీనులుగ దలంతురు. భగవద్విషయమునకు భగవద్జ్ఞానమునకు గూడ వారనర్హులని చెప్పుదురు. ఓహో! ఇది ఎంత పొరబాటు! భగవదాశయమున కిది విరుద్ధమైనది. ఏలన నీ యధ్యాయమున శ్రీ భగవంతుడే స్త్రీలయందు నేడు గుణములతో నేను నివా

సము చేయుచున్నానని యనుగ్రహించియున్నారు. 34-వ శ్లోకము జూడుడు. (1) కీర్తి (పుణ్యకర్మములచే గలుగు విఖ్యాతి), (2) లక్ష్మి (పవిత్రశోభ లేక ఐశ్వర్యము), (3) ప్రేమపూరితవాక్కు, (4) స్మృతి (ధర్మకార్యమాచరింప వలెనను జ్ఞాపకము), (5) మేధ (పుణ్యాపుణ్య వివేచనా సామర్థ్యము), (6) ధైర్యము. (7) క్షమ (ఓరిమి) – ఈ యేడు గుణములతో గూడి స్త్రీలలో పరమాత్మ నివసించుచున్నాడని యానతిచ్చియున్నారు

"కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా"

ఇట్టి పుణ్యస్వరూపిణులగు నారీమణులకు భగవంతు డనుగ్రహించిన గీతా శాస్త్రమునుగూడ చదువుటకర్హతలేదని చెప్పుట భగవదాజ్ఞ నుల్లంఘించిన దౌష్ట్య మును చేయుట యని యర్థముగదా! అట్టిదానివలన అనర్థమే గలుగును గాని సార్థకం (ప్రయోజనము) ఎట్లు గల్గును? గీతామాహాత్మ్యమున కర్మబద్ధులై దుఃఖ మనుభవించు జీవకోట్లకు దేనివలన కర్మశాంతియు పరమపదప్రాప్తియుగలుగునని యడిగినది శ్రీభూదేవిగదా! అట్టి భూదేవికిగదా భగవంతుడు శ్రీగీత నుపదేశిం చెను? ఈ భూదేవియు స్త్రీవర్గములో చేరినవారుకదా! ఈ విషయమై యిది వరలో వ్రాసి యుండు భగవద్గీతయొక్క ఋష్యాది న్యాసవివరణములో విస్తార ముగ గనదగును. అయితే భగవంతు డనుగ్రహించిన యిట్టి పుణ్యగుణములన్ని టిని నారీమణులు సంరక్షించుకొనవలెను. లేవిచో భగవంతుడిచ్చిన దివ్యత్వమును పోగొట్టుకొనినవారే యగుదురు. అందువలన భగవత్ప్రీతికి దూరులగుటయేగాక లోకనిందకును పాత్రులగుదురు. మఱియు నీ యధ్యాయమున నొక గొప్ప రహస్యము నుపదేశించి యున్నారు దైవగుణములు ఎవరియందు గన్పించునో ఆ గుణములు భగవత్స్వరూపమునకు సంబంధించినవని, అవశ్యముగా వానిని గ్రహించుకొనవలసినదనియు చెప్పబడియున్నది. ఇట్టి భగవద్వచన ప్రమాణ ముండియు జనులు దానిని మఱచి పోవుచున్నారు. కావున నేదేశమున నేజాతి యందైనను నిహలోకమునకు సంబంధించినవనియు పరలోకమునకు సంబం ధించినవనియు నగు విద్యగాని, జ్ఞానముగాని యుండిన అవశ్యముగా వానిని భగవదంశముగ దలంచి యంగీకరింపవలయును. భగవద్గుణములు అనంత ములు భగవజ్జ్ఞానమును అనంతము. ఇంతవఱకు వ్యక్తమైనదే గాక యింకను కల్పాంతము వఱకు నెంతయో జ్ఞానము పాంచభౌతిక సంబంధమైన దనియు, అప్రాకృతమైనదియు ఒక్కొక్క దేశములో ఒక్కొక్క కాలములో నభివ్యక్తము కాగల్గును. వలన వేదమునంతమనియు, భగవద్విభూతి యనంతమనియు

శాస్త్రములలో గన్పించుచున్నది. కావున నెచటెచట భగవద్విభూతి గన్పించునో, అచటచట భగవద్భావము గలుగజేసికొనవలెనని శ్రీ భగవాను లుపదేశించిరి. ఈ యధ్యాయమున నీశ్లోకము ముఖ్యము:—

శ్లో॥ యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్॥ (10-41)

తా॥ ఈశ్వరసంబంధమైనదియు, చైతన్యయుక్తమైనదియు అత్యంతోత్సాహముతో గూడినదియునగు వస్తుసమూహమేదిగలదో, యదంతయు నా తేజస్సుయొక్కయంశమువలన గలిగినదానివలెనే నీవుతెలిసికొనుము.

పైజెప్పిన దైవగుణములు ఎవరియందు గన్పించినను అవి భగవదంశమే యని తలంచి యంగీకరించవలెనని భగవంతుడుపదేశించిన యీ భావము చాల విశాలమైనది, కనుకనే శాస్త్రవేత్తలు "అన్త్యాదపి పరం ధర్మం' 'అమేధ్యాదపి కాంచనం'-అని తెలుపుటకు కారణమైనది. అనగా శ్రేష్ఠమైన ధర్మము నంత్యజునినుండియు, సువర్ణమును మాలిన్యమునుండియు గ్రహించినను దోషములేదని తెలిపిరి. ఆహా! యెంత విశాలభావము!

ఓమ్ తత్ సత్

ఓమ్

# 11. విశ్వరూప సందర్శనయోగము

శ్లో॥ ఏకం శాస్త్రం దేవకీపుత్రగీత మేకోదేవో దేవకీపుత్ర ఏవ ।
ఏకో మన్త్రో దేవకీపుత్రనామ కర్మా ప్యేకం దేవకీపుత్ర సేవా ॥

తా॥ శ్రీకృష్ణునిచే నుపదేశింపబడిన శాస్త్రమే శాస్త్రము. కృష్ణభగవానుడొకడే దేవుడు శ్రీకృష్ణునినామమే మహత్తరమగు మంత్రము. దేవకీపుత్రుని సేవయే చేయదగిన కర్మ.

విశ్వరూపయోగమని చెప్పక 'విశ్వరూపసందర్శనయోగమ'ని చెప్పుటచే భగవంతునియొక్క విశ్వరూపము లెస్సగా దర్శింపబడినయోగమని దీనికి పేరు. విశ్వరూప సాక్షాత్కార మీ యధ్యాయమున జూపినందుచే దీనికి 'విశ్వరూప సందర్శనమ'ని పేరు గల్గినది. భగవద్దర్శనమనిగాని, భగవత్ప్రత్యక్షమనిగాని, భగవత్సాక్షాత్కారమనిగాని చెప్పక విశ్వరూపసందర్శనమని' చెప్పుటలోగొప్ప రహస్యముగలదు, వేదాంతశాస్త్రము యొక్క వివరలో నీ జగత్తంతయు

భగవత్స్వరూపమనియు, బ్రహ్మమయమనియు, మాయవలన నా సద్భావము నెవ్వరును కనుగొనజాలకున్నారనియు భగవాను లుపదేశించియున్నారు. "ఏకమేవాఽద్వితీయం" అని చెప్పు శ్రుతివాక్యమేయిందుకు ప్రమాణము. అయితే అట్టి యప్రాకృతమగు దివ్యదర్శనము మాయచే నావృతమైన హృదయము గల వారికి దర్శింపసాధ్యముగాదనియు, మాయయొక్క యావరణము భగవత్కృప వలననే తొలగవలయుననియు, అప్పుడే దివ్యదృష్టి గలుగుననియు నీ యధ్యాయమువలన తెలియదగినది. భగవత్కృపగల్గుటకు నిష్కళంకమైనభక్తియే ముఖ్యసాధనమని యుపదేశింపబడినది. శ్రీకృష్ణభగవానుని దేహమందేయర్జునుడు చతుర్ముఖబ్రహ్మను, దేవతలను, ఋషులను, ఆదిత్యులను, యక్షులను, గంధర్వులను, రాక్షసులను, మానవులను, పశ్వాది తిర్యగ్జంతువులను, వేయేల, లోకమంతయును జూడడమైనది. కావున నీ జగత్తంతయు వాసుదేవ మయమని యేడవ యధ్యాయమున జెప్పుటకు కారణమైనది, ఏకత్వమున ననేకత్వమును కల్పించుట మాయయొక్క పనియైయున్నది. అట్టి యవిద్యనశించిన ఏకం సత్ విప్రాబహుధా వదన్తి" అను శ్రుతివాక్యము గోచరమగును. ఇదే దీనిలోగల ముఖ్యవిషయము. రెండవది యజ్ఞాది క్రతువులచేగాని, వేదాధ్యయనాదులచేగాని మోక్షము కలుగదనియు, అనన్యభక్తి యొక్క దాని వలననే ఈశ్వరసాక్షాత్కారము సిద్ధించుననియు సెలవిచ్చియున్నారు. ఇదే కారుణ్యమయుడగు శ్రీకృష్ణభగవానునికి జీవరాసులలోగల వాత్సల్యము, ఏలన, యజ్ఞములు చేయుటకును, వేదములు పఠించుటకును, దానములు చేయుటకును, తపస్సులు సల్పుటకును అందఱకు ననుకూలముండదు. అనన్య భక్తి గలిగి సర్వేశ్వరస్మరణ హృదయములో గలిగియుండుట ప్రతివారికి సాధ్యమైనపనియే యను భావమేమియు దీనియందులేదు. శ్రద్ధయు, పవిత్రతయు, గలిగిన జాలును, మూడవది మానవులు నిమిత్తమాత్రులనియు, సమస్తము సర్వేశ్వరశక్తివలననే జరుగుచున్నదనియు తలంచి నిస్సంగత్వము వహించి భగవదర్పితహృదయము గలిగియుండవలెనని దీనివలన తేలుచున్నది. కనుకనే అర్జునునితో నీవు నిమిత్తమాత్రుడవేగాని సమస్త క్రియలును నావల్లనే జరుగుచున్నవని చెప్పుటకు హేతువైనది. అయితే సమస్తము భగవదాజ్ఞానుసారము జరుగుచున్నదని తలంచి పురుషప్రయత్నము నుపేక్షించియుండవలెనని కాదు. తాను చేయవలసిన కృత్యములను నిర్వహించుట యాశ్వరాజ్ఞయై యున్నది. లేనిచో నెప్పటికిని జీవులు కృతార్థులు కాజాలరు. మఱియు సమస్తము భగవదిచ్ఛానుసారముగ

జరుగుచున్నదని స్వయముగా తెలిసికొనెడు జ్ఞానము కలుగవలెనుగదా, అర్జునునకు ప్రాకృతదృష్టి వదలి యప్రాకృతమగు దివ్యదృష్టి గలిగినపుడే సమస్తమును భగవత్స్వరూపముగా గోచరమైనది. ఇట్టిస్థితి యూహచే పొందదగినది కాదు. అనుభవముచే పొందదగినది. అందులకై అవిద్య నశింపవలయును. దీనియందీ శ్లోకము ముఖ్యము:—

శ్లో॥ మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః ।
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాండవ! ॥ (11–55)

తా॥ ఓ యర్జునా! ఎవడు ఈశ్వరార్పణబుద్ధితో సత్కర్మలజేయుచు నీశ్వరునే పరమశరణమని నమ్మి భగవద్భక్తిగలవాడై దేనియందును సంగములేక యే ప్రాణియందు వైరబుద్ధిలేకయుండునో యతడే నన్నుబొందునుగాని యన్యులు బొందలేరు.

ఓం తత్ సత్ ఓమ్



ఓమ్

# 12. భక్తియోగము

శ్లో॥ గీతా సుగీతా కర్తవ్యాకిమన్యైశ్శాస్త్రవిస్తరైః ।
యాస్స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా॥

తా॥ ఏగీత శ్రీకృష్ణపరమాత్మయొక్క ముఖకమలమునుండి స్వయముగా బయల్వెడలెనో అట్టి భగవద్గీతయే పఠింపదగినది. విస్తారమగు నితరశాస్త్రముల చేత నేమి ప్రయోజనము?

దీనియందు భక్తిని మిక్కుటముగాజెప్పినందుచే దీనికి 'భక్తియోగము'ని పేరు వచ్చినది. దీనిలో సగుణభక్తియు నిర్గుణభక్తియు నుపదేశింపబడెను. వీనిలో నేదిశ్రేష్ఠమని ప్రశ్నరాగా ఏదైనను సరే శ్రద్ధయను సుగుణముతోగూడి నిరంతరము భగవచ్చింతనముగలవాడెవడైనను వాడే శ్రేష్ఠుడని భగవంతుడుపదేశించెను, దేహాభిమానము, కులాభిమానము. ఆశ్రమాభిమానము, విద్యాభిమానము అధికారాభిమానము, రూపాభిమానము మొదలగు దేహసంబంధ బంధనముగలవారికి మోక్షప్రాప్తి గలుగుట ప్రయాసమని యుపదేశించిరి. ఇట్టి యభి

మానము ఆత్మను కనుపరచనీయక కప్పివేయుచుండును. మఱియు జ్ఞాన యోగమే అన్నిటికంటె శ్రేష్ఠమని తెలిపి యట్టి జ్ఞానయోగమునకు శక్తి చాలక పోయినచో ధ్యానసమాధియోగముల నుపదేశించిరి. దానికిని సామర్థ్యము లేని వారికి భక్తియోగము నుపదేశించిరి, అనన్యమగు భక్తియోగమును శీలించుటకు సమర్థతలేనిచో నిష్కామకర్మయోగము నాచరించిన చాలునని తెలిపిరి. దీనికిని సమర్థతలేని పక్షమున నెవరైనను సత్కర్మలాచరించుదానిని చూచి సంతోష పడిన సద్గతి గల్గునని వచించిరి, మఱియు తాను చేయుటకు నిష్టములేక ఎవ రైనను చేయుదానినిజూచి యసూయపడకుండుటయు, నాటంకము గలుగజేయ కుండుటయు పుణ్యమని యానతిచ్చిరి. కావున సత్కర్మలకు నాటంకముజేసి నరకమునకుబాల్పడకుండ చూచుట శ్రేయస్కరము. భగవద్భక్తుల కుండవల సిన సుగుణము లన్నింటిని బాగుగా నీ యధ్యాయమున దెల్పియున్నారు.

గీతాపారాయణము చేయువారు మొదటనుండి ప్రారంభింపక అనగా ప్రథమాధ్యాయమునుండి యారంభముచేయక నీ పంౘ్రెండవ యధ్యాయము నుండి మొదలుపెట్టుట మంచిదని పరంపరానుభవముగల పెద్దలు చెప్పుదురు. ఇది పారంపర్య ధర్మమనిగూడా తెలిపెదరు. అట్లయిన విఘ్నములుగూడ గలుగవని వచింతురు. ఈ యధ్యాయమున నమృతసమానములైన వాక్యములు గలవు. మఱియు నీ యధ్యాయ శ్లోకములు చాల చిన్నవి. అనుష్టుప్ ఛందస్సుతో గూడినవి. అంతియేగాక యిరువది శ్లోకములు మాత్రమే యిందు గలవు. మొదటి యధ్యాయము దుఃఖవార్తలతో గూడినది అది దుఃఖమును గుఱించిన కథలు గలదగుటచేతను, శ్లోకములుచాల పెద్దవగుటచేతను, ఎక్కువ శ్లోకము లుండుటచేతను, క్లేశమే దానియందు వివరింపబడి యుండుటచేతను పై విధమున జెప్పుటకు కారణమై యుండవచ్చును. శ్రీమద్భగవద్గీత యంతయును 4 భాగములలో నిమిడియున్నది, (1) కర్మ యోగము, ఇది మూడవ యధ్యాయమున గనదగును, (2) భక్తియోగము, ద్వాదశాధ్యాయమున వివరింపబడినది. (3) ధ్యానయోగము (అభ్యాసయోగము) ఇది ఆరవ యధ్యాయమున నుపదేశింపబడెను, (4) జ్ఞానయోగము ఇది పదునాల్గవ యధ్యాయమున గనదగును తక్కిన యధ్యాయములన్నియు వీటిలో నంతర్భూతములే.

మఱియు నీ గీత 'తత్త్వమసి' అను మహావాక్యమునే యుపదేశించుచున్న దనియు, మొదటి యారు అధ్యాయములు 'తత్' పదార్థమగు నీశ్వరుని గుఱిం

చియు. రెండవ ఆరు యధ్యాయములు 'త్వం' పదార్థమగు జీవునిగూర్చియు, మూడవ ఆరు యధ్యాయములు 'అసి' పదార్థమగు నైక్యమునుగూర్చియు నిరూపించుచున్నవని విజ్ఞులు దెల్పిరి. అనగా జీవేశ్వరైక్యమే గీతయొక్క సార మని మహనీయులయొక్క యభిప్రాయము. అన్ని యోగములును, అన్ని విద్య లును ఒక్కరియందుండవు. అవి యన్నియు సర్వేశ్వరునియందు మాత్రమే నిండియుండును. జీవుల సంస్కారము ననుసరించి భక్తియోగమందుగాని, కర్మ యోగమందుగాని, ధ్యానయోగమందు గాని, జ్ఞానయోగమందుగాని మనస్సు ప్రవర్తించును. కావున భక్తులు ఈ భక్తియోగమును, నిష్కామకర్మయోగులు మూడవ యధ్యాయమును, ధ్యానయోగులు ఆరవ అధ్యాయమును, జ్ఞానయోగులు నాల్గవ యధ్యాయమును ముఖ్యముగా బఠింపవలయును. ఒక్కొక్కరును నీ నాలుగు యోగములలోని యొక్కొక్కదానియందు యాధిక్యము గల్గియుండినను తక్కిన మూడు యోగములను మిశ్రరూపములుగా గల్గియుండవలెను. ఒకటి ముఖ్యముగాను, తక్కినవి గౌణముగాను నుండుటయే పవిత్ర మిశ్రధర్మ మగును. అట్లుగాక భక్తియోగమందుగాని, కర్మయోగమందుగాని, ధ్యానయోగమందు గాని, జ్ఞానయోగమందుగాని యాధిక్యము గలిగియుండినను తక్కినవాటిని నిందించుట చాల సంకుచితభావమే యగును. ఏ యోగమవలంబించిన వాడైనను నీ ద్వాదశాధ్యాయమున జెప్పియుండు దైవగుణముల నందఱును గలిగి యుండ వలయును. ఈ నాల్గు యోగములును సనాతనములు. వీటిలో నేయోగము ఏ కాలమున క్షయించినను, దాని నుద్ధరించుటకొఱకు నెవడో ఒక మహనీయుడు భూలోకమున నవతరించును. అప్పుడు దానికే యాత డాధిక్యమిచ్చును. ఇదే దీనిలో గల పరమరహస్యము మఱియొక కాలమున నింకొక యోగముక్షీణించి నపుడు దానిని పునరుద్ధరించుటకొఱకు మఱియొక దివ్యపురుషు డావిర్భవించును. ఆ మహనీయుడు దాని నవలంబించి దాని కగ్రస్థానమిచ్చును. ఈలాగున కాలచక్రము తిరుగుచుండును. ఇది యనాదిధర్మము. అనంతకాలమువఱకు నీ లాగుననే జరుగుచుండును. ఒక రాజ్యపరిపాలనము నందు చతురంగ బల ముండును. వారందఱును రాజ్యసంరక్షణయందును. అధికారమందును సమానులై యుందురు.వారిలో వైద్యశాస్త్రనిపుణులు 'మేమే ముఖ్యులము, మేము లేనిచో రోగములనుండి జనుల నెవరు రక్షింపగలరు,? అనియు, విద్యాశాఖ వారు 'మేమే అధికులము అందరకును మేమే విద్య చెప్పి బాగుపరచువారము మేము విద్య నేర్పనిచో మనుజులకును, జంతువులకును ఏమి భేదము?' అనియు

శత్రువులనుండి దేశమును సంరక్షించువారగు సైన్యాధిపతులు 'మేమే దేశ సంరక్షకులము, మేము లేనిచో దేశమును శత్రువులు ఆక్రమించెదరు, అనియు, నాల్గవవారగు మంత్రివర్గము మంచిచెడ్డలను విచారించి న్యాయబద్ధముగా మేమే రాజ్యపరిపాలన మొనర్చుచున్నారము, మేమే లేనిచో జనులు అన్యాయపరులై ప్రపంచమును నాశనమొనర్తురు. వైద్యుల ఆరోగ్యానారోగ్యములను, విద్యాధికుల మంచి చెడుగులను. సేనాధిపతుల కార్యాకార్యములను గుఱించి మేమే విచారణ జేయువారలమగుటచే మేమే యధికులము అనియు నిట్లు చెప్పబూనిన నదెట్లుండునో. పై విషయమును నాలాగుననే యుండును, ఇది ఎంతయో వివేక దూరమనియు, ఇది కేవలమవివేక పూరితవచనమనియు జనులెఱుంగు విధమున మేమధికుల మని చెప్పువారిని గూర్చియు వివేకులు తలంతురు. లేక శరీర కార్య నిర్వహణములో నేత్రమే ముఖ్యమని కన్నును, కర్ణమే యెక్కువని చెవియు, నాల్కే ప్రధానమని నోరును. ఘ్రాణమే యధికమని ముక్కును వచించి పోట్లాడుకొనిన నది యెంత స్వారస్యముగా నుండునో, అట్లే కరచరణాదులును. దంతములునుకూడ మాత్సర్యమును ప్రకటించిన నా దేహ స్థితి యెట్లుండునో, పైదానిచే లోకమునకు గలిగెడు ఫలితమును నాలాగుననే యుండును, కావున నట్టి యంధకారములో బడిపోగూడదని తలంచి శ్రీకృష్ణభగవానులు జీవకోట్ల సంస్కారము ప్రకారము ఈ నాల్గు యోగములను ఉపదేశించిరి, అందఱికిని నాత్మశుద్ధి, ఇంద్రియ నిగ్రహము, జీవకారుణ్యము, దైవభక్తియు. నిరంతర పరమేశ్వర ధ్యానమును సమానముగానే యుండవలెను. అయితే యిచ్చట భక్తులకొక సందేహము కలుగవచ్చును. అదేమన పుణ్యకర్మాదులను ఫలాపేక్ష లేక ఈశ్వరార్పణబుద్ధితో జేయుటచే ఆత్మశుద్ధి గల్గి జ్ఞానముదయమై మోక్షము కలుగుట నిజముగ నుండవచ్చును, కాని యోగ, సమాధి,తపస్సులవలన గలిగెడు ఆత్మశక్తియు, దివ్యప్రజ్ఞయు, యోగసిద్ధులును వీరికిగూడ గలుగునా? అనుచో దీనికి సమాధానమేమన... నిష్కామకర్మయోగము ఈశ్వరార్పణబుద్ధితో చేయుచు రాగా రాగా నాత్మయొక్క యావరణములు తొలగిపోయి స్వరూపజ్ఞానము గల్గి ముక్తి గల్గుట నిక్కము, కాని యోగసమాధులచేతను, తపోనిష్ఠాదులచేతను గలిగెడు అప్రాకృత దైవశక్తిమాత్రము గలుగుట దుస్తరము. ఏలన, అనేక మహర్షులు దివ్యప్రభావము గలవారై తపస్సువలనను, యోగాభ్యాస మహిమ వలనను నట్టి యతీంద్రియ జ్ఞానము గలవారైరి. కాని యోగము తపస్సు ఇవన్నియు నిర్విఘ్నముగ ఫలసిద్ధి గలుగవలసియుండిన చిరకాలము పుణ్య

కర్మలు ఈశ్వరార్పణబుద్ధితో తప్పక చేయవలసియుండును. లేనిచో యోగ సమాధులకు అర్హత గలుగదు. ఇదే యిందులో గల రహస్యము. వైరాగ్య బోధోపరతుల ఫలములను గురించి పంచదశియందు తెలుపబడినది. ఒక్కొక్క దానివలని ప్రయోజనమువటు ప్రత్యేకముగా జెప్పబడినది. వానియందు గాంచ వచ్చును. ఈ యధ్యాయమున నీ శ్లోకము ముఖ్యము.

శ్లో॥ యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్ధధానామత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥ (12-20)

తా॥ ఎవరు ఈశ్వరునే పరమగతి యని నమ్మి మోక్షప్రదమగు నీ యమృతవాక్యములను నేను చెప్పిన విధమున నాచరించి శ్రద్ధతో నడచుకొను చున్నారో, అట్టి భక్తిగలవారు నాకు మిక్కిలి ప్రియులు.

ఓమ్ తత్ సత్

★

ఓమ్

# 13. క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

శ్లో॥ భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా।
అశ్వత్థామ వికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకః కేశవః ॥

తా॥ పాండవులు శ్రీ కేశవుడను నావికుని సహాయముగొని భీష్మాచార్య ద్రోణాచార్యులను తీరములుగలదియు, జయద్రథుడను జలముగలదియు, శకుని యను నల్లకలువగలదియు, శల్యుడను మొసలిగలదియు, కృపాచార్యుడను మార్గము గలదియు, కర్ణుడను కల్లోలములతో గూడినదియు, అశ్వత్థామ వికర్ణు లను పెద్దచేపలు గలదియు దుర్యోధనుడను పెద్దసుడిగుంట గలదియు నగు రణనదిని దాటిరి.

క్షేత్రమనగా శరీరము. క్షేత్రజ్ఞుడనగా జీవుడు. ఈ రెండింటియొక్క విభాగము దీనియందు నిరూపింపబడి యుండుటచే దీనికి 'క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగమని' పేరు వచ్చినది. ఆత్మ యెటువంటిది? అనాత్మ స్వరూపమెట్టిది?

అని తెలిసికొనవలెనని భగవదాశయము. కొందరు ఆత్మానాత్మ విచారము భక్తులకుగాని నిష్కామ కర్మయోగులకుగాని యవసరములేదని వాదింతురు. శ్రీభగవానుల యభిప్రాయమట్లుగాదు. భక్తి గలిగినను ఆత్మ యిటువంటిది. అనాత్మ యిటువంటిది, ప్రకృతి యిటువంటిది, పురుషుడిటువంటివాడని తెలియక పోయిన నాత్మయందు నిత్యబుద్ధియు, అనాత్మయం దనిత్యబుద్ధియు గలుగదు. కావుననే నాయొక్క భక్తులుగూడా దీనిని తెలిసికొనియే ముక్తిని పొందుచున్నారని 19 వ శ్లోకమున భగవానులు చెప్పుటకు కారణము. మఱియు దీనియందు మొదట ఆరు ప్రశ్నల నర్జునుడడిగి యున్నాడు. (1) ప్రకృతి యనగా నెట్టిది? (2) పురుషుడనగా నెవడు? (3) క్షేత్రమనగా నెటువంటిది? (4) క్షేత్రజ్ఞు డెట్టివాడు? (5) జ్ఞానమనగా దేనికి పేరు? (6) జ్ఞేయమనగా నేమి? ఈ ప్రశ్నలలో నాఖరునగల ప్రశ్నలు రెండును ముఖ్యములు. కనుకనే పై ప్రశ్నలలోని మొదటి నాల్గింటికి సామాన్యముగా నర్థముచెప్పి తుది రెండు ప్రశ్నలకు విశేషముగా నర్థము జెప్పుటకు గారణము. ఇచట జ్ఞానమునే జ్ఞేయమనియు, జ్ఞేయమునే యాత్మజ్ఞానమనియు దలపక జ్ఞానికి నుండవలసిన సుగుణములను జ్ఞానమనియు, దైవసాక్షాత్కారమును జ్ఞేయమనియు గ్రహించుకొనవలెను. ఇట్లు జ్ఞాని కుండవలసిన ధర్మములు ఇరువది జెప్పియున్నారు. ఈ గుణములు గల వాడే జ్ఞానియని తెలిసికొనవలయును. ఈ గుణములకు భిన్నములగు ప్రకృతి గుణము లెవనియందు గన్పించునో వానిని యజ్ఞాని యనియే నిశ్చయింపవలెను. సాధకులు గూడా తమయందు శ్రీ భగవాను లుపదేశించిన జ్ఞానగుణములకు భిన్నములగు ప్రకృతిగుణము (దుర్గుణము) లుండినవానిని అవిద్యాగుణములని యెఱింగి యట్టి దుష్టగుణములను రహిత మొనర్చుకొనవలెను.

మఱియొక్క రహస్యమీ యధ్యాయమున గలదు. అదేమన జ్ఞానికి ఉండవలసిన అమానిత్వాదులగు నిరువది సుగుణములు పూర్తిగా గలిగియుండినను తమ పని పూర్తియైనదని సాధకులు తలంపరాదు. జ్ఞేయమగు బ్రహ్మసాక్షాత్కారము గలిగిన మాత్రమే యమృతత్వము గలుగునని శ్రీ భగవానులుపదేశించిరి. జ్ఞానగుణము పూర్తియైననే జ్ఞేయములో ప్రవేశించుట కర్హత కలుగును. దీనిలో నేదైననొకటి పూర్తిగా లేనిచో జ్ఞేయమును బొందుట కర్హత లేదని గ్రహింపవలయును. ఏదైన నొక ఉన్నతోద్యోగమునకై కావలసిన పరీక్షలలో నుత్తీర్ణులుకానిచో నా పదవికి జనులెట్లు యోగ్యులుకారో, ఆలాగున బ్రహ్మవిద్యయందును నిట్టి నియమముగలదు. కనుకనే యర్జునుడు మొదట

జ్ఞానము నడిగిన తర్వాత జ్ఞేయము నడుగుట కారణమైనది. భగవానులుగూడా జ్ఞానము నుపదేశించిన తరువాత జ్ఞేయమగు బ్రహ్మము నుపదేశించెను. అట్లు గాక మొదటనే నీతిని నిష్ఠను ఉపదేశింపక బ్రహ్మము నుపదేశించువారు తైలము, ప్రత్తి ప్రమిద వీటిని మొదట నమర్చక దీపమును వెలిగించువారి చందమున నుందురు. ఆ దీపమునిలుచునా? తైలాదులు మూడును సిద్ధ పరచిన తరువాత బ్రహ్మజ్ఞానజ్యోతిని వెలిగించిన నది వెలుగుచుండును. తైలాదిత్రయ ముచే దీపము వెలిగించినను గృహాంతరాళములయందు నేదైనకిటికీలద్వారాగాని తలుపులద్వారాగాని గాలివచ్చిన దీపమారిపోవును. అపుడుగాలి వలన దీపమునకు నపాయము గలుగునని తెలిసిన నాద్వారమునునెట్లు మూసివేయుదురో, అలాగున శమదమాదులు గలిగి బ్రహ్మోపదేశము సిద్ధించినను విక్షేపాది విషయ వాస నలు గలుగుచుండిన నట్టిదానినుండి విముక్తి గలుగుటకు తగిన ప్రయత్న ములు చేసికొని ధ్యానధారణాదులను, మనన నిధిధ్యాసములను బాగుగా నభ్య సించుకొనవలెను. దీనికే జ్ఞానపరీక్ష యనిపేరు, మనమొక పరీక్షకు చదువు చుండునపుడు కొన్ని పాఠములలో నుత్తీర్ణులై మఱికొన్నిటిలో తప్పినచో మరు సంవత్సరము వాటినేలాగున పూర్తిచేయుదుమో, అలాగున బ్రహ్మనిష్ఠులకుండ వలసిన సుగుణములలోను కొఱతకలిగిన మఱియొక జన్మలో నాకొరతను పూర్తి జేసికొనిననే మోక్షపదమున కర్హత కలుగును, ఇట్టివారే బాల్యకాలము నుండి విరక్తులై బ్రహ్మనిష్ఠగలవారుగా జన్మింతురు. కడచిన జన్మలోనే ప్రతి బంధములు గల్గి మోక్షము లభింపక పోయినచో అట్టి ప్రతిబంధము లేవియు లేని యుత్కృష్ట జన్మము ఈశ్వరకృపచే గల్గును. దీనియందేలాంటి సందేహ మును లేదు. జీవించియుండగనే జీవుడిచట నుండగనే నిశ్శేష వాసనారాహి త్యము గలిగి తాను బ్రహ్మసుఖము నొందవలయు. 'నాయందు ప్రకృతి దోష మంతయు నశించినది. నేను నిత్య సుఖము పొందితిని. నేను అఖండ జ్ఞాన స్వరూపుడను, ప్రకృతిగాని, ప్రకృతిదోషములు గాని యిప్పుడు నాయందే మాత్రము కనిపించుటలేదు. అంతయు శాంతిమయము, జ్ఞానమయము, పుణ్య మయము, ఆనందమయము, అనుబోధ కలుగవలెను. ఏలాగున రోగియైన వాడు ఔషధసేవచే నారోగ్యము గలుగునపుడు 'నాబాధలన్నియు పోయినవి. ఏలాటి దుఃఖమును నాకులేదు, ఆరోగ్యముగ నున్నా'నని చెప్పునో అలాగున నజ్ఞానము నశించిన జ్ఞానికూడా ప్రకృతివలన కలిగెడు దుఃఖములన్నియు నశిం చినవాడై యుండును. కావుననే మోక్షదశయందు నతిహర్షము గలుగునని

శ్రుతి వాక్యములయొక్క సారము, నిశ్శేష శోకశాంతియు నప్పుడు సిద్ధించునని శాస్త్రములు చెప్పెడి రహస్యము. ఆకలి దప్పికలచే పీడితుడై మండుటెండలో తపించుచు నెడారిలో ప్రయాణము చేయువాడు చల్లని నీడయు, శీతలోదకము, తృప్తిగ మంచిభోజనమును పొందినచో నేలాగున పూర్ణతృప్తుడగునో, అలాగున తాపత్రయాగ్నిచే తపించి సంసారమను యెడారిలో ప్రయాణము చేయు జీవికి గూడ మోక్షసుఖము గలుగునప్పుడు పూర్ణతృప్తి గలుగును. కనుకనే నిశ్శేష దుఃఖనివృత్తి నిరతిశయ సౌఖ్యమును ముక్తిదశయందు గలుగునని వచించు టకు గారణము. తక్కిన సౌఖ్యము లొకవేళ గలిగినను క్షణకాలములో నశించి పోవును. ఈ కైవల్యసుఖమునకు పతనమనునది లేదు. ఎన్ని యుగములుగాని, కల్పములుగాని పోయినను దానికి క్షయము గలుగదు. ఈ యధ్యాయమునందీ శ్లోకము ముఖ్యము:—

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ (13-28)

ఎవడుబ్రహ్మాది స్తంభపర్యంతముగల సమస్త ప్రాణులందు సమానముగ నుండునో, వస్తుసముదాయము నశించుచున్నను ఎవడు నాశనము నొందడో, అట్టి పరమేశ్వరుని సమస్తములోను సమానముగాఁ జూచువాడే నిజముగ చూచువాడు. తక్కిన వారలు నేత్రములు గలవారైనను నేత్రములు లేనివానితో సమానులే.

పాంచభౌతికమగు నీ దృష్టి పంచభూత సముదాయముచే నుద్భూతము లైన వస్తువులను మాత్రము చూడగలుగును. ఆత్మ (బ్రహ్మ) పంచభూత విల క్షణము గాన దానిని చూడవలెననిన దివ్యదృష్టి గలుగవలెను. అనగా ఆత్మ యొక్క యావరణము లన్నియుఁ దొలగవలెను. జ్ఞానము అనగా జ్ఞాని కుండ వలసిన గుణములు సంపూర్ణముగ గలిగియున్నను జ్ఞేయమును పొందనిచో నమృతత్త్వము గలుగదని ఈ యధ్యాయమునభగవంతుడు విస్పష్టముగా జెప్పు టచే నీ జ్ఞేయపదమును గూర్చి బాగుగ యోచింప వలసియున్నది. ఇప్పుడు చాల మంది జనులు ఏదైన కొంత పరోపకారము చేయుట చేతను కొన్ని సత్కర్మల నాచరించుట చేతను, కొంత లోకసేవ యొనర్చుటచేతను, కొంత సదాచార నిష్ఠ గలిగి యుండుటచేతను తాము ధన్యులమైతిమనియు దానికంటె పరమైనది పొందదగినది లేదనియు తలంచి సంతుష్టులగుచున్నారు. దానివలన తృప్తి

బొందక జ్ఞేయమగు బ్రహ్మమును అనగా నాత్మసాక్షాత్కార స్వరూపమును అను భవము లోనికి తీసికొని వచ్చుటకై ప్రయత్నింపక కృతకృత్యులమైతిమని తలంపవలదనియే భగవదాశయము. అయితే ఇపుడు కొంత పరోపకారము చేతనే తామందఱికంటె శ్రేష్ఠులమైతిమని తలంచుటకు కారణమేమన—అంత మాత్రమైనను సత్కర్మ చేయువా రిక్కాలమున నరుదైరి. అంతియేగాక జ్ఞేయ మగు బ్రహ్మలో స్థితికల్గిన ఈ బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు తాపసోత్తములు, యోగ నిష్ఠులు, ఇపుడు మిక్కిలి యరుదై పోయినందుచేతను నిట్టి యభిప్రాయము వీరికిఁ గలుగుటకు కారణమైనది. ఎట్లన నొక దేశములో వృక్షములే లేవు. అచ్చోట నాముదపుచెట్టు గొప్ప మ్రాను అని తలంచి గర్వపడుదురు. మఱియు నింకొక దేశమున పాములే లేవఁట అచట భూనాగము (ఎఱ్ఱ) ఆదిశేషుఁడుగా తలంపబడునట. ప్రస్తుతము మనయొక్క దేశస్థితియు నీలాగునపరిణమించినది

ఓమ్ తత్ సత్.

-:(o):-

ఓమ్

# 14. గుణత్రయ విభాగయోగము

శ్లో॥ భగవద్గీతా కించిదధీతా గంగాజల లవకణికా పీతా ।
నకృదపియేన మురారిసమర్చాక్రియతే తస్యయమోఽపి న చర్చామ్॥

తా॥ ఎవడు భగవద్గీతను కొంచముగానైన నధ్యయనము చేసియున్నాడో గంగానదిలోని యొక్క నీటిబిందువునైన త్రాగి యున్నాడో, ఒకసారియైన భగ వంతుని అర్చించి యున్నాడో, యట్టివానిని గూర్చి యముడుకూడా చర్చించడు అనగా యముడుగూడ దరిజేరడు.

మూడు గుణములచే జీవుడెట్లు బద్ధుడగునో, ఆ విషయమును గూర్చి చెప్పిన దగుటచే నీ యధ్యాయమునకు 'గుణత్రయ విభాగయోగమ'ని పేరు వచ్చినది. గీతయందింత ప్రాముఖ్యము గల యధ్యాయము మఱియొకటిలేదు. ఇది జ్ఞానయోగమున జేరినది. చాల మేధాసంపత్తిగలవారికి మాత్రమే యిది అర్థమగును, చిత్తశుద్ధియు, ఏకాగ్రతయు గలవారలకు విద్య లేనప్పటికిని ఇది యర్థమగును. మహాపండితులైనను. అంతఃకరణశుద్ధియు, చిత్తైకాగ్రతయు,

సంయమమును లేనిచో నిది యర్థముగాదు, నేత్రము గలవారు విద్యలేనివారై నను నేలాగున సూర్యుని జూడ గల్గుదురో, నేత్రహీనులైనవారలెంత శాస్త్ర పాండిత్యము గల్గినవారైనను నేలాగున చూడజాలరో, బ్రహ్మ విద్యయొక్క రహస్యమును నిట్టిదే. ఇది కఠినభాగమగుటచే మొదటి శ్లోకములో శ్రీ భగ వానులు ఇది జ్ఞానమన్నిటిలోను ఉత్తమజ్ఞానమనియు, ఋషులందఱును నిట్టి జ్ఞానముగలవారగుటచే నాజన్మలోనే ముక్తిని బొందిరనియు చెప్పుటకు కారణము.

ఈశ్వరస్వరూపమగు ఆత్మకు మాలిన్య మెవ్విధమున గలిగినది? దేని వలన ప్రకృతియందు బంధింపబడినది? మఱల నెట్లు ఈ మాయామాలిన్యము నుండి తొలగును? ఏలాగున దానికి ప్రకృతి బంధమునుండి విముక్తిగల్గును? ప్రకృతిదోషము నశించుటకు ముఖ్యసాధనమెద్ది? ఎవరెవ రేయేగుణములతో గూడియుండిరో యెట్లు తెలియును? ఏ యేగుణము గల్గియుండునపుడు దేహ మును వీడిన నేయే లోకమును బొందును? మఱల నతనికి యే జన్మము గలు గును? జీవన్ముక్తుని లక్షణ మెటువంటిది? మున్నగు విషయములన్నియు నిందు విశదముగా తెలుపబడినవి, స్వయముగా దెలిసికొన సమర్థతలేనివారు గొప్ప మేధాసంపత్తిగలవారును ఆత్మజ్ఞానులు నగువారియొద్ద నీయధ్యాయ మును దెలిసికొనుటయే మేలు. దీనియందు శుష్కవేదాంతమునకు తావులేదు. ఏలన, గుణములు ఇంద్రియములకు స్వభావములనియు, నీవుసాక్షిగా నున్నట్లు తలంచిన చాలుననియు, అట్లైన నేకార్యము చేసినను బంధము లేదనియు చెప్పెడు వాక్యమసత్యప్రలాపమని ఈయధ్యాయము భేరీనాదమొనర్చి చెప్పు చున్నది. ఇది సత్య వేదముయొక్కనిజార్థము. గుణము లింద్రియములకు స్వాభావికములు గావనియు. అవి కర్మసంస్కారముననుసరించి ఆగంతుకముగ వచ్చిచేరిన వనియు, అట్టి దోషములు రహితములు కావలయుననియు శ్రీ భగ వానులుపదేశించిరి. ఈ విషయము రెండవ యధ్యాయములో గల "మాత్రాస్ప ర్శాస్తు కౌన్తేయ" అనుశ్లోకమునవ్యక్తీకరింపబడినది. ఆగంతుక మనగా మధ్య వచ్చిచేరినది. ఎట్లన వస్త్రముయొక్క నిజరూపముతెలుపైనను రంగులచే ననేక వర్ణములుగ కన్పించును, అది యసలువస్త్రము స్వభావము గాదనియు, రంగు లచే గల్గినదనియు నెట్లు గ్రహించుచున్నామో అలాగున జీవులయొక్క స్థితిని గూర్చియు ముముక్షువులు తెలిసికొనవచ్చును, ఎటువంటిరంగు వస్త్రమైనను ద్రావకములోవేసి ఉడకబెట్టి ఉతికినచో రంగులన్నియు వదలిపోయి తెలుపు వర్ణము తేలునట్లు దైవచింతనలో మగ్నులై ధ్యానములోమునిగి, భవదోషము

గలుగనీయక చూడవలెనని యీయధ్యాయముపదేశించుచున్నది. ఇందుమూడు గుణములు మాత్రము చెప్పిరేకాని విశుద్ధగుణమును చెప్పలేదని కొందఱు తలంపవచ్చు. గుణత్రయాతీతుని లక్షణము నీయధ్యాయమున జెప్పియుండుటచే నట్టిసందేహము కలుగుటకు నవకాశములేదు. భగవద్భక్తియను ద్రావకములో జీవునిశుద్ధమొనర్చవలె నని, ఈయధ్యాయాంతమున భగవాను లుపదేశించిరి. కావున నిర్మలమైనభక్తి యొక్క దానివలననే ప్రకృతిదోషములన్నియు తొలగి జీవకోట్లు భగవత్ప్రాప్తిని బడయ గలవు. కావునముముక్షువులును, భక్తులును, తక్కినవారందురును నీ ప్రకృతిగుణములలో నేవి తమయందు గలవో విచారించుకొని వానిని కనిపెట్టి యట్టిదోషములు తమయందు లేకుండునట్లు చూడ వలెను, ఈ యధ్యాయమున నీ శ్లోకము ముఖ్యము;—

శ్లో॥ గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే॥(14-20)

దేహము గలుగుటకు కారణభూతమైన సత్త్వరజస్తమో గుణములను దేహియెప్పు డతిక్రమించునో. అప్పుడతడు జన్మమృత్యుజరాదుఃఖములచే విడువబడి మోక్షము నొందును.

ఓం తత్ సత్.

ఓమ్

# 15. పురుషోత్తమప్రాప్తియోగము

శ్లో॥ సంసారసాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః ।
గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥

తా॥ ఎవడు భయంకరమగు సంసారసముద్రమును దాటగోరుచున్నాడో అతడు గీతయను నావ నాశ్రయించినయెడల సుఖముగా తీరమును జేరుచున్నాడు.

పురుషోత్తముడనియు. భగవంతుడనియు, పరమేశ్వరుడనియు, పరబ్రహ్మమనియు చెప్పినను నొకే యర్థమే. అట్టి సర్వేశ్వరునిబొందుటకు తగిన పద్ధతి యీయధ్యాయమునందు జెప్పబడినందున దీనికి 'పురుషోత్తమ ప్రాప్తియోగ'మని పేరువచ్చినది. ఈ యధ్యాయములో చెప్పినట్లాచరించువారికి పరమపదప్రాప్తి గలుగును. అనగా మోక్షముసిద్ధించును. అదేపురుషోత్తమ ప్రాప్తియనియు,

భగవదైక్యమనియు తెలియదగును అనుష్ఠానపరులందఱును నీ యధ్యాయమును భోజన కాలమున పఠించి భుజించెదరు. అట్లు వేయువారలకు మహాపుణ్యము గలుగుననియు, పఠించనివారు భక్తితో వినుచుండినను పుణ్యప్రాప్తి చెందుదురనియు ననాదినుండియు వదంతి యున్నది. ఈ విషయమై మహాభగవద్గీత 15-వ అధ్యాయ ఫలశ్రుతి జూడదగును. మఱియు గీతలో 18 అధ్యాయములుండగా నీ యధ్యాయమును మాత్రమేల పఠించ వలయును? ఇతర అధ్యాయములలో దేనినైన భోజన సమయములో పారాయణచేయ రాదా? యని సందేహము గలుగవచ్చును, సన్న్యాసులందఱును భోజనకాలమున దీనిని పారాయణచేయుదురు. సన్న్యాసులు మాత్రముగాక బ్రహ్మనిష్ఠులందఱును నాలాగున నాచరింతురు, దానికి కారణమేమన—14-వ శ్లో. లో భగవంతుడీలాగున నుపదేశించి యున్నారు.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥

తా॥ నేను జఠరాగ్ని స్వరూపుడనై ప్రాణుల దేహముల నాశ్రయించి ప్రాణాపాన వాయువుతో గూడుకొన్నవాడనై ప్రాణికోట్లు భుజించెడు (భక్ష్యభోజ్యలేహ్యచోష్యములనియెడు) నాల్గు విధములగు అన్నమును పచనము చేయుచున్నాను.

ఇది బ్రహ్మనిష్ఠులకు; పరమభక్తులకు చాల ముఖ్యమైన శ్లోకము. అయ్యది (భోజనకాలములో పఠించుట) భోజన కాలములోగూడ పంచప్రాణములకు, పంచ జ్ఞానేంద్రియములకు, పంచకర్మేంద్రియములకు, పంచ తన్మాత్రలకు నాత్మ విలక్షణ స్వరూపమని భావన చేసికొనుటకొరకే యగును. లేక నీ జీవసంజ్ఞతో ప్రకాశించువాడు కేవలము భగవత్స్వరూపుడే అట్టి ఆత్మైక్యాను సంధానపరులై యుండవలెననునర్థమున దీనియందు స్ఫురించుచున్నది. దీనిలోమొదటనే ప్రపంచ వృక్షముయొక్క వర్ణన చేయబడినది. అట్టి సంసారవృక్షమును నరికివేసిన మాత్రమే జనన మరణ దుఃఖములు నశించి జీవుడు మోక్షము నొందగల్గును. ఆ విషయములన్నియు దీనిలో విశదీకరింపబడియున్నవి. ముఖ్యముగా సంసార వృక్షము అనగా నజ్ఞాన వృక్షము ఎట్టిదో, దానిని నఱికెడి గొడ్డలి యెట్టిదో ముముక్షువులు తెలిసికొనవలసి యున్నది. వృక్షము లన్నింటికిని మూలము క్రిందుగాను, అగ్రము పైగానుండును. ఈసంసార మహావృక్షమునకు మూలము పైభాగమున, అగ్రము క్రింది భాగమున నుండునని శ్రీభగవానులు వర్ణించిరి.

ఇది యాశ్చర్యకరము. ఈలాగున నెచ్చటనైనా యుండునా? ఇదియే దీనిలోగల మర్మము. ఆత్మచింతను లందఱును, పరమభక్తు లందఱును ఈ రహస్యమును తెలిసికొనవలెను. స్వయముగా తెలిసికొనశక్తి లేనివారు ఉత్తమగురువుల వలననైనను గ్రహించుకొనవచ్చును. కనుకనే ప్రారంభములోనే 'ఊర్ధ్వమూల మధశ్శాఖ' మని ఆరంభించిరి. ఈ వ్యాసములో దేనికిని ప్రమాణశ్లోకములు వ్రాయగూడదని తలంచడమైనది. ఏలన, గ్రంథము పెరిగిపోవును. అయినను ఇది యమూల్యవిషయమగుటచేతను, ముముక్షువులు ముఖ్యముగా తెలిసికొన దగిన దగుటచేతను శ్రుతి స్మృతులందలి రెండు వాక్యములు మాత్రము వ్రాయ దలంచడమైనది. ఆ సంసారవృక్ష మెటువంటిదో, యిట వర్ణింపబడుచున్నది.

శ్లో॥ అవ్యక్తమూల ప్రభవ స్తస్యైవాను గ్రహోత్థితః।
బుద్ధిస్కన్ధమయశ్చైవ ఇంద్రియాంతర కోటరః!
,, మహాభూత ప్రశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా।
ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః॥
,, ఆజీవ్యసర్వవృక్షాణాం బ్రహ్మవృక్షస్సనాతనః।
ఏతద్బ్రహ్మవనం చైవ బ్రహ్మా చరతి నిత్యశః॥
,, ఏతచ్ఛిత్వా చ భిత్వా చ జ్ఞానేన పరమాసినా।
తతశ్చాత్మరతిం ప్రాప్య యస్మాన్నా వర్తతే పునః॥

తా॥ అవ్యాకృతము (మూలప్రకృతి లేక మాయ). అనెడు వేరునుండి పుట్టి, యావేరు గట్టిదగుటంజేసి క్రమముగా విస్తరించి పెరుగుచున్నదియు, బుద్ధియనెడు మ్రాను గలదియు, నేత్రేంద్రియాది రంధ్రములే తొఱ్ఱలుగా గలదియు, పృథివ్యాది పంచభూతములే పెద్ద కొమ్మలుగా గలదియు, శబ్దాది విషయములే ఆకులుగా గలదియు, ధర్మాధర్మములనెడు మంచిపుష్పములు గలదియు, సుఖ దుఃఖ పుణ్యాపాపములనెడు పండ్లు గలదియు, వృక్షము పక్షులకువలె సమస్తప్రాణు లకు జీవనాధారమైనదియు, చిరకాలమునకు బ్రహ్మజ్ఞానము గలిగిన పిమ్మట పోవునది యగుటబట్టి బహు పురాతనమైనదగు బ్రహ్మమే యధిష్ఠానముగాఁ గన బడునదియు నగు నీ సంసారమనెడు వృక్షమే పరమాత్మకు విహారస్థానమగు వనమై యున్నది. అవ్యక్తమనియు, అవిద్యయనియు, ప్రకృతియనియు, ప్రధాన మనియు, మాయయనియు, అజ్ఞానమనియు చెప్పిన నొకే యర్థము.

"ఓం తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నం. అన్నాత్పురుషః ॥ (తైత్తిరీయోపనిషత్తు)

తా॥ ఆత్మశబ్దవాచ్యమును సత్యజ్ఞానానంద స్వరూపమునగు నా పరబ్రహ్మము నుండి సమస్తభూతములకును నవకాశము నిచ్చుచున్న ఆకాశము పుట్టినది. ఆకాశమునుండి వాయువును, వాయువునుండి యగ్నియు, అగ్నినుండి జలమును, జలమునుండి పృథివియు, పృథివినుండి తరుగుల్మలతాదులు సమస్త సస్యములును స్వరూపములుగా గల ఓషధులును పుట్టినవి. ఆ యోషధులవలన నన్నము పుట్టినది. రేతోరూపముగా పరిణమించిన యా యన్నమువలన శిరస్సు, హస్తము మొదలైన యవయవములతోగూడిన యాకృతి గల పురుషుడు పుట్టెను.

భగవంతుడుపదేశించినందున ఇది చాలా రహస్యమైనది. మూల ప్రకృతినుండియే యీ సృష్టి ప్రారంభమైనదనియు, నట్టి మూలావిద్యను ఛేదించిన మాత్రమే యజ్ఞానవృక్షము నశించుననియు, ఈశ్వర సాక్షాత్కార జ్ఞానము వలన మాత్రమే దానికి వినాశము గల్గుననియు వచించిరి. భోజనకాలములో నిట్టి పవిత్రపారాయణవలన మనస్సు ఈశ్వర విషయములో మగ్నమై యుండును. అలాగున భుజించెడి అన్నాది పదార్థము లతిపవిత్రములై యుండును. అట్టి అన్నపానాదులచే హృదయము చాలా నిర్మలత్వము నొందును. భోజనసమయములో నెవడెట్టి భావము గలిగియుండునో, అట్టి గుణమాతనికి తప్పక గలుగునని దివ్యదృష్టిగలవారి యాశయము. కావుననే మంత్రపూతముగా నొనర్చి భుజింపవలయునని చెప్పెడి రహస్యము, అట్టి దివ్యమంత్రములు జపించవలసి యుండుటచే నితరములగు వ్యర్థవాక్యములుగాని తలంపులుగాని చేయుట కవకాశ ముండదు. ఋషులందఱును మంత్రముల సృష్టించుట కిదియే కారణము. కనుకనే భోజనము కొంత రహస్యస్థలములో చేయవలయుననియు, ఆ సమయములో మాట్లాడగూడదనియు నేర్పరచిన రహస్యము. స్వయముగా దైవభావము గలిగియుండుట సామాన్యులకు దుస్తరమని తలంచి మంత్రములేర్పరచిరి. కాల మహిమచే నిప్పుడట్టి మంత్రములను జపమొనర్చి భుజించువారరుదైరి. ఒకవేళ నోటితో కొందరుచ్చరించుచున్నను మనస్సులో నీశ్వరభావము లేకపోవుచున్నది. అందువలననే యట్టి యన్నాదులు దుష్పరిణామముబొంది, వానివలన నేర్పడు స్త్రీ పురుషశుక్లశోణితములు నశుద్ధము లగుచున్నవి. అందువలన పుట్టెడి బిడ్డలు యశస్సు, ఓజస్సును లేని వారగుటకు, అధర్మప్రవర్తనులగుటకును

కారణమగుచున్నది. మంత్రములను మాత్రమొకవేళ యుచ్చరించుచుండిన భావము లేక పోయిన అదిన్ని అంత ఫలమును గలుగజేయదని జ్ఞాపకముంచు కొనవలెను. కనుకనే వాచ్యవాచకముల యైక్యము గలిగియుండవలెనని చెప్పెడి రహస్యము, వాక్యముకన్న భావమే గొప్పదైనను, అట్టి మంత్రము లేనిచో భావముకూడ చేయరని తలంచి కరుణా మూర్తులగు పరమఋషులు మంత్రము లను గూడ పఠించవలెనని నిర్ణయించిరి. కలికాలమహిమచే దీనిని ఆచరించు వారే లేకపోయిరి. ఈ యధ్యాయమున నీ శ్లోకము ముఖ్యము.

శ్లో॥ యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥ (15.11)

తా॥ ధ్యానాదులచే బ్రహ్మస్వరూపమునుఁ దెలిసికొనుటకు ప్రయత్నము చేయుచున్న ధ్యానయోగులు (జ్ఞానులు) తమ యందున్నట్టి యీ యాత్మను దర్శించుచున్నారు. ధ్యానభజనాది ప్రయత్నములు చేయుచున్నను చిత్తశుద్ధి లేని యవివేకులు ఈ యాత్మను తెలిసికొనజాలకున్నారు. ఓం తత్ సత్



ఓమ్

## పంచదశాధ్యాయ మాహాత్మ్యము



శ్లో॥ కృష్ణోజానాతి వై సమ్యక్ క్వచిత్ కౌన్తేయ ఏవ చ ।
వ్యాసో వా వ్యాసపుత్రో వా యాజ్ఞవల్క్యోఽథ మైథిలః ॥

తా॥ భగవద్గీతయొక్క సంపూర్ణార్థమును శ్రీకృష్ణభగవానుడొక్కడే యెఱుగును. అర్జునుడును, వ్యాసుడును, శుకదేవుడును, యాజ్ఞవల్క్యుడును, జనకమహారాజును కొంచెము కొంచెముగా తెలిసికొని యున్నారు. ఇట్లుండగా సామాన్యమనుజుడు ఈ గీతార్థమును సంపూర్ణముగ నెట్లు తెలిసికొనగలడు?

భోజనకాలమున నీ యధ్యాయమును పారాయణచేయు విషయమై శ్రీమహా భగవద్గీతయందు కారణము జెప్పబడెను. ఈ ఒక్కఅధ్యాయమునకే గాక ప్రతి అధ్యాయమునకు పారాయణఫలము, దానికి కారణమును నిరూపింపబడినది. ఈ వ్యాస మతిసంక్షిప్తమగుటచే దాని నిట వ్రాయలేదు, అచట నీ అధ్యాయ మాహాత్మ్యము గూడ గనదగును. కాని ఈ పంచదశాధ్యాయమును గూర్చి మరియొక్క యితిహాసముగలదు. అదేమనగా:—

ఒక యగ్రహారమున నిద్దరు బ్రాహ్మణులు భోజనకాలమున గీతాపారాయణమునుచేసి భుజించు స్వభావముగలవారై యుండిరి. వారుభయులను గొప్ప శాస్త్రవేత్తలు, సుమారు ఒకరోజు ప్రయాణముచేయదగిన దూరమునగల భూపాలుని దగ్గరకువెళ్ళి తమ పాండిత్యమును ప్రదర్శించి గొప్ప బహుమతిని పొందదలంచి యుభయులును రాత్రి నాల్గవ యామారంభములో స్నానమాచరించి అన్నము కట్టుకొని పయన మయిరి. మధ్యాహ్నమున కొక అడవి ప్రదేశమునకు చేరిరి. అచ్చోట మంచి జలాశయమును వృక్షచ్ఛాయయు నుండెను. వారందు స్నానమాచరించి మాధ్యాహ్నిక క్రియల సల్పి బాగుగా ముదిరిన యొక మఱ్ఱి చెట్టుక్రింద కూర్చుండి భోజనముచేయప్రారంభించుటకు ముందుగా శ్రీభగవద్గీత పంచదశాధ్యాయమును పఠింప నారంభించిరి. వీరు ప్రతిరోజును గీతయొక్కొక్క యధ్యాయమును పారాయణచేసి భుజించు స్వభావముగలవారని పైన తెలుప బడినదికదా! ఆ దినము పంచదశాధ్యాయమే వచ్చెను. శ్రీ గీతాపారాయణము కొంతవరకు సాగినది, అప్పుడు ఆ వృద్ధవటవృక్షము పెటపెటాయని పగిలి దానినుండి పెద్దధ్వని యొకటి బయలుపడుటయు, ఆ మ్రానునుండి గొప్ప ప్రకాశముతోగూడిన యొక దివ్యపురుషుడావిర్భవించుటయు చూచిరి. ఈ ఆశ్చర్యమును బ్రాహ్మణులుచూచి విభ్రాన్తులై పరస్పరము విచారించుకొను చుండగా అ దివ్యపురుషుడు భక్తితో వారికి నమస్కరించి యిట్లు చెప్పదొడగెను "ఓ మహాత్ములారా ! నేనొక గంధర్వుడను. నాయొక్క రూప లావణ్యమును, గాన విద్యాప్రావీణ్యమును చూచిగర్వించిమదించి, దూర్వాస మహామునిని చూచి పరిహాసముతో నవ్వితిని. అప్పుడు ఆ మహాముని సత్తముడు కోపించి బ్రహ్మరాక్షసుడవు కమ్మని శపించెను. తక్షణమే నేను బ్రహ్మరాక్షసుడనైతిని. మఱల నపరాధము క్షమింపుమని ఆ మహాత్ముని వేడుకొనగా మహర్షి శాంతినొంది శ్రీభగవద్గీత పంచదశాధ్యాయము నీవెప్పుడు మంచి యనుష్ఠానము గలవారివలన శ్రవణము జేయుదువో అప్పుడు శాప విమోచనము గలుగునని యాశీర్వదించెను. అప్పటినుండి యీ వటవృక్షమున చాలా బాధలను సహించి వాసము చేయుచున్నాను. శాపాగ్నిచే దహింపబడు చుండువాడను. ఇచ్చట నుండుటకు కారణమేమన ఈ సరోవరములో పలువురు బాటసారులు స్నానమాచరించి జప. ధ్యాన గీతా పారాయణాదులను చేసి భుజింతురు. ఇదివరలో అనేకులిచట గీతా పారాయణము సుందరకాండ పారాయణము, దివ్యమంత్రజపములను జేసి భుజించి వెళ్ళిరే కాని యెవరును ఈ పంచ

దశాధ్యాయ పారాయణ చేసియుండలేదు. మహాత్ములగు మీరు గీత పదునై దవ అధ్యాయ పారాయణము జేయుదానిని నేను ఏకాగ్రతతో వింటిని. అందుచే నాకు శాపవిమోచనము గల్గినది. నేనిప్పుడు స్వర్గలోకమునకు పోవుచున్నాను, అయితే కరుణాస్వరూపులగు మీరు నాకింత పుణ్యము గలుగజేసినందుకు మీకు ప్రత్యుపకారముగా నొక కార్యమును చేసెద మీరు పోవుచుండు విషయము నాకు తెలియును. మీరు సంభావనకొఱకు రాజును దర్శింప వెళ్ళుచున్నారు. మీరు దేనిని కోరెదరో దానిని మీ కిచ్చులాగున నేను రాజుయొక్క జిహ్వాగ్రమున ఉండి పలికించెదను, భూపాలునకు హృదయసంతోషము గలుగు లాగున చేసెద" నని చెప్పి ఆ గంధర్వుడదృశ్యుడాయెను. విప్రోత్తములు రాజుగారి సభలో ప్రవేశించి తమ శాస్త్రప్రభావమును. ప్రయోజనమునుజూపగా ఆ మేదినీపతి అత్యాశ్చర్యమునొంది వారికిగొప్పదగు నొకయగ్రహారమును ఆ చంద్రార్కముగా ననుభవించులాగున దానమొసగి తామ్రశాసనమునుగూడ వ్రాసి (చెక్కించి)యిచ్చెను. శ్రీ భగవద్గీత పంచదశాధ్యాయ పారాయణ ఫల మీలాగున నుంటున్నది. కావుననే పెద్దలందఱు ఈ పదునేనవ అధ్యాయ పారాయణజేసి భుజించుటకు కారణము. ఓమ్ తత్ సత్,

---

ఓమ్

# 16. దైవాసురసంపద్విభాగయోగము

శ్లో॥ గీతాజ్ఞానం శ్రుతం నైవ సదైవాభ్యాసయోగతః ।
మోక్షమిచ్ఛతి మూఢాత్మా యాతి బాలకహాస్యతామ్ ॥

తా॥ ఎవడైతే శ్రీ భగవద్గీతా జ్ఞానమును వినలేదో, ఆలాగున గీతా పారాయణాది అభ్యాసము చేయలేదో, అటువంటి మూఢాత్ములు మోక్షమును గోరుచో బాలుర పరిహాసమునకు పాత్రులయ్యెదరు. అనగా నితర వేదాంత శాస్త్రములన్నియు చదివిన వాడైనను గీత పఠించనిచో వ్యర్థమని భావము.

ఈ పదునాఱవ యధ్యాయమున దైవసంపత్తిని గుఱించియు, అసుర సంపత్తులను గూర్చియు, విస్తారముగా జెప్పినందుచే దీనికి దైవాసురసంపద్విభాగయోగమ'ని పేరు గలిగినది, దైవసంపత్తనగా దైవగుణములనియు, అసుర

సంపత్తనగా నసుర గుణములనియు గ్రహించవలెను, కావున ముముక్షువులు అసురస్వభావములు తమలో నుండిన కనిపెట్టి యొకేసారి విడిచిపెట్టుటగాని లేక ఒక్కొక్కదానిని క్రమముగ త్యజించుటగాని చేయవలెను. తీవ్రవైరాగ్యము గలవారు ఒకసారి విడువవచ్చును, కొంచెము మందవైరాగ్యమును, కొంచెము బంధనమును గలవారొక్కొక్కదానిని క్రమముగ నుపేక్షించి పరిశుద్ధులయ్యే లాగున ప్రయత్నించవలెను. అలాగున నొకవేళ పైజెప్పిన సుగుణము లన్నియు తనలో పూర్తిగ లేనిచో, వానిని త్వరలో నొకటొకటిగా సంపాదించుకొనవలయును. చెడువిత్తనమునకు చెడ్డఫలమే గలుగునట్లు అసుర స్వభావము గలవారికి దుఃఖములే గలుగును. ఇహమందును అలాగుననే యుండును. పరమందును నదేప్రకారము దుఃఖము గలుగును. ఇదేరీతిగా మంచిబీజము వేయు వారికి మంచిఫలములు గలుగును. ఈ విషయములో శ్రద్ధనుంచక తపస్సుగాని, భక్తిగాని, సత్కర్మలుగాని చేయుచుండినను దైవ కృప కలుగదు. జ్ఞానముదయించదు, కనుకనే భగవంతుడు దైవికగుణములు గలవారికి మాత్రమే మోక్షము గలుగుననియు, రాక్షసగుణములు గలవారికి నరకము ప్రాప్తించుననియు నుపదేశించెను. ఇది ఈశ్వరుని యొక్క నియతిగా నున్నది. దీనిని పరమేశ్వరుడు మార్చుకొనడు. అసురగుణమే తామసస్వభావ మనియు, పైశాచికలక్షణమనియు గ్రహింపవలెను. దైవగుణమునకే సాత్త్విక గుణమనియు. ఈశ్వరవిభూతియనియు పేర్లు. కర్మఫలప్రాప్తి సర్వేశ్వరుని నియతియగుటచే కొందఱు పరమభక్తులైయుండియు కొన్ని కష్టములకు పాత్రులగు చున్నారు. ఇది యెపుడో చేసిన పాపకర్మఫలమని ముముక్షువులు గ్రహింపదగును. అలాగున ప్రస్తుతము కొందఱు దుష్టకృత్యములు చేయు వారైనను భాగ్యవంతులుగా గన బడుచున్నారు. అదియును వారలెప్పుడో చేసిన సుకృత ఫలవిశేషమని తెలియదగును. అయితే ఈపైన చెప్పిన రెండును బాహ్యఫలమును గుఱించియే, బాహ్యముననే మనకిట్లు కాన్పించును, ఏలన సుఖమునకు మనస్సే స్థానమగుటచే మనశ్శుద్ధి గలవాడు దరిద్రుడైనను గొప్ప ఆత్మశాంతిని సౌఖ్యమును బొందుచుండును. ధనవంతుడైనను ఆత్మసంస్కారము శుద్ధముగా లేనిచో దుఃఖములో మునుగవలసియుండును. మాయవలన జ్ఞాన నేత్రము మూయబడియుండుటచే కర్మయొక్కగతిని ఎవరును తెలిసికొనజాల కున్నారు, అయినను అనుమాన ప్రత్యక్షముల ద్వారా కారణములేక కార్యము గలుగదని యూహించుకొనవలయును. ఒక అడవి ప్రదేశమున మంచి పుష్పో

ద్యానము పెంచవలసిన యేలాగున కంటకాదిసమస్తవృక్షములను సమూలముగ ఛేదించి తీసివైచి ఉత్కృష్టములగు వృక్షములను పెట్టి పెంచుదురో, అలాగున హృదయారణ్యములలోగల దుర్గుణములను దుస్స్వభావములను దుర్వృత్తులను, దుష్ప్రవర్తనలను,దుర్మార్గములను దుష్టవిచారముల నన్నిటిని నిర్మూలనమొనర్చి యాస్థానములో సత్యము,శాంతము,దయ,విరక్తి, భక్తి,జ్ఞానము మొదలగుసుగుణ ములనుపెట్టి జాగ్రత్తగా పెంచవలెను. అపుడు మాత్రమే నిత్యానందమును,పరమ శాంతియు జీవులకు గలుగును. ఇదియే భగవంతుడుపదేశించిన విద్యాసారము, కర్షకులు, ఫలపుష్పాదులను పెట్టిపోషించు తోటమాలులు నేలాగున వారిభూము లలో అప్పుడప్పుడు నుద్భవించెడు గడ్డి మొదలైనవానిని తీసివేయుచుందురో, అలాగున హృదయాంతరాళములో జన్మజన్మాంతరములనుండి కలుగుచువచ్చిన దుష్టసంస్కారములను నశింపజేయవలెను, కాని. యతిసూక్ష్మములుగా నుండు టచే సంపూర్ణముగా నొకసారి నశింపజేయుటకు సాధ్యముకాదు. కావున అవి యావిర్భవించినపుడెల్ల అట్టి దుర్గుణములు ప్రకృతిసంబంధములని తలంచి తీసి వేయుచుండవలెను, అవి అసలు పైరును ఫలవృక్షాదులను అణచివేసి దుర్బల మొనర్చును. అలాగున ప్రాకృతగుణములుండిన నవి ఆత్మజ్ఞాన ఫలమును సన్న గిలచేయునని సాధకులు సదా జ్ఞాపకముంచుకొన వలయును, రోగియైనవాడు ఏయే వస్తువులు భుజింపవచ్చునో, ఏయే పదార్థములు విడువవలయునో యెఱింగి జాగ్రత్తగ వర్తింపవలసియున్నట్లు, భవరోగులగు జీవులును తగని గుణములను విడిచి పెట్టి, తగిన గుణములను సంపాదించుకొన వలెను. అట్లు కానిచో, ఎంత శ్రేష్ఠ ఔషధమైనను పథ్యము సరిగా చేయనిచో ఆరోగ్యము కలుగనట్లు, ఎంత గొప్ప గురువుయొద్దనుండి యుపదేశము నొందినను భవరోగము నశింపదు, ఆత్మశాంతి గలుగదు.ఈతత్త్వమంతయు భక్తులు ఈ యధ్యాయమున గ్రహించు కొనవచ్చును. మఱియు మంచి వృక్షమునకు లేబ్రాయమున పురుగులు పట్టెడు స్వభావమెట్లుండునో, మఱియు వానిని కనిపెట్టి జాగ్రత్తతో నెట్లు తీసివేయ వలసియుండునో, అలాగున నధ్యాత్మజ్ఞాననిష్ఠలో ప్రథమమున విఘ్నము లనేక ములు గలుగవచ్చును. కాని వాటిని కనిపెట్టి రహిత మొనర్చుచుండవలెను. జన్మాంతర సుకృతవిశేష మెక్కువగలవారికి ఈశ్వరకృప గలవారికిని ఎక్కువ ప్రతిబంధములుండవు. గాని తక్కినవారికి పతనము గలుగుటకు కారణము లనేకములు గలవు, అందు విషయవిరక్తి లేకయుండుట యొకటి. విషయ విరక్తి కలుగుట చాల కష్టము, ఏలన ప్రపంచముయొక్క సంస్కృతి యంతయు

దానిపై నిబిడముగా బంధింపబడి యున్నది. కాలచక్ర గమనమంతయు దాని లోనే యమర్చబడియున్నది, సృష్టియొక్క క్రమమంతయు దానిలోనే ఇమిడి యున్నది. అది లేనిచో ప్రపంచమే లేదు.. అత్యధిక గురుభక్తియు, పుణ్యబల మును గల జీవుని మాత్రమే అది యెక్కువగ బాధింపక చిన్నగా విడిచిపెట్టును. కావుననే సత్కర్మలును, సదాచారములును, ఆత్మవిచారమును సదా గలిగి యుండేలాగున చూడవలెనని మహనీయులు చెప్పెడి రహస్యము. దీనియందీ శ్లోకము ముఖ్యము:—

శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ (1-23)

తా॥ ఎవడు శాస్త్రవిధి నుల్లంఘించి తన యిష్టానుసారము ప్రవర్తించునో, అట్టివాడు (కార్య)సిద్ధిని బొందడు. (ఇహలోకమున)సుఖమును పొందడు(మరణా నంతరము మోక్షము నొందడు.) ఓమ్ తత్ సత్.



ఓమ్

# 17. శ్రద్ధాత్రయ విభాగయోగము

శ్లో॥ యే శృణ్వంతి పఠన్త్యేవ గీతాశాస్త్రమహర్నిశమ్ ।
న తే వై మానుషా జ్ఞేయా దేవా ఏవ న సంశయః ॥

ఎవరైతే రాత్రింబవళ్ళు గీతను పఠించెదరో, అలాగున పఠించుటకు సాధ్యముగాని వారలు పఠించువారి దగ్గరనుండి శ్రవణము చేయుదురో, అట్టి మానవులు మనుజులుగారు. మరి యెవరనగ వారు దేవతలే అని తెలియ నగును.

ఈ పదునేడవ అధ్యాయమున సత్త్వరజస్తమో గుణములు మూఁడును మానవుల యందెట్లు అణగియున్నవో, అవి యే లాగున నాత్మను ప్రేరణ చేయునో, యీ మొదలగు విషయములు వివరణగా నిరూపణము జేసినందుచే దీనికి శ్రద్ధాత్రయ విభాగయోగమని పేరు వచ్చినది. దీనిలోఁ జెప్పిన గురుతు లను కనిపెట్టిన నెవరు ఏ స్వభావము గలిగియుందురో తెలిసికొన వచ్చును. జన్మాంతర సంస్కారము ననుసరించి అంతఃకరణ మేర్పడియుండును. దానిలోఁ

గల జీవుఁడును నాలాగుననే ప్రవర్తించును. అయితే జీవులుపూర్వజన్మ సంస్కారము ననుసరించియే ప్రవర్తించుచుండిరని చెప్పినది నిజమైనచో ప్రవృత్తి మార్గములోనుండు జీవుడు నివృత్తి మార్గములోనికి నెట్లు రాగలుగును? రజస్తమో గుణములు గల మానవులు సత్త్వగుణములోనికి నెట్లు ప్రవేశింపగలుగుదురను సందేహము సామాన్యులకు కలుగవచ్చును. సరి.

అట్లైన ధర్మముల నుపదేశించెడు వేదశాస్త్రములును, జ్ఞానము నుపదేశించెడు పుణ్యాత్ములును వ్యర్థులై పోవుదురుకదా? యని శంకింపఁ బనిలేదు. జీవులయొక్క నైజస్వభావము దైవాంశమగుటచేతను, శుద్ధ జ్ఞాన స్వరూపమగుటచేతను, సహజముగ నానందస్వరూపమగుట చేతను, ప్రతిజీవికి నుత్తమసుఖము పొందవలయునను తలంపు గలుగుటచేతను, జీవులు చైతన్య స్వరూపులగుటచేతను - త్రోవదప్పిన బాటసారికి మంచి మార్గమునుఁ జూపిన యాతడేలాగున దాని ననుసరించి పోవుచుండునో లేక మంచి యాహారము దొరకక ఆకులు, అలములు, గడ్డలు, కాయలు మొదలైనవానిని తిని జీవించు వారికి నుత్తమ భోజనపద్ధతి యేర్పడిన వెంటనే యెట్లు మార్చుకొనెదరో ఆలాగున మార్గము తెలియక సంకటపడునట్టి వారికి ధర్మశాస్త్రమును, ధర్మబోధకులును ఉపయోగపడుదురు. ప్రజ్ఞావంతులు తమలోఁగల రజోగుణదోషములను విడిచి సత్త్వగుణము లోనికి వచ్చుటకు మార్గమేర్పడును. రోగులైనవారు రోగశాంతి పొందుటకు నేలాగున నాహారమును మార్పుచేసికొని యారోగ్యపదార్థములను భుజింతురో, అలాగున ప్రాజ్ఞులగు జీవులకును ఉత్తమగతిని గలుగఁజేసికొనుటకవకాశము గలుగును. కనుక గుణదోషములను తెలిపెడు పవిత్రశాస్త్రములును జ్ఞానము నుపదేశించెడు పుణ్య పురుషులును వ్యర్థులు గాజాలరు. ఈ యధ్యాయమును చాల జాగరూకతతో చదువవలసి యుండును. అట్లైన మాత్రమే వారు తమయొక్క స్థితిగతులను తెలిసికొనుటకు సాధ్యపడును. ఇతరుల స్థితి గతులను కూడ తెలిసికొనుటకు నవకాశము గల్గును. మూఁడు గుణములని చెప్పినను, మూఁడుశ్రద్ధలని చెప్పినను నర్థమొక్కటియే. మూఁడుగుణములను గురించి 14-వ అధ్యాయమున చెప్పినందుచే నిచ్చట మూఁడు విధములగు శ్రద్ధలని చెప్పుటకు కారణమైనది కావున ముముక్షువులు తమలోఁగల రాజసతామస శ్రద్ధలను కనిపెట్టి వానిని రహిత మొనర్చి సత్త్వగుణశ్రద్ధగలిగి వర్తించేలాగున చూడవలెను. దీనితోను తృప్తినొందక శ్రద్ధాత్రయాతీతమగు శుద్ధజ్ఞాన స్వరూపస్థితిలో నిలుకడ చేసికొనవలయును. అది యీ మూఁడు విధములగు శ్రద్ధల

కంటె విలక్షణము. అది శివము, ఆనందము, అమృతము, శాశ్వతము. అయితే సాత్త్విక శ్రద్ధ నవలంబించి యచ్చోటకు ప్రయాణము చేసిన మాత్రమే యా స్థానము లోనికి వెళ్ళగలము. ఈ మార్గము సుగమము. అచ్చట ప్రకృతు లన్నియు ప్రయాణమున కనుకూలముగనే యుండును. మార్గము వాలా ప్రస న్నముగాను, ప్రశాంతముగాను, ఆనందముగాను ఉండును. రజోగుణ తమోగుణ ములుగలవారి మార్గములు కంటకావృతములు. భయంకర జంతు సంకీర్ణములు, ఎచ్చటను ప్రతిబంధములే కన్పించును. ఒక్క మూరెడు దూరమేగిన మూఁడు మూరలు దూరము క్రిందికి జారిపడిపోవును. మార్గము మహాదుర్గమము. అవ రోధములు మెండు కనుకనే పాపము గలవారు మోక్షమార్గములో ప్రవేశించిన ననేక పతనములు, సంకటములు, రోగ బాధలు మొదలైనవి గలుగుటకు కార ణము. ఇవన్నియు నీశ్వరభక్తి చేతను, పుణ్యకర్మల ఫలము చేతను, పరిశుద్ధ వ్రతములచేతను దాటవలెను. రాజభటులచే నిరోధింపఁ బడిన మార్గముయొక్క పురోభాగమునకు నేలాగున వెళ్ళజాలమో, కాని రాజాజ్ఞను సంపాదించినచో ఇంతకు పూర్వము నిరోధించినవారే యెంతో యుపకారపరులై మార్గావరోధము దొలగించి యేలాఁటి యాపత్తులనుఁ గలుగనీయక సన్మార్గముగుండా తీసికొని పోవుదురో, అలాగున నీశ్వర కృపయొక్క ఫలమునుఁ గూర్చియు నెరుంగ వలెను. ఈశ్వర కృపఁ గలిగినచో నప్పుడు సత్త్వగుణ శ్రద్ధగల వారుపోయెడు త్రోవలో కలిసికొనెదరు. అప్పటినుండి మరల కష్టమేమియు నుండదు. పైవారి వలె శాంతియు సౌఖ్యమును వీరికిఁగూడ లభించును. ఈ యధ్యాయమం దీ శ్లోకము ముఖ్యము:—

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।
శ్రద్ధామయోఽయం పురుషోయోయచ్ఛ్రద్ధస్స ఏవ సః॥ (17-3)

తా॥ ఓ అర్జునా! సమస్త ప్రాణులకును వాని వాని పూర్వజన్మసంస్కార ములతోఁగూడిన యంతఃకరణమునకుఁదగిన శ్రద్ధయే కలుగుచున్నది. ఎవడెట్టి శ్రద్ధ గలవాడో వాడట్టిశ్రద్ధతో నెగ్గువాఁడగును.

ఓమ్ తత్ సత్.



ఓమ్

# 18. మోక్షసన్న్యాసయోగము

శ్లో॥ కృష్ణో జానాతి వై సమ్యక్ క్వచిత్కౌంతేయ ఏవ చ।
వ్యాసో వా వ్యాసపుత్రో వా యాజ్ఞవల్క్యోఽథ మైథిలః ॥

తా॥ గీతార్థమును సంపూర్ణముగా శ్రీకృష్ణభగవానుడొక్కడే యెఱుఁగును. ఆ తరువాత నర్జునుఁడును, అలాగున వ్యాసభగవానులును, శుకదేవుఁడును, యాజ్ఞవల్క్యమహర్షియును, జనకమహారాజును కొంచెము కొంచెముగా తెలిసికొని యున్నారు.

ఈ యధ్యాయమున మోక్షముయొక్కయు, సన్న్యాసముయొక్కయు లక్షణములు విస్పష్టముగ చెప్పబడినందున దీనికి 'మోక్షసన్న్యాసయోగమని' పేరు గల్గెను. మఱియు, 'త్యాగ' శబ్దముయొక్కయు, 'సన్న్యాస' శబ్దము యొక్కయు అర్థము దీనిలో నిరూపింపబడినది. సమస్తకర్మలయొక్కయు, సర్వానుష్ఠానములయొక్కయు పర్యవసానము మోక్షమగుటచేతను.ఈగ్రంథము ఈ యధ్యాయముతో సమాప్తి నొందుటచేతను దీనికీపేరు వచ్చినది. మఱియు నన్నియాశ్రమముల అంతిమస్థానమగునది తురీయాశ్రమమగుటచేతను, అట్టి తురీయాశ్రమము ముక్తిని గలుగజేయునదగుటచేఁను ఈ యధ్యాయ మట్టి తురీయస్థితిని అనగా మోక్షమును తెలుపునదగుటచేతను ఇచ్చట మోక్షమని, సన్న్యాసయోగమని రెండు పేర్లు నొకటిగా గూడియున్నవి. బ్రహ్మచర్యాదులు మూడాశ్రమములను సరిగా ననుష్ఠించుచు వచ్చిన నేలాగున యంత్యాశ్రమమునకు స్వయముగ నర్హతగలుగునో, అలాగున నిదివఱకు శ్రీ భగవానులుపదేశించిన 17అధ్యాయములును సరిగా నాచరించుచువచ్చిన సన్న్యాసాశ్రమావస్థయును, దానివలన మోక్షమును చేకూరునని యీ పేరుయొక్క గూఢార్థమైయున్నది. దీనివలన నన్ని యాశ్రమములలోని వారు అంతమున సన్న్యాసాశ్రమమును స్వీకరించవలెనని గోచరమగుచున్నది. అట్లు గానిచో నిర్విషయ, నిస్సంకల్ప నిస్సంగత్వ స్థితి జీవకోట్లకు గలుగుట దుస్తరమని బోధించు శ్రుతి వాక్యములను జ్ఞప్తిలోనుంచి కరుణామూర్తియగు శ్రీభగవంతుడు ఈ యధ్యాయమునకు నీ నామధేయ మొసంగినాడు. భగవదాశయమును నిదే యగుటచే గీతామహోపదేశమును పొందిన శ్రీ పార్థుడును, ధర్మరాజాదులును అంత్యకాలమున సమస్తమును పరిత్యజించి సన్న్యాసాశ్రమము స్వీకరించి (తాపస

వేషమును ధరించి) మహాప్రస్థానము గావించిరి. పాండవుల మహాప్రస్థానము, స్వర్గారోహణము మొదలగు భాగములను మహాభారతమును చదివిన విస్పష్టము కాగలదు. అంతేగాక త్యాగశబ్దముయొక్క లక్ష్యమును, సన్న్యాసశబ్దము యొక్క లక్ష్యమును నొకటే యగును. ఈ యధ్యాయమున నిశ్చయముగ స్థిరపఱచిన విషయము సామాన్యముగాదు. ఇది చాల అగాధవిషయము. ఇది పరమప్రాప్తిని కలుగజేయునదగుటచే నీ యధ్యాయమున 'సర్వధర్మాన్ పరిత్యజ్య' — అను చరమశ్లోకము నుపదేశించిరి. శ్రీ వైష్ణవసాంప్రదాయకు లకు దీనికంటె ముఖ్యమైనది మఱియొకటి లేదు. తిరుమంత్ర మెటువంటిదో ఇదియు వారికి నటువంటిదే అని యర్థము. శ్రీ రామానుజాచార్యులవారు దీనికి గొప్ప భాష్యము వ్రాసియున్నారు. సన్న్యాసమునకు కేవలము శిఖాచ్ఛేదన, కాషాయవస్త్రధారణ కావలయునని అర్థము కాదనియు సర్వకర్మ ఫలత్యాగమే యర్థమనియు దీనియందు నిరూపింపబడినది. ఇట్టి యమోఘ విషయమును సమన్వయపఱచుట సామాన్యమైన పనిగాదు.

మఱియొక యర్థముగూడ దీనికి గలదు. అదేమన 'మోక్షసన్న్యాసయోగ' మని చెప్పుటచే మోక్షమునుగూడ సన్న్యసింపవలెనను అర్థము స్ఫురించు చున్నది. ఇంతవఱకు 17 అధ్యాయములలో జెప్పిన సమస్తవిషయములును మోక్షముకొఱకే యగుచుండగా నాఖరున నట్టి మోక్షమునుగూడ వదలిపెట్టు మనుట యెంత విపరీతముగా నున్నది? ఒక ప్రభువు తనదగ్గఱనుండు కింకరుల తోను, సేవకులతోను - నేను చెప్పేలాగున నాచరించిన మీ కోర్కెలన్నియు నిర్వహింపబడగలవని చెప్పి తనయొక్క సమస్తకార్యములను చేయించుకొని, ఆఖరున మీకు ఏయే కోర్కెలను నిర్వహించెదనని చెప్పియున్నానో, ఆ కోర్కె లనుగూడ నిప్పుడు విడిచిపెట్టుడు (అనగా నేమియు నిచ్చుటలేదు) - అని వచించిన ఎటువంటిమాటయో యిదియు నటువంటిదే. ఓహో! భగవంతుడు గూడ నిట్టి మోసపుకృత్యము గలవాడా? దీనియొక్క రహస్యమదిగాదు. 17-వ అధ్యాయమువరకు నుపదేశించిన వాక్యముల ప్రకార మనుష్ఠించినచో మోక్షము స్వయముగానే గలుగునను ఉద్దేశ్యమును, లోపల నుంచుకొనియే యీ యధ్యాయ మునకు మోక్షసన్న్యాసమని నామధేయమిడిరి. మోక్షము కావలెనను సంకల్పము ఎవనికి గల్గును? మోక్షము పొందనివానికే గదా! ముక్తులైనపిదప నిక మోక్షముకోరవలసిన పనియేమున్నది? ఋణముగలవాడే ఋణవిమోచనమును కోరును. ఋణము తీయనివానికి ఋణనివృత్తి గలుగవలెనను చింత యుండదు

గదా ? అలాగున రోగగ్రస్తునకే ఆరోగ్యము గలుగవలెనను విచారము గల్గును. రోగనివృత్తిగల్గి మంచి యారోగ్యస్థితిలో నుండువారికిక రోగవిమోచనము గావలెనను చింత లేదు గదా? అట్లే కారాగృహమున నుండువారికి దానినుండి విడుదల నొందిన తరువాత నట్టి విచార మక్కరలేదుగదా ! అలాగున 17 అధ్యాయములలోను బోధించినట్లాచరించువారికి మోక్షమునుగూర్చి విచారము గూడ వదలదగినది. అనగా నట్టివారు జీవన్ముక్తులైరని తాత్పర్యము. ఇందు సందేహమేమియును లేదు.

వేదాంతసార గర్భితమగు మఱియొక యర్థముగూడ దీనిలో నిగూఢమై యున్నది అదే దీనిలోగల పరమరహస్యము. ఇది సామాన్యజనులకు గోచరించు నదిగాదు. అదేమన అజ్ఞానదశలోనే జీవుడు తాను బద్ధుడనను విచారము గల్గి యుండును. గీతలో చెప్పినట్లనుష్ఠించుటచే నజ్ఞానము క్షయించి, జ్ఞానముద యమై, తాను చిత్స్వరూపుడననియు, నీశ్వరాంశుడననియు, నిత్యుడననియు నేకాలములోను తాను బంధావస్థను పొంది యుండలేదనియు బోధ గలుగును. అట్టిబంధావస్థ, అజ్ఞానముచే తనయొక్క నిజస్వరూపమును తెలియక పోవుట వలన గలిగిన భ్రమమాత్రమే యని యపుడు గోచరము కాగలదు. కాన మోక్షా పేక్షనుగూడ సన్న్యసింపుము. అనగా నుపేక్షింపుము అని చెప్పబడినది ఇదియే ఇందలి రహస్యార్థము. దీనికి సంబంధించిన శ్లోకములు గీతలో ననేకములు గలవు. కాని, ఏ శ్లోకమును దీనియందు ఉదాహరింపకూడదని ముందుగానే నిశ్చయించుటచే వాని నిచట నుదాహరించుటలేదు. యథార్థముగ అనుభవజ్ఞు లగు మహనీయుల దగ్గఱ ఉండి వేదాంత శ్రవణము చేసినఆత్మకు నేకాలము నను బంధముగలిగి యుండలేదను తత్త్వము గోచరము కాగలదు. అవిద్య యొక్క మహిమచేతనే జీవుడు తాను నిత్యముక్తుడై యుండియు బద్ధుడననితలంచు చున్నాడు.ఆ యవిద్యయే వాని కట్టిబుద్ధిని గలుగజేయుచున్నది. స్వప్నములో ననేక విధములగు కార్యములు జరిగినట్లు కనుపించినను జాగ్రదవస్థలోనికి వచ్చునపుడు అవి యన్నియు నేలాగున నసత్యములని బోధగల్గునో, అలాగున నవిద్యా మోహములో ఉండువఱకుమాత్రమే జీవునకట్టి భ్రాంతులన్నియు గలుగుచుండును. గీతావాక్యములుపదేశించినట్లు నిష్కామకర్మల నాచరించుచు వచ్చుటచే జీవునియొక్క యావరణము వదలిపోయి వానికి తనయొక్క నిజస్వరూపము గోచరమగును. కనుకనే 5-వ అధ్యాయము 16-వ శ్లోకములో నజ్ఞానముచే జ్ఞానము అవరింప బడినదనియు జ్ఞానమువలన నట్టి యావరణము తొలగునపుడు సూర్యునివలె

నాత్మజ్ఞానము స్వయముగ ప్రకాశించుననియు చెప్పుటకు హేతువైనది. అప్పుడు తాను కేవలము ఆ పరబ్రహ్మము యొక్క అంశమేయని లేక ఆ పరబ్రహ్మము తానుగానే యుండెనని లేక పరబ్రహ్మయొక్క ప్రతిబింబము తానుగా నుండెననియు బోధగల్గును. ఆత్మనుగూర్చి పై జెప్పిన మూఁడు అభిప్రాయములలో నొక్కొక్కటి యొక్కొక్క సంప్రదాయమున గలదు, ఈ మూడు నొకే వస్తువుయొక్క అనాంతర భేదములని గ్రహించిన జాలును. మోక్షము పొందవలెనను సంకల్పములుగూడా విడువవలెనని చెప్పుటచే మఱల నితర సంకల్పములు కూడదను విషయమై చెప్పవలయునా! సంకల్పము లుండువఱకు నాత్మ అపూర్ణ స్థితిలోనే యుండును. కొరతగల హృదయముల నుండియే కోరిక లుద్భవించును, అదియునుగాక ప్రకృతియొక్క శుద్ధభావముగాని, అశుద్ధభావముగాని అంతఃకరణములో నుండునంతవరకు సంకల్పము లుద్భవించుచుండును. అది శుద్ధప్రకృతి యైనచో శుద్ధసంకల్పములును, మలిన ప్రకృతి యైనచో అశుద్ధ సంకల్పములును పుట్టుచుండును. ఈ రెండు ప్రకృతులును సాక్షాత్ శుద్ధజీవునియందుండవు. కావున నాదశలో సంకల్పములు గలుగవు. అప్పుడు తాను ఏ సంకల్పములుగాని, బంధములుగాని, మాయామోహములుగాని లేనివాఁడననియు, కేవలము చిత్స్వరూపుఁడననియు, జ్ఞానైక నిలయుఁడననియు, స్వయంప్రకాశుఁడననియు బోధ గలుగును. ఏ కాలములోను ప్రకృతి తనలో లేదనియు, తాను కేవలము అఖండ జ్ఞానస్వరూపియై యుండెననియు తెలివి గల్గును, ఇదివఱకుఁ గల్గిన యవస్థలన్నియు సంకల్పమహిమవలననే యేర్పడినవనియు, ఈ కాన్పించు నామరూపములు మాయవలన కల్పితములనియు, సత్యముగా నే కాలమునగాని మాయయు మాయామహిమయు నుండియుండలేదనియు సద్బోధ ముదయమగును ఇట్టి పరబ్రహ్మజ్ఞానస్థితియే ముక్తియని వేదాంతులును అంతయు భగవన్మయమని పరమ భక్తులును అనుభవము పొందగలరు. అట్టి వారిజన్మము ధన్యము. వారికి మఱల జన్మము గలుగదు. కలిగినను బంధనముండదు. జ్ఞానులలో లోకోద్ధరణకొఱకు మాత్రము కొందఱవతరించ వచ్చును. అట్లైనను సదాశివము, అనంతము అమృతమను భావము గలిగియుందురు. ఇట్టి దివ్యావస్థ పరమపావనస్థితియని చెప్పదగును.

ఈ పదునెనిమిదవ యధ్యాయము సామాన్యముగాదు. ఇది యింతవరకు చెప్పుచువచ్చిన అధ్యాయములన్నింటియొక్క సారము. దీనిని ప్రత్యేకముగ నొక యధ్యాయమని తలంపక అన్ని యధ్యాయముల సారమని గ్రహింపదగును.

అంతేగాక నాయా యధ్యాయములలో చెప్పదలచిన విషయములందు నేయే కొరత యుండెనో దానినంతయు నీ యధ్యాయములో పూర్తి జేసియున్నారు. కనుకనే 14-వ అధ్యాయములో చెప్పిన త్రిగుణముల గూర్చియు, 17-వ అధ్యాయములో నుపదేశించిన శ్రద్ధాత్రయమును గూర్చియు నీ యధ్యాయమున నుపదేశించుటకు కారణమైనది. మఱియు, 'నైష్కర్మ్యసిద్ధి' యనగా నిష్కామకర్మచే పొందవలసిన ఈశ్వరప్రాప్తిని ఈ యధ్యాయములోనే తెలిపినారు. నిర్వికల్ప సమాధియు దీనిలోనేయుపదేశింపఁబడినది. 49-వశ్లోకమునుండి54-వ శ్లోకము వఱకు చూడుడు. బ్రహ్మనిష్ఠులు గ్రహించియాచరణలో నుంచతగిన విషయములన్నియు సంక్షిప్తముగ నిచ్చోటనుపదేశింపఁబడినవి. ఇదేగీతయొక్క ప్రాణము. దీనిని ఎల్లప్పుడును, మనసులో నుంచి యనుష్ఠించు వారికి మఱియొక్క ప్రమాణ మవసరములేదు. పరమ పవిత్రమును మోక్షమార్గ కవాటముఁ దెరచునదియు నగు (66-వ) శ్లోకమునుఁ జూడుఁడు. ఇఁక నీ విషయమైయెక్కువగ చెప్పఁబూనలేదు. ఒక్క రహస్యమును మాత్రము జెప్పి దీని నుపసంహరించెద. అది యేమన? ఏ గ్రంథమైనను, ఏ శాస్త్రమైనను, ఏ మంత్రమైనను పఠించునపుడు దానిని ప్రపంచములో మొదట నుపదేశించిన వారియందు ఎంతటి భక్తి విశ్వాసములు గల్గియుందురో అంతే యర్థము అంతే ఫలము, అంతే మహిమ అభ్యాసకులకు గల్గును. ఇది సత్యము కావున శ్రీ కృష్ణ పరమాత్మ యందును, శ్రీ గీతాశాస్త్రమందును మీ కెంత భక్తి విశ్వాసము లుండునో అంతేఫలమును పొందగలరు, ఇదినిజము.

సర్వేశ్వరుని ప్రియపుత్రులారా! పుత్రికలారా! ఈ గీతాశాస్త్రమును ఈశ్వర సంతానమగు మీరందఱును చదివి సంసారదుఃఖములను రహితమొనర్చుకొని మోక్షమును పొందవచ్చును. పరమేశ్వరసృష్టియగు దేదీప్యమానసూర్యప్రకాశము, చంద్రునియొక్క శీతలమైన చంద్రికయు, ప్రాణమును గలుగజేయు వాయువు, ఓషధులను వృద్ధిజేసెడు మేఘజలమగు వృష్టియు, సర్వ జనులకు నేలాగున సమముగా జగదీశ్వరునిచే సృష్టింపబడినవో, అలాగున తాపత్రయముల రహితమొనర్చి ఇహమందును, పరమందును, సర్వులకు నిత్య సుఖమును గలుగజేయుటకే ఈ గీతాశాస్త్రమావిర్భవించినది. కనుక దీనినందఱును పఠించి పాపవిమోచనమొంది జీవితమును ధన్యము గావించుకొన వచ్చును. ఈ విషయమై శ్రీభగవాను లీ యధ్యాయమున నుపదేశించిన 68,69 శ్లోకములే ప్రమాణములు. భగవద్భక్తులకు అతిపావనమగు నీ శాస్త్రము

నెవ రుపదేశింతురో, వారికి సమానమైన పరమభక్తుడు మఱియొక్కడు "నాకు మూడు లోకములందును లేడు, ఉండబోడు, ఉండి యుండలేదు" అని శ్రీభగవానుడు ప్రతిజ్ఞజేసి చెప్పియుండగా మఱల మీకేల సందేహము గలుగ వలయు? స్వయముగానో లేక నితరుల వాక్యములనువినియో మీలో కొందఱు తామర్హులు గామనియు, పాపులమనియు, తలంచుటయే లేక తలంపజేయుటయే ఇట్టి పతనమునకు గారణమైనది, ఆత్మవేత్తల మని తలంచెడు కొందఱు తమలోను నితరులలోను గల చైతన్యమగు నాత్మను మరచి జడమగు దేహమునకే యాధిక్యత నిచ్చినందుచేతనే నీ దేశమింత హీనదశకు వచ్చినది. అట్టి జడభావము బలపడి నందుచేతనే మీలో వెలుగుచుండు దైవము మరుగుపడి పోయినది. సర్వజీవరాసులలోను భగవంతుడనగు నేను వెలుగుచున్నాననియు అందఱిలోను నేను సమానముగ నున్నాననియు గీతలోభగవాను లుపదేశించిన వాక్య మెచటనో యంతర్ధాన మొందినది. గుణమునుగూర్చిగాక కేవలము కులమును బట్టియే వర్ణములను నిర్ణయించి మానవుల యభివృద్ధికి నేలాంటి మార్గమును లేకుండ చేసినందుచేతనే ఆర్యుల సంతానమగు నీ మానవులు కేవలము పరులకు బానిసలై అనార్యులస్థితికి వచ్చిపడిరి అయినను ప్రాతపడిన దుర్బలమైన త్రాటితో దేనినైన గట్టిన కొంత కాలమున కది జీర్ణమైపోయి కట్టు తెగి పోవునట్లు, అసత్యమైన, బంధనముచే నెంత బలముగా బంధింపజూచినను నిలుచునా? కల్పితమగు దేహమునకే వర్ణముల గల్పించినందుచే నవి యిప్పటికి జీర్ణములైపోయి జనులు వారి వారి శక్తి ననుసరించి ప్రవర్తింప దొడగిరి. జనుల యభివృద్ధి విషయమై తగు రాజ్యపరిపాలన లేకపోయెను. ఏలన? ప్రభుత్వమతము వేరుగను, ఈ జనులమతము వేరుగా నుండుటచే నట్లు కలుగుటకు కారణమైనది. కాబట్టి జనులను ధర్మమార్గములో నడుపువారు జగద్గురువులు, అనగా మఠాధితులు, వీరి వాక్యములలో జనులకు విశ్వాసము బొత్తిగా లేకపోయెను. ఏలన సన్న్యాసులకు తగిన తపస్సు యోగము, జ్ఞానమును వీరిలో చాలామందికి క్షీణదశకు వచ్చెను. యోగమునకు బదులు దేహసౌఖ్యమును పోషింపదొడగిరి, ఇక వీరి వాక్యములకు విలువ యెచటనుండివచ్చును? ఆత్మశక్తియుండిన కాలములో వీరి వాక్యములను దైవవాక్యములుగా విశ్వసించుచుండిరి. అప్పుడు వారికి మంచి నిగ్రహానుగ్రహశక్తియుండెను, అంతేగాక వీరు ప్రజలను తమ బిడ్డలవలె జూచుచుండిరి. మానవుల యభివృద్ధికొఱకు వీరు సదా విజ్ఞానము నుపదేశించు చుండిరి, ఇప్పుడు గౌరవముకొఱకును ఆధిక్యత

కొఱకును, సన్న్యాసముకొఱకును, వాదప్రతివాదములు చేయుటయేగాక న్యాయస్థానములనుగూడ నెక్కదొడగిరి. మఱియు తమ సౌఖ్యమునే చూడదొడగిరి. అందుచే వీరు సామాన్యమనుజులవలె నైరి, ఇప్పుడు దీపమారిపోయిన రాత్రివలె లోకములో నంధకారము ప్రవేశించెను. దానికే అంధ విశ్వాసమని పేరు. ఇక లోకోద్ధరణ మెపుడు గలుగునో, అపుడు మాత్రమే జనుల ఆత్మయొక్క యావరణములుపోయి దివ్యజ్ఞానము ప్రకాశించును. కావున, తపస్సంపన్నులేర్పడి యధ్యాత్మజ్ఞానము గలవారలు తగిన ప్రదేశములలో పుణ్యాశ్రమముల స్థాపించి యోగ్యులైన జిజ్ఞాసకులకు తగిన సాధనలు, దివ్యవిద్యలు నేర్పి ఆత్మశక్తి నభివృద్ధిపఱచిన మాత్రమే తెగిపోయిన వంతెనను మఱల శుద్ధ పఱచినట్లగును. అప్పుడు మంచిదారి యేర్పడును. అప్పుడందఱును ఆ మార్గముననే నడువగలరు. ఇప్పుడు దేశముయొక్క స్థితి గొల్లవాడులేని గొఱ్ఱెలగుంపు రీతియైనది. అనేక పుణ్యపురుషులు జన్మించినదియు, అనేక తాపసోత్తములు తపస్సు చేసినదియు, అనేక మహర్షి పుంగవులుద్భవించినదియు అనేకధర్మాత్ములు జీవించినదియు, అనేక కరుణాస్వరూపు లవతరించినదియు, అనేక పుణ్యవ్రతులగు నారీమణు లుద్భవించినదియు నగు, నీ పుణ్యభూమిపై పరమేశ్వరుడు కరుణించిన మాత్రమే జనులు కృతార్థు లగుదురు. పరమేశ్వరానుగ్రహము నొంది యొక దివ్యపురుషుండు భూలోకమున నవతరించవలసిన కాలమిపు డాసన్నమైనది, వేరుగతి యేమియు కన్పించుటలేదు. ముఖ్యముగా జనుల ఆత్మోన్నతి గావలసియుండినచో మానవుల యొక్క గుణములకే యాధిక్యతగలదని సర్వజనులకు తెలిసేలాగునను, వారి హృదయమున బాగుగా నాటేలాగునను బోధప్రారంభించవలెను. అట్టి గుణము గలవారలకు తగిన యోగ్యతను కల్పించవలయును. అప్పుడే లోకోద్ధారము కాగలగు. ఈ యధ్యాయమున నీ శ్లోకము ముఖ్యమైనది;—

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహంత్వా సర్వపాపేభ్యోమోక్షయిష్యామిమాశుచః॥ (18-66)

తా॥ సర్వధర్మములను విడనాడి నన్నొక్కనినే శరణుపొందుము. నేను నిన్ను అన్నిపాపములనుండి విడిపించెదను శోకింపకుము.

శ్రీ కృష్ణ పరబ్రహ్మార్పణమస్తు

ఓమ్ తత్ సత్



ఓమ్

# శ్రీనారాయణస్తోత్రమ్

నారాయణ నారాయణ జయ గోవింద హరే! ।
నారాయణ నారాయణ జయ గోపాల హరే! ॥

(దీనియందు సంబోధనగా నుండినను, దీర్ఘోచ్చారణముగా పఠించవలెను)

1. కరుణా పారా వారా, వరుణాలయ గంభీరా ॥నారాయణ॥
2. ఘననీరదసంకాశా, కృతకలికల్మషనాశా ॥నా॥
3. యమునాతీర విహారా, ధృతకౌస్తుభ మణిహారా ॥నా॥
4. పీతాంబర పరిధానా, సురకల్యాణనిధానా ॥నా॥
5. మంజులగుంజాభూషా, మాయామానుషవేషా ॥నా॥
6. రాధాఽధరమధురసికా, రజనీకరకులతిలకా ॥నా॥
7. మురళీగానవినోదా, వేదస్తుతభూపాదా ॥నా॥
8. బర్హిణిబర్హాపీడా, నవనాటక ఫణిక్రీడా ॥నా॥
9. వారిజభూషాభరణా, రాజీవరుక్మిణీరమణా ॥నా॥
10. జలరుహదళ నిభనేత్రా, జగదారంభకసూత్రా ॥నా॥
11. పాతకరజనీసంహర, కరుణాలయ మాముద్ధర ॥నా॥
12. అఘబకక్షయ కంసారే, కేశవకృష్ణమురారే! ॥నా॥
13. హాటకనిభ పీతాంబరా, అభయం కురు మే మావర ॥నా॥
14. దశరథరాజకుమారా, దానవమదసంహారా ॥నా॥
15. గోవర్ధన గిరి రమణా, గోపీమానసహరణా ॥నా॥
16. సరయూతీర విహారా, సజ్జనఋషిమందారా ॥నా॥
17. విశ్వామిత్ర మఖత్రాతా, వివిధపరాసుచరిత్రా ॥నా॥
18. ధ్వజవజ్రాంకుశపాదా, ధరణీసుతాసహమోదా ॥నా॥
19. జనక సుతాప్రతిపాలా, జయ జయ సంస్మృతిలీలా ॥నా॥

20. దశరథవాగ్ధృతిభారా, దండకవనసంచారా ॥నా
21. ముష్టిక చాణూర సంహారా, మునిమానస విహారా ॥నా॥
22. వాలివినిగ్రహశౌర్యా, వరసుగ్రీవ హితకార్యా ॥నా॥
23. మామురళీకరధీరా, పాలయ పాలయ శ్రీధరా ॥నా॥
24. జలనిధిబంధనధీరా, రావణకంఠవిదారా ॥నా॥
25. తాటకమర్దన రామా, నటగుణ వివిధ సురామా ॥నా॥
26. గౌతమపత్నీ పూజనా, కరుణాఘనావలోకనా ॥నా॥
27. సంభ్రమ సీతాహారా, సాకేతపురవిహారా ॥నా॥
28. అచలోద్ధృత చంచత్కరా, భక్తానుగ్రహతత్పరా ॥నా॥
29. నైగమగానవినోదా, రక్షస్సుతప్రహ్లాదా ॥నా॥
30. భారతియతివర శంకరా, నామామృత మఖిలాంతరా ॥నా॥

నారాయణ నారాయణ జయ గోవింద హరే ।
నారాయణ నారాయణ జయ గోపాల హరే! ॥

ఇతి శ్రీమచ్ఛంకరాచార్యవిరచితం శ్రీ నారాయణస్తోత్రం సంపూర్ణమ్.





ఓమ్

# శ్రీకృష్ణాష్టోత్తరశతనామస్తోత్రమ్

శ్రీకృష్ణ కమలానాథో వాసుదేవః సనాతనః ॥
వసుదేవాత్మజః పుణ్యో లీలామానుషవిగ్రహః ॥ 1
శ్రీవత్స కౌస్తుభ ధరో యశోదావత్సలో హరిః ।
చతుర్భుజాత్త చక్రాసిగదాశంఖామ్బుజాయుధః ॥ 2
దేవకీనందనః శ్రీశో నందగోపప్రియాత్మజః ।
యమునావేగసంహారీ బలభద్రప్రియానుజః ॥ 3
పూతనాజీవితహరః శకటాసురభంజనః ।
నందవ్రజ జనానందీ సచ్చిదానంద విగ్రహః ॥ 4
నవనీతవిలిప్తాంగో నవనీతనటోఽనఘః ।
నవనీతనవాహారో ముచికుందప్రసాదకః ॥ 5
షోడశస్త్రీసహస్రేశ స్త్రిభంగీ మధురాకృతిః ।
శుకవాగమృతాబ్ధీందుర్గోవిందో యోగినాంపతిః ॥ 6
వత్సవాటచరోఽనన్తో ధేనుకాసురభంజనః ।
తృణీకృతతృణావర్తో యమళార్జునభంజనః ॥ 7
ఉత్తాలతాలభేత్తా చ తమాలశ్యామలాకృతిః ।
గోపగోపీశ్వరో యోగీ కోటిసూర్యసమప్రభః ॥ 8
ఇలాపతిః పరంజ్యోతిర్యాదవేంద్రో యదూద్వహః ।
వనమాలీ పీతవాసాః పారిజాతాపహారకః ॥ 9
గోవర్ధనాచలోద్ధర్తా గోపాలః సర్వపాలకః ।
అజో నిరంజనః కామజనకః కంజలోచనః ॥ 10
మధుహా మధురానాథో ద్వారకానాయకో బలీ ।
బృందావనాంతసంచారీ తులసీదామభూషణః ॥ 11
శమంతకమణేర్హర్తా నరనారాయణాత్మకః ।
కుబ్జాకృష్ణాంబరధరో మాయీ పరమపూరుషః ॥ 12

ముష్టికాసురచాణూరమల్లయుద్ధవిశారదః ।
సంసారవైరీ కంసారిర్మురారిర్నరకాంతకః ॥ 13

అనాదిబ్రహ్మచారీ చ కృష్ణావ్యసనకర్శకః ।
శిశుపాలశిరశ్ఛేత్తా దుర్యోధన కులాంతకః ॥ 14

విదురాక్రూరవరదో విశ్వరూపప్రదర్శకః ।
సత్యవాక్సత్యసంకల్పః సత్యభామారతో జయీ ॥ 15

సుభద్రాపూర్వజో విష్ణుర్భీష్మముక్తిప్రదాయకః ।
జగద్గురుర్జగన్నాథో వేణునాదవిశారదః ॥ 16

వృషభాసురవిధ్వంసీ బాణాసురకరాంతకః ।
యుధిష్ఠిర ప్రతిష్ఠాతా బర్హిబర్హావతంసకః ॥ 17

పార్థసారథిరవ్యక్తో గీతామృత మహోదధిః ।
కాళీయఫణిమాణిక్యరంజిత శ్రీ పదాంబుజః ॥ 18

దామోదరో యజ్ఞభోక్తా దానవేంద్ర వినాశకః ।
నారాయణః పరంబ్రహ్మ పన్నగాశన వాహనః ॥ 19

జలక్రీడాసమాసక్తగోపీవస్త్రాపహారకః ।
పుణ్యశ్లోక స్తీర్థపాదో వేదవేద్యో దయానిధిః ॥ 20

సర్వతీర్థాత్మకః సర్వగ్రహరూపీ పరాత్పరః ।
ఏవం శ్రీకృష్ణదేవస్యనామ్నామష్టోత్తరం శతమ్ ॥ 21

కృష్ణనామామృతం నామ పరమానందకారకమ్ ।
అత్యుపద్రవదోషఘ్నం పరమాయుష్యవర్ధనమ్ ॥ 22

శ్రీ కృష్ణాష్టోత్తర శతనామ స్తోత్రం సంపూర్ణమ్.

ఓమ్ తత్ సత్.

ఓమ్

# శ్రీ కృష్ణాష్టోత్తర శతనామావళిః



1 ఓమ్ శ్రీకృష్ణాయ నమః
2 ,, కమలానాథాయ నమః
3 ,, వాసుదేవాయ నమః
4 ,, సనాతనాయ నమః
5 ,, వసుదేవాత్మజాయ నమః
6 ,, పుణ్యాయ నమః
7 ,, లీలామానుషవిగ్రహాయనమః
8 ,, శ్రీవత్సకౌస్తుభధరాయ నమః
9 ,, యశోదావత్సలాయ నమః
10 ,, హరయే నమః
11 ,, చతుర్భుజాత్తచక్రాసిగదా-
శంఖాద్యుదాయుధాయ నమః
12 ,, దేవకీనందనాయ నమః
13 ,, శ్రీశాయ నమః
14 ,, నందగోపప్రియాత్మజాయనమః
15 ,, యమునావేగసంహారిణే నమః
16 ,, బలభద్రప్రియానుజాయనమః
17 ,, పూతనాజీవితహరాయ నమః
18 ,, శకటాసురభంజనాయ నమః
19 ,, నందవ్రజ జనానందినే నమః
20 ,, సచ్చిదానందవిగ్రహాయనమః
21 ,, నవనీత విలిప్తాంగాయ నమః
22 ,, నవనీత నటాయ నమః
23 ,, అనఘాయ నమః
24 ,, నవనీతనవాహారాయ నమః
25 ,, ముచికుందప్రసాదకాయనమః
26 ,, షోడశస్త్రీసహస్రేశాయ నమః
27 ,, త్రిభంగినే నమః
28 ,, మధురాకృతయే నమః
29 ,, శుకవాగమృతాబ్ధీన్దవే నమః
30 ,, గోవిందాయ నమః
31 ,, యోగినాంపతయే నమః
32 ఓమ్ వత్సవాటచరాయ నమః
33 ,, అనంతాయ నమః
34 ,, ధేనుకాసురభంజనాయ నమః
35 ,, తృణీకృతతృణావర్తాయనమః
36 ,, యమళార్జునభంజనాయ నమః
37 ,, ఉత్తాలతాలభేత్రే నమః
38 ,, తమాలశ్యామలాకృతయేనమః
39 ,, గోపగోపీశ్వరాయ నమః
40 ,, యోగినే నమః
41 ,, కోటిసూర్యసమప్రభాయనమః
42 ,, ఇలాపతయే నమః
43 ,, పరంజ్యోతిషే నమః
44 ,, యాదవేంద్రాయ నమః
45 ,, యదూద్వహాయ నమః
46 ,, వనమాలినే నమః
47 ,, పీతవాససే నమః
48 ,, పారిజాతాపహారకాయ నమః
49 ,, గోవర్ధనాచలోద్ధర్త్రే నమః
50 ,, గోపాలాయ నమః
51 ,, సర్వపాలకాయ నమః
52 ,, అజాయ నమః
53 ,, నిరంజనాయ నమః
54 ,, కామజనకాయ నమః
55 ,, కంజలోచనాయ నమః
56 ,, మధుఘ్నే నమః
57 ,, మధురానాథాయ నమః
58 ,, ద్వారకానాయకాయ నమః
59 ,, బలినే నమః
60 ,, బృందావనాంతసంచారిణేనమః
61 ,, తులసీదామభూషణాయ నమః
62 ,, శమంతకమణేర్హర్త్రే నమః
63 ,, నరనారాయణాత్మకాయ నమః

64 ఓమ్ కుబ్జాకృష్ణాంబరధరాయనమః
65 ,, మాయినే నమః
66 ,, ముష్టికాసురచాణూరమల్లయుద్ధ విశారదాయ నమః
67 ,, సంసారవైరిణే నమః
68 ,, కంసారయే నమః
69 ,, మురారయే నమః
70 ,, నరకాంతకాయ నమః
71 ,, అనాదిబ్రహ్మచారిణే నమః
72 ,, కృష్ణావ్యసనకర్శకాయ నమః
73 ,, శిశుపాలశిరశ్ఛేత్రే నమః
74 ,, దుర్యోధనకులాంతకాయనమః
75 ,, విదురాక్రూరవరదాయ నమః
76 ,, విశ్వరూపప్రదర్శకాయ నమః
77 ,, సత్యవాచే నమః
78 ,, సత్యసంకల్పాయ నమః
79 ,, సత్యభామారతాయ నమః
80 ,, జయినే నమః
81 ,, సుభద్రాపూర్వజాయ నమః
82 ,, జిష్ణవే నమః
83 ,, భీష్మముక్తిప్రదాయ నమః
84 ,, జగద్గురవే నమః
85 ,, జగన్నాథాయ నమః
86 ,, వేణునాదవిశారదాయ నమః
87 ఓమ్ వృషభాసురవిధ్వంసినేనమః
88 ,, [illegible]
89 ,, యుధిష్ఠరప్రతిష్ఠాత్రే నమః
90 ,, బర్హిబర్హావతంసకాయ నమః
91 ,, పార్థసారథయే నమః
92 ,, అవ్యక్తాయ నమః
93 ,, గీతామృతమహోదధయేనమ
94 ,, కాళీయఫణిమాణిక్యరంజిత శ్రీ పదాంబుజాయ నమః
95 ,, దామోదరాయ నమః
96 ,, యజ్ఞభోక్త్రే నమః
97 ,, దానవేంద్రవినాశకాయనమః
98 ,, నారాయణాయ నమః
99 ,, పరబ్రహ్మణే నమః
100 ,, పన్నగాశనవాహనాయనమః
101 ,, జలక్రీడాసమాసక్త గోపీ వస్త్రాపహారకాయ నమః
102 ,, పుణ్యశ్లోకాయ నమః
103 ,, తీర్థపాదాయ నమః
104 ,, వేదవేద్యాయ నమః
105 ,, దయానిధయే నమః
106 ,, సర్వతీర్థాత్మకాయ నమః
107 ,, సర్వగ్రహరూపిణే నమః
108 ,, పరాత్పరాయ నమః

శ్రీ కృష్ణ పరమాత్మార్పణమస్తు

ఓం తత్ సత్ ఓమ్



ఓమ్

# శ్రీమద్భగవద్గీతాష్టోత్తరశతనామస్తోత్రమ్

1. గీతాదేవీ చ విమలా సుఖదా మునిసంస్తుతా ।
తత్త్వార్థబోధినీ పూజ్యా శ్రీకృష్ణముఖనిస్సృతా ॥

2. పాపఘ్నీ పుణ్యదా దేవీ నిష్ప్రవృత్త్యాహ్వవిదాత్మికా ।
శోకమోహాపహన్త్రీ చ మోక్షదా బ్రహ్మబోధినీ ॥

3. బ్రహ్మవిద్యా చిదానన్దా భవఘ్నీ భయనాశినీ ।
వేదత్రయాత్మికాఽనన్తా తత్త్వార్థజ్ఞానమఞ్జరీ ॥

4. వ్యాససంగ్రథితా పూతా సంసారమలమోచనీ ।
సర్వశాస్త్రమయీ మాతా సర్వతీర్థమయీ పునః ॥

5. తత్త్వమస్యాదివాక్యోత్థ బ్రహ్మతత్త్వావగాహినీ ।
శాన్తిప్రదా పరానన్దా బోధామృతతరంగిణీ ॥

6. విశ్వసంస్కృతిసమ్భూతిర్విశ్వధర్మప్రచారిణీ ।
విశ్వైకరచనా రమ్యా రమణీయార్థభాసితా ॥

7. విశ్వమానవసంపూజ్యా విశ్వమంగళకారిణీ ।
విశ్వసిద్ధాన్తసమ్మాన్యా విశ్వసమ్మోహనాశినీ ॥

8. విశ్వస్వరూపిణీ వన్ద్యా విశ్వతత్త్వప్రకాశినీ ।
త్రిగుణాతీతతత్త్వార్థభాసినీ గ్రంథిభేదినీ ।

9. లోకోత్తరగుణోపేతా లోకోచితమతాన్వితా ।
లోకోద్ధరణసంశీలా లోకామోదప్రవర్ధికా ॥

10. నిహితాఖిలశాస్త్రార్థా శుభోజః పదగుమ్ఫితా ।
అనిర్వాచ్యా చ గంభీరా నిత్యా నిత్యసుఖప్రదా ॥

11. నైకవ్యాఖ్యానసంభిన్నా నానాచార్యసమాదృతా ।
స్వస్వానుకూలభావార్థశోభితా శాన్తిదాన్తిదా ॥

12. నిత్యనూతనభావార్థదాయినీ లోకకామదా ।
ప్రాచ్యపాశ్చాత్యఖండాన్తర్నివాసిజనమోదదా ॥

13. అక్షరాఽద్వేషిణీ సర్వకాలధర్మప్రబోధినీ ।
దైవసమ్పత్సుసమ్పన్నాఽఽసురభావాదివర్జితా ॥
14. అష్టాదశమహాయోగభూషితా భ్రష్టతారిణీ ।
స్త్రీశూద్రసముద్ధర్త్రీ సమభావవిశోభినీ ॥
15. ఈర్ష్యాప్రసూతజాత్యాదిదురహంకారఘాతినీ ।
చండాలద్విజశూద్రాది సర్వోద్ధరణతత్పరా ॥
16. మాయాపనోదినీ సత్యా ద్వన్ద్వభేదవినాశినీ ।
అభేదభావపీయూషవర్షిణీ జ్ఞానభాసినీ ॥
17. త్యాగరూపాఽనవద్యా చ విముక్తిఫలశాలినీ ।
యథాధికారి నిష్కామకర్మ ధ్యానాదిబోధినీ ॥
18. భవమగ్నప్రజానౌకా బన్ధచ్ఛేదవిచక్షణా ।
భగవద్భావసమ్పూర్ణా భవవారిధితారిణీ ॥
19. ఆధ్యాత్మిక మహాకాశ లసత్సౌదామినీసమా ।
నిష్కళా నిర్మలా శాన్తా సర్వతేజోమయీ శుభా ॥
20. తమోవిమూఢలోకాన్ధకారనోదనచన్ద్రికా ।
శ్రుత్యన్తగతసత్త్వార్థబోధినీ బోధభాసురా ॥
21. బోధామృతపయశ్శుక్లా పార్థవత్సతరాన్వితా ।
దోగ్ధృకృష్ణా చ గోరూపా కామధేను శ్శుగన్తికా ।
22. క్లిన్నపార్థతమోహన్త్రీ క్షాత్రధర్మప్రవర్తికా ।
కర్తవ్యభ్యుతధీమూఢజనసత్పథదర్శికా ॥
23. సర్వసంన్యాససంలక్ష్యా పూర్ణబ్రహ్మప్రబోధినీ ।
కలిసన్త్రస్తసమ్మూఢలోక త్రాణచణా పరా ॥
24. అష్టోత్తరశతం నామ్నాం గీతాయాః పూతభావనః ।
పఠమానో నరో నిత్యమాప్నుయాత్పరమం పదమ్ ॥

ఇతి శ్రీమద్భగవద్గీతాష్టోత్తర శతనామ స్తోత్రం సంపూర్ణమ్.

ఓమ్

# శ్రీమద్భగవద్గీతాష్టోత్తరశతనామావళిః

1 ఓం శ్రీగీతాదేవ్యై నమః
2 ,, విమలాయై నమః
3 ,, సుఖదాయై నమః
4 ,, మునిసంస్తుతాయై నమః
5 ,, తత్త్వార్థబోధిన్యై నమః
6 ,, పూజ్యాయై నమః
7 ,, శ్రీకృష్ణముఖనిస్సృతాయైనమః
8 ,, పాపఘ్న్యై నమః
9 ,, పుణ్యదాయై నమః
10 ,, దేవ్యై నమః
11 ,,నిర్వృత్యాహచిదాత్మికాయైనమః
12 ,, శోకమోహాపహన్త్ర్యై నమః
13 ,, మోక్షదాయై నమః
14 ,, బ్రహ్మబోధిన్యై నమః
15 ,, బ్రహ్మవిద్యాయై నమః
16 ,, చిదానన్దాయై నమః
17 ,, భవఘ్న్యై నమః
18 ,, భయనాశిన్యై నమః
19 ,, వేదత్రయాత్మికాయై నమః
20 ,, అనన్తాయై నమః
21 ,, తత్త్వార్థజ్ఞానమఞ్జర్యై నమః
22 ,, వ్యాససంగ్రథితాయై నమః
23 ,, పూతాయై నమః
24 ,, సంసారమలమోచన్యై నమః
25 ,, సర్వశాస్త్రమయై నమః
26 ,, మాత్రే నమః
27 ,, సర్వతీర్థమయై నమః
28 ,, తత్త్వమస్యాదివాక్యోత్థ బ్రహ్మతత్త్వావగాహిన్యై నమః
29 ,, శాంతిప్రదాయై నమః
30 ,, పరానందాయై నమః
31 ,, బోధామృతతరంగిణ్యై నమః
32 ఓం విశ్వసంస్కృతిసంభూతయే నమః
33 ,, విశ్వధర్మప్రచారిణ్యై నమః
34 ,, విశ్వైకరచనాయై నమః
35 ,, రమ్యాయై నమః
36 ,, రమణీయార్థభాసితాయై నమః
37 ,, విశ్వమానవసంపూజ్యాయైనమః
38 ,, విశ్వమంగళకారిణ్యై నమః
39 ,, విశ్వసిద్ధాన్తసమ్మాన్యాయై నమః
40 ,, విశ్వసమ్మోహనాశిన్యై నమః
41 ,, విశ్వస్వరూపిణ్యై నమః
42 ,, వన్ద్యాయై నమః
43 ,, విశ్వతత్త్వప్రకాశిన్యై నమః
44 ,,త్రిగుణాతీతతత్త్వార్థభాసిన్యైనమః
45 ,, గ్రంథిభేదిన్యై నమః
46 ,, లోకోత్తరగుణోపేతాయై నమః
47 ,, లోకోచితమతాన్వితాయై నమః
48 ,, లోకోద్ధరణసంశీలాయై నమః
49 ,, లోకామోదప్రవర్ధికాయై నమః
50 ,, నిహితాఖిలశాస్త్రార్థాయై నమః
51 ,, పఠోజః పదగుమ్భితాయై నమః
52 ,, అనిర్వాచ్యాయై నమః
53 ,, గంభీరాయై నమః
54 ,, నిత్యాయై నమః
55 ,, నిత్యసుఖప్రదాయై నమః
56 ,,నైకవ్యాఖ్యానసంభిన్నాయై నమః
57 ,, నానాచార్యసమాదృతాయైనమః
58 ,, స్వస్వానుకూలభావార్థశోభితాయై నమః
59 ,, శాన్తిదాన్తిదాయై నమః
60 ,, నిత్యనూతనభావార్థదాయిన్యై నమః

61 ఓం లోకకామదాయై నమః
62 ,, ప్రాచ్యపాశ్చాత్య ఖండాంత ర్నివాసిజనమోదదాయై నమః
63 ,, అక్షరాయై నమః
64 ,, అద్వేషిణ్యై నమః
65 ,, సర్వకాలధర్మప్రబోధిన్యైనమః
66 ,, దైవసంపత్సంపన్నాయైనమః
67 ,, అసురభావాదివర్జితాయై నమః
68 ,, అష్టాదశ మహాయోగభూషితాయై నమః
69 , భ్రష్టతారిణ్యై నమః
70 ,, స్త్రీశూద్రసముద్ధర్త్ర్యై నమః
71 ,, సమభావవిశోభిన్యై నమః
72 ,, ఈర్ష్యాప్రసూతజాత్యాది దురహంకారఘాతిన్యై నమః
73 ,, చండాలద్విజశూద్రాదిసర్వోద్ధరణ తత్పరాయై నమః
74 ,, మాయాపనోదిన్యై నమః
75 ,, సత్యాయై నమః
76 ,, ద్వన్ద్వభేదవినాశిన్యై నమః
77 ,, అభేదభావపీయూషవర్షిణ్యైనమః
78 ,, జ్ఞానభాసిన్యై నమః
79 ,, త్యాగరూపాయై నమః
80 ,, అనవద్యాయై నమః
81 ,, విముక్తిఫలశాలిన్యై నమః
82 ,, యథాధికారినిష్కామకర్మధ్యానాదిబోధిన్యై నమః
83 ,, భవమగ్నప్రజానౌకాయై నమః
84 ,, బన్ధచ్ఛేదవిచక్షణాయై నమః
85 ఓం భగవద్భావనసమ్పూర్ణాయై నమః
86 ,, భవవార్ధి తారిణ్యై నమః
87 ,, ఆధ్యాత్మిక మహాకౌశలసత్సౌదామినీసమాయై నమః
88 ,, నిష్కళాయై నమః
89 ,, నిర్మలాయై నమః
90 ,, శాన్తాయై నమః
91 ,, సర్వతేజోమయ్యై నమః
92 ,, శుభాయై నమః
93 ,, తమోవిమూఢలోకాన్ధకారనోదనచన్ద్రికాయై నమః
94 ,, శ్రుత్యన్తగతతత్త్వార్థబోధిన్యై నమః
95 ,, బోధభాసురాయై నమః
96 ,,బోధామృతపయశ్శుక్లాయైనమః
97 ,, పార్థవత్సతరాన్వితాయై నమః
98 ,, దోగ్ధృకృష్ణాయై నమః
99 ,, గోరూపాయై నమః
100 ,, కామధేనవే నమః
101 ,, శుగన్తికాయై నమః
102 ,, క్లిన్నపార్థతమోహన్త్ర్యైనమః
103 ,, క్షాత్రధర్మప్రవర్తికాయైనమః
104 ,, కర్తవ్యచ్యుతధీమూఢజనసత్పథదర్శికాయై నమః
105,,సర్వసన్న్యాససంలక్ష్యాయైనమః
106,,పూర్ణబ్రహ్మప్రబోధిన్యైనమః
107 ,, కలిసన్త్రసమ్మూఢలోకత్రాణచణాయె నమః
108 ,, పరాయై నమః

శ్లో॥ అష్టోత్తరశతం నామ్నాం గీతాయాః పూతభావనః ।
పఠమానో నరో నిత్యమాప్నుయాత్పరమం పదమ్ ॥

ఇతి శ్రీమద్భగవద్గీతాష్టోత్తర శతనామావళిః
సంపూర్ణమ్.

ఓమ్

# శ్రీ భగవద్గీతా గేయము

( శ్రీరాగము — ఆదితాళము )

[ శ్రీ ద్రోణమరాజు రామమూర్తిగారి "గీతోద్యానవిహారము" నుండి ]



భగవద్గీతో ద్యానవిహారము భక్తినొనర్పగ పరుగునరండి ।
సొగసుగ దానిని జూడగనయ్యెడు సులువగు త్రోవను జూపెదనండీ ॥

1. భారతయుద్ధపు పరిసరభూముల బయలుదేఱిన భాగ్యంబండీ ।
ధీరుఁడు వ్యాసుడు స్థిరముగనాటిన దివ్యోద్యాన క్షేత్రమునుండీ ॥

2 రహినిలకృష్ణుఁడు రక్తితోపార్థుని రథమును నడిపిన రంగంబండీ ।
ఇహపర సుఖకర హేతుభూతముల నెన్నియో యాతఁడు పన్నినదండీ ॥

3. ఇలపయినది పదియెన్మిదియౌ యకరంబుల పరిమితి రాజిలునండీ ।
సలలితముగ నట సప్తశత బుల సద్వృక్షంబులు జెలఁగును జుండీ ॥

4. ఎప్పుడు వాడని పూవులుచుండీ ఎప్పుడు కుళ్ళని ఫలములుసుండీ ।
తప్పక మనమా ధన్యవనికిఁజని తలకొక కొన్నిఁటిఁ దెత్తమురండీ ॥

( హిందీ ఆరతీ )

1. జయభగవద్గీతే జయభగవద్గీతే ।
హరిహియ కమలవిహారిణి సున్దరసుపునీతే ॥

2. కర్మసుమర్మప్రకాశిని కామాసక్తిహరా ।
తత్త్వజ్ఞాన వికాసిని విద్యాబ్రహ్మపరా ॥ ॥జయ॥

3. నిశ్చలభక్తివిధాయిని నిర్మలమలహారీ ।
శరణ రహస్యప్రదాయినీ సబవిధిసుఖకారీ ॥ ॥జయ॥

4. రాగద్వేషవిదారిణి కారిణి మోదసదా ।
భవభయహారిణి తారిణి పరమానన్దప్రదా ॥ ॥జయ॥

5. ఆసురభావ వినాశిని నాశిని తమరజనీ ।
దైవీసద్గుణదాయిని హరిరసికా సజనీ ॥ ॥జయ॥

6. సమతాత్యాగ శిఖావని హరిముఖకీబానీ !
సకలశాస్త్రకీ స్వామిని శ్రుతియోంకీ రానీ ॥ ॥జయ॥

7. దయాసుధాబరసావని మాతృకృపాకీజై ।
హరిపదప్రేమదాన కం అపనోకరలీజై ॥ ॥జయ॥





# శ్రీ భగవద్గీతా గేయము

బేహాగ్ రాగము — ఆదితాళము (సంస్కృతము)

రచయిత:- శ్రీ నోముల అప్పారావు గారు



జయ జయ జయ జయ భగవద్గీతే !
జయ భవబన్ధనశమన సుచరితే !

1. కాండత్రయ సంశోభితరూపే !
ఖండిత త్రిభువన ఘన సన్తాపే ! ॥జయ॥

2. సాంఖ్యకర్మ యాగాది విలసితే !
సంశ్రితసాధక జన కల్పలతే ! ॥జయ॥

3. పద్యసప్తశత భవ్యతరాంగే !
పాప విభంజన ! పావనగఙ్గే ! ॥జయ॥

4. భక్తి జ్ఞాన సోపాన శోభితే !
పరమయోగి హృత్పద్మభావితే ! ॥జయ॥

5. భగవత్ శ్రీముఖపద్మమరన్దే !
పారహృత్పదన భరితానన్దే ! ॥జయ॥

6. సకలోపనిషత్ సాగరజాతే !
సన్మునిమథనాచలపరిపూతే ! ॥జయ॥

7. శాంతి సుఖప్రద సదమృతకిరణే !
జననమరణ భవసాగరతరణే ! ॥జయ॥

8. భజన సమాజ సుభక్త హృదబ్జే !
పరిపూజిత పావన పాదాబ్జే ! ॥జయ॥



ఓమ్

# శ్రీమద్భగవద్గీతాన్తర్గత శ్లోకముల యకారాది వర్ణక్రమ పట్టిక

# శ్రీమద్భగవద్గీతాన్తర్గత శ్లోకముల 'అ'కారాది వర్ణక్రమ పట్టిక

## శ్రీమద్భగవద్గీతా న్తర్గత శ్లోకముల 'అ'కారాది వర్ణక్రమ పట్టిక

# శ్రీమద్భగవద్గీతాన్తర్గత శ్లోకముల 'అ'కారాది వర్ణక్రమ పట్టిక

# శ్రీమద్భగవద్గీతాన్తర్గత శ్లోకముల 'అ' కారాది వర్ణక్రమ పట్టిక

## శ్రీమద్భగవద్గీతా న్తర్గత శ్లోకముల 'అ' కారాది వర్ణక్రమ పట్టిక

# శ్రీమద్భగవద్గీతా న్తర్గత శ్లోకముల ‘అ’కారాది వర్ణక్రమ పట్టిక

# శ్రీమద్భగవద్గీతాన్తర్గత శ్లోకముల 'అ' కారాది వర్ణక్రమ పట్టిక



## యా

## శ్రీవ్యాసాశ్రమ భగవద్గీతా ప్రచురణలు

1. శ్రీమద్భగవద్గీత (మూలము)
2. శ్రీమద్భగవద్గీత (తాత్పర్యసహితము) తాత్పర్యకర్త–
   మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారు
3. శ్రీమద్భగవద్గీత (స్థూలాక్షరోపేతము – మూలము)
4. శ్రీమద్భగవద్గీత – పదవిభాగ టీకా తాత్పర్య విశేషార్థసహితము
   మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారిచే విరచితము
5. శ్రీమహాభగవద్గీత (మతత్రయాది భాష్యసార సంగ్రహము)
6. శ్రీగీతాశయము ( మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారు)
7. శ్రీ భగవద్గీతాష్టాదశాధ్యాయ ముక్తిసోపానము
8. శ్రీభగవద్గీతాష్టోత్తర శతనామ స్తోత్రము – నామావళి
9. శ్రీగీతాగమనము ( మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారు)

ఓమ్

## శ్రీవ్యాసాశ్రమ ఉపనిషత్ప్రచురణలు

1. కఠోపనిషత్తు
2. మాండూక్యోపనిషత్తు ( దీపికా సహితము)
3. ఛాందోగ్యోపనిషత్తు ( టీకాతాత్పర్య సహితము)
4. బృహదారణ్యకోపనిషత్తు ( టీకాతాత్పర్య సహితము)
5. నారదపరివ్రాజకోపనిషత్తు
6. శుకరహస్యోపనిషత్తు
7. నారాయణోపనిషత్తు
8. అమృతబిన్దూపనిషత్తు ( చిన్నది) ( పెద్దది)
9. ముండకోపనిషత్తు
10. మైత్రేయ్యుపనిషత్తు

---

**ప్రతులకు వలయువారు :**

**మేనేజరు**

**శ్రీవ్యాసాశ్రమము, వ్యాసాశ్రమము పోష్టు – 517 621.**

**వయా ఏర్పేడు, చిత్తూరు జిల్లా (ఆం, ప్ర)**